చైత్రాది ద్వాదశమాసముల యందు గలుగు పాతల యొక్క వివరము తిథులలో చేయుసందున యిచ్చట వ్రాయడమైనది.

చైత్ర శు ౧౧ శ వ్యప్రః ౪౬-౩౦ నిర్గః ౫౭-౨౨
బ ౧౦ శు వైప్రః ౦-౨౨ నిర్గః౧౦-౪౮
వైశాఖ శు ౬ బు వ్యప్రః ౫౨-౨౦
శు౮ గు నిర్గః౪-౦
బ ౪ సో వైప్రః ౦-౨౦ నిర్గః౪౬-౨౦
శ్రావణ శు ౧౦ బు వైప్రః ౪౪-౦
శు ౧౧ గు నిర్గః ౧౮-౩౦
బ ౭ మం వ్యప్రః ౨౯-౦ నిర్గః ౫౪-౨౦
భాద్రపద శు ౫ ఆ వైప్రః ౩౧-౧౨ నిర్గః ౪౭-౧౦
బ ౩ శ వ్యప్రః ౧౭-౨౦ నిర్గః ౩౬-౧౪
బ ౩౦ గు వైప్రః ౪౨-౧౦ నిర్గః ౫౭-౪౦
ఆశ్వీజ శు ౧౫ గు వ్యప్రః ౬-౫౦ నిర్గః ౨౩-౨౦
బ ౯ ఆ వైప్రః ౫౦-౨౦
బ ౧౦ సో నిర్గః ౮-౧౦
కార్తిక శు ౯ ఆది వ్యప్రః ౫౧-౨౦
శు ౧౦ సో నిర్గః ౧౫-౨౦
బ ౬ శు వైప్రః ౨౬-౨౦ నిర్గః౫౯-౪౦
మాఘ శు ౧౧ ఆ వైప్రః ౨౩-౨౦
శు ౧౨ సో నిర్గః ౯-౨౦
బ ౭ గు వ్యప్రః ౫౦-౧౦
బ ౯ శు నిర్గః ౧౦-౪౮
ఫాల్గుణ శు ౫ బు వైప్రః ౪౦-౧౦ నిర్గ ౫౬-౨౦
బ ౩ సో వ్యప్రః ౫౮-౧౮
బ ౪ బు నిర్గః ౧౪-౫౦

జ్యేష్ఠ ఆషాఢమాసముల యందున్ను మార్గశిర పుష్య మాసములయందున్ను పాతసంభవము కాలేదు.

వెలస్వల్పము! గొప్పవారిచే వేలకు వేలు యోగ్యతా పత్రములు పొందిన వెలమధికము!!




# అమృతాంజనము

## వాయునొప్పులకు వజ్రాయుధము

పంచ భాష చీటి చూచి కొనిన మోసము గలుగదు

చక్కని డబ్బితో సహా సీసా 1-కి, 0-10-0 అణాలుమాత్రమే




## అమృతాంజనము సకలవిధ నొప్పులకు సంజీవివంటిది

తలనొప్పుల మాన్పును, వాయువుపోట్ల బాపును, పార్శ్వపునొప్పుల బారదోలును, పోట్లపోగొట్టును.



బెణుకుల భేదించును వాపుల రూపుమాపును దగ్గును తగ్గించును దురదను తొలగించును

వనమూలికలచే హిందూదేశమందు తయారుచేయబడు మంచిమందు సువాసనగలిగియుండును

## అమృతాంజనము గాయము పుండ్లకు ఘనమయినమందు



నెత్తురునందు మూత్రామ్లజము మొదలగు చెడు పదార్థములుచేరి యవి సంధి బంధనములందు నిలిచియుండుట వలన సంధివాత




మేర్పడు చున్నది. కీళ్లువాచుట, జ్వరము, కీళ్లపోట్లను మొదలగునవి దీనికి లక్షణములు. వేలకువేలు విక్రయము.




# తామరతైలము

తామర, తీట, గజ్జికి మంచిది డబ్బీ 1-కి 0—6—0 మాత్రమే.

రాజారాణి గురుగల తామరతైలము పూతినాశకములగు చాల మంచిమందులతో తయారు చేయబడి ప్రఖ్యాతిగాంచెను. అనేక రోజులనుండి యున్న తామర నాలుగైదు సారులు రాచిన తోడనే పోయినదని వేలమంది మాకు వ్రాసియున్నారు. దీని రాచిన మంటయుండదు. చర్మము నలుపెక్కదు.

# దంతచూర్ణము.

పండ్లపోటుకు తీపులకు మంచిపొడుము చక్కని డబ్బీ 1-కి 0—2—0

ఈ దంతచూర్ణముతో పండ్లు తోముటవలన చిగుళ్లనుండి రక్తము స్రవించకుండును. నోట దుర్గంధము లేక యుండును. పండ్లు ముత్యములవలె తెల్లగా నుండును. అనేకులవల్ల ప్రతిరోజు వాడబడుచున్నది.

## అమృతాంజనము డిపో, బొంబయి లేక మదరాసు.

వెల స్వల్పము ! ఫల మధికము !!

# అమృతాంజనము

## వాయునొప్పులకు పరమామృతము.

గొప్ప గొప్పవారిచే వేలకు వేలు యోగ్యతా పత్రములు పొందినది

పంచభాష చీటీచూచి కొనిన మోసము గలుగదు. ప్రతియింట నుండదగినది.

సీసా 1-కి, 0-10-0 అణాలుమాత్రమే. ప్రతివారము వేలకు వేలు విక్రయము.

## అమృతాంజనము పోట్లబోగొట్టును. తలనొప్పులమాన్పును.




నెత్తురునందు మూత్రామ్లజము మొదలగు చెడుపదార్థములుచేరి యవి సంధిబంధనములందు నిలిచి



LUMBAGO

యుండుట వలన సంధివాతమేర్పడుచున్నది. కీళ్లువాచుట, జ్వరము, కీళ్లుపోటును మొదలగునవి దీనికి లక్షణ




ములు. బాధగలిగిన వెంటనే రోగికి విశ్రాంతినిచ్చుట యవసరము. సంధివాత మేర్పడిన వెంటనే అమృతాంజనము నుపయోగించుచు వెంటనే భేదికి తీసికొనుట మంచిది.

## అమృతాంజనము జగత్ప్రసిద్ధిజెందిన దివ్యాంజనము

తలనొప్పుల మాన్పును

పార్శ్వపు నొప్పుల బారదోలును

వాయుపుపోట్ల బాపును

బెణుకుల భేదించును

వాపుల రూపుమాపును




దగ్గును తగ్గించును

గురదను తొలగించును

తేలుబాధను తీసివేయును

వేలకువేలు విక్రయము.

వెల 0-10-0 లు మాత్రమే

## అమృతాంజనము డిపో, బొంబయి. మదరాసు.

Andhra Patrika Press, Madras.—1922.

ఓం

# ప్రస్తావన

ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే । నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః

శ్రీమన్మహాదేవుని కాలచక్రమునం దొక మానవ సంవత్సరము గతించినది. అనంతమైన కాలచక్రసంభ్రమణమున కాద్యంతములు మహాదేవుని మాయాలీలలందు గోచరములగుచుండును. బ్రహ్మాండభాండ సంభృతములైన ఖగోళములు భూతజాలములు మహాదేవుని దివ్యమహిమను బోధించుచున్నవి. ఆదిత్యమండలములు-తారాగణములు-గ్రహరాసులు-దివ్యస్వరూపములు-దురవగాహమైన మహాదేవుని పరమార్థస్వరూపమును బోధించుచున్నవి. లీలాసూత్రధారుని మహానాటక ప్రదర్శనమున కాద్యంతములు కనుపట్టవు. మహాప్రవృత్తి యంతయును కాలచక్రమునం దనవరతము సంభ్రమణము చేయుచున్నది. జీవజాలములు జ్ఞానానందమును బొంది యాత్మానందము ననుభవించుటకు దాల్చిన భౌతికస్వరూపములను తలంచునపుడు విభ్రమము గలుగుచుండును. ఆకాశతత్త్వము పృథ్వీతత్త్వముగఁ బరిణమించుటయును, పృథ్వీతత్త్వమునం దాకాశతత్త్వము ప్రభవించుటయును విచిత్రరచనలు. ఈ విచిత్రరచనయందు గలిగిన స్వరూపములకును గలుగనున్న స్వరూపములకును నాద్యంతములు పరబ్రహ్మస్వరూపమునందు గోచరంబులు. గోళములు భస్మములయినవి. మహాసముద్రములు మహానగములుగ మాఱినవి. దారుణారణ్యములు ఖనిజములైనవి. భూఖండములు సముద్రములైనవి. జీవసమూహములు ఖండాంతరములైనవి. ఈమహాపథమునం దనంతనామరూపములను దాల్చుచు జీవము స్వకర్మబద్ధమై సంచారమును జేయుచున్నవిధమును జీవస్వరూపములు విశదముచేయుచున్నవి. అనంతములైన జీవజాతులు పుట్టి గిట్టినవి. ప్రపంచావృతములైన భూధరములు-జలచరములు-భూచరములు-ఖేచరములు-మానవవంశములు మన్వంతరక్రమమును విశదముచేయుచున్నవి. ఏకేంద్రియవిశిష్టమైన జీవకణమునందును, దశేంద్రియవిశిష్టమైన నరునియందును, సర్వేంద్రియవిశిష్టుడైన నారాయణునియందును, అనంతమైన జీవప్రవాహము గోచరంబగుచున్నది. ఒక ప్రదేశమునం దొక కాలమునం దొక పాత్రమునందు విశ్వప్రకరణ మంతయును పండితులకు గోచరంబగుచు జ్ఞానోపదేశమును జేయుచుండును. స్వాభిమానపరాయణులకు విశ్వప్రకరణమునందు స్వప్రయోజనములు మాత్రమే గోచరం బగుచుండును.

ప్రపంచ నాటకము

దారుణసంగ్రామములు గలిగినవి. మహాసామ్రాజ్యములు నశించినవి. జాతులు గతించినవి. ప్రళయములు సంప్రాప్తములైనవి. కలిపురుషనాటకము యథాప్రకారము సాగుచున్నది. ఈ నాటకరంగమునందు యుగముల ప్రదర్శనమువలె సంవత్సరవృత్తాంతరూపప్రదర్శనము మానవకోటికి జ్ఞానోదయమును జేయుటకు జాలియున్నను జ్ఞానోదయము మాత్రము గలుగకున్నది. ఐరోపాసంగ్రామము ప్రపంచస్థితిని తాఱుమాఱు చేసినను శాంతిస్థాపనమునకు సాధనభూతము గాజాలని విధమును గతసంవత్సరవృత్తాంతము విశదముచేయుచున్నది. మహాసంగ్రామము పేరునకు ముగిసినను యూరపురాజ్యముల కాత్మశాంతి గలుగలేదు. బ్రిటీషు సామ్రాజ్యాధికారులకు సామ్రాజ్యవిస్తరణాభిలాషము తఱుగలేదు. బ్రిటీషురాజ్యాధికారులు ఐర్లాండు ఈజిప్టులపట్లను సానుభూతినిఁ జూపినను భరతఖండముపట్ల నిర్బంధవిధానము నవలంబించు చున్న విధమును దుర్మతిసంవత్సరవృత్తాంతము విస్పష్టము చేయుచున్నది.

ప్రభవాదిసంవత్సరములం దరిష్టదాయకములుగ గణుతింపబడెడి ఇకారాన్త వర్షసప్తకమునందు దుర్మతి గతించినది. దుందుభి ప్రారంభమైనది. ఈ వర్షసప్తకము సందుఁ గాళయుక్తికి రాజు శుక్రుడు. సిద్ధార్థి కధిపతి కుజుడు. రౌద్రి కీశుడు రవి. దుర్మతి కేలిక శని. దుందుభి కధీశుడు బుధుడు. ఇకారాంతసప్తకమునం దైదవవర్షఫలమును దైవజ్ఞ లిట్లు నిర్దేశించిరి:—

దుందుభి సంవత్సరము

దుందుభిసంవత్సరమునకు రాజుబుధుడు. ఫలము:— రాజకోపము దుఃఖము మధ్యవృష్టి అపరసస్యవృద్ధి. సైన్యాధిపతిఫలము:— వాతాహతవర్షము సస్యఫలసమృద్ధి లోకపీడ; అర్ఘాధిపతిఫలము :—అర్ఘాభివృద్ధి సస్యాభివృద్ధి మంచివానలు; దైవజ్ఞాధిపతి ఫలము :—దైవజ్ఞుల గౌరవము. మేఘాధిపతి ఫలము :—మహావృష్టి అశనిపాషాణవృష్టిపాతము. మంత్రి గురువు; ఫలము—మంచిపంటలు మంచివానలు రాజసౌఖ్యము; గ్రామపాలకుడు; ఫలము:— గ్రామసౌఖ్యము గ్రామపాలకసౌఖ్యము. సస్యాధిపతి రవి; ఫలము:—సస్యసమృద్ధి ఈతిభయము; పురోహితుడు; ఫలము:—గోబ్రాహ్మణసుఖము, సస్యవృద్ధి:—ధాన్యాధిపతి శుక్రుడు; ఫలము :—అతివృష్టి, సుభిక్షము, ఆరోగ్యము. రసాధిపతి కుజుడు. ఫలము—తిలతైలసమృద్ధి రజతసమృద్ధి. నీరసాధిపతి శని. ఫలము - లోహము దూది కొమ్ములు మాంసములధరలు పెరుగుట. పరీక్షకుడు శని; ఫలము— పరీక్షకులకు మాంద్యము అనర్ఘము అల్పవృష్టి కృష్ణధాన్యసమృద్ధి. గణకుడు చంద్రుడు; ఫలము:—గణకుల వృద్ధి, సస్యసమృద్ధి రాజనీతిరక్షణము. పశుపాలకుడు బలరాముడు; ఫలము—సస్యజలతృణసమృద్ధి, సుభిక్షము. దుందుభిసంవత్సరమునందు కన్యారాశియందు గురుశని రాహువులకును బుధరవులకును సమకాలసంచారము గలదు. తులారాశియందు గురుశుక్రులకు సమకాల సంచారము గలదు. కుజశనులకు కుజగురువులకు సంసప్తకదోషము గలదు. ఈ దుర్యోగములకు కలహము దుర్భిక్షము వ్యాధిపీడ రాజపీడ యుద్ధము దుఃఖము ఫలములు. సంవత్సరసామాన్యఫలము:—

శ్లో॥ సర్వసస్యైశ్చసంపూర్ణా ధాత్రీ దుందుభివత్సరే।
రాజాభిః పాల్యతే పూర్వ దేశేశ్వరవినాశనం॥

దుందుభి సంవత్సరమునందు శుభగ్రహమైన బుధుడు రాజ్యాధిపతి సేనాధిపతి అర్ఘాధిపతి మేఘాధిపతిగ నున్నాడు. సామాన్యఫలము:—యుద్ధారిష్టములు గలిగినను, సస్యసమృద్ధి-వర్షసమృద్ధి-పశువృద్ధి - గలుగుననియును తిలధాన్యాదుల ధరలు తగ్గుననియును దైవజ్ఞులు నిర్ణయించుచున్నారు.

ఆశాసమ్మోహము

కాలమహాస్రవంతియందొక సంవత్సర వృత్తాంతము బుద్బుదప్రాయముగనుండును. కాని యొకబుద్బుదమునందే ప్రాజ్ఞులకు విశ్వస్వరూపమంతయును గోచరంబగుచుండును. విశ్వస్వరూపమణువునందువలె మహామేరువునందును సర్వలక్షణ సమన్వితమై విలసిల్లుచుండును. దివ్యదృష్టితో నొక క్షణమాత్రము విశ్వరూపసందర్శనమును జేయునపుడు కాలతత్త్వము గోచరంబగుచున్నది. దివ్యదృష్టితో మహాకాలస్వరూపము నవలోకించునపుడు భారతరణక్షేత్రమునందు విజయునకు గలిగిన విషాదయోగమే భౌతికయోగబద్ధమైన మానవహృదయమునందు గలుగుచుండును. సృష్టిస్థితి సంహారస్వరూపమైన పరమేశ్వరుని లీలలు క్షుహానురాగ వ్యామోహాభయములకు గారణంబు లగుచుండును. ఒక క్షణమునందు విశ్వమునం దనంతములైన జీవములు పుట్టుచు గిట్టుచునున్నవి. జీవకణము నావిర్భవించిన యాశామోహామే త్రిమూర్తులను సయితమావిర్భవించు ప్రపంచ నాటకమును నడుపుచుండును. ఆశామోహిని త్రిభువనములను కీలుబొమ్మలనువలె త్రిప్పుచు నవరసభరితమైన మహానాటకము నాడించుచున్నది. నాటకరంగములందు ప్రేమపాత్రలు వీరపాత్రలు కరుణపాత్రలు క్రూరపాత్రలు స్వసంస్కారమున కనురూపముగ నాటకము నాడుచు నంతర్థానము నొందుచుండును. గత సంవత్సరమునం దెందఱో మానవలోభమున కాహుతులైరి! ఎందఱో యుద్ధములకు గురియైరి! ఎందఱో మహారోగములకు బలియైరి! ఎందఱో ఆకస్మిక కారణముల కర్పితులైరి! ఈ మరణసంఖ్యను దలంచినపుడు హృదయము కంపము నొందుచున్నను మానవపౌరుషేయము మాత్రము మహారాజ్యాధిసత్యమును వహించుచున్నది. ఈ పౌరుషము వర్తమానయుగమునందు గలుగజేయుచున్న మహాభీభత్సము తత్త్వజ్ఞులకు మహావిషాదమును గలుగఁజేయుచున్నది. ప్రకృతిశాస్త్రజ్ఞులు భూతవశీకరణసాధనములను నిర్మించుచు సర్వజ్ఞత్వమును బూనుచున్నారు. ధీరులు జాతీయాభిమానపరవశులై విశ్వాధిపత్యమును గోరుచున్నారు. పండితులు స్వభావాభిమాననిరతులై స్వజాతీయప్రయోజనములను ఘోషించుచున్నారు. ప్రజలు భోగాభిలాష పరాయణులయి విశ్వవశీకరణమును గోరుచున్నారు. శాస్త్రములు కళలు మానవధర్మాభ్యుదయనామమునను మానవధర్మసంహారమునకై వినియోగపడుచున్నవి. శాస్త్రపరిశోధనలు- సహజసంపదలు- ధర్మాభిమానము- మానవధర్మసంహారమునకు వినియోగపడుచున్న విధమును గతించిన

మహాసంగ్రామము సువ్యక్తము చేసినది. నాలుగేండ్లలో చిరకాలసంవర్ధితములైన సంపదలు నశించినను- ప్రజలు హరించినను- ధర్మములు పోయినను- ప్రపంచహృదయమునకు శాంతి గలుగలేదు.

**పరాపహారణము**

ప్రపంచహృదయమునందు కష్టకాలమునందు గలిగిన విరాగము స్మశానవైరాగ్యముగఁ బరిణమించినది. పాశ్చాత్యజాతులయందహమహమిక పెరుగుచున్నది. మహాతృష్ణ వర్ధిలుచున్నది. భోగాభిలాష విజృంభించుచున్నది. మానవదృష్టి బాహ్యాడంబరములందు లగ్నమగుచున్నది. భాగ్యభోగ్యారాధనమునందు గల యభిమానము ధర్మారాధనమునందు గలుగలేదు. పరజనులు పరదేశము పరద్రవ్యము ప్రపంచశాంతికి బదులు ప్రపంచసంహారమునకు వినియోగపడుచున్నవి. బాహ్యసాధనమగ్నమైన మానవహృదయము నాంతరంగిక సాధనమునకు మఱల్చుట ప్రపంచశాంతికి సాధనముగ నున్నది. పరమేశ్వరుఁడు, వ్యక్తులును జాతులును పరాపేక్ష లేకయే సుఖముల ననుభవించుటకు సదుపాయములను గల్పించినను, మానవహృదయమునకు పరావలోకనమే సుఖసాధనముగ గన్పించుచున్నది. పరద్రవ్యాకర్షణము పరదేశాక్రమణము పరవాణిజ్యాకర్షణము సుఖసాధనములుగ బరిణమించినవి. సామ్రాజ్యములకు సంపదలకు పరిశ్రమలకు వాణిజ్యమునకు విపరీతాకృతు లేర్పడినవి. మహాసామ్రాజ్యములు పెరిగినవి. కోటీశ్వరులు పడగలెత్తిరి. వర్తకశేఖరులు విజృంభించిరి. లోకమునందు శాంతికిబదులు సంరంభము పెరిగినది. మానవదృష్టి బాహ్యసాధనములందు లగ్నమగునంతవఱకు సంరంభము పెరుగుచుండునని లోకానుభవము విశదము చేయుచున్నది. మానవదృష్టి బాహ్యసాధనములనుండి యాంతరంగిక సాధనములకు మఱలునపుడే లోకమునకు శాంతియును సుఖమును గలుగునని తత్త్వవేత్తలనాదినుండియును బోధించుచు లోకకల్యాణమునకుఁ దోడ్పడుచుండిరి. మహర్షులు సుఖమునకు శాంతికి మానవహృదయమును భౌతికప్రపంచమునుండి యాధ్యాత్మిక ప్రపంచమునకు మఱల్చుటయే పరమసాధన మని బోధించుచుండిరి. ఆ బోధామృతమును గ్రోలిన భారతహృదయము కష్టకాలమునందు సయితము శాంతి ననుభవింపగలిగినది. గాంధిమహాత్ముఁడు, భారతహృదయమునందవ్యక్తముగ నున్న యాధ్యాత్మిక సాధనమునే అసహాయోద్యమ స్వరూపమునను సువ్యక్తము చేసి భారతభూమియందును ఇతర రాజ్యములందును సుస్థిరశాంతిని స్థాపించుటకు బూనుకొనెను. భారతహృదయస్వభావము నెఱుఁగని పాశ్చాత్యులకును స్వదేశీయులకును గాంధిమహాత్ముని భావములు విపరీతములుగఁ దోఁచుటయును వారు నిర్బంధ ప్రస్థానమునకు ధ్వజమెత్తుటయును సహజము. భాగ్యభోగ్యములందు మునిగి తేలువారలకు కౌపీనధారణము పరిహాసపాత్ర మగుట సహజము.

సర్వావృతంబై మహాస్తంభనమునకు గారణంబైన భౌతికపాశబంధములను సడలించి భారతదేశమోక్షమును జేయుటకు గంకణమును గట్టుకొనిన గాంధిమహాత్ముఁడు రాజద్రోహిగ దండింపబడెను. వేలకొలఁది భారతపుత్రులు బంధనములపాలయి స్వరాజ్యాశ్రమములందు విశ్రమించుచు స్వరాజ్యమంత్రమును జపించుచున్నారు. దేశభక్తుఁడు వేంకటప్పయ్యపంతులు శాంతిసంరక్షణవ్యాజమున నిర్బంధము ననుభవించుచున్నాఁడు. సాధుపుంగవుఁడు గాంధిమహాత్ముఁడు రాజద్రోహమునకు దండనము ననుభవించుచున్నాఁడు. భారతభూమికి దుర్మతిసంవత్సర మన్వర్థభావమును వహించిన విధమును నిర్బంధములును దేశపరిస్థితులును ఈతిబాధలును విశదము సేయుచున్నవి. కష్టములతోను నిర్బంధములతోను ఆరంభమైన దుందుభిసంవత్సరము శుభములతోను స్వాతంత్ర్యముతోను నంత మొందుటకు పరమేశ్వరుఁ డనుగ్రహించుగాత!

**దుందుభి సంచిక**

సంవత్సరాదిసంచికను సకాలమునకు బ్రచురింపఁజాలనందుల కాంధ్రమహాజనుల మన్నలను వేఁడుచున్నాము. సంవత్సరాదిసంచికయందు రాజకీయ మతనైతిక సాంఘిక సారస్వతవిషయములకు సంబంధించిన వ్యాసములు గలవు. దేశభక్తులు-విద్వాంసులు- విద్యార్థులు- బంధనముల పాలయియున్నపుడు వారి భావసంజాతమైన సంచికయును సంకుచితాకృతిని దాల్చుట సహజము. రాజకీయవేత్తలు పట్టాభిసీతారామయ్యగారు అసహాయోద్యమవ్యాపనమును గురించి వ్రాసిన వ్యాసము సంశయాత్ముల సందియములను బాపగలదు. ఆంధ్రరాజకీయచరిత్రము, ఆంధ్రవిశ్వవిద్యాలయము, స్వరాజ్యసంపాదనము, నాటకలక్ష్యసమన్వయము, ఆంధ్రగద్యనాటకములు, బడితోటలు, తిక్కన కవిత్వము, కవితత్త్వము, మనుచరిత్ర

విమర్శనము, ఆత్మీయ స్వారాజ్యము, ప్రాచీనాంధ్ర నౌకాజీవనము, భారత స్వరాజ్యాదర్శము, పాలకురికి సోమనాథకవి, కాళింగులు, యుద్ధమల్లుని బెజవాడ శాసనము, అనవేముని ఉప్పుగల్లుశాసనము మొదలగు రాజకీయ మత సాంఘిక సారస్వత చారిత్రాత్మక వ్యాసములు గలవు. కవిశేఖరులు రచియించిన రసభావ సంపన్నములైన పద్యములును గలవు. పద్యములు వ్యాసములు ప్రజాహృదయము నావరించిన స్వాతంత్ర్య ధర్మ వికాసమును మహా ప్రబోధమును మాతృభాషాభిమానమును సేవాభిలాషను తెలుపుచున్నవి.

మా ప్రయత్నములకు దోడ్పడుచు నంచికోప యోగమును పెంపొందించిన వ్యాసలేఖకులకు పరమ కృతజ్ఞులము.

దేశమోక్షమునకై స్వయముగ నిర్బంధము నను భవించిన దేశభక్తుల పటములు ఈసంచికయందు బ్రచురింపబడినవి. గాంధిమహాత్ముఁడు దేశభక్త వేంకటప్పయ్య పంతులు దేశబంధు చిత్తరంజనుదాసు మొదలగు ప్రముఖులపటములతో బాటుదేశమోక్షమునకుస్వీయస్వేచ్ఛను సమర్పించిన దేశసేవకులయొక్కయును చిత్రపటములును కొన్ని గలవు. శ్రీకృష్ణజన్మస్థానములందు నివసించుచున్న యాంధ్రధీరుల పటముల నన్నిటిని ప్రచురింపదలపెట్టి యును పటములందక ప్రచురింపజాలనందులకు చింతిలు చున్నాము. జాతీయవిద్యాభ్యుదయమునకై జీవితమును ధారవోసి ఆంధ్ర దేశమునం దంతటను పూజ్యతను గడించిన శ్రీయుత కోపల్లి హనుమంతరావుగారి పటమును నిందుగలదు. దేశోద్ధరణమున కాత్మసమర్పణమును జేసిన భారతమహిళల పటములుఁ గలవు. గతసంవత్సరమునందు భరతవర్షమును సందర్శించిన శ్రీ యువరాజుపటమును, సంవత్సరవృత్తాంతమునందు విశేషాంశముగ బరిగ ణించుటవలనను, ముద్రింపబడినది. తగిన యవకాశములును సదుపాయములును గలుగక ఇతరపటములను ముద్రింపజాలనందులకు దేశాభిమానుల మన్నలను వేడుచున్నాము.

ముఖపటము / ఇతర పటములు

ముఖపటమునందు శ్రీ గోపాలకృష్ణుని విగ్రహము గోపికావృతమై యున్నటులు ముద్రింపబడినది. గోపాలుడు వేణుగానముతో ధర్మనాదమును దిగంతములందు బూరించుచు విశ్వ సమ్మోహమును గలుగజేయుచున్నాడు. కారాగృహమునందు బుట్టి నందవ్రజమునం దజ్ఞాతవాసమునుచేసి మహాయోగపరాయణుడై ధర్మోద్ధరణమును జేసిన శ్రీకృష్ణుడు మహాయోగీశ్వరేశ్వరుడు. ధనుర్ధరుడైన పార్థుడు యోగమూర్తియైన శ్రీకృష్ణసహాయమునను మహాభారత యుద్ధమునందు విజయమును బడసెను. ద్వాపరయుగమునందువలె కలియుగమునందును గోపాలుడు వేణునాదమునుఁ జేయుచు ధర్మోపదేశమును జేయుచున్నాడు. గోపికలు రాటములగానమును వేణునాదముతో మేళ గింపుచు శాంతిప్రదమైన విజయధ్వజస్థాపనమును జేయుచున్నారు. గాంధిమహాత్ముడు ధర్మవిజయస్థాపనమునకు ఘోరమైన ధనుర్ధారణమును వదిలి సౌమ్యమైన రాటధారణము నాదేశించుచు నవయుగధర్మసంస్థాపనమును జేయుచున్నాడు. భారతీయులు గాంధిమహాత్ముని యాదేశమును బాలించి రాటధారణమును జేసి శాంతిప్రదమైన మహావిజయమును శ్రీకృష్ణపరమాత్మానుగ్రహమునను బడయుదురుగాత!

శ్లో. యత్రయోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

ఓమ్ తత్సత్.

# ప్రపంచ ప్రవృత్తి

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద * మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా, నొల్లరు చక్రవర్తిపద * మొల్లరు సర్వరసాధిపత్యము
నొల్లరు యోగసిద్ధి ఫలి * యొండు భవంబుల నొందనీని నీ, సల్లలితాంఘ్రిరేణువుల * సంగతి నొందినధన్యు లెప్పుడున్.

భాగ. ద. పూ. ౬౫౦.

అనంతస్వరూపవిలాసమయమైన ప్రపంచప్రవృత్తి విస్మయమును గలుగఁజేయుచుండును. అనంత రూపములు వివిధదేశములు నానాజాతులు బహుభావలు భిన్నమతములు సృష్టియందు వ్యక్తిత్వమును ప్రతిపాదించుచున్నవి. పరమాణువు మొదలు పరబ్రహ్మమువఱకును గల పదార్థప్రపంచమునం దంతటను పరమార్థతత్త్వము యోగులకు గోచరం బగుచుండును. చీమయందువలె బ్రహ్మయందును శుద్ధసత్యబుద్ధస్వరూపము యోగులకుఁ గనఁబడుచుండును. దేశకాలపాత్రావరణములు పరమార్థసందర్శనమునకుఁ బ్రతిబంధకములు గావని మహాత్ములు లోకోద్ధరణమునకై యనుబోధించి ప్రపంచవికాసమునకు ధర్మసంస్థాపనను జేయుచుందురు. అనంతబ్రహ్మాండభాండమునందు గల సకలపదార్థములును పండితులకు సమభావమును బోధించుటకు వినియోగించును గాని భేదభావమును గల్పించుటకు వినియోగింపవు భూర్భువాదిలోకములు- ధ్రువోష్ణసమప్రదేశములు- పూర్వాపరకాలములు- కృష్ణపింగళశ్వేతమానవజాతులు- అండజపిండజోద్భిజ్జములు - సకలచరాచరప్రపంచము- పండితులకు పురుషార్థసిద్ధికి సాధనములు. ధర్మార్జితమైన యర్థము కామము మోక్షము పురుషార్థములు. చతుర్విధపురుషార్థసిద్ధియే పరమార్థసిద్ధి. ఈమహాసామ్రాజ్యయోగప్రాప్తికి సంసారచక్రమునందు జీవమున కనుభూతమైన ధర్మసంస్కారమును మహాబ్రహ్మాండపురాణ మనంతముఖముల విశదము చేయుచున్నది. కాని మానవహృదయావృతంబైన సమ్మోహము ధర్మవిముఖత్వమునకును నశాంతికిని గారణంబగుచు మహాసంక్షోభమును గలిగించుచున్నది. సంక్షోభావృతంబైన గతసంవత్సరవృత్తాంతావలోకనమునకు ప్రపంచపరిస్థితుల సింహావలోకన మవసరము.

ఏకత్వము

అనేకత్వము

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషః యో యచ్ఛ్రద్ధః స ఏవ సః.

ప్రపంచమునందు సకలజీవములును స్వకర్మ కనురూపములైన ఫలము ననుభవించుచున్నవి. తామసకర్మకు తామసఫలము- రాజసకర్మకు రాజసఫలము- సాత్వికకర్మకు సాత్త్వికఫలము- గలుగుట సహజము. భాగ్యారాధకులకు భాగ్యము గలుగును. యుద్ధారాధకులకు యుద్ధము గలుగును. ధర్మారాధకులకు ధర్మము సంప్రాప్త మగును. మోక్షకాములకు మోక్షము లభించును. ప్రపంచప్రవృత్తియందు వ్యక్తులకును జాతులకును స్వీయసంస్కారమున కనురూపమైన ఫలము గలుగునుగాని సంస్కారవ్యతిరిక్తమైన ఫలము గలుగదు. రాజసబీజములు గల క్షేత్రమునందు సాత్త్వికసస్యములు ఫలింపవు. యూరపు రాజ్యములు చిరకాలమునుండియును పెంచి పోషించిన రాజసతామసబీజములఫలము నిపు డనుభవించుచున్నవి. పాశ్చాత్యరాజ్యముల నావహించిన మమకారాహంకారములకు ఫలమును ప్రపంచ మిపు డనుభవించుచున్నది. యూరపురాజ్యములకు గలిగిన భౌతికసామ్రాజ్యాధిపత్యాభిలాష మహాసంగ్రామములకును హత్యలకును సాధనముగ బరిణమించినది. ప్రపంచేతిహాసములందు గలించిన నాలుగు శతాబ్దముల చరిత్రమును పరమవిషాదమును గలుగ జేయుచున్నది. పాశ్చాత్యరాజ్యముల వ్యాపారలోభము- రాజ్యలోభము- మతలోభము- పరమానర్థములకు గారణంబైనది. వ్యాపారలోభము పరదేశపరిశ్రమలను పాడుచేసినది. రాజ్యలోభము పరదేశస్వాతంత్ర్యమును దగ్ధము చేసినది. మతలోభము పరమతధర్మములను నాశనము చేసినది. పాశ్చాత్యజాతులు లోభపరవశులై చేసిన మహాపరాధములకు ఫలము నిపు డనుభవించుచున్నవి. హరిహరాదులకైనను స్వకర్మఫల మవశ్య మనుభోక్త

పాశ్చాత్య సంస్కారము

వ్యము. నాగరకనామమునను పాశ్చాత్యజాతులు గావించిన సంక్షోభమును ధర్మహానియును వర్ణనాతీతములు. పాశ్చాత్యులాక్రమించిన దేశములందు స్వదేశవాసులకు పుట్టుగతులు పోయినవి. అమెరికాయందు రెడ్డిండియనులు విలయము నందిరి. ఆస్ట్రేలియాయం దాదిమవాసులు నాశనము నొందిరి. ఆఫ్రికాయందు స్వదేశవాసులు హత్యలకును క్రౌర్యములకును పాలయిన విధము లోకవిఖ్యాతము. గనులయందును తోటలయందును స్వదేశస్థులనుభవించెడి హింసలు దేవ్రున కెఱుక. పనివాండ్ర వ్రేళ్లను నఱుకుచుండిరి. చేతులను తెగగొట్టుచుండిరి ఘోరహింసల పాలు చేయుచుండిరి. మంచిస్థలములు తెల్లవారికి- మన్యస్థలములు నల్లవారికి- నివాసస్థలములు. ఈఖండములు స్వదేస్థులకు విదేశములును విదేశస్థులకు స్వదేశములును నైనవి. కారణము శ్వేతజాతుల స్వార్థపరత్వము. తెల్ల ఆస్ట్రేలియా- తెల్ల ఆఫ్రికా- తెల్ల అమెరికా- తెల్ల ఐరోపా- ప్రపంచమునందు స్థిరపడినవి. దైవానుగ్రహమువలనను ఆసియా మాత్రము పూర్తిగ తెల్లఆసియా గాక కొంతకు కొంత నల్లఆసియాగ నిలిచియున్నది. ఈయన్యాయాక్రమణమునకు తెల్లజాతు లవలంబించిన దుర్నయములు- మాయోపాయములు- ధర్మాత్ముల హృదయమునందు పరమసంతాపమును గలుగజేయగలవు. శ్వేతజాతులు పరదేశాక్రమణమునకును పరద్రవ్యాపహరణమునకును ఆత్మవిక్రయమును జేసికొనినవి. ఆత్మవిక్రయముతో సన్నిధర్మములును నశించి స్వార్థపరత్వము మాత్రము నిలిచియున్నది.

ప్రాచీప్రతీచీ ప్రతిఘటనము

ఆసియాఖండ మాదికాలమునుండియును యూరపురాజ్యముల సౌభాగ్యమున కాధారముగ నుండెను. గ్రీసు రోమక రాజ్యముల సౌభాగ్యమున కాసియాఖండ సంపదలు పరమాధారములు. రోమకసైన్యము లాసియాఖండమునందు సర్వసంహారమును జేయుచు సర్వసంపదలను స్వస్థలమునకు జేర్చుచుండినవి. ఆసియాసంపదలు రోమనులందు భాగ్యభోగాభిలాషను వృద్ధిచేసి లోభవశులను జేసినవి. రోమను రాజ్యాధికారమును ప్రతిఘటించిన ప్రజలకు వా రెంతటి మహానుభావులైనను రాజద్రోహదండనము సిద్ధముగ నుండెను. మహాత్ముడు ఏసుక్రీస్తు రాజద్రోహమునకుగాను శూలార్పితమైన ఇతిహాసము ప్రజలుపడిన బాధలకు పరమప్రమాణముగ నున్నది. ఆకథయే 1922 వ సంవత్సరమునందు బ్రిటీషుసామ్రాజ్యమునందు నడుచుచున్నది. రోమనుస్మృతులను రోమను సంస్కారమును నవలంబించిన పాశ్చాత్యసామ్రాజ్యములీ స్వాతంత్ర్యయుగమునందు నయితే మాదండనవిధానము నవలంబించుటయందు విచిత్రము లేదు. రోమనురాజ్యమునందు సైన్యములు రాజ్యమును సంపాదించినవి. వ్యాపారమును పోషించినవి. సామ్రాజ్యమును సుసంపన్నముచేసినవి. అతంత్రమే- వర్తమానకాలమునందు బ్రిటీషుసామ్రాజ్యమునం దవలంబింపబడుచున్న విధమును భారతదేశ వ్యవహారములు సువ్యక్తము చేయుచున్నవి. బ్రిటీషుభారత సామ్రాజ్యమును వాణిజ్యమును ప్రతిభను సైన్యములు రక్షించుచు పోషించుచున్నవి. ప్రజాహృదయమునందు ప్రబోధము గలిగినపుడు సైన్యబలములు తాత్కాలికముగ నిర్బంధింపగలిగినను కాలక్రమమున సామ్రాజ్యసంరక్షణమునకు నిరుపయోగములై సామ్రాజ్యాంతర్భాగములు విడిపోవును. రోమను సామ్రాజ్యచరిత్రము ప్రత్యక్ష ప్రమాణముగ నున్నను సామ్రాజ్యాభిమానులకు జ్ఞానోదయము గలుగని విధమును అధికారుల నిరంకుశవ్యవహారములు విశదముచేయుచున్నవి. పలస్తీనునందు పందొమ్మిది శతాబ్దములకుఁ బూర్వము క్రీస్తు మహాత్ముడు ప్రతిపాదించిన ధర్మేతిహాసమునే గాంధిమహాత్ముడు1922సం॥రమునందు భరతఖండమునందు ప్రతిపాదించుచున్నాడు. అనేక శతాబ్దములుగడచినను- సంగ్రామములు సంప్రాప్తమైనను- సామ్రాజ్యము లంతరించినను - కళలు వర్థిలినను- శాస్త్రములు వికసించినను- మతములు మారినను- విప్లవములు సంప్రాప్తమైనను- పాశ్చాత్యసంస్కారస్వరూపస్వభావము మాత్రము మాఱకయే అసురరాజ్యపాలనము చేయుచున్నది.

ప్రాచీప్రతీచీ సంస్కారములు

ప్రాచీప్రతీచీ సంస్కారముల కాదికాలమునుండియును సంయోగవియోగములు గలుగుచుండినను ఉభయ సంస్కారములును ప్రత్యేకలక్షణలక్షితములై ప్రపంచసంస్కారమున కుపచరించుచున్నవి. ప్రవృత్తియందు జీవస్వరూపస్వభావములు ప్రకృతిపరిస్థితుల కనురూపముగ క్షీణవికాసములను బొందుచు వ్యక్తిత్వమును బడయుచుండును. పంచభూతములు దశేంద్రియములు మనోబుద్ధిచిత్తాహంకారములు స్వరూపస్వభావనిర్మాణమున కవసరమైన బాహ్యసాధన

నిర్మాణమున కనుగుణము తోడ్పడుచుండును. చిరకాలసంవర్ధితములైన బాహ్యసాధనములు బాహ్యసంస్కారములుగ బరిణమించుచున్నవి. ఉద్దీప్తసోమభాస్కర భూతభాసురంబైన ప్రదేశములందును, మందసోమభాస్కర భూతవిలసితంబులైన ప్రదేశములందును, జీవనపోషణమునకు బాహ్యసంస్కారములు భిన్నములుగ నుండును. స్నానాన్నపానీయములందును గృహారామవిహారములందును వస్త్రాభరణములందును సకల భౌతిక సంస్కారములందును నుభయభాగములకును భిన్నమైన దృక్పథ మేర్పడును. ప్రకృతిసంపన్నములైన ప్రాచ్యదేశములు తత్త్వాన్వేషణమునకు పూనుకొనుటయును ప్రకృతి సంపద్విరహితములైన ప్రతీచీ దేశములు ప్రకృత్యన్వేషణమునకు బూనుకొనుటయును సహజము. ప్రకృతిసంపదలతో నిండిన ప్రాచ్యదేశముల వశీకరణమునకు ప్రకృతి సంపదల నాసించెడి పాశ్చాత్యరాజ్యములు విశ్వప్రయత్నములను జేసినవి. అమెరికా ఆస్ట్రేలియా ఆఫ్రికా ఖండములందు సాధ్యమైన సర్వవశీకరణవిధాన మాసియాఖండమునందు సాధ్యము కాలేదు. రాజ్యాక్రమణము సాధ్యముగాని ఆసియాఖండమునందు వాణిజ్యరాజ్యము ధనరాజ్యము సాధ్యములైనవి. ఐరోపాసైన్యములు మారణయంత్రములు పొగ యోడలు వస్తుసముదాయములు వాణిజ్య ధనరాజ్యములను స్థాపించినవి. ఆసియాఖండము పాశ్చాత్యభౌతికపాశబద్ధమైనను నాధ్యాత్మిక సామ్రాజ్యము నవిచ్ఛిన్నముగ ననుభవించుచున్నది.

ఆసియా సంస్కారము

ప్రపంచావృతమైన మహామతములకు ఆశియాఖండము జననస్థలము. ఆసియాఖండవాసులయిన బుద్ధదేవుడు లాఓట్సి ఏసుక్రీస్తు మహమ్మదు పరమేశ్వర సామ్రాజ్యస్థాపనమునకుగారకులు. త్యాగమూర్తి బుద్ధదేవుడు పశుపాతమును జేసి యహింసావ్రతమునను ష్ఠించి శాంతిధర్మమును ప్రతిపాదించెను. మహాత్ముడు ఏసుక్రీస్తు ఆత్మసమర్పణమును జేసి ద్వేషపాతమును చేసి ప్రేమధర్మమును ప్రతిపాదించెను. మహాభక్తుడు మహమ్మదు భేదపాతమును జేసి భగవదర్పణమును చేసి సత్యధర్మమును ప్రతిపాదించెను. ఆసియా సంస్కార సంజాతములైన సత్యాహింసప్రేమ ధర్మములను సంక్షోభ భరితమైన లోకమునందు గాంధిమహాత్ముడు పునః ప్రతిపాదనమునుచేసి ధర్మోద్ధరణమునకు పూనుకొనెను. ఆసియాఖండము నందు పాశ్చాత్యు లవలంబించిన సమ్మోహాతంత్రమునకు భరతఖండ వ్యవహారములు ప్రమాణములు. ఆసియాఖండమునకు సంప్రాప్తమైన సమ్మోహమును జపాను రాజ్యము పాశ్చాత్యాయుధములతోఁ బోగొట్టినది. భరతఖండ మపూర్వమైన ధర్మసాధనమునను బోగొట్టుటకు బూనుకొనినది. ఆసియాఖండమునకు బాహుబల ధర్మబలము లాత్మవిశ్వాసమును గలుగజేయుచున్నది.

భారత చైతన్యము

ప్రపంచ సంస్కారమునందు భారత సంస్కారమపూర్వము. అతిప్రాచీనమైన భారతసంస్కారము విఘ్నపరంపరలు సంప్రాప్తమైనను నవిచ్ఛిన్నముగ భారతహృదయమునందు బ్రవహించుచు సనాతన ధర్మచైతన్యమును సంరక్షించుచున్నది. ప్రపంచేతిహాసము వివిధ సంస్థాపనలు జాతులు ధర్మములు రాజ్యములు మానవ ధర్మాభ్యుదయమున కుపచరించినవిధమును విశదము చేయుచున్నది. ప్రాచీన కాలమునందు అస్సీరియనులు యవనులు రోమనులు స్థాపించిన మహాసామ్రాజ్యము లంతరించినను సామ్రాజ్యముల సంస్కార స్వభావము ప్రపంచప్రవృత్తియందు గోచరంబగుచున్నది. గ్రీసు రోమక సంస్కారములు పాశ్చాత్య సంస్కారమునందు ప్రలీనంబైనను నిజస్వరూపమును గోల్పోయినవి. ప్రాచీనమైన భారతదేశసంస్కారము నేటికిని నిజస్వరూపముతో బ్రత్యక్షమగుచున్నది. ఆదిమగ్రంథమైన వేదమును నిర్దుష్టముగ ననేకశతాబ్దములు గాపాడగలిగిన ప్రతిభయే భారతసంస్కార చైతన్యమునకు నిదర్శనము. భారత సంస్కారమునకు వివిధయుగములందు భిన్నసంస్కారముల సమ్మేళనము గలిగినను సంస్కారస్వభావము మాత్రము పూర్వవాసనలను గలిగియున్నది. భారత సంస్కారమునకు సాత్త్వికమైన జైనబౌద్ధమత సంస్కారవాసనయును ప్రచండమైన మహమ్మదీయమత సంస్కారవాసనయును రాజసమైన క్రైస్తవమత సంస్కార వాసనయును సంక్రమించినవి. ఆ సంక్రమణము భారతసంస్కారమున కనిర్వచనీయమైన శోభను గలుగజేసినది. వేదపరిజ్ఞానము వేదాంతపరిజ్ఞానముగఁ బరిణమించినది. తత్త్వపరిజ్ఞానము భక్తిజ్ఞాన కర్మపరిజ్ఞానరూపమునను నిత్యమైన జీవనధర్మముగ బరిణమించినది. భారతసంస్కారమునందు మతసాంఘిక రాజకీయజీవనములకు పాశ్చాత్యసంస్కారము నందువలె ప్రత్యేకావరణములు లేవు. సకలజీవనవిధానావరణములకును నేకలక్ష్యమును, భారతసంస్కారము నిర్ణ

యుంచినది. రాజులు పోయినను, రాజ్యములు మారినను మతస్వరూపము చెడినను, పరాధీనస్థితి సంప్రాప్తమైనను, మహారిష్టములు గలిగినను, భారతసంస్కారము చైతన్యమును దాల్చియున్నది. పురాకృత సంస్కారలబ్ధమైన తత్త్వజ్ఞానము ప్రజాహృదయమునందు వెలుంగుచున్నది. లోకమునందు ఏయితర దేశమునందును మద్యపానమును మాంసాహారమును విసర్జించిన మహాసంఘములు లేవు. భరతఖండమునందు మాత్రము మద్యమాంసములను పూర్తిగ విసర్జించిన సంఘములు గలవు. భారతహృదయ నిగ్రహమున కీ విసర్జనము ప్రమాణముగనున్నది. కాలాంతరములందు మద్యమాంసప్రియులు రాజ్యాధికారులగుట సంప్రాప్తమైనను పరాధీనస్థితి సంప్రాప్తమైనను భారతధర్మము మాత్రము విలయము నొందకను నిలిచియున్నది. చిరకాలాగతంబైన సనాతనధర్మము సత్యాగ్రహరూపమునను అసహాయోద్యమ సాధనమునను తిరిగి యవతరించినది. అవతారపురుషుడు గాంధిమహాత్ముండీ సత్యోద్యమమును బ్రహ్మాత్మ్యమును బూని నడుపుచున్న విధము ప్రపంచమున కనుభవమువలనను దెలిసియున్నది.

బ్రిటిషు సామ్రాజ్యము

బ్రిటిషుసామ్రాజ్యము భౌతిక పరిస్థితులందు పరమోచ్చదశయందున్నది. విస్తీర్ణమునందును సంపదలందును జనజనసంఖ్యయందును సామ్రాజ్యమద్వితీయ స్థానము నలంకరించుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యము 1427?782 మైళ్ల విస్తీర్ణమును 44,53,88,5?0 జనసంఖ్యను మహావైభవమును గలిగి యద్వితీయముగ వెలుంగుచున్నది. బ్రిటీషు సామ్రాజ్యమునందు 21,00,00,000 హిందువులు 10,00,00,000 మహమ్మదీయులు 8,00,00,000 క్రైస్తవులు 1,20,00,000 బౌద్ధులు 1,20,00,000 ప్రకృతిపూజకులు 40,00,000 సిక్కులు మొదలగువారుగలరు. గ్రేటుబ్రిటనుకు 1921-22 సం. నందు 121,66,50,000 నవరనుల రాబడియును 103,97,28,000 నవరనుల వ్యయమును నిర్ణయింపబడినది. అందు 25,90,00,000 నవరనులు సైనికాదివ్యయములకు వినియోగపడును. పది సంవత్సరములం దాదాయవ్యయము 7 రెట్లు పెరిగినది. గత సంవత్సరాంతమునకు 783,17,44,300 నవరనుల ఋణము గలదు. ఆ ఋణమునందు 116,15,60,000 మాత్రమె పరదేశముల కీయవలయును. గత సంవత్సరమునందు 349,00,00,000 నవరనుల వ్యాపారము బ్రిటీషుద్వీపమునందు నడిచినది. బ్రిటీషువ్యాపారమునకు ప్రధానపోషణము భరతఖండమువలన గలుగుచున్నది. నాల్గవవంతు జనసంఖ్యను వైశాల్యమును గల బ్రిటీషు సామ్రాజ్యభారము దుర్భరమని వ్యవహారక్రమము విశదము చేయుచున్నది. సామ్రాజ్యాంతర్భాగములందు గలుగుచున్న మహాకలవరము దుర్భరభారమునకు నిదర్శనముగనున్నది. మతమునందును సంస్కారమునందును ప్రయోజనములందును భిన్నదృక్పథము గల జాతులకు భిన్న నిరీక్షణము గలుగుట వర్తమాన ప్రపంచపరిస్థితుల కనురూపముగనున్నది. భిన్నజాతులకు సహజముగ గల సంస్కారము కొంతకాల మంతర్గర్భితముగ నున్నను బహిర్గతంబైనపు డా సంస్కారమును గూపుమాపుట యసంగతము. బ్రిటీషుసామ్రాజ్యము నీ దృష్టితో బరిశీలించునపుడు సామ్రాజ్యమునకు గల కష్టసుఖములు విశదము లగును.

సామ్రాజ్యాంతర్భాగములు

బ్రిటీషుసామ్రాజ్యమునందు ప్రత్యేక వ్యక్తిత్వముగల రాజ్యము లనేకములు గలవు. కనడావంటి స్వారాజ్యము ననుభవించెడి రాజ్యములును భరతఖండమునుబోలిన పరాధీనత రాజ్యములును గలవు. బ్రిటీషు సామ్రాజ్యసభ్యత్వము పేరునకుసామ్రాజ్యవాసులకుగౌరవభాజనంబైనను నాచరణమునందు ప్రతిబంధములకు గారణంబుగ బరిణమించిన విధమును సామ్రాజ్యచరిత్రము విశదముచేయుచున్నది. స్వదేశస్వజాతీయాభిమానగ్రస్తులైన బ్రిటీషుసామ్రాజ్యాధికారనిర్వాహకులు స్వార్థపరాయణులై సామ్రాజ్యపరమార్థమును మఱచి సామ్రాజ్యసంరంభమునకు గారణభూతులగుచున్నారు.

శ్వేత సామ్రాజ్యము

సామ్రాజ్యాభిమానులకు సామ్రాజ్య సంస్మరణమునందు తెల్లజాతుల సంస్మరణము మాత్రము గలుగుచుండును. బ్రిటిషు సామ్రాజ్యమునందు గల 44 కోట్ల ప్రజలయందును 6 కోట్ల ప్రజలుమాత్రమె తెల్లవారును 22 కోట్ల హిందువులును 10 కోట్ల మహమ్మదీయులును గలరు. సామ్రాజ్య ప్రజలయందు 32 కోట్ల భారతీయులుగలరు. బ్రిటిషు సామ్రాజ్య విస్తీర్ణమును ప్రజాబాహుళ్యమును నవనిరీక్షణమును నవయుగ ధర్మప్రకాశావసరమును విశదము చేయుచున్నను సామ్రాజ్యాభిమానులెప్పటి యాటనె యాడుచున్నారు. ఐరోపా మహా

సంగ్రామము ప్రాచీన సిద్ధాంతములను విధ్వంసము చేసినది. ఆపత్కాలమునందు ప్రుడ్రో విల్సను లాయిడు జార్జి మొదలగు రాజ్యనీతిజ్ఞులు ప్రతిపాదించిన మూలధర్మములు యుద్ధానంతరము నిరర్థకములైనవి. ప్రపంచమునందు సామాన్యమానవుల కున్న ధర్మస్వత్వములు మహాజాతులకు లేవు. వ్యక్తులు పరస్థలాక్రమణమును జేసినపుడు ప్రతీకారమును జేయుటకు న్యాయస్థానములు గలవు. పరద్రవ్యాపహరణము పరగృహాక్రమణము పరదారాగమనము పరప్రాణాపహరణము- వ్యక్తులందు ధర్మప్రతికూలమై దండనార్హమైనను- రాజ్యాధిష్ఠిత జాతులందుత్తమ ధర్మముగఁ బరిగణింపబడుచున్నది. వ్యక్తులకు శత్రువులను జంపుట మహాపాతకము. జాతులకు పరులను దండించుట పరమధర్మము. పవిత్రమైన దేశాభిమానము దేశభక్తి హేయములై మహాసంక్షోభమును గలుగఁజేసినవి. యూరపు రాజ్యములందు జాతీయభావమునకుఁ బట్టిన దుర్దశకు గత శతాబ్దిలోని ఇతిహాసము వ్యాఖ్యానముగనున్నది. గత శతాబ్దియందు పాశ్చాత్య జాతుల నావహించిన యహంమహమికయే మహాసంగ్రామములకును మహాసామ్రాజ్యములకును సాధనంబైనది. జాతీయ దురహంకారము జాతీయధ్వజచిహ్నములైన గండభేరుండములందును సింహములందును భల్లూకములందును వ్యాఘ్రములందును ప్రత్యక్షముగనున్నది. క్రూరమృగారాధనమునకు ఘోరఫలము గలుగునేగాని శాంతిఫలము గలుగదు. ఈ యహంమహమికకును దురహంకారమునకును పతనమునకును జర్మను జాతీయేతిహాసము లక్ష్యముగ నున్నది. సకల ప్రపంచమును జర్మనుమయము చేయఁ బూనిన జర్మనుజాతియును జర్మను సామ్రాజ్యమును నధోగతిపాలైనవి. యుద్ధాంతముతో నాపత్సమయమందు ప్రతిపాదితములైన ధర్మసిద్ధాంతములను సంతరించినవి. లాయిడు జార్జిగారి ధర్మప్రతిజ్ఞలు మాయమాటలై సామ్రాజ్యాభిమానము పూర్వపు రూపభావములను వర్ధిలుచున్నది. భారతస్వారాజ్యవిషయమునను ఖిలాఫతువిషయమునను లాయిడుజార్జిగారు ప్రతిజ్ఞాభంగమును జేసి యశాంతిని గలుగజేసిరి. భారతసమస్యయందును ఖిలాఫతుసమస్యయందును శ్వేతాధిపత్యము మాత్రము స్థిరపడినది. బ్రిటీషుసామ్రాజ్యమునందు శ్వేతాధిపత్యధర్మము గలుగజేయుచున్న ధర్మవిప్లవము మహాసంక్షోభమును గలుగజేయుచున్నది.

వ్యక్తులస్థితి కవసరమైన స్వయంవ్యక్తిత్వధర్మము జాతుల స్థితికిని సత్యంతావసరము. మహావ్యక్తిత్వము గల మహాజాతులకు వలె సామాన్య

**స్వయం వ్యక్తిత్వము**

వ్యక్తిత్వము గల స్వల్పజాతులకును స్వయంవ్యక్తిత్వాధికారము జన్మస్వత్వము. వ్యక్తుల బానిసతనమును నిర్మూలనము చేసిన రాజ్యములు మహాజాతుల స్వామ్యమునకు గంకణము గట్టుకొనుట ధర్మవైపరీత్యము. శ్వేతజాతులు నల్లజాతుల దుర్భరభారమును వహించుచున్నటులు ప్రగల్భములను గొట్టుట తెల్లవారికి పరిపాటియైనది. తెల్లవారు నల్లవారి భారమును వహించిన విధమునకు తుపాకులు మరఫిరంగులు విమానములు సైన్యములు నౌకాదళములు సాక్షీభూతములు. భారతజాతీయవికాసమునకు నూటయేబదేండ్ల బ్రిటీషుపరిపాలన మొనర్చిన ఘనకార్య మగోచరము. బ్రిటీషుప్రభుత్వము నిర్మించిన రైలుమార్గములు- స్థాపించిన తపాలకచ్చేరిలు-తంత్రిమార్గములు- న్యాయస్థానములు- ఘనకార్యములుగఁ బరిగణింపఁబడజాలవు. ఇవి కేవలము బ్రిటీషు ప్రభుత్వప్రయోజనములకు నిర్మితములు గాకపోయినను వర్తమానకాలావసరములకై సకలదేశములందును నేర్పడుచున్నవి. ఈ నిర్మాణములు భారతవ్యక్తిత్వమునకును వికాసమునకును దుర్బలమును గలుగజేసినవే గాని బలమును గలుగజేయలేదని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. భారతహృదయమునం దాత్మావలంబనభావము పోయి పరావలంబనభావము కలిగినది. పరావలంబన మాత్మనిరసనమునకును పరశ్లాఘనమునకును సాధనమైనది. స్వధర్మము స్వమతము స్వభాష స్వదేశము పరిహాసమునకును, పరధర్మము పరభాష పరదేశము గౌరవమునకును, భాజనంబులైనవి. ఆంగ్లభాషాభ్యాసము గౌరవమునకును నుదరపోషణమునకును నాగరకతకును లక్షణమైనది. లాగు బూటు టోపీధారణము గౌరవచిహ్నమైనది. క్రైస్తవమత ధర్మాచారము లనుష్ఠేయములైనవి. ఆంగ్లదేశ నివాసగమనములు మహత్త్వమునకు సాధనములైనవి. బట్టలకు లాంకాషైరు, చెప్పులకు సుర్రె కత్తులకు బర్మింగ్హాము, మేకులకు హాలండు, రంగులకు జర్మని, పాలకు స్విట్జర్లాండు, సారాయమునకు స్కాట్లండు, రొట్టెలకు రెడింగు, పండితులకు ఆక్స్ఫర్డు, రక్షణమునకాంగ్లబలము ఆధారములైనవి. దేహపోషణము, వస్త్రధారణము వాగ్విభవము మనోవికాసము పరాధీనమునం

దున్నపు డాత్మస్వరూప మంతరించును. ఆత్మస్వరూప మంతరించునపు డితర మహాప్రయోజనము లన్నియును నిరుపయోగములు. నూటయేబదేండ్ల బ్రిటీషుపరిపాలనమువలనను భారతసంస్కారమునకుఁ గలిగిన ప్రయోజన మతిస్వల్పము. నేఁ డాంగ్లేయులు స్వస్థలమునకుఁ బోయిన భరతఖండమునకుఁ మిగులగల సంస్కార మతిస్వల్పముగ నుండు నని పాశ్చాత్యపండితులు నయిత మంగీకరించు చున్నారు. స్వదేశమునందు స్వజాతీయ ప్రయోజనముల కాత్మోపలబ్ధిని బడయుట కవకాశములు లేని పరిపాలనవిధానమునందు భారతసంస్కార వికాసము దుస్తరము. ఆంగ్లవ్యక్తికిఁ గల గౌరవావకాశములు భారతవ్యక్తికి స్వదేశమునందు దుర్లభము లైన పుడు భారతజాతికి స్వదేశమునం దాత్మహాని గలిగినవిధము విశద మగుచున్నది. మహావ్యక్తులకు నయితము స్వదేశమునందే సామాన్యాంగ్లవ్యక్తులకుఁ గల గౌరవ ప్రతిపత్తులు లేనపుడు బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములందు గౌరవప్రతిపత్తులు గలవని యానందించుటగాని కలుగవలయునని కోరుటగాని నిరర్థకము.

సామ్రాజ్యాంతర్భాగములు

నానాజాతిసమితియందు భరతఖండమునకు గలిగిన సభ్యత్వము స్వయంవ్యక్తిత్వమునకు నిదర్శన మని ఘోషించుట యాచారమైనది. మహాగౌరవనీయులైన శ్రీనివాసశాస్త్రిగారును రాజప్రతినిధి రీడింగు ప్రభువును ప్రధానమంత్రి లాయిడు జార్జిగారును నీవిషయమునే ప్రతిపాదనమును జేయుటచే విషయము విచారార్హ మగుచున్నది. స్వదేశమునందు భారతీయులకు గల ప్రతిపత్తి జగద్విదితము. జన్మభూమియందు మానవులకు జన్మస్వత్వమైన సమావేశస్వాతంత్ర్యము వాక్స్వాతంత్ర్యము లేనపుడు జాతిసమితియందలి సభ్యత్వము వలనను గలుగఁగల ప్రయోజనము తెలియకున్నది. జాతిసమితిసమావేశమునందు బ్రిటీషు సామ్రాజ్యపక్షమునను శ్రీనివాసశాస్త్రిగా రొక సమ్మతి నీయవచ్చును. ఈసభ్యత్వ మింటను గెలువక రచ్చను గెలుచునటు లున్నది. బ్రిటీషుసామ్రాజ్యమునందు భరతఖండమునకుఁ గల ప్రతిపత్తికి కెనియా దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియా కనడారాజ్యములందు గల్పింపబడిన ప్రతిబంధకములు ప్రమాణములు. తెల్లవారత్యంత స్వల్పసంఖ్యాకులు గల ఫిజీదీవులందు నయితము భారతీయుల ప్రతిషేధము కోరఁబడుచున్నది. భారతీయులు కూలిపనులను జేయుచున్నంతవఱకును వారికి భిక్షమును పెట్టుటకు తెల్లదొరల కభ్యంతర ముండదు. స్వయంవ్యక్తిత్వలక్షణములు గోచరమగునపుడు వలస రాజ్యనివాసమునకు భారతీయు లపాత్రు లగుదురు. స్వదేశమునందు గౌరవములేని భారతజాతికి శ్రీనివాసశాస్త్రిగారి ప్రార్థనలును నుపన్యాసములును వలసరాజ్యములందు గౌరవమును గడింపఁజాలవు. స్వయంవ్యక్తిత్వము స్వయంకృషివలననే గలుగఁగలదని జాతీయమహాసభ చేసిన నిర్దేశమనహాయోద్యమమునకు మూలాధారముగ నున్నది. శ్వేతజాత్యధిపత్యమే ప్రధానమైన బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములందును జన్మభూమియందును మహాభారతజాతికి గౌరవప్రతిష్ఠలు గలుగనపు డాత్మసంరక్షణమున కసహాయోద్యమము శరణ్యమైనది.

స్వయం నిర్ణయము

ప్రపంచమునందు సంకల్పమున కనురూపమైన ఫలము జీవములకు గలుగుచుండును. స్వయంవ్యక్తిత్వమునకు సంకల్పము మహాబీజము. స్వయంవికాసమునకు వ్యక్తులకు గల ధర్మాధికారము జాతులకును గలదు. ఈమహాధర్మమును పాశ్చాత్యరాజ్యముల రాజ్యలోభము వాణిజ్యలోభము పాడుచేసినది. పాశ్చాత్యరాజ్యములు సకలదేశములను సంపదలను పంచభూతములను నారగించుట కుపక్రమించినవి. ఈమహాభక్షణము మహావ్యాధిని బుట్టించి జాతీయదురహంకారము నపారముగ వృద్ధిచేసినది. ప్రతిజాతికిని తనజాతియే లోకోత్తరమైన జాతియను నహంకార ముదయించినది. విశ్వాధిపత్యమునకు తన జాతిని భగవంతుడు నిర్మించినటు లభిమానము గలిగినది. అభిమానసంరక్షణమునకు పటాటోపము పెరిగినది. పటాటోపసంరక్షణమునకు సైన్యములు నౌకాదళములు శస్త్రాగారములు మారణసాధనములు మాయోపాయములు వర్ధిల్లినవి. మారణసాధనసంరక్షణమునకు దేశాదాయమునందలి విశేషభాగము వ్యయమగుచున్నది. గత సంగ్రామమునందు రణరంగములందు మరణించిన కోటిమంది సైనికుల సంఖ్యయును క్షతగాత్రులైన రెండుకోట్ల సైనికసంఖ్యయును హానైన యర్బుదముల ద్రవ్యమును యూరపురాజ్యముల నావహించిన మహావ్యాధిలక్షణములను దెలుపుచున్నవి. ఆపత్కాలమునందు గలిగెడి ధర్మసంస్మరణ మాపదంతముతో నంతరించును. సంగ్రామకష్టసమయమునందు ప్రతిపాదితమైన స్వ

యంనిర్ణయధర్మము సంగ్రామాంతములో నంతర్గతమైనది. బ్రిటీషు సామ్రాజ్య విజయమునకు తోడ్పడిన మహమ్మదీయులకును భారతీయులకును సామ్రాజ్యాధికారులు ప్రతిజ్ఞాభంగమును జేసిరి. మహమ్మదీయ మతాధిపత్యమునకు లక్ష్యమైన తురుష్క-సామ్రాజ్యమున కంగవిచ్ఛేదము గలిగినది. స్వాతంత్ర్యనామధారణము గల శేషించిన మహమ్మదీయ రాజ్య మొకటియును దుర్గతి నొందినది. బ్రిటీషురాజ్యాధికారుల రాజ్యతంత్రము మహమ్మదీయ ప్రపంచమునందు గొప్పకలవరము గలుగ జేసినది. మహమ్మదీయ ప్రపంచ సంయోగాభిలాష వర్ధిల్లినది. నేడు లోకమునందుగల మహమ్మదీయ రాజ్యములకు దురదృష్టవశమునకైనను సానుభూతి సాధ్యమైనది. ఖిలాఫతు సమస్య ప్రపంచశాంతిసమస్యగా బరిణమించినది. యుద్ధసమయమునం దాంగ్ల రాజనీతిజ్ఞులు ప్రతిపాదించిన స్వయంనిర్ణయధర్మము భారత జాతీయ హృదయమునందు స్వరాజ్యాశాంకురములను స్థాపించినది. యుద్ధానంతరము ప్రసాదితములైన యపర్యాప్తములైన మాంటుఫర్డు సంస్కరణవిధానములు రౌలటుశాసనము పంజాబు హత్యలు బ్రిటీషురాజ్యహృదయమును విశదముచేసినవి. ధర్మనిర్ణయములకును రాజ్యవ్యవహారములకును గల స్వల్పసంబంధ మనుభవవేద్యమైనది. ప్రతిజ్ఞలు-సంస్కరణములు-రాజ్యతంత్రములు-భారతజాతీయపారతంత్ర్యస్థితిని బలపఱచుట కేర్పడినవిధమును చిరకాలానుభవము ధ్రువపఱచినది. మోర్లే తత్త్వజ్ఞునకును మాంటేగు రాజనీతిజ్ఞునకును వింటర్టను ప్రభువునకును భారతస్వారాజ్యసమస్య విషయమై మాటలయందు భేదమున్నను క్రియలయందు సమానముగనుండును. మోర్లే దర్మ్యాంబరోపమానమును వింటరుటను దెలిపిన పౌరసేవోద్యోగి ప్రతిభయును నిదర్శనములుగ నున్నవి. భారతజాతీయ మోక్షమున కాంగ్ల రాజనీతిజ్ఞుల ప్రతిజ్ఞలును సంస్కరణశాసనములును ధర్మోపదేశములును సాధనములు గావనియును భారతీయుల స్వయంసహాయావలంబనమే సాధన మనియును స్వదేశమునందును పరదేశములందును ననుభవమునందు గల బ్రిటీషుపరిపాలనానుభవము విశదము సేయుచున్నది.

## బ్రిటీషు పరిపాలనము

భారతహృదయమునకు చిరపరిచితమైన బ్రిటీషు పరిపాలన వర్ణనము వర్తమానసమయమునం దనవసరము. భారతప్రభుత్వము బ్రిటీషుప్రజల స్వప్రయోజనముల కేర్పడినదనియును పరమార్థమున కేర్పడలే దనియును సామాన్యముగ నంగీకరింపబడుచున్నది. ప్రధానమంత్రి లాయడు జార్జి గారు బ్రిటీషు బలములును సంపదలును బ్రిటీషు ప్రయోజనముల సంరక్షణమునకు వినియోగింపబడు నని మర్మమును విడిచి చెప్పిరి. పరిపాలనవిధానము మంత్రిభావముల కనురూపముగ నున్నది. పరమార్థమునకును స్వప్రయోజనములకును సాహచర్య మసంభవము. ఓడ్వయరులు డయరులు సైడెన్హాములు బహిరంగముగ బ్రిటీషు పరిపాలనస్వభావమును ప్రతిపాదించుచున్నారు.

నిరంకుశ ప్రభుత్వము

నిరంకుశప్రభుత్వమునందు ధర్మాధర్మవివక్షత పోయి స్వప్రయోజనము రాజ్యముచేయుచుండును. నిరంకుశాధికారమునకు నిర్బంధములు దౌర్జన్యములు దండనములు సహజాయుధములు. బ్రిటీషు రాజ్యాధికారులు నిరంకుశాయుధములను యథేచ్ఛగ వాడెడివిధమును నిత్యవ్యవహారములు చెప్పకయే చెప్పుచున్నవి. కలెక్టరులవలె సామాన్యరక్షకభటులును నిర్బంధాస్త్రములను నిరభ్యంతరముగ నుపయోగింపగల పరిపాలనవిధాన మేదేశములందును ననాదరణీయము. నిరంకుశ విధానమునకు ప్రజలు ప్రతిఘటనభావమును జూపునపు డాయుధములు డయరు చెప్పినట్లు గుణపాఠమును నేర్పుటకు సిద్ధముగ నుండును. ఏటేట నెందఱు నిర్దోషులు శాంతిన్యాయరక్షణనామమున నిరంకుశవిధానమునకు బలి యగుచున్నదియును రాజ్యవ్యవహారములు తెలుపుచున్నవి. నిర్బంధములు-నిర్బంధముల వెంటను ప్రభుత్వసమర్థనము-సిద్ధముగ నుండును. పంజాబుహత్యలు ప్రభుత్వసమర్థనము హంటరు నివేదికము భారతహృదయమున ననుభవమునం దున్న రాజ్యాంగవిధానము. దుర్భరమైన పరిపాలనవిధానము మాఱునంతవఱకును భారతజాతికి భుక్తియును ముక్తియును గలుగవు. అసురమైన ప్రభుత్వవిధానమును మార్చుటకు గాంధిమహాత్ము డసహాయోద్యమ సాధనము నవలంబించి నవధర్మప్రతిష్ఠను జేసెను.

పరాధీనస్థితియం దున్న జాతులకు స్వాతంత్ర్యము గలుగుట కష్టసాధ్యము. రాజ్యానుభోగము గల యధికారవర్గము ప్రజాభీష్టములను విఫలము చేయుటకు సంసిద్ధముగ నుండును. ప్రజాహృదయమునందు ప్రబోధము గలిగినపుడు నిరంకుశాయుధములు హృదయ స్తంభనమును జేయుచుండును. నిర్బంధవిధాన ప్రయోగమునకు గారణపరంపరలు గన్పించుచుండును. ప్రజలు దార్జన్యమునకు ప్రతిదార్జన్యము చూపునపుడు బంధనపాశములు విడునడుచుండును. స్వాతంత్ర్యప్రకాసము విధివశమున సంప్రాప్తమగును. కాని యుదారహృదయముతో నొసంగబడదు. ఐర్లాండు బంధనములు వదలుటకు నూఱేండ్ల సంరంభ మవసరమైనది. ఐర్లాండు దార్జన్యమునకు దార్జన్యమును దండనమునకు దండనమును హత్యకు హత్యను ప్రయోగించి విమోచనమును బడయగలిగెను. దార్జన్య సంస్కారము గల ప్రభుత్వము దార్జన్యప్రతాపమును గ్రహించునటు లన్యసాధనముల ప్రభావమును గ్రహింపజాలదు. ఐర్లాండు స్వరాజ్యసిద్ధికి దండనసాధనమును ససహాయోద్యమాయుధమును తోడ్పడినవి. ప్రజల సహాయోద్యమాయుధ ప్రయోగమును జేసి రాజ్యస్తంభనమును చేసినపుడు సుకరముగను ఐర్లాండునకు స్వరాజ్యము సంప్రాప్తమైనది. ఈజిప్టుదేశమును నయిర్లాండుమార్గము నవలంబించి స్వరాజ్యమును బడయనున్నది. స్వరాజ్యసంరంభమునందు నిమగ్నమైన భారతజాతికిని స్వరాజ్యప్రాప్తికి ధర్మసాధన మవసరమైనది.

*స్వరాజ్య సంపాదనము*

*భారతజాతీయ మహాసభ*

భారతజాతీయ మహాసభాసాధనమునను భారతనాయకులు చిరకాలమునుండియును స్వరాజ్యసంరంభమును జేయుచు పొందిన ప్రయోజనములు ప్రజలకు దెలిసియున్నవి. స్వదేశమునందును గ్రేటుబ్రిటనునందును నడిపిన రాయబారములు- సమర్పించిన విన్నపములు- ప్రతిపాదించిన తీర్మానములు- నిష్ఫలములైనవి. మోర్లిమింటో సంస్కరణములు- మోంట్ఫర్డు సంస్కరణములు- భారతీయుల కుద్యోగములను గలుగజేసినను పరిపాలనవిధానమెప్పటివలె నాంగ్లాధికారవర్గహస్తములందు నిలిచియున్నది. ద్వంద్వ ప్రభుత్వము ప్రసాదించిన ప్రజాయత్తశాఖయందైనను మంత్రులకు వ్యక్తిత్వము లేదని మంత్రుల ప్రసంగములు విశదముచేసినవి. సంస్కరణములు స్వాతంత్ర్యమును ప్రసాదింపజాలక పోయినను వ్యయభారమును విపరీతముగ వృద్ధిచేసినవి. రాష్ట్రప్రభుత్వములకును సామ్రాజ్యప్రభుత్వమునకును నాదాయమునుమించిన వ్యయము గలిగినది. సామ్రాజ్యాదాయమునందు సగము సైనికవ్యయమునకై వినియోగపడుచున్నది. వ్యయమునకు దగినయాదాయము గలుగుటకు క్రొత్తపన్ను లవసరంబైనవి. స్టాంపులఫీజులు రిజిష్ట్రేషను ఫీజులు దిగుమతిపన్నులు రైలుకిరాయిలు మొదలగునవి హెచ్చింపబడినవి. పన్నులు పదేండ్లలో తలకు రెండురూపాయలనుండి రు 6-8-0 లకు పెరిగినవి. పన్నులు పెరిగినను దేశమునకు తరణోపాయము గనుపడుట లేదు. దేశాదాయమునందు విశేషభాగము సైన్యవ్యవస్థలకును నాంగ్లాధికారుల వేతనములకును వినియోగింపబడుచున్నది. విద్య కళలు పరిశ్రమలు పారిశుద్ధ్యము వ్యాపనమును పొందుటకు ద్రవ్యము లేదు. వర్తమానపరిపాలనవిధానమునం దొక శతాబ్దము నిరీక్షించినను దేశక్షేమాభ్యుదయముల కవసరమైన ద్రవ్యోత్పత్తి కలుగుట దుర్లభము. వ్యయమును తగ్గించుటకు విచారించుటకేర్పాటుచేసిన పంచాయతులు పదుగురు గుమాస్తాలనో నౌకరులనో తొలగించుటను నిర్ణయించి వ్యయమును తగ్గించినటు లానందించును. వర్తమాన పరిపాలన విధానము సంపూర్ణముగ మారుటయును జాతీయసంస్కారమునకును పరిస్థితులకును ననురూపమైన పరిపాలనవిధానమేర్పడుటయును దేశమునకు తరణోపాయము. స్వప్రయోజనముల నాసించెడి పరరాజ్యపరిపాలనమున కీమహాకార్యమును నెఱవేర్చుటకు సంకల్పము గలుగదు. సంకల్పము గలిగినను వారి సంస్కారము ప్రతిబంధకముగ నుండును. నలువదేండ్ల రాజ్యాంగాందోళనమీ ప్రయోజనమును గలుగజేయలేదు. రాజకీయహత్యలును నిరుపయోగములైనవి. ధర్మప్రదమైన సత్యాగ్రహాయుధము స్వరాజ్యసాధనముగ బరిణమించినది. అఖండమైన సత్యాగ్రహధర్మమును గ్రహించుటయును ధర్మారాధనమును జేయుటయును కష్టసాధ్యములు.

## సత్యాగ్రహము

*త్యాగము*

సత్యాగ్రహ మసిధారా వ్రతము. సత్యాగ్రహము సకలజీవములకును పరిచితమైన సత్యధర్మారాధనము. మానవహృదయమునందధర్మమాగ్రహమునుగలుగజేయును. సామాన్యులీయాగ్రహమును పరపీడనమునకు వినియోగించి యాత్మపతనమునకు గారకులగుదురు. ప్రాజ్ఞులీ

యాగ్రహము నాత్మత్యాగమునకు వినియోగించి ఆత్మోద్ధరణమునకును ప్రపంచోద్ధరణమునకును గారకులగుదురు. మానవసంస్కారమునందు పశుభావ మాసుర కార్యములకును ఆత్మత్యాగము దైవకార్యములకును సాధన మగుచున్నది. ప్రపంచప్రవృత్తియందు దురాగ్రహ మనర్థములకును సత్యాగ్రహము పరమార్థమునకును సాధనమగుచున్నది. హిరణ్యకశిపుని దురాగ్రహ మాత్మవినాశనమును ప్రహ్లాదుని సత్యాగ్రహ మాత్మవికాసమును గలుగజేసినవి. సురుచి దురాగ్రహము విప్లవమును ధ్రువునిసత్యాగ్రహము విజయమును సమకూర్చినవి. త్యాగమూర్తులైన బుద్ధదేవునకును ఏసుక్రీస్తునకును దేవత్వము గలిగినది. అజ్ఞానులు తాత్కాలిక ప్రయోజనముల నాసించి పరాపహరణమును జేయుచు నాత్మహత్యను జేసికొనుటయును జ్ఞానులు నిత్యప్రయోజనములను గోరి ఆత్మార్పణమును జేయుచు నాత్మోపలబ్ధిని బడయుటయును అనుభవవేద్యములైన పరమధర్మములు. "త్యాగే నైకే అమృతత్వ మానశుః" అను కైవల్యోపనిషద్వాక్యమునందుగల ధర్మభావము మహాత్ములకు నిత్యానుభవమునందున్నను సామాన్యులకు మాటలయందు మాత్రమే గోచరంబగుచుండును. త్యాగధర్మమును నిత్యవ్యవహారముల కన్వయింపజేయుటవలనను లోకమునందు శాంతిస్థాపనము సాధ్యము గాగలదు. బాలునకును వృద్ధునకును నిత్యకృత్యములందు పరదూషణము పరాపవాదము పరదండనము సహజముగ దోచుచుండును. గాని తనతప్పులు గనిపించుచుండవు. ఆత్మసమర్పణము చేసిన త్యాగులకు తమదోషములు గనిపించుచుండును గాని పరులతప్పులు గనిపించుచుండవు. పరపీడనము పీడితునకును పీడకునకును దుఃఖసాధనమగునే గాని సుఖసాధనము గాదు. ఈ మహాసత్యమును నిత్యవ్యవహారములకు సమన్వయము చేసి ధర్మమార్గమునను భారతస్వారాజ్యమును మానవకల్యాణమును సమకూర్చుట సత్యాగ్రహమునకు ప్రయోజనము. అఖండత్యాగస్వరూప మైన సత్యాగ్రహవ్రతారాధనమునకు అసహాయోద్యమదీక్ష పరమసాధనముగ నున్నది.

**అసహాయోద్యమము**

వర్తమానపరిస్థితులందు స్వరాజ్యసంపాదనమున కసహాయోద్యమము భారతహృదయమున కనురూప మైన సాధనముగ నున్నది. నిరాయుధులైన భారతీయులకు సాయుధపాణులతో సంరంభ మనుచితము. ఉచితమైనను నప్రశస్తము. ముప్పదికోట్లభారతీయు లాయుధపాణులై స్వరాజ్యస్థాపనమును జేయునపుడు ప్రపంచశాంతికి భంగము గలుగుట సహజము. పరపీడనమువలన గలిగినలాభ మాత్మశాంతికి ప్రయోజనకరము గాదు. ఆయుధధారణము గలుగజేసెడి మహావిలయమును గడచిన సంగ్రామము విశదము చేసినది. గెలిచినదేశములందును నోడినదేశములందును నశాంతి రాజ్యము చేయుచున్నది. ప్రజలు పోషణములేక మృత్యుదేవతకు బలియగుచున్నారు. అయిరిషు ప్రజలు స్వరాజ్యనామమున జేయుచున్న సంహారము జ్ఞానోదయమును గలుగజేయగలదు. "హత్యలు నిర్బంధములు దండనములు దహనములు చెలరేగుచున్నవి. వీధులందు జనులు కాల్చి చంపబడుచున్నారు. కుటుంబములు వెడలగొట్టబడుచున్నవి. వృత్తులు పోయినవి. ప్రజలప్రాణరక్షణము దుర్భర మైనది." అని ఐర్లాండు మతగురువులు వ్రాసిరి. ఒకదేశమునం దుత్తరదక్షిణభాగముల కిట్టిపోరాటము సంప్రాప్త మగునపు డాయుధధారణము పరజాతీయులకు గలుగజేసెడి మహోపద్రవము వర్ణనాతీతము. భారతభూమియందు పదునైదేండ్లకు పూర్వ మాయుధసాధనమునను స్వాతంత్ర్యసంపాదనమును జేయుటకు యువజనులు దలపడిన విధమును దానిఫలమును దెలిసియే యున్నవి. పరమేశ్వరానుగ్రహమునను భారతజాతి స్వరాజ్యసంపాదనమునకు స్వధర్మసంస్కారమున కనురూప మైన సాధనము నవలంబించినది. ముప్పదికోట్ల ప్రజలకు స్వరాజ్యసంకల్పము గలుగునపుడు స్వరాజ్యస్థాపన మనివార్య మగును. స్వరాజ్యసంకల్పము స్థిరమగుటకు వర్తమానవిధానముపట్ల గల మహావ్యామోహ మస్తమింపవలయును. వ్యామోహాస్తమయముతో నవీనవిధానోదయమును గలుగును. ప్రజలు వర్తమానవిధానముపట్ల గనబరచుచున దాస్యభావము నంతరింపజేయుటయందును నవీనోత్సాహమును గలుగజేయుటయందును అసహాయోద్యమ ముపచరించిన విధమును గత సంవత్సర వృత్తాంతము విశదము చేయుచున్నది.

**స్వరాజ్యాదర్శము**

నాగపురమునందు గూడిన జాతీయమహాసభ చేసిన "శాంతియుతములగునట్టియు సధర్మములగునట్టియు అన్ని యుపాయములచేత స్వరాజ్య సంపాదనము జాతీయమహాసభాదర్శము" స్వరాజ్యతీర్మానమున కర్థప్రతిపత్తి గత వత్సరమునందు గల్పింపబడినది. కాంగ్రెసునాయకులు

తీర్మానములో సంతృప్తిని జెందకను కార్యవిధానమునకు బూనుకొనిరి. విజయవాడయందు గూడిన యఖిలభారత జాతీయమహాసభోపసంఘము స్వారాజ్యసంపాదనమున కవసర మైన సైన్యమును ద్రవ్యమును శస్త్రములను గడించుటకు నిర్ణయించినది. కోటిరూప్యములు వసూలుచేయబడెను. కాంగ్రెసుసంఘములందు లక్షలమంది సభ్యులుగ జేరిరి. లక్షలకొలది రాట్నములు స్థాపింపబడినవి. స్వదేశారాధనవ్రత మారంభ మైనది. యువజనులు వృద్ధులు స్త్రీలు పురుషులు సత్యమైన స్వదేశసేవకు బూనుకొనిరి. సభామంటపములందా వెడి దేశారాధననాటకము గౌరవహీన మైనది. దేశారాధనజీవనము దుర్భర మైనది. దేశారాధనజీవనమునందు గంభీరోపన్యాసములకు తర్కవాదములకు విద్యాపాండిత్యములకు విలువ పోయినది, రాజ్యాంగాందోళనమునందు ధర్మపథమునకు త్యాగమునకు విలువ యేర్పడినది. త్యాగపురుషుడు గాంధిమహాత్ముని బోధలు దేశారాధనమునకు ప్రమాణము లైనవి. మాసముదినములలో కోటిరూప్యములు సమకూడినవి. రాట్నములు వ్యాపించినవి. దేశమునందంతటను కాంగ్రెసుసంఘములు వ్యాపించినవి. సంఘములందు సభ్యులు చేరిరి. విద్యార్థులు విద్యాలయములను వదలిరి. న్యాయవాదులు వృత్తులను విసర్జించిరి. మహాజనులు బిరుదములను విసర్జించిరి. ప్రచారకు లమితోత్సాహముతో మూలమూలలను స్వరాజ్యప్రచారమును చేయుచుండిరి. బొంబయియందు గూడిన స్థాయిసంఘసమావేశ మసహాయోద్యమ ప్రణాళికనే పునః ప్రతిపాదనమును జేసినది. అసహాయోద్యమము దినదిన ప్రవర్ధమానమై ప్రజాహృదయమునకు గలుగజేసిన మహాశక్తిని శ్రీ యువరాజ సందర్భమునందు జేసిన హరతాళములు విశదము చేసినవి. ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ యువరాజాగమనమును స్వాగతమును నేర్పాటు చేసిన యధికారుల భ్రమను విశదము చేయుటకు కాంగ్రెసు తలపెట్టినది. బొంబాయికి శ్రీ యువరాజు వేంచేసినపుడు హరతాళము జరిగినది. కాని ప్రజానివహములు గలుగజేసిన సంక్షోభము మహాత్మునకు మహాసంతాపమును గలుగజేసినది. మహాత్ముడు పాపపరిహారార్థము మూడుదినము లుపవసించెను. బొంబాయియందు శాంతిని స్థాపించెను. అధికారులకు వారి శక్తి భ్రమ పోయి ప్రజాబలము గాంధిబలము తెలిసినవి.



దేశబంధు చిత్తరంజనదాసు

ప్రయాగయందు హరతాళము నాపుటకు పండిత మోతీలాలు నెహ్రూగారి నధికారులు బంధించిరి. ఈబంధనము ప్రయాగప్రజలయందు మహోద్వేగమును గలుగ జేసినది. ప్రయాగయందు శ్రీ యువరాజాగమనసందర్భమున జరిగిన హరతాళ మద్భుతముగ ప్రజాబలమును విశదము చేసినది. ఒక కూలియైనను బండియైనను గనుపింపలేదు. వీధు లన్నియును నిర్మానుష్యములై యధికారుల కోపమును పెంచినవి. కాశీక్షేత్రమునందును నిట్టి స్వాగతమే గలిగి ప్రజాసంకల్ప మధికారులకు సువ్యక్తమైనది. కలకత్తా నగరమునను నాసన్నమైన హరతాళము నాపుటకును శాంతిని స్థాపించుటకును పండిత మదనమోహన మాలవ్యగారు విశ్వప్రయత్నములను జేసి బొంబయియం దన్నిపక్షములవారిని సమావేశముచేసెను. ఆ సమావేశమునకు సర్ శంకరం నాయ రధ్యక్షతను వహించి చూపిన యవజ్ఞత భారతజాతీయేతిహాసమునందు చిరస్థాయిగ నుండగలదు. ఆ సమావేశమునందు గాంధిమహాత్ముడు చూపిననిగ్రహము శత్రువులకు సయితము విభ్రమము గలుగజేసినది. సర్ శంకరన్ నాయరునరాగ్రహము సర్వసంహారమును జేసినది. బొంబాయియందు నాయకులు గూడునపుడె రాజప్రతినిధిమంత్రి సభ కలకత్తానగరమునందు గూడినది. బొంబయి సభ ముగిసినతరువాతను మహాత్ముడు కాంగ్రెసు ఆశయములను రాజప్రతినిధికి దెలియజేసెను. ఈ సందేశము చేరుటయందు దైవవశమున నాలస్యము గలిగినది. అధికారవర్గ మాగ్రహపూరితమై జాతీయమహాసభాధిపతిగ నెన్నుకొనబడిన దేశబంధు చిత్తరంజనదాసుగారిని బంధించిరి. ఈ బంధనము గొప్పకలవరమును గలుగజేసినది. వేలకొలది యువజనులు శ్రీకృష్ణజన్మస్థానముల నలంకరించిరి. ప్రజాశక్తి యాసేతుహిమాచలపర్యంతమును హద్దుపద్దులు లేక మహాతరంగములవలె వ్యాపించినవి. పట్టణము పట్టణమును మండలము మండలమును రాష్ట్రము రాష్ట్రమును శాసనోల్లంఘనవిధానమునం దతిక్రమించుటకు బూనుకొనినవి. వేలమంది శ్రీకృష్ణజన్మస్థానముల కేగిరి. అసహాయోద్యమప్రతాపము దేశమునకు వ్యక్తమైనది. అహమదాబాదునందు ఖాదీనగరమునందు గూడిన జాతీయమహాసభ జాతీయహృదయమును వ్యక్తముచేసి భావికార్యవిధానమును నిర్ణయించినది.

అధికారు లవలంబించిన నిర్బంధవిధానము ప్రజాహృదయమునం దపారమైన యుత్సాహమును గలుగజేసినది. న్యాయశాస్త్రజ్ఞుడైన శ్రీ రెడింగుప్రభుప్రశాంతిన్యాయసంరక్షణనామమునను నిర్బంధవిధానమును దేశమునం దంతటను నవలంబించినపుడు న్యాయపాలనమునందు నిరాశ గలిగినది. జాతీయమహాసభాధిపతి చిత్తరంజనదాసుగారు బంధితులైనపు డధికారహృదయము ప్రజలకు దెలిసినది. శిక్షాస్మృతి సవరణచట్టమును రాజద్రోహసభాశాసనమును దేశమునం దంతటను వ్యాపకమును బొందుచు ప్రజల సమావేశసంభాషణ స్వత్త్వములు నిర్బంధింపబడుచున్నపుడు ప్రజలయందు మహాసంచలనము గలిగినది. ఆలిసోదరులు రాజద్రోహమునకు శిక్షను బొందిరి. లాలా లాజపతిరాయి రాజద్రోహసభాశాసనము ననుసరించి శిక్షను బొందెను. చిత్తరంజనదాసు మోతిలాలు నెహ్రూ శిక్షాస్మృతిసవరణ శాసనాధారమునను దండనమును బడసిరి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య రాజద్రోహమునకు దండనమును బొందెను. అన్ని రాష్ట్రములందును దేశసేవకులకు దుర్మార్గుల కేర్పడిన శాసనాధారమునను శిక్షలు గలిగినవి. చెఱసాలలు స్వర్గములైనవి. వేనవేలు దేశారాధకులు పరమోత్సాహముతో కారాగృహవాసమును స్వీకరించిరి. ప్రజలయుత్సాహముతో నధికారుల నిర్బంధములును విజృంభించినవి. రాజ్యాంగసంరంభమునం దపరిచితములైన 144, 108, 107 శాసనములు ప్రయోగమును బొందినవి. అహమదాబాదునందు జాతీయమహాసభయె ప్రతిషేధింపబడునను భావము వ్యాపించినది. ఇట్టి విపరీతపరిస్థితులందు గాంధిమహాత్ముని మూలస్థానమైన అహమదాబాదునందు జాతీయమహాసభ గూడినది.

ప్రపంచప్రవృత్తియం దనవరతము నూతనపరిస్థితులు గోచరంబగుచుండును. ఎప్పటికప్పుడు విచిత్రమైన స్థితిగతులు గోచరంబగుచుండును. ఒకస్థితిని మించిన మఱొకస్థితి గనుపట్టును. ఈయాశాపాశమె ప్రపంచప్రవృత్తియం దుద్ధరణమునకు సాధనం బగుచున్నది. ఆపత్సముద్రమునందు మునిగియున్న వానికైనను ఆశాంకురములు గనుపించుచు నూతనపరిస్థితులు గోచరం బగుచుండును. మోంటుఫర్డు సంస్కరణములు పంజాబు దురంతములు ఖిలాఫతు దుర్నయములు గలుగజేసిన దుఃఖాను

భవమునందే యాశాంకురములు గోచరములైనవి. అమృతసరము జాతీయమహాసభ యపూర్వముగ బరిణమించినది. కలకత్తాయందు గూడిన ప్రత్యేకమహాసభ భారతజాతీయస్థిరసంకల్పమును విశదము చేసినది. నాగపురమునందు గూడిన మహాసభ ప్రజాభీష్టములను సువ్యక్తము చేసినది. ఈమహాసభలు ప్రతినిధుల సంఖ్యయందును నుత్సాహప్రదర్శనమునందును స్థిరసంకల్పమునందును నొకదాని నొకటి యతిక్రమించినవి. నాగపురముమహాసభ నిర్ణయించిన యంగనిర్మాణమున కనురూపముగ ముప్పదియారవ భారతజాతీయమహాసభ డిశంబరు మాసాంతమునందు శబర్మతీతీరమున గూడినది.

ప్రపంచ ప్రవృత్తియందు మానవ ప్రకృతి సంస్కారానురూపముగఁ బరిణమించుచుండును. జాతీయ మహాసభయందు అసహాయోద్యమ విధా శాసనోల్లంఘనము నమునందలి యంతరము లన్నియును వెంటనే యాచరణ యోగ్యము లని నమ్మెడివా రుండుట సహజము. ఆ పక్షము వారిదృష్టి విజయవాడ సమావేశ సమయము నుండియును శాసనోల్లంఘన సాధనమునందు లగ్నమై యుండెను. ఏప్రిలు మాసమునందు విజయవాడయందువలె జూలయిమాసమునందు బొంబయి సమావేశమునందును శాసనోల్లంఘన విషయము వాదప్రతివాదములకు గారణంబైనది. బొంబయి స్థాయిసంఘమునందు విదేశవస్త్ర బహిష్కారము యువరాజ హరతాళము సంపూర్ణామోదమును బడసినవి. దేశమునం దంతటను విదేశవస్త్ర కామదహనము జరిగినది. బొంబయియందు గూడిన స్థాయిసంఘ సమావేశమునందు శాసనోల్లంఘన విషయము నిరాకృతమైనను ఢిల్లీయందు నాల్గవ నవంబరునగూడిన సమావేశమునందు శాసనోల్లంఘనము నాచరించుటకు పరిస్థితు లనుకూలముగ నున్న రాష్ట్రములందుమాత్రమే వ్యష్టి శాసనోల్లంఘనమును సమష్టిశాసనోల్లంఘనమును జేయుటకు రాష్ట్రీయోపసంఘముల కధికార మొసంగబడినది. ఆ యధికారము ననుసరించి గుజరాతు రాష్ట్రమునందలి ఆనంద బార్డోలి తాలూకాలందు శాసనోల్లంఘన ప్రస్థానమును నవంబరు 23 తేదిని మహాత్ముడు స్వయముగ నడుపుటకు నిర్ణయించెను. నవంబరు 17-వ తేదిని బొంబయియందు సంప్రాప్తమైన దురంతములు మహాత్ముని సంకల్పమును మార్చినవి. నవంబరు 17-వ తేది అసహాయోద్యమ చరిత్రమునందు చిరస్మరణీయముగ నుండగలదు. దిగంత వ్యాప్తములైన హరతాళములు ప్రజాశక్తిని దెలిపినటులు ప్రజల దౌర్జన్యస్వభావమును విశదముచేసినవి. మానవప్రకృతియందు గల పశుభావమునకును దైవభావమునకును గల సంబంధము బోధపడినది. అసహాయోద్యమమునకు బీజమైన యహింసాధర్మము ప్రజాహృదయమునకు ప్రత్యక్షము గాలేదని గాంధిమహాత్మునకు దెలిసినది. ప్రజాకల్యాణమున కవసరమైన స్వరాజ్యము ప్రజాసంక్షోభమునకు సాధనమగు విధమును బొంబాయి దురంతములందు మహాత్ముడు సందర్శించెను. అసహాయోద్యమనాయకులకు దురంతముల నాపుటకు శక్తి లేనపు డసహాయోద్యమ విజయమునకు ప్రజలకు శిక్షణ మవసరమని మహాత్ముడు గ్రహించెను. బొంబయి దురంతములకు ప్రాయశ్చిత్తమున కుపవాసములను జేసెను. మహాత్ముని యుపవాసములు ప్రజల కాత్మస్మరణమును గలుగజేసినవి. సకల జనసౌఖ్యము స్వరాజ్యమునకు ఫలమని ప్రజలు గ్రహించిరి. స్వల్పసంఖ్యాకులైన పార్సీ క్రైస్తవాది భారతీయుల యోగక్షేమముల కథ్యంతరము గల స్వరాజ్యస్థితి భారతమాతకు దుఃఖకారణము గాని సుఖకారణము గాదని మహాత్ముడు గనుగొని భారతీయులకు వారి కర్తవ్యమును నిర్భయముగ బోధించెను. బార్డోలీయందు శాసనోల్లంఘనప్రస్థానమును విరమించెను. తదనంతరమున గూడిన జాతీయమహాసభ మహాత్ముని నిర్ణయములను సమర్థించిన విధమును అహమదాబాదుసభ విశదము చేయుచున్నది.

అహమదాబాదుసభ స్వరాజ్యప్రస్థానమునందు సకలవిధములను గణనీయముగ నున్నది. మహాసభాభిషిక్తుడైన దేశబంధు చిత్తరంజనదాసు బంధనమునం దుండెను. దేశసేవకులు బంధనముల ననుభవించుచుండిరి. గాంధిమహాత్ముడు శాసనోల్లంఘనప్రస్థానమును విరమించెను. అధికారుల నిర్బంధాస్త్రములు దిగంతములందు వ్యాపించుచుండెను. అయినను ప్రజోత్సాహము తరంగతరంగములుగ పొంగి ప్రవహించినవిధమును అహమదాబాదు కాంగ్రెసు విశదముచేసినది. అహమదాబాదు మహాసభయందు గాంధియవతారము ప్రత్యక్షమైనది. మహాత్ముని భావములు ఖాదినగరమునందును ఖాదిమంటపమునందును సభావ్యవహారములందును రూపరేఖావిలాసములను దాల్చినవి. జాతీయమహాసభయందును నిర్ణయములందును వ్యవస్థలందును భారతస్వరూపము ప్రత్యక్షమైనది. ఖాదీమంటపము ఖాదీదుస్తులు ఖాదీయాసన

ములు ఖాదీసేవకులు స్వదేశవిలాసములు స్వదేశవిహారములు స్వదేశవస్తుప్రదర్శనశాలలు భారతజాతీయసంస్మరణమును జేసినవి. ఆయపూర్వ సందర్శనము స్వరాజ్యానందానుభవమును గలుగజేసినది. వేనవేలు ప్రజలు జాతీయతీర్థయాత్రను జేసి గాంధిమహాత్ముని సందర్శించి కృతార్థులగుటకు అహమదాబాదునకు బోయియుండిరి. మహాత్ముని సందర్శనార్థము లక్షలమంది ప్రజలు అహమదాబాదునందు సమావేశమైన విధము గాంధిమహాత్ముని విజయమును జాటుచున్నది. రెండేండ్లలో దేశమునంతను గాంధిమయము చేయగలిగిన పురుషుని మహాత్వమును అహమదాబాదుసభ విశదము చేసినది. అహమదాబాదుమహాసభకు హకీము అజ్మలుఖానుగా రధిపతిగ నుండి జయప్రదముగ నడిపినను అహమదాబాదు సభ మహాత్ముని విజయమును ప్రకటించుచున్నది. గాంధి విజయమే అసహాయోద్యమవిజయము. శ్రీయువరాజాగమనసందర్భమునందు గలిగిన హరతాళ స్వాగతములు గాంధి మహాత్ముని సంచారములందు గలిగిన విజయస్వాగతములు ప్రజాధికారులకు వారి బలాబలములు తెలిసినవి. అహమదాబాదు కాంగ్రెసునకు స్వరాజ్యకాంగ్రెసు నామ మన్వర్థముగ గలిగినది. స్వరాజ్యాధ్వర్యమునకు గాంధి మహాత్ము డధ్వర్యుడుగ నియమింపబడెను. స్వరాజ్యవిజయమును స్వరాజ్యగీతములందును భజనలందును సమ్మేళనములందును నృత్యములందును గానములందును కన్నులు గలవారు చూచిరి చెవులుగలవారు వినిరి జ్ఞానముగలవా రనుభవించిరి. గాంధి విజయమును మహాసభయం దామోదితమైన యీ క్రిందితీర్మానము విశదము చేయుచున్నది.

## అహమదాబాదు కాంగ్రెసు తీర్మానము

1920 వ సంవత్సరము డిసెంబరు నెలలో దేశీయ మహాజనసభ జరిగిన దాదిగా దౌర్జన్యరహితమగు నసహాయోద్యమము నవలంబించుట వలన నిర్భయత్వమును స్వార్థత్యాగమును, ఆత్మగౌరవ సంరక్షణమును దేశీయులం దధికమగు నభివృద్ధి కలిగినదని అనుభవమువలన విదితమైనది. ఈయుద్యమమువలన ప్రభుత్వప్రతిష్ఠకు చాల భంగము వాటిల్లినది. మొత్తముమీద దేశ మంతయు స్వరాజ్యమును చేరుట కతిశీఘ్రముగ పురోగమన మొనర్చుచున్నది. గాన కలకత్తాలో జరిగిన అవసర దేశీయమహాసభయం దామోదింపబడినట్టియు నాగపూరులో మరల స్థిరపరుపబడినట్టియు తీర్మానము నీసభవారు స్థిరపరచుచున్నారు. పంజాబుఖిలాఫతు అక్రమములు తొలగునవరకును స్వరాజ్యము స్థాపింపబడువరకును బాధ్యతలేని యుద్యోగవర్గము అధీనమునందున్న యిండియా ప్రభుత్వము ప్రజలవశ మగువరకును ఆయారాష్ట్రములు నిర్ధారణచేయు



రీతిని దౌర్జన్యరహితమగు నసహాయోద్యమమును కొనసాగించుటకు దేశీయమహాసభవారు గట్టి నిశ్చయముతో నున్నారని యీసభవారు గ్రంథస్థ మొనరించుచున్నారు. ఇటీవల రాజప్రతినిధి యొసంగిన యుపన్యాసములందు స్పష్టమైన బెదరింపులవలనను తదనుగుణ్యముగ నన్ని రాష్ట్రములలోను వలంటీరు సంఘములు అక్రమసంఘములని యిండియా ప్రభుత్వమువారు ప్రకటించుట అక్రమముగను దౌర్జన్యముగను బహిరంగసభలనే గాక సంఘసభలను గూడ బలవంతముగ నుద్యోగులు నిలిపివేయుచుండుట అనేక రాష్ట్రములలో కాంగ్రెసు నాయకులను పెక్కుమందిని అరెస్టు చేయుటవలనను కాంగ్రెసు ఖిలాఫతు ప్రచారమును పూర్తిగా నడచివేసి దేశీయుల కాసంఘములవలన కలుగుచున్న సహాయము లభింపకుండ చేయుటకే ప్రభుత్వమువా రీనిర్బంధవిధానమును ప్రారంభించిరని స్పష్టమగుచుండుట వలనను అన్నివిధములను కాంగ్రెసుప్రచారములను తాత్కాలికముగ నిలిపివేసి ఎట్టి ఆర్భాటమును లేకుండ శాంతముగా వలంటీరు సంఘములందు చేరుటవలన అరెస్టు చేయబడుటకు సమ్మతింపవలసినదని యీమహాసభవారు తీర్మానించుచున్నారు. ఈసంవత్సరము నవంబరు నెల 23-వ బొంబయినగరమున జరిగిన కాంగ్రెసు కార్యసంఘసభయం దామోదింపబడిన తీర్మానము ననుసరించి దేశమునం దంతటను వలంటీరు సంఘము లేర్పరుపబడెను. ఆ వలంటీరు సంఘములందు చేరగోరువా రందరును ప్రమాణము చేసినగాని చేర్చుకొనబడరు.

## ప్రమాణము

"నేను దైవసాక్షిగా ప్రమాణపూర్వకముగా నంగీకరించిన విషయములు: 1. నేను జాతీయవలంటీరు సంఘమున సభ్యుడనుగా నుండగోరుచున్నాను. 2. భరతఖండమునందలి పరిస్థితులను బట్టి యీదేశమున ఖిలాఫతు పంజాబు అక్రమముల నివారించుటకును స్వరాజ్యప్రాప్తికి సాధనమగుటకును ఈదేశమునందు నివసించుచున్న హిందూ, మహమ్మదీయ, సిక్కు, పార్సీ, క్రైస్తవ, యూదు ప్రముఖ వివిధమతముల వారందరైకమత్యమును కలిగి ఏకభారతజాతిగా నేర్పడుటకును దౌర్జన్యరాహిత్యమొక్కటే మార్గమై తోడ్పడునని నేను నమ్ముచుండుటచే నేను వలంటీరుదళమున సభ్యుడనుగా నున్నంతకాలము మాటయందును క్రియయందును దౌర్జన్యము లేకుండ నుండగలవాడను. భావమునందు గూడ దౌర్జన్యము లేకుండనుండుటకు గట్టి ప్రయత్నము చేయగలవాడను. 3. భరతఖండము ఆర్థిక రాజకీయ నైతిక విషయములందు సాఫల్యమును బడయుటకు స్వదేశీవ్రతము ప్రధానమని నేను నమ్మెదను. కేవలము వడకునూలుతో చేతిమగ్గములపై నేయబడిన ఖద్దరుబట్టలనే ధరించెదను. మరియేరకము బట్టలను ధరింపను. 4- నేను హిందూ మతస్థుడ నగుటచే సంఘమునం దొకతెగవారు అంటరానివారని వారిని బహిష్కరించుట అక్రమమని నేనెరుగుదును గాన, అస్పృశ్యతను తొలగించుట న్యాయమును అవసరము నని నేను నమ్ముచుండుట వలనను వీలైనపుడెల్ల నిమ్నజాతులతో కలసిమెలసి యుందును. వారికి సర్వవిధముల సేవచేయుదును. 5-వ వలంటీరు దళాధికారుల ఆజ్ఞలను నేను నెరవేర్చెదను. ఈప్రమాణమునకు విరుద్ధము కానట్టియు వలంటీరు బోర్డులు, కార్యసంఘము, లేక కాంగ్రెసువారిచే నేర్పరుపబడిన మరేదే సంఘ

ములుగాని చేసినట్టి నిబంధనలను నేను నెరవేర్చెదను. 6. నా మతము కొరకును, నా దేశముకొరకును ఎట్టి ఆగ్రహమును చూపకుండ కారాగృహవాసము, ప్రహారణములు, కడకు మరణము లెటస్థించినను గూడ నే ననుభవించుటకు సంసిద్ధుడను. 7. నన్ను చెఱసాలకు పంపుచో నా కుటుంబమునకు గాని నావలన పోషింపబడువారికి గాని కాంగ్రెసు వలన నెట్టి సంరక్షణను ధనసహాయమును నేను కోరను." అను నవి ప్రమాణనిబంధనలు.

జాతీయ వలంటీరుదళములందు చేరగూడ దని ప్రభుత్వము వా రాజ్ఞాపించియున్నను పై ప్రమాణ మొనరించి 18 ఏండ్లవయసుకు పైబడిన వారందరును తక్షణము వలంటీరు సంఘములందు చేరుదు రని యీ కాంగ్రెసు సంఘమువారు విశ్వసించుచున్నారు.

బహిరంగసభలు జరుగగూడదని ప్రభుత్వమువారు ప్రకటించిరి సంఘసభలుగూడ బహిరంగసభలే అని వానినిగూడ నిలిపివేసిరి. కాన దేశీయులు సంఘసభలను జరుపవలెను. బహిరంగసభలను చుట్టును ఆవరణగలచోట గోడలమధ్య జరుపవలెను ముందుగా సభనుగూర్చి ప్రకటింపవలెను టిక్కట్లను ఏర్పరచి వానిని చూపించువారిని మాత్రమే లోపలికి రానీయవలెను. ప్రకటనలలో తెలుపబడిన యుపన్యాసకులు మాత్రమె సభలలో నుపన్యసించునట్లు సాధ్యమగునంతవరకు చూడవలెను. ఉపన్యాసకు లుపన్యాసములు వ్రాసుకొనివచ్చి వానిని చదువవలెను. ఆసభలవలన ప్రజలలో కొందరి కాగ్రహము కలుగుట వారు దౌర్జన్యము చేయుట మున్నగునవి జరుగకుండ చూడవలెను.

వ్యక్తులుగాని, వర్గములుగాని అధికారమును నిరంకుశముగను దారుణముగను దేశమును కృశింపజేయుటయందును వినియోగించి నప్పుడటుల వారు అధికారమును దుర్వినియోగము చేయకుండ నివారించుటకు ప్రజ లొనరించిన యితర ప్రయత్నములన్నియును నిష్ఫలములగు నేని ఆయుధముల ధరించి విప్లవ మొనరించుటకు బదులు సివిలు ఆజ్ఞోల్లంఘన మొక్కటియే నాగరకతాసూచకమును సమర్థమునగు సాధనము నని యీ కాంగ్రెసుసభవా రభిప్రాయపడుచు, శాంతవిధానమునందు విశ్వసించునట్టియు ప్రస్తుతము భారతీయులకు కొంచెమైన నుత్తరవాదిగా కుండ నిరంకుశముగ పరిపాలించుచున్న యీ ప్రభుత్వమును తొలగించుటకు ఏదోయొకవిధమగు నుత్సాహమును చూపుటకంటె నితరనివారణోపాయములేదని కృతనిశ్చయులై నట్టియు కాంగ్రెసు సేవకులందరును వ్యక్తిఆజ్ఞోల్లంఘనమును సంఘ ఆజ్ఞోల్లంఘనమును ప్రారంభింపవలె నని యీసభవారు సూచించుచున్నారు. సంఘఆజ్ఞోల్లంఘనమును ప్రారంభించుటకు ఢిల్లీలో జరిగిన స్థాయిసంఘసభయందు చేయబడిన తీర్మానములోని షరతుల ప్రకారము ఆయా ప్రాంతవాసులు దౌర్జన్యరాహిత్యాది నియమములను బాగుగా నభ్యసించినట్లు ధ్రువపడవలెను.

వ్యక్తి లేక సంఘ ఆజ్ఞోల్లంఘనము దేశమందంతటను నికేచ్ఛను గాని ప్రభుత్వమువారి అక్రమ ఆజ్ఞలనుండి తమ్ము కాపాడుకొనుటకు గాని దౌర్జన్యాదులు జరుగకుండ తగిన కాపుదలల క్రింద కార్యసంఘమువారును రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములును ఎప్పటి కప్పుడు ప్రకటించు ఆజ్ఞల ననుసరించి దేశీయులందరు నమలులో పెట్టుటయందే అధికకృషిని సలుపుటకు ఎప్పుడైనను ఎచట నైనను అవసరమైనంతవరకు యితర కాంగ్రెసు ప్రచారము నంతయు నిలిపివేయవలె నని యీసభవా రభిప్రాయపడుచున్నారు.

18 ఏండ్లకు పైబడిన విద్యార్థు లందరును ముఖ్యముగా జాతీయ విద్యాలయములందు చదువుచున్నవా రందరును ఆవిద్యాలయములలోని యుపాధ్యాయులును తక్షణమే ప్రమాణ మొనరించి వలంటీరు సంఘము లందు చేరవలెనని యీసభవారు సూచించుచున్నారు.

కాంగ్రెసు సేవకులను పెక్కుమందిని త్వరలో ప్రభుత్వము వారు పట్టుకొనుట జరుగగలదుగాన కాంగ్రెసుస్థాయికార్యసంఘాదుల నెప్పటియట్లు వీలయినపు డెల్ల మామూలుపనులకు వినియోగించుకొను పద్ధతిని తిరిగి తెలుపబడువరకును గాంధిమహాత్మ నొక్కనినే కాంగ్రెసు కార్యనిర్వాహకాధికారినిగా యీ సభవారు నియమించి ఆయనకు స్థాయిసంఘ సర్వాధికారము నిచ్చుచున్నారు. కాంగ్రెసు అవసర మహాసభను జరుపుట స్థాయిసంఘ, కార్యసంఘ అవసర సభలను జరుపుట కత్యవసరము కలిగినపుడు మహాత్ముడు తనస్థానమున పనిచేయుట కింకొకరిని నియమించుట అనునధికారములు గూడ మహాత్మున కీయబడెను. మహాత్మునకీయబడిన అధికారము లన్నియు ఆయనస్థానే ఒకరి తరువాత నొకరుగ నియమింపబడు వారికందరికిని యుండగలవు గాని ఇండియా కోరతనముతోను బ్రిటనుకోరతనముతోను ఒడంబడిక చేసికొనుటయు కాంగ్రెసు సంప్రదాయమును మార్చుటయు మహాత్మునకుగాని వారితరువాతివారుగాని స్వతంత్రించి చేయగూడదు. స్థాయిసంఘము వారును పిమ్మట మహాసభవారును ఆమోదింపకుండ నవి జరుగగూడదు.

దేశముకొరకును అంతరాత్మకొరకును కారాగృహములందు శిక్షల ననుభవించుచున్న దేశభక్తుల నందరిని యీసభవా రభినందించుచున్నారు. వారిత్యాగమే స్వరాజ్యసిద్ధిని మరింత చేరువకు తెచ్చినది.

స్వరాజ్యమహాసభ జయప్రదముగ ముగిసినది. యాత్రికులు స్వరాజ్యయాత్రను మహాత్ముని సందర్శనమును జేసి పావనులై స్వరాజ్యసందేశమును స్వస్థలములకు గొనిపోయిరి. అన్నిరాష్ట్రములందును స్వరాజ్య ప్రస్థానమును జేయుటకు స్వరాజ్యభటులు యత్నములను జేయుచుండిరి.

గాంధి మహాత్మునకును వారి యనుచరులును బార్డోలీయందు సమష్టి శాసనోల్లంఘన ప్రస్థానమును జేయుట కేర్పాటులను చేయుచుండిరి. విధివశమునను చౌరీచౌరా దురంతములు సంప్రాప్తములైనవి. మహాత్మునకు బొంబయి దురంతములవలె చౌరిచౌరా దురంతములును దుఃఖవేదనను గలుగజేసి ధర్మోపదేశమును జేసినవి. మానవ ప్రవృత్తి నావహించిన పశుభావము మహాత్మునకు గోచరమైనది. మహాత్ముడు దురభిమాన

మును వదలి చౌరీచౌరా దురంతములను స్వయంకృతాప రాధములనుగ నంగీకరించి ప్రాయశ్చిత్తమును జేకొనెను. బార్డోలీయందవలంబింపనున్న సమష్టి శాసనోల్లంఘన మును విరమించెను. అంతకు పూర్వమే రీడింగు ప్రభు వున కంపిన ప్రతిజ్ఞకు స్వార్థపరు లపార్థమును గల్పించిరి. మహాత్ముడు పరుల నిందాస్తోత్రములను లక్ష్యము చేయ కయే దేశక్షేమమునకు మూలమైన ధర్మలక్ష్యమును ననుష్ఠించెను. బార్డోలియందు కార్యనిర్వాహక సంఘ మును సమావేశము చేసెను. కార్యనిర్వాహక సంఘ మిపుడు వాదప్రతివాదములకు మూలమైన బార్డోలి నిర్మాణ విధానమును నిర్ణయించినది. ఆనిర్ణయములనే ఢిల్లీయందు ఫిబ్రవరి మాసారంభమున గూడిన స్థాయి సంఘము కొన్ని సవరణలతో నంగీకరించినది.

బార్డోలీలో ఫిబ్రవరి నెల 11-12 తేదీలను జరిగిన అఖిలభారత కాంగ్రెసుకార్యసంఘసభలో నామోదించబడిన తీర్మానములను స్థాయి సంఘము వారు శ్రద్ధతో గమనించి వానియందు కొన్ని సవరణలను చేసి స్థిరపరచిరి. ఆయా రాష్ట్రములయందలి రాష్ట్రీయ కాంగ్రెసు సం ఘముల ప్రేరేపణవలనను వారి అనుమతిని బడసియు కొన్ని ప్రత్యేక చట్టములను గూర్చియు వ్యక్తులు ఆత్మస్వాతంత్ర్య రక్షణమునకైనను లేక ఆగ్రహమును కలిగించుటకైనను ఆజ్ఞోల్లంఘనమునకు గడంగవచ్చు ను గాని కాంగ్రెసు మహాసభవారును, స్థాయిసంఘము వారును కార్య సంఘమువారును నిర్ణయించిన నియమములు పూర్తిగా నెరవేరినగాని రాష్ట్రీయసంఘమువా రట్టివ్యక్తి ఆజ్ఞోల్లంఘనమునకైనను అనుమ తింపగూడదు. 2. కల్లు సారాదుకాణముల యొద్ద బోధించుట ఎంత ముఖ్యమో విదేశీబట్టల దుకాణములయొద్ద బోధించుటగూడ నంతముఖ్యమే. గాన దానిని మానగూడదని పలుచోట్లనుండి లేఖలు వచ్చినవిగాన మోస మేమియు లేకుండ హెచ్చరికముగ విదేశీబట్టల దుకాణములకడ్డ గూడ కల్లు సారాదుకాణములవద్ద వలెనే బోధింపవచ్చును గాని కల్లు సారా దుకాణములవద్ద బోధించువారికి బార్డోలీ తీర్మానములందు నిర్ణయింప బడిన నియమములు బట్టల దుకాణములవద్ద బోధించువారుగూడ ననుస రింపవలెను. 3 బార్డోలీ తీర్మానముల యుద్దేశము కాంగ్రెసువారు మొ దట నిర్ణయించిన అసహకారోద్యమవిధానమును పూర్తిగా వదలవలెనని గాని సమష్టి ఆజ్ఞోల్లంఘనము నెప్పటికిని తలపెట్టగూడదని గాని దేశీ యులు తలంపగూడదు. బార్డోలీలో కార్యసంఘమువారు నిర్ణయించిన నిర్మాణవిధానమును కాంగ్రెసు ప్రచారకు లందరును ఏకాగ్రతతో ననుసరింపగడంగిన సంకల్పసిద్ధి కత్యవసరమగు సమష్టిదార్ఢ్య రాహిత్యము దేశమున స్థిరముగా నెలకొనగలదనియే కార్యసంఘమువారి భావ మనియు దేశీయులు తెలిసికొనదగును. 4 దేశీయులు స్పష్టముగ వెల్ల డించిన దృఢసంకల్పమును ప్రభుత్వము తిరస్కరించినపుడెల్ల ప్రజలు ఆజ్ఞోల్లంఘనము ననుసరించుట వారి ముఖ్యకర్తవ్యము. అది వారికి జన్మ స్వాతంత్ర్యము (వ్యక్తి లేక సమష్టి ఆజ్ఞోల్లంఘనమనగా ఒక్కడు గాని నిర్ణయింపబడిన సంఖ్యగల కొందరు గాని ప్రారంభించు ఆజ్ఞోల్లంఘ నము అని గ్రహింపదగును. ఒకసభను జరుపదలచి ఆసభకు రాదగిన వారికి టిక్కెట్లను పంపి ఆటిక్కెట్లు చూపించనివారిని లోపలికి రానీయ కుండ చేసినపుడు ఉద్యోగులాసభను నిలిపివేయ బూనినచో చేయబడు నాజ్ఞోల్లంఘనము వ్యష్టిఆజ్ఞోల్లంఘన మగును. అటుగాక ఎల్లవారును రావచ్చునని ప్రకటింపబడిన సభను ఉద్యోగు లాపబూనినపుడు చేయ బడు ఆజ్ఞోల్లంఘనము సమష్టిఆజ్ఞోల్లంఘనమగును. సభోద్దేశము మామూలు కార్యముల నిమిత్తమే యైనపుడుగూడ నట్టిసభ నుద్యోగులు సాగనీయ నిచో జరుగుఆజ్ఞోల్లంఘనము స్వాతంత్ర్యరక్షకమగును. అందువలన నుల్లం ఘించినవారు అరెస్టుచేయబడినను అది స్వాతంత్ర్యరక్షకమే అగును. మామూలు కార్యములనిమిత్తము గాక కేవలము అరెస్టును కారాగృహ వాసమును కోరి చేయుసభ నుద్యోగులు సాగనీయనపుడు జరుపు ఆజ్ఞో ల్లంఘనము ఆగ్రహాకారక మగు ఆజ్ఞోల్లంఘన మగును).

## తీర్మానము

(1) చౌరీచౌరాలో గుంపు అడవిమృగములవలె రాక్షసకృత్య ము లొనరించి కనిస్టేబులందరిని దారుణముగ సంహరించినందులకును ఇండ్లను తగులబెట్టినందులకును ఈ సంఘమువారు చాల చింతిలుచు వారి కుటుంబములకు సానుభూతిని తెలుపుచున్నారు. (2) పన్నుల నిరాకరణముతో గూడిన ఆజ్ఞోల్లంఘనమును ప్రారంభింప సర్వమును సిద్ధమగు తరుణముననే ప్రతిసారియును ప్రబలదురాగతము బయలుదేరు చున్నది. దేశమున సమష్టి ఆజ్ఞోల్లంఘనమున కుండవలసిన శాంతస్థితి ఏర్పడలేదని యీదురాగతములు వెల్లడించుచున్నవి. ఇపుడు మరల బార్డోలీలో నాజ్ఞోల్లంఘనమును ప్రారంభింపబోవ చౌరీచౌరాలో ప్రబలదురంతరములు జరిగెను. కాన బార్డోలీలోను ఇతరచోట్లను ఆజ్ఞోల్లంఘనమును ప్రస్తుతము నిలిపివేయవలెను. కాన వ్యవసాయదారు లందరును దొరతనమునకు చెల్లింపవలసిన శిస్తులన్నిటిని చెల్లింపవలెను. వారు అపరాధస్వభావము గల సమావేశముల నన్నిటిని కట్టిపెట్టవలెను. (3) మాలెగాంలో జరిగినట్టి దారుణకృత్యములను 17-11-21 ని బొంబాయిలోను 13-1-22 న చెన్నపురిలో జరిగినట్టి తుంటరి కార్యము లును మరల నెన్నటికి నెచటను జరుగకుండుటకై శాంతస్థితి దేశమునందు నెలకొనువరకును సమష్టి ఆజ్ఞోల్లంఘనము నెచటను ప్రారంభింపగూడదు. (4) దేశమున శాంతి నెలకొల్పుటకు గాను మరల ననుమతి యియ్య బడువరకును ప్రజలు అరెస్టులను కారాగృహనివాసములను కోరి అందు కొరకు ఎట్టి ప్రయత్నములను చేయకుండునట్లు కాంగ్రెసు సంఘములు పరిశీలింపవలెను. ఎచ్చట సంపూర్ణశాంతి యుండుననుటకు గట్టి నమ్మకము కలదో అచట వారటాలు మున్నగు మామూలు కాంగ్రెసు ప్రచారము జరుగవచ్చును. కల్లుదుకాణములవద్ద శాంతముగ త్రాగుడువలన కలుగు అనర్థకములను గూర్చి బోధించుట తప్ప తక్కిన నిరోధకప్రయత్నముల నన్నిటిని కట్టిపెట్టవలెను. ఇట్లు బోధించుటకు మంచియోగ్యత కల వారిని మాత్రమే కాంగ్రెసు సంఘమువారు ప్రత్యేకముగ నియమించి వారిచర్యలను శ్రద్ధతో పరిశీలింపవలెను. (5) రాజద్రోహసభా, వలం టీరు సంఘనిషేధక శాసనములను ధిక్కరించుటచే ప్రయోజనముగ

పెట్టుకొని సభలను నూరేగింపులను జరుపగూడదు. కాంగ్రెసు సంఘముల సభలను మామూలు కాంగ్రెసు ప్రచారమునకు సంబంధించిన సభలను సాగించుటకు కట్టి ఆక్షేపణయును లేదు. (6) రైతులు జమీందారులకియ్యవలసిన శిస్తులను గూడ నివ్వుటలేదని యాసంఘమునకు తెలిసినది. ఇది పోనిక-ము తీర్మానమునకు విరుద్ధము గాన వారు వెంటనే జమీందారులకు శిస్తులను చెల్లింపవలెనని కాంగ్రెసు సంఘములును ప్రచారకులును రైతులకు స్పష్టముగా తెలియజేయవలెను. (7) జమీందారులకు న్యాయశాస్త్రీయ గుణ్యముగా గలహక్కులను భంగపరుచుట కీయుద్యమము ప్రారంభింపబడలేదు. రైతులకును జమీందారులకును వివాదములు కలిగినపుడుగూడ రైతులును జమీందారులు నొండొరులతో నాలోచించియు మధ్యవర్తులద్వారాను పరిష్కరించుకొనదగు నని యీసంఘమువారు జమీందారులకు సూచించుచున్నారు. (8) వలంటీరులను చేర్చుకొనుటలో నిబంధనలను సరిగ పాటించుటయందధికముగ నుపేక్ష జరుగుచున్నదనియు వడుకునూలు ఖద్దరుబట్టలను వలంటీరు లందరును ధరించుట లేదనియు అస్పృశ్యతావిషయమున వలంటీరు లగు హిందువులు నిబంధనలను పూర్తిగా ననుసరించుట లేదనియు వలంటీరులుగా చేరగోరువారు మనోవాక్కాయకర్మలందు దౌర్జన్యమును పూర్తిగా నిరసించుటను గూర్చి గట్టిపరీక్ష జరుగుటలేదనియు తెలియుచున్నది. కాన కాంగ్రెస్ సంఘములు వలంటీరుల పట్టికలను మరల పరీక్షించి ప్రమాణములను పూర్తిగా నెరవేర్పని వారినందరిని తొలగింపవలె నని యీ సంఘమువారు స్పష్టపరుచుచున్నారు. (9) కాంగ్రెసు వారి యేర్పాటును ఎప్పటికప్పుడు కార్యసంఘమువారు ప్రకటించు నియమములను కాంగ్రెసు సంఘములు నెరవేర్పనిచో కాంగ్రెసు సంకల్పము శీఘ్రముగ గాని అసలే గాని నెఱవేరదు. (10) ఈపైతీర్మానములు యీకద్వారత కాంగ్రెసు స్థాయిసంఘసభ జరుగువరకును అటుపిమ్మట నాసభవారిచే నామోదింపబడు పద్ధతిని అమలులో నుండును. ఆసభను కార్యదర్శి హకీం అజ్మలుఖాను గారితో నాలోచించి సాధ్యమైనంత త్వరలో జరుపగలరు. ఆజ్ఞోల్లంఘనమునకు దౌర్జన్యరాహిత్యము ప్రప్రధానమగు ముఖ్యాంశమని ప్రజలు బాగుగా గ్రహింపలేదని ఘోరకుప్రారు దురాగతములవలన స్పష్టమగుచున్నది. కాంగ్రెసు ఉత్తరువులను తిరస్కరించి నియమములను కఠినముగ ననుసరింపక అనర్హుల నయోగ్యుల వలంటీరులుగా చేర్చుటవలన సత్యాగ్రహ ప్రధానధర్మమును దేశములు సరిగా గ్రహింప లేదని తెల్లమగుచున్నది. ఈ రీతిగా కాంగ్రెసు నియమములను అసంపూర్తిగాను అల్పముగను నెఱవేర్చుటవలననే స్వరాజ్యసిద్ధి ఆలస్యమగుచున్నది. కాన కాంగ్రెసు ఈపసంఘములను పక్కచేయుటకు యీ దిగువకార్యములను కాంగ్రెసు సంఘములవారు నెఱవేర్పవలెను. i ఒక కోటిమందిని కాంగ్రెసు సభ్యులనుగా చేర్చుట (1) కాంగ్రెసు సాంప్రదాయమునందు శాంతిసత్యములు (దౌర్జన్యరాహిత్యము ఔచిత్యము) ముఖ్యాంగములు గాన స్వరాజ్యసిద్ధికి సత్యదౌర్జన్యరాహిత్యము లత్యవసరము లను నమ్మకము లేనివారి నెవ్వరిని సభ్యులనుగా చేర్చగూడదు గాన సభ్యులుగ చేరగోరువారికి కాంగ్రెసుసాంప్రదాయమును బాగుగా బోధింపవలెను. (2) సంవత్సరమునందాను చెల్లింపనివారు అర్హత గల కాంగ్రెసుసభ్యులు గారు. గాన ప్రాతసభ్యులందరును చందాను చెల్లించి తమ పేరులను నమోదు చేయించుకొనవలెనని వారికి బోధింపవలెను ii రాట్నముల వాడుకను, నూలువడుకుటను ఖద్దరుబట్టలను నేయుటను చాల వృద్ధిచేయుటకు (1) కాంగ్రెసు సంఘముల యుద్యోగులును వలంటీరులును యావన్మందియు ఖద్దరుబట్టలనే ధరింపవలెను ఇతరులను ప్రోత్సాహపరుచుటకు వారు రాట్నముపై నూలువడుకుటను గూడ నేర్చుకొని యుండవలెను. iii జాతీయ పాఠశాలల నేర్పరుచు విషయమున ప్రభుత్వపాఠశాలల వద్ద బోధింపగూడదు. ముఖ్యవిషయము లన్నిటిలో జాతీయపాఠశాలలు ప్రభుత్వపాఠశాలలకంటె శ్రేష్ఠము లని ప్రజలు గ్రహించునట్లు వానిని నడుపుచో ప్రజలే చేరుదురు. iv నిమ్నజాతులు బాగుగా బ్రతుకుటకు వీలగు నేర్పాటులను చేయవలెను. వారి సాంఘిక నైతిక మానసికస్థితి నభివృద్ధినొందింపవలెను. వారు తమపిల్లలను జాతీయపాఠశాలలకు పంపునట్లు బోధింపవలెను. తక్కిన వారలకు గల సదుపాయముల నన్నిటిని వారికి కలుగజేయవలెను. ఎచ్చట పంచమనిరసన మింకను ప్రబలముగా నుండునో అచ్చట వారికి ప్రత్యేకముగ నూతులను పాఠశాలలను కాంగ్రెసు సంఘము లేర్పఱుపవలెను. అందుకు కాంగ్రెసు సునిధిని వ్యయపరుపవలెను. వారిపిల్లలను జాతీయపాఠశాలల కాకర్షించుటకు గట్టిప్రయత్నములను చేయవలెను. మామూలు నూతులలో నీళ్లు తోడుకొనుటకు సమ్మతించునట్లు ప్రజలకు బోధింపవలెను. v త్రాగుపోతుతనమును తగ్గించుటకు దుకాణముల యొద్ద బోధించుటకంటె వారివారియిండ్లకు బోయి శాంతిముగ త్రాగుడువలన కలుగు నష్టకములను బోధింపవగును. vi నానా గ్రామములందును పట్టణములందును పంచాయతీ సభల నేర్పరచి అన్ని వివాదములను పంచాయితీలద్వారా పరిష్కరించునట్లు చూడదగును. ప్రజాభిప్రాయమును బట్టియు పంచాయతీదారుల తీర్పునందలి సత్యమును బట్టియు ప్రజ లాతీర్పు ననుసరింపవలెను. ప్రజలను నిర్బంధించుచున్నారను నభిప్రాయము బొత్తుగా కలుగగూడదు గాన పంచాయితీ సభల యుత్తరువుల నుల్లంఘించువారిని సాంఘికముగ బహిష్కరించు పద్ధతిని మానవలెను. vii అన్ని మతముల వర్ణముల జాతులలో నైకమత్యమును కలిగించుట అసహాయోద్యమసంకల్పములలో నొక్కటి. అందులకు పరసేవాశాఖ నేర్పరుపవలెను. ప్రజలలో వ్యాధిగ్రస్తులు ఆపదలకు ప్రమాదములకు పాలైనవారికిని జాతిమతభేదములతో పనిలేకుండ సాంఘికసేవకులు తోడ్పడవలెను. అసహాయవాది తనసంప్రదాయము ననుసరించుచు నేవ్యక్తి ఆపద ప్రమాదము కలిగినపుడు ఆంగ్లేయులకును భారతీయులకును ఎల్లవారికిని గూడ సేవచేయుట తమ అదృష్ట మని భావింపవలెను. తిలకు స్వరాజ్యనిధికి ధనమును సంపాదించుచుండవలెను. కాంగ్రెసు సభ్యులు (స్త్రీలును పురుషులును గూడ) ను కాంగ్రెసు అభిమానులును గూడ 1921 వ సంవత్సరమునకు తమకు వచ్చిన సాలుసరి ఆదాయమున 100-వ వంతునయిన నిచ్చునట్లు వారిని కోరవలెను. ప్రతిరాష్ట్రీయసంఘము ప్రతినెలకును వసూలైన తిలకునిధిలో 100 కి 25 వంతున ఇండియా కాంగ్రెసు సంఘమునకు పంపవలెను

ix ఈతీర్మానములు ఇండియా కాంగ్రెసు స్థాయిసంఘసభలో వారి ఆమోదమునకు పెట్టబడును. x ప్రభుత్వోద్యోగములను వదలిన

వారికి తగిన యుద్యోగములను సమకూర్చు టవసరము గాన నందుల కొకవిధాన మేర్పరుచుటకు మియాను మహమ్మదు హాజీ, జాను మహమ్మదు చోటనీ, జమునాలాలు బజాజు, వి. జె. పటేలుగా రుపసంఘముగా నియోజింపబడిరి. ఆ విధానము గూడ స్థాయిసంఘమువా రామోదింపవలసియున్నది.

ఢిల్లీయందు గూడిన స్థాయిసంఘ సమావేశము నందు గాంధిమహాత్ముని హృదయవేదనము సువ్యక్తమైనది. బార్డోలియందు శాసనోల్లంఘన ప్రస్థానమును విరమించిన మహాత్ముని మీఁదను దురభిమానుల యాగ్రహము విరిగిపడినది. మహాత్ముని యింద్రజాలము స్వరాజ్యము సంపాదింపనందులకు నాయకుల హృదయములందు నమిత మాగ్రహము జనించినది. నాయకులు వ్రాసిన తిరస్కారలేఖలను మహాత్ముఁడు స్వయంకృతాపరాధములనఁగ స్వీకరించినను ధర్మనిర్ణయములను సమర్థించుకొనుచు స్వీయ మహత్త్వమును ప్రత్యక్షము చేసెను. ఢిల్లీ సభయందు దురభిమానులు చేసిన నిందలు దోషారోపణములు దుర్భాషలు మహాత్ముని యాత్మనిగ్రహమును విశదము చేసినవి. మహాత్ముఁడు నిందావాక్యములను మందహాసముతో స్వీకరించి యాత్మవిజయమును విశదము చేసెను. మహాత్మునకు అజమలుఖాను గారి మీఁదను గల గౌరవము ఢిల్లీ సభయందు విశదమైనది. ఇతరుల సంభాషణములకు చలింపని మహాత్ముఁడు మహమ్మదీయాభిప్రాయములకు చలించి బార్డోలీ తీర్మానమునందు మార్పుల నంగీకరించెను. రాష్ట్రీయసంఘములకు శాసనోల్లంఘనాధికారమును గలుగఁజేయుట కంగీకరించెను. ఆ తీర్మానమునందే మహాత్ముని బాధనము గలదని దూరదృష్టిగల సభ్యులు గనుగొనిరి. బార్డోలి తీర్మానము ప్రజలు కరుగెత్తుటకు ప్రతిబంధకముగ నున్నను ముందునకు బోవుట కే విధమైన యాటంకములను గలుగఁజేయలేదు. కర్మప్రవృత్తిగల యాజ్ఞికులకు సర్వారంభములందును కర్మకలాపము గనుపించుచున్నను కర్తవ్యప్రవృత్తి లేని ప్రజలకు మహారంభములందు సయితము కర్తకలాపము గోచరము గాకుండును. బార్డోలి విధానమును ప్రశంసించుటకును నిందించుటకును నిప్రవృత్తిమూలముగాని బార్డోలి విధానము మూలముగాదు. బార్డోలి విధానము స్వరాజ్య ప్రస్థానము నాపినదను నపవాదము దేశమునం దేర్పడినది. బార్డోలి ఢిల్లి తీర్మానము శాసనోల్లంఘన ప్రస్థానమునందు వెనుకంజ వేయలేదనియును ముందంజ వేయుట కధికారమును రాష్ట్రములకు గలుగఁజేసిన దనియును ప్రతిపాదనవిమర్శనము విశదము చేయుచున్నది.

బార్డోలి తీర్మానము నిరంకుశాధివర్గమునకు మహాత్ముని నిర్బంధమున కవకాశము లను గలుగఁజేసినది. రాజ్యాంగరథము వాయువేగముతో నడిచినది. సంయుక్త పక్షమును లాలించుటకు మోంటేగుగారి రాజీనామాయును మహాత్ముని బంధనమును నవసరములైనవి. మార్చి మాసమునందు మహాత్ముఁడారేండ్లు రాజద్రోహమునకు దండనమును బొందెను. సత్యమూర్తియైన మహాత్ముని దండనము లోకమునకు విస్మయమును గలుగఁజేసినది. దండించిన న్యాయాధిపునకు దండనమును జెప్పునపుడు చిత్తచాంచల్యము గలిగినపుడు దండన న్యాయమును జర్చించుట యనవసరము. మహాత్ముఁడు దుండగములకును దురంతములకును తన బాధ్యత నొప్పుకొని తీవ్రమైన దండనమును గోరి దండనమును మందహాసముతో స్వీకరించెను. మహాత్ముఁడు దాఖలు చేసిన యభిప్రాయ పత్రము ధర్మపత్రముగ నాచంద్రార్కముగ నిలిచి లోకమునకు ధర్మబోధను జేయగలదు.

## మహాత్ముని వ్రాతమూలము

గాఢరాజభక్తిపరుఁడనగు నేను తిరుగలేని ప్రభుత్వానురాగరహితుఁడనుగను అసహాయవాదిగను మారుటకు గలకారణములను నా దేశీయులకును ఎవరిని సంతోష పెట్టుటకు నాపై నిర్బంధి యభియోగము తేబడెనో అట్టి ఆంగ్లదేశీయులకును నేను వెల్లడింపవలసి యున్నది. హిందూదేశమున న్యాయశాస్త్రప్రకారముగ నేర్పరుపబడిన ప్రభుత్వముపట్ల నసంగరాహిత్యమును నేను ప్రబలజేయుచున్నానను నేరమును నేను జేసితి నని యొప్పుకొనుటకు గల కారణమును న్యాయస్థానాధిపతికి గూడ నేను తెలుపవలసియున్నది.

దక్షిణాఫ్రికాలో పరిస్థితులు కడువిషమముగా నున్న తరుణమున 1893 లో నేను ప్రజాసేవ ప్రారంభించితిని. మొట్టమొదట నే నాదేశమున బ్రిటీషువారి సహవాస్యమును బడయుటవలన ననుకూలభావము గలుగలేదు. మానవుఁడ నగుటచేతను భారతీయుఁడ నగుటచేతను నాకుండవలసిన హక్కులేమియును నాకు లేవని నేనపుడు గ్రహించితిని. నేను భారతదేశమున జనించుటవలన నే మానవహక్కులకు స్వాతంత్ర్యములు గూడ నాకు లేకుండబోయినని సైతము నేనపుడు గ్రహించితిని గాని కేవలమాత్రమున భగ్నాశయుఁడను గాలేదు. బ్రిటిషు ప్రభుత్వవిధానము సహజముగ సాంగముగ నుత్తమమే యనియును దక్షిణాఫ్రికాలో మాత్రమా విధానమున కీ దుర్గతి సంప్రాప్తమైన దనియును నేను భావించితిని. ప్రభుత్వహితమును కోరి మనఃపూర్వకముగను స్వేచ్ఛగను సహకారినై తద్విమర్శనము సెన్నడు కోరక అదక్షిణ్యదృష్టితో నాకు దోషయుతములని తోచినవిషయములన్నిటిని నిష్కర్షగా విమర్శించి వ్రాసితిని.

1899 వ సంవత్సరమున బోయరులు ప్రభుత్వముతో యుద్ధమునకు గడంగినపుడు, నేను సేవచేసెద నని తెలియఁజేసి, వైద్యసహాయ సైన్యిక

దళమును సిద్ధపరచి లేడీ స్మిత్ ముట్టడిని తొలగించుటకు జరిగిన పెక్కు యుద్ధములందు సహాయ సేవచేసితిని. 1906లో జూలూలు తిరుగ బడి పితూరి చేసినపుడు గూడ నేను గాయముల నెత్తిన వారిని మోసికొని పోవుటకు డోలీలను మోయువారి దళము నేర్పరచి పితూరి అడగిపోవు వరకును సహాయము చేసితిని. ఆ రెండు సారులను గూడ నా సహాయ మును సభినందించుచు నాకు పతకముల నిచ్చుటయే గాక బ్రిటిష్ ప్రభు త్వము వారికి వ్రాసిన లేఖలలో గూడ నా సహాయమును ప్రశంసించుచు వ్రాసిరి. దక్షిణాఫ్రికాలో నేను చేసిన సహాయమునకే హార్డింజి ప్రభువు (రాజప్రతినిధి) వెనుక నాకు కైసరీ హిందు స్వర్ణ పతకమును గూడ నా కొసంగెను. 1914 లో జర్మనీవారు యుద్ధమును ప్రారంభింపగా నే నేనపు డాంగ్ల దేశమునం దుండుటచే నచట నపుడు లండనులో నున్న భార తీయులను ముఖ్యముగా విద్యార్థులను వైద్యసహాయ స్వచ్ఛికదళముగా నేర్పరచితిని. ఆదళము ఘనమగు సేవచేసెనని సైన్యాధికారు లపుడు ప్రశంసించిరి. ఆయుద్ధము జరుగుచుండగనే నేను యిండియాకు వచ్చిన పిమ్మట నీదేశమున సైనికులు కావలెనని 1917 లో జరిగిన యుద్ధసభ లో చెమ్సుఫర్డు ప్రభువు (రాజప్రతినిధి) ప్రత్యేకముగ కోరగా నాక పుడు ఆరోగ్యము చెడియున్నను గూడ లెక్కచేయక ఖేడాలో నొక దళమును సిద్ధపరుప చాల ప్రయత్నము చేసితిని. చాలమంది వచ్చిచేరిరి. కాని అంతలో యుద్ధము ముగిసినందున ఆ సేనతో అవసరము కలుగ లేదు. ఇట్టిసేవ చేసినచో బ్రిటిషు సామ్రాజ్యమునందలి యితర దేశము లతో సమానమగు స్వాతంత్ర్యగౌరవము భరతఖండమునకు గూడ లభించునను నమ్మకముతో నే నీరీతిగా ప్రభుత్వమునకు సహాయము చేసితిని.

## ఆశాభంగపరంపరలు

వీనిలో మొట్టమొదటిది రౌలటు చట్టము. ప్రజలకు గల యథా ర్థస్వాతంత్ర్యమును పూర్తిగా తీసివేయుటకే యీ రౌలటు చట్టము చేయబడెను. కాన దానికి ప్రతికూలముగ తీవ్రముగ నాందోళన మొనరించుట నా విధి యని నేను నిశ్చయించితిని. అంతటితో జలియను వాలాబాగు సంఘ సంహారముతో ప్రారంభమై ప్రాకడపు టుత్తరువు, నడివీథులలో కొరడాలతో కొట్టుట, మున్నగు వర్ణింపనలవి గాని వరా భవక్రియల పరిణామము వహించిన పంజాబు దౌర్జన్యములు ప్రారంభమై నవి. మహమ్మదీయుల పుణ్యక్షేత్రములను గాపాడుట, టర్కీసంధి మున్నగు విషయములను గూర్చి ప్రధానమంత్రి భారతీయులగు మహ మ్మదీయుల కొసంగిన వాగ్దానము నెరవేర్పబడుట గూడ అసంభవమని నే నపుడు గ్రహించితిని.

## ప్రభుత్వసహాయముకొరకింకను ప్రయత్నించుట

ఇట్టి నిదర్శనము లెన్నియో కనబడినను మిత్రులు గట్టిగ నన్ను మందలించినను గూడ 1919 లో అమృతసరునందు కాంగ్రెసు సభ జరిగినపుడు మాంటాగూ - చెమ్సుఫర్డు సంస్కరణములను నెరవేర్పు టకు దేశీయులకు సహాయము చేయవలెననియే నేను వాదించితిని. అట్లు చేసినచో ప్రధానమంత్రి మహమ్మదీయులకు చేసిన వాగ్దానమును చెల్లిం చుననియు పంజాబు వణోవ్రణములు మాన్పబడుననియు రాబోవు సంస్కరణములు అసంతృప్తికరములుగనే యున్నను అవి దేశీయజీవన మున ఆశాజనకములగు నూతనశకప్రారంభము లనియు నే నాశించితిని.

ఆయాశలన్నియును ఛిన్నాభిన్నమై పోయెను. ఖిలాఫతు వాగ్దానము నెరవేర్పలేదు. పంజాబు దురంతములను అలతిగ తేల్చివేయు టయే గాక అపరాధులను దండింపక పోవుట యటుండ వారి నింకను ప్రభుత్వ సేవనుండి తొలగించనేలేదు. వారిలో నొకకొందరికి హిందూదేశ దాయమునుండి ఫించనుల నిచ్చుచున్నారు. వారిలో నొకకొందరికి బహుమానముల గూడ నొసంగిరి. రాజకీయ సంస్కరణముల వలన నుద్యోగుల మనసు కొంచెమైన మారలేదు. సరిగదా భరతఖండమునం దలి ద్రవ్యము నింకను కొనిపోవుటకును భరత ఖండము నింకను దాస్య నిర్బంధమున బంధించుటకును సంస్కరణములే వారికి సాధనము లయ్యె ను. రాజకీయార్థిక విషయములందు దరిదర మెన్నడును కలుగనంతటి అస హాయస్థితి బ్రిటిషు సంబంధమేర్పడిన పిమ్మటనే కలిగినదను నభి ప్రాయము నేనెంత ప్రయత్నించినను తొలగుటలేదు. నిరాయుధముగ చేయబడిన భరతఖండము తన్ను తలపడవచ్చినవానిని సాయుధులై మారొడ్డ నవలె ననిన నిపుడు భరతఖండమునకు నిరోధశక్తి లవమాత్ర మును లేదు. అధినివేశనములకు గల స్వాతంత్ర్యము భరతఖండమున లభిం చుటకు పెక్కు పుష్టహాంతరములు గడువవలెనని భారతీయులలో విజ్ఞు లగువారే పలువురు తలంచునట్లు చేయునంత హెచ్చుగా నీపరాధీనత ప్రబలియున్నది. దారిద్ర్య మత్యధికమగుటచే క్షామములు కలిగి నపుడు ప్రజలు పోత్తుగా సహింపజాలని దుర్దశ కలిగినది. బ్రిటిషువారి దేశమునకు రాకపూర్వము కోట్లకొలది కుటుంబములవారు నూలువడుకు టను బట్టలనేతను గృహపరిశ్రమగా నొనరించుచుండిరి. వ్యవసాయము వలన వారికి లభించు స్వల్పాదాయమున కీవిధముగ గూడ కొంత తోడు పడుచుండెను. భరతఖండవాసుల మనగడ కత్యవసరమగు నీపరిశ్ర మను నమ్మశక్యము కానంతటి క్రూరకృత్యములచే రూపుమాపిరని ఆ ఱాయమును నాశనము చేసిరని ఆంగ్లేయులు చెప్పిన వృత్తాంతముల వలననే స్పష్టమగుచున్నది. గ్రామములందు నివసించుచు కడుపునిండ నొక పూట యైన భుజింప నాధారము లేక నకనకలాడుచున్న సామాన్యప్రజలు క్రమ ముగ నెట్లు జీవచ్ఛవములై పోవుచున్నారో పట్టణవాసుల కేమియును తెలియదు. విదేశీయులగు ధనాపేక్షకులు పట్టణవాసులచే సేవచేయిం చుకొని వారికి స్వల్పమగు దళారి నిచ్చుచున్నారు. ఆవిదేశీయు లధిక లాభమును గొంపోవుచున్నారు. ఆలాభమును యీ దళారిని గూడ వారు గ్రామవాసులగు సామాన్యప్రజలనుండి రాబట్టుచున్నారు. ఈసంగతిని కొంచెమైన గ్రహింపక పట్టణవాసు లాదళారితో నామమాత్రమగు సౌఖ్యము ననుభవించుచు మురియుచున్నారు. సామాన్యప్రజల విత్తము నీరీతిగా హరించుటకే యీదేశమున ప్రభుత్వ ముపయోగపడుచున్నదను విషయమైన నీపట్టణవాసులు గ్రహింప లేరు.

## మానవసంఘముపట్ల మహాపరాధము

గ్రామములలో ప్రత్యక్షముగ కనబడు నస్థిపంజరము లిచ్చు సాక్ష్యమును ఎట్టి లెక్కలును ఎట్టి యంత్రజాలమును ఎట్టి తిరస్కృతి

మాటలును మరుగుపరుపజాలవు. చరిత్రయందు ఇవి మానవసంఘముపట్ల జరుగుచున్న మహాపరాధములన్నిటిని తలదన్నిన మహాపాతకములు. ఇందులకు పట్టణవాసులును బ్రిటిషువారును బాధ్యులు. నిజముగ దైవమే యొకడున్నచో వారలనిక త్తరవాదులు కాకతప్పదు. ఈ దేశమునకు వచ్చిన విదేశీయులకు ధనహర్తలకే న్యాయశాస్త్రనిబంధనలు గూడ సమకూలపడుచున్నవి. నేను నిష్పాక్షికముగ పంజాబు సైనికశాసన విచారణలను పరికింపగా 100 కి 95 మందికి విధింపబడిన శిక్షలు పూర్తిగా అన్యాయమని తేలినది. ఈ దేశమునందలి రాజకీయ నేరములలో నాకు చాల అనుభవము గలదు. శిక్షింపబడిన ప్రతి పదిమందిలోను 9 మంది కేవలము నిర్దోషులే. మాతృదేశము ప్రేమించుట యొక్కటియే వారొనరించిన అపరాధము. పాశ్చాత్యులసంబంధము గల కేసులలో ఈ దేశమునందలి న్యాయస్థానముల తీర్పులవలన 100 కి 99 కేసులలో దేశీయులకన్యాయమె జరుగుచున్నది. ఇందతిశయోక్తి యేమియును లేదు. అట్టి కేసులతో నేమాత్రమైన సంబంధమున్నచో నట్టి భారతీయులకందరికీ నీ విషయము పూర్తిగా అనుభవములోనున్న సంగతియే. ఈరీతిగా విదేశీయ ధనహర్తల కనుకూలముగనే న్యాయనిబంధనలు బుద్ధిపూర్వకముగనో కాకనో పరిపాలించుచున్నారు.

## మహాదురదృష్టము

ఇట్టి మహాపాతకమున తమకు సంబంధము కలదని దేశపరిపాలనమునకు బూనిన ఆంగ్లేయులును వారికి తోడ్పడుచున్న భారతీయులును గూడ గ్రహింపకుండుట మహాదురదృష్టము. ఈపరిపాలనావిధానము ప్రపంచమునందంతటను గూడ సర్వోత్తమమనియు దీనివలన భరతఖండమున కభివృద్ధి కడుమందముగ కలుగుచున్నను కలిగినంతవరకు సుస్థిరమనియు నిష్కపటముగ నమ్ము నాంగ్లేయులును భారతీయులును పాలకవర్గమున పలువురు కలరనియెడ నే నెరుగుదును. ఒకపక్షమున సూక్ష్మమయ్యు సమర్థమగు భయవశీకరణవిధానమును సక్రమ పశుబల ప్రదర్శనమును కలదనియు రెండవపక్షమున ఆత్మరక్షణప్రతిఘటనశక్తులు పూర్తిగా నశింప జేయబడుటవలన ఆపక్షమువారి పౌరుషసత్వములు పూర్తిగా రూపుమాయుటచే వారు కపటనటన మను దురభ్యాసము ప్రబలినదనియు నీయుద్యోగు లెరుగరు. పరిపాలకుల అజ్ఞాన, ఆత్మవంచనలకీ కపటనటన మను ఘోరదురభ్యాసము మరింత తోడ్పడినది.

## నిబంధనలలో మొదటిరకము

హిందూదేశ శిక్షాస్మృతిలోని రాజకీయనిబంధనలలో 124. ఏ నిబంధన మొదటి రకమని చెప్పదగును. ఇపుడు దానిక్రిందనే నాపైని కేసుచేసిరి. పౌరుల స్వాతంత్ర్యమును అణచివేయుట కేర్పరుపబడినది. అనురాగమును కలిగించుటయు సక్రమపరచుటయు నిబంధనలవలన సాధ్యముకాదు. ఒకనికొకనిపైగాని ఒకవస్తువుపైగాని అనురాగములేనపుడు దౌర్జన్యమును సంకల్పించుటయు దౌర్జన్యమును వ్యాపింప జేయుటయు దౌర్జన్యమున కితరులను పురికొల్పుటయు జరుగనంతకాలము అతడు తన విరాగమును పూర్తిగా వెల్లడించుటకు సర్వస్వాతంత్ర్యములను కలిగియుండదగును. కాని నాపైనను బాంకరుగారిపైనను కేసు చేయబడిన నిబంధనప్రకారము అనురాగరాహిత్యమును వ్యాపింపజేయుటయే నేరమగుచున్నది. ఈ నిబంధనక్రింద విచారింపబడిన కొన్ని కేసులను నేను పరిశీలించితిని. భారతీయులచే సర్వాధికముగ ప్రేమింపబడిన దేశభక్తులు కొందరీ నిబంధనక్రిందనే శిక్షింపబడిరి. నాపైనగూడ నానిబంధనక్రిందనే కేసుచేయుట నాకొక గౌరవముగా నేను భావించుచున్నాను.

## అనురాగరాహిత్య మొకసుగుణము

నాకనురాగము తొలగుటకు గల కారణములను చాల సంగ్రహముగ వివరించుటకు నేను ప్రయత్నించితిని. పరిపాలకవర్గమునందున్న ఏవ్యక్తిపైనను నాకు ద్వేషము లేదు. రాజుపట్ల నసలె లేదు. ఇదివరకే ప్రభుత్వవిధానమును చేయనంతటి మహాపకారమును హిందూదేశమునకు మొత్తముమీద నొనరించినట్టి ప్రభుత్వముపై ననురాగము లేకుండుటయే సుగుణమని నేను నమ్ముచున్నాను. ఈప్రభుత్వముక్రిందవలె మునుపెన్నడును గూడ భారతీయు లింత హెచ్చుగా పౌరుషవిహీనులు కాలేదు. అట్టి నమ్మకము నాకుండుటచే అట్టి ప్రభుత్వవిధానమును ప్రేమించుట పాతకమని నేను తలంచుచున్నాను. ఇపుడు నేరమునకు నిదర్శనములుగా చూపబడిన వ్యాసములలోని విషయములను నేను వ్రాయగలుగుట అమూల్యగౌరవ మని నేను భావించుచున్నాను. ఆంగ్ల భారతదేశములు రెండును మెలంగుచున్న అక్రమవిధానమునుండి విముక్తములగుటకు మార్గమును అసహాయోద్యమమువలన నేను చూపియుండుటచే వారెండు దేశములకును నేను మంచినే చేసితినని నేను భావించుచున్నాను.

## అసహాయోద్యమము - ముఖ్యమగు విధి

ఉత్తమకార్యములకు తోడ్పడుటవలెనే దుష్కార్యములకు సహాయము చేయకుండుట గూడ మానవులకు ముఖ్యమగు విధియేయని నేను నమ్ముచున్నానుగాని యింతవరకును దుష్కార్యముల నొనరించిన వారిపట్ల అసహాయోద్యమము బుద్ధిపూర్వకముగ దౌర్జన్యమే యొనరించినది. దౌర్జన్యముతో గూడిన అసహాయోద్యమమువలన దుష్కార్యములే హెచ్చగును. దుష్కార్యముల కాధారము దౌర్జన్యమేగాన దౌర్జన్యమును పూర్తిగా పరిత్యజించినగాని దుష్కార్యములకు నిరాధారస్థితి కలుగదు. దుష్కార్యములకు సహకారులము కాకుండుటవలన కలుగు ఫలితము ననుభవించుటకు బుద్ధిపూర్వకముగ సంసిద్ధుల మగుటయే దౌర్జన్యరాహిత్యమని గ్రహింపవలెనని నేను దేశీయులకు బోధింప గోరుచున్నాను.

## మీరు అధికతమమగుశిక్షను వేయుడు లేనిచో ఉద్యోగములను వదలివేయుడు

మీ న్యాయశాస్త్రప్రకారము బుద్ధిపూర్వకమగు నేరమనియు నా అభిప్రాయమునుబట్టి పౌరుని యుత్తమధర్మమనియు తోచుకార్యమును నేను చేసినందులకు నాకు వేయదగిన అధికతమమగు శిక్షను వేయుడని మిమ్ములను కోరుచు దానిని సంతోషముగ ననుభవించుటకు సర్వసిద్ధముగ నున్నాను. న్యాయాధికారియును న్యాయసహాయులు

(జడ్జీ, అసెసరులు) నగు మీరు పరిపాలింప నెంచిన న్యాయనిబంధనము దోషమనియు నేను నిర్దోషి ననియు నమ్మినచో మీ యుద్యోగములకు రాజీనామాలనిచ్చుటయు లేదా ఆ నిబంధనయు పరిపాలనా విధానము మంచిదనియు దేశీయులకు లాభకరములనియు నా ప్రయత్నము ప్రజల మేలుకు భంగకరమనియు మీరు నమ్మినచో మిక్కిలి హెచ్చగు శిక్షను నాకు వేయుటయు మీకు ముఖ్యకర్తవ్యమని విన్నవించుచున్నాను.

ఎం. కే. గాంధీ.

గాంధి మహాత్ముని దండనము స్వరాజ్య ప్రస్థానమానం దొక రంగమును ముగించి రెండవ రంగము నుపక్రమింప జేసినది. రెండవ రంగమునందు విజయమును గడింపవలసిన భారము భారతీయుల మీదను గలదు. మహాత్ము డుపదేశించిన ఖద్దరు ధారణము ఖద్దరు వ్యాపనము స్వరాజ్య విజయమునకు సుదర్శన చక్రముగ నున్నది. మహాత్ముని విమోచనము స్వరాజ్యానుభవము ప్రజాధీనమునందు గలదు. బార్డోలి నిర్మాణ విధానమును అనుష్ఠించుటయం దసహాయోద్యమ ప్రస్థానమునం దితర రంగములను జేరుట కధికారము గలుగును. అసహాయోద్యమ ప్రస్థానమునందు నడుచుటకును నడుపుటకును వలయు నధికారలక్షణములను మహాత్ముండు తన యాచరణమువలనను స్వయముగ వ్యక్తముచేసినను నాత్మవంచకుల కీపరమార్థము గోచరము గాకున్నది. బార్డోలీ విధానమున కెవరి యర్థమును వారు చేయుచు వామమార్గముల నవలంబించుట కుపక్రమించు చున్నను మహాత్ముని త్యాగము పరమేశ్వరానుగ్రహమువలనను స్వరాజ్య ప్రస్థానమునందు భారతీయులను ధర్మమార్గ ప్రవర్తకులనుగను జేయగలదు.

## ఆంధ్రదేశము

ఆంధ్రదేశము భారతేతిహాసములందు ప్రసిద్ధమైన ప్రాచీనదేశము. దేశమునందు ప్రజల జీవనపోషణమునకు సాధనములైన నీటివసతులు సుక్షేత్రములు ప్రకృతి పరిస్థితులు గలవు. ప్రజ లుదారశీలము గల భగవద్భక్తులు. భాష స్వరాంతమైన మధురభాష. ఆంధ్రదేశము ప్రజలు భాష ప్రాచీనసాంప్రదాయేతిహాససంజాతమైన సంస్కారములను గలిగి ప్రత్యేకవ్యక్తిత్వమును దెలుపుచున్నవి. దక్షిణాపథమునందు గల రాష్ట్రము లాంధ్రరాష్ట్రవ్యక్తిత్వము చిరకాల సమాగతమైనను బ్రిటీషురాజ్యవిధానమునందు మద్రాసురాష్ట్రమునం దంతర్గర్భితమై యాంధ్రాభ్యుదయమున కాటంకములు గలిగినవి. మద్రాసురాష్ట్రమునందు దక్షిణభాగప్రాబల్య ముత్తరభాగ స్తంభనమునకు గారణంబైనది. రాజ్యాంగములందును విద్యావిధానమునందును వ్యాపారకరిశ్రమలయందును బలుకుబడియందును నాంధ్రదేశమున కవసరమైన పోషణము గలుగకుండెను. ఆంధ్రపౌరుషము ప్రతికూలపరిస్థితులందును గోచరంబగుచు నాంధ్రోద్యమస్వరూపమునను సువ్యక్తమైనది. నాగపురము మహాసభ నిర్ణయించిన భాషారాష్ట్రవిభాగముల నాంధ్రమహాసభలు పదేండ్లకు బూర్వము నిర్ణయించినవి. ఆంధ్రదేశమునకు బ్రిటీషు ప్రభుత్వమునందు లేని స్వతంత్రవ్యక్తిత్వము భారత జాతీయమహాసభ కల్పించినది. కలకత్తామహాసభ సంశయభావముతో గల్పించిన యాంధ్రవ్యక్తిత్వమును నాగపురము మహాసభ సమర్థించినది. జాతీయసభాప్రయోజనములను సమర్థించుటకు విని యోగపడినవిధమును నాంధ్రప్రపంచము విశదము జేయుచున్నది.

## అసహాయోద్యమము

స్వయంసహాయాధారమునను ఆంధ్రసభలను నిర్వహించిన యాంధ్రప్రపంచమునం దసహాయోద్యమ వ్యాపనము సుకరమైనది. జాతీయవిద్య స్వదేశదీక్ష స్వభాషాభిమానము పరిచితమైన యాంధ్రహృదయమున కసహాయోద్యమ ధర్మము సులభగ్రాహ్యము. అసహాయోద్యమ ప్రస్థానమునకు విజయవాడ విధానము ప్రముఖము. గాంధిమహాత్ముని యాంధ్రదేశ సంచార మాంధ్రవ్యక్తిత్వమున కుత్తేజమును గలుగజేసినది. అసహాయోద్యమ ధర్మగ్రహణమునందును నిర్మాణవిధానమునందును నాంధ్రులకు గల సామర్థ్యమును మహాత్ముడు గ్రహించి యాంధ్రులను బ్రశంసించెను. ఆంధ్రులు యథాశక్తిని స్వరాజ్య ప్రస్థానమునం దసహాయోద్యమ ధర్మమును నిర్మాణసాధనమును నుపయోగించి స్వరాజ్యరథమును నడిపించిరి. ఖద్దరు నిర్మాణమునందు 17 లక్షల రూపాయలను వ్యయము చేసినను గుజరాతునకు గలుగని కీర్తి యాంధ్రదేశమునకు గలిగినది. పొందూరు సన్నబట్టలు విజయవాడ ముతకబట్టలు భారతభూమియందు బ్రఖ్యాతిని బొందినవి. శాసనోల్లంఘన విధానమునందు చీరాల మ్యునిసిపాలిటీ భారతదృష్టి నాకర్షించినది. వందలమంది దేశసేవకులు గత సంవత్సరమునందు స్వరాజ్యప్రచారమును దేశమునందంతటను జేసిరి. ప్లీడరులు విద్యార్థులు వారి వృత్తులను విసర్జించి దేశసేవను జేయుచుండిరి. బ్రహ్మపురమునందు సెప్టెంబరు

మానసమునందు గూడిన యాంధ్రసభ లసహాయోద్యమ విధానమును సమర్థించినవి. ఆంధ్ర రాష్ట్రీయసభ కధ్యక్షులైన శ్రీయుత భోగరాజు పట్టాభిసీతారామయ్యగారును ఆంధ్రమహాసభ కధ్యక్షులైన గంపలగూడెము కుమారరాజాగారును ప్రజాభిప్రాయమును సమర్థించిరి. అధికార నిర్బంధములు ప్రబలినవి. బ్రహ్మపురమునందు శ్రీయుత ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారును కుమారరాజాగారు దండనమునకు పాల్పడిరి. వందలమంది ప్రచారకులు శ్రీకృష్ణజన్మస్థానములను జన్మస్వత్వములను కాపాడుకొనుటకై ప్రవేశించిరి. అహమదాబాదు మహాసభకు వందలకొలది యాత్రికులు పోయి స్వరాజ్యయాత్రను జేసి గాంధిమహాత్ముని సందర్శించి కృతార్థులైరి.

పన్నుల నాకటు

జనవరి మాసారంభమునను సమష్టిశాసనోల్లంఘనమును జేయుటకును కిస్తీల నాపుటకును ఆంధ్ర రాష్ట్రీయసభ మండలసభల కధికార మొసంగుటకు నిర్ణయించినది. ఈ నిర్ణయమును కృష్ణాగోదావరీ మండల సంఘములు కాలాంతరమునను మార్చినను గుంటూరు మండలము రాష్ట్రీయసభ తిరిగి తీర్మానోపసంహారమును జేయునంతవఱకును మార్పులేదు. సమష్టి శాసనోల్లంఘన పరిస్థితులను విమర్శించుటకు శ్రీయుత టం. ప్రకాశముగారు కా. నాగేశ్వరరావుగారు దం. నారాయణరాజుగారు నియమింపబడిరి. వారు దేశపరిస్థితుల నవలోకించి పన్నులను చెల్లింపవలయు నని నిర్ణయించిరి. గుంటూరు మండలమును కాంగ్రెసు తీర్మానానంతరము పన్నులను జెల్లించినది. ఈ పరిస్థితులందు గుంటూరు మండలాధికారి వర్ననుగారును వారియనుచరులును జేసిన దౌర్జన్యములు భీభత్సములు నిరంకుశ విధానమునకు లక్ష్యములుగ నుండగలవు. పన్నుల నీయవలదని బోధించిన నేరమునకు శ్రీయుత సీతారామశాస్త్రి ప్రభృతులును దేశభక్త వేంకటప్పయ్యగారును నిర్బంధింపబడిరి. బ్రహ్మపురమునుండి చిత్తూరువఱకును నాంధ్రావనియందలి దేశసేవకులు దేశమోక్షమునకు స్వరాజ్యాశ్రమములను స్వీకరించిరి. స్త్రీలును పురుషులవలె దేశమోక్షమునకాత్మసమర్పణమును జేసి దేశవ్యాప్తమైన స్వరాజ్యానుతాపమును సువ్యక్తము జేసిరి. స్త్రీలు పురుషులు, పండితులు పామరులు, యువకులు వృద్ధులు పరమానందముతో స్వరాజ్యాశ్రమములను స్వీకరించి స్వాతంత్ర్యేచ్ఛను విశదము చేసిరి.

నిర్బంధములు

అధికారులు నిరభ్యంతరముగ నిర్బంధాయుధముల నుపయోగించి స్వాతంత్ర్యసంహారమును జేయుచున్నను ప్రజ లేవాదమును లేకయే యాత్మసమర్పణమును జేయుచున్నారు. అధికారుల యుపేక్షయైనను నాంధ్రమంత్రుల యభిమానమైనను పత్రికల నింతవఱకును బంధింప కుండుట సంస్తవనీయము. అధికారు లేమినిర్బంధములను గల్పించినను స్వరాజ్యానుతాపము ప్రజాహృదయమును దృఢముగ నావరించిన విధమును నాంధ్రదేశ పరిస్థితులును ముఖ్యముగ గుంటూరు మండల పరిస్థితులును విశదము చేసినవి. చేయుచున్నవి. అధికారులు నిరంకుశ కవచాచ్ఛాదనమునఁ జేయుచున్న న్యాయపరిపాలనము న్యాయస్వరూపమును మార్చినది. అధికారులు స్వాధికారసమర్థనమునకు వినియోగించుచున్న శాసనములను శాసనాన్వయములను యోచించునపుడు పామరులకు సయితము శాసనములందు విశ్వాసము పోయినది. బ్రహ్మపురమునందు నాయకులు మద్యపాననిషేధమును బోధించినందులకు దండింపబడిరి. రాజమహేంద్రవరమునందును మంగళగిరియందును శాంతిసైనికులు నిర్బంధముల ననుభవించిరి. సింహపురప్రాంతములందు మద్యపాననిషేధమును బోధించినవారు దండనమునకు పాత్రులైరి. శ్రీయుత తిక్కవరపు రామిరెడ్డిగారు బెజవాడ చంద్రశేఖరరెడ్డిగారు చేయనినేరమునకు శిక్ష ననుభవించుచున్నారు. ప్రజల సమావేశస్వాతంత్ర్యమును సంభాషణస్వాతంత్ర్యమును 144,108,107 మొదలగు శాసనాస్త్రములు సంహారమును జేసినవి. కల్లుసారాయముల పాటల నాపుటయందును తగ్గించుటయందును ప్రజలు చూపిన సాహసోత్సాహము లధికార హృదయమునందు భయభ్రాంతులను గలుగజేసినవి.

గుంటూరు విజయము

గుంటూరునందు శాంతిసైనికులు సారాయము పాట సమయమునను గుంపులు గుంపులుగ శ్రీకృష్ణాశ్రమములకు బోయినపు డధికారులకు సయితము కర్తవ్యము తోచకుండెను. ఆంధ్రనాయకుడు దేశభక్త వేంకటప్పయ్యగారు పన్నుల నిరాకరణమును బోధించిన నేరమునకు దండనము ననుభవించుచున్నాడు. గుంటూరు మండలమునం దధికారులు న్యాయసంరక్షణనామమునను గలుగజేసిన కష్టము లధికార నిరంకుశతను వెల్లడి చేసినవి. అధికారులనిరంకుశత్వము ప్రజలు పన్నుల నిచ్చిన

తరువాత బయటబడినది. అధికారులు సైనికులను రక్షకభటులను సంచారమును జేయించి ప్రజలను భీతావహచిత్తులను జేయుచుండిరి. పల్నాటియందు తుపాకుల ధారునకు నలుగురు బలియైరి. అందు ఇన్స్పెక్టరు గట్టుపువాడుండుటకు గారణము తెలియకున్నది. ఈ మరణములకు యథార్థమైన కారణము లింకను బయలుపడలేదు. వర్మనుగారు గుంటూరుమండలమునం దవలంబించిన నిర్బంధ ప్రస్థానమును వ్రాయుటకు మహాపురాణము గావలయును. అధికారులీ దౌర్జన్యమూలమునను ప్రజోత్సాహము నశించిన దని యానందించిరి. వర్మనుగారిని శ్రీవిల్లింగ్డను ప్రభు వభినందించి సంవత్సరకాలము స్వయంప్రతాపమును మననము చేసికొనుటకు విశ్రాంతి నొసంగిరి. వర్మనుగారు గడించిన విజయయాత్ర ననుభవించుటకు గవర్నరుగారు గుంటూరు మండలమునందు నిరంకుశజయభేరిని మ్రోగించుచు సంచారమును జేసిరి. అధికారులు రాజభక్తినాటకము నాడించిరి. సన్మానపత్రముల నర్పించిరి. గంభీరోపన్యాసములను జేసిరి. అసహాయోద్యమమును జంపి ప్రజోత్సాహమును జయించి నట్లు లానందభేరిని ప్రకటించిరి. శ్రీయుత మాడభూషి నరసింహాచార్యులు గారును ఉన్నవ లక్ష్మీనారాయణ గారును గుంటూరు పురమునకు జేరినపుడు నాటక స్వరూపము మారినది. ప్రజలు పరమోత్సాహముతో స్వాగతము నొసంగిరి. శాసనోల్లంఘనవిచారణసంఘమునకు గుంటూరుపుర మొసంగిన మహాస్వాగత మధికార నాటకమును బూటకము చేసినది. అధికార నిర్బంధములను లక్ష్యము చేయకయే వేలకొలది ప్రజలు విజయధ్వానములతో స్వాగతంబు నొసంగిరి. రెండుగడియలకాలములో జన్మస్వత్వముల రక్షణమునకు 200 మంది శాంతిసేవకులు స్వరాజ్యాశ్రమమునకు బోయి గుంటూరుపుర విజయమును బ్రకటించిరి. గుంటూరుభక్తులు ప్రదర్శించిన మహానాటకమునే ఆంధ్రదేశమునం దితర ప్రాంతములును ఇతర రాష్ట్రములును ప్రదర్శించుచున్నవి. అన్నిరాష్ట్రములందును మహాజనులును యువజనులును కారాగృహవాసమును స్వర్గాశ్రమవాసమువలె స్వీకరించుచున్నను నధికారహృదయమునందు మాత్రము సంచలనము గలుగలేదు. ప్రజలత్యాగ మధికారవర్గమునందు శాంతికి బదులు కోపమును వృద్ధిచేయుచున్నది. ప్రజలశాంతము నధికారుల కోపమును స్వరాజ్య ధర్మవిజయమును స్థాపించి ప్రజల ధర్మకర్తవ్యమును సువ్యక్తము చేసినది.

## అసహాయోద్యమ విజయము

అధికారనిర్బంధములు వెల్లువలై ప్రవహించుచున్నను ప్రజలు పరమశాంతమును జూపుచు నధికారవర్గమునకు చిత్తవిభ్రమణమును గలుగజేయుచున్నారు. ప్రజలయందు దండనభయముపోయి దండితులు స్వాగతసత్కారములకు బాత్రులగుచున్నారు. ఈ ధర్మస్థితి ప్రజలస్వాతంత్ర్య ప్రబోధమును వేయినోళ్లను జాటుచున్నను నసహాయోద్యమవిధానము నన్నగిలినదనియును స్వరాజ్యమునకు నూతనసాధనమును గోరుట విమమదశయందు గలిగెడి హృదయదౌర్బల్యమునకు నిదర్శనముగ నున్నది. పాశ్చాత్యసభ్యత్వము గతశతాబ్దియందు నాగరకవ్యాజమునను పశుబలరాజ్యమును విశ్వవ్యాపకమును జేసినవి. మహారాజ్యములు రాజ్యాదాయములను నిర్బంధ సైనికశిక్షణమునకును మారణయంత్ర సాధనములకును వినియోగించి అశాంతిదేవతను ప్రతిష్ఠించినవి. మారణక్షేత్రములందు శాంతిసస్యములు పండుచున్నవని యానందించినవి. ఐరోపా మహాసంగ్రామము కన్నులను విప్పినను ప్రాతవాసన లింకను ప్రపంచమును పీడించుచున్నవి. ప్రపంచశాంతికిని మానవధర్మాభ్యుదయమునకును నవధర్మోదయమును రాజ్యనీతిజ్ఞులు ధర్మాత్ములు తత్త్వజ్ఞులు సకలజనులు పరితపించుచున్నను ధర్మకర్తవ్య మగమ్యగోచరముగ నున్నది. ప్రపంచప్రవృత్తియందు భోగార్థమైన స్వార్థము పీడను ద్వేషమును దుఃఖమును, త్యాగార్థమైన పరార్థము శుభమును ప్రేమను సుఖమును, నొడగూర్చును. ప్రపంచము స్వార్థపరమైన ప్రతిఘటనమునకు మహాదుఃఖము ననుభవించుచున్నది. పరమార్థమైన త్యాగసాధనమునను సుఖము ననుభవింపగలదు. అహింస సత్యము ప్రేమ పరమార్థమైన త్యాగధర్మమునకు మూలబీజములు. గాంధిమహాత్ముఁ డీపరమార్థమును నసహాయోద్యమ రూపమున ననుష్ఠించి ప్రపంచశాంతి కాత్మసమర్పణమును జేసి స్వారాజ్యసిద్ధిని బొందెను. భారతపుత్రులు గాంధిమహాత్ముడు ఢిల్లీ-బార్డోలీ సంకల్పమునందు విధించిన స్వరాజ్యవ్రతానుష్ఠానమును శాంతిమార్గమునఁ జేసి స్వారాజ్యసిద్ధినిబొంది శాంతిస్థాపనమునకు మార్గదర్శకు లగుటకు భగవంతుఁ డనుగ్రహించుఁగాత!

శ్లో. కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి

ఓమ్ శాంతి శ్శాంతిః.

ఇండియా యేజన్సీ బీరోవారి

# కొనుడు! జాతీయ గ్రంథములు ఆదరింపుడు!!

చదువుడు; నూతనోజ్జీవనమును బడయుడు. వానిని చదివి ప్రజలకు బోధింపుడు;
మీరు వారలలో ఆత్మగౌరవమును, ఆత్మవిశ్వాసమును, ధైర్యమును, దేశప్రేమను రగుల్కొల్పగలరు.

## మాచే ప్రచురింపబడిన గ్రంథముల పట్టీ

| | రూ. | అ. | పై. | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| హైందవస్వరాజ్యము (మహాత్మాగాంధివిరచితము) | 0 | 10 | 0 | [illegible]సందేశము (రెండవ కూర్పు) | 0 | 6 | 0 |
| స్వరాజ్యమేనిఫెస్టో (సి. ఆర్. దాసు గారిచే వ్రాయబడినది) | 0 | 3 | 0 | చిత్తరంజనుని జీవితము | 0 | 8 | 0 |
| | | | | చిత్తరంజనుని జీవితము | 0 | 4 | 0 |
| స్వరాజ్యగీతములు ఒకటి, రెండు భాగములు, (ప్రభుత్వ కైంకర్యము (గరిమెళ్ల సత్యనారాయణ గారివి) | 0 | 7 | 0 | టెరెన్సు మాక్స్విని జీవితము | 0 | 6 | 0 |
| | | | | చిత్తరంజనుని ఉపదేశములు | 0 | 1 | 0 |
| | | | | గాంధిమహాత్ముని విచారణ | 0 | 1 | 0 |
| ఆరోగ్యసాధనము (గాంధిమహాత్మునిది) | 0 | 8 | 0 | సహాయనిరాకరణ విజయము | 0 | 1 | 6 |
| భారతవిజ్ఞానరహస్యము ([illegible]) | 0 | 10 | 0 | స్వరాజ్యపత్రము | 0 | 1 | 6 |

## మావద్ద నీ క్రింది గ్రంథములుకూడ దొరకును

| | రూ. | అ. | పై. | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| గాంధిమహాత్ముని సంపూర్ణజీవితము | 1 | 8 | 0 | యుద్ధసంబంధ ముకద్దమాలో తెలుగుభాషలో | | | |
| [illegible] గారి ఆధిక చరిత్ర | 1 | 8 | 0 | (వ్రాయబడి యుండలేదు) | 0 | 8 | 0 |
| పంజాబుదురంతములు | 1 | 2 | 0 | మద్యపానము | 0 | 10 | 0 |
| ఆంధ్రవీరులు | 1 | 4 | 0 | మహాత్ముని చెఱసాలానుభవములు | 0 | 10 | 0 |
| అబలాసచ్చరిత్రరత్నమాల | 1 | 4 | 0 | దాదాభాయి నౌరోజీ జీవితము | 0 | 8 | 0 |
| నిరుద్ధభారతము (అస్పృశ్యులను గురించి యున్నది) | | | | రామతీర్థుని జీవితము మొదలగునవి | 0 | 8 | 0 |

సంపాదకుడు:— ఆచంట సత్యనారాయణ, బి. ఏ., ఇండియా ఏజన్సీబీరో, తిరువల్లిక్కేణి, మదరాసు.

## ఆంధ్రపత్రిక — ఉగాదిసంచికలు

మావద్ద 9 సంవత్సరముల సంచికలుమాత్ర మున్నది. తిరిగి అచ్చుపడనేరవు. ఒక సంవత్సరం సంచిక వెల 0-8-0 మాత్రమే. పోస్టేజి ప్రత్యేకము.

## ఆంధ్రపత్రిక చందా ఏర్పాటులు

1921 వ సం॥ మార్చి మొదటితేది నుండియును నీ క్రిందివిధముగ చందాలు ఏర్పాటు చేయబడినవి.

| | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| దినపత్రిక | సంవత్సర | చందా రూ | 24 | 0 | 0 |
| ,, | అర్ధసంవత్సరము | ,, ,, | 12 | 0 | 0 |
| ,, | మూడుమాసములు | ,, ,, | 6 | 4 | 0 |
| ,, | మాసమునకు | ,, ,, | 2 | 2 | 0 |
| వారపత్రిక | సంవత్సరము 1-కి | ,, ,, | 4 | 0 | 0 |

వారపత్రిక సంవత్సరమునకు తక్కువ చందాకు పంపబడదు.

సంవత్సరాది సంచిక

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| దినపత్రిక సంవత్సర చందాదారులకు | 1 | 0 | 0 |
| దినపత్రిక సంవత్సరపు తక్కువ చందాదారులకు | 1 | 4 | 0 |
| వారపత్రిక చందాదారులకు ... | 1 | 4 | 0 |
| ఇతరులకు ... ... ... | 2 | 0 | 0 |
| ☞ ప్రస్తుతము పోస్టలు రూల్సు ప్రకారము | 0 | 2 | 0 |

రిజిష్టరు చార్జి అధిక మగుచున్నది. మీరే ముందుగ మనీ యార్డరు పంపిన ఈఖర్చు తగ్గును.

మానేజరు:—ఆంధ్రపత్రికాకార్యాలయము, 7. తంబుశెట్టి వీధి, మద్రాసు.

# అసహాయోద్యమము

భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు గారు

అసహాయోద్యమము ప్రారంభమై రెండుసంవత్సరము లైనదని చెప్పవచ్చును. ఈ రెండు సంవత్సరముల కాలములోను భారతజాతీయతాస్వరూ

**స్వరూపము**

పము సంపూర్ణముగ మార్పుచెందిన దని సామాన్యులకు కూడ స్పష్టముగు నున్నది. ఉద్యమము లో నిమగ్నులై యున్న ప్రచారకులకును ప్రముఖులకును నాటినాటికి గలుగుచున్న రూపభేదములు గుర్తించుటకు కష్టముగ నుండవచ్చును. కాని ఈరెండు సంవత్సరముల చరిత్రమును సింహావలోకనము చేసినచో దేశమునందు గలిగిన పరివర్తనము గోచరింపకపోదు. ప్రతిదినమును పెంచుచున్న తల్లికి బిడ్డలయొక్క రూపభేదములు తెలియక అప్పుడప్పుడు చూచు బంధువర్గమునకు ఎట్టివిధమున నాభేదములు స్పష్టపడునో అట్లే అసహాయోద్యమముచే గలిగిన గాఢమగు మార్పులు దూరస్థులకును అప్పుడప్పుడు పరీక్షించువారికిని బాగుగ వ్యక్తపడును.

ఆంగ్లదేశపరిజ్ఞానమునే పూజించి వారి రాజకీయ సాంఘిక ధార్మిక సంస్థలనే ఆదర్శముగ నెంచుకొనిన భారతీయులు ఇప్పుడు నలుదిక్కులను భారతజాతి తమ కనువుపమైనరీతిని వికాసము చెందవలెనని కోరుచు - అట్టి పరిపక్వమునకై కృషి సల్పుచున్నారు. పూర్వపు వాదాలు మారినవి. వెనుకటి గ్రంథాలు మారినవి. ఆ కాలపు కుస్తులు సహా మారినవి. ఊహాలు - బుద్ధులు - ఆశలు - ఆదర్శములు - ఇవన్నియు గూడ బాహ్యపు చిహ్నలతో పాటు మార్పు చెందినవి. కార్యశూరుల కున్న గౌరవము వక్తలకు లభించుట లేదు. త్యాగశీలునికి లభించు గణ్యత మత్తెవ్వరికినిలభించుటలేదు. వచోవైదగ్ధ్యమునకంటె చిత్తశుద్ధి యెక్కువగా బరిగణింపబడుచున్నది. పట్టణవాస్తవ్యులు గ్రామవాస్తవ్యులచే దూరీకృతులుగ జేయబడినారు. ఆంగ్లవిద్యకు గణ్యతియు వాడుకయు నశించి - భారతజాతికి హిందీభాషయే సామాన్యభాష నేర్పడి - ప్రజలమనస్సులు ఆంగ్లభాషనుండి దేశీయభాషలవైపు మరలింపబడినది. దేశీయమహాసభవంటి పండితసభయందు ఆంగ్లవాగ్ధారలు ఎక్కడను వినబడవు. సభయొక్క కార్యక్రమమంతయు ఉపన్యాసభూయిష్ఠమైనదిగ గాక కార్యాచరణకు సంబంధించిన వ్యవహారకాండను నిర్ణయించునదైనది. ప్రజాప్రతినిధ్యము పూర్వమువలె బూటకముగాక - వోటును దాసియొక్క విలువను గుర్తెరిగినవారై ఎన్నికలవలననే నిర్ణయింపబడుచున్నది. చిరకాలమునుండి అదృశ్యముగ విధింపబడిన దాస్యమునుండి ప్రజలకు విమోచనముగలిగింపవలెననిఆసేతుహిమాచలము - ఒక్క భావము - ఒక్క పరమావధి - ఒక్కలక్ష్యము - ప్రజలమనస్సులయందు తాండవ మాడుచున్నది.

దేశమునందు అనేకులు తమభాషలను ఉపేక్షించి అయినను పరభాషలను అదలి సారస్వతమును

**పారతంత్ర్యక్రమము**

గ్రోలి తత్సహాయముచే భౌతికశ్రేయస్సును బొందుచు నధికారమును ధనమును గలవారైనప్పుడు ప్రజలు దాస్యమునం దున్నారనుమాట కొందఱి కెంతయు కర్ణకఠోరముగ నుండవచ్చును. కాని ఒకరాజ్యము మఱియొక రాజ్యముచే బరిపాలింపబడునప్పుడు జరిగెడి పెల్లని మార్పులయొక్క పరిణామక్రమమును మనము తెలిసికొనినచో దాస్యము లేదనుకొనుటయే దాస్యావస్థయొక్క ప్రధానలక్షణమును కడపటి రుజువును అయియున్న దని మనకు తెలియగలదు. ఒకరాజ్యమును మఱియొక రాజ్యము జయించినప్పుడు పూర్వము విజేతలు పరాజితులనుండి కప్పములను పొందెడివారు. లేదా ఆదేశమునందు ఉండెడి భాగ్యమును కొల్లగొట్టుకొని పోయెడివారు. ఈభాగ్యము ప్రజలది కావచ్చును లేక ప్రభువులది కావచ్చును. ఒక్కసారియే తీసికొని పోవచ్చును లేదా ఏటేటను శాసనరూపము దాల్చిన రాజ్యాంగపద్ధతుల వలనశాశ్వతముగనైన తీసికొనిపోవచ్చును. కొన్ని సందర్భములలో ఓడిపోయిన దేశమునం దుండెడి ప్రకృతిభాగ్యములను స్వాధీనపరచుకొనుటయే విజయముయొక్క ముఖ్యోద్దేశమై యుండును. ఇట్టి ఆర్జన మంతయు నత్యంత శీఘ్రముగను తక్కువవ్యయముతోడను సైనికబలమువలనఁ జేయనగును. పిమ్మట రాజనీతియు

వాణిజ్యనైపుణ్యమును విద్యావిషయికము లగు శక్తులను పరాధీనతను ఘనీభవింపజేయును. మనదేశమువలెనే ఐర్లాండుదేశమును ముఖ్యముగ వర్తకమువలననే ఆంగ్లేయులకుజిక్కి పరిపూర్ణ దాస్యత నొందినది. గృహపరిశ్రమలు అచ్చటను ఇచ్చటను గూడ నశించి ఇంగ్లాండునుండి దిగుమతియైన విదేశపుసరకులవలన నిర్మూలము పొందినవి. దేశమునందు ఉత్పత్తియైన దుస్తులయందు ప్రజలకు హేయము గలిగి విదేశపుఫక్కీలయెడల నభిమానము ఉత్పన్నమైనది. ఆభావ-ఆమాట-ఆముచ్చట-ఆదుస్తులు-ఆపేరు-ఆపద్ధతులు-ఆరూపు-ఆనడక ఆకత్తు-ఆకచ్చేరీలు-ఆపోలీసు-ఆపరిపాలన-ఆకళాశాలలు-ఆబిరుదములు-ఆవిద్య-అంతయు "ఆ" ఏ కాని "ఈ" ఎక్కడను కనుపింపదు. పారతంత్ర్యమేగాని స్వాతంత్ర్యము కనుపింపదు. దాస్యమేగాని స్వేచ్ఛ కనుపింపదు. స్నానమునకు సబ్బు-చీకటిలో దీపము-కట్టుటకుబట్ట-బిడ్డకు పాలు-గంజిలోనికి ఉప్పు-పాలలోనికి పంచదార-కాలికిచెప్పు-నెత్తికి గొడుగు- ఈయన్నిటి దాస్యమే సందర్భమైనది. మన గృహపరిశ్రమలు నశించినవెంటనే పై వస్తువుల నన్నిటిని షాపులలో బెట్టి కాని-మూలధనము కూడ లేని పాశ్చాత్యులు ఓడ దిగి బ్యాంకులలోనికి పోయి ఋణములు తెచ్చుకొని- పెద్దపెద్దషాపులు పెట్టి- చేతికర్ర మొదలు తోలుపెట్టెవరకు సమస్తమైన వస్తువులును మన కందజేయుచున్నారు. వీని నన్నిటిని కొని-చూచి-ధరించి-తిని - మనము ఆనందించుచున్నాము. దీనికంతకును మూలము - మన రుచులను మన పరిపాలకులు మార్పగలిగినారు. మనతత్వమును మార్చినారు. వీటినన్నిటి నుండియు ప్రజలదృష్టిని తిరిగి దేశీయపరిస్థితుల వైపునకు మరలింపజాలనంత కాలము-ఎన్నిహక్కులు వారికిచ్చినను-ఎన్నిహోదాలిచ్చినను- ఎన్ని అధికారముల నిచ్చినను-వారిదృష్టి లండనువైపు తిరుగును గాని ఢిల్లీవైపునకు తిరుగదు. సీమకై చూచుచుండును గాని భారతవర్షము మీద నిలువదు. అసహాయోద్యమము ఈదృష్టిని ఇట్లు మళ్లింప నుద్దేశింపబడిన మహోద్యమము.

ఈ విప్లవమునే స్వరాజ్యము ననెదము. స్వరాజ్యము పరిపక్వమైనఫలము కాదు. కాని పరిపక్వము నొందించుపద్ధతి.

**స్వరాజ్యము - వాని యర్థము**

స్వరాజ్యము అధికారమును చలామణిచేయు హక్కు కాదు. కాని, అధికారమును కోరు ఆత్మగౌరవము స్వరాజ్యము విదేశవస్తువులను దిగుమతి కాకుండ నాపివేయు శాసననిర్మాణ స్వాతంత్ర్యము గాదు. కాని, అట్టివస్తువులను ఉపేక్షింపకుండ నుంచు చిత్తశుద్ధి. స్వరాజ్యము బాహుబలముచే పరులను నోడింపగల సైనికశక్తి గాదు. కాని పరులతో నిట్టి సంఘర్షణలను నివారింపగలిగిన ఆత్మబలము. స్వరాజ్యమును నిర్వచించుట కష్టము. బ్రాహ్మణులకు అది వైదికకాల పునరాగమనముగను కార్మికులకు నది కళాకౌశల్యపునరుద్ధారణముగను పంచమున కది అస్పృశ్యతాదోషనివారణముగను గనుపింపవచ్చును. ఎవరిచూపునకు అనురూపమైన దర్శనము వారికి గలుగుచుండును. పేదవానికిస్వరాజ్యమనిన అన్నము. దిగంబరునకు స్వరాజ్యమనిన బట్ట. దిక్కులేనివానికి స్వరాజ్యమనిన సంరక్షణము. యోగికి స్వరాజ్యమనిన శాంతము. కాని భారతభూమికి స్వరాజ్యమనగా ఒకనూతనసృష్టి. అట్టిసృష్టివలన- లేమిలో నున్నవారికి కలిమియు-వ్యాధిగ్రస్తునకు ఆరోగ్యమును-చిత్తసంక్షోభమొందువానికి శాంతియు- అజ్ఞానభూయిష్ఠులకు జ్ఞానమును- తక్కినయందరికిని ఒక నూతనజీవితమును- ఒకనూతన ఆదర్శమును - ఒకనూతన ఆనందమును- గలుగును.

ప్రకృతియందు ఇట్టి పరివర్తనములు లేకపోలేదు. భవిష్యత్తు ఎన్నడును భూతమునకు సంబంధించని కాలగతి కానేరదు. వర్తమాన భూత భవిష్యత్తులు కాలచక్రముయొక్క భిన్నస్థానములు. ఇట్టి కాలచక్రముయొక్క గతి సమరేఖవలె గాక మెలివలె నుండును. ముందుకు వెళ్లినను వెనుకచూపు త్యజింపజాలము. భూతభవిష్యద్వర్తమానములను సమన్వయము చేసి - సృష్టి నంతను ప్రకృతియొక్క వికాసముగ ప్రజ్వలింపజేయు మహాశక్తి ఈప్రపంచమును నడుపుచున్నది. ప్రకృతియందే ఇట్టి తీవ్రమగు పరివర్తనములు అప్పుడప్పుడు కనుపించుచుండును. అగ్నిపర్వతమునుండి మహాజ్వాలలు వెడలి చుట్టుప్రక్కలనున్న సృష్టినంతను నశింపజేయునపుడు - ఆయగ్నిపర్వత గర్భమునందు జరుగుచున్న మార్పులు-ఎంతకాలమునుండియో జరుగుచుండియుండవలయును. అటులనే భూకంపములు- పిడుగులు- తోకచుక్కలు- మున్నగు ఉపద్రవములన్నియు తాత్కాలికములుగ కనుపించినను చిరకాలపరిపక్వములఫలితము లని మనము గ్రహింపవలెను. ఇవ్విధముననే భావప్రపంచమునందు జరుగు పరివర్తనములుగూడ కాలక్రమమున నగు

పరిణామఫలితము లేయగుఁ గాని తాత్కాలిక ప్రదర్శనము లుకాజాలవు. రుష్యాలో జరిగినవిప్లవము 1918లో జరిగినను- ఏబదిసంవత్సరముల క్రింద నాటబడిన బీజమునుండి ఉద్భవించిన-మహావృక్షముయొక్క ఫలిత మనుటకు సందియము లేదు. సామ్రాజ్యములు నశించునపుడు గాని- నూతనరాజ్యములు సృష్టియగునపుడు గాని- పరిణామ క్రమముయొక్క గతి యిట్లే యుండు నని మనము ఊహింపనగును. భారతవర్షమున కూడ స్వరాజ్యము గావలెనని ప్రజలయొక్క మనస్సులను - సాంఘికసంస్థలను - నైతికధర్మములను- పునర్నిర్మాణము చేయుగల మార్పు వారియందు అంకురింపవలెను. అట్టిమార్పు ఈయుద్యమమువలన గలిగిన దని చెప్ప సాహసించుచున్నాము.

ఉద్యమముయొక్క చరిత్రము

1914 వ సంవత్సరములో ఐరోపామహాయుద్ధ ప్రారంభము. 1915వ సం॥లో ఇండియాదేశము సంరక్షణ శాసనము. 1916వ సం॥లో స్వరాజ్యోద్యమ (Home Rule) యత్నములు. 1917 వ సం॥లో పార్లమెంటు ప్రకటనము 1918వ సం॥ లో రౌలటుబిల్లు, పంజాబులో సర్ మైకలుఓడ్వాయరు గారి విజృంభణము. 1919వ సం॥లో సత్యాగ్రహారంభము. పంజాబు దురంతములు, అమృతసరు కాంగ్రెసు. 1920 వ సం॥ము ప్రారంభములో పంజాబునుగూర్చిన కాంగ్రెసు రిపోర్టు. ఐరోపాయుద్ధ పర్యవసానముగ ఖిలాఫతు విషయమై టర్కీకి గలిగిన పరాభవము - హంటరుని వేదికము - డయరుసమర్థనము మహమ్మదీయుల ఆశాభంగము భారతీయులెలర నిరాశ- ఇవన్నియును చరిత్రాంశములు. అదివఱకు గాంధి సత్యాగ్రహోద్యమమును ఆరంభించి రౌలతుశాసనముయొక్క రద్దుకొరకై యత్నము చేసియున్నను 1919 సం॥ము మార్చి 30 మొదలు ఏప్రియల్ 15 వరకు ఢిల్లీ అమృతసరము కాసూరు గుజరనువాలా అహమ్మదాబాదు వీరాంగం మొదలగు ప్రదేశములలో జరిగిన అల్లరుల ఫలితముగ గాంధి తనయుద్యమమును సంక్షేపించుకొని తుదకు అమృతసరు కాంగ్రెసునందు సంస్కరణలను ఆచరించవలెననియే తనయభిమతమును చూపెను. కాని 1920 వ సం॥ములో ఏప్రియల్ ప్రాంతములో ఎప్పుడు టర్కీ సంధిషరతులు సుల్తానుయొక్క పీఠాధికత్యమునకు భంగము కలుగజేసి రాజ్యవైభవమును సంకుచితము గావించెనో, ఎప్పుడు డయరు సేనాని తనసాక్ష్యమునందు ఒప్పుకొనిన సందర్భములగూడ నుపేక్షించి మంత్రివర్గమువారు ఆయనయొక్కయు-నాయన సహచరులయొక్కయు దోషములను పూసిపెట్టిరో-అప్పుడు- చిరకాలమునుండి గాంధి యొక్క రాజకీయజీవితమునకు మూలాధారులైన ఆంగ్లులయెడలగల భక్తివిశ్వాసములు సంక్షోభము చెంది-గాంధి- భారతీయులయొక్క మోక్షము ఆంగ్లులవలన గలుగక భారతీయులయొక్క సాధనలచేతనే లభింపవలె నని నిశ్చయముచేసికొనెను. ఇట్లు కృతనిశ్చయుడై గాంధి అసహాయోద్యమమనెడు మహాప్రళయతుల్యమగు సంచలనమును దేశముయొక్క నలుదెసలను ఉత్పన్నముచేసి భారతీయులెల్లరను నూతనాదర్శవికాసితులుగను, నవ్యభారత జాతీయతాతత్పరులుగను, మంత్రజలముచేవలె క్షణమాత్రములో మార్పుగావించి నూతనశకమును 1920 సంవత్సరము మార్చి 19 వ తేదీని యావద్భారతహరితాళముతో ప్రారంభింపజేసెను. కాని ప్రజల కందఱకును నొక్క మందలింపు మాత్రము ఒసంగబడెను. "మనోవాక్కాయకర్మలయందైన నెచ్చటను హింసపనికిరాదు." హింసనుగూర్చి గాంధిగారీరీతిని 1920 సం॥రము మార్చి 10 వ తేదిని విరాఘాటముగ వచించెను:—

దొరతనమువారికి అన్నిసందర్భములయందును "అహింసాపూర్వకమైనట్టువంటి, అసహాయోద్యమమే ప్రజలకు సాధ్యమైన ప్రతిక్రియ. ఏవిధమైన సంఘబహిష్కారమును ఉపయోగించెదమని బెదరింపరాదు. దొరతనమువారికి సహాయము చేయరాదనుట స్వచ్ఛందముగ నుండవలెను. ఏక్షణమందు హింస కావింపబడునో, లేక బోధింపబడునో, లేక సమర్థింపబడునో,ఆక్షణమందే సేనీయుద్యమును మానుకొనెదను. కావున వక్తలెల్లరకు నొకసలహా నిచ్చెదను. ఎంత రెచ్చగొట్టినను-అపారమైన స్వయంనిగ్రహత్వమును చూపవలెను. ఎప్పుడు మనము పట్టుదలను, సౌమ్యమును చూపగలమో, అప్పుడు మనకు జయము నిశ్చయము. కాని కోపము- అనాయ-ఈర్ష్య-నిర్లక్ష్యము-దౌర్జన్యము ఎప్పుడు మనయందు ప్రబలునో అప్పుడు మనకు అధోగతియగును. నేను ఒంటరిగాడనైనను వీనినన్నిటిని నాప్రాణముల నర్పించియు నిరోధించెదను. ప్రపంచములో స్నేహమే నాప మావధి. దోషమును ఎంతగాఢముగనైన నిరోధింపగలను. కాని ఇట్టి నిరోధముతోపాటు పరిపూర్ణమైన ప్రేమభావము అవలంబింపగలను."

1920 ఏప్రియల్ 6 మొదలు 13 వఱకు పంజాబు దురంతములను జ్ఞప్తికి దెచ్చుకొనుటకు జాతీయవారముగ నిశ్చయింపబడెను ఏప్రిలు 9 వ తేది ఖిలాఫతు దినముగ నిర్ణయము గావింపబడి బొంబాయినుండి గాంధి ఇట్లు తీర్మానము గావించెను.

"ముసల్మానులయొక్క కోరికలు ఈడేర్పబడక ప్రతికూలమైన తీర్మానము గావింపబడినచో ముసల్మానులకు చేయబడిన ప్రతిజ్ఞ నెరవేర్పబడువఱకు గవర్నమెంటునకు అన్నివిధములైన సహాయములను మానుచేసికొనుట ప్రతిఖిలాఫతీయుని కర్తవ్యమగును."

తరువాతి సహాయనిరోధ్యమముయొక్క నాలుగు సోపానములును తీర్మానరూపకముగ చెన్నపట్టణమందు గావింపబడిన ఖిలాఫతు మహాసభయందు 1920 సం॥ ఏప్రియల్ 17 వ తేదీని గావింపబడెను. అనతికాలములోనే అసహాయోద్యమమునకు పోషణకారణములుగ ఖిలాఫతు సమస్యయే గాక పంజాబు దురంతములును సంస్కరణలయొక్క అపర్యాప్తతయును చేర్పబడెను. ఇది మే 30,31 తేదీలయందు కాశీయందు జరిగిన అఖిల మహాభారతసభయందు జరిగినది. జులై ఆరంభములో వైస్రాయిగారికి మాసము రోజులు వ్యవధి ఇచ్చుచు ఒక లేఖ వ్రాయబడెను. ఆగస్టు 1 తేదిన అసహాయోద్యమము సక్రమముగ నారంభింపబడి సెప్టెంబరు 4 వ తేదిని కలకత్తాయందు జరిగిన ప్రత్యేక దేశీయ మహాసభయందు ప్రజామోదమునొందెను అంతవరకు ఒంటిగ్గమీదనిల్చిన ఈ అసహాయోద్యమపాత మరియొకగడను అధారముగ సంపాదించెను. గాంధి దేశీయనాయకులలో సెప్టెంబరు 8 వరకును ఒంటరిగాడై యుండెను. కలకత్తామహాసభలో పండితమోతీలాలు నెహ్రూగారియొక్క సానుభూతి సంపాదింపగలిగెను గాని సభాధ్యక్షుడుగనున్న లాలా లజపతిరాయిగారు సభానంతరముకూడ వ్యతిరేకాభిప్రాయమును వెలిపుచ్చిరి. కలకత్తాలో జరిగిన మహాసభలో ఇండియాలోని రాజధానులయందు నెల్ల నుద్యమమునకు వ్యతిరేకముగ నుండియున్నది మధ్యరాష్ట్రములు. ఆసంవత్సరము దేశీయమహాసభకూడ మధ్యరాష్ట్రములోని నాగపురమునందే జరుగవలసియుండెను. బంగాళాదేశమునకును మహారాష్ట్రమునకును ఈ అసహాయోద్యమ కార్యక్రమము నచ్చియుండలేదు. దాసుగారు 40 వేల రూప్యములను ఖర్చుపెట్టి రెండువందల ప్రతినిధులను నాగపూరు కాంగ్రెసునకు తీసికొనివచ్చి తనపక్షమువారును జితేంద్రలాలు బెనర్జీగారి యాధిపత్యము క్రింద వచ్చిన ప్రతినిధులును-చేతులు కలుపుకొని-చివరకు నాగపురమునందు ప్రజలెల్లరు ఏకగ్రీవముగ తీర్మానమును ఆమోదించిన పిమ్మట అపజయమునొంది స్వదేశమునకేగి పశ్చాత్తాపపీడితులై కాంగ్రెసుపక్షావలంబులు అయ్యెరు. అదివఱకు మితవాదులపై కత్తిగట్టి పోట్లాడుచుండిన జాతీయవాదులెల్లరగతియు నీవిధముననే పరిణమించెను. కాని దాక్షిణాత్యులు చిత్తరంజనదాసుగారుచూపిన ఔదార్యమునుగాని త్యాగశీలతనుగాని చూపజాలక జాతీయవాదుల మనుబింకముతో మితవాదదూషణముతోడను, అసహాయోద్యమోపేక్షతోడను కాలము గడపుచు నేటివఱకు ఇంచుమించుగ నట్టి త్రిశంకుస్వర్గమునందే నిల్చియున్నారు. కాని ఉద్యమము ప్రళయతుల్యమై నలుదిక్కులను వ్యాపించి ఎదురునిల్చినవారిని తుడిచిపెట్టుట సాగించుటజూచి అనేకులు బలమైనపక్షముననే తమబలమునుకూడ మొగ్గువేయింప సాగించి 1921 సం॥రము జూను ప్రాంతములకు దేశములో మితవాదులు కానివారెల్ల సహాయనిరోధ్యమమునందే చేరిరి. ఇప్పటికి అనగా జూనుమాసమునకు ఉద్యమము అత్యంతమైన జయము పొందియుండెను. వెనుకటి సంవత్సరపు నవంబరులో జరిగిన ఎన్నికలలో సకరమైన జాతీయవాదులలో నెవ్వరును శాసనసభలలోనికి ప్రతినిధులుగ వచ్చియుండలేదని దొరతనమువారును మితవాదులును సమగ్రముగ సూచించియుండిరి.

1921 వ సం మార్చి 31, ఏప్రియల్ 1 వ తేదుల యందు బెజవాడలో కృష్ణాతీరమందు జరిగిన అఖిలభారత మహాసభయందు తీర్మానింపబడిన కోటిమెంబర్లు కోటి రూపాయలు-ఇరువదిలక్షలరాట్నములు - జూనుమాసాంతమునకు సమాప్తి పూర్తియయ్యెను. మరియును 2000 మంది న్యాయవాదులు తమవృత్తిని వదలిపెట్టిరి. ఒక్క కలకత్తా విశ్వవిద్యాలయము క్రింద 50 వేల మంది విద్యార్థులు తమవిద్యను మానుకొనిరి. తక్కిన ప్రాంతములలో కూడ నీరీతినే పాఠశాలలబహిష్కారము జరిగి జాతీయ విద్యావ్యాపకము కొనసాగుచుండెను. జులై 29 వ తేదీని బొంబాయిలో జరిగిన అఖిలభారత మహాసభయందు శాసనోల్లంఘనము గావింపవలెనని సభ్యులు అమితోత్సాహమును జూపిరి గాని నాగపూరు తీర్మానమునందు శాసనోల్లంఘనము గావించుటకు అధికారము ఒసగబడియుండలేదని అధ్యక్షుడు విజయరాఘవాచారిగారు అభిప్రాయపడుటచేత నేమి-లేక పరిస్థితులు పరిపక్వము కాలేదనుటచేనేమి-అప్పటి కాయుద్యమము ఉపేక్షింపబడి అందరికిని అనుకూలముగ నుండునట్లును, నిజముగ ఎవరిని మెప్పింపనట్టి తీర్మానమొకటి అప్పుడు గావింపబడెను. కాని ఆసభయందు ముఖ్యముగ మగ్గములగూర్చి హెచ్చరింపు చేయబడెను. ఇంతటిలో దేశమునందెల్ల ఒక మహాప్రయత్నము అంకురమై యుండెను. మద్యపానము

నెడల ప్రజలకు గలసహజమగు నిరసనమును దొరతనము వారిపై నూతన ఆయుధముగ వినియోగింపదలచి కల్లు సారాపాటలయందు వేలములు జరుగకుండను దుకాణములవద్ద పాటలుసాగకుండగను ప్రజలు గస్తీలు వేయుంచుచు స్వచ్ఛందసైనికులను ఏర్పాటుచేసి ఒక్కచిన్న రాజధానియందు కల్లుపాటలలో 83 లక్షల రూపాయల నష్టమును గవర్నమెంటువారికి కలుగజేసిరి. ఇట్టిగస్తీలను దొరతనమువా రాక్షేపించుచుండగ గస్తీలువేయుట ప్రాతిపదిక స్వాతంత్ర్యమనియు, వ్యక్తిశాసనోల్లంఘనము కాజాలదనియు, నిరుపద్రవకరముగ జరుపబడినంత కాలము వీటి కెట్టియాక్షేపణ లుండరాదనియు బొంబాయిలో తీర్మానింపబడెను. కాని మద్యపాననిర్మూలమునకును విదేశవస్త్రబహిష్కారమునకును గస్తీలు వేయుంచుట కాంగ్రెసు కార్యక్రమములోని అంశములును స్వచ్ఛందసైనికుల ఆవశ్యకర్తవ్యములు కావు. ఇవి ఎట్లు పరిణమించెనో అనంతరము చూతము. బొంబాయిసభ జరిగినపిమ్మట ఆగస్టు సెప్టెంబరు 5వ తేదులవరకు ప్రజలు మగ్గములనుబెట్టుచు ఖద్దరువ్యాపకము జేయుచు కాలము గడపుచుండిరి. బొంబాయిలో జరిగిన సభయందు యువరాజుగారి రాకమొదల అఖిలభారతసభవారు అయిష్టమును దెలిపిరే గాని హర్తాళములు జరుపవలెనని ఉద్దేశము గలిగియుండలేదు. అయినను జులై మాసారంభమున కీదండనీతి దొరతనమువారిచే తీవ్రముగ నవలంబింపబడి మొదట బీహారురంగమును, పిమ్మట సింధు ఆంధ్ర దేశములందును తలయెత్తసాగెను. సెప్టెంబరు 14 వ తేదిని వాల్టేరులో గాంధీతో ప్రయాణముచేయుచున్న మహమ్మదాలీ గారిని - 15 వ తేదీని బొంబాయిలో షౌకతాలీగారిని పిమ్మట కిచ్లూ మొదలగు మరినలుగురు మహమ్మదీయులను - శారదాపీఠాధిపతులగు శంకరస్వాములను పట్టుకొని కరాచీయందు విచారణ జరిపిన విషయము పాఠకులకు తెలిసియేయున్నది. ఇదియే దండనీతిశకముయొక్క తీవ్రప్రారంభము. అలీసోదరులను కట్టుకొనుటకు కారణము కరాచీలో జూనుమాసములో జరిగిన తీర్మానములును ఉపన్యాసములును అని తెలుపబడెను. జమైతుఉల్ ఉలేమావారు 50 మౌల్వీల సంతకము క్రింద నొకఫత్వాను జారీచేయుంచిరనియు నాఫత్వాపై వీరలలో కొందఱసంతకము లుండెననియు వీరిపైనను మరికొందఱిపైనను దోషారోపణము చేయబడినది. పోలీసువారిని, సిపాయిలను దొరతనమువారి కొలువు మానుకొనుడని బోధించినట్లు వీరెల్లరపై దోషారోపణము గావింపబడినది. అనగా అసహాయోద్యమముయొక్క కార్యక్రమములోని రెండుమూడు సోపానములను వీరు ఆచరణలోనికి దేబ్రయత్నించినట్లు వీరిపై దోషారోపణము చేయబడినది. ఎప్పుడు అలీసోదరులపై మోపబడిన దోషము వెల్లడింపబడెనో ఆ వెంటనే గాంధి తిరుచునాపల్లిలో వారు చేసిన ఉపన్యాసమును తానునుచేసెడివాడ ననియు, ఆ ఉపన్యాససారాంశమును తానే వచించెద ననియు చెప్పి ఒక మహోపన్యాసమును ఆపట్టణమం దొసంగి భారతీయులెల్లరకు అపారమగు ధైర్యసాహసములను నొసంగెను. పిమ్మట బొంబాయిలో నక్టోబరు 5 వ తేదీని అఖిలభారతమహాసభా కార్యసభ వారు సమావేశమై అలీసోదరులయొక్క ప్రతిబంధమునకు జవాబుగ నవంబరు 17 వ తేదీని యువరాజుగారు భారతభూమియందు పాదముపెట్టురోజున భారతవర్షమునందెల్ల స్వాచ్ఛందికమగు హర్తాళము జరుగవలెనని తీర్మానించిరి. ఈతీర్మానమే నవంబరు 4,5 తేదుల ఢిల్లీలో జరిగిన అఖిలభారతమహాసభవారు ఆమోదించిరి. ఇందే శాసనోల్లంఘనముకూడ సాంతముగ చర్చింపబడెను.

శాసనోల్లంఘనము వ్యక్తిశాసనోల్లంఘన మనియు సమష్టిశాసనోల్లంఘన మనియు రెండువిధములుగ విభజింపబడెను. వీనికి వలయు నిర్ణయము లన్నియు స్పష్టపరుపబడెను. ప్రతివ్యక్తియు నూలువడుకుట నేర్చియుండవలెననియు, అహింసాతత్వమును పూనవలె ననియు, హిందూమహమ్మదీయైక్యమున నమ్మకము గలిగియుండవలెననియు, అస్పృశ్యతాదోషము, జాతీయతకు కళంకమని నమ్మి తనజీవితమునందు అట్టి నమ్మకమును ఆచరణరూపకముగ చూపవలె ననియును దీర్మానింపబడెను.

సమష్టిశాసనోల్లంఘనమునకు కూడ నీనిర్ణయములన్నియు వర్తించుచుండ నింకనుతోడు నిషేధింపబడిన సభలు జరపునప్పుడు - అవి నిర్ణీతప్రదేశమునందు నిర్ణీత సంఖ్యగల ప్రజలతో టిక్కెట్లమీద, జరుపబడవలె నని తీర్మానింపబడెను. ప్రజలందఱు ఈ శాసనోల్లంఘనమునకై వేచియుండిరి. ఇదివఱకు జామీనుసెక్షనుల క్రింద తమపై అభియోగములు తేబడినప్పుడు ప్రతివాదములేక జైలుకుపోవుచుండిరి. కాని, 144 సెక్షను క్రింద నిషేధపుత్తరువులు అమలుపఱచబడినప్పుడు వాటి నుల్లంఘించుట లేదు. అందుకు నలయునధికారము కాంగ్రెసు నుండి వచ్చియుండలేదు. ఇప్పుడు అట్టి అధికారము కలిగి

నది. ప్రజలు విచ్చలవిడిగా పరిపూర్ణమైన సంతోషముతో జైళ్లకు పోవసాగిరి. "అసహాయోద్యమముయొక్క తత్త్వమంతయు నిర్దోషులయొక్క అనిరోధపూర్వక మగు బాధవల్లనే దేశమునకు మోక్షము చేకూరును." అని బోధించిన బోధలను తమజీవితమునందు సార్థకముచేసికొనవలెనని ప్రతి అసహాయవాదియు నాతురముతోనున్నవాడై వ్యక్తిశాసనోల్లంఘనమునకు పూనుకొనెను. ఇంక సమష్టిశాసనోల్లంఘనమును గాంధి తానే బార్డోలీలో ప్రవేశపెట్టెద ననియు నాకార్యక్రమము తాను ఎప్పటికప్పుడు సందర్భములబట్టి విజృంభింపజేయవలె ననియు, ఇందుకుగాను ప్రజలు 100 కి 50 మందికి తక్కువగాకుండ ఖద్దరు కట్టుచు తమపిల్లలను జాతీయపాఠశాలలకు బంపుచు దమగ్రామమునందు అస్పృశ్యతాదోషమును నివారింపజేసి మాలమాదిగలను పాఠశాలలలోనికి చెఱువులయొద్దకు, నూతులయొద్దకు రానియ్యవలయు ననియు, మద్యపాన నిషేధమును గావింపవలయు ననియు, ఈ షరతు లన్నియు నిర్వర్తింపబడవలె నని యీయన నిర్వచించెను. అనగా సమష్టిశాసనోల్లంఘన మనిన దొరతనమువారిపై తిరుగుబాటు అని యీయన భావించి, అట్టి తిరుగుబాటు చేయగలవారు దౌర్జన్యవిరహితపద్ధతులను మాత్రమే యవలంబించు చిత్తశాంతి గలవారై యుండుటయే గాక, పారతంత్ర్యముయొక్క నీచత్వమును - గౌరవహీనమును - గుర్తెఱుగగల్గినవారై యుండవలె ననియు నందుకు బుజువుగ నట్టివారెల్లరు పరదాస్యమును పెంపొందించు లేక ఘనీభవింపజేయు పాఠశాలలనుండియు, న్యాయస్థానములనుండియు, తమబిడ్డలను, తమ్మును మఱలించుకొనగల చిత్తస్థైర్యము గలవారై యుండవలె ననియు, మఱియు మద్యపానము మొదలగు దురభ్యాసములను నిర్మూలము చేయగలిగి అవసరమైనప్పుడు పన్నులను నిలుపుదలచేసి, తమ ఆస్తి పోవుచున్నను సహింపగల చిత్తశుద్ధి గలవారై యుండవలె ననియు, నీ నిర్ణయప్రణాళికను ఢిల్లీయందు గాంధి యేర్పాటు చేసియుండెను. బార్డోలీలో తాను - ప్రత్యేకముగ - తన పై యదుపుక్రింద ఈ సమష్టిశాసనోల్లంఘనమును జేయ బ్రయత్నించెద ననియు, తా నొక్కచోట బ్రిటిషుశాసనమును ప్రజలు జయప్రదముగ నుల్లంఘింప చేయగలిగిననో నితరచోట్ల నిట్టి ప్రయత్నములు అనావశ్యకము లగుననియు దాను చేయజాలనిచో నితరచోట్ల సాధ్యము కా దనియు గాంధి బోధించెను. బోధించి తాను మాత్రము ఈ మహాప్రయత్నమునందు నిమగ్నుడై యుండగా తక్కిన దేశమంతయు వ్యక్తిశాసనోల్లంఘనమును గావించుచుండవలె ననియు, ఎవరును ఖైదును కల్పించి పొందవల దనియు, పరిపూర్ణమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యములతో ఎవరి కర్తవ్యములను వారు నెఱవేర్చుచుండ ఖైదునకు ఆహ్వానము వచ్చినచో అభ్యంతర పెట్టరా దనియు ధర్మనిర్ధారణము చేసియుండెను. కాని ప్రజలకు ఈ హితబోధ అంతగ రుచింపక యుద్రేకపూరితు లగు యువకులు ఖద్దరువ్యాపక మనెడు కఠినకార్యమునకు దగిన ఓపిక పట్టుదల లేనివారై, కార్యముకంటె నుత్సాహమును ఎక్కువగ నెంచి కొన్ని సందర్భములలో తాము ఖైదుకు వెళ్లినచో ప్రజలు అన్యథా భావింతురని తలంపు కలవారై - మఱికొన్ని సందర్భములలో నిష్కల్మషమైన హృదయముతోను, నిర్మలమైన యోచనతోను, కారాగృహములందు వందలకొలది ప్రవేశించిరి. అదివరకు గాంధిమహాత్మునకు కలకత్తా కాంగ్రెసు సందర్భమునను తత్పూర్వమునను అప్పుడప్పుడు తనబోధలు ప్రజలు సంపూర్ణముగ నంగీకరించిన యెడల స్వరాజ్యము సంవత్సరములో చేకూరు నను భావమును అక్షర ప్రమాణముగ (According to Strict Letter, అర్థము చేసికొని అనేకులు అట్టి స్వరాజ్యప్రాప్తిని బలపరచుటకు నిర్దోషు లగు తాము జైలుకు వెళ్లుటయే ప్రత్యేకసాధన మనియును - పరమసాధన మనియును - నెంచి వందలకొలది పౌరులు ఖైదుకు పోవుచుండిరి. ఇదంతయు దేశమునందు నూతన తేజస్సును కలుగజేసెను. జ్ఞానవంతులకు నిజమైన స్వరాజ్యోదయము ఈ త్యాగమునందే పొడసూపుచుండె ననుటకు సందియము లేదు. అజ్ఞానులు స్వరాజ్యసంస్థలకై వెదకులాడుచుండిరి.

ఈప్రకారము జరుగుచుండ నవంబరు 17 వ తేదిని యువరాజుగారి యాగమనసందర్భమున బొంబాయిలో జరిగిన యల్లరులలో 50 మంది ప్రాణములను గోల్పోయిరి. 400 మందికి గాయములు తగిలెను. పార్సీలకును క్రైస్తవులకును, తదితరజాతులయెడ నసూయ పెంపొంది, యీ రెండుజాతులవారును హిందూమహమ్మదీయైక్యము - అనగా చిన్నసంఖ్యగల తమబోటిసంఘములవారికి మహావిపత్తును గలుగజేయు నూతనబలమని - భావింపసాగిరి. అంతట గాంధి మూడుదినము లుపవాసము చేసి స్వ

జాతులవారికిని సామరస్యమును పునఃసంస్థాపన చేసెను. కాని సమష్టిశాసనోల్లంఘనము మానుకొనెను. దేశమునందు అందరు వలయు చిత్తశాంతి - చిత్తస్థైర్యము-చిత్తశుద్ధి - ఇంకను పూర్ణముగ నాటుకొని యుండలేదని గ్రహించి యిట్లు తన ప్రయత్నములను ఉపసంహరించుకొనెను. నవంబరు 20 మొదలు డిశెంబరు 1 వఱకును అసహాయోద్యమము మక్కానులేని పడవవలె సంక్షోభితమగు మహాసముద్రముమీద అల్లల్లాడుచుండెను. అంట రీడింగు ప్రభుత్వ దీక్ష - ఈ పడవకు మార్గము చూపెను. దొరతనమువారిని నవంబరు 17 వ తేదిని బొంబాయిలో జరిగిన హత్యలును అల్లరులును సంక్షోభపెట్టినమాట నిజమే. కాని ఎంతమాత్రము అల్లరిలేకయే చీమ చిటుక్కుమనకయే కలకత్తాలో జరిగిన 17 వ నవంబరునాటి సంపూర్ణహరితాళము వీరిమనస్సును బొంబాయిఅల్లరులకంటె నెక్కువ కలవరపఱచెను. అల్లరులు జరిగినయెడల దొరతనమువారు వానిని తేలికగ నణచివేయగలరు. ఇండియాప్రజ లెల్లరు నొక్కమాటు తిరుగుబాటుచేసి హింసామార్గమును అవలంబించినను-ఆసేతుహిమాచలపర్యంతము-ఈఅల్లరుల నణచివేయగలిగిన- బాహుబలము- అంగబలము- అర్థబలము- ఆయుధబలము - దొరతనమువారియొద్ద నున్నది. బొంబాయి అల్లరులు వారిమనస్సునకు కష్టము కలుగజేసియుండవచ్చును. కాని అది యెన్నడును కలవరపఱచి యుండజాలదు. కలకత్తాలోని శాంతిపూర్ణమైన హరితాళము వారి మనస్సును కలవరపఱచెను. ఆదినమున ట్రాము బండ్లు లేవు. దుకాణములు లేవు. వ్యాపారము లేదు. పాఠశాలలు లేవు. కచేరీలు లేవు. ఏరోపియనులకు హోటలులు లేవు. ఇండ్లయందు బట్లర్లు లేరు. మోటారు బండ్లు తోలుటకు షోఫర్లు లేరు. వీథులలో 3000 మంది జాతీయస్వచ్ఛందసేవకు లుండియున్నను-నగరమున నెచ్చటను అల్లరులు లేవు. 17 వ నవంబరునముననే కలకత్తాయొక్క స్థితి ఆప్రకారముండియున్నచో 24 వ డిశెంబరున యువరాజుగారు కలకత్తాకేగి 3 దినము లుండినప్పుడు ఇంక కలకత్తాస్థితి యెట్లుండవచ్చును? ఇట్టి సమస్య దొరతనమువారిని కలవరపఱచి యుపద్రవము కలిగించని స్వచ్ఛందసైనికులను - దొరతనము ... రిక్షత వకు ఎక్కువహానిని కలుగజేయుచుండె నను తాత్పర్యముతో - స్వచ్ఛందసైనికనిర్మాణ మంతయు శాసనవిరుద్ధములైన సమాజములని-ఆనాటి బాంబులకాలపు త్రుప్పపట్టినశాసనము నొకదానిని పైకిలాగి-బంగాళా అలహాబాదు పంజాబు అస్సాము రాజధానులలోని స్వచ్ఛందసైనికగణము లన్నియు అశాస్త్రీయము లని - ఒట్టుపెట్టుక వీటినన్నిటి నణచివేయ దొరతనమువారు ప్రయత్నించినారు. కాని స్వచ్ఛందసైనికగణము లు ఇందుకు లొంగక యథావిధిని శాసనోల్లంఘనమును జరిపి వేలకొలది ఖైదుకు బోయిరి. చిత్తరంజనదాసుగారు అహమ్మదాబాదు కాంగ్రెసుప్రెసిడెంటుగ నెన్నుకొనబడియును దొరతనమువారిచే పట్టుకొనబడి కాంగ్రెసునుండి దూరస్థునిగ గావింపబడి కడపటకు ఖైదుశిక్ష నొందెను. ఒక్కనాడు-ఈయనయును - కొడుకును - భార్యయును-చెల్లెలును-ఎల్లరును జైలులో నుంచబడిరి. కాని స్త్రీలు వెంటనే వదలిపెట్టబడిరి. తండ్రికొడుకులు మాత్రము జైలులో నున్నారు. అటులనే అలహాబాదులో మోతీలాలు నెహ్రూగారును ఆయనపుత్రుడును జైలున కంపబడిరి. రాష్ట్రీయకాంగ్రెసు కార్యక్రమమును జరుపుటకు సమావేశమైన 53 సభ్యులు ఒక్కసారి ఖైదులో బెట్టబడిరి. అటులనే లజపతిరాయిగారు రాష్ట్రీయసభాసమావేశము జరుగుచుండగా లాహోరులో ఈయన పట్టుకొనబడెను. ఈయనతర్వాత వచ్చిన ఆగాసఫ్దర్ సాహేబుగారును అటుపిమ్మట ప్రెసిడెంటుగానున్న సరదారక్రకుసింగుగారును ఖైదులో పెట్టబడిరి. ఎన్నిజరిగినను యువరాజుగారిస్వాగతము అన్నిపట్టణములయందును హరితాళములతోనే జరిగెను. ముఖ్యముగ అలహాబాదులో జరిగిన హరితాళము ఇంగ్లాండునందును విస్మయము నొందించెను. ఇప్పటికిని వారు అలహాబాదుహరితాళమునే చెప్పుకొని చెప్పుకొని ఆగ్రహాపూరితు లగుచున్నారు.

**దొరతనమువారి నీతి**

మొదటనుండియును దొరతనమువారు ఈయుద్యమముయొక్క నిజస్వరూపమును గ్రహింపలేక పోయినారు. మొదట ఛెలమ్సుఫర్డు ప్రభుత్వ ఇండియాలోను - సింహళ ప్రభుత్వ సీమలోను-ఇది పోషణలేక తనంతటనదియే నశించునని వాక్రుచ్చియున్నారు. కాని హింస, దౌర్జన్యములనుతక్కించుట ఈ యుద్యమముయొక్క మతములో ముఖ్యాశమని గుర్తెఱిగి యెంతవరకు దీనిని సహింపనగునో, ఎచ్చట దీనిని అణచివేయ

ప్రారంభింపవలెనో నిర్ణయించుట కష్టముగ నుండెననిదొరతనమువారు ఇటీవల ప్రచురించిన వైటుపేపరులో ప్రచురించియున్నారు. 1920 సంవత్సరము ఏప్రిలుమాసములోను ఛెమ్సుఫర్డుప్రభువుచే తీర్మానములుగావింపబడి ప్రచురింపబడెను. అందు ఉద్యమము దౌర్జన్యరహితముగ నున్నంతకాలము తాము సంబంధము కలుగజేసుకొన మనియును, దౌర్జన్య మున్నచోట తాము దానిని నిర్దాక్షిణ్యముగ నణచివేయుదు మనియును స్పష్టపరచిరి. 1920 నవంబరులోనే స్వచ్ఛందసైనికులను గూర్చి జాగ్రత్తగ నుండవలయు నని ఇండియాదొరతనమువారు రాష్ట్రీయదొరతనమువారిని మందలించిరి. కాని కార్యకర్తృత్వక ప్రపంచమందు జరిగిన యార్థికజనితమగు నాందోళన మంతయును అసహాయోద్యమమునకే వీరారోపించి అస్సాములోని తేయాకుతోటలయందు కలిగిన కలవరమును - చెన్నపట్టణములోని అదిద్రావిడ బ్రాహ్మణేతరుల మధ్య జరిగిన పోరాటములును - కర్నాటకమిల్లుల సమ్మెకట్టులును - బకింగుహాముమిల్లు సమ్మెకట్టులును - చిట్టగాంగులోని స్టీమరుకూలీల సమ్మెకట్టును - ఈస్టుఇండియారైల్వే సమ్మెకట్టును - అసహాయోద్యమపర్యవసానము క్రింద ఈ వైటుపేపరులో వెంచినారు. వీనిలో చిటగాంగువ్యవహారమునందు అసహాయవాదులు కొంత జోక్యము కలుగజేసుకొన్నను, తక్కిన ఆందోళనములకును ఉద్యమమునకును ఎట్టి సంబంధము లేదని చెప్ప సాహసింపగలము. ఇంతటితో సంతృప్తి పొందక ధార్వారు అలిఘరు మాటియూరి మాలిగాను మున్నగుప్రదేశములందు - జరిగిన అల్లరులుకూడ అసహాయోద్యమఫలితములే యని దొరతనమువారు చెప్పుచున్నారు. వీనిలో చాలప్రదేశములగూర్చి కాంగ్రెసుసంఘము వారు విచారణచేసి ప్రత్యేకనివేదికను తెలిపియున్నారు. దానినిబట్టి దోషస్థాపనము ఎటుచేయవలసినదియును తెలియగలదు. అన్నిటికంటె విపరీతము మాప్లాఅల్లరులు అసహాయోద్యమమునకు పర్యవసానము లని వీరు వ్రాసియున్నారు. ఇంతవరకు ఎట్టి స్వాతంత్ర్యముగలసంఘము ఈవిషయమును గూర్చి చర్చించియుండనపుడు దొరతనమువారి వ్రాతలు బాధ్యతావిరహితములైన వ్రాతలని చెప్పవలసియున్నది. కాని-ఏది ఎట్లున్నను-దొరతనమువారు డిశంబరు మాసమునుండి - వాలంటీరులయెడల చూపిన దండనీతి - పైని సాంతముగ వర్ణింపబడియున్నది.

దొరతనమువారికి కూడ ఇట్టి దండనీతి హితవుగ నుండెనని చెప్పజాలము. వీలైనచో ప్రజలను సమాధానపరచి యువరాజుగారికి తగు రాజభక్తియుక్తములు స్వాగతమును ఇప్పింపవలెనను కుతూహలము రీడింగుప్రభువుకు గలిగినట్లు కనుపించును. ఇందుకు నలయు ప్రయత్నములు కొందఱు మితవాదులను పురస్కరించుకొని జరుపబడినవి. ఇంత మహాప్రయత్నములో మితవాదులు ఎచ్చట నున్నది చెప్పుట కష్టము. ఒకప్రక్కను గాంధి యొక్క ఉద్యమము అమోఘముగ ఖండించుచు మఱియొకప్రక్కను క్రిమినల్‌లా అమెండుమెంటు ఆక్టును వాలంటీరులకు వర్తింపజేయుటకూడ దని వీరు సమాన తీవ్రతతో ఖండించుచుండిరి. నిజముగ ఇందు అసందర్భ మేమియు లేదు. కాని వైటుపేపరులో దొరతనమువారు వీరినిగూర్చి ఈ విధముగ వ్రాసియున్నారు. "నవంబరు మాస మధ్యమున జరిగిన సందర్భములవలన మితవాదులలో చాలమంది మిక్కిలి భీతావహులై ఎక్కువ కఠినమైన చర్యలను దొరతనమువా రవలంబింపవలెనని వీరు నిర్బంధించినను ఈ రెండు శాసనములను అమలులో బెట్టి అనేకమందిని శిక్షించిన పిమ్మట వీరిలో రాజకీయవేత్తల యొక్కయు, వార్తాపత్రికాధిపతుల యొక్కయు మనస్సు ఇట్టియములపై తీవ్రముగను, ఆశాభంగకరముగను ప్రతికూలముగను అయ్యెను. ఇట్టి ప్రతికూలభావముచేతనే వీరిలో కొందఱు మితవాద శాఖకు చేరియుండని మదనమోహనమాలవ్యా సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు మొదలగువారు 1921 సం॥రము డిశంబరు 21-వ తేదిని వైస్రాయి గారికి కలకత్తాలో ఒక విజ్ఞాపనము నొసగిరి. అప్పటికిని అంతకు పూర్వమును కొన్ని రాజీనామా ప్రయత్నములు జరిగెను. మాలవ్యాగారు కలకత్తాలో జైలులో నున్న దాసుగారితోను మౌలానా అబ్దుల్ కలాము హాజరతు గారితోను ముచ్చటించి రౌండుటేబిలు కాన్ఫరెన్సు (సర్వసమితసభ) జరుపవలెననియు, అందుకు పూర్వము క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టు క్రిందను సెడిషను మీటింగుల క్రిందను శిక్షింపబడిన ఖైదీలనెల్లరను విడిచి పెట్టవలెననియు షరతుల నేర్పాటుచేసిరి. ఈ విషయమును గాంధికి తంతివలన తెలుపగ నీయన ఇందుకు సమ్మతించి మఱికొన్ని షరతులను చేర్చిరి. సభయొక్క సమావేశ కాలమును సభ్యులవివరమును అచ్చట పరిష్కరింపబడు

DESABANDHU CHITTRANJAN DAS



శ్రీయుత, దేశబంధు చిత్తరంజన దాసు

DESABHAKTA KONDA VENKATAPPIAH



శ్రీయుత, దేశభక్త కొండ వేంకటప్పయ్య

MAULANA MAHAMAD ALI.



మౌలానా మహమ్మదాలి

MAULANA SHAUKAT ALI



మౌలానా షౌకతాలి

LALA LAJPAT RAI



శ్రీయుత, లాలా లజపతిరాయి

PANDIT MOTILAL NEHRU



శ్రీయుత, పండిత మోతీలాలు నెహ్రూ

వ్యవహార వివరమును ముందుగనే నిర్ణయింపబడవలె నని గాంధిగారు కోరిరి. ఇందుకు మాలవ్యాగారు అంగీకరించి దాసుప్రభృతుల యామోదము నొంది రీడింగుప్రభువు నెదుటబెట్టి గాంధిగారికి తెలుపగ నీయన ఫత్వాకైదీలను కూడ వదలిపెట్టవలసిన దని క్రొత్తషరతును చేర్చిరి. ఈ తంతి 22 వ తేదీ సాయంత్రమునకు గాని కలకత్తా జేరుట తటస్థించ లేదు. ఈ లోపున వైస్రాయిగారు కలకత్తానుండి ఢిల్లీకి వెళ్లి పోవలసివచ్చెను. ఇంతట రాజీనామా ప్రయత్నములు తమంతట నవి ముగిసెను. ఏలయన 24-వ తేదీకి దాసుగారిని అహమ్మదాబాదు కాంగ్రెసుకు అధ్యక్షునిగ పంపుటకు ముహూర్తము ఒకప్రక్కను దాటిపోయెను. రెండవ ప్రక్కను 24-వ తారీఖున కలకత్తాలో యువరాజుగారు వచ్చునాటికి హారితాళములు జరుప కుండనుండు ముహూర్తమును దాటిపోయెను. కాని రాజీప్రయత్నములు 31-వ డిశంబరువఱకు జరుగుచునే యుండెను. మాలవ్యాగారును - జిన్నాగారును కాంగ్రెసు సభ్యులతో రాజీనామాను గూర్చి ప్రసంగములు జరిపి ఫలాని షరతులమీద సర్వమతసభకు సమ్మతించెద మని కాంగ్రెసుతీర్మానమును కోరిరి. ఇందుకు కాంగ్రెసు అంగీకరించి యుండ లేదు. అంతటితో రాజీనామా ప్రయత్నములు ముగియ లేదు. 22-వ సంవత్సరము జనవరి 14,15 తేదీలను జరిగిన పార్టీలసభలో తిరిగి ఈ ప్రయత్నములు జరుపబడెను. అప్పుడు గాంధిగారు తమ షరతులను తెలిపిరి. ఇవన్నియు నిటీవల ప్రచురింపబడినవి. వీనిని దొరతనమువా రంగీకరించ లేదు.

**పర్యవసానము**

అహమ్మదాబాదు కాంగ్రెసునందు సమష్టిశాసనోల్లంఘనమును తిరిగి సాగించుటకు తనకు గల నిశ్చయమును గాంధిగారు తెలిపి మాలవ్యా జిన్నాగార్ల కోరికలమీద జనవరి 15 వఱకును ఆపెను. పిమ్మట పార్టీల కాన్ఫరెన్సునందు జనవరి 31-వ తేదీవఱకు ఆపెద నని వాగ్దానము చేసెను. కాని ఆ తేదీలోపల రౌండుటేబిలు సమావేశముం గూర్చి ప్రభుత్వమువారి ప్రత్యుత్తరము రాక పోయినందున 4 ఫిబ్రవరి తేదీని వైస్రాయిగారికి తన కార్యక్రమమును గూర్చియు బార్డోలీలో తాను చేయబోవు సమష్టిశాసనోల్లంఘనమును గూర్చియు లేఖ వ్రాసెను. ఇందుపై బొంబాయి గవర్నమెంటువారు గాంధిని పట్టుకొనుటకు తీర్మానించుకొని ఇండియా గవర్నమెంటువారి యామోదమును బొందిరి. కాని ఇంతటిలో చౌరాచౌరీయందు జరిగిన ఘోరకృత్యముల వృత్తాంతము గాంధిగారికి తెలిసి వెనుక బొంబాయి అల్లరులు జరిగిన పిమ్మట ఏ ప్రకారము మానుకొనెనో ఆ ప్రకారము తన సమష్టిశాసనోల్లంఘనమును మానుకొనెను. అంతియ కాక వ్యక్తిశాసనోల్లంఘనమునుగూడ ఉపసంహరించుకొనవలె నని బార్డోలీయందు తీర్మానించెను. ఈతీర్మానములు ఢిల్లీయందు అఖిలభారతసంఘము నెదుట పునర్విమర్శనమునకు వచ్చెను. అప్పుడు గాంధి పంచాగ్నిహోత్రమధ్యమం దుండెను. ఒక్కప్రక్కను మహారాష్ట్రులు స్వరాజ్యసంపాదనమునందు గలిగిన ఆలస్యమునందు ఆశాభంగము నొంది శాసనసభలయందుండెడి ప్రీతి ఇంకను తగ్గియుండక పోవుటచేగార్యక్రమమంతయు పునర్నిర్మాణ మొందవలె నని వాదించుచుండిరి. మఱియొకప్రక్కను అహింసాతత్వము కలియుగధర్మమునకు వర్తింపనిదనియు, రాజకీయసమస్యల కంతకంటె వర్తింపదనియు, కావున సహాయోద్యమవిశేష్యమురొక్క విశేషణము దేశకాలపాత్రానుగుణ్యముగ మార్పుచెందవలె ననియుఁ గొందఱు వాదించుచుండిరి. ఇట్లు కొంద అహింసాభావమును మఱికొంద అసహాయభావమును ఖండించుచుండగా - ఉద్యమమే సమసిపోవుటకు మార్గములు సూచింపబడుచుండెను. ఈయుభయుల మధ్యను వ్యష్టిశాసనోల్లంఘనము స్థాపితము కావలెనని కొందఱును, గస్తీలను రద్దుచేసుకొనజాల మని మఱికొందఱును, వాలంటీరులవలన దోషము లేదని మరికొందఱును గుంపులుగుంపులుగ ప్రచండవాదముల సల్పిరి. రాజధానీస్వాతంత్ర్యమును రద్దుచేసినందుకు పలువురు ఆగ్రహించిరి. వాలంటీరులకు పని చెప్పజాలకుంటి మని అనేకులు శోకించిరి. చౌరీచౌరాబాధ్యత మనకేల యని కొందఱు విలపించిరి. ఇవన్నియు నిట్లుండ ఖైదులోనున్న మహనీయులు గాంధిగారి బార్డోలీతీర్మానములు అవివేకము లైనవనియు ఉద్యమమురొక్క ఉపసంహరణము ఉద్యమమునకు అరిష్టమనియు సహాయోద్యమము రొక్క తత్త్వమును గూర్చియు, సుపయోగమును గూర్చియు తాము మొదటినుండియు సందేహముపడుచునే యుంటిమనియుఁ గలకత్తా కాంగ్రెసునమయమున ఎట్టి సందేహముతోడను అవిశ్వాసముతోడను తాముంటిమో అట్టి సందేహమే- అట్టి విశ్వాసమే- తమ నిప్పుడు ఆవేశించి యుండె ననియు చిన్నలు, పెద్దలు, కుఱ్ఱలు మొదలైనవారు భయంకరమగు నట్టియు, చెద

రింపులతో గూడినట్టియు ఉత్తరములను వ్రాసి పంపిరి. ఇవ్వేవియును గాంధిని కలవరపరచలేదు. జైలులోనికి వెళ్లినవారు సివిలుహత్య జేసికొన్నవారనియు అట్టివారు తమ పరోక్షమందు జరుగు రాజకీయవిషయములను గూర్చి తమ అభిప్రాయము నొసంగబూనుట అధర్మాభిలాష మనియు (Illegal gratification) చిరునవ్వుతో గాంధి వాక్రుచ్చియుండెను. కాని ఇంతమంది ఇన్నిమాటలు చెప్పినదానిమీదట బార్డోలీతీర్మానమును- ఉన్నది యున్నట్టు ఛాయపరచుట- సాధ్యముకాక అనవసరమైనట్టియు- అప్రస్తుతమైనట్టియు- కొన్ని ఆడంబరవాక్యములను చేర్చి తీర్మానమును ధ్రువపరచుట తటస్థించెను. ఇదియే గాంధిని పట్టుకొనుటకు కారణము. ఇవి కారణమని ఇటీవల ప్రచురింపబడిన వైటుపేపరులో గూడ వ్రాయబడియున్నది. రాజీనామాయొక్క పర్యవసానమిదియే—

**ఉద్యమముయొక్క ఫలిత మేమి?**

గాంధిని పట్టుకున్నారు. ఆయనతోపాటు 20,000 జనమును బట్టుకున్నారు. దేశములోని నాయకులెల్లరు బ్రిటిషువారిచే వారి జైలులందు బంధింపబడినారు. ఇంక నీయుద్యమ మెక్కడ? దీనియాత్మబల మెక్కడ? అని అనేకులు ప్రశ్నించుచున్నారు. ఇంతటి గళగ్రాహిత లేనివారు మన ప్రయత్నములు - మనయాశయములు - మన త్యాగములు- ఇవన్నియు వ్యర్థములయిన వని లోలోపల దుఃఖించుచు, ఖిన్నులై యున్నారు. మఱికొందఱు తమ యుద్రేకోత్సాహములకు స్థానమును, అవకాశము నొసంగక, గాంధియును కాంగ్రెసును, ఉద్యమమును హఠాత్తుగ నాపివేసినందులకు ఆగ్రహించుచున్నారు. కాని ఈ భిన్నాభిప్రాయములమధ్య సత్యమెచ్చట దాగియున్నదో అన్వేషింపవలయును. సందేహము పడువారికి ఉద్యమముయొక్క స్వరూపము గోచరము కాలేదు. దుఃఖించువారికిని ఉద్యమముయొక్క అర్థము తెలియలేదు, ఆగ్రహించువారికిని ఉద్యమముయొక్క సారాంశము తెలియలేదు. గాంధి ఏడుకొండల క్రింద దాగియున్న గుణ్ణముపైని రాతినెత్తి అందులోని స్వరాజ్యనిధిని తెచ్చి మన చేతిలో పెట్టలేదని అనేకుల కాగ్రహము గలుగుచున్నది. గాంధిమీద ఆగ్రహము- ఆయన ఉద్యమమును ఆపినాడని కాదు. ఆయన గారడీవల్ల క్షణమాత్రములో స్వరాజ్యమను ఫలమునొలిచి చేతిలోపెట్టినట్లు పెట్టలేదనియే! స్వరాజ్యమనునది ముఖ్యముగ నొక మానసస్థితి యని ఎప్పుడు ప్రజలు గ్రహింతురో అప్పుడు స్వరాజ్యము వచ్చినదని కాని, రాలేదనికాని ప్రజలు ముచ్చటింపక స్వరాజ్యాంకురమయ్యెనా లేదా యని ప్రజలు ప్రశ్నింతురు. కావున స్వరాజ్యము ఒక కార్యక్రమము. ఒక మనఃప్రసారము. ఒక పరిణామవిధానము. ఇట్టి విధానము దేశమున ఆరంభమయ్యెనా లేదా యని మనము యోచింపవచ్చును. స్వరాజ్యము జైలునుండి పెరుగు ఒక నిర్మాణము కాదు. లోపలనుండి వర్ధిల్లు ఒకమార్పు. 1907 వ సంవత్సరములోనే; దాదాభాయినౌరోజీ కాంగ్రెసు అయినతరువాత స్థాపింపబడినదని తలంపుడు. అప్పుడు భారతవర్షము ఆంగ్లదేశముయొక్క గొడ్లచావిడిగ నుండెడిది. ఆంగ్లభాష దేశముయొక్క సామాన్యభాషగ పరిణమించెడిది. ఇట్లు ప్రజాసామాన్యమునకును, ఆంగ్లవిద్యాధికులకును కలుపరాని జలసంధి ఏర్పడియుండెడిది. పరిపాలనమంతయు నాంగ్లభాషయందు జరుగుచు ఆంగ్లభాషావిద్యాధికులగు నొక చిన్నకూటముచే జరుపబడుచుండెడిది. ఆంగ్లభాషకొసంగిన ప్రాముఖ్యముతోపాటు ఆంగ్లకళలు- ఆంగ్లసారస్వతము-ఆంగ్లఫక్కీలు- సామాన్య జీవితమునందు ఆధిక్యత వహించియుండెడివి. ఇంతయేల? మతము, ఆధ్యాత్మికము, ఆముష్మికములకు బదులు ధనము భౌతికము ప్రజలమనస్సులను ఆవహించి యుండెడిది. వాకిటిలో ముగ్గు-గుమ్మములమీద పసుపు- కుంకుమ - ద్వారబంధములమీద ఛత్రముఁలు, సావిటఁ దివాచి- ఇంట పోంకమగుచెంబులు-పండుగలు-పండుగలయందు ఉత్సవముఁలు - వివాహములయందు తంతు - ఇవన్నియు కూడ సమసిపోయి - వాకిలి ఇల్లు దొడ్డి గుమ్మము పాత్ర పండుగ-పరవడి - ఒక్కటే నఁను పుగ నుండెడివి.

ఇంకపరిపాలనము చూడబోయినచో పాశ్చాత్యపు కచ్చేరీలు, శాసనములు కేంద్రీకృతములగు పోలీసుపద్ధతులు- కట్టడిమీద నిర్మింపబడిన పరిశ్రమలు- వచ్చి- పంచాయితీలను- ప్రపంచవివేకమును- గ్రామకట్టడులను గృహపరిశ్రమలను నాశనముచేసెడివి. స్వరాజ్యమునందు 'స్వ' పోయి రాజ్యముమాత్రము మిగిలియుండెడిది. ఆ రాజ్యమును ఇప్పటిరాజ్యమువలెనే ఉండి పాశ్చాత్యులందఱు ప్రాచ్యులచే జరుపబడు పరిపాలనగలదై నిరంతరము రూపాయలకొరకు జరుగు పోరాటముగను, మతము

తత్త్వముకళమున్నగునవిఆదివారమునాడు అప్పుడుధరించి, అప్పుడు పొంకిత కనుపించు దుస్తులుగను పరిణమించెడివి.

ఇప్పుడన్ననో నూతనాదర్శములు ప్రజల అందరి మనస్సునందును వహించినవి. గాంధిని ఆయనతో కూడ 20,000 మందిని బంధించిన బంధింతురు గాక! హిందువులకును మహమ్మదీయులకును సమానముగ శ్రుతివాక్యము లనదగిన ఆయన మహావాక్కులు వాయువేగముతో మనకు రాకున్న రాకపోవుగాక! మన మాతృభూమి బజారుగ మార్చబోవు పరిపాలకులను ఆయన ఎదుర్కొని సామ్రాజ్యవర్ధనమును గూర్చి- జాతీయదేవాలయమును వర్తకగణముయొక్క చెయులనుండి సంరక్షింప సమకట్టినాడు. అందువలనను ధనికులను, వర్తకశిఖామణులను సంతృప్తిపరచుటకు ఆయనను బంధించినను బంధింపవచ్చును! ఈ పోరాటము ప్రజలను పరిపాలక భౌతికాపేక్షమధ్యను ప్రజల మనస్సాక్షిమధ్యను ఉత్పన్నమైనవి. ఇప్పుడు పాలకులచే బంధింపబడినది ప్రజల మనస్సాక్షి. జాతియొక్క ఆత్మ. ఇప్పుడు ఈయనను బంధించినంతమాత్రముచే ప్రజల మనస్సాక్షినిగాని - జాతియొక్క ఆత్మనుగాని - ఎవరైన బంధింపగలరా? ఆనాడు క్రీస్తును శిలచేసి ఖననముచేసినపుడు చుట్టునున్న సిపాయీలును గణములును సమాధినుండి ఆయన ఆత్మను ఎగిరిపోకుండ నిలుపగలిగెనా? గాంధి ఒకవ్యక్తి కాడు. ఆయనను ఒకస్థానమందు బంధించి యుండలేదు. ఆయన జాతియొక్క నూతనోదయమునందలి తేజస్సు. మానవకల్పితమైన శాసనముకంటె ఉత్కృష్టశాసనములు గలవు. ఆయన పాటించునది-ఆయనను బంధించునది-ఈశాసనము గాని ఆశాసనము గాదు. ఈయన జయమొందునా యని ప్రశ్నించుట అజ్ఞానలక్షణము. సంవత్సరన్నరకాలమైనఁ గాకముందే ఈయన ఉపక్రమింపచేసిన నూతనోద్యమమునకు కోట్లకొలది అనుచరులు చేరినారు. వీరెల్లరు మనస్పూర్తిగను- యథేచ్ఛముగను-స్వాచ్ఛందికముగను-కాఠిన్యజీవితము నవలంబించి సాంఘికసంస్కరణమునకు సమకట్టినారు. గాంధియొక్క కార్యమును మదింపు వేయుటచే లోకము చేతప్పు ఎక్కడనున్నదనగ రాజకీయస్వాతంత్ర్యమను ప్రమాణమును బట్టియే వీరెల్లరు దానిని వీక్షింతురు. భారతభూమికి రాజకీయస్వాతంత్ర్యము ఆయన కార్యప్రణాళికయందు నాయకమణియే. కాని అది కేవలము ఆయనయొక్క ఆత్మకు ఒకరూపము. అల్లుగాక రూపమునే ఆత్మకు దలఁచుట యపోహ. ఏసుక్రీస్తును నొకదేశాభిమానిగ భావించి పాలస్టీనునుండి రోమనులను తరిమివేయలేకపోయినాడని అను కారణముచే నాయన అపజయము పొందెననిగాని-ఆయన జీవితము నిరర్థక మయ్యెనని గాని - చెప్పుదుమా? గాంధి కేవలము రాజకీయసంస్కర్త కాడు. నూతనమతస్థాపకుడు. నూతనపీఠాధిపతి. అసహాయోద్యమము నూతన పీఠము. నూతనమతము. ఈనాడు వేసిన బీజము మరునాటికే మహావృక్షమగునా? బీజమును గ్రొయ్యద వ్విమట్టిలో పాతిపెట్టవలెను. సకాలములో వర్ష బిందువులుపడి భూపతనము పొందిన పిమ్మట వృక్షము బయలువెడలును. గాంధిని కొట్టులోపెట్టి బంధించినారు. సకాలములో భారతజాతీయతామహావృక్షము బయలువెడలి ప్రపంచము నంతకును నీడను సౌఖ్యమును నొసంగగలదు.

## నైవేద్యము

### శ్రీయుతులు దువ్వూరి రామి రెడ్డి గారు

తల్లి! నైవేద్యహస్తులై దరలినారు
ప్రజలు నీయుత్సవముఁ గాంచ భక్తితోడ
ధన్యు లెల్లరు నాత్మోచితంపుఁ గానుకలర్పణము సేయవచ్చిరి యందికొమ్మ. ౧
స్వర్ణసుమముల నర్చనసలుపువారు
భాగ్యవంతులు నీపాదపద్మములకు;
ఏమి లేనట్టి భిక్షుకుండేని నేఁడు
కంటిక్రొన్నిటిముత్యాల కానుకలిడును. ౨
ధనికులును బీదలనెడి యంతరము లేక
చేతులను మోడ్చి నీస్తుతిఁ జేయువారు
భక్తిపరవశులైన యాప్రజలగీతి
దిక్కుదిక్కులయందుఁ బ్రతిధ్వనించు. 3
అమ్మరో! నీదు మందిరప్రాంగణమున
మండుచున్నది కర్పూరఖండగణము.
త్యాగపరిశుద్ధమగు నాత్మఁ దలఁగి పోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనఁగ. ౪
ప్రొద్దుపొడుపున నీపాదపూజకొఱకు,
కవిని, తెచ్చితి దోసిటఁ గన్నెపూలు;
బలివితర్దిక నిరతంబు వెలుఁగునటులు
హృదయపు సుగంధదీప మర్పింతుఁ గొనుము. ౫

# స్వరాజ్య మహోద్యమము

మంగిపూడి వేంకటశర్మ గారు

క. కసి యెన్నండును బూనరా దెదిరిపైఁ గారుణ్యమున్ వీడరా
దుసురుల్ వోయెడువేళనైనఁ గపటోద్యోగంబు గారాదు. ఏ
పని లేదంచును వీడఁగూడదు దయాసత్యాదిశౌచంబు లీ
యసిధారావ్రతమందు ముఖ్యములు. మీ రవ్వానిఁ బాటింపుఁడీ!

సీ. సత్యహీనులఁ బట్టి చంపఁ గర్జముగాదు, సత్యంబుఁ బ్రోచు కర్జంబు గాని
ధర్మదూరులఁ ద్రుంపదగు నుద్యమము గాదు, ధర్మంబుగాచు నుద్యమము గాని
శాంతిశత్రుల శిక్షనలుపు చర్యయుఁ గాదు, శాంతిని రక్షించు చర్యగాని
న్యాయదూరుల వధసేయు యత్నము గాదు, న్యాయంబు నేలు యత్నంబుగాని
తే. ఇం దధర్మంబు పొడగట్టె నిపుడు మనకు, జయము నిశ్చయ మింక సంశయము వలదు
ధర్మసంస్థాపనార్థమై తరలి రండు, వెన్నుఁజూపకుఁ డో యాంధ్రవీరులార!

సీ. సత్యతనుత్రంబు సంతరించినఁ జాలు, ఘనవజ్రకవచంబు మనకు వలదు
ధర్మదివ్యాస్త్రముల్ ధరియించినన్ జాలు, నితరాస్త్రశస్త్రంబు లెత్తవలదు
త్యాగసంపద నిండి తనరారినన్ జాలు, నరులసంపదఁ జూరలాడవలదు
శాంతిసాధన మెండు సమకూరినన్ జాలు, నన్యసాధనలకై యరయవలదు.
తే. క్రూరపునిరంకుశతను మార్కొన్నఁజాలు, నంతియె తదాశ్రయులఁగదియంగవలదు.
ఆత్మను జయింపు డిది చాలు నరులవలదు, మనస్వరాజ్యంబు కరతలామలకమగును.

సీ. భారతంబునకు స్వాభావికంబై యొప్పి, సాటి మించిన యాత్మశక్తిమహిమ
హైందవక్షోణి కనాదిసిద్ధంబై ప్రశస్తిగాంచిన మహాశాంతగరిమ
ఆర్యసీమకు నైజమై యన్యభూమండలాసాధ్యమగు పరిత్యాగపటిమ
పుణ్యభూమికి జన్మభూమియై బహుజగజ్జేగీయమాన మహాశీలద్రఢిమ
తే. ఆర్షవాటికి సహజంబులైన ధర్మనిరతి సత్యాభిరతి నిండి నివ్వటిల్లె
నఖిలధాత్రికి నద్భుతం బావహిల్ల, గాంధిభగవాను నుద్యమకారణమున.

సీ. శమనపుత్త్రుఁ డజాతశత్త్రుఁడన్న యథార్థ,మా యంచు నమ్మలేనట్టివారు
ప్రహ్లాదుఁ డోర్చె ఘోరపుబాధలని చెప్ప, నతిశయోక్తులటంచు నాడువారు
శాంతంబునకు వసిష్ఠమునీంద్రు వర్ణింప, గల్పనాకథలంచుఁ దెల్పువారు
సత్యంబునకు హరిశ్చంద్రుఁ డమ్ముడువోయె,నన సంభవంబు గా దనెడివారు
గీ. వెన్నెముక నిచ్చెను దధీచియన్న మాంస,మిచ్చె శిబియన్న మృషలనఁ జొచ్చువారు
గాంధిప్రేమాక్షమాశాంతకలనఁ జూచి, సత్యరతిఁ జూచి త్యాగసంసక్తిఁ జూచి
దిగ్భ్రమ వహించుచున్నారు తెల్లఁబోయి.

సీ. నిద్రాణమైయున్న నిఖిలభారతభూమి, కడు సంభ్రమముగ మేలుకాంచి యుండ
నిస్తేజమైన హిందూస్థాన మరిపీర, దుర్నిరీక్ష్యంబుగాఁ దోఁచుచుండ
దుస్సాధ్యమైన హిందూముసల్మానుల,మైత్రి దుర్భేద్యమై మలయుచుండ
కలనైనఁ దలఁపని కర్జమై రాటంబు, మరల ధాటికి నిల్చి వరలుచుండ
వేనవేలేండ్లు వ్రేళ్లూని యూడలుగొన్న, యంటుదోసము మాయ మగుచునుండ
తే. మోతిలా లన్సరీలట్టి భోగపరులె, జోగులు ఫకీరులై యుండ శూరు లాలి
సోదరులె శస్త్రసన్న్యాసులై తనర్చి, కనదహింసాస్త్రహస్తులై క్రాలుచుండ
గాంధిమహిమకు నింక తార్కాణ లేల ?

సీ. సత్యం వద యటన్న సదమలవాక్యంబు, తలఁపునన్ దోఁచె నేధన్యువలన
ధర్మం చర యటన్న నిర్మలతరసూక్తి, మనసులోఁ జొచ్చె నేమాన్యువలన
భువి నాత్మవ త్సర్వభూతాని యనునీతి, యనుభూత మయ్యె నేయనఘువలన
జగతి శాంతం విభూషణ మన్న యార్యోక్తి, స్థిరముగా నిలిచె నేధీరువలన
మొగి నహింసాపరమోధర్మ యనువాక్కు, వరణీయ మయ్యె నేపరమువలన
తే. ఆ తపశ్శాలి గాంధిమహాత్ముఁ డార్య,సాంప్రదాయజ్ఞుఁ డాత్మజ్ఞుఁ డాప్రభుత్వ
నీతికుశలుండు నాయకుండై తనర్చె,మనస్వరాజ్యోద్యమ మమోఘ మనఁగఁదగదె!

ఉ. తొందరఁజెంది 'గాంధి- యిదె తోఁచె స్వరాజ్యము వత్సరంబులో
నందగఁజేతునంచు నడియాసలుకొల్పె. స్వరాజ్య మేది యే
దిండుల కేల రా' దనుచు నెల్లిదమాడక యాత్మదోషముల్
డెందములం దలంచుకొని దిద్దుక యొద్దిక బుద్ధి కల్గి మీ
రందఱు నమ్మహామహుని యాజ్ఞల నౌదలఁ దాల్చి చేయుఁడీ
సందియ మేల, యింతటి విశారదుఁడై తగు నాయకుండు లేఁ
డెందును నిమ్మహాతరుణ మెన్నఁడు రాదిఁక నంద తేకమై
దుందుభివర్ష మందు జయదుందుభిఁ మ్రోయ స్వరాజ్యవైభవా
నందము నంది సౌఖ్యముల నంది వినిర్మలకీర్తిచంద్రికల్
సుందరలీల దిక్తటుల సొంపులు నింపఁగ ఖ్యాతి నందుఁడీ !

# ఆంధ్ర రాజకీయ వాఙ్మయము

కోలవెన్ను రామకోటీశ్వర రావు గారు

మన రాజధానియందలి భాషలలోనెల్ల నాంధ్రమున రాజకీయవాఙ్మయము విశేషముగ నభివృద్ధి జెందుచున్నటులఁ బ్రభుత్వనివేదికలవలనను ఇతరసూచనలవలనను తెలియుచున్నది. వంగదేశవిభజనమునాటినుండియు నాంధ్రులు రాజకీయరంగమున మిగుల నుత్సాహముతో పాల్గొనియున్నారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకును, హిమ్మటి హోంరూలు ఉద్యమమునకును, నేటి అసహాయోద్యమవ్యాప్తికిని, ఆంధ్రులు సలిపిన కృషి ప్రశంసార్హము. వారి రాజకీయవాఙ్మయ మెట్లు లభివృద్ధినొందినదియును, ముందెటుల నభివృద్ధి గాంచవలసినదియును మనము ప్రకృతము విచారింతము.

## ౧౯-వ శతాబ్దము

ఆంధ్రవాఙ్మయచరిత్రయందు ౧౯-వ శతాబ్ది 'వచనయుగ'మని చెప్పఁదగును. అంతకుఁబూర్వము వచనగ్రంథములు. అందు ముఖ్యముగ కథలు- పెక్కులుండినను సర్వతోముఖముగు వచనవాఙ్మయము కడచిన శతాబ్దియందే వెలువడెను. 'గద్యతిక్కన' యని కీర్తి గాంచిన శ్రీ వీరేశలింగం పంతులవారును, వారి సమకాలికులగు నితరప్రముఖులును, సరళమగు తెలుగువచనశైలిని సాగించి నవలలు నాటకములు ప్రహసనములు జీవితచరిత్రలు భౌతికశాస్త్రములు వాఙ్మయచర్చలు ఇతిహాసములు లోనగు గ్రంథములన్నియును వచనమున రచించి ఆంధ్రభాషకు నూతనశోభ నొసంగిరి. కాని కేవల రాజకీయవాఙ్మయమువట్ల వారంతగ నభిమానము చూపినటు లగపడదు.

## రాజకీయ జీవనము

శతాబ్దిఁ అంతమువఱకును ఆంధ్రులదృష్టి నాకర్షించినదియు- వారియుత్సాహమును పురికొల్పినదియు- వారి జీవితాదర్శముల మార్చినదియు- రాజకీయ సమస్య కాదు. సంఘోద్ధరణమును కొంతవఱకును పండితప్రకాండులవాదప్రతివాదములును, వారిని సమ్మోహింపజేసెను. సంఘసంస్కరణ మైనపిమ్మట గాని రాజకీయ విమోచనము కానేరదనువాదము సర్వసామాన్యముగ నాదరింపబడుచుండెను. శ్రీపంతులవారికి యాంగ్లప్రభుత్వమునందును ఆసంస్థలందును భక్తి మెండు. కనుకనే ప్రభుత్వవిధానమునందు ఏవైనస్వల్పలోపము లుండినను, వానిని సవరించుటకు మాత్రమే కృషిసలిపిన చాలు నని తలంచిరి. ప్రజలదృష్టిని రాజకీయసమస్యలపై కేంద్రీకరించి సత్వరస్వరాజ్యప్రాప్తికై పాటుపడవలె నను అభిప్రాయ మప్పటికి లేకుండెను. శ్రీ పంతులవారు దేశీయ మహాసభను గుఱించి ఒకయుపన్యాసముఁ బ్రకటించిరి.

## ఆంగ్లభాషావ్యామోహము

జాతీయ మహాసభలకును రాష్ట్రీయసభలకును ఆంధ్రులు వెడలుచుండిరి. మండలసభల నమకూర్చుచుండిరి. శాసనసభలలో కడు నేర్పుతోఁ బ్రసంగించుచుండిరి. కాని ఆంధ్రరాజకీయవాఙ్మయమునకు వారికృషి విశేషముగ లాభింపలేదు. వారి యుపన్యాసములు- వ్యాసములు- సంభాషణలు- చాలవఱకు నాంగ్లమున నుండెను. ౧౯౦౪-వ సంవత్సరమున సైతము, ఒక మండలసంఘాధ్యక్షుడును, సన్మానసంఘాధిపతియును నాంగ్లముననే తమ యుపన్యాసముల నొసంగుట నేనెఱుగుదును. కొందఱాంధ్రమున నుపన్యసించినను, కృత్రిమమగు భాషను వాడుచుండిరి. రాజకీయవిషయములఁ గూర్చి ఆంధ్రమునఁ జక్కగ వ్రాయుటగాని, ఉపన్యసించుట గాని వీలగునా యని సుప్రసిద్ధనాయకులు సంశయించుచుండిరి. ఆంధ్రప్రకాశిక దేశాభిమాని కృష్ణాపత్రికల వంటి కతిపయపత్రికారాజములు మాత్రము శక్తివంచన లేక, పలుకష్టముల కోర్చి, ఏదియో యొకవిధముగ తల యెత్తికొని రాజకీయసమస్యలఁ గూర్చి ప్రజల నుద్బోధించుచుండెను.

## కొన్ని కరపత్రములు

౧౯వ శతాబ్దమునుండి విరమించుటకుఁ బూర్వము ఆంధ్రప్రముఖులలోఁ గొందఱు ప్రచురించిన కరపత్రముల గూర్చి స్వల్పముగఁ జెప్పవలసియున్నది. జాతీయ మహాసభయందు విశేషముగ నభిమానముగలవారు ఆ మహాసభోద్దేశములను కొన్నిసభల వృత్తాంతమును సులభ

ముగ జనులకు తెలియునట్లు కరపత్రములఁ బ్రకటించిరి. వీనిలో శ్రీ ఏ. సి. పార్థసారథినాయుడుగారు ౧౮౯౪ వ సంవత్సరములో ప్రకటించిన 'కాంగ్రెసు ప్రశ్నోత్తరమాలిక', ౧౮౯౬ లో ప్రకటించిన 'పదిపదునొకండు మహాసభల వృత్తాంతము' ముఖ్యములు. గంజాముమండల వాస్తవ్యులును, ఉదారచరితులును, కీర్తిశేషులును నగు శ్రీయుత తిమ్మరాజు వేంకటశివరావు పంతులు గారు ౧౮౯౭ వ సంవత్సరమున, 'మహాసభాచరిత్ర - ఉద్దేశములు' అను చిన్నిపొత్తమును ప్రకటించిరి. వార్తాపత్రికల మూలమున గాక ఇట్టి చిన్నిపొత్తముల మూలమున రాజకీయజ్ఞానమును వ్యాపింపజేయవచ్చు నని నిరూపించిన ఆంధ్రులలో వీరిద్దరును ప్రముఖు లనవచ్చును.

గోదావరీమండల సభావృత్తాంతమును మఱి కొన్ని మండలసభల వృత్తాంతములును అప్పటప్పటికి ప్రచురించెడివాడుక యుండెను. కాని ఇవి ప్రజలలో విశేషించి వ్యాపించెనని గాని జ్ఞానాభివృద్ధికి తోడ్పడెనని గాని చెప్పజాలము. ఆదినములలో రైతుసంఘమును విశేషముగ కలఁతపెట్టిన 'సిటితీరువ' గూర్చి గోదావరీ మండలసంఘమువా రొక కరపత్రమును ౧౮౯౮ సంవత్సరమునఁ బ్రకటించిరి. అటులనే గంజాము మండలమును చెన్నరాష్ట్రమునుండి విడదీయనెంచినపుడు అట్లుచేయుట తగదని గంజాముఆంధ్రులు కరపత్రమును ప్రకటించిరి. మొత్తముమీఁద ఆంధ్రవాఙ్మయమునం దితరవిభాగము లభివృద్ధి గాంచినటులు రాజకీయగ్రంథములు అభివృద్ధిని గాంచ లేదు.

### జాతీయాదర్శము

ఆంధ్రరాజకీయజీవన మిట్టి స్థితినుండగా ౨౦ వ శతాబ్ద్యారంభమున భారతవర్షమును కలఁచివైచి భారతీయాదర్శములఁ దీవ్రముగ మార్చిన జాతీయోద్యమము బయలుదేరెను. ప్రాగ్దేశముల కెల్ల నూతనోజ్జీవ మొసంగిన మహోద్యమమే భారతవర్షమందును వెలసెను. జపానుచీనాపారశీకములవలెనే భారతవర్షమును, తన నిరుపమానప్రతిభను, లోకమునకు చాటి స్వార్థస్థానమును బడయ నెమకట్టెను. వంగదేశవిభజన మీయుద్యమమునకు దోహద మొసంగినమాట సత్యము. అంతవఱకును, కొలదిమంది ఆంగ్లవిద్యాధికులచే నడుపబడుచుండిన రాజకీయోద్యమము ప్రజాసామాన్యముయొక్క ఆదరణమునకుఁ బాత్రమయ్యెను. జాతీయాభివృద్ధికి, ఎల్లరును సమానముగ పాటుపడవలె నను అభిప్రాయము వ్యాపించెను. వంగరాష్ట్రమున కలిగినంత సంచలనము తదితరరాష్ట్రములలో లేకుండినను, వంగదేశీయులకు వాటిల్లినకష్టములు సకలభారతీయులకును సంబంధించినవే యని అన్నిప్రాంతములవారును గ్రహించిరి.

### ఆంధ్రసంచలనము

వంగదేశమునకుఁ గడుసమీపమున నున్న ఆంధ్రదేశ మీతరుణమున శ్రీవిపినచంద్రపాలుని వాగమృతమును గ్రోలెను. ఆసుప్రసిద్ధవక్త ప్రధానాంధ్రనగరముల సందర్శించి నవీనజాతీయాదర్శములఁ గూర్చి కడునిపుణముగ నుపన్యసించెను. ఉత్సాహపూరితులగు నాంధ్రయువకులు పలువురు వారిసందేశమును గ్రహించి, తమ జీవితమును దేశారాధనమునకై అర్పింప నెమకట్టిరి. నేఁడాంధ్రదేశమున నాయకత్వము వహించి నిర్మలదేశాభిమానమునందును కార్యదీక్షయందును ఆదర్శప్రాయులుగ నున్నవారిలో పెక్కురు విపినచంద్రపాలుని ప్రబోధము వలన జాతీయోద్యమమునఁ బ్రవేశించినవారే. బందరు ఆంధ్రజాతీయకళాశాల- రాజమహేంద్రవరపు జాతీయపాఠశాల- బెజవాడ 'స్వరాజ్య' పత్రిక- మొదలగునవన్నియు- నాఁటి జాతీయోత్సాహజనితములే! 'నవయుగ' 'ఆంధ్రకేసరి' పత్రికలును అప్పుడే యుదయించియుండెను.

### రాజకీయగ్రంథములు

కాని మన మిప్పుడు ఆంధ్రరాజకీయ జీవనచరిత్రమును చర్చించుట లేదు. వాఙ్మయాభివృద్ధికీ యుద్యమ మెంతవఱకు తోడ్పిన దనునంశమే ఇట ముఖ్యము. ఆంధ్రపత్రికలు కొన్ని నూతనముగ వెలువడుట యటుండ రాజకీయగ్రంథములను- ప్రకృతిశాస్త్రములను- ఆంధ్రమునఁ బ్రకటించి ప్రజాసామాన్యమునందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకై కొన్నిసంఘములు స్థాపింపబడెను. వీనిలో విజ్ఞానచంద్రికామండలి (హైదరాబాదు) ఆంధ్రభాషాభివర్ధనీసంఘము (బందరు) భాషాసేవకసమాజము (గుంటూరు) ముఖ్యములు. ఆంధ్రగ్రంథము లనిన విశేష మాదరణమే లేని రోజులలో- నిరుత్సాహమును జెందక- మిగుల ప్రశస్తములగు గ్రంథములఁ బ్రచురించి భాషాసేవ నొనర్చిన యాసంఘాధిపతులు సంస్తవనీయులు. ప్రకృతిశాస్త్రములును జీవితచరిత్రలును వీరి ప్రచురణములలో ప్రధానస్థాన మాక్రమించెను. రామ

లింగారెడ్డిగారి 'అర్థశాస్త్రము' తప్ప విజ్ఞానచంద్రికవారు రాజకయగ్రంథములఁ బ్రకటింపలేదు.

ఆంధ్రభాషాభివర్ధనీ సంఘమువారు- వల్లూరి సూర్యనారాయణరావుగారి 'రాజ్యచరిత్రము'ను-గోటేటి కనకరాజుగారి ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్రను దుగ్గిరాల రామమూర్తిగారి 'స్వాతంత్ర్యదర్శము'ను (మిల్లు గ్రంథమునకు తర్జుమా) ఇటీవల ప్లేటో 'రాజనీతిశాస్త్రము'ను ప్రకటించిరి. భాషాసేవక సమాజమువారు చాలస్వల్పకాలము మాత్రమే పనిచేసిరి. 'సంస్థానికత్రయము' అను గ్రంథమును, 'ఇండియారాజ్యతంత్రము'ను వారి ప్రచురణములలో ముఖ్యములు. కడపటిగ్రంథమును, జొన్నవిత్తుల గురునాథముగారును ఉన్నవ లక్ష్మీనారాయణగారును కలసి రచించిరి.

రాజకీయవిషయములఁగూర్చి మంచి జ్ఞానమును సంపాదింపనెంచినవారల కీగ్రంథములు కొంతవఱ కుపయోగించెను. వీనిలోఁ గొన్ని ఆంగ్లభాషాపరిచయము లేనివారికి సులభముగఁ దెలియునట్లు వ్రాయఁబడలేదు. ఇక నాంగ్లభాషాకోవిదుల కీగ్రంథము లేల? అందువలన నవి చాలవఱకు అలంకారప్రాయములై యుండెను. తాత్కాలికోద్రేకము విశేషముగ నుండినను- సావకాశముగ- మంచి గ్రంథముల పఠించి జ్ఞానమును సంపాదింతుమను వాంఛ- దేశమునం దంతగ వ్యాపింపలేదు. చారిత్రకనవల లనుపేర పెక్కుగ్రంథములు బయలుదేఱి తెలుగుఁ జదువనేర్చినవారి నందఱ నాకర్షించెను. సకల రాజ్యాంగములను కడుశ్రద్ధతో పరిశీలించి క్రమమైన రాజకీయపరిభాషను కల్పించి శ్రీ సూర్యనారాయణ రావుగారు వ్రాసిన రాజ్యచరిత్రమును కడచిన ౧౦, ౧౨ సంవత్సరములలో నెంతమంది ఆంధ్రయువకులు చదివిరో లెక్కవేసి చూచినచో ఫలితము మిగుల నిరుత్సాహకరముగ నుండకమానదు.

ప్రత్యేకసంఘములచే ప్రకటింపబడిన యుగ్రంథములే కాక ౧౯౦౭,౧౯౦౮ సంవత్సరములలో మఱికొన్ని గ్రంథములు బయలుదేఱెను. సులభశైలిలో వ్రాయబడుటచే నెక్కువమంది ఈ గ్రంథములఁ బఠించిరి. వీనిలో నిటికాలసూర్యనారాయణగారి 'సూరతుకాంగ్రెసుచరిత్ర' రంగాచార్యులుగారి 'సూరతుకాంగ్రెసుఉపన్యాసములు' సి. దొరస్వామయ్యగారి 'దాదాభాయినౌరోజీ ప్రసంగము' చిల్లరిగె శ్రీనివాసరావుగారి 'విపినచంద్రపాలుని ఉపన్యాసములు' శంకరవెంకట్రామయ్యగారి 'మనప్రస్తుతస్థితి' అనునవి పేర్కొనదగినవి. లజపతిరాయి గాంధి తిలకు మొదలగువారి ఉపన్యాసములు, జీవితములు కూడ పెక్కులు రచింపబడెను. కాని వాఙ్మయమున శాశ్వతస్థాన మాక్రమింపగలిగిన గ్రంథములు లేవనియే చెప్పవచ్చును. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి 'హిందూదేశైశ్వర్యచరిత్ర' ఉత్తమగ్రంథము.

### ఆంధ్రోద్యమము, హోంరూలు

రాజకీయపరిభాషను విరివిగ సృష్టించుటకును వాడుకలోనికి తెచ్చుటకును అత్యద్భుతముగ తోడ్పడినయుద్యమము ఆంధ్రోద్యమమే! అంతకుఁ బూర్వమే స్థాపింపబడిన, యాంధ్రపత్రికయుఁ గృష్ణాపత్రికయుఁ దమ సంపాదకీయవ్యాసముల మూలమున రాజకీయవాఙ్మయమునకు మహోపకారమొనర్చినవి. ఆంధ్రమహాసభలలో ప్రతివారును నాంధ్రముననే యుపన్యసింపవలె నను నియమ మేర్పడుటచేత నతిత్వరితముగ దేశనాయకులందఱును ఆంధ్రమున మాటాడనేర్చిరి. ఆంధ్రోద్యమప్రారంభమునుండియు, ఆంధ్రగ్రంథాలయోద్యమముకూడ ప్రఖ్యాతిని వహించెను. 'హోంరూలు' ఉద్యమమును ౧౯౧౬ సం॥ లో బహిర్గత మయ్యెను. ౧౯౦౭ వ సంవత్సరము తరువాత, మఱల ౧౯౧౬ సంవత్సరముననే రాజకీయవాఙ్మయము ప్రాముఖ్యమునకు రాగలిగెను. పత్రికావ్యాసములు- ఉపన్యాససంపుటములు- ఆంధ్రపత్రికా సంవత్సరాదిసంచికలు- ఇతర కరపత్రములు, ఇవన్నియును ప్రజలలో విశేషముగ వ్యాపించెను.

### సంస్కరణములు

“భారతవర్షమున కెట్టి రాజ్యాంగము వాంఛనీయము?”అను సమస్యఁ దర్కించుచు, పలువురు వ్రాయ మొదలిడిరి. మాంటాగూగారి రాకకు పూర్వమును, అటుతరువాతనుకూడ ఈవిషయమై ప్రబలచర్చలు జరిగెను. జాతీయమహాసభవారిచే సిద్ధము చేయబడిన ప్రణాళికను ప్రజలకు సులభముగ తెలియజేయుటకై, బందరు కృష్ణా స్వదేశీ ముద్రాలయమువారు 'కాంగ్రెసు స్కీము' అను చిన్నపుస్తకమును ప్రచురించిరి. అటులనే 'మాంటేగ్యూకృతగ్రంథవిమర్శన' మనుపేర పట్టాభిసీతారామయ్యగారు రచించిన దీర్ఘవ్యాసమునుకూడ తరువాత వీరు ప్రకటించిరి. నాటి చర్చ లన్నియు పత్రికల మూలముననను, ఉపన్యాసవేదికలందును నడచినవే కాని

HAKIM AJMALKHAN SAHEB



హకీం అజ్మల్ ఖాన్ సాహెబు

SRI VALLABHAI PATEL



శ్రీ వల్లభభాయ్ పటేలు

SRI T. PRAKASAM



శ్రీయుత టంగుటూరు ప్రకాశం

BABU
GOPABANDHU DOSS



బాబు
గోపబంధు దాసు

SREEMATHI SAROJINI DEVI



శ్రీమతి సరోజినీ దేవి



అఖిలభారత ఆజ్ఞోల్లంఘన కిలాఫతు విచారణసంఘము

నిలచినవారు— అమఘదు అలీ, బక్షిటు అలీ, మహమ్మదు మోజాము
కూర్చున్నవారు— మోజాము అలీ, టి. ఏ. కే. షెర్వానీ, బషూరు అహమ్మదు

అఖిలభారత ఆజ్ఞోల్లంఘన విచారణసంఘము



నిలచినవారు— ఎం. ఏ. బషీటు, సి. రాజగోపాలాచారి, ఎం. ఏ. అన్సారీ,
ఎచ్. ఎం. హాయతు, లాల్జీ మెహ్రోత్రా. కూర్చున్నవారు— వి. జే. పటేలు,
హాకీం అజ్మలుఖాను, పండిత మోతీలాలు నెహ్రూ, ఎస్. కస్తూరిరంగయ్యంగారు

వాఙ్మయమునం దంతగా ప్రతిఫలింపలేదు. సంస్కరణములఁగూర్చి ప్రజలకు బోధింపగల ప్రచారకులను సిద్ధపఱచుటకై బెజవాడయందు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు కొన్ని ఉపన్యాసముల నిప్పించిరి. ఆ యుపన్యాసములలో వేంకటరంగయ్యగా రొసంగినవి 'అర్థశాస్త్రము' అనుపేర ముద్రితమైనవి. తాత్కాలికముగఁ బ్రజల నుద్బోధించుటకు తోడ్పడిన వాఙ్మయమునందు 'గుంటూరుమండల గ్రంథాలయసంఘము' 'ఆంధ్ర ప్రజాసంఘము' 'ఆంధ్ర యువజనస్వరాజ్యసభ'ల రాజకీయకరపత్రములు ప్రత్యేకముగఁ బేర్కొనదగినవి.

### అసహాయోద్యమము

గాంధిమహాత్మునియొక్కయు జాతీయమహాసభవారియొక్కయు నాదేశము ననుసరించి, భారతీయులు అసహాయోద్యమమునఁ బ్రవేశించినదిమొదలు దేశమునందు కలిగిన సంచలనము చెప్పనలవిగాదు. ఆంధ్రులీ తరుణమున నేరికిని తీసిపోక తమధర్మమును నెఱవేర్చుచున్నారు. ఉద్యమతత్వముల బోధించుటకును మహాత్మునిఁ గీర్తించుటకును, ప్రజలమహోత్సాహమును ప్రస్ఫుటపఱచుటకును, కడచిన ౨౦ మాసములలో ప్రచురింపబడిన కరపత్రములు- జీవితచరిత్రలు- నాటకములు- పద్యములు- పాటలు- భజనకీర్తనలు- హరికథలు- ఉపన్యాసములు- లెక్కింప నలవిగాదు. ప్రజల హృదయాంతరాళమున స్వరాజ్యజ్యోతి వెలుగొందుచున్న దనుటకు వేఱు నిదర్శన మక్కఱలేదు. పలువురుదేశభక్తులు శక్తికొలది కావించిన కృషినిగూర్చియును- వారివారి గ్రంథములగూర్చియును వేర్వేఱుగ వర్ణించుట అనవసరము.

కాని ఆంధ్రరాజకీయవాఙ్మయమునకు సుభూషణములని చెప్పదగు గ్రంథములను పేర్కొనకుండుట పాడిగాదు. సర్వోత్తమరావుగారి హైందవస్వరాజ్యము- చెరుకువాడ నరసింహముగారి స్వరాజ్యదర్పణము- మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి తిలకుజీవితము- ఉపన్యాసములు, మహాత్మా గాంధిజీవితము- మాడభూషి వేదాంతనృసింహాచార్యులుగారి అసహాయోద్యమవిజయము, బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి స్వరాజ్యసమస్యయు నేటిగ్రంథములలో నగ్రస్థాన మాక్రమించుచున్నవి. నవయుగగ్రంథమాలలోని భారతస్వాతంత్ర్యము శాసనతిరస్కారముకూడ నెన్నదగినవి.

### ఇకముందు జరుగదగుపని

రాజకీయవాఙ్మయమునుగూర్చి మనము గమనింపవలసిన విషయములు రెండు గలవు. (౧) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిఁ గావించుట. (౨) పాండిత్యము సంపాదింపనెంచువారి యుపయోగార్థము ప్రశస్తగ్రంథముల రచించుట. వీనిని గూర్చి వేర్వేఱుగ విచారింతము.

### (౧) జనసామాన్యము

జనసామాన్య మని మనము వాడుచుండుపదమున కర్థ మేమి? కొన్ని సంవత్సరములకుఁ బూర్వము ఆంగ్లభాషాపరిచయము లేనివారిని జనసామాన్య మని పిలుచుట వాడుకగ నుండెను. కాని రాజకీయపరిజ్ఞానమునకును ఆంగ్లభాషాపాండిత్యమునకును ఎడతెగని సంబంధము లేదు. ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘసభలును మండలసంఘసభలును సమావేశమైనపుడు, ఆంగ్లభాషాజ్ఞానములేని రయితులును భూస్వాములును వర్తకులును ఎట్టి క్లిష్టసమస్యలనైనను బహుచాకచక్యముగను, దూరదృష్టితోడను, పరిష్కరించుచుండుట మనమెఱుఁగుదుము. అన్ని శాసనసభలయందును, దేశభాషలలో ప్రసంగములు జరిపినయెడల, వీరే గొప్ప రాజ్యాంగవేత్తలుగను, మంత్రివర్యులుగను వన్నెకెక్కఁజాలరా? కొంతకాలము క్రిందటివఱకును, వీరి కర్హస్థాన మీయక ఆంగ్లభాషాపాండిత్యమునే పూజించుచుండిన మనసంకుచితదృష్టి నేమనవచ్చును? జనసామాన్యమును, ఆంగ్లభాషాశూన్యులు అను పర్యాయపదముగ నుపయోగింపదగు కాలము గతించినది. బొత్తుగ వ్రాయను చదువను శక్తిలేనివారును చదివినను స్వల్పజ్ఞానమును మాత్రమే సంపాదించినవారును జనసామాన్యపదమునకుఁ దగియుందురు. చదువురానంతమాత్రమున వీరికి రాజకీయజ్ఞాన మలవడనేరదా? ఏచదువును రానివారు గొప్పఆస్తులను కాపాడుకొనుట లేదా? వ్యవహారముల జరుపుట లేదా? సచ్చరిత్రులై యుచితమర్యాదల నందుట లేదా? వారికి రాజకీయజ్ఞాన మలవడఁజేయుట మనవిధి కాదా?

ప్రతిగ్రామమునందును, పత్రికలును- సులభశైలిని వ్రాసిన కరపత్రములును- అందుబాటులో నుండవలెను. చిన్నగ్రంథాలయమును, పఠనమందిరమును సమకూర్చి, భాగవతాదిపురాణములతోఁబాటు పత్రికలను కరపత్రములను చదివి వారికి బోధించుచుండవలెను. ప్రజల హృదయముల నాకర్షింపగల వక్తలు పల్లెటూరులలో

నుపన్యసించుట అవసరము. భాషాపాండిత్యముకంటెను, విషయగ్రహణమే అత్యవసర మని గ్రహించి పత్రికాధిపతులు తేటతెలుఁగుమాటలతో వ్రాయ మొదలిడవలెను. అనవసరముగఁ గాలక్షేపము చేయుచు, కోర్టువ్యవహారములలో మునిఁగి తేలుచున్న గ్రామస్థులను సన్మార్గమునకు తెచ్చి, దేశాభివృద్ధికి పాటుపడున ట్లొనర్పవలెను. ఈ పద్ధతులను కొంతవఱ కవలంబించుటవలననే, ఈరెండు సంవత్సరములలో రాజకీయోద్యమము దేశమునందు వ్రేళ్లు పాతుకొని ప్రజల కుత్తేజము కలిగించినది.

(౨) ఉత్తమగ్రంథరచనము

ఆంగ్లభాష బొత్తుగ తెలియనివారైనను రాజకీయవిషయములలోఁ బాండిత్యమును సంపాదించి, రాజనీతికోవిదులై దేశోద్ధరణ మొనరింపగలిగినంత జ్ఞానమును సంపాదించుట కవకాశ ముండవలయును. పత్రికాపఠనమువలన, మనవారిలో కలిగిన ప్రబోధము మిగుల స్తుతిపాత్రము. కాని వర్తమానమున సకలదేశచరిత్రములును- రాజ్యాంగములును- గ్రహింపదలచినవారికి ఆంగ్లభాషయందుతప్ప తగిన అవకాశ ముండుట లేదు. ఇది కడు శోచనీయము. సాధ్యమైనంత శీఘ్రముగ- నాంధ్రభాషలో రాజనీతిశాస్త్రము- అర్థశాస్త్రము- ప్రపంచచరిత్ర- విదేశీరాజనీతిజ్ఞుల జీవితములు- మొదలగున వన్నియు సమగ్రముగఁ బొందుపఱుపవలయును. ఆంధ్రాంగ్లభాషాపాండిత్యముగల పెద్దలు కొందఱు ౧౦, ౧౨ సంవత్సరములు తదేకదీక్షతోఁ బనిచేసినగాని ఉత్తమవాఙ్మయము చేకూరనేరదు. ధనార్జనకాంక్షయు తాత్కాలికజనామోదవాంఛయు వదలి, జ్ఞానసముపార్జనమును సద్గ్రంథరచనమును పరమావధులుగ స్వీకరించి, నిరంతరకృషి సలుపగల ధీమంతులు కావలయును. గ్రంథరచనమే కాక, విద్యార్థుల కుపన్యసించుటయును, ఉత్తమమాసపత్రికకు వ్యాసములు వ్రాయుటయును కూడ వారివిధులు. ప్రశస్తమగు గ్రంథాలయమును- ముద్రణయంత్రమును- వసతిగృహమును- ఏకస్థలమున నుండినచోఁ గేవలమును వాఙ్మయాభివృద్ధికై పాటుపడనెంచిన వారికి మంచి యవకాశ మేర్పడును. నూతనముగ స్థాపింపబడిన జాతీయపాఠశాలలును- స్వరాజ్యాశ్రమములును- ఈవిషయమున శ్రద్ధ వహింపనగును.

కొన్ని సూచనలు

ఇంతవఱకు మన ఆంధ్రదేశీయులు ప్రకటించిన రాజకీయగ్రంథము లన్నియు నాంగ్లగ్రంథముల పరివర్తనములో లేక పాశ్చాత్యరాజ్యాంగముల వర్ణనలో అయియున్నవి. మన భారతీయసాంప్రదాయములను- సంస్కృతవిజ్ఞానమున శోధించి- వ్రాసినవా రరుదుగ నున్నారు. ఒక్క- శుక్రనీతిసారము తప్ప, ఏ గ్రంథమును ఆంధ్రమున వ్రాయఁబడలేదు. కౌటిల్యుని అర్థశాస్త్రమును ఆంధ్రమునఁ బ్రకటింప నొక రుద్దేశించినట్లు తెలియుచున్నది. ఇంతియ కాక ఉద్యోగపర్వము- శాంతిపర్వము- మనుధర్మశాస్త్రము- బౌద్ధగ్రంథములు- మొదలగున వన్నియుఁ గ్రోడీకరించినఁగాని, మన రాజకీయపరిజ్ఞానము సంపూర్ణము కానేరదు. ఎంతకాలము పాశ్చాత్యజ్ఞానముపైఁ బూర్తిగ నాధారపడియుందుమో, అంతవఱకును- మనపద్ధతులను- మనవిజ్ఞానమును- సరిగ గుర్తింపజాలము. ఇటీవలఁ బ్రకటింపబడిన గ్రంథములలో శ్రీ హరిసర్వోత్తమరావుగారి 'ప్రభుత్వము'ను వేపా సత్యనారాయణమూర్తిగారి అర్థశాస్త్రమును కొంతవఱకు భారతీయపరిస్థితులను గమనించి వ్రాయఁబడినవి. గ్రంథకర్తలకు సంస్కృతభాషాపరిచయ ముండినగాని, సమగ్రమగు రాజకీయవాఙ్మయమును సృష్టింపజాలరు.

కేవలాంధ్రగ్రంథములు

సంస్కృతవాఙ్మయమే కాక మనపూర్వపుటాంధ్రగ్రంథములను సైతము పరిశీలింపవలెను. పెక్కుశతాబ్దములు సామ్రాజ్యపదవి నధిష్ఠించిన ఆంధ్రజాతి సుప్రసిద్ధములైన రాజనీతిగ్రంథములను పెక్కింటిని రచించియుండవలెను. శ్రీవంగూరి సుబ్బారావుగారు, 'బద్దెనీతు'లనియును, రాయలరాజనీతి యనియును, రెండు చిన్నిగ్రంథములను ప్రకటించి యున్నారు. వీనిలో రెండవది శ్రీ కృష్ణదేవరాయల యాముక్తమాల్యదలో నుండి ప్రత్యేకించి వచనమున వ్రాయబడినది.

కావున నాంధ్రాంగ్ల సంస్కృతగ్రంథముల నెల్ల భక్తిపూర్వకముగఁ బఠించి- ప్రకృత రాజకీయసమస్యలను గూర్చి బాగుగ పరిశీలించి- ఆంధ్రమునఁ జదువగలవారికెల్లరకును సులభసాధ్యమగునటుల సత్యోత్తమ రాజకీయగ్రంథముల రచించి- ప్రకటించుటకై, ఆంధ్రప్రముఖులు యత్నించెదరు గాక! విశ్వవిద్యాలయము లందును శాసనసభలయందును, ఆంధ్రమే ప్రధానస్థాన మాక్రమించినచో, రాజకీయవాఙ్మయము వెంటనే అభివృద్ధి చెందఁగలదు. అందులకు సత్వరస్వరాజ్యసిద్ధియే మూలాధారము.

# స్వరాజ్యవిచికిత్సలు

సోమంచి సూర్యనారాయణ శర్మ గారు

"రాటాలతోటి స్వరాజ్యము వచ్చునా ? యెక్కడిమా"టను హీనమతులు
"ఈలాటి సబలకెల్లిన పట్టి కొట్టులో పెట్టరా ?" యని యార్చు భీతమతులు
"ఆంగలుం డొక్క ఫిరంగి కాల్చిన బాబో సావమా ?" యనెడి నిస్సారమతులు
ఏనాడు లేదిప్పు డేమిస్వరాజ్యము మనకంచు బోధించు మందమతులు
గీ. జల్పనంబొనరించెడి యల్పమతులు, అందఱను మోసపుచ్చు స్వార్థైకమతులు,
నగుచునున్నారిఁకను కొందఱాంధ్రసుతులు, అది యెఱిఁగి హుంకరించెద రాంగ్లపతులు!

సీ. "ఎవరెటుబోయిన నేమిరా మన"కని యలసవాక్యంబుల నాడువారు
'భాపనమాయరా బాబో! యీగోలలో పడబోకు' మని పల్కు పలుకువారు
'నౌకరీ వీళ్లకీ సన్నారు సరకారు' సంగతి యిది యని చాటువారు
'అందఱు నచ్చిన ఆకరున స్వరాజ్య మిక నేరి కని' వచియించువారు
గీ. ఆంధ్ర రైతుసోదరు లింక నలరినారు, పిరికిమందు లెస్సగాఁ ద్రావి పెరిగినారు
గాంధితత్త్వ మొకింతయు గానలేరు, తెలిసి యియ్యది గర్జింత్రు తెల్లదొరలు!

సీ. మాలమాదిగ లేకమై వర్ణములు చెడి, పోవుచున్నవి యని పొగులు వారు
మహమదీయులు గోడ్డుమాంసంబు మననోటఁ దిన్పింతు రిఁకనంచు దెలుపువారు
మనమండలము నాశమైపోవడానికే, వచ్చె నిదంచు వాక్రుచ్చువారు
అశుభసూచకము వస్త్రాలఁ గాల్చుట చాలతప్పంచు గట్టిగా చెప్పువారు
గీ. ఆంధ్ర దేశసోదరు లిట్టు లలరినారు, ఐకమత్యమె బలమని యరయలేరు,
గాంధితత్త్వ మొకింతయు గానలేరు తెలిసి యియ్యది గర్జింత్రు తెల్లదొరలు!

సీ. అత్తలతోఁ కయ్యంబులాడుట మాని, యువిదలైనను నూలు నొడికిరేని
సాలీలు తమదు మగ్గాల నెల్లప్పుడు, నొడుకునూలునె నేయుచుండిరేని
పట్టుదలల్ పూని ప్రతిమానవుండును, ఖద్దరుబట్టనే కట్టెనేని
మద్యపానంబు సమ్మతిమై నిషేధించి, యందఱు శాంతితో సమరిరేని
గీ. పన్నులను నెగవేసెడి పనియె లేక, శాసనోల్లంఘనపు టవసరమె లేక,
మన స్వరాజ్యంబు కరతలామలక మగును, తెల్లవారి యారభటియుఁ దెల్లమగును.

# ఆంధ్ర విశ్వవిద్యాలయము

విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు ఎమ్. ఏ. ఎల్. టి.

ఆంధ్రదేశమునకుఁ బ్రత్యేకముగ నొక విశ్వవిద్యాలయము వచ్చుననెడి యాశ యిప్పటికి అడుగంటినది. వర్తమాన స్థితిగతులఁబట్టి చూడఁగా ఆంధ్రవిశ్వవిద్యాలయ మనునది మఱి పదియేండ్లలోఁగాకూడ సిద్ధింపదని తోఁచును. ఈయాశాభంగము దేశమున కొక దౌర్భాగ్యమును- దేశభాష కొక యనిష్టమును-నిరంతరముగఁ గల్పించుచుండుననుట నిక్కము.

ఇంగ్లండు చెన్నరాజధానిలో మూఁడవవంతు వైశాల్యముగలది. ఇంగ్లండులో తొమ్మిదివిశ్వవిద్యాలయము లున్నవి. మనజిల్లాలు నాల్గింటికన్నఁ దక్కువ వైశాల్యముగల స్కాట్లండులో నాలుగు విశ్వవిద్యాలయములును, ఐర్లండులో మూఁడును చిరకాలమునుండి వ్యవహారములో నున్నవి. ఒకలక్షయేఁబదివేల చదరపు మైళ్ల విస్తీర్ణముగల చెన్నరాజధానికి - నాలుగయిదు వ్యవహారభాషలచే విభక్తమయినదానికి - ఒక్కవిశ్వవిద్యాలయము మాత్రమే ప్రతిష్ఠితమయి యున్నది. ఈవిశ్వవిద్యాలయము ముఖ్యాంశములయం దెల్లను అధమదశలో నున్నది. పాఠపరీక్షలు దేశభాషలలో జరుగనందువలన ఈ భాషలకు గలుగుచున్న దుర్గతి ఇంతింతయనిచెప్ప నలవిగాదు. ఈభాషల వాఙ్మయములు కాలానుసారముగ నానాముఖమున నభివృద్ధిఁజెందక మిక్కిలి సంకోచపడియున్నవి. చెన్న చెన్న రాజధాని విశ్వవిద్యాలయముమూలముగవ్యాపకమగుచున్నవిద్య ముఖ్యముగ వృత్తిసాధకముగ నున్నదేగాని విజ్ఞానపోషకముగా లేదని పెక్కండ్రు విజ్ఞులు తలఁతురు. బుద్ధివికాసము- శోధనశక్తి- స్వతంత్రవ్యక్తి-మున్నగువానికి ఇందలి విద్య ఆధారపడలేదు. ఆంధ్రదేశమునకుఁ బ్రస్తుతము ఒక్కవిశ్వవిద్యాలయ మైనను అత్యవసరముగ నున్నది. చెన్నరాష్ట్ర విశ్వవిద్యాలయముఁ దాను మోయలేని బరువు దలపై నెత్తుకొని యున్నది. చెన్నరాష్ట్రమునకు దీనివలన కాలోచితమగు లాభము కలుగుటలేదు. దీనివలన దేశభాషలు హీనస్థితికి వచ్చినవి. భౌతికశాస్త్రములు సోపయోగముగ నేర్పఁబడకపోవుటచే వృథాశ్రమమునకు మాత్రమే ఇవి హేతువులయినవి. చెన్నవిశ్వవిద్యాలయము కృషివాణిజ్యాది వ్యాసంగములకును కార్మిక పరిశ్రమములకును ఆధారమును కలుగఁజేసి యుండలేదు. విదేశభాషామూలముననే సర్వశాస్త్రములును ప్రవచింపఁబడుటచేఁ బాఠకులకు బుద్ధివికాసము భావస్వాతంత్ర్యము జ్ఞానాభిరుచియు నుదయించుట లేదు. ఈ కారణములచే నుత్తమవిద్య దేశసామాన్యమునకును స్త్రీలకును అలవడకున్నది. శిల్పము వైద్యము మున్నగునవి కేవలము పాశ్చాత్యపద్ధతుల ననుసరించి వ్యవహరింపఁబడుచున్నవేగాని దేశపద్ధతుల నవలంబింప లేదు. మొత్తముపైని చెన్నరాష్ట్రవిశ్వవిద్యాలయము దేశమునకు ఉచితమగు రీతిని ఉపకరించుచుండలేదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయము ఒక్కటయినను పొందుపడుభాగ్యము మనకు కలిగెనేని ఇట్టి విద్యాలయము వేఱుత్రోవఁ ద్రొక్కవలయును. లేనిచో లాభ ముండదు. తెలుఁగుదేశము రమారమి లక్ష చదరపుమైళ్ల వైశాల్యముగలది. ఇందు పదివిశ్వవిద్యాలయముల కైనను అవసరమును అవకాశమును గలదు. కాని ప్రస్తుతమందు ఒక్క విశ్వవిద్యాలయము వచ్చుటయే దుర్లభముగ నున్నది. కావుననే తొలుత నాంధ్రవిశ్వవిద్యాలయము చాలవఱకు పరీక్షాపరముగ నుండి క్రమముగ బోధనాత్మకము కావలయును. పరీక్షాపద్ధతులు కాలానుగుణముగను స్థలవిశేషములనుబట్టియు మార్పు చెందుచుండవలయును. సేడ్లరుకమిటీవారు ఉపదేశించిన విధమున నచ్చటచ్చటి విద్యాలయములలో గల ఆయావిధానముల ననుసరించి పరీక్షలు జరుగవలయును.

ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు ఆంధ్రభాషలోనే చదువు జరుగవలయును. ఇంగ్లీషు హిందీ అరవము మున్నగుభాషలు ఆయాభాషలలో నేర్పఁబడదగును. తక్కినవిషయములన్నియును చారిత్రికభౌతికశాస్త్రములు వైద్యము శిల్పమున్నగునవి- తెలుఁగున నేర్పఁబడి తెలుఁగుననే పరీక్షింపఁబడవలయును. వివిధశాస్త్రముల పై వివిధభాషలలోఁగల ఉద్గ్రంథములు తెలుఁగులోనికి

పరివర్తితములు కావలయును. ఇది ద్రవ్యసాధ్యమగు కార్యము. సుప్రసిద్ధములగు సాంకేతికపదములు వైదేశికములయినను గ్రహింపఁబడవలయును. ఏకోట ఒకలక్ష రూపాయలు వ్యయముచేసినయెడల మూఁడునాల్గు సంవత్సరములనాఁటికి ఆంధ్ర వాఙ్మయము నిండుకొని ఔన్నత్యమువహించి జ్ఞానమును దేశమందెల్లెడల పఱపఁజాలియుండును. కాలక్రమముగ నుద్గ్రంథములు తెలుఁగునఁ బుట్టి ఇతరదేశములవారి యాదరణమునకు పాత్రము లగుచుండును. ఆయుర్వేదము సంగీతము పారిశ్రామికవిద్యలు కృషి వాణిజ్యాదులు మున్నగు క్రొత్తవిషయములు గూడ విశ్వవిద్యాలయముచే వ్యాపకమునకు తేబడవలయును. సంస్కృతమునందలి గ్రంథములన్నియు తెలుఁగువచనమునఁ బరివర్తితములు కావలయును. పదార్థము ముఖ్యముగాని పదముగాదు. తెలుఁగుగాక మఱి ఒకటోని రెండోనిభాషలు విద్యార్థులు అభ్యసింపవలయును. యావత్ప్రపంచవిదితమై ప్రచుర మగు వాఙ్మయమును నెలకొలిపిన ఇంగ్లీషుభాషయొక్క పరిచయము మిక్కిలి లాభకరము. కావున ప్రాయికముగ నింగ్లీషు నొక ఉపభాషగ నుండవలయును. సంస్కృతము హిందీ అరవము-కన్నడము-ఫ్రెంచి-ఉరుదు-అరబ్బీ-జర్మను మున్నగు భాషలలో నేదియో యొకటి మరియొక ఉపభాషగ నుండనగును. చారిత్రిక భౌతిక శాస్త్రములు కృషి మున్నగువిషయములు జదువువారికి పెక్కుభాషలజ్ఞానము నిర్బంధముగ విధింపఁబడరాదు. ఆంధ్ర దేశమునందున్న మహమ్మదీయులు గూడ ఆంధ్రముననే భౌతికశాస్త్రాది విషయముల నభ్యసింపవలసియుండును. ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ఉరుదుభాషయే ఎల్లరకును పాఠపరీక్షా సందర్భముల విధింపఁబడెను గదా! ఇట్టి విధానము కార్యసాధనము. మహమ్మదీయులు ఉరుదు అరబ్బీ మున్నగు భాషలను ఉపభాషలుగఁ జదువఁగలుగుదురు.

ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్రదేశమునకు ఉపకారి కావలయునన్న పైరీతిని దీనిని సమర్థింపవలయును. అట్లు కాదేని దాన నెంతమాత్రమును లాభ ముండదు.

# భారతీయ ప్రబోధము

అక్కరాజు రాఘవరావు గారు

ప్రాక్పశ్చిమామోఘ పర్వతపంక్తి నీ
    బాహుయుగ్మము గాదె భరతమాత!
పావనోదకములు ప్రవహించునదులు నీ
    హారంబు లగుఁగదా భారతాంబ!
అంబరచుంబితం బౌ హిమాలయము నీ
    ఘనకిరీటము గాదె, కన్నతల్లి!
అల్లరమ్యంబువింధ్యాద్రి నీగజ్జెల
    మొలనూలుఁ గాదె యోపుణ్యచరిత!

గీ. లంక నీపాదపీఠంబు పొంక మంద
దివ్యమంగళరూపంబు తేజరిల్ల
నిన్ను ధ్యానింపఁజాలని నీచుఁ డున్నె?
భరతమాతరో! కేలోడ్తు భక్తి నీకు.

ఉ. పూనితి మీవ్రతంబు నతిపూజ్యము నా నసహాయపద్ధతిన్
మానితి మెల్లదౌష్ట్యము లమంగళమంచు స్వరాజ్యసిద్ధికిన్
గానము సేయుఁడీ భరతకంఠ మృణాళ మృదూక్తి వీచికా
ధ్యానపరంపరా ప్రణవ తత్త్వము సత్యపథంబు నంటుఁగన్.

ఉ. కాదని యూరకున్న నికఁ గల్గదు మోక్షము. జ్ఞానియైన ప్ర
హ్లాదుఁడు చూపినట్టిది సహాయనిరాకరణంబు. వీర లా
మోదముతోడ గాంధి ఋషి పూజ్యుని జిత్తమునందు నిల్పి ని
ష్ఖేదముగా స్వరాజ్యమును జెందుఁడు భారతవీరపుంగవుల్.

సీ. ఆత్మసమర్పణంబందు నెల్లర నేకపాశబద్ధులఁ జేయుపట్టునందు
విద్యాధికులభావవిపులదాస్యధ్వజధ్వంసనంబును జేయఁదలఁచుతఱిని
స్వప్రజాసామాన్య భావపీఠములందు భారతాంబను నిల్పఁగోరునపుడు
అధికారవర్గ దౌష్ట్యానలజ్వాలలఁ జంద్రికాజ్వాలల నలువునెడల

గీ. పశుబలాళిందములకు సంపంగి, భార
తీయహృదయాంబుజములఁ బూదేనె, యగుచు
నుపచరించు నిరాకరణోద్యమంబు
తెలియు స్వేచ్ఛాప్రదము భారతీయులార!

సీ. ఆత్మావబోధకం బౌ రాట్నసత్కళా
    స్ఫూర్తికి జీవంబు పోయరయ్య
పావనం బౌ నాత్మపారిశుద్ధ్యప్రభా
    వముచే స్వరాజ్యంబుఁ బడయరయ్య
కామశాంతికి స్త్రీలకారణంబుగ బలి
    పడెడి వేశ్యావృత్తిఁ బాపరయ్య
నోరులేనట్టి జంతువుల గోవులఁ జంపి
    తినుచు రాక్షసవృత్తి నడఁపరయ్య

గీ. భారతావని పూర్వసౌభాగ్యవిభవ
మును విముక్తియు మీకరంబులనె కలదు.
భారతీయుల కొప్పునే? పరుల వేడ?
పూర్వఋషివర్య రీతిఁ బోదలినారె?

# నేతపరిశ్రమము

## గంటి సూర్యనారాయణశాస్త్రి గారు

శ్లో. వందే భారతమాతరం సురనుతాం సస్యాదిసంశోభితాం, వందే లోకహితైషిణం సకరుణం శ్రీబాలగంగాధరమ్
వందే గాంధిమహాశయం గురువరం గోపాలగోఖ్లేవిభుం, వందే పండితమోతిలాలునెహురుం దాసుం సదా భాసురమ్.

ప్రస్తుతము భరతఖండము దుఃఖసముద్రమున మునిగియున్న సంగతి సర్వజనవిదితమై యున్నది. పూర్వయుగమున పరాత్పరుడగు సచ్చిదానంద స్వరూపుడు కృష్ణావతార మెత్తి శంఖ, చక్ర, గదలను ధరించి రథారూఢుడై యరాతులను నిర్మూలము గావించి, ప్రజలబాధల నంతరింపజేసి మహానందంబు నొసంగె నను పౌరాణికేతిహాసము హిందూహృదయములకు చిరపరిచితమై యున్నది. ఇంకను,

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్."

అని భగవంతుడు వాగ్దానముచేసియున్న సంగతి భారతీయులకు సుజ్ఞాతమే. నిమ్నులైన భారతీయుల నుద్ధరించుటకు అభయదాతయగు భగవానుడే గాంధ్యవతార మెత్తి తూలపుంజ మనుశంఖమును, రాట్నమను సుదర్శనచక్రమును, పంటె యను గదను ధరించి తురీ (మగ్గము) రథారూఢుడై దౌర్జన్యరాహిత్య సహాయ నిరాకరణధర్మయుద్ధమును శాంతితో చేయుచున్న విషయము హిందూమహమ్మదీయు లెల్లర హృదయగహ్వరములలో ప్రవేశించి విజృంభించుచున్నది. సమరము ప్రజలపై నాధారపడియున్నది గాని కేవలము నాయకునిపై లేదు. శాంతిసమరసామగ్రిని గైకొని నియమానువర్తులై గడంగవలసినబాధ్యత ప్రజలశిరస్సులపై నుండి యున్నది. భారతీయు లందఱు నడుములు బిగియించి రాటముల వడుకుచు వడికినదారమును చేతిమగ్గములచే నేయించుచు, తద్వస్త్రములనే ధరించినచో వైదేశిక యంత్రతంత్రములు వెంటనే నశించుటలో సందియ మెంతమాత్రము లేదు. పిమ్మట మనకు విజయ మబ్బుటయే గాక మన దారిద్ర్యపిశాచమును కూడ పాఱద్రోలినవారము కాగలము. సోదరులారా! అట్టి శాంతి యుద్ధసామగ్రి మనకు లేదని శంకించుచున్నారా? ఒక్కసారి భరతఖండపు ప్రాచీన నేతపరిశ్రమలను తిలకింపుడు. చిరకాలమునుండి భరతఖండము చేతిపరిశ్రమలకు పుట్టినిల్లై అందునను నేతపరిశ్రమలో లోకమంతకును ఆదర్శస్థానము వహించియున్న దని మన పూర్వచరిత్ర లుద్ఘోషించుచున్నవి. ఇప్పుడు మన దేశమున గుంతమగ్గము, ప్లైషటల్ అను పేర్లగల మగ్గములు సుమారు ముప్పదివేలు పనిచేయుచున్నవి. వీటితో పలువిధము లగు చీరలు- ధోవతులు- తువాళ్లు- కోటు గుడ్డలు, అంగవస్త్రములు మొదలగునవి చాల సొంపుగను, చక్కగను నేయుచున్నారు. ఇంకను తరులతా కుసుమకోరకాదులు, చిత్రవిచిత్రము లగు బొమ్మలు మున్నగు చిత్రవర్ణములతో నతిచిత్రముగ నేయు మహాశయు లెందఱో యున్నారు. కొన్ని గ్రామములలో హంస, పతాసీ, గవాక్షీ, లాయరు, చౌకి, పిల్లడుగు, బటాబత్తీ, అమీరుఖాణీ, తరంగిణీ, త్రివేణీసంగము, గోదావరిపులినము- చంద్రకాళీ, గులాబీ, బిబిలా అను పేర్లతో నెన్నోవస్త్రములు తయారగుచున్నవి. ఆరణి, తాటిపాక, పొందూరు, ఉర్లాం, శ్రీకాకుళం మొదలగు గ్రామములలో రాటములపైన రెండువందల నంబరు గల నూలుతో సమానమగు నూలురు వడికి పాలమీగడ వలె మార్దవము, కలుగునట్లుగా నేయు నేతగాండ్రు గలరు. మన తెలుగుదేశమున నున్న గుంతమగ్గము, ప్లైషటల్ లలో 20 మొదలు 31 వఱకు నిమిషమునకు లాఢీపారును. కాలికట్టు, కన్ననూరు మొదలగు పట్టణములలో చెక్కగుడ్డలు, పట్టుపంచలు, చీరలు, అధికమై మానుచిన్నెల దుప్పట్లు, వన్నెవన్నెల రవికల గుడ్డలు, కత్రి, సాదా, డ్రిల్లు, మణియు, రెట్టపోలీ, మణటిల్ యను పేర్లుగల తానులు, పార్శ్వభేదపు దుకూలోత్తరీయములు మున్నగునవి ఆటోమేటిక్ ఇంగ్లీషు మగ్గములలోను, సాల్వేషన్-ఆర్మీఫ్యాక్టరీమగ్గములలోను, సయాజి ఫ్యాక్టరీ మగ్గములలోను తయారగుచున్నవి. ఈ ప్రకా

రము తయారగువాటిని వ్రాయవలెనన్న మహాభారతమంత గ్రంథ మగుట కేమిసందేహము లేదు. మనలో కొందఱు మహానుభావులు యంత్రసహాయమును గోరుచున్నారు. యంత్రములనే మనదేశమున స్థాపించినచో నెన్ని కష్టములకు పాలగుదుమో పరికింపుడు. మిల్లులలో నేసిన బట్టలకు, మన చేతిమగ్గములమీాద నేసినబట్టలకు సహస్రాంశము హెచ్చుతగ్గున్న సంగతి యెల్లరకు విదితమే. ప్రప్రథమమున ధనవ్యయమున అనంతరము జనసమ్మర్దముచే నారోగ్యము కూడ సంభవించును. కొంచెము బుద్ధి నుపయోగించి చిత్రవిచిత్రపు వస్త్రములను నేయుచున్నవారలు మిల్లులలో చక్రములను త్రిప్పుచు నిర్జీవప్రతిమలవలె స్వాతంత్ర్యదూరులై యుండవలసి వచ్చును. లాభము అధికారులది. కష్టము పనివారలది యగును. ఇటువంటిమిల్లులగుణములను వ్రాయుటకు నా కలముకూడ వెనుదీయుచున్నది. మగ్గముల వలన నెంతలాభము కలుగుచున్నదో చూడుడు. పది రూపాయలతోను మగ్గము తయారగును. ప్రజ్ఞ నుపయోగించి పనిచేసినచో అధికలాభమేగాక, ప్రతిష్ఠకూడ వచ్చును. నేను మలబారులో చూచిన సంగతిని కొంచెము తెలిపెదను. కన్ననూరులో 20 సంవత్సరముల క్రిందట 35 నేతకంపెనీ లుండెడి వనియు, ప్రస్తుతము సుమారు 379 కంపెనీలవఱకు వృద్ధి యయ్యె ననియు 100-కి 70 మంది నేత నేసి జీవించువారే యనియు, 1 మగ్గము మొదలు 150 మగ్గములవఱకు నొక్కొక్క కంపెనీలో నున్నవనియు నచ్చటి 100 మగ్గములు గల కంపెనీ యధిపతి నాతో చెప్పినారు. 1 మగ్గము గల కంపెనీ యున్నదా? ఉన్నచో వారి కేమిలాభము కిట్టును? అని నే నడిగితిని. తరువాతను వారు నన్ను ఒక కంపెనీకి తీసికొనిపోయి చూపించిరి. అచ్చట భార్య భర్త కుమారుడు ముగ్గురు మాత్రమే యుండిరి. భార్య నూలుతోడి, కండెలు చుట్టియిచ్చు పనిలో మగ్నయై యున్నది. పుత్రుడు పడుగులు పోసి అచ్చు లతుకుచున్నాడు. భర్త నేత నేయుచుండెను. ఈప్రకారము ముగ్గురు కష్టపడి నెలకు రూ 80, 90 లు, ఖర్చులు పోను సంపాదించుచుండిరని వారు సెలవిచ్చిరి. కాలికట్టులో కూడ నిదేవిధముగ వేలకు వేలు జీవించుచున్నారు. మగ్గపు మహాలక్ష్మిగుణముల నుచ్చరించుటకు వేయిముఖములు గల అనంతుడు కూడ సమర్థుడు కాడు. ఉచ్చరించిన గుణములను వ్రాయుటకు సహస్రహస్తు డగు కార్తవీర్యార్జునుడు కూడ వ్రాయజాలడు.

నేతపరిశ్రమ దారిద్ర్యధ్వంసిని, మహాలక్ష్మిప్రదాయిని, దాస్యధూమకేతువు, స్వాతంత్ర్యప్రదాయిని గాన మహారాజులు,జమీాందారులు,విద్యాధికులు, ధనాధికులు, ప్రజ్ఞావంతులు, వణిక్శిఖామణులు, స్వాతంత్ర్యకాములు మున్నగు మహాశయు లందఱు నేతపరిశ్రమను వృద్ధిజేయుటకు తగిన ప్రోత్సాహమును ధనము నొసంగి, ప్రతిగ్రామమునను పట్టణములలోను నేతకంపెనీలను స్థాపించి, దరిద్రులకు దేశమునకు ఉపకారమును జేసి స్వదేశిశాంతిసమరమున విజయము బడసి, దాస్యదారిద్ర్య పదములనుగూడ భరతఖండమునుండి తొలంగించెదరుగాక యని ప్రార్థించుచున్నాను.

# నవ్య భారతి

## సోదరద్వయము

లోకమోహన మైన కోకిలస్వరములోఁ, బరమార్థగీతంబు పాడి పాడి
బ్రహ్మాండభాండంబు నిండించు ఘోషతో, నుపనిషత్సారంబు నూది యూది
మోదంబు గురియించు వేదనాదంబుతో, విశ్వసందేశంబు వినిచి వినిచి
భూలోకస్వర్గంబుఁ బొందించు ప్రేమతోఁ, బరమామృతంబును గురిసి కురిసి
గీ. విశ్వమంగళగీతగానంబునందు, నాత్మ లీనంబు గావించినట్టి తల్లి !
అలసి నిద్రించి మేల్కాంచి తమ్మ నేఁడు, భరతమాతరో ! నీకిదే వందనంబు.
సీ. సింహవిక్రముఁ డైన శ్రీగాంధిదేవుండు, స్వారాజ్యమును దేర శంఖ మొత్తె
అల స్వరాజ్యమునకై యాలీయుగము లేన, ప్రాణంబు లర్పించు పదను జూపె
అలనల్ల మేల్కాంచి యఖిలభారతజాతి, యానందబాష్పంబు లర్ఘ్య మిచ్చె
స్వారాజ్యరవిబింబసంభవసూచనల్, ప్రాచీముఖానఁ గన్పట్టుచుండె
గీ. ఇట్టి యుదయకాలమునందె యట్టలేచి, ముదము గదురంగ చిఱునవ్వ మొలకలెత్త,
దివ్యదర్శన మిచ్చు నీ నవ్యమూర్తి, నాత్మ భావించి మ్రొక్కెద నాదరింపు.
సీ. ధర్మరంగమునందు తగ ధనంజయునకు నండ మైనట్టి గీతామృతంబు
మొఱకు లౌ నరబియా తురకల నవరింప, కడగండ్లఁ బడినట్టి కర్మశక్తి
పరులపాపము లెల్ల పైవై చికొని కొర్రుఁ, గౌఁగిలించిన యేసు గాన సరణి
పైశాచరాజ్యంబు పై పెచ్చుఁ దగ్గించు, ఘనశాక్యసింహు హుంకారరవము
అధమజాతులవారి నాళ్వారు లొనరించు, రామానుజస్వామి ప్రేమరసము
గీ. గాంధిభగవాను నవతారకాంతియందు, లీనమై నేఁడు సందేశ మీనుచుండ
నొడలుపులకించె నానంద ముప్పతిల్లె, నాలకించి తరింపరాదో ! నేఁడు.
సీ. సత్యమే తమధర్మ-శాస్త్రంబు గా నెంచి, భూపాలపరులు పాలించునాఁడు
త్యాగమే తమకుల-ధర్మంబుగా నెంచి, యాత్మార్పణము ద్విజుల్-సలుపునాఁడు
కాయకష్టమె తమ గౌరవంబని యెంచి, శూద్రజనము కర్మ-సలుపునాడు
న్యాయవాణిజ్యంబు-నడపుచు వర్తకుల్, దేశదారిద్ర్యంబు-దీర్చునాఁడు
అధమజాతులవారి-నగ్రజాతులవారు, సమతతోఁ జూచుచు-జరగునాఁడు
గీ. ఆత్మవత్సర్వభూతాని-యనుచు జగతి, నీదు ప్రేమామృతముతోడ-నింపివైచి
సర్వమతములసమతను-జాటునాఁడు "అట్టినాఁ డెన్నడబ్బునో"-యనుచు నుంటి.
సీ. దరికిరానీకుండ-తఱిమి కొట్టఁగఁబడి తపియించు కడజాతి-తమ్ములార !
అగ్రజన్ముల మంచు-ననెడు మహాత్ముల కాలి క్రిందవటించు-మాలలార !
"మాజాతి యిది మాకు-మాతృభూమి" యటన్న, సౌభాగ్య మబ్బని-శ్వపచులార!
కట్టగుడ్డయు లేక-నట్టాడుచుండంగ, జాలి గల్పించు చం-డాలురార !
గీ. భారతాంబిక మీతల్లి-భరతసుతులు, మీకు సోదరుల్. వేవేగ-మేలుకొనుఁడు.
మిమ్ము విడిచిన మాకు మో-క్షమ్ము లేదు. పిలుచుచున్నది రండయ్య-ప్రేమతోడ.

# దుందుభి ధ్వానము

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

తూరుపుఁ గోనలో ♦ దుందుభిస్వనము
వీణారవంబులో ♦ వినవచ్చుచుండెఁ;
బ్రణయరాగంబులో ♦ భావముల్ నిండె,
దుర్మతీ! దుర్మతీ! ♦ తొలఁగి పొమ్మింక.

### ప్రశారణము

భువనకల్యాణైక ♦ పుణ్యరంగమున
సదమల స్వేచ్ఛా ప్ర♦చార రంగమున
సత్యశౌచదయా ప్ర ♦ శాంతరంగమున
సాధుప్రబోధ వి ♦ శ్రాంతరంగమున
సకలమానవ సుఖా ♦ శాంతరంగమునఁ
బ్రణయతరంగిత ♦ ప్రథమరంగమున
విశ్వంబు పులకింప ♦ విజయనాదమున
విజయదుందుభిఘోష ♦ వినవచ్చుచుండెఁ
బశ్చిమద్వారంబు ♦ పడిపోవుచుండె
దుర్మతీ! దుర్మతీ! ♦ తొలఁగిపొమ్మింక:—

సీ. పగలు రే యనక రా♦ ప్పటికిప్పుడే ప్రాణ ♦ ధనమానముల చింత ♦ ముసుఁగ వలసె
నాఁడు నేఁడనక యే ♦ నాఁడుఁ గష్టంబుల ♦ జోడించుచేతలే ♦ చూడవలసె
నిండు సంపదలఁబోసి ♦ మెందు నుల్లము గల్గిం♦చు వార్తలె యాల♦కింపవలసె
వాడు వీఁడనక ము♦ప్పదిమూడుకోట్లు న ♦ ట్లుడికిపోయినయట్టు ♦ లుడుకవలసె
గీ. నీవు వచ్చిన దాదిగా ♦ నేఁటివాఁకఁ, బూటపూటకుఁ దపియించి ♦ పోవవలసెఁ
జాలు నింక మాకు నీపొత్తు ♦ చాలుఁ జాలు, దుర్మతీ! దుర్మతీ! వేగ ♦ తొలఁగిపొమ్మ:—

కామవికారంబు ♦ కడలంటి పోయెఁ
క్రోధానలజ్వాల ♦ కుమిలి చల్లారె
లోభపంకం బింకి ♦ లోపించి పోయె
మోహప్రవాహంబు ♦ మున్నీట మునిఁగె
మదవికారము పద♦మదమయి పోయె
మాత్సర్యరోగంబు ♦ మటుమాయ మయ్యె

సురలోకమున వేగుఁ♦జుక్క తోఁచినది
కొక్కొరోకో యని ♦ కోడి కూసినది
యుదయాద్రిపై నరు♦ణోదయం బయ్యె
ననుకూలపవనంబు ♦ లరుదెంచుచుండె
విజయదుందుభిఘోష ♦ వినవచ్చుచుండె
దుర్మతీ! దుర్మతీ! ♦ తొలఁగిపొమ్మింక:—

సీ. తనువుగందకయుండ ♦ మనసు నొవ్వకయుండ ♦ దడిపాతలను గొంతుఁ ♦ దఱిగినావు
అడుగువెట్టకయుండ ♦ మడిమఁ ద్రిప్పకయుండ ♦ మెట్టుత్రోవను గంచెఁ ♦ గొట్టినావు
విప్పిచెప్పకయుండఁ ♦ జెప్పి చూపకయుండ ♦ శివశివా యన బూతుఁ ♦ జేసినావు
తలఁగి పోవకయుండ ♦ నిలువరింపక యుండ ♦ నట్టియింటను నిప్పు ♦ వెట్టినావు

గీ. నీవు వచ్చిన దాదిగా ♦ నేఁటిదాఁక, నెక్క-రీతిగ నోళులు ♦ నెక్కి-నావు
చాలు నిఁక మాకు నీపొత్తు ♦ చాలుఁ జాలు, దుర్మతీ! దుర్మతి! వేగ ♦ తొలఁగిపొమ్ము:—

ఆరామవైభవం ♦ బడుగంటఁ జేసి
కొమ్మలసంపత్తిఁ ♦ గూలద్రోసితివి
రసగౌరవమున వై♦రస్యంబుఁ గూర్చి
ఘనతరుల్ వెతఁగుందఁ ♦ గా నొనర్చితివి
ఆశావకాశంబు ♦ లట్టిట్టుఁ జేసి
శుష్క-పత్రంబుల ♦ సుళ్లు వెట్టితివి
పచ్చపైరులఁ గత్తి♦పాలు గావించి
పంటవలంతినిఁ ♦ బాడుచేసితివి
నీపేరు గుండెల ♦ నీరుచేసినది
నీయేఁడు పూర్తిగా ♦ నిండిపోయినది
నీవాదు జగమెల్ల ♦ నిండిపోయినది

పాపంబు నీకెట్లు ♦ పండిపోయినది
విరియకే శీలంబు ♦ విరిగిపోయినది
తెలియకే కాలంబు ♦ తిరిగిపోయినది
రాజవీథులలోన ♦ రథములు దిరిగె
శివశివా యనుకొంచు ♦ శిశిరంబు జరిగె
విజయదుందుభిఘోష ♦ వినవచ్చుచుండె
సుమతిచైత్రుఁడు వచ్చు ♦ సూచనల్ దోఁచె
నీకెక్క-డను నిల్వ ♦ నీడలే దిచట
నివురు గ్రమ్మినయట్టి ♦ ని ప్పారినట్లు
కనుఁగొనుచుండఁ జీఁ ♦ కటి జాఱినట్లు
దుర్మతీ! దుర్మతీ! ♦ తొలఁగిపొ మ్మింక:—

## స్వాగతము

సీ. ప్రతిశబ్దగతిను గూడఁ ♦ బాపపుణ్యంబుల ♦ బాటలు సూటిగాఁ ♦ దేటపఱుపఁ
బ్రతినిస్వనంబును ♦ బంధమోక్షంబుల ♦ భావముల్ వెలయించి ♦ బయలుపఱుపఁ
బ్రతినినాదంబు దు♦ర్మతసన్మతంబుల ♦ గాథలు సులువుగా ♦ బోధపఱుపఁ
బ్రతివిరావంబును ♦ పశుదివ్యబలముల ♦ పరిమాణములఁ దూచి ♦ యెఱుకపఱుపఁ

గీ. బ్రణయనాదంబు నిన్నుండి ♦ బయలువ్రాఁకఁ, బ్రకృతిశాంతాంతరంగంబు ♦ పల్లవింపఁ
బలుకుపలుకున శుభవార్తఁ ♦ దెలిపికొనుచు, దుందుభీ! రమ్మ! స్వాగతం ♦ బందుకొమ్మ!

సీ. అసిచాలనము లేని ♦ యాహవభూమిలో ♦ నార్భాట మెఱుఁగని ♦ యట్టిపలుకు
రక్తపాతము లేని ♦ రణమహీతలములో ♦ నట్టహాసము లేని ♦ యట్టి పలుకు
ఉద్ధతుల్ చేరని ♦ యుద్ధరంగంబులో ♦ నలజడి గొలుపని ♦ యట్టి పలుకు
శాత్రవంబులు లేని ♦ సమరాంగణంబులో ♦ నాగ్రహం బొలయని ♦ యట్టి పలుకు

గీ. ప్రణయరసమొల్కు- నీపల్కు- ♦ ప్రకృతి యెల్ల, మంగళాలాపములతోడ ♦ మాఱుమొఱయ
మసృణ మోహన గంభీర ♦ మధురగతుల, దుందుభీ! రమ్మ! స్వాగతం ♦ బందుకొమ్మ:—

## సంబోధనము.

ప్రాణపల్లవముల ♦ రాగంబు మెఱసెఁ
ప్రేమకోరకముల ♦ రేకులు విరిసెఁ
ప్రమదపుష్పముల సౌరభములు పొరసె
నాశ్వాసఫలముల ♦ నమృతంబు గురిసె
శాంతవాహినులలో ♦ సమగతుల్ దొరసె
భావనా ప్రకృతిలోఁ ♦ ప్రణయంబు నెరసె
లక్ష్యంబు చెడకుండ ♦ లయ తప్పకుండ
సుగతి మీఱకయుండ ♦ శ్రుతి గందకుండ
విజయఘోషంబులు ♦ విశ్వంబు నిండ
మ్రోఁగవే! దుందుభీ! ♦ మ్రోఁగవే యింక:—
సుఖదుఃఖభావ ప్రచోదిత జీవ
సతత ప్రచారవిస్తారశబ్దములు
యోగవియోగసంయుక్తసంకీర్ణ
భూతపంచక సముద్భూత శబ్దములు
అపకర్షణాకర్షణాత్తసంచలన
ఘనఖేల ఋజు వక్ర ♦ గమనశబ్దములు
విలయ సర్గక్రియా ♦ విశ్రాంతకాల
చక్రవిభ్రమణ సంజనిత శబ్దములు
సౌఖ్యావహము లైన ♦ సరళశబ్దములు
భయదాయకము లైన ♦ పరుషశబ్దములు
భవదీయ మధుర శబ్దములతోఁ జేర్చి
ప్రణవశబ్దంబుతో ♦ బ్రహ్మాండ మెల్ల
మధురశబ్దబ్రహ్మ ♦ మయముఁ గావింప
మ్రోఁగవే దుందుభీ! మ్రోఁగవే యింక:—
ఆనందలహరిలో ♦ నమృతవీచికల
దివ్యవాయువులలోఁ ♦ దేలించుకొనుచు
శాంతిగీతములలో ♦ సరళస్వరములఁ
బ్రణయతంతువులలోఁ ♦ బలికించుకొనుచు
ధర్మపుష్పములలోఁ ♦ దత్త్వగంధముల
నచలభావములలో ♦ నలరించుకొనుచు
సత్యమండలములో ♦ సౌఖ్యచంద్రికల
విశ్వసౌధంబుల ♦ వెలయించుకొనుచు
నఖిలశబ్దంబుల ♦ నైక్యంబు చేసి
యఖిలార్థములకు నేకార్థంబుఁ దెలిపి
యఖిలచిత్తముల కేకాగ్రతఁ గూర్చి
యఖిలశ్రుతుల కఖండానంద మిచ్చి
యఖిలభూలోక కల్యాణంబుకొఱకు
మ్రోఁగవే దుందుభీ! ♦ మ్రోఁగవే యింక:—

## గానము

చాటవే దుందుభి చాటవే.

౧. చేదుపువ్వులఁ బంచదారగుఁ
జేరఁదీసి గ్రహించు నార్యుల
వాదములలో భేదభావము
లేదు లేనేలేదు లేదని—చాట॥

౨. దారుణక్రియ లెన్ని సల్పిన
నోరు కనియెడి మూలమంత్రము
గోరుముద్దలతోడ నేర్చిన
భారతీయులు భయముపడ రని—చాట॥

౩. నల్లమడుగుల నింపఁ గురిసెడి
బొల్లి మబ్బుల దుళ్లఁ గొట్టఁగ
జల్లగాడ్పులఁ భరతభూముల
నెల్లదిక్కుల నల్లుకొనె నని—చాట॥

౪. ప్రేమసింధు తరంగములలో
సామగానము వెడలె భారత
భూమిలోఁ గలవార లందఱు
సోమయాజుల వార లైరని—చాట॥

౫. నిప్పుఁగొండలనుండి పన్నీ
రుప్పతిల్లఁగఁ జేయుమంత్రము
తప్పకుండఁగ నెల్ల హైందవు
లొప్పఁ జెప్పఁగ రండురం డని—చాట॥

౬. చల్లచల్లఁగ జాతి దుర్మతి
తెల్లబోవుచుఁ బోవుచుండెను
మెల్లమెల్లగ మేలుకొండో
తెల్లవారిన దంచు నెల్లెడ—చాట॥

# స్వరాజ్యసంపాదనము

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ. బి. ఎల్. ఎల్టి.

ప్రతివ్యక్తియును తనకును తనదేశమునకును సంపూర్ణ స్వాతంత్ర్యము కావలయు నని కోరుట స్వభావము. తనయాత్మ స్వరాజ్యమును తనసాధనములవలన సంపాదించుకొనవచ్చును. కాని, దేశస్వాతంత్ర్యము తనఒక్కని చేతను చేకూరునది కాదు. దీనికి తనతోడిసోదరులును, ప్రస్తుతపరిపాలకులును గూడఁ దోడ్పడవలయును. మన ప్రభువులు విదేశీయు లగుటచేత వారి దేశీయులకు నష్టము కలుగు నను భీతితో మన స్వరాజ్యసంపాదనమునకు సాయముచేయుట అసంభవము. మనలో నెమ్మదికి భంగముఁ గలుగకుండఁ జేసి, మనయాస్తిని ప్రాణములనుఁ గాపాడుచు మనకు కొద్దికొద్దిగ రాజకీయస్వత్వముల నిచ్చుచు దేశమునుండి వచ్చు నికరాదాయములోఁ జాలభాగము తమ దేశీయులైన సివిలు మిలిటరీ యుద్యోగస్థుల జీతములకును పెన్షనులకును తమవర్తకాభివృద్ధికిని వినియోగించుకొనుచున్నారు. వీరు కడచిన రెండుశతాబ్దములనుండియు నీదేశములో జరిగించిన పరిపాలనచర్యలవలన నుదారముతో మనకు స్వపరిపాలనము నిచ్చి తొలఁగుదు రను మాట కలలోని వార్త. వీరియందు ప్రజలకు అట్టి నమ్మకముకూడ నశించినది. ఇది తిరిగి పుట్టనేరదు.

కాఁబట్టి ఆంగ్లేయపార్లమెంటుద్వారా సామదానభేదోపాయములవలన మనకు స్వరాజ్యము చేకూఱనప్పుడు దండోపాయమే శరణ్య మని కొందఱి యభిప్రాయము. కాని యీవిషయమును ముందుగనే చక్కఁగ నాలోచించి మనలను వారు నిరాయుధులుగఁ జేసి ప్రపంచములో మఱి యెక్కడను కనివిని యెఱుఁగని ప్రజాదౌర్బల్యమను మహాపాతకమునకు ఒడిగట్టుకొన్నారు. ఇతరదేశస్థులబారినుండి మనము తప్పించుకొనలేనంత నిస్సహాయులనుగఁ జేసి తమ్మునే మన యర్థప్రాణములకు భగవంతుఁడు రక్షకులనుగ చేసినాఁ డనియును, తమరు దేశమును విడిచి వెళ్లిపోయినయెడల నంతఃకలహములవలనను బాహ్యులదాడులవలనను దేశమంతయు రక్తపాత మగు ననియు మనలను భయపెట్టుచున్నారు. ఇట్టిస్థితిలో మనము దండనపద్ధతుల నవలంబించినచో వారుమనలనుమిక్కిలిసులభముగా నలిపి పాఱవేయఁగలరు. వృథగాఁ గొంతకాలము అరాజకమును ప్రవేశపెట్టి మనరక్తమును ఓడ్చినవార మగుదుము. ఈ యుపాయము లెవ్వియు మనవంటి దుర్బలులకు పనికిరావని బాగుగ గ్రహించినవాఁడై దక్షిణాఫ్రికాలో ననేక కష్టముల ననుభవించివచ్చిన గాంధిమహాత్ముఁడు సహాయనిరాకరణసూత్రము నవలంబించి మొండివాఁడు రాజుకంటెను బలవంతుఁడనియుఁ బ్రభువులను ప్రజలకు లొంగఁ జేయవలె నన్న ఆత్మకలబ్ధికి హానికరమైన దౌర్జన్యములతోఁ గూడిన పాశ్చాత్యపద్ధతులను వదలివైచి, దౌర్జన్యరహితమైన త్రోవలను బట్టవలె ననియును మనకు రెండుసంవత్సరములనుండి బోధించి నడపించుచున్నాఁడు.

ఈ సహాయనిరాకరణపద్ధతిలోఁ గూడ కష్టములు లేకపోలేదు. ఒకానొకసమయమందు రక్తపాతము కలుగక మానదు. కాని ఆరక్తపాతము మనదై యుండవలయునుగాని మనవిరోధులదై యుండఁగూడదు. అహింస సత్యము-త్యాగము-దయ-మొదలగు సద్గుణములనలవడఁజేసికొని, విదేశీయుల యన్యాయ్యశాసనములను ధిక్కరించి వారు విధించు శిక్షలను ఓర్పుతో ననుభవించుచుండిన యెడల, వారే క్రమక్రమముగ బలహీను లగుటయును స్వరాజ్యము దేశములో సుస్థాపిత మగుటయును సంభవించును. ఈ విధానమును మన మెంత శీఘ్రముగా-దేశమం దంతటను ఒక్కసారిగా-నాచరణలో పెట్టిన నంతత్వరలో-మనకు స్వరాజ్యము రాఁగలదు. విదేశీయుల యన్యాయ్యశాసనములలో-శాంతిసంఘ నిషేధము-వాక్స్వాతంత్ర్యలేఖనస్వాతంత్ర్యనిషేధములు-మన యసహాయోద్యమప్రచారమును ప్రస్తుతము అరికట్టనున్నవి. వీనిని మనము ముందుగా నిరాకరించి ప్రభువులు విధించు శిక్షలను సంతోషముతో ననుభవించుచు వేనకువేలు కారాగృహముల నింపుచుండవలయును.

ఇదియుఁగాక మనప్రభువులను ప్రజలు వశపరుచుకొనవలయు ననిన రాజ్యపరిపాలనమునకు ఆయువుపట్టగు వారిరాబడిని తగ్గింపవలయును. పన్నులను చెల్లింపక నిరాకరించిన యెడలఁ బ్రజలు కోరు రాజ్యవిధానమును వారు ప్రవేశపెట్టి తీరుదురు. కాని ప్రతిపల్లెలోను, ప్రతిపట్టణములోను నుండు జనసామాన్య మంతయు నొక్కుమ్మడిగ

ఈవిధానము నవలంబించుట సాధ్యపడునా? ఇట్టి ఐకమత్యము సంభవమా? ఒకసేరు దోమపాలు సంపాదింపగలిగిన మొసలిం జచ్చినవానిని బ్రతికింపగల నన్నట్లుగా నున్నం దని కొందఱనవచ్చును. కాని యీ విధానమును దేశమంతయు నొక్కసారిగా నారంభింప నక్కఱలేదు. ఒక్క తాలూకాలోని గ్రామముల ప్రజలలో విశేషపుచుండి జనులు భూమిపన్నుల నీయకుండ చేయగలిగినం జాలును. గాంధిమహాత్ముడు ఈశక్తియైనను సులభము కాదనియు నీ విధానము నవలంబించుటకు ముందు నాలుగైదు విషయములలో నొక్క తాలూకాజనమైనను ఐకమత్యముతో జయప్రదముగం బనిని సాగింపగలిగిన యెడల పన్నులనీయకుండం జేయగల మనియుం జెప్పుచున్నాడు. ఆయన చెప్పెడి విధానము లివ్వివి:—

### 1. స్వయముగ వడికిన నూలుతో స్వయముగ వస్త్రముల నేసికొనుట

హోటలులలోనుండిగాక స్వంతముగ వంటచేసికొనుట ప్రతికుటుంబమువారికి నెట్టి ఆచార మైనదో, అట్లే మనకు కావలసిన వస్త్రములకై మనము మనరాటముల మీఁద స్వంతముగా నూలువడుకుట ఆచారమై యుండవలయును. ఇట్లు ప్రతియింటను చేసినయెడల యంత్రశాలలలోఁ దయారగు వస్త్రములంతచవుకగా మనవస్త్రములు కూడ నుండగలవు. మనవి యెక్కువకాలము కూడ మనును. సుమారు అఱువదికోట్లరూపాయలు మనవస్త్రములక్రింద విదేశములకు పోకుండ నాపగలుగుదుము. యంత్రస్థాపనలవలన పాశ్చాత్యరాష్ట్రములలో కలుగుచున్న బాధలను నివారించుకొనగలుగుదుము. ముదుకవియగునీదీక్షావస్త్రములను ధరించుకొనుటవలనం బ్రతినిమేషము మనశరీరమువంకకు దృష్టి ప్రసరించుచుండుటచేత స్వదేశస్థితి స్ఫురణకు వచ్చును, స్వరాజ్యసంపాదనకు సాధనముల నరయుచుం ద్యాగముచేయుటకు సదా సిద్ధపడుచుందుము. ఇట్టి స్వదేశీవ్రతదీక్షను ఒకతాలూకాలోనిజనమైనను గట్టిగాపూనుకొని జయప్రదముగ కొనసాగించినయెడల నీ ప్రధానవిషయములో జనించిన ఐకమత్యమే సర్కారుకు పన్నుల నీయకుండ జేయంగలదు. అందఱకు నుపయోగ మైనట్టియు నార్థికసంబంధ మైనట్టియు నెవ్వరికిని హానికరము కానట్టియు నీవిషయములోనే ఒక్కత్రాటిమీఁద నడువలేని ప్రజలు పన్నుల నిచ్చుటను నిరాకరింపగలరా? కొందఱు నిరాకరించినను, వారియాస్తిని జప్తుచేసి యేలము వేయించినయెడలను తక్కినవారు కొనకుండ నుందురా?

### 2. మద్యపాన నిషేధము

శరీరమనోదార్ఢ్యములను నశింపఁజేయునట్టియు ననేకనేరములకు పుట్టినిల్లయినట్టి దారిద్ర్యమునకు ముఖ్యహేతు వైనట్టి మద్యపాన దుర్వ్యసనమును దేశమునుండి పాఱద్రోలుటకు ఇచ్చగింపనివాఁ డెవ్వఁడు? కాని బ్రిటిషువారి పరిపాలనములో, దీనిక్రింద వ్యయమగుచున్న ద్రవ్యము అపరిమితము. ప్రభువులరాబడి హెచ్చుగుచున్నది. కల్లుసారాయిదుకాణములు మూయింపగలిగినయెడల ఆబ్కారీ పోలీసు క్రిమినల్ డిపార్టుమెంటుఖర్చులు తగ్గుటయే గాక ప్రజలచేత నెక్కువసొమ్ము నిలువచేయింపఁగలుగును. ప్రజలు ఈవిషయములో కట్టుగట్టి పనిచేయఁగలిగినయెడల ఈకట్టేపన్నులను నిరాకరింపగల శక్తిని వృద్ధిచేయును.

### 3. జాతీయపాఠశాలలలో విద్యనేర్పుట

మన పూర్వవిజ్ఞానమును, ఆధునికశాస్త్రజ్ఞానముతో మేళవింపఁజేసి దేశోపయోగకరమైన దేశాభిమానమును పురికొల్పునట్టి కళలను శాస్త్రములను దేశభాషలలో నభ్యసింపఁజేయవలెను. కాని ఈవిదేశప్రభుత్వములో పొట్టకూటికిని యూడిగమునకు మాత్రము పనికివచ్చు విద్యకొఱకై మనధనమును శరీరమును ధారపోయుటను మాన్పవలయును. పూర్వపు బడులనే పునరుద్ధారణము చేసి సామాన్యవిద్య నంతయు చవుకగ గ్రామములలోని బాలురందఱకును గఱపవచ్చును.

### 4. గ్రామపంచాయితీల నేర్పరచుట

ఈ కలియుగములో మనుష్యమాత్రులకు క్రోధమోహమదమత్సరము లుండుట స్వాభావికము. గ్రామములలో కలహము లెప్పుడును అంతరింపవు. కాని వీనిని వారించు మార్గము పంచాయితీసభల యేర్పాటే. ఇప్పటికోర్టులు జూదరులకును ధనవంతులకును లాభకరములు గాని బీదలకు న్యాయమును కలుగఁజేయుటకు ఎట్టి సౌకర్యములను కలుగఁజేయుచుండుట లేదు. కాబట్టి ధనవ్యయము - శరీరకష్టము - ఆలస్యము - తుదకు చిత్తుభోకులు సంభవించకుండ జనులు గ్రామపంచాయితీసభలకు బద్ధులై అహంకారములను చంపుకొని పట్టణములలో

నున్న కోర్టులకు పోకుండ నుండగలిగినయెడల పన్నులను నిరాకరింపగలశక్తి ప్రజలకందఱకును చేకూఱును. ఇట్లు ఒక్కసంవత్సరము పరస్పరవైషమ్యములను చంపుకొనఁ గలిగినయెడల స్వరాజ్యకోర్టులు స్థాపింపఁబడినతరువాత, తిరిగి జూదమాడుటకు దుర్మార్గులు ప్రారంభింపవచ్చును.

### 5. అస్పృశ్యత

ప్రతిగ్రామమునకును అంటుకొని ఒక మాలపల్లెయు మాదిగపల్లెయుఁ దరుచుగా నుండును. తరతరములనుండియు నీపంచముల కుటుంబములు తామరతంపరగా పెరుగుచున్నను తమపూర్వుల గడలనే కనిపెట్టుకొని అనారోగ్యకరములగు పదార్థములను దినుచు, ఆ రొచ్చుగుడిసెలలోనే నివసించుచు, త్రాగుడుమొదలగు దురభ్యాసములకు లోనై గోచిపాతతో గ్రామస్థులకు ఊడిగము చేయుచు, నెట్టి విద్యాగంధమును లేక, దారిద్ర్యము ననుభవించుచున్నారు. కాఁబట్టి వీరిగాలిసైతము సోఁకుటకు తక్కిన ప్రజలు ఇష్టపడకున్నారు. వీరిని చండాలురని పిలుచుచు గ్రామములలోని బావులలో మంచినీళ్లను చేదుకొనుటకు సైతము రానిచ్చుటలేదు. వీరికి సంబంధించిన యీ అస్పృశ్యతాదోషమునైనను పోఁగొట్టి వీరిస్థితిని కొద్దిగానైనను మనము బాగుపఱచుచు వీరిని మన హైందవ సోదరులనుగా చూచుట మిక్కిలి అగత్యము. అట్లు శీఘ్రముగాఁ జేయనియెడల వీరు అన్యమతములలో కలిసి మన అసహకారోద్యమములో పాల్గొనుటకు నిరాకరించెదరు. మన విదేశప్రభువులకు సహకారులగుదురు. పన్నుల నీయకుండ మనము నిశ్చయించినపుడు సర్కారువారు మనపైరునుగాని, యితర చరాస్తినిగాని జప్తుచేసినయెడల, దానిని జైలుకు తీసికొనిపోవుటకు ఈపంచములుకూడ నిరాకరింపవలసియుందురు. వీరితోడ్పాటు లేకుండ మన ఐకమత్యమును ఉద్యమమును జయప్రదముగ సాగనేరవు.

పైనిచెప్పిన అయిదువిధానములును ఏతాలూకాలో అమలులో బహుమంది పెట్టఁగలరో, ఆతాలూకావారు ఆఖరుమెట్టగు భూమిపన్నుల నీయకుండఁగూడ నిరాకరింపగలవారగుదురు. ఇది యొక గొప్ప హక్కనియును దీనిని పై సాధనములను చేసిన ప్రజలే ఉపయోగింపవలసిన దనియును గాంధిమహాత్ముఁడు చెప్పుచున్నాఁడు. ఇంతవఱకు, పైవిధానములను బాగుగ నాచరణములోఁ బెట్టిన తాలూకా తమకు దొరకలేదనియు, శీఘ్రకాలములోనే ఘూర్జరదేశములో ఒకటి రెండు బరులు దేఱఁగల వనియు సహాయనిరాకరణ విధానము నంతను అక్కడ ముందుగా నాచరణములోఁ బెట్టినపుడు తామందఱు పడుబాధలను జాగ్రత్తగ గమనించుచు దేశమంతయు దౌర్జన్యరహితముగ నుండవలయునని బోధించుచున్నాఁడు. పైనిచెప్పిన అయిదువిధానములనుఆచరణములోఁ బెట్టఁగల ఏతాలూకావారైననుఆఖరువిధానమైన యీ పన్నుల నిరాకరణసూత్రమును కూడ అవలంబింపవచ్చునని రాష్ట్రీయకాంగ్రెసుకమిటీలకు అధికారమీయఁబడియే యున్నది. ఇది అక్కడక్కడ మూఁడు నాలుగు గ్రామములలో జరిగిన లాభము లేదు. అప్పుడు గ్రామములమధ్యను అంతఃకలహములు ప్రారంభించి తుదకు దౌర్జన్యములును అరాజకత్వమును ప్రబలును. ఇట్టివి తప్పించుటకే ప్రతిగ్రామములోను శాంతిసైన్యమును ఏర్పాటుచేయవలయును. ఒక్కొక్కప్పుడు మనము అనుకొనని బాధలు సర్కారు ఉద్యోగస్థులే కలుగఁజేసి మనవారిని దౌర్జన్యకార్యములకు పురికొల్పవచ్చును. అప్పుడు కూడ సహింసావ్రతము ననలంబించి ధీరచిత్తులమై నిలుచున్నయెడల స్వరాజ్యమునకు అర్హులమని పాలకులు ఒప్పుకొని మన ప్రజాప్రతినిధులకు స్వయంనిర్ణయాధికారము నొసంగి తీరుదురు.

# భారతీయ ప్రబోధము

నిడదవోలు వేంకటరమణ కవిగారు

సిరులెల్లఁ గోల్పోయి జీర్ణాంశుకము దాల్చు
తల్లిదుస్థితినైన తలఁపకుండఁ
మానభంగము గాంచి మహి వీడఁ దలఁచెడు
సోదరీమణులను చూడకుండ
సుకుమారులై కష్టనికరంబు నోర్చిన
చిన్ని తమ్ముల ముద్దుసేయకుండ
తల్లికై ప్రాణంబు ధారపోసెడు నట్టి
నాయకులను బట్టి నడువకుండ
ధర్మరణభూమి సత్యశస్త్రమును దాల్చి
ఆల మొనరించి స్వర్గంబు నందకుండ
బ్రతికియున్నాఁడవే యింక వసుధపైని
భారతాత్మజ! జీవచ్ఛవంబ వగుచు!

సీ. పుట్టినా వెందుకు పూతచరిత్రయౌ
భారత మాతృ గర్భంబునందు
బ్రతికినా వెందుల కలుషిత ధర్మసం
స్థాపన మొనరించు సమయమందు
వినినా వెందుకు ఘనతర స్వాతంత్ర్య
కలితధ్వనులు ప్రాయకాలమందు
కనినా వెందుల కనుపమ దీక్షతో
నసువు లభించెడి యదను నందు
శాంతిసమరంబునందు నావంత యేని
పాల్గొనకయుంట నీకిది పాడి యగునె?
తరుణమరుదెంచె. భారతాత్మజుఁడ! లెమ్ము
తల్లిఋణమును దీర్పని తనయుఁ డేల?

సీ. నిఖిల ప్రపంచ శాంతిస్థాపనఖ్యాతి
తమ్ముఁడా! నీ కింక దక్కఁబోదు
పరమధర్మ క్రియాచరణ యశఃకాంతి
సోదరా! నీ వింకఁ జూడఁబోవు
మాతృదాస్యచ్ఛేద మహనీయ తరకీర్తి
అవరజా! నీ వింక నందలేవు
దేశ సేవార్పిత ధీ జీవితఫలంబు
సనుజుఁడా! నీ వింక నంద బోవు
ధర్మయుద్ధంబు నందు నుద్యత్ప్రభావ
దీప్తిఁ బోరాడి నీవిధిఁ దీర్పవేని
నేఁడు వెను కంజవేయుచు నిలుతు వేని
జడుఁడవేగాని భరతాత్మజుఁడవు గావు.

సీ. మనతల్లి దుఃఖాగ్ని మలఁగుచు నుండఁగ
సంతసింపుచునున్న శాంతియుతులు!
మనతల్లి స్వాతంత్ర్యమునకుఁ బోరుచునుండ
వెనుక జంకుచునున్న వీరవరులు!
మనతల్లి ధర్మంపుమహిమ నిల్పఁగ నోర
దేశంబుతో బోని దివ్యమతులు!
మనతల్లి స్వేచ్ఛావిధినిఁ గోరుచుండఁగ
దాస్యభావము గోరు ధర్మపరులు!
స్వార్థమే పరమార్థ మటంచు నెంచి
యూడిగము సల్పి జీవించుచున్నవారు!
కలిగియున్నారు తల్లికిఁ గడుపుచేటు
వారిలో నేమి నీ పట్టు వదల కయ్య.

సీ. ధరఁగనట్టి దుర్భర దాస్య భారంబు
నింక నెన్నాళ్లు భరింపఁగలవు?
విపరీతమతియయి అపకీర్తిపాలయి
ఇంక నెన్నాళ్లు చరింపఁగలవు?
ఆత్మగౌరవమున కతిదూరమై భూమి
నింక నెన్నాళ్లు వసింపఁగలవు?
కడగండ్లతో గ్రాఁగి కలఁగుతల్లిని చూచి
యింక నెన్నాళ్లు తరింప గలవు
భారతాత్మజ! తరుణంబు బాసితేని
స్వేచ్ఛయనునది గగనారవింద మగును
దేశమాత ఋణంబును దీర్పలేని
సౌఖ్య మది యేల? చదువేల? జన్మమేల?

సీ. అఖిలభారతయశః ప్రథితమందిర పున
రుద్ధారణా మహోద్యోగమునకు
ప్రవిహత భారత ప్రాచీన విజ్ఞాన
వల్లికాదోహద వ్రతమునకును
పరరాజ్యకలిత సంపన్మగ్న నిజసంప
దవాప్తి పునరవతరణమునకు
వినతచాతుర్యైక వివిధచతుష్షష్టి
కమనీయ సత్కళా గ్రహణమునకు
శాంతి సంస్థాపన క్రియాచరణమునకు
ధర్మ సంస్థాపనాది సత్కర్మమునకు
తరుణ మరుదెంచె భారతాత్మజుఁడ నేఁడు
నీవిధిని దీర్చి చిరకీర్తి నిలుపు మయ్య.

# శ్రీనాథ మహాకవి ప్రశంస

బండారు తమ్మయ్యగారు.

ధీరకీర్తిన్ గవిసార్వభౌమబిరుద శ్రీనాథు శ్రీనాథు దు
ష్కరశైవ వ్రతశీలు నాత్మసుతుగాఁ గాంచంగఁ దా మెట్టి స
ద్వరపుణ్యంబులు సల్పినారొ ధరణిన్ ధన్యాత్ములు కామ సం
హరపూజాపరతంత్రమానసులు మారామాత్యభీమాంబికల్.

సీ. కవులెల్ల నవ్వనఁ గవితాపథమునందు స్వైరవిహారంబు సలిపినాఁడు
దిగ్విజయము సల్పి దిశ లెల్ల భేరీరవంబులను జెవుడు వఱిచినాఁడు
గౌడడిండిమభట్టు కవిసార్వభౌముని నొడిచి తద్బిరుదంబు వడసినాఁడు
కనకాభిషేకసత్కారంబు కర్ణాట భూనాయకునిచేతఁ బొందినాఁడు

గీ. పార మిడరాని శివభక్తి సారకలన, స్వీయనామము శ్రీనాథు సార్థకముగ? హాసించినాఁడు
నిరతమును గీర్తి కాంతను మఱగినాఁడు, ప్రకటధీశాలి శ్రీనాథసుకవిమౌళి.

సీ. అఖిలదుర్గుణకందహాపరాగావనిమునందు శివపదార్చనరతిఁ దవిలినావు
ఆగమజ్ఞానతత్త్వార్థసేవధియయి నిగమాంతవేదివై నెగడినావు
శృంగారశివమూర్తిఁ జింతించి మది భక్తి శృంగారరసము వర్షించినావు
భవునకుఁ దద్భక్తవరులకు లేశంబు భేదంబులేమి భావించినావు
కొనుట యిచ్చుటలు భక్తులయొద్దనే పోలునెంతయు నను గుట్టు నెఱిగినావు
కృతులెల్ల శివభక్తతతి కిచ్చి నిలచెనే వారిస్థిరకీర్తి నిలిపినావు

గీ. అట్టి నిన్ను స్త్రీధనలోలుఁ డని వచింత్రు, పామరులు గొందఱైన నీకేమి కొదువ?
బోధపడకున్నె నిజము సద్బుద్ధులకును, సుగుణగణధన్య! శ్రీనాథ సుకృతగణ్య?

ఉ. ముప్పిటు చెల్లునో యనుచు ముందు దలంపక, తాతరీతిగా
నెప్పటికప్పుడే ధనము నెల్లను నర్థుల కిచ్చి, లేమిచేఁ
దిప్పలనొందితే తుదిని! దీనికతంబున జాఱుఁడంచు నిన్
జెప్పఁగఁ గొంద ఱయ్యు లిఁక నేర్చిద రంచు నెఱుంగనైతివో?

ఉ. కమ్మని తెల్గుబాస నుడికారపుసొంపు, రసంపుఁబెంపు, పా
త్రమ్ములరూపవర్ణన, సుధామయసంస్కృతమంజువాక్ప్రపూ
రమ్ములధాటి, భావముల రమ్యతయున్, గవిసార్వభౌమ! నీ
సొమ్ములుగాక యన్యునకుఁ జొప్పడునే మఱి వేయుచెప్పినన్.

చ. చెవులకు దుర్భరంపువ్యథ సీసములం గరఁగించి పోయఁగా
నవునని లోకమందు జనులాడెడు మాటల నోటువుచ్చి, మేల్
చవులను విందుసేయుచును సంతతకర్ణరసాయనంబులై
హావణిలు నీదు సీసములకా! రసమూర విచిత్రరీతులన్.

మ. భరమై కుమ్మరికోటికిన్ నికరమై, ఫాలాక్షుసద్భక్తికిన్
స్థిరసత్కీర్తికిమూలమై, సుకవితా సీమంతినీకేళిమం
దరమై, యర్థులపాలికల్పనగమై, ధీసేవ్యమై, నిత్యసం
స్మరణీయం బగు నీదుమూర్తి సముపాస్యం బంచుఁ గీర్తించెదన్.

# వంగూరి సుబ్బారావుగారి పుస్తకములు

అపరూపగ్రంథములు! | నూతన ప్రచురములు!!

## ప్ర భా త ము

కర్త:-వంగూరి సుబ్బారావు.

కృష్ణదేవరాయని అంతఃపుర విశేషముల వివరముగఁ దెలుపునవల. కృష్ణరాయని వివాహము, దండయాత్ర, తిమ్మరుసు రాజనీతి, వరదరాజమ్మయనన్య ప్రేమము వర్ణితము. ఇది 1922 సంll రము ఇంటర్మీడియేటుకు, హైయరు ఎలిమెంటరీ ట్రెయినింగు విద్యార్థులకు, మైసూరు విశ్వవిద్యాలయము మెట్రిక్యులేషనుకు, విజయనగరము సాహిత్య పరీక్షలకుఁ బఠనీయగ్రంథముగ నిర్ణయించిరి. పండితులు, పత్రికలు నిది నవలా ప్రపంచమునకు ప్రభాతమువంటి దనిరి. ఇదివఱకే సుమారు 3000 ప్రతులు వ్యయమైపోయినవి. వెల. రు. 0—12—0

అనేక పాఠశాలలలో పఠనీయ మెంపర్చినారు. సులభశైలి. స్త్రీలు, బాలురు చదువవచ్చును.

ఆంధ్రవాఙ్మయనిర్మాతలు

## వే మ న

కర్త:-వంగూరి సుబ్బారావు.

5 చిత్రపటములు ప్రాచీనమైనవి కలవు. తంజావూరి రాజులు వేయించిన రంగులపటమునుండి తీసిన ఫోటో, వేమన్న శిష్యులాతనికి సమీపకాలమున వ్రాసిన "వేమనచరిత్ర" మను ద్విపదకావ్య వివరము లున్నవి.

### వి ష య సూ చి క



అను 18 శీర్షికలు, ప్రసిద్ధకవుల పాఁగడ్తపద్యములతో, పండితుల విమర్శనములతో, గ్రీకు, ద్రావిడ, కర్ణాటక, మహారాష్ట్రకవుల పోలికలతో, "సంపూర్ణ జీవితము-బోధనలు" గల గ్రంథము 280 పుటలు కలదివ్రాసినది. అనేక నూతన చరిత్రాంశములు నిన్నటికలుకు తేలని విందుగలవు. వెల ప్రతి 1-కి 1-8-0

విద్యార్థులకు సాధారణప్రతి వెల రు. 1—4—0

## ఆం ధ్ర క్ష త్రి యు లు.

[వాదోపవాదములు]

సంపాదకుఁడు:—వంగూరి సుబ్బారావు.

చిరకాలమునుండి కొందఱు చరిత్రకారు లాంధ్రులనుగుఱించి కొన్ని విరుద్ధాంశములు వ్రాయుచుండిరి. అవియైనఁ జిన్నగ గ్రహింపక శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ యాంధ్రుల చరిత్రముపీఠికలోఁ బనిలేదిది తెలుఁగుక్షత్రియులు శూద్రులని తీర్మానించిరి. ఇది యన్యాయమని వంగూరి సుబ్బారావుగారు బదులువ్రాసిరి. దానిపై నేయిపోసిన యగ్నివలె శ్రీ వీరభద్రరావుగారు సుబ్బారావుగారిని,క్షత్రియ వైశ్యసంఘములను దూషించిరి. కాళింగులు, ఒడ్డెవాండ్రు, పల్లెవాండ్రవలె యజ్ఞోపవీతములు ధరించిరని రొంపి పెట్టివాదమును ప్రారంభించిరి. మరి కిది వింతగాఁ బరిణమించుట లోకమున కరుదు! ఇది యంతయు ఖండించి క్షత్రియులు, ద్విజులని బుజువుచేసిన వాదోపవాదములు, వీరభద్రరావుగారి యసత్యకలుషితము లైన వ్రాతలుగలవు. చదివి తీరవలెను. నడుచు వెలయువారు. రెడ్లు, వైశ్యులు. కమ్మవారి ప్రసంగమువచ్చును. రెండు పత్రములు వ్రాతలుకలవు. వెల 1 కి రు. 1—8—0

చిత్రపటములు! క్యాలికో బైండు!! గిల్టుఅక్షరములు !!!

## ఆంధ్ర వాఙ్మయ చరిత్రము

కర్త:-వంగూరి సుబ్బారావు.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు మెచ్చి పీఠిక వ్రాసిరి. శ్రీ చెలికాని లచ్చారావు జమీందారుగారు రు 1116 లు బహుమానమిచ్చిరి. ఆంధ్రవాఙ్మయ పుట్టుక మొదలు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కాలమువఱకుఁ బుట్టిన వేలకొలఁది గ్రంథముల- వానివివరములు- పురాణములు, ప్రబంధములు, శతకములు, దండకములు, వచనములు, కీర్తనలు, మొదలగు వాఙ్మయస్వరూప స్వభావ చరిత్రమును స్త్రీలు బాలురుకూడ గ్రహించుటకు వీలైన సులభ శైలిలోనున్నవి. పరిశోధకులైన కె. వి. లక్ష్మణరావు పంతులు, మానవల్లి రామకృష్ణకవి, వేదము వేంకటరాయశాస్త్రి మొదలగు పండితులు, జయంతిరామయ్య పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, మొదలగు విద్యాధికులు, పత్రికలు, మెచ్చుకొనినది. మదరాసు ప్రభుత్వమువారు, జిల్లాబోర్డులవారు, మైసూరు విశ్వవిద్యాలయమువారు పోషించిన గ్రంథము.

ప్రతి గవర్నమెంటు, బోర్డుసెకండరీస్కూలు లైబ్రరీలకును సప్లయిచేసినది. వెల 1 కి రు 5—0—0

80 ప్రతులుమాత్రము మిగిలియున్నవి. రెండవ ముద్రణముగును.

**కమల కుటీరము. మైలాపూరు,మదరాసు.**

SREEMATHI KASTURIBAI GANDHI



శ్రీమతి కస్తూరిబాయి గాంధీ

SREEMATHI SARALADEVI



శ్రీమతి సరళాదేవి

SREEMATHI VASANTHIDEVI



శ్రీమతి వాసంతీదేవి

SREEMATHI U. LAKSHMIPAYMMA



శ్రీమతి ఉన్నవ (లక్ష్మీబాయమ్మ)

DUVUVURI SUBBAMMA GARU



దువ్వూరి సుబ్బమ్మగారు

URMILA DEVI GARU



ఊర్మిళాదేవిగారు

BIAMMA (Mother of Ali Bros)



బీ అమ్మ (అలీసోదరుల తల్లి)

FAMLY OF C. NARAYANA RAU



శ్రీయుత చిలుకూరి నారాయణరావుగారి కుటుంబము

SRI AYURVEDA PANCHANANA
KRISHNA SASTRI KAVADE B. A.



శ్రీయుత ఆయుర్వేదపంచానన కృష్ణశాస్త్రి కవడే బి. ఏ.

C. F. ANDROOS



సి. ఎఫ్. ఆండ్రూసు

GEORGE JOSEP



జార్జి జోసఫ్

# శ్రీ వాల్మీకి రామాయణము

## ఆంధ్ర వచనము

ఈ పుస్తకమునందు అతిసుందరమైన 115 పటము లున్నవి

సంపూర్ణము 9 సంపుటములు వెల రూ ౧౧-౦-౦

### శ్రీమదాంధ్ర వచన మహాభాగవతము వచనము

| | | | |
|---|---|---|---|
| మొదటి సంపుటము, కాలికో బైండు ప్రథమ, ద్వితీయస్కంధములు. | ౧ | ౪ | ౦ |
| రెండవసంపుటము, తృతీయ, చతుర్థ స్కంధములు | ౧ | ౪ | ౦ |
| మూడవసంపుటము, చతుర్థ, పంచమస్కంధములు | ౧ | ౪ | ౦ |
| నాల్గవ సంపుటము, షష్ఠ, సప్తమ స్కంధములు | ౧ | ౪ | ౦ |
| ఐదవసంపుటము, అష్టమ, నవమ స్కంధములు | ౧ | ౪ | ౦ |
| ఆఱవసంపుటము, దశమస్కంధము, ప్రథమభాగము | ౧ | ౪ | ౦ |
| ఏడవసంపుటము ,, ద్వితీయభాగము, సంపూర్ణము | ౧ | ౪ | ౦ |
| ఎనిమిదవసంపుటము, ఏకాదశ ద్వాదశస్కంధములు | ౧ | ౪ | ౦ |

ఇందులో పోస్టేజి చేరియుండలేదు.

| | | | |
|---|---|---|---|
| ఆచార్యసూక్తి ముక్తావళి | ౩ | ౮ | ౦ |
| వసుచరిత్రము, టీకాతాత్పర్య విశేషార్థసహితము | ౪ | ౦ | ౦ |
| మనుచరిత్రము ,, (కాలికో బైండు) | ౨ | ౦ | ౦ |
| శ్రీ సీతా రామాంజనేయ సంవాదము.—టీకా తాత్పర్య విశేషార్థ సహితము, కాలికో బైండు | ౩ | ౪ | ౦ |
| శృంగారనైషధము:- పటములు గలవు. | ౩ | ౦ | ౦ |
| విశ్వగుణాదర్శము:— సటిప్పణాంధ్రపద్యటీకా తాత్పర్యేతిహాససహితము, కాలికో బైండు | ౨ | ౮ | ౦ |
| రాఘవపాండవీయము.— సటీకాతాత్పర్యము (కాలికో బైండు) పటములు గలవు. | ౨ | ౦ | ౦ |
| సప్తమస్కంధము.— టీకాతాత్పర్య సహితము కాలికో బైండు. | ౧ | ౮ | ౦ |
| ఆంధ్రనిఘంటుత్రయము.— (ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు) కాలికో బైండు | ౧ | ౨ | ౦ |
| ,, ,, అట్టబైండు | ౦ | ౧౪ | ౦ |
| రామదాసు చరిత్రము | ౧ | ౦ | ౦ |
| డిటో కాలికో బైండు | ౧ | ౨ | ౦ |
| శ్రీ వేంకటాద్రిస్వామికీర్తనలు | ౦ | ౮ | ౦ |

సంపూర్ణము 8 సంపుటములు వెల రూ ౧౨-౧౨-౦

| | | | |
|---|---|---|---|
| నృసింహశతకము - మూలము మాత్రము | ౦ | ౨ | ౦ |
| బాలరామాయణము డిటో | ౦ | ౩ | ౦ |
| పరమానందయ్యకథలు | ౦ | ౨ | ౦ |
| ఇందిర | ౦ | ౮ | ౦ |
| శ్యామల | ౦ | ౮ | ౦ |
| వైరాగ్యశతకము - అత్యద్భుత కథ, భీష్మునిచరిత్రము | ౦ | ౬ | ౦ |
| రుక్మిణీకల్యాణము-సటీకాతాత్పర్యం, కాలికోబైండు | ౦ | ౧౨ | ౦ |
| డిటో డిటో పేపరుబైండు | ౦ | ౮ | ౦ |
| ఆంధ్రసంధ్యాటీక | ౦ | ౮ | ౦ |
| కుమారీశతకము | ౦ | ౩ | ౦ |
| భాస్కరశతకము | ౦ | ౪ | ౦ |
| సుమతిశతకము టీకాతాత్పర్యము | ౦ | ౩ | ౦ |

కమలిని:- ఇదియొక చక్కని నవల- ఇందలి కథ అతి మనోహరము. శైలి మృదుమధురము. శ్రీ కృష్ణదేవరాయలవారి యల్లుడగు రామరాజు కాలమునాటి చరిత్రసంబంధమగు నవల. ఇందలి కథానాయికానాయకుల పట్టుదలయు అరణ్యవర్ణనము మొదలగునవి స్వభావసిద్ధముగా ఆంధ్రస్త్రీచే వ్రాయబడినది. 190 పేజీలుగల యీ నవల పెద్దదు మెయిటు కాగితములమీద క్రౌను సైజున చక్కగ ముద్రింపబడినది. ౧ ౦ ౦

### సంస్కృత గ్రంథములు - తెనుగు లిపి

| | | | |
|---|---|---|---|
| అమరకోశము మూలము.—స్వల్పార్థము, ఆంగ్లేయభాషాంతరపదములు గలవి. చిన్నసైజు అట్టబైండు | ౦ | ౮ | ౦ |
| సుందర కాండము-మూలము౧౬పటములు కిత్తానుబైండు | ౧ | ౦ | ౦ |
| స్తోత్రార్ణవము 1-వ భాగము కిత్తానుబైండు | ౦ | ౧౨ | ౦ |
| డిటో 11-వ భాగము ,, | ౦ | ౧౨ | ౦ |
| శ్రీభగవద్గీత - మూలముమాత్రము, చిన్నసైజు | ౦ | ౬ | ౦ |
| శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రము | ౦ | ౩ | ౦ |
| డిటో నామావళి సహా | ౦ | ౧ | ౦ |
| శ్రీరామకాలనిర్ణయము | ౦ | ౮ | ౦ |

ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెని,

లోన్‌స్క్వైర్, మద్రాసు.

# నన్నయమహాభారతము

## నాటకలక్ష్యలక్షణసమన్వయము

బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారు, ఎమ్. ఏ.

జనమేజయసర్పయాగము • సంభావనానుకూల్యము • కథాగమనత్వరీకరణము

రంగమండలి పాత్రల వాక్యోపవాక్యములవల్ల ప్రయోజనమును సాధించు విధాన మేర్పడుటయే గాక ప్రయోజనమున కనుకూలమగు కథాగమనము త్వరపడవలెను. కానిచో నాటక ద్రష్టలకు విసుగుపుట్టును. నాటకము ప్రేక్షక హృదయముల నాకర్షింపఁజాలదు. కథాగమనత్వరీకరణమును చూపు వాక్యోపవాక్యములు "జనమేజయ సర్పయాగ" వర్ణనమునఁ గలవు.

స్థలము హాస్తినాపురము. రంగము జనమేజయ చక్రవర్తి యాస్థానము. కొలువుదీర్చిన యాస్థానమున కుదంకుఁడు వచ్చి పరీక్షిన్నరేంద్రుఁడు తొల్లి తక్షకు నపకారంబున పంచత్వంబు నొందిన వృత్తాంతముఁ జెప్పి రాజును సర్పయాగము చేయఁ బ్రోత్సహించును.

జన:— (మంత్రులఁజూచి) ఇది యేమినిమిత్తంబు? దీనిని విస్తరంబుగాఁ జెప్పుఁడు.

మంత్రులు:—(పరీక్షిన్నరేంద్రు మరణవృత్తాంతము తా మెఱిఁగినరీతిని సవిస్తరముగఁ జెప్పి)

క. ఆయుష్మంతుఁడవై ల
క్ష్మీయుత బాల్యంబునందె మీ యన్వయరా
జ్యాయత్త మహీభారం
బాయతభుజ నీవు దాల్చి తఖిలక్షితుఁడవై.

ఉ. పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్
మంచి యనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీసమానులే!

ఉ. కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్రశిఖాచయంబులన్.

(జన:—కోపోద్దీపితుఁడై, సర్పయాగంబుఁ జేయ నమకట్టి పురోహితులను ఋత్విజులను బిలువఁబంచి)

చ. తనవిషవహ్ని మజ్జనకుఁ దక్షకుఁ డెట్లు దహించె నట్ల యే
నును సహమిత్రబాంధవజనం బగు తక్షకు నుగ్రహవ్యవా
హనశిఖలన్ దహించి దివిజాధిపలోకనివాసుఁడైన మ
జ్జనకున కీయుదంకునకు సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్.

వ. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు గలదేని చెప్పుఁడు.

ఋత్వి:— మత్త! నీ తదర్థము కాఁగ దేవవినిర్మితం బిది; యన్యు లం
కృతశేక్వర దీనిఁ జేయరు; నేఁటి మేము పురాణవి
ఖ్యాత మాద్యము"...

జనమేజయునిచే సర్పయాగము చేయించి పాముల వంశనాశము చేయుట యుదంకు నుద్దేశము. ఉదంకుని వచనములందు ప్రమాణబుద్ధి యున్నను వాని సత్యాసత్యము లరయునిది ఈజనమేజయునివంటి చక్రవర్తి కార్యమునకు దిగుట పాడిగాదుగదా! ఈ యుదంతముఁ దా నెఱుఁగడు. తనవా రెఱుఁగుదురుగాఁబోలు. వారివచనములను స్థిరపఱచినచో ధర్మపరిపాలకుఁడు గనుక తాను విచారణపైని తేలిన సత్యమునకు తగినట్లు నడచుకొనవచ్చును. జనమేజయుఁడు మంత్రుల నడుగుటలో ప్రయోజనసాధనవిధాన మేర్పడుటకు సూచన గలదు. ఊహింపఁబడిన ప్రయోజనమునకు సాధనవిధాన మేర్పడినఁగాని కథాగమన మారంభము కాదు. "మంత్రులు తా మెఱిఁగినది చెప్పుదురు. తనవాక్యములసత్యము తేటపడును. రాజునకు నిశ్చయము కలుగఁగలదు" అని యుదంకుని యూహ. కార్యాచరణోత్సాహముచే పురికొల్పఁబడి మనస్సునకు నిశ్చయజ్ఞానము కలుగుట ప్రయోజనసాధనమునకు రెండవ మెట్టు. మంత్రులవాక్యములు ఇట రెండురకములు: (1) పరీక్షిన్నరేంద్రుని దుర్మరణవృత్తాంతమును విస్తరించి చెప్పునవి.

(2) రాజును ధర్మమార్గప్రవర్తకునిగ స్తుతించి యాతనిచే ప్రతీకారము చేయింపఁ బ్రోత్సాహించునవి. ఉదంకుని వాక్యము లీ రెండవరకములో చేరినవి. మొత్తముపైని మంత్రులవాక్యములవల్ల ఉదంకునివాక్యములు సమర్థింపఁబడినవి. కార్యాచరణమునందు పనిగల పాత్ర లొకదాని కొకటి యనుకూలపడినఁగాని కథాగమనము త్వరపడ నేరదు. ఇట్టి పాత్రానుకూల్య మీ ఘట్టమునఁ గలిగినది. ప్రయోజనసాధనము మఱియొక మెట్టెక్కెను. రాజు కృతనిశ్చయుఁ డగుటయు నాతని నిశ్చయమునకుఁ గోపము తోడగుటయు నాతని వాక్యములవల్ల స్పష్టము. నిశ్చయజ్ఞానమునకు రాగము తోడగుట కథాగమనత్వరీకరణమునకు ముఖ్యము. అయినను జనమేజయుని యెడ రాగమునకన్న ధర్మమునకే ప్రాముఖ్య మని తేటతెల్లమగుచున్నది. అది రాజధర్మము. రాజులు తొందరపడి కోపము తెచ్చుకోరు. సకారణముగ వారికిఁ గోపము వచ్చి కార్యమునకు దిగిరా వెనుకంజ వేయరు. మనసునకు నిశ్చయము కలిగీకలుగుటలో రాజు పురోహితులతోను ఋత్విజులతోను యోజించెను. ఇది మూఁడవ మెట్టు. ఋత్విజుల వాక్యములవల్ల యాగవిధాన మేర్పడినది. ఇది నాల్గవమెట్టు. ప్రయోజనసాధనము సన్నిహితమైనది. దీనిని వర్ణించువాక్యములలో నన్నయకవి సర్పయాగమును కంటికిగట్టినట్లగపఱచెను.

"ఇట్లు కృతనిశ్చయుండై జనమేజయుండు కాశిరాజపుత్రియైన వపుష్టయను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుండై శాస్త్రపఠిష్ట ప్రమాణలక్షణనిపుణ శిల్పాచార్యవినిర్మితంబును యజ్ఞోపకరణానేకద్రవ్యసంభారసంభృతంబును ప్రభూత ధనధాన్యసంపూర్ణంబును స్వస్వనియుక్త క్రియారంభసంభ్రమ పరిభ్రమద్బ్రాహ్మణనివహంబును నైన యజ్ఞాయతనంబున నున్న

[ఇచట కవి నన్నయ వేదఘోష ననుకరించు పవిత్రరవప్రాధాన్యముగ పదబంధములను కూర్చి యుండుట పాత్ర్యానుకూల్యతుల్యమై యున్నది.]

ఈవర్ణనమువలన ప్రయోజన ప్రచోదనము మొదలు ప్రయోజనాసన్నతవఱకును గల కథాగమన మెంతత్వరలో నెఱవేఱినదో స్పష్టము.

పరమ భాగవతోత్తములు పూర్వము మిత్రత్వశత్రుత్వములవలన పరమేశ్వరునిలో నెట్లు లీనమైపోయిరో అట్లే వాక్యోపవాక్యములును అనుకూల ప్రతికూల మార్గములఁ గథాగమనమున లీనము గావలెను. మాటల రూపమున కథ నడచిపోవలెను. ఇంతవఱ కీవాక్యోపవాక్యములలో ననుకూలమార్గమే కలదు.

అటు యజ్ఞదీక్షితుం డగు రాజునొద్దకు వాస్తువిద్యానిపుణుం డగు పౌరాణికుండు (వచ్చి)—

క. అనఘా యీ యజ్ఞము విధి
సనాథ ఋత్విక్ప్రియోగ సంపూర్ణం బ
య్యును గడచన నేరదు. నడు
మన యుడుగును. భూసురోత్తమనిమిత్తమునన్.

అనెను. ఈవాక్యమున ప్రయోజనమునకు ప్రాతికూల్యము గలదు. ఈపౌరాణికుఁడు ప్రయోజన సాధనమునకు రంగప్రాతికూల్యము సూచించెను. ఇది "వాస్తువిద్యానిపుణుండైన" యను విశేషణమువల్ల నూహ్యము. ఋత్విక్కు లాతనిమాటలను సరకుగొనరైరి. తమ ప్రయత్నములందు నూతనోత్సాహులైరి. కాఁగా ప్రయోజనము ప్రతికూలమార్గమున నైదవమెట్టెక్కెను. సర్పము లగ్నిలో పడఁజొచ్చినవి. ఇంతవఱకు నన్నయ భూమియందలి చర్యను వర్ణనలో నిరూపించెను. వివిధేంద్రియగ్రాహ్య మగునటుల నర్థములు వర్ణించుటయు వాని నిరూపించుటయు ఇవి దృశ్యకావ్యలక్షణములు. ఈగుణము రూపకములందు వేషభాషలవలనను, సీనులయమర్పులవలనను అభినయమువలనను తేటపడును. భాషామయమగు వర్ణనమున నింద్రియ గ్రాహ్యత్వము (ensuousness) వలన తేటపడును. నభోంతరాళమున నా యుత్తరరంగమున నప్పు డెట్టి విచిత్రములు పుట్టెనో నన్నయ యిట్లు దెల్పెను:—

క. ధరణీసుర మంత్ర హోమ
స్ఫురణను వివశు లయి భూరిభుజగప్రభు లొం
డొరుఁ బిలుచుచు నధికభయా
తురులై కుండాగ్నులందు దొరగిరి పెలుచన్.

ఇందు "ధరణి......స్ఫురణను" "ఒండొరు బిలుచుచు" అని వర్ణించుటవల్ల శ్రోతల కావాక్యములు వినఁబడుచుండినట్లే యుండును. ఇది కర్ణగ్రాహ్యత్వము. "వివశులై" "అధికభయాతురులై" "కుండాగ్నులందు దొరగిరి" అనుమాటలనుబట్టి యాపడుచుండిన పాము లె

ట్లుండినవో నేత్రగ్రాహ్యము చేసికొనవచ్చును. ఇది నేత్రగ్రాహ్యత్వము. ఈగుణములు పాములను వర్ణించిన యితర పద్యములలోఁ గూడఁ గలవు. ఎట్లనిన:—

మ. అతివేగాకులచిత్తులై పడి రుదాత్తాశీవిషాగ్నుల్ సితా
సిత పీతారుణ వర్ణదేహులు నవాసృగ్రక్తనేత్రుల్ మహో
న్నత శేక త్రిక పంచ సప్త నవ నానామస్తకుల్ పల్వు రు
ద్ధత నాగేంద్రులు బ్రహ్మదండహతి నార్తధ్వానులై వహ్నిలోన్.

"ఆర్తధ్వానులై" అని యన్నది కర్ణగ్రాహ్యము మిఁగిలిన దంతయును నేత్రగ్రాహ్యము.

క. ఉడుఁబడఁ బడిరొడు రవమును
బడితాలెడు రవము గాలి పలుతెఱఁగుల వ్ర
స్సెడు రవమును దిక్కులయందుఁ
గడుకొని మ్రోయించె నురగకాయోత్థితమై.

ఇది యంతయు కర్ణగ్రాహ్యము. ఇఁకను కర్ణనేత్రగ్రాహ్యత్వము నుదాహరించెదను.

క. తక్షకుఁ డతిభీతుండై
యాక్షణమున నరిగె సురగణాధిప నన్నున్
రక్షింపుము రక్షింపుము
రక్షింపుము యనుచు నప్పురందరుకడకున్.

ప్రయోజనము కథాగమనత్వరీకరణమార్గమున సాఫల్యముఁ జేరనున్నది. ఇది ఆఱవమెట్టు. రూపకములు ముఖ్యముగా కర్ణనేత్రగ్రాహ్యములు. అవి కర్ణనేత్రపేయము లైనచో హృదయము నరికట్టును. ఈవర్ణనములం దిట్టి గుణము మాత్రమేగాక కార్యగమనముయొక్క త్వరితమును (Rush of action) సూచింపఁబడుచున్నది. నభోంతరాళమున—

మ. అతులోర్వీసుర ముఖ్యమంత్ర హుత మాహాత్మ్యంబునన్ వాసవ
చ్యుతుడై మందర తక్షకుం డురువిషార్చుల్ దూల వాత్యారయో
ద్ధత నద్భూతవివర్తితాయత బృహద్దావాగ్ని శోభన్ విచే
ష్టితుఁడై వేఁకుపథంబునన్ దిరుగుచుండెన్ విస్మితుల్ గా జనుల్.

ఇది ప్రయోజనసాధనమున నేడవమెట్టు. ఇంతలో నాస్తీకుఁడు సర్పయాగరంగమును బ్రవేశించును. ఈతనియుద్దేశము ప్రయోజనమునకు ప్రతికూలము. సర్పయాగము నాపి తన బంధుజనంబు లగు నురగుల రక్షింప నీతనియాశయము. ఇతఁడు మంచివాక్కుఁడు. ఆరంగమందున్న యందఱ యనుగ్రహమువలనఁ గాని తనయభీష్టము నెఱవేఱనేరదని యెఱుఁగును. ప్రతికూల వాక్యము లాడినచో వారి ప్రయత్నము దృఢపడును. తనకార్యమురు భగ్నమగును. వారిప్రయత్నము నిరోధింపఁబడుటయే తనప్రయత్నము నెఱవేఱుట. పౌరాణికుని ప్రతికూలవాక్యములవలన కథాగమనము త్వరపడినది. ఆస్తీకుని వాక్యములు ప్రతికూలము లైనచో కథాగమనము (అనఁగా తక్షకుండు చావకుండ యాగ మాపఁబడుట) త్వరపడదు. కనుక నాస్తీకుని వాక్యములు సానుకూలములై రంగమునందలి యెల్లపాత్రల యాభిముఖ్యమును సమకూర్చుకొనవలయును. కనుక కవినన్నయ పౌరాణికునివాక్యములవల్ల రంగప్రాతికూల్యసూచక మగు కార్యసాధనవిధానమును చూపినట్లే ఆస్తీకుని స్తుతివాక్యములవల్ల రంగానుకూల్యసూచక మగు సాధనవిధానమును చూపెను. ఆస్తీకుఁడు "జనమేజయు నాతనియజ్ఞమహిమను, ఋత్విజులను, సదస్యులను నగ్నిభట్టారకు ననురూపవచనంబులఁ బ్రస్తుతించెను." ఈస్తుతివాక్యములవల్ల నాతనికి రంగానుకూల్యము పూర్తిగా సమకూఱి కథాప్రయోజనము తుదమెట్టునకు చేరిన ట్లీఘట్టమున నున్న వాక్యోపవాక్యములవలన స్పష్టము.

జన:— (ఆస్తీకుం జూచి) మునీంద్రా! నీ కెద్ది యిష్టంబు? దానిని యిత్తు నడుగుము.

ఆస్తీ:— ఉ. మానిత సత్యవాక్య యభిమన్యుకులోద్భవ! శాంతమన్యు సం
తానుఁడవై దయాభినిరతస్థితి నీవు మదీయ బంధు సం
తానము నోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో
ర్వీమత! సర్పయాగ ముడిపింపుము కావుము సర్పసంహతిన్.

సదస్యులు:—..............................ఇట్టి విశిష్టవిప్రము
ఖ్యునకు మహాతపోధనునకుం దగు పాత్రున కెద్ది యిచ్చినన్
ఘన మగు నక్షయంబు నగు కావున నీద్విజనాథుకోర్కెఁ బెం
పున కృథసేయఁగాఁ దగదు భూకలయేశ్వర యిమ్ము సెమ్మితోన్

తదనంతర ముదంకుని ప్రచోదనమున "సర్వజనానుమతంబుగా" సర్పయాగ మారంభించిన జనమేజయుఁడు ఆస్తీకుని "ప్రార్థనం జేసి" "సర్వ జనానుమతంబుగా" దాని నుడిగించెను. ప్రయోజనము కడతేరెను. కథాగమనము పూర్తియాయెను. భువినుండి యాస్తీకుఁడు "ఓహో తక్షక! క్రమ్మఱుము" అని "యత్యుగ్రానలపాతోన్ముఖుఁడైన" యాతక్షకుని గ్రమ్మఱించెను.

# * అలలు

భావరాజు వేంకటసుబ్బారావు గారు బి. ఏ.

అలలమీఁద నలలు పెరిఁగి ♦ యలమి నన్ను ముంచిముంచఁ
దలకొన నిఁక నిలువలేకఁ ♦ దలఁకి తొలఁగు టలుపు లిడుదు
పుట్టువుతోఁ బుట్టెనో? లేఁ ♦ బుట్టక పూర్వమె పుట్టెనో?
పుట్టినాఁటి యెలతి నీ ♦ గట్టివా కరళ్లు పుట్టి
పట్టాడుచు మిట్టాడెనో? ♦ గట్టిగ నే నెఱుఁగ—నొట్టు!
కన్నతల్లిఁ దొలుత నెఱుఁగఁ ♦ గన్న వేళ నాపె 'అన్న'
'నాన్న' యనుచు నేర్చువేళ ♦ వెన్నెలఁ గనిపించువేళఁ
జోరువట్టి యేడ్చువేళ ♦ బూచివానిఁ బిలుచువేళఁ
దప్పటడుగు లిడెడువేళఁ ♦ దారంగముఁ జూచువేళఁ
గనుమూఁతలఁ జెవిమూఁతల ♦ నునుబుగ్గల పొట్ట లుబుక
గిలిగింతల వెకిరింతలఁ ♦ గిలకిల నవ్వెడి వేళను
గలవని నానమ్మకంబు ♦ తలఁపు టలల పొందలికలు.
అచ్చపుఁ బటికంపుగిన్నె ♦ వెచ్చనైన పాల నూదఁ
బుచ్చెడు చిట్టూర్పుగాలిఁ ♦ బుట్టి చిట్టితరఁగలవలె
నద్దము క్రియఁ ♦ బ్రతిఫలించు నిద్దపు నడబావిమీఁదఁ
బిల్లగాడ్పు విద్దెమాడ ♦ వేడిన ప్రాఁకాడఁ బోడము
చిఱుత రెఱల సరి తూఁగుచుఁ ♦ జిన్నిపాపతలఁపు లుండె.
అటుమీఁదట నొకవేసవి ♦ బటువు చినుకు లొకటొకటిఁ
దటుకటుకు రాలి మించి ♦ ధారగట్టి జల్లు రేఁగి
నడగం డ్లొరవడి సరలఁగ ♦ వాన గురియు కొలఁదిపెఱు
కొలఁకులలో నిలువనీటఁ ♦ గుల్యల జాలైన నీట
బుడబుడమని బుగ్గ లెగసి ♦ వడివడిగా నలల నీవ
నొత్తిడిచే మొత్తములై ♦ యొకటి నొకటి మించి యూఁది
దరిఁ జేరెడి దుడుకుఁగుఱ్ఱ ♦ కెరటంబులఁ బురుడించుచు
బానపాడి గల్గనింపఁ ♦ బైదలి చెఱువంతకడవఁ
గవ్వము నమరించి కృష్ణ♦గానముతో గిఱ్ఱుగిఱ్ఱు
మజ్జిగఁ జిలుకఁగ గాజుల ♦ గజ్జెల భజనమునఁ గలిసి
గఱ్ఱుగఱ్ఱు తాళ మేసి ♦ గంతులుచిందులు ద్రొక్కుచుఁ
దమలోపలి నవనీతముఁ ♦ దమ్మికంటి కర్పించెడి
చల్లతరంగముల గొల్లు ♦ గొల్లగొనుచు నుల్లసిల్లెఁ
గేళి గానలోల చపల ♦ బాలభావ భంగపాళి
తారుణ్యోదయరాగము ♦ మీఱఁగఁ బ్రాభాత స్ని
గ్ధగంధవహ చలితోత్కలి♦కలు హంసధ్వనిశతులఁ
చక్రవాక వల్లభాను♦సార చతుర చాటూక్తుల

స్వకంకణ వివిధమణి వి♦భ్రమములొప్ప తీవి గాని
నతమొఱసి సిరులఁ జల్లెను ♦ నాట్యప్రభా దాళిసరసు.
పదబ్జాకరాకసులం ♦ జారువినోదామృతమునఁ
దోఁగుచు నూఁగుచు తీఁగుచుఁ ♦ దూఁగుచు నొక కొన్నినాళ్లు
క్రొక్కారున నెమ్మది వి♦న్నిక్కులఁ జిక్కులమబ్బులు
మూఁగ, నోరుగాలి సాగి ♦ పుడమి దుమ్ము రేఁపి కొత్త
యూఁపులఁ దల దిమ్మగొలుప ♦ నుప్పర మంతయు మెఱపులు
చిచ్చిడి కడు జళిపింపఁగఁ ♦ జెవులు గాడి చిల్లులఁబడ
మిన్ను మన్ను బ్రద్దలుగా ♦ మిక్కుట మగు నుఱుములఁ ఫెళ
ఫెళ మ్రోయఁగ వానదన జడి ♦ వెనుక ముందుఁ గుడియెడమలఁ
జుట్టుముట్టి విసరివిసరి ♦ కొట్టి కురిసి కుండపోఁతఁ
గొండ చిల్లిపడ్డట్టులు ♦ కుమ్మరించి దిమ్మరింప
మిట్ట పల్లమేకంబై ♦ గట్టు చేను గానరాకఁ
జాఁపచుట్ట పఱచునట్లు ♦ సాగి కఱద లేకంబై
పొర్లెత్తుచు వెల్లివిరియ ♦ భూమియెల్ల జలమయమై
పంకిల మగు క్రొత్తనీరు ♦ పటురయమున మ్రోఁత లిడుచు
వాఁగులఁ బడి యేళ్ల నుబ్బి ♦ వాహినులం దుమికి బొబ్బ
రింతలతో నొడ్డ నొఱసి ♦ రివ్వునఁ బారెడువేళను
జల గమనోద్ధూతములై ♦ శిలావిషమతలముల నభి
వృద్ధిఁ జెంది సుళ్లఁ జెలఁగి ♦ వృక్షాదిప్రతిహతి వి
స్తీర్ణములై తటకమఠవి♦ఘూర్ణితంబు లన్యోన్యా
ఘాతోద్ధూతంబులు నై ♦ స్రోతోగ్రవ్యాయతములు
సమీరణక్షుభితంబులు ♦ సరిత్సంగ మోత్తాలము
లైన యూర్మికలు వల♦యములై మాలాజాలములై
విన్నాణపు వేణికలై ♦ విప్పారిన వీవనలై
వేల్పుటోని పింగిణులై ♦ వెడఁదమడఁక నడకలునై
చాపటాతి తాపలున్ వి♦శాలలోలడోలలునై
వీథిపోతజాతములై ♦ విపల్ల తుంగములై
కుంజరసంఘాతములై ♦ కోటగోడలై యెంచిన
యలగుట్టలఁ దలఁదన్నెడి ♦ యాలోచన లుప్పతిల్లి
విచ్చలవిడిఁ జెమ్చు పెరిఁగి ♦ వికలసంకులములై యా
నందము కుందును దోడ్తో ♦ నొందించుచు రాపిళ్లం
జీకాకుపరాకు గాక ♦ చేసి కలఁచె గొంతవట్టు
రసాళయా గ్రసుఖ ప్రా♦రబ్ధయానకర్మంబున

---

* ఈవృత్తము మాత్రానియమప్రధానము. తురగవల్గన రగడవలెను, కందము తుఱుచచరణముల జంటవలెను, ఇరువదినాల్గు మాత్రలం గొను. గణబద్ధము గామి విషమగతులు దోఁచును. ఆఱేసిమాత్రలకు లయనియతి గలదు.

భువనవ్యాపారేమం • బోరవర్తకుం డొకరుండు.
జీవనయాత్రార్థంబునఁ • జెఱి సమముగఁ దమ రిద్దఱు
భాగములను భోగింపఁగ • బాసఁజేసి చేపట్టిన
మానినిమణి చేదో దస•మయమునఁ జే జాఱిపోవఁ
దనపాలిటి భాగ్యదేవత • తొలఁగి విడనాడి చనఁగ
మార్గప్రద్యోతక సుమ•మారాశి యడఁగ వలా
హకమాలాసంఛన్న వి•హాయసపథ మంథసంత
మసవృతమై నిమీలనస • మవిలోకన మగు రోదః
కుహరంబున ఝంఝానిల • కోపోద్రేకము సంత్రా
సాకహమై కూలఁద్రోయ • వాకాశప్రాకారము
బీటలు వాఱినఁ దత్త • ద్వివరదృష్టవాకలోక
కాంతు లసన్ తుణప్రభా • గతులు వక్రదీర్ఘోద్ధతి
దృష్టిభంగ మొందింపఁగఁ • దీవ్రమేఘనిర్ఘోషము
కొండ విఱిగి పడునట్టులు • కొండలపెట్టఁగఁ జెటజెట
పిడుగులు ఘుల్లున రాలఁగ • ద్విపహస్తోపమాల
ధారాపాతము ముంపఁగఁ • బారావారము మధ్యను
బెట్టిదపుఁ దుపానువాతఁ • బట్టువడ్డ యోడ భిన్న
భిన్నములై పగులఁ దాను • మున్నీటను బడి సర్వము
గోలుపోయి యొంటిఁ జిక్కి•కొన్న సార్థవాహుఁ బట్టి
మ్రింగ నెంచె నవ వేలా • భంగ కాండములు మహాహి
కోటుల బారులతీరున • ఘోషించుచుఁ దాలోన్నత
దీర్ఘ ఘోర కాయంబుల • దివి కెత్తుచు నుజ్జ్వాలల
విశంకటస్ఫటాచ్ఛటల • విప్పుచు శరవేగంబునఁ
బైఁబడఁగా; హర్యక్ష•వ్యాఘ్రాతి క్రూరసత్త్వ
యూథంబులవలె గర్జన•హుంకృతులను బొబ్బరించి
పటావాల విక్షేపణ • నటనంబుల నావిష్కృతవ
దన గహ్వరదర్శనముల • మన మురియఁగఁ జేసి యొక్క
త్రేటున లంఘించి వాని•వీపెక్కఁగ; మైనాక
ప్రముఖ కామచారి శైల•పతులు కదలి వచ్చినమై
దానముపై బహుకేళన • తత్పరతం బరిసరచర
పరకేరిభద్రముఁ గా•పాడుచింత నుంతలేక
మట్టాడ దొడంగె ననన్ • మహాకల్లోలసంఘంబులు
మింటి నొఱయు పొడవుల దిశ•లంటు పరువిలతుల

ఘోటక రేఖలు దీపింపఁగ • తాపు ల్వార్చి భ్రమించుచుఁ
బరస్పరవిఘట్టన ప్ర•భవ కోలాహలములతో
గిట్టునఁ బడఁగొట్టి వాని• నట్టి ద్రొక్కి పరుగు లిడఁగ;
వికృతాకృతు లట్టహాస • వికటధ్వానములు సకల
దిశి కుణపకలకలహాన • కిలంబులు భీభత్స భ
యానకరంగములు గర్వా•యానంబులు నగు ప్రోచ్ఛ్రిత
కల్లోల పిశాచానీ•కంబులు పీడించి శోష
మావహింప! 'విశ్రుతర•త్నాకర నిగ మాంతము సార
గౌరవహీనులకుఁ గడిది • మేరమీఱి దాయవలదు
దండనార్హుల రగుదు రని • తర్జనముల బెట్టుచుచు
బ్రమత్తతం జొచ్చు నల్పుఁ • బఱచి పట్టుమక్షీవర్ణ
వేషులఁ బాటలఫేనో•ష్ణీషులు నగు ప్రణ్యజనుల
పహరాపాఁజాల పోలిక • భయదరూపకులై భ
ర్జించి మహాస్రోతః పా•కాంచలములఁ గట్టి యీడ్చి
వాడవాడ లెల్లఁ ద్రిప్పి • బల్లాత్కార కఠినంబుగ
బటుబటు బడుటికిఁ ద్రోయు స్వ•భావముగల లహరులు త
ద్వ్యణిజు నటు పలుభంగుల • బాధపఱిచి జీవచ్ఛవ
కల్పుఁ జేయ బ్రతుకు చావు•గాని దుస్థితిం దలంచి
పరమాత్మ ధ్యానభిన్న • శరణంబుల యాస వీడి
యుమ్మెవన శాంతింపఁ జేసి • యొడ్డుఁ జేర్చి రక్షింపఁగ
వేఁడుకోలు సలుపు నదరు • జీవారి చందంబున సం
కల్ప వికల్పాహాపో•హాల్పధీ వితర్కభావ
నాపరంపరాభిలోల • నటద్రుట దుదగ్రభంగ
సంకుల సంసారార్ణవ • సంఘూర్ణితచేతస్కుఁడఁ
బరమేశా! యిఁకఁజాలును • బాములఁ బడఁజాలఁ దండ్రి!
యోచనా ప్రపంచవిముఖు • నుజ్ఝిత సంకల్ప నిర్వి
కల్ప శత్రుమిత్రుఁ జేసి • గరణత్రయశుద్ధుఁ బుద్ధ
దృష్టాపరివర్జితు సం•తృప్తు నింద్రియాధికోహం
ద్వంద్వాచంచలు నన్య•స్త సమస్తేహా తంత్రాఢ్యు
సమలాత్ముని గూటస్థుని • నానంద తటస్థ శాంతి
పీఠాధిష్ఠితను త్యక్త•శ్రీవత్సాత్ముఁ జేసి నాదు
నీతో సమసంధానము • నేర్పు మిదె నమస్కృతంబు.

# మనశ్శరీరములకుగల సంబంధము

పారనంది జగన్నాథస్వామి గారు., బి. ఏ. ఎల్. టీ.

జనసామాన్యమునకు శరీర మనుభవసిద్ధ మైనట్టుల మనస్సు కాకున్నను ఇట్టివస్తువులు రెండు గల వను ప్రతీతిమాత్రము గలదు. ఈనమ్మకము పండిత పామరులలో నెవరికి గల దను ప్రశ్నకుఁ దగిన ప్రత్యుత్తర మిచ్చుట సులభము గాదు. అందఱకు గల యీ ప్రత్యయ మును స్వీకరించి అట్టివస్తువులకుఁ గల సంబంధ మెట్టిదని విచారింపఁ బ్రయత్నించెదను. విషయముయొక్క ముఖ్య తను గుఱించి వేఱుగ జెప్పనక్కఱ లేదు. శరీరశాస్త్ర మందును మనశ్శాస్త్రమందును ఈ విషయమును చర్చిం పక తీరదు. అందుచేత నీవిషయవిచారములో శారీరక మనశ్శాస్త్రముల మూలసూత్ర మర్యాదలతోనైనను పరిచయ మావశ్యకము. అయినను వాటి యనువాద మెంత తక్కువయగునో యట్లే విషయవివరములను చక్కఁబెట్ట నిశ్చయించి యీ వ్యాసమును ప్రారంభించితిని.

మొదట నీరెండింటికినిగల సన్నిహిత సంబంధ మెట్టిదో తెలుసుకొనుటకు కొన్ని యుదాహరణములను అంశములను - వివరించి తరువాత సంబంధసూత్ర చర్చను ప్రారంభించెదను. వాటి నన్నిఁటిని సంకలించి నచో - శరీరమునకు మనస్సు మనస్సునకు శరీరము సహ కారులై యున్నటుల స్పష్ట మగును. అందులో శరీర మునకు మనస్సుయొక్క సహకారత్వముకంటె మనస్సు నకు శరీరముయొక్క యవసర మధిక మేమో యని తోఁ చకమానదు. కొన్ని శరీరవృత్తులు మనోపేక్ష లేకయే జరు గుచున్నవి. ఊపిరితీయుట-గుండెకాయ కొట్టుకొనుట-నడ చుట-మొదలైన స్థిరీకృతములైన యలవాటులు మనశ్శ క్తియైన యిచ్ఛాప్రేరణ మక్కఱలేకుండగనే జరుగుచుం డును. కాని శరీరసంబంధమైన యింద్రియసాధనత్వము లేనిదే ఏవిధమైన మనోవృత్తియును జరుగనేరదు. ప్రతి మనోవృత్తికిని ఇట్టి యింద్రియవృత్తియొక్క యాపేక్ష యావశ్యకము గాకున్నను, ఇంద్రియాగతసంస్కారముల యాపేక్ష మైనను ఆవశ్యకము. ఈ యీ షడ్వ్యత్యాస ములను పాటింపక పరస్పరసహకారత్వమును అంగీకరిం పవచ్చును. అందుచే లోకవ్యవహారము ప్రపంచజ్ఞానము శరీరముద్వారానే లభించుచున్నవని చెప్పగలము. భావము లన్నియు శరీరవ్యంజనమును గలిగియే యున్నవి. సంతోషమునకు చిరునవ్వు- బాధకు ముడతలుగలవికృతి- ఆశ్చర్యమునకు తేరిచూపు - భయమునకుకంపనము - కో పమునకు చిట్లించుకొనుట - ఇట్టి శరీరవ్యంజనము లాయా భావములకు లింగములై యున్నవి. అందుచేతనే శరీర వ్యంజనముల నరికట్టగలిగినపుడు భావము లణగుచుండుట యును ముఖమునుజూచి మనస్సును పోల్పగలుగుటయును సంభవ మగుచున్నవి. శరీరస్థితినిబట్టి మనభావము లుండు టకూడగలదు. ఆకలిగా నున్నప్పుడు సంతోషముగనుండ లే కుండుట బడలికగానున్నప్పుడు ఓర్మిలేకుండుట ఇందు కుదాహరణములు. ఉదయముననుండు మనోల్లాసము సాయంకాలమున కుండదు. శరీర మారోగ్యముగ నున్నపు డుండు జ్ఞాపకధారణాశక్తులు అనారోగ్యదశలో నుండవు. అకస్మాత్తుగ భావోద్రేకమైనచో శరీరమందు వికృతి గలుగును.

ఇట్టి సంబంధమునే గాక శోధనపూర్వక సంబంధ మును గూడ శారీరకశాస్త్ర మభివృద్ధి జెందుటచే శాస్త్ర జ్ఞులు కనిపెట్టగలిగినారు. మనస్సుతో సంబంధించినది శరీరమంతయునైనను సాక్షాత్సంబంధముగలది శరీరావ యవమైన మెదడనియు - ఆమెదడు తనసంబంధ మైనను- నాడులద్వారా మనస్సుయొక్క ప్రభావమును ఇతర శరీరాంగములపైఁ బ్రసరింపజేయుననియును శాస్త్రజ్ఞులు నిశ్చయించినారు. ఆనాడులు శరీరమంతటను సూక్ష్మ రూపముతో (ఒకనాడి $\frac{1}{1500}$ నుండి $\frac{1}{12000}$ అంగుళముల వఱకు దళసరి గలిగియుండి) క్రమ్మియున్నవి గాన మన స్సుతో సంబంధము గలది శరీర మని పలుకునపుడు

మెదడునకే విశేషప్రసక్తి యని భావింపవలెను. ఎట్లన మెదడుపైని గాఢమైన దెబ్బ తగిలినయెడల శాశ్వతమైన మనోవైకల్యము గలుగును. తదేకదీక్షతో బుద్ధి నుపయోగించినయెడల నాడీవస్తువైన ఫాస్ఫేట్ ఒకటి మూత్రము ద్వారా పోవును. అదిగాక మెదడును సూక్ష్మముగఁ బరిశీలించి మెదడులోని కొన్నికొన్ని భాగములకును మనోవృత్తులకుఁగొన్నిఁటికిని యత్యంత సంబంధమును (కార్యకారణసంబంధ మని చెప్పవచ్చు. నేమో) నిర్ణయించినారు. వాక్సంబంధమైన దొకభాగము చక్షుస్సంబంధమైన దొకటి. ఇట్లు మెదడును విభరించి యున్నారు. ఆ భాగములలో నేదిచెడునో దాని సాధనత్వము పోవుటచేత నావృత్తి నశించును. అన్నిఁటియొక్క హీనత గలుగునపుడు మొత్తముపై నన్నివిధములను మన శ్శక్తియంతయు దగ్గిపోవును. అట్టి మొత్తపుసంబంధము నారోగ్యవంతులకును పిచ్చివాండ్రకును గల మెదడుల భేదమందు చూడఁగలము. సాధారణముగ మెదడు 49½ ఔన్సులు (అనగా 123¾ తులములు) బరు వుండును; పుట్టు వెఱ్ఱివాండ్రకు చాల తక్కువగా నుండును. అట్టి వాని కొకనికి 8½ ఔన్సులు (అనగా 21¼ తులములు) బరువుగల మెద దుండెను. మధ్యకాలమున వెఱ్ఱియెత్తిన వారిమెదడు వైకల్యముఁ బొందియుండును. పైచూపున కారోగ్యముగలదిగ గనఁబడినను విప్పి పరిశీలించినచో నీ వికృతి స్పష్టపడును. మనోవికారముగలవారి మెద డెట్లు చులకనగునో అట్లే బుద్ధివిశేషము గలవారి మెద డెక్కువ బరువుగ నుండును. ఒకప్రజ్ఞాశీలుని మెదడు 64½ ఔన్సులు (అనగా 161¼ తులములు) బరు వుండెనఁట!

ఇట్టి సన్నిహితసంబంధులకు గల భేదము నెకింత పరిశీలించుట యవసరము. శరీరము ద్రవ్యమయమై జడమైనది. గనుక దీని వ్యాపారములు యంత్రవత్తులు. మనస్సు అప్రాకృతికమై అజడమైనది గాన దీనివ్యాపారములయంత్రవత్తులు. ఈ భేదవిశేషములలో యంత్రవత్తనగా నేమియో కొంచెము విశదపరుపవలెను. యంత్రమెట్లు బహిఃప్రసారితశక్తిచే నియమముగ దిరుగునో అట్లే యేవ్యాపారము బహిఃస్థిత కారణ సామగ్రిచేతనే నిశ్చితమగునో యది యంత్రవత్తుగ సంభవించె నని చెప్పుదుము. కారణముల జ్ఞానమువలన కార్యమును నిర్ణయింప వీలగును. ఆ బహిఃస్థిత కారణము లున్నచో కార్యము సిద్ధమై తీరును. ఒక కార్యజనక కారణము లా కార్యబహిఃస్థితము లనియును, ఆ కార్యజననములో కార్యవస్తువునకే ప్రయోజనము లే దనియును, కారణముల సద్భావమున కార్యము సంభవింపవలె ననియును, కార్యకారణములు సమము లగు ననియును ఈ యంత్రశాస్త్ర నియమములు. అట్టివి శరీరవ్యాపారములు. కాని మనోవృత్తులగురించి యట్లని చెప్పలేము. బహిఃకారణములు తెలిసినను కార్య మెట్లు కానున్నదో చెప్పలేము. మనస్సునకు లింగమైన యిచ్ఛాశక్తిచేత కార్యస్వభావము మారును. ఎంత బహిఃకారణ సామగ్రి యున్నను ఇచ్ఛ యెట్లు ప్రవర్తింపజేయునో అట్లు మానసిక కార్య మగుటను జూచుచున్నాము. ఆదర్శముల ననుసరించి ప్రవర్తించుట జీవస్వభావము. చైతన్య విశిష్టపదార్థ వ్యాపారములను సాధింపఁబూనుకొను శాస్త్రములకు యంత్రనియమములు వర్తింపనేరవు. అందుచే మనోవృత్తులు యంత్రవృత్తులు గానేరవు. మనస్సునకుగల యీస్వతంత్రస్వభావములను లెక్కించని సూత్రము తప్పు సూత్రమగును.

సంగతులను జ్ఞప్తినుంచికొని యీరెండింటి సంబంధసూత్రములను విచారింప నుపక్రమింపవచ్చును. దీని గుఱించి యాలోచించిన వారి మతములలో ముఖ్యమైనవి మూఁడు గలవు. వాటిని సంగ్రహముగ నిరూపించెదను.

మూఁడింటిలోను మిగుల బలహీనమైన మత మొకటి యున్నది. దీని ప్రకారము శారీరక వ్యాపారములు మాత్రము ఒక కార్యకారణ పరంపర - ఒకశరీరవృత్తి మరియొకదాని కార్యమో కారణమో యగును. ప్రతి శరీరవృత్తికి సంబంధించిన యొక మనోవృత్తి యుండును. ఇట్లు కార్యకారణ పరంపరలో నున్న శరీరవృత్తుల ననుసరించియున్న మనోవృత్తులలో మాత్రము నొకదానితో మఱియొకదాని కేవిధమైన సంబంధమును లేదు. మనోవృత్తు లందుచేత శరీరవృత్తులకు అనగత్యక సంయుక్తములు ఎట్లన:—క క గ గ చ చా

క గ చ శరీరవృత్తులు. తత్సంయుక్తము లైన

మనోవృత్తులు క', గ', చ'. క, గ, చ, లకు కారణత్వ సంబంధ మున్నది. క', గ', చ', లలో లేదు.

ఈ మతమందు శరీరవృత్తుల కారణత్వము నుపపాదించు తథ్యము గలదు. కాని యిచ్ఛాది వృత్తులలో స్పష్టమయ్యే మనఃప్రభావమును నిరసించుట యందఱ యనుభవమునకును విరుద్ధము. ఇంతియుగాక మనోవృత్తులు శరీరవృత్తుల ననుసరించినవియే యగుటచే, మనోవృత్తులు ప్రవర్తనపద్ధతి శరీరవృత్తుల ప్రవర్తనపద్ధతి వలెనే యంత్రవత్తు కావలసివచ్చును. అందువలన నీవాద మసంగీకార్యము.

మిగిలిన రెండువాదములలో దేనినైన నింతసులభముగ ఖండింపఁజాలము. రెండుమతములకును దగినయవలంబకు లున్నారు. అంతియుగాక నీమతములను పూర్తిగ విమర్శించుటకవకాశము లేదు. కాన నీరెండింటి యొక్క ముఖ్యోద్దేశములను మాత్రము స్పష్టపరచెదను.

రెండుగీత లెట్లు సమాంతరములో ఒకదాని నొకటి యెప్పటికిని దగులకుండ ననంతముగ బ్రవహించుచుండునో అట్లే శరీరమనో వృత్తులు రెండును సమాంతర ప్రవాహములవలె ప్రవర్తించుచుండును. ఎట్లన క, గ, చ అను శరీరపరంపర యొకటి క',గ', చ', అను మనోవృత్తి పరంపరయొకటియు నొకదానితో నొకటి కలియక అనంతముగా ప్రవర్తించుచుండును. శరీరవృత్తులలో కారణత్వ సంబంధ ముండును; అట్లే మనోవృత్తులలోను. కాని శరీరమనోవృత్తులలో నన్యోన్యముగ నెవ్విధమైన సంబంధ ముండదు. ఎట్లన.

'క—క' ♦ 'గ—గ' ♦ 'చ—చ'

కారణత్వ భావమును ప్రకటించుటలో క,గ,చ, లకు గాని, క', గ', చ', లకు గాని ప్రత్యేకముగ జెప్పవలెను; గాని క, క' లకు చెప్పరాదు. శరీరవృత్తి లేని మనోవృత్తిగాని, మనోవృత్తిలేని శరీరవృత్తిగాని యుండవు. అందుచే మీఁద నుదాహరించిన మొదటి మతమునకు గల బాధకములు దీనిని బాధింపవు. మనోవృత్తులు ప్రత్యేక పరంపరగ నుండుటచేత వాటి సద్భావమునకు విచ్ఛిత్తి లేదు. శరీరవృత్తి పరంపరకు సాధకమై యంత్రవత్పద్ధతి మనోవృత్తి పరంపరకు ప్రవర్తింపదు. ఈ మతమునకు సమాంతరత్వవాద మని పేరిడవచ్చును.

ఇక మూఁడవవాదము. శరీరమనస్సులొకదానిని విడిచి రెండవది లేదనియును ఒకదానిపై రెండవదానికి పరస్పరముగఁ బ్రభావముగల దనియు నీవాదాభిప్రాయము. ఇది మనయనుభవమునకు అత్తియుండును. ఇంద్రియసన్నికర్షచేతనే ప్రపంచ గోచరత్వము - ఇచ్ఛాశక్తిచేత శరీరావయవముల ప్రవర్తనము - ఈ వాదమునకు ముఖ్య బీజము లని చెప్పవచ్చును. అనుభవమునకు శరీరము సాధనము; అనుభవకార్యము శరీరావయవముల ప్రవర్తనము. ఈ ప్రవర్తనజ్ఞానము మఱియొక మనోవృత్తి. ఈ వృత్తుల పరంపర లిట్లన్యోన్యముగ మిశ్రితములై యున్నయవి. ఈవాదమున కన్యోన్య ప్రభావత్వవాద మని పేరుపెట్టదము. ఈ రెండు మతములలో నేదియు సర్వాంగీకారమని నిశ్చయింప వీ లున్నట్లు గానరాదు. గొప్ప తత్త్వశాస్త్రజ్ఞులు కొందఱిటును, కొందఱటును జోగు జూపుచున్నారు. అనుభవములో నెక్కడనైనను గానరాని విరుద్ధవస్తువుల పరస్పరత్వము శరీరమనస్సులకు మాత్రము గల దని యెట్లంగీకరించమనియొకరును, అట్లైనచో నొకదాని జోక్యము మఱియొకదానికి లేకుండనుండు రెండుసమాంతరములై ప్రవహించుచుండుట యెట్టులు తటస్థించగలదని యొకరును పరస్పరము ఖండనవాదమును జరుపుచునే యున్నారు. అట్టిస్థితిలోనున్న ఈ విషయమై తుది మాటను జెప్పుటకువీలు కాదు. ఈవాదములు తత్త్వవిచారణ కెట్లుపచరించునో చూపింపవలసియున్నది. గ్రంథ విస్తర భీతిచేత నిపుడు చేయలేకున్నాను.

## నవలలు! ప్రబంధములు! నాటకములు! చరిత్రలు!

# అ ప రూ ప గ్రం థ ము లు

### I నవలలు

వంగూరి సుబ్బారావుగారివి.

| | | | |
|---|---|---|---|
| (1) ప్రభాతము | 0 | 12 | 0 |
| (2) కాంచనమాల | 0 | 3 | 0 |
| (3) మాయ | 0 | 6 | 0 |
| (4) రత్నపురి | 0 | 2 | 0 |
| (5) రోహిణి | 0 | 2 | 0 |
| (6) గులే బహారు | 0 | 4 | 0 |
| (7) లలితకుమారి | 0 | 10 | 0 |

### II ఇతరుల నవలలు

| | | | |
|---|---|---|---|
| (8) వినోదిని 1 భాగము | 0 | 12 | 0 |
| (9) ,, 2 భాగము | 0 | 12 | 0 |
| (10) ప్రేమలత | 0 | 8 | 0 |
| (11) పరుసవేది | 0 | 8 | 0 |
| (12) మయసభ | 0 | 10 | 0 |
| (13) అపూర్వ ప్రతిభ | 0 | 10 | 0 |
| (14) చాందసుల్తాన | 0 | 10 | 0 |
| (15) చిన రంగారావు | 0 | 6 | 0 |
| (16) సహృదయ | 0 | 4 | 0 |
| (17) మాధవీ కంకణము | 1 | 8 | 0 |
| (18) శుక్తి మతి | 0 | 12 | 0 |
| (19) శైవలినీ చంద్రశేఖరము | 0 | 12 | 0 |

### III ప్రాచీన ప్రబంధములు

| | | | |
|---|---|---|---|
| (1) పాండురంగ మాహాత్మ్యము | 0 | 12 | 0 |
| (2) పారిజాతాపహరణము | 0 | 6 | 0 |
| (3) జాహ్నవీ మాహాత్మ్యము | 0 | 10 | 0 |
| (4) సీమంతినీ కళ్యాణము | 0 | 10 | 0 |
| (5) విజయనందన విలాసము | 0 | 10 | 0 |
| (6) వాల్మీక చరిత్రము | 0 | 8 | 0 |
| (7) రంగనాథ రామాయణము | 1 | 0 | 0 |
| (8) శ్రీరంగ మాహాత్మ్యము | 0 | 12 | 0 |
| (9) సారంగధర చరిత్రము | 0 | 8 | 0 |
| (10) బద్దిసీతులు | 0 | 4 | 0 |

### IV చరిత్రములు

| | | | |
|---|---|---|---|
| (1) ఆంధ్ర వాఙ్మయచరిత్రము | 5 | 0 | 0 |
| (2) వేమన చరిత్రము | 1 | 8 | 0 |
| (3) ఆంధ్ర క్షత్రియులు | 1 | 8 | 0 |

### V వివిధ విషయములు

| | | | |
|---|---|---|---|
| (1) గృహ వైద్యము | 0 | 8 | 0 |
| (2) వ్యవహార చంద్రిక | 1 | 12 | 0 |
| (3) బొబ్బిలి యుద్ధము | 0 | 2 | 0 |
| (4) సుజ్ఞానోదయ నాటకము | 0 | 8 | 0 |
| (5) వారణాసి పురము | 0 | 0 | 6 |
| (6) జపాను సాంఘిక చరిత్రము | 0 | 8 | 0 |
| (7) హర్ష చరిత్రము | 0 | 8 | 0 |
| (8) అరేబియన్ నైట్సు కథలు | 1 | 8 | 0 |
| (9) ఈసబు నీతికథలు I | 0 | 6 | 0 |
| (10) ,, రెండవభాగము | 0 | 8 | 0 |
| (11) రాయల రాజనీతి | 0 | 4 | 0 |
| (12) గోషా | 0 | 8 | 0 |
| (13) వేమన్న చిత్రపటము | 0 | 4 | 0 |

పై గ్రంథములలో జాలవఱకు 50, 60 ప్రతులు మాత్రము నిలువయున్నవి. తిరిగి ముద్రణము కావు.

పై పుస్తకములు అని వ్రాయ
వలయువారు **కమల కుటీరము. మైలాపూరు, మదరాసు.** వలెను.

# వసంతోదయము

కొణిదెన బాల కృష్ణయ్య గారు

పూలరాజు చలికాఁడు వనముల ఱేఁడు
మనపాలి భాగ్యంబు మనకల్పకంబు
మనల నొక్కటిగాఁగ మన్నించుమధవుఁడు
చాలకాలమునకుఁ జనుదెంచినాఁడు.
వన్నెవన్నెల చెలువంబులు మించ
సింగారములను గైసేసి యందముగ
లతకూనలార యల్లన సాగివచ్చి
మనవసంతునకు నమస్కార మనరె
స్వామి కందఱు గూడి స్వాగతం బిడరె!

* * *

మొలకనవ్వులు గుల్క మురిపెంబు దొలఁక
ముద్దుల మల్లికా! ముందు రావమ్మ.
గమగమతావులు గ్రమ్ముకొనఁగ
చలముసేయక రావె జాజినెలంత!
గరువంబు మాపక కదలిరావమ్మ
వాసంతికా కమ్మవాసనల్ దనర
సోఁగచూపుల నట్లు చూచెద వేమె!
ఏలామతల్లి! నా గింకేల నమ్మ?
పువ్వులదొరసాని పొలఁతి గులాబి
కెంజాయచెక్కుల కీలుకొనఁగ
కోపగింపక రమ్ము కొమ్మలఁ గూడి.
అలకల నవలించి యందంపునడల
చంపకావతి రావె పరగునఁ గదలి
పరుగుపరుగున రావె పరువంపు మొల్ల
రావె రోజామల్లి! రావె గోరింట!
రావె రో మాలతీ! రా కురువింద!
ఆలసింపక మీర లమ్మకచెల్ల
లతకూనలార! యల్లన సాగిరారె
హారతు లెత్తరే ఆమనిదొరకు!

* * *

మాధవుం డేతేర మదిఁ గోర్కు లూర
మదిరాక్షి వనలక్ష్మి మానితగతిని
చెలినీటుతోడి వన్నెలు పచరించె
క్రొందలిరుల మావిగున్నలు పొలిచె
అవనిజంబులు ముదు రాకుల నూడ్చి
చెలువారఁ గ్రొంగ్రొత్త చిగురుల మించె
ఏడాకు లనఁటుల కెసగెఁ గప్పురము

అలరులఁ దిని పికంబులు చెలరేగి
పంచమస్వరమునఁ బాడుచున్నయవి
తోఁటపాటులు పొందు బడలిక ల్బాయ
మలయానిలము వీఁచె మందమందముగ
వింతయలంకార విభవంబు కలిమి
బ్రహ్మాండమున కిది పండువు యయ్యె
తోఁడివా రెల్ల రెంతో కౌతుకమున
విలసనంబులు చూపి వేడుకల్ జరుప
సిరిసంపదల మించి సీమాన నుండ
మన మిట్టు లుండఁగ మతి పోరు నేమి?
తరిదైనపుడు మన ధర్మంబు నలుప
కూరకుండిన నదె యుక్రోశాడు మనకు
చాటుమాటులఁ జిక్కి సమకూటకంబె
మనధర్మ మొనరించి మతి చావ మేలు
ఇహపరంబుల కవు దక్కగలాము
దైవంబు చూపిన దారిఁ బోఁడిచి
అనదల ట్రితరుల నండఁగాఁ దలఁచి
స్వేచ్ఛ లే కెన్నాళ్లు చిక్కులఁ బడెద
మక్కటా! యిది యెట్టి యన్యాయ మమ్మ.
ఆలోచనల కిది యదను గా దమ్మ.
లతకూనలార మెల్లగఁ బైకిసాగి
ఆలమాధవునకు జోహారు లీరమ్మ.

* * *

కట్టెండతాకునఁ గమలి కొన్నాళ్లు
గాలిదొమ్మ్మమునఁ దూగాడి కొన్నాళ్లు
వానవెల్లున కసివాడి కొన్నాళ్లు
మంచుకోఁతలచేత మణఁగి కొన్నాళ్లు
తీవచేడియలార! దిగులొందినాము.
ప్రాణము ల్బిగఁబట్టి బ్రదికియున్నాము.
అప్పాట్లు దలఁచిన నడలు జనించు
నవఁబోఁడులార మీ సాకుఁ దల్లదిగొ!
వనలక్ష్మితోఁ గూడి వాల్లభ్యమునను
విహరించుచున్నాఁడు వేడుకతోడ.
లసదలంకారముల్ రమణ ధరించి
కడు ముద్దునడకలఁ గానరారమ్మ.
స్వామియానతి శిరసా వహించి.

కలుష మిాధర్మంబు శపథంబుఁ జేసి
బాగైనవిరుల నుపాయన మిచ్చి
పాటివారలలోన సత్కీర్తి గనుఁడి.
నాయకుఁ డరుదేర నాఁ డూరకుండి
యకట నశ్రుల రాల్చు టది బేలతనము.
చెప్పినమాటలఁ జెవియొగ్గి వినుఁడి
కీర్తింపవలెక సమయంబునందు
మిాస్వధర్మము దీర్ప మేలు సేకూరును.
క్రమయొల్ల దీఱను సంతస మొందవు
పేరు ప్రఖ్యాతియుఁ బెంపును గలుగు.
ఇటులు గాకున్న మిా కెల్లకాలమును
ఊరుఁ బేరును లేక నరకఁ జచ్చుచును
పుట్టుచుండెద రమ్మ పురుగులరీతి
కష్టంబు నాక నీ కాలంబునందు
తీవకన్నియలార తెంపున వదలి
స్వామి చెప్పినయట్లు చరియింపుఁ డమ్మ.

* * *

మనఘనం బంతయుఁ మాటుపడంగ
నలజల్లిఁ గుడుచుచు నవయుచున్నాము.
తము దాఁ బొగడికోలు తథ్యంబు కాదు
వినఁ జెప్పకఁ దప్ప దదను గావునను.
మన సౌకుమార్యంబు మన సోయగంబు
మన వింతవన్నెలు మన సుగంధంబు
మన గొప్పతనమును మన భాగ్యగరిమ
వసుధలోఁ గలవె యెవ్వారికి నేని?
మన యుపకారంబు మఱతు రెవ్వారు !
పొందుగా నీశ్వరుఁ బూజింప మనము
రాజులమకుటముల్ రంజింప మనము
గొప్పవారల నెదుర్కొనుటకు మనము
తమకంబు మించ నూతనవధూవరులు
అలఁతినవ్వుల నంటు లాడంగ మనము
అతనుతాపంబున నలసట నొందు
చిగురుఁబోఁడి కమర్చు సెజ్జకు మనము
శృంగారవతులకు శయ్యాగృహముల
సరససౌరభముఁ బ్రసాదింప మనము
ప్రభువులకొలువులఁ బరిమత్తులందుఁ
పెండ్లిపందిళులందు వేడుకలందు
పండుగలకును దప్పక నుండ మనము
పాలయల్కఁ జెందిన పూఁబోఁడి విభుని
దండింపఁ దగు నాయుధములకు మనము
అందంబులకు వింతయందంబు నొసఁగి
జవరాండ్ర ముద్దుముచ్చటఁ దీర్ప మనము
సహకారులము సుమ్మి జనుల కెల్లకును.
రతనాలు సైతము రాఁగల వెపుడు
వలె నన్నుపడు రాము వారికి మనము
మనశక్తి నెఱుఁగక మసలుచున్నాము
గాన తత్త్వ మెఱింగి కడు నిష్ఠతోడ
అలరుదీవియలార ! యుండక యొక్కటిగఁ
దగుధర్మ మొనరింపఁ దరియింపఁ గలరు.

* * *

కమ్మనితావులు కడలెల్ల ముంపఁ
దళరచ్చటలు రోదసి నాక్రమింప
రకరకంబులఁ బొల్చు లావణ్యములకుఁ
జూపఱ హృదయముల్ చూఱ కోవంగ
గనుఁగొన్న వా రెల్లఁ గైవండ లొసఁగ
మనల నాదటఁ జేర్చి మర్యాదఁ జూప
మనకీర్తిలతికలు మహి కెల్లఁ బ్రాక
విలసమించినయట్టి విభవంబుతోడ
నైకమత్యముతోడ నందఱు గూడి
వర వసంతోత్సవ వైభవంబునకు
సహకార మొనరింప జన్మముల్ ఫలము
గాంచుఁ గావున మీరు కదలి చేవచ్చి
లాలసల్ దీపింప లతకూనలార!
స్వేచ్ఛగా స్వామిని సేవింప రమ్మ.
తత్ప్రసాదముఁ బొంది ధారుణిలోన
సుఖజీవనములచే శోభిల్ల రమ్మ
సకలసంపదల స్వేచ్ఛను గన రమ్మ.

# ఆంధ్ర గద్య నాటకములు

శ్రీపాద కామేశ్వరరావు గారు

గద్యం కవీనాం నికషం వదంతి అని యాభాణకము. ప్రకృతమున నాంధ్ర దేశమునఁ బ్రదర్శింపబడు ఆంధ్ర నాటకము లన్నియు గద్యపద్యాత్మకములు. వాని యందు గీతములు పెక్కులు రచింపబడుచున్నవి. ఇందుకు కారణము నా కొకటి తోఁచుచున్నది. సంస్కృత నాటకములు గద్యపద్యాత్మకములు. ఆంధ్రమున మొట్ట మొదట వ్రాయఁబడిన నాటకములు గద్యమయములే యనుట యందఱకును విదితమే! పద్యములను నాటకము లలోనికిఁ జొన్పినవారు ఆంధ్ర నాటకపితామహులును కీర్తిశేషులును నగు ధర్మవరము కృష్ణమాచార్యులు గారు. వారు వానిని రచించుటలోఁ గర్ణాటనాటకము లను జూచి తెనుఁగున నాటకము లుండఁగూడదా అను ప్రశ్నకు సమాధాన మిచ్చుటకై యట్లు వ్రాసి రని తెల్పి యున్నారు. ఆ కర్ణాటనాటకముల ననుసరించి అట్లు వ్రాసి రనుట కొంతవఱకు నిజము కావచ్చును. ఇట్టి యలవాటు సంస్కృతనాటకములయం దుండుటచే దేశ భాషాకవులుగూడ వాని ననుకరించియుందు రనుట సమంజస మని నాకు తోఁచుచున్నది.

ఉత్తరసర్కారులలో నాటకరచనకు మార్గదర్శ కులు ధార్వాడకంపెనీవారు. వీరు క్రీ. శ. 1880 వ సంవత్సరమునుండియును ఉత్తరసర్కారులలోని ప్రతిపట్ట ణమందును నాటకములనుఁ బ్రదర్శించిరి. ఆ నాటకము లనుజూచి మనవారు రచింప మొదలుపెట్టిరని పెద్దలు చెప్పుదురు.

ఇంకొకవిశేషము. ఆంధ్రమునగూడ నాటకముల కీడువచ్చిన యక్షగానప్రబంధము లుండెను. ఇందు గద్యపద్యములే గాక గీతములుకూడ నుండెను, వీనినిజూ చియును - హిందీభాషను ధార్వాడవారు ప్రదర్శించిన నాటకములయందును గీతము లుండుటచేతను గాబోలు కృష్ణమాచార్యులుగారును గీతములనురచియించిరి. గతా నుగతికులై కూడ యిటీవలివారు నక్లే చేయుచున్నారు.

నాటకములయందుమాత్రము పద్యము లెక్కు డుగా నుండెను. గద్యము చాల తక్కువ. కొందఱు గీతములను రచింప లేదు. సంపూర్ణ గద్యనాటకములు ప్రద ర్శింబడుట లేదు.

ఆంధ్రమునందు పద్యములు చదువునప్పుడు సంగీత ముండుట యొక యాచారము. సంస్కృతనాటకముల నాడువా రొకటిరెండు సమాజము లుండబోలును - వా నియందలి పద్యములను వా రెట్లు చదువుదురో నేను విన లేదు. కాని సంగీత ముండియుండు ననియే నానమ్మకము. విజయనగరమున నొక సంస్కృతనాటకసమాజ మిప్ప టికి నలువదియేండ్ల క్రిందట నుండెడిది. అందు వారు సంగీతముతోడనే పద్యములను చదువుచు కొన్ని పద్య ములను లయబద్ధముగఁ జేసి పాటవలె పాడుచుండెడి వారు. ఈ దేశమున పురాణములఁ జదువుట చాలకా లమునుండియు ననుశ్రుతముగ వచ్చుచున్నది. వారును గద్యపద్యములను రాగయుక్తములుగఁ జదువుచుండెడి వారని మన మూహింపవచ్చును. ఎట్లైననేమి? ద్రావిడ భాష లన్నిఁటిలో పద్యము లిట్లే చదువుచున్నారు. సంస్కృతపద్యములు వృత్తములు. కావున గానము సహజముగా వానియందుఁ గలదు. ఆంధ్రమునఁగూడ కొన్నివృత్తములు లయబద్ధములై యున్నను వాని నరు దుగ వాడుదురు. వానినైనను సహజశైలిని నటులు చదువక రాగవరుసతోఁ జదువురు. ఇది మనభాషకు వ్యక్తివిశేష మనఁ జెల్లును.

ఎట్లు రచింపఁబడినను నాటకములయందు నాల్గు కళలును సమ్మేళనముఁ జెందుచున్నవి. అవి-కవిత అభిన యము (భావప్రకటన) వాచకము సంగీతము అనునవి. మొదటిది కవులకును తక్కినమూఁడును ప్రదర్శకులకును జెందును. కవితయనునప్పుడు నాటకకళా (Dramatic art) మిళిత మని యెంచనగును. పురాణములు, ప్రబంధములు మొదలగువానియందలి కవితకును నాటకములయందలి కవితకును భేద మేమున్నదనుట యీనాటకకళను బట్టియే. ఈ నాటకకళ, శిల్పము గానము, చిత్రలేఖ నము వంటి (Fine art) కళ. కవితయం దొకజాతి.

నాలుగు కళలు నాటకములయందు చిత్రింపఁబడుచున్నను నాటకకళయే ప్రధానము. తక్కినవి దానికి సహకారులు. వీని కన్నింటికి ఫల మొక్కటియే—చిత్తరంజనము! అనఁగా భావోన్మీలనముచే మనముల నలరింపఁజేయుట. ఏక కార్యనిర్వాహకులు పల్గురు కూడినపుడు వా రన్యోన్య ప్రతికూలురు కాఁగూడదని యందఱకును దెలియును. నల్వురును సమర్థులు కావున నందొకరికొకరు విసుటన మొనర్పరాదు. ఇం దెవ్వరును తక్కిన వారిని డిగఁద్రొక్కి యంతయుఁ దామే జుఱ్ఱుకొనఁ దలంపఁగూడదు. ఇందుమూలమున నితరుల ప్రకర్ష తిరోహిత మగుటయే కాక ఫలముగూడ కూలంకషము కానేరదు. పదిమంది కలిసి బంతి యాడునప్పుడు ఎవరు చేయవలసినపని వారు చేయవలయును. అందఱును డిగఁద్రొక్కి యొకరిద్దఱు తామే విజృంభింప నెంచినచో, జయము చేకూరుట యరుదని ప్రతివానికిని దెలియును. అందఱును సమానముగాఁ బనిచేయుచున్నచో జయము సుకర మగును. అట్లే యీ కళలన్నియు భావోన్మీలన మొనర్పవలయును. ఇం దెద్దియేని లోపించినను, లేక బాగుగ నుండకుండినను, ఫలము చేకూరదు. ఒకవేళ చేకూరినను కూలంకషము గాదు. ఇటఁగూడ నొక్క మాట చెప్పవలసియున్నది. పై నుదాహరించిన కళలలోఁ బ్రధానమైన అభినయమును, వాచకమును బాగుగనుండి సంగీతము బాగుగనుండని నటులు పొగడ్తఁ గనుచున్నారు. కాని సంగీతము బాగుగనుండి తక్కిన రెండును బాగుగ నున్నవారు విద్వాంసులచేఁ బొగడ్తఁ గాంచలేదు. ఇది కొంతమేలు. జనసామాన్యము సూక్ష్మవిషయములను గుర్తింపలేనందున వారు సంగీతమునే మెచ్చెద రనుటకు వీలు లేదు. వాచకాభినయములు మేలైనచో వారు సంతోషించి తీరుదురు. ఈ విషయమునుగూర్చి పెక్కుసారులు పత్రికలలో చర్చించియుంటిని. కాన నిట విరమింతును. ఇందలి పర్యవసానమును మాత్రమే ఇట పొందుపఱచెదను. సంగీత మాంధ్ర రంగస్థలమునఁ బెచ్చుపెరిఁగి వాచకమును ప్రక్కలుచేసి అభినయము నడుగంటఁజేయుచున్నది. దీనిని లోపింపఁజేయుటయే ప్రకృతమున మనకు శ్రేయము. అట్లిష్టపడనివారు దానిని సాధ్యమైనంత వఱకును దగ్గింపవలయును. ఈ విషయమున మనలో నిద్దఱు నాటకకవులు దారిచూపిరి. శ్రీ కృష్ణమాచార్యులు గారును శ్రీయుతులు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారును. వారి చివరనాటకములలో గద్యము నెక్కుడుగ నుపయోగించిరి. వీ రిట్టి మార్పు సేయుట అభినయాభివృద్ధి కనియే తోఁచెడిని. వారి యభిప్రాయము కూడ నదియే కావచ్చును. కాని వీరును పాటలను పద్యములను బొత్తుగ వాడియుండనిచోఁ బ్రకృతమున నత్యుత్తమ మని నాకుఁ దోఁచుచున్నది.

మొదటఁ బద్యరూపముగ నాటకములను వ్రాసి, రాను రాను గద్యమయముచేయుట అదృష్టశ్రుతపూర్వము కాదు. నాగరకతకు నివాసములైన యన్యదేశసారస్వతములను పరిశీలింపుడు. నూఱువత్సరములనుండి యూరపుఖండమునను అమెరికాఖండమునను జపానుదేశమందును నాటకములు గద్యరూపముననే వ్రాయుచున్నారు. మనదేశమందుఁగూడ మార్గదర్శియగు బంగాళదేశమున నాటక కవివరులు గద్యమునే వ్రాయుచున్నారు. మనవా రట్లేల చేయఁగూడదు ?

నేను కొందఱు నాటకసంఘాధ్యక్షుల నడుగఁగా నట్టివి జనులకు రుచింపవని చెప్పిరి. కాని వీరు గద్యనాటకములనుఁ బ్రదర్శింపనిదే యవి రుచింపవని యెట్లూహింపఁజాలిరో తెలియదు. నిజమైన కారణ మొకటి కలదు. గద్యనాటకముల నాడి ప్రేక్షకులను సంతసపెట్టఁగడంగినవారు అభినయవాచకములందు నిపుణులై యుండవలయును. అనఁగా విద్వాంసులు గావలయును. ఇట్టివారు నాటకసంఘములలో జేరుటలేదు. కావున నవి రుచింపవనుట కొంతవఱకు నిజము. రంగస్థలముల నభివృద్ధి సేయనెంచినయెడల గద్యనాటకములను ప్రదర్శింపవలయును.

ఈ క్రొత్తమార్గము నవలంబించుట కింక నొక ముఖ్యకారణ మున్నది. ఇప్పటి యాంధ్ర నాటకములలో నాటకకళకుఁ గావలసిన ముఖ్యవిషయములు కొన్ని లేవు. అందు ముఖ్యమైనవి చరిత్రచిత్రణము లేక పాత్రస్వభావోన్మీలనము, నాటకసంవిధానము లేక ఆఖ్యానవస్తునిర్మాణము. ఈ రెండువిషయములను రచియించుటయందు కవి తనచతురత గనఁబఱుపవలయును. ఈ విషయములను ఇప్పటివారు గమనింపక ఏవో కొన్ని గద్యపద్యములను తడకలవలె నల్లి నాటకములను వ్రాయుచున్నారు. అమెరికాయందు నాంగ్లదేశమందును ఈవిషయములకు ప్రాముఖ్యము ఎక్కుడు. ఇట్టినాటకములు సర్వజనరంజకము లగును. కావున మనభాషయందు కూడ నిట్టివి చేకరించుట మనకు విధి. స్వకపోలకల్పితములై యిట్టి నాటకములు వెలువడుట కష్టము గాన నంతకు మున్ను

ఇతరభాషలలోని యుత్కృష్టనాటకములను ఆంధ్రమున భాషాంతరీకరించుట ప్రథమకర్తవ్యము. ఇతరదేశముల యందలి నాటకములు మనదేశమువారికి రుచించునో లేదో చూచుటకు ముందు మనదేశమందు ఇతరభాషలలో రచింపఁబడినవానిని మొదటఁ దెనిఁగింపవలయును. ఇందుకై యొకసంఘ మేర్పడి యొకగ్రంథమాలను వెలువడఁజేయుట శ్రేయము. ఇప్పుడు స్థాపింపఁబడిన గ్రంథాలయములందు నవలలను శాస్త్రములను చరిత్రములను ప్రచురించుచున్నారు. కాని నాటకములను ప్రచురించు సంఘము లెచ్చటను గానరావు. కావున కళాభిలాషు లిట్టి సంఘములను ఏర్పఱచుటను గూర్చి యించుక యాలోచింతురు గాక!

ఈ విషయమున నేను కొంతవఱకుఁ గృషి చేసితిని. కావున వంగదేశనాటకములఁగూర్చి యించుక ముచ్చటించెదను. వంగభాషను నాటకములు పెక్కు లుండుటయే గాక అవి యుత్తమశ్రేణికిఁ జెందిన గ్రంథము లని నిస్సందేహముగా వక్కాణింపఁగలను. ఇరువదిసంవత్సరములనుండి నేను వంగభాష నభ్యసించి యిరువదినాటకములను నతిజాగ్రత్తతోఁ జదివితిని. ఇరువదిసంవత్సరములనుండి నేను చదువుచున్న ఆంధ్రనాటకములు వానితో సరిరావని నాకు తోఁచినది. అందుచేఁ గొందఱు నాటకాభిమాను లగు నామిత్రులకా నాటకములను జదివి వినిపింపఁగా వారును నాతో సమాభిప్రాయులై వానిని తెనిఁగింపుమని నన్ను నిర్బంధపెట్టిరి. నాకు భాషాజ్ఞాన మంతగా లేకున్నను మాతృభాష యగుటచే దేశసేవకై వానిలోఁ గొన్నిఁటిని తెనిఁగించి పలుపురయెదుటఁ జదివితిని. బాగుగ లే దనువారు లేరు సరేకదా వానిని ప్రదర్శింపుడనియు, ప్రకటింపుడనియు నడుగనివారు లేరు. ఆంగ్లభాషయందలి నాటకములను జదివినవారి కవి రుచించు నని కొందఱనఁగా మచ్చుమాత్ర మని యొక నాటకమును ప్రదర్శించితిమి. ఆబాలగోపాల మందఱు బాగుగ నున్నదని కొనియాడిరి. "వంటకత్తియ జాణ కావలయుఁ గాని తినెడివారికి తద్రుచు దెలియ కున్నె?" అను మాట నిజమయ్యె. ఒకవంగభాష నొకకవి రచించిన యొకనాటక మిట్లుండినచో పలుభాషల పెక్కురుత్తమకవులు రచించిన ప్రకృష్టనాటకముల నిట్లు తెనిఁగించి ప్రదర్శించిన మన రంగస్థలము లభివృద్ధిఁ జెందవా?

అట్టి గ్రంథములను మొదట గద్యమున రచించి ప్రేక్షకులను నటులను నాగరకరుచుల నవలంబించునటులు చేయవలయును. అట్లు చేసినచో రసహీనము లగు నాటకములు వన్నె కెక్కవు. నాటకకవులు పొల్లు నాటకములను వ్రాయుట మానుదురు. క్రొత్తవారు రసవంతము లగు గ్రంథములనే రచించెదరు. గద్యకావ్యములు ప్రబలుటచే వాచకము అభినయము నభివృద్ధి నొందును. రంగస్థలము బాగుపడును. సారస్వతము గణనీయ మగును.

ఒకనాటకమునందలి గుణదోషవిమర్శన మెట్లు సేయవలెనో యించుక సూచించెదను. నాటకమున ముఖ్యవిషయము నాటకకళ. కవనము రెండవది. నాటకకళ ముఖ్యముగఁ బై నుదాహరించిన ఆఖ్యానవస్తునిర్మాణమును పాత్రస్వభావోన్మీలనమునను గన్పట్టును.

ఆఖ్యానవస్తునిర్మాణమునకు నియమము లివి:— కథాభాగమున నైక్యముండవలయును. ప్రతినాటకమునను బ్రధానవిషయ మొకటి యుండవలయును. తక్కినవిషయము లెల్ల దీనినిఁ బ్రస్ఫుటితము చేయవలయును. ప్రధానవిషయమున కాత్యంతికసంబధము లేని విషయ మేదియు నుండఁగూడదు.

నాటకములో నుదాహరించిన ప్రతివిషయమునకును ఫలము సేకూఱవలయును. వానికి రెండు తెఱఁగుల యుపయోగ ముండవలయును. ప్రధానవిషయమున కనుకూలముగఁగాని ప్రతికూలముగ గాని యుండవలయును. ఏది యుండినను ఊడినను ప్రధానవిషయము మాత్రము నిరంతరాయముగ సాగువిషయ ముండరాదు.

నాటకమున సరసమగు కవిత యుండవలయు. ఇది భావోన్మీలనము తోడ్తోడ నొనర్పవలయును గాన అన్వయమునఁ గాని - పదములందుఁ గాని - అలంకారములందుఁ గాని జటిలత తోఁపరాదు. నాతికఠినము లగు పదములను గూర్చి యర్థము సూక్ష్మముగఁ దోఁచునట్లు గద్యపద్యములను రచింపవలయును.

నాటకమునందలి ఘటనల ఘాతప్రతిఘాతములచే కథాభాగము నడుచుచుండవలయునే కాని సరళముగా నడువరాదు. మనజీవనచిత్రము లిటులే సాగుచుండును.

నాటకమునం దంతర్ద్వంద్వము కనిపించవలయును. "కర్తు మకర్తు మన్యథాకర్తుమ్" అనునట్టి సమస్య

యుండవలయును. మానవునియంతరంగమునందు నిట్టి యుద్ధము జరుగవలయును. ఇట్టియుద్ధము జరుగుచుండుటయు నొకవేళ ప్రతికూలించుటయునుగూడ కల్గుటవలననే నాటకమందు రసోత్పత్తి యగును. ఇవి యనన్యసాధారణము లైనచో నిఁక చెప్పవలయునా?

ప్రతికళయుఁ బ్రకృతి ననుసరించుచుండును. కావున నాటకమున విషయము లన్నియును స్వభావసిద్ధములుగ నుండవలయును. గద్యనాటకములనుగూర్చి యింతగా నేలవ్రాసితివని కొందఱడుగవచ్చును. నాటకములలో పద్యము లుంచరాదని నా యభిప్రాయము కాదు. "నిరంకుశాః కవయః" అనుటను నే నెఱుఁగుదును. కాని నాటకకళయందు నాకుఁగల యభిరుచియే నన్నిట్లు పురికొల్పినది. ఇప్పుడు మన నాటకములలో ముఖ్యపాత్రలను స్వీకరించువారు సంగీతము అభినయము వాచకమును సమరసముగా మేళగించువారలు మిక్కిలి తక్కువగ నున్నారు. ఏ సమాజమును జూచినను సంగీతమందు ప్రకర్షత గలవారలే ముఖ్యపాత్రములను స్వీకరించుచున్నారు. వాచకము నభినయమును లెక్కసేయువారలే లేరు. సంగీతమునకైనను శ్రావ్యమైన కంఠధ్వనినే చూచుచున్నారు గాని సంగీతపరిచితినిగూడ గణింపరు. శాస్త్రపరిచితి లేనివారిసంగీతము వినుట కింపుగానుండునా? శాస్త్రపరిచితి యున్నను కంఠధ్వని శ్రావ్యముగా నుండకున్నచో బాగుగ నుండదుకదా! ఈ రెండును బాగుగ నుండువారు నటవృత్తిలోఁ బ్రవేశించుట లేదు. కావునఁ దగినవారలు సేకూఱు నంతదనుక సంగీతముజోలికి పోకుండుటయే శ్రేయము. దీనిని లోపింపఁజేసిన భరతశాస్త్రమున నొక ముఖ్యసాధనమును కోలుపోదుమని యెంచఁగారాదు. తక్కినసాధనములను నిర్దుష్టముగ వెలయఁజేయఁజాలినచో లోటు కాన్పింపదు. కవిత సరసముగా నుండి వాచకమును అభినయమును యథాయోగ్యముగ నిర్వర్తితము లైనచో చిత్తములు పల్లవింపకుండునా? సంగీతమే ముఖ్యసాధనమని యెంతురేని గద్యమును రచింపనేల? నాటకములు నిర్వచనము లైనచో శ్రేయముకదా? ఇట్లుచేయుట అందఱకు సమ్మతమా? పోనీ సంగీతముననే రసోత్పాదనమున్న దని యెంతురా? మన నాటకములందలి గద్యము లెన్నిచోట్ల రసవంతములుగ లేవు? అట్టిభాగములు రంగస్థలములపైఁ బ్రదర్శించినపుడు రసోదయము కాలేదా? ఇట్టిచోటులందు సంగీతము లేనిలోటు కనఁబడినదా? మెప్పువడయని సంగీత మను నిర్బంధవిధానమునకు నటులను ప్రేక్షకులను పాత్రులఁజేసి రసాభాసమొనర్చుటకంటెను సంగీతమునే వదలినచో మేలుకాదా?

అట్లయిన సంగీతముతో పద్యమును కూడ బహిష్కరింపవలయు నందురా? అట్లే కానిండు. నాకెట్టి యభ్యంతరమును లేదు. కావనే నేను గద్యనాటకములు కావలయు నని మొఱవెట్టుచుంటిని. సరే ఇందువలన కవులస్వాతంత్ర్యము నిరంకుశము కాదు. పద్యముచెప్పక యున్నచోఁ గవిత్వమేడ అని యందురా? నే నిచ్చెడు యుత్తర మిది. కవిత పద్యమునందే కాక గద్యమునఁగూడ కలదు. అంతియ కాదు. ఆంధ్రమునందు పద్యకవనము కావలసినంత యున్నది. గద్యరచనము తక్కువ. ప్రస్తుతపు వాఙ్మయమునం దీశాఖయే పల్లవించుచున్నది. ఇప్పు డీ సంచికలో వ్రాయఁబడిన వ్యాసము లన్నియునుఁ బద్యరూపమున వ్రాయవలయు నన్న నెందఱట్లువ్రాయ సాహసింపఁ గలరు? అదియునుంగాక గద్యము ప్రబలుటయే దేశోద్ధరణమునకు శుభసూచకము. గద్యము సులభగ్రాహ్యము. పండితపామరులు గద్యమును విని యానందింతురు. గద్యం కవీనాం నికషం వదంతి అని యాభాణకము. కావుననే కవి గద్యముఁ వ్రాసినంతనే ప్రశంసనీయుఁడు కాఁడు.

ఐననుఁ బద్యకవనమునందు సారస్యము లేదనను. రంగస్థలమునఁ బద్యమును సంగీతములోఁ జదువుచుండుటచేఁ బద్యమునందలి మాధురి తగ్గుచున్నది. రెండింటిని విడుచుట సర్వోత్తమము. అట్లు చేయకున్నచో సంగీతముఁ ద్యజింపుఁడు. కవితకు ప్రాధాన్య మెక్కుడుకదా! అట్లయినఁ బద్యములను చదువు టెట్లని ప్రశ్నింతురా? గద్యమువలె చదువుడు. ఇది హాస్యాస్పద మందురా? క్రొత్త యగుటచేఁ గొలఁదికాల మట్లు భావింతురేమో కాని, ఈ యభిప్రాయ మెంతయోకాల ముండదు. సరియైనచోటుల నాపుటకును, ఒత్తిపల్కుటకును వీలుండును. భావము పూర్ణముగా స్ఫురించును. వాచక మభివృద్ధి జెందును. అభినయము తోడ్తోడనే యులవడును. అప్పుడప్పుడును సంగీతజ్ఞానము లేనివా రొకటిరెండు పద్యములను గద్యవలెనే చదివిరి. ప్రేక్షకులు వారిని జూచి సంతసించిరి. గాని గేలిసేయలేదు. ఇట్లొకటిరెండు నాటకసంఘము లాచరించినచో సంగీతము సన్నగిల్లి నాటకకళ నానాఁట నభివృద్ధిఁ జెందును. మననాటకములను జూచిన కొందఱు పాశ్చాత్యపండితుల యభి

ప్రాయ మిది:—మన నాటకములయందు సంగీతమును పద్యములను వేఱుసేయవలయుననియును అట్లుసేయకున్న నాటకవాఙ్మయ మభివృద్ధి నొంద దనియును అంతవఱకు నిపుణులగు ప్రదర్శకులు వెలువడరనియు. మంచి ప్రదర్శకులును నాటకములును లేనిచో నాటకసమాజము లేల? ఇంకొకటి. కలకత్తా, బొంబాయి, మొదలగు పట్టణములయందు సంగీతములయందు గొప్పగొప్ప నాటకసమాజము లున్నవి. వానియందు సంగీతము లేదా? అని కొందఱడుగవచ్చును. బొంబాయిసంగతి నాకు తెలియదు. కలకత్తాలోఁ బ్రదర్శించు వంగనాటకములలో సంగీతము పాటలయందే కాని పద్యముల యందు వాడరు. హిందీ నాటకములను గొన్నిఁటిని చదివితిని. ఆడుచుండఁగాను జూచితిని. వానియందును సంగీతము పాటలయందే కాని గద్యమున నుపయోగింపలేదు. ఈపాటలైనను రంగమునకు ముందో లేక అంతమునకో కాని నడుమ నెక్కడను కానరాలేదు.

పార్శీకంపెనీవారు వచ్చి యడుగడుగునను పాటలను బెట్టి నాటకమునంతను పాటలతోఁ గుప్పించిరి. వారిని చూచి మనవారును మంచిచెడ్డల నారయక యాదారినే పట్టిరి. ఈ విషయమునందు కృష్ణమాచార్యులవారు ప్రథమనేరస్థులు. ఇటీవలి బాపట్ల కాంతయ్యగారు ద్వితీయులు. కృష్ణమాచార్యులగారికంటెను కాంతయ్యగారే చెడ్డపేరు తెచ్చుకొనిరి. ఈయనకు పాటలే ప్రధానము. వీరు కొంతకాలము హైదరాబాదుదేశమున నుండుటచే నావరుసల బెట్టి తెనుఁగున పాటల రచించి పేరువడిన నాటకసమాజములవారియొద్ద జీతమునకుండి నటులకు వానిని నేర్పి ధనార్జనముచేసి రంగస్థలములరసాభాసమునకు మూలకారకులైరి. వీరు గీతములను రచియించుటయే గాక మూఁడు నాటకములను వ్రాసిరి. నే నానాటకములను జూచితిని. అందు పాటలుతప్ప వేఱు గణనీయ మగువిషయమే లేదు. మనవారింకనైనఁ దెల్వితెచ్చుకొని రంగస్థలముల యభివృద్ధికై పాటుపడుదురుగాక! ఇంకొక్కమాట. నే నెంత చెప్పినను సంగీతమును విడువఁజాల మనువారు పాటల నరుదుగా వాడుకొనుఁడు. పద్యము లన్నిఁటిని సంగీతమయముచేసి వాచకాభినయములను రూపుమాపకుఁడు.

# కవిమహిమ

జనమంచి వేంకటరామయ్య గారు

ప్రతిమనుజుఁడు కవియే యగుఁ
బ్రతిమనుజుఁడు శిల్పి యగును బ్రతిమనుజుఁడు మా
నిత సుందరతాప్రియుఁ డగుఁ
బ్రతిమనుజుం డీశ్వరునికిఁ బ్రతిబింబమెకా.

క. జీవకుఁడయ్యెడైన యీశ్వరుఁ
డీవిశ్వముఁ దనదుకళగ సృజియించునటుల్
భావజ్ఞుఁడైన కవియే
జీవకళాశోభితముగఁ జేయుఁ గవనమున్.

మ. కవితాతత్త్వవిశారదుం డగుటకై కాశీ నవద్వీప వా
స వృథాయాసము లేల? పూర్వభవ సంస్కారంబు వాణీప్రసా
ద విశేషంబును గల్గ, మాఘరము వసంతశ్రీసమారంభవే
శ వనీపాళిఁ బికంబు వోలె మధురాలాపంబుఁ గావించెడున్.

మ. కవనం బన్నను గాఢుకు ప్పెఁ గొనితేఁ గాసంత గంగాజలం
బవునే? పెద్దల కల్ల దాహశమనంబై యొలలాడంగ దఢ
ద్భికమార్గోపరి శైల దంబుఁ ధుని దివ్యప్రవాహంబులన్
భువిఁ బాతింపవలెన్ భగీరథతపఃపుణ్యంబునన్ గన్యకై.

క. కలుగుదురు గాని కవు లిలఁ
గలిగింపం బడ రటంద్రు ఖండాంతరవా
సులు ప్రాచ్యపశ్చిమవిశ్వా
సులు గాకయుఁ బలుకు టిట్లు చోద్యము కాదే!

క. ఏకాగ్రచిత్తుఁ డయి త
త్త్వాకలితహృదయుఁ డయిన మహాకవి ఋషియే
గా కొరుఁడే? తగులం వాతని
వాకునె యర్థంబు నెడ వస్తునవోలన్.

క. కవిహృదయము సహృదయం
బు విధంబునఁ బద్మకోశమున కెనయగుఁ గా
ని విశేష మిన్న ఘటసం
భవు పుడిసిలి యట్లు నిండఁ బట్టుం గడలిన్.

క. కను దెఱచి మూసి తెఱచియు
ఘనుఁ డగు కవి ముజ్జగంబుఁ గట్టెదయుదు; వా
మనమూర్తిపదత్రయిక
న్నను బలవత్తరము భావనాదృష్టి యహహా!

గీ. సర్వభక్షకుఁ డైన వైశ్వానరుండు
శుచి యటంచును శ్రుతిని విశ్రుతిని గాంచు
నన్నిటిని నంటు భాస్కరుం డంటుకడఁడు
వివిధభావవీథివిహారి కవివరుఁడు నటులె.

గీ. తత్త్వవేత్తలు చేఁదు సత్యముగఁ దోఁచు
నదియె సౌందర్యరూపమై యమరుఁ గవికిఁ
జండమార్తాండ తేజఃప్రసారమె కద
నిండుపున్నమ పండువెన్నెలగ మాఱు.

క. పువ్వులపయిఁ జేఁటివోలెం
దవిలెడుఁ దా నెపుడు వాసనాప్రేరితమై
కవిమనసు మధురవస్తుల
భువి సుమహితవృత్తుల కిది పోలును గాదే.

గీ. నవరసామోదమేదురం బవుచు వివిధ
పాకరీతుల నొప్పు కావ్యము సువర్ణ
పాత్రికలయందుఁ గని మహాభాగ్యశాలి
యమృత మస్తని యిడును మృష్టాన్నమట్లు.

ఉ. ఇంద్రియగోచరం బగుచు నేవిషయంబో కవీంద్రు డెందమున్
సాంద్రవికారభాజన మొనర్చుచు నస్తమితాన్యభావని
స్తంద్రముఁ జేయు నవ్వెనుక సర్వముఁ దానయి నిండి పొంగి స్వ
చ్ఛందగతిన్ రసాకృతిని జాల్కొనఁగా నది కావ్య మయ్యెడున్.

గీ. విషయమును బట్టి వృత్తియు వృత్తిఁ బట్టి
విషయమును మాఱుచుండుట విదితమె కద
స్ఫటికమణి కెంపుఁ దాల్చు దాసనము చెంత
రజ్జువును సర్ప మగు భయభ్రాంతు మ్రోల.

క. హృదయమునుండి వెడలిన
యది హృదయమె చేరి ప్రియుల యనురాగమటుల్
గదియించుఁ గవిని జదువరి
నిదియే సుండీ కావ్యబంధ మే మనుకొనిరో.

ఆ. శిల్పినిపుణుఁ డైన చిత్రకారుం డెట్లు
సూక్ష్మములను జూపు స్థూలములను
ప్రౌఢకవియు నట్లె భావంబుఁ బ్రకటించుఁ
బూవుఁ దెచ్చి ముక్కుపొంత నిడఁడు.

గీ. పెదవిఁ గదలింపకుండ నవ్విన యలంతి
నగవు కనుదోయి క్రేకల నిగిడి మొగము
దమ్మి వికసింపఁజేయు చందమున మెఱసి
ప్రౌఢకవివాక్కు హృదయంబు నలరఁజేయు.

మ. తెలుఁగున్ సంస్కృత మాంగిలేయ మని ప్రత్యేకంబుగాఁ గొన్ని భా
షలె గాదన్ని యెఱుంగఁ జేయుటకు ప్రజ్ఞావంతులై దక్షులై
యలలుం గాలులు మబ్బులుం బలుకఁగా నయ్యర్థ మూహించుచుం
బలుకన్నేరుతు రింపుగాఁ బ్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్.

మ. శిల లేడ్వన్ విని చెప్పలేని మనకున్ శ్రీకంఠుఁ డుత్కంఠుఁడై!
వెలయం లొక్కటి కొండ కవ్వలిదరిం జేయు న్విలాపంబు న
త్యలఘుప్రజ్ఞుఁడు రామభూషణుఁడు మరియాలించి పాలింపఁడే!
పలుకన్నేరుతు రంతరప్రకృతిభావజ్ఞుల్ కవుల్ ప్రాజ్ఞులై.

గీ. ప్రకృతి యను రాణి యాస్థానరమ్యభూమిఁ
జేరి సేవింతు రెందఱో! వారిలోన
నాంతరంగికు లెవ్వారు నరయఁ గారు
యోగమహితుఁడు కవివరుం డొకఁడు దక్క.

మ. ప్రకృతిం బట్టి పరీక్ష సేయుటయె మావ్యాపార మంచున్ సదా
యొకచేఁ గత్తియు గాజుగొట్ట మొకచేఁ నొప్పింపఁగాఁ బట్టి యం
దొకయంశంబును వెక్కు సంశయములన్ యోజించి లోఁ జూడ నే
రక యల్పజ్ఞతఁ గ్రిందుమీఁ దరయు శాస్త్రజ్ఞుల్ కవుల్ చేయహహా!

ఆ. కత్తికోఁత లేదు గాజుగొట్టము లేదు
మాత నెత్రుక్రోధ చేఁత లేదు
ఒనరఁ బ్రేమఁ బ్రకృతితోడఁ జేరి చనుఁ గ్రోలి
మేను మఱచి నిదుర గాని కవికి.

గీ. ప్రకృతి తనుఁ బట్టి బాధించు వారి కెన్నొ
కడుపునను బెట్టి కన్నిట్లు దుడుచుఁ గాని
దాఁచిపెట్టును దన వెన్నిధాన మింక
యోగమహితుండు కవివరేణ్యునకుఁ గాను.

ఆ. సుకృతి గాఁడె సుకవి ప్రకృతితో నేకాంత
గోష్ఠి నుండుఁ గానకోనలందుఁ
దపసివోలె నెపుడు తత్త్వంబె చింతించు
మధురరసముఁ గ్రోలు మధుప మట్లు.

శా. అన్నం బేటికి పాన మేటికి సమృద్ధాహారంబు చేకూఱఁగాఁ
గన్నుల్ మోడ్వఁగఁ బారవశ్యమున నింక న్నిద్ర యింకేల? స
ర్వోన్నత్యంబు ఘటిల్ల భావజగతిన్ బాహ్యప్రపంచం బికే
లెన్నన్ భేదము రోగికిం గవికిఁ దా నింతేనియున్ లేదహో!



DUGGIRALA GOPALAKRISHNIAH

శ్రీయుత, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

UNNAVA LAKSHMINARAYANA



శ్రీయుత, ఉన్నవ లక్ష్మీనారాయణ



CHERUKUVADA VENKATANARASIMHAM

శ్రీయుత, చెఱుకువాడ వేంకటనరసింహము



S GANGOJI RAO, GANAPACHELIAH

శ్రీయుత, ఎస్. గంగోజీరావు శ్రీయుత, గణప చేలయ్య

D

SETH JAMNALAL BAJAJ




శ్రీయుత, సేట్ జమ్నాలాల్ బజాజ్.

SHANKERLAL BANKER



శ్రీయుత, శంకరలాలు బ్యాంకరు

# బడితోఁటలు

దువ్వూరి బాల కృష్ణమూర్తి గారు

నిన్న మొన్నటివఱకు మన పాఠశాలలలో బాలురకు చదువుట, వ్రాయుట, కొంచె మంకగణితము-నను నీమూఁడుకళలు మాత్రమే నేర్పుట యాచారమై యుండెను. నేఁటి ఉపాధ్యాయులు సన్మానించు పద్ధతి యది గాదు. బాలురచేతనే ప్రయోగము (Experiment) మొదలగు కార్యములు చేసి- వారలచేఁ జేయించి- అందలిసంగతులు గ్రహింపఁజేయుటచే బాలురకు బోధించుట సులభ మగు నని యాపద్ధతినే నేఁడు ఉపాధ్యాయులు సన్మానించుచు నాచరణలోనికిఁ దెచ్చుచున్నారు. ఇప్పుడు మన బోధనపద్ధతులలో పురోగమనమునకు ముఖ్యహేతువు "కిండరు గార్టెను" పద్ధతి నవలంబించుటయే.

కొంతకాలమునుండి బాలురు ప్రతిదినమును కొంతసేపు తోఁటలో పనిచేయుట వారివిద్యాభ్యాసమున నొక ప్రధానాంశముగా నెంచఁబడుచున్నది. బాలురును బాలికలును స్వాభావికముగా నారామకృషియందు మిగుల నాసక్తి గలవారు. ఒక్కొక్కవిద్యార్థికి బడి యావరణమునం దొక్కొక్క చిన్న మడి నిచ్చి వాని స్వహస్తములతో నందు విత్తించి యామొక్కలను తన చేతులతోనే పెంచుచుండున ట్లేర్పాటు చేసినపక్షమున నవి పుష్పములు పూచినప్పుడును కాయలు కాచినప్పుడును ఆబాలునికిఁ గల్గు నానందమునకును సౌఖ్యమునకును మితిలేక యుండును. ఏదేని యొక్క మహాకార్యమును చేసినప్పుడు పెద్ద లెంత సంతోషమును పొందుచున్నారో అంత సంతోషమును తమ చిన్నచేతులతో తాము స్వయముగా పనిచేసి నప్పుడు పిన్నలుగూడ పొందుచున్నారు. చిన్నపాత్రము కొంచెము జలముతో నిండినట్లె స్వల్పలాభముతో నీ యువకుల చిన్నిహృదయములు మిగుల సంతోషపూరితము లగుచున్నవి. విసువక ఇంకను పని చేసినపక్షమున ఇంకను లాభ ముండు నను తలంపు జనించి వారి యుల్లములు పల్లవించుట సహజధర్మము. విత్తకపూర్వము ఒకరు చెప్పుమాట వినుటవలనను అందువలనఁ గలిగెడు నూహలచేతను మాత్రము వారి మనములు పనిచేయును గాని ప్రత్యక్షముగా నేమియుఁ గానరాదు. చిన్నవిత్తనమువంటి సామాన్యవస్తువునుండి స్వయంకృషిచేత స్వప్రయత్నముచేత చక్కని చిన్న మొక్కలను మొలపింపఁజేయుట- పుష్పములుపూయించుట- కాయలుకాయించుట- వారి కెంతో ఘనకార్యమువలెఁ గన్పించి సంతోషప్రదముగ నుండును.

ఈవిధముగా నొకమాఱు కార్యసిద్ధి యయ్యెనేని మఱింత కృషిచేసి ఫల మధికముగా పొందవలె నని బాలుర హృదయములయందు కుతూహలము జనించును. పదిమంది బాలు రీవిధమున పనిచేయుచున్నప్పుడు, పోటీపైని మఱియొకనికన్న తా నెక్కువపని చేసి ఫల మధికముగాఁ బడయవలయు నను నాశ వారి హృదయముల జనించును ఈ కార్యనిర్వాహణమందుఁ జూడ చూపిన దీక్షయును కార్యోత్సాహమును వానికి క్రమక్రమముగ, సహజశీలములై నానాఁట పెంపొందుచు భావికాలమున నాతని జీవితమున కాదర్శము లగును.

ఆరామకృషి బాలికల మనస్సులను ముఖ్యముగా నాకర్షించుచున్నది. దీనికి కారణములు పెక్కులు గలవు. వివిధవర్ణయుతములై రమణీయము లగు పుష్పజాతులను తిలకించుటచేతను, హాయి నిచ్చు నా పుష్పరాజముల సుగంధపరిమళముల నాఘ్రాణించుటచేతను, కోమల బాలికాహృదయములు పుష్పజాతులదెస మిగుల నాకర్షితములై వానియందు లక్ష్యము నతిశయింపఁజేయుచుండును. స్త్రీలకు భావపూర్ణలగుటచేత పురుషులకంటె వానియందు ప్రీతి మెండు. బాలికలు విను కథలలో పుష్పములనుగూర్చి విశేషముగాఁ దెలిసికొనుచుందురు. ఒక్కొక్క పుష్ప మొక్కొక్క జీవితాదర్శమునకు సంజ్ఞగా నిరూపిత మగుచున్నది. కొన్నిపుష్పములు ప్రియభావసూచకములు. కొన్ని ఆనందసూచకములు. మఱికొన్ని వేదనాదులను వేఱొక కొన్ని చాంచల్యమును సూచించునవి. ఇట్లు శతసహస్రసంఖ్యలుగల కుసుమములు తత్తదనురూపభావములను వ్యక్తీకరించుచుండును.

బాలుర యాశయములు వేఱు. వారి చిత్తవృత్తి భిన్నము. సూక్ష్మవస్తువునుండి ఘనపదార్థము నుత్పత్తి

చేయుట వారి యుద్దేశము. వారలకు సంపూర్ణమైన సంకల్పసిద్ధి యారామకృషివలననే లభించుచున్నది. కృషివిషయమునఁ దోడిబాలురకంటె నధిక ఫలసిద్ధిని పొందవలయు నను నిశ్చయముతోను, దీక్షతోను బాలురు కృషిచేయ నారంభింతురు.

బాలికలు కోమలగాత్రలు. సుకుమారలు. మార్దవభూషితలు. బాలురు జీవితకాల మంతయు పోరాటముగాఁ గడపవలసి యుండుటచేఁ బ్రకృతిచే బాలురు కర్కశదేహులుగా నిర్మింపఁబడినారు. బాలకు లారంభించిన కార్య మేదియైనను తోడివారలను మించి యుండవలయు నను నాశయము గలిగియుండును. కావున నారామకృషి బాలుర భవిష్యజ్జీవనక్రమమునకు సుపథమగురీతి యగు నని యంగీకరింపక తప్పదు.

బుద్ధివికాస మంతగా లేని బాలురను మొద్దు లనియు మొద్దు లనియు కొంద అందురు. నిజమునకు అట్టి బాలురకు జ్ఞానమును బుద్ధికుశలతయుఁ దక్కువగ నుండును. ఆబాలురకు ఆరామకృషి మిగుల లాభకారిగా నుండును ఏలయనఁగా-అతడు కుశాగ్రబుద్ధిగలవాడు గాకున్నను నియుక్తకార్యమును స్వయముగఁ జేయు సామర్థ్యమునైనను గలిగి ఉండకపోడు. ఈకాలమున మన కువలసినది కేవలమును సర్వజ్ఞులగు పండితోత్తములే గాదు. ఓపికతో నెండలువంచి పనిచేయగలవారును ముఖ్యముగ కావలయును. అట్టివారిని తరిఫీదుచేయుటకు తోటపని చక్కనిసాధనము. మఱొక లాభము. కొన్ని దేశములలో నెండలువంచి పాటుపడెడివారు గతిలేనినీచులనియు, ఏవ్యాపారమునుఁ జేయక పెద్ద లార్జించినది వెచ్చించు సోమరులు ఘను లనియు తలంపఁబడుచున్నది. ఈమహానుభావులు కలముపట్టిన గుమాస్తా అగు నని కలము పట్టరు. కత్తిపట్టిన కట్టెలుకొట్టువా రగుదురు అని, పార చేపట్టిన కాపువాండ్రగుదు రని, పనిచేసిన మర్యాదకు తక్కువయని పాటుపడుట గౌరవహాని యని తలంచెదరు. ఈదురభిమానము మొదలంట నశింపవలసి యున్నది. నిరర్థకజీవనము చేయు నీ సోమరుల జీవనము కంటె నార్థికజీవనము చేయు కృషీవలుల జీవనమే వేయిరెట్లు ఘనమైనదనియు పరిశ్రమయే గౌరవహేతు వనియు నెల్లవారలు తెలిసికొనవలసియున్నది. ఇందులకు సాధన మొక్కటియే. ఈ దురభిమాన మంకురింపకపూర్వమే బాల్యమునందే- అనఁగా నేర్పినసంగతులు యావజ్జీవము మఱపునకురాని లేఁబ్రాయమునందే- పరిశ్రమము గౌరవహేతువని బాలకులమనస్సున దృఢముగా నాటవలయును. బడితోఁటలలో తొల్లికలు మొదలగు పనిముట్లతో నుత్సాహపూరితులై పనిచేయ మొదలిడిన పక్షమున మహానర్థదాయక మైన యహంభావము రూపుమాసిపోఁగలదు. అప్పుడు కృషియెడ గౌరవమే గాని న్యూనత గోచరింపదు. అప్పుడు కార్యనిర్వాహణక్రమమును కల్పనాశక్తియును విమర్శనకుతూహలమును బాలురయందు చక్కఁగా పెంపొందఁగలవు. తా నేమి చేయఁగలిగినదియును స్వయముగఁ బ్రదర్శించుట కవకాశ ముండును.

బడితోఁటలలో బాలకులచేఁ బనిచేయించుటలో విద్యాభిమానులకుఁ గల యుద్దేశము ఏఁటేఁటను తోఁటమాలీలను తరిఫీదుచేయుటయా? యని కొంద అనుగవచ్చును. అది సరిగాదు. బాలునిపరిశీలనమును పెంపొందఁజేసి, ముఖ్యాంగము లైన నేత్రహస్తముల నుపయోగించుటయందు బాలురను శిక్షితులనుచేయుటయే వారి యభిప్రాయము. ఈ శిక్షణ మారామకృషిలో విశేషముగాఁ గలుగుచున్నది. అట్టి శిక్షణము లేనప్పుడు బాలుని జ్ఞానాభివృద్ధికి నిజమైనమార్గమే లేదు.

వ్యవసాయశాఖకు విద్యాశాఖ యుపశాఖ యనియు కొందఱు విద్యాధికుల యభిప్రాయము. అచిరకాలముననే వ్యవసాయకళయందు శిక్షణమును బడయవలసిన యువకులకు నవీనవ్యవసాయపద్ధతులను బోధించి యుల వడునట్లు చేయుటకై వ్యవసాయకళాశాలవారి ప్రయాసమును విశేషముగాఁ దగ్గింపవలసిన భారము ప్రాథమికపాఠశాలోపాధ్యాయులం దున్నది. ఏలయనఁగా, విద్యారంభవేళయందే గ్రహణ ధారణ పరిశీలనాది సులక్షణములును స్వబుద్ధిచేత యోజించుట మున్నగునవి బాలకుల కలవడుట మిగుల ముఖ్యము. ఏవృత్తిలో నున్నవారికైనను ఈ సుగుణము లావశ్యకము లే. వ్యవసాయమునం దివి యత్యావశ్యకములు. పరీక్షలయందు కృతార్థత వడయుటకును యథార్థమును ఉపయోగకరమునైన జ్ఞానము సంపాదనకును చాల వ్యత్యాసము గలదు. రెండు నొక్కటియే యని తలంచుట పొరబాటు. పొరబాటులో గొప్ప పొరబాటు. తక్కిన వ్యాపారములలో నీ పొరబాటువలనఁ గలిగెడి యనర్థము లెట్టున్నను వ్యవసాయమందు మాత్రము దీని విషమించకపో దని దృఢముగా చెప్పఁగలము. ఈదేశములో పాఠశాలలలో తోఁటలు

ముఖ్యముగా నుండవలె ననుటకు ముఖ్యహేతువు లనేకములు గలవు. అందు గొన్నిఁటి నిట వివరించెదము.

ప్రస్తుతము విద్యార్థికు లని పేరొందినవారి విజ్ఞానమున రెండు ముఖ్యము లగు లోపము లగపడుచున్నవి. పుస్తకములలో నున్నదే జ్ఞాన మని భావించుట. ప్రకృతిశోధనకు ప్రయత్నింపకుండుట.

(1) పరీక్షయందు కృతార్థులయినట్టు యోగ్యతాపత్రము వడయుటయే విద్యయొక్క పరమావధి అయినది. గనుకనే వృక్షశాస్త్రము మొదలైన ప్రకృతిశాస్త్రములలో నుత్తమపరీక్ష లిచ్చినవారు నయితము తుదకు న్యాయవాదిత్వమునకుఁ బూనుకొని కాలము గడపువారెందఱో నేఁడు మన కగపడుచున్నారు. ప్రకృతిశాస్త్ర మొక మూల నున్నది. రెంటికిఁ గల సంబంధ మేమియో వారికి గోచరమే కాదు. కాని చిన్నవాఁడు బడిలో తోఁటలో పనిచేసినపక్షమున పుస్తకములోని ప్రకృతిసూత్రములకును తమయెదుట ప్రత్యక్షముగ నగపడు వస్తుతతియొక్క గుణస్వభావములకును వాని ననుసరించి వ్రాయఁబడిన ప్రకృతిసూత్రములకును గల సంబంధము స్పష్టమగుచుండును. వృక్షశాస్త్ర రసాయనశాస్త్ర పదార్థవిజ్ఞానశాస్త్రములకును మనచుట్టు నున్న ప్రకృతికిని సంబంధము కల్పించువా రది బడితోఁట యని వేఱే వక్కాణింప నవసరము లేదు. వస్తుపరిశోధనము చేసి స్వయముగా తెలిసికొనినదే జ్ఞానము గాని గ్రంథములను బట్టీవేయుటవలన కలిగినది జ్ఞానము కాదు. బాల్యమునందు పాఠశాలలోని తోఁటలో పనిచేయుటవలనఁ బ్రకృతియందలి యానందముఁ గొనుట కలవడిన బాలురు తాము పెద్దవారైనప్పుడు తమ గృహములను ఆరామములను తమ గ్రామములను నేఁటివలె శోచనీయస్థితియందు విడిచివేయుదురా?

మఱియు నీదేశమున మఱియొక యనర్థము గాననగుచున్నది. బాగుగఁ బనిగలిగిన వర్షఋతువునందు తప్ప శేషించిన కాలములలో గ్రామములలోని పిన్నవాండ్రేమి పెద్దలేమి యకారణకలహములను బెంచుకొని, యొండొరులతో తగవులాడి న్యాయస్థానము లెక్కి న్యాయవాదులను పోషించుచు, తాము మునిగిపోవుచున్నారు. "పనిలేనివాండ్రకు సైతాను పని గల్పించు" నని యాంగ్లమున నొక సామ్యము గలదు. చిన్ననాఁడు బడితోఁటలలో పనిచేయించి యందభిరుచి పుట్టించినచో బాలకులు పెద్దవాండ్రయినప్పుడు గూడ నీ పరిశ్రమమును చేసికొనుచుండరా? తగవులు చాలమట్టుకు తగ్గియుండవా? పాఠశాలలయందలి యారామములు చూచుట కింపుగా నుండవలెను. ఇవి యిట్లుండుటచే పాఠశాల లంతచక్కఁగ లేకున్నను వాని కీయారామములు సుందరభూషణములవలె మనోజ్ఞత నొసంగును. సాధారణముగా చుట్టును పెరుఁగు వృక్షములను పైరులు మొక్కలు మొదలగువానిని, సాధ్యమగునంతవఱకు తోఁటలో వేయవలెను. అవకాశ మున్నచో ఇతర ప్రదేశము లందలి పైరులు మొదలగునవి కూడ నిచ్చట పెంచి ప్రదర్శించుచు వచ్చినపక్షమున నాచుట్టుపట్ల ప్రజల కది వస్తుప్రదర్శనశాలవలె క్రొత్తసంగతులను బోధించుచు నుపయోగకరముగ నుండగలదు.

మన రాజధానియందుఁగల పాతికలక్ష పాఠశాలలలో ప్రతిపాఠశాలకు వ్యవసాయకళను బోధించునిమిత్త మొకకొంతభూమి యుండినచో చాల బాగుగ నుండును. దీనియొక్క ముఖ్యోపయోగ మేమనఁగా బాలురకు జ్ఞానము గలుగఁజేయుట. వ్యవసాయమును దేశములో చాలమంది నీచవ్యాపారముగా జూచుచుండుట ఈకళ యభివృద్ధినొందుటకు ప్రబలమైన యవరోధముగా నున్న దని అందఱు నెఱుఁగవలయును. ఈ కళ మానవకోటి కెంత యుపయోగకరమో, దీనిలో నెంత నేర్పు దూరదృష్టి శాంతము కావలసియున్నవో విచారించువారు నూటికి కాదు వేయింటి కొకరైనఁ గలరా? తోఁటలో క్రొత్తగఁ బనిచేయనారంభించిన యుపాధ్యాయుఁడు మొక్కలను పెంచుట యనునది మొదట తాననుకొనినట్లు సులభముగా దీని యనుభవమువలన తెలిసికొనుచున్నాడు. అప్పుడు ఈకళయం దనుభవముగలవారి సలహా పుచ్చుకొనుట యాతని కావశ్యకమగుచున్నది. అప్పుడు ఒక్క కష్టపడి పనిచేయుటయే గాక భూమిని సేద్యముచేయుటకు మంచి తెలివితేటలును జాగ్రత్తగల దూరదృష్టియును గాఢవిమర్శయును గావలసియున్న దని తెలిసికొనగలఁడు. అందువలన విద్యార్థుల తలిదండ్రులయందు ఉపాధ్యాయునికి సద్భావ ముదయించును. ఉపాధ్యాయులయందు శిష్యులకు గురుభక్తి గలిగియుండును. ఉపాధ్యాయులే శ్రద్ధతో తోఁటలలో పనిచేయుచున్నప్పుడు శిష్యు లందఱును మిగుల హెచ్చరికతో పాటుపడుదురు. అందుచే పాటున కిప్పుడుగల నీచభావము

నుండి క్రమముగా విముక్తి గలుగును. మఱియు నీపరిశ్రమ బడివిడిచిపెట్టినపెనుక విద్యార్థులకు భావికాలమున నెంతో యుపయోగకారిగను నుండఁగలదు. చక్కని యారామమువలన బాలకులకుఁ గలిగెడి గొప్పలాభమే తోఁటలను బడులలో వేయించుటకు ముఖ్యమైన కారణమని చెప్పవచ్చును. వ్యవసాయకళ ఇచ్చట ఉత్కృష్టదశయందుండకుండుటకు రెండు హేతువు లగపడుచున్నవి. మొదటిది యీశాఖలో పనిచేయు ననేకులకు పరిశీలననైపుణ్యము శూన్యము. రెండవది రయితుయొక్క యజ్ఞానము. పూర్వాచారపరాయణత్వము. బాల్యమున చక్కని శిక్షలేనికారణముచేత నిప్పుడీశాఖలో పనిచేయువారికి శ్రద్ధగా పరికించి పనిచేయుట యలవడలేదు. ఇప్పుడైన పాఠశాలలలో నారామములు నెలకొల్పఁబడి బాలురకు విత్తుట నాటుట త్రవ్వుట మొదలగునవి నేర్పినచో విత్తులు మొక్కలగుటయు, మొక్కలు పెరుగుటయు దినదినము శ్రద్ధతోఁ బరికించుచు వచ్చినయెడల వారికి పరిశోధనయందు తప్పక నైపుణ్య మలవడును. అది భావికాలమున నెంతో యుపయోగకారిగ నుండును.

ఈదేశమున వ్యవసాయము వృద్ధిగావలె నన్నచో, ఈశాఖలోఁ బనిచేయు నుద్యోగస్థులు నిపుణు లైనంత మాత్రమున నంతగా కార్యము లేదు. రయితులలో కూడ ననురూపమైన వృద్ధి గావలసియున్నది. నేఁడు గ్రామపాఠశాలలలో విద్యాభ్యాసము చేయువారిలో నూటికి తొంబదిమందికిపైఁగా వ్యవసాయమువలన జీవనము చేయువారై యున్నారు. ఈవిషయమును ప్రాథమికపాఠశాలల యుపాధ్యాయులును, వారి పనులను తనిఖీచేయు విద్యాశాఖపై గల యధికారులును ఎన్నఁడును మఱవరాదు.

తా మింతకు పూర్వము చూడని యేవస్తువునైనను వినని యేసంగతినైనను ఇప్పటికాలపు రయితులు యోచించి మాటలాడక నిర్లక్ష్యముతో నిరసించి పారవేయు స్వభావము గలవారుగ నున్నారు. ఇటుపై తరము వారు వీరివలె నూతన భావములయందు అనాదరము గనఁబఱుపరాదు. నూతనాంశములను తెలిసికొనుటయందాసక్తియు పరిశీలనదక్షత్వమును గలవారుగా నుండవలయును. ఈ మహాకార్యము నెఱవేఱుటకు సాధనమొక్కటియే! రసాయనశాస్త్రము మొదలగునవి గఱుపుటకు ప్రయోగశాలలు ప్రతికళాశాలలో నెలకొల్పుట యావశ్యకమని సర్కారువారు శాసించిన విధముననే సామాన్యపాఠశాలలను పోషించువారెల్లరును పాఠశాలతో నొక యారామమును గూడ గలిపి యుంచక తీరదని సర్కారువారు శాసించినచో నీమనోరథ మీడేరును. ఏల యనఁగా "నెల్లరకును విభవ మొసగదె యారామవైభవంబు."

# ప్రబోధము

పెద్దసోమయాజుల వెంకటేశ్వర శర్మగారు

చూచినారలుకదా? సుంతైనదయలేక • హింసూప్రజల నెల్ల హింసచేయ;
పాటించినారలే? పంజాబుఘోరంబు • లానాడు నమృతసరమునందు;
వినుల మఱచిరే? మిగులదుర్భరమైన • కొలకు బిల్లిఫ్లు నగులుకొనగ;
కల్గ్యాంచిరా? లేద! కేశుపుండులనంటు • సాహాయ్యనిరసను బలిమిగోనఁగ;
గీ. రెండు లెండు డదె? దిక్కులు నెట్టువారె • వాదపులరగ మీ ముఖమ్ములను గడిగె;
తేఱిచూడుడు తూరుపు దిక్కుదెసను • అల్లదే! మహోదయ మ్మగుచునుండె.

సీ. గ్రంథంబులే లేవె? గ్రాహ్యంబులై పని; పూలిబైబిలె గాని పూయలుఱావ
మనీతిశాస్త్రంబు మంటగలిసెనెకటా? • పొలిటికల్ సైన్సుల బొగడి చదువ;
మతధర్మనియమముల్ మనకు లేనే లేవో? • పరమతధర్మముల్ పాటిసేయ,
హిందుపాలన మీకు నింపుగా లేదేమొ? పరుల దాస్యము చేయ బొగిసారు;
మన చేతిపెక్కులతో మనకన్నులన్ బొడువ • నానంద మందుచు నలరవలెనొ?
గీ. అహహ! కౌర్యంబు మీయందు నంతరించె, పిఱికిపందల గానింక నుండదగునె?
భరతమాతకు పుత్రులైన మీరు రండు పోరుడు స్వారాజ్యలక్ష్మి కైకొనుడు.

# హరిభజన మంజరులు

వడ్డాది సుబ్బారాయ కవి గారు

హరి భజియింపుర హరి భజియింపుర
హరి భజియింపుర హతబుద్ధీ!
మరణము దరి దాపుర మగుచు డుకృఞ్
కరణే కావదు కావదురా—హరి. ౧

మానుము ద్రవ్య సమార్జనతృష్ణను
బూనుము మూఢ! సుబుద్ధి వితృష్ణను;
నీ నిజవృత్తముచే నగు విత్తము
తో నత్రింపుము తుష్టిని జిత్తము—హరి. ౨

వినతాంగుల నాభీస్తనదేశముఁ
గనుఁగొని పొందకు కామావేశము
అనుకొను "మాంసవసాదివికారము
లివి నఖిలంబును" నని ప్రతివారము—హరి. ౩

నళినీదళగత జలకణ మెట్టులు
చల మీజీవము చంచల మట్టులు
తెలియుము జగ మాధివ్యాధిహతము
కలుష శుచాహంకార కబళితము—హరి. ౪

ధనసంపాదన మొనరించెడు తఱి
నెన రూనుచు బరిజన మెక్కుడు గుఱి
వెనుకను జర్జరతనుఁడయి బ్రదుకుడు.
మనికికి సేమము వినరాఁ డొక్కఁడు—హరి. ౫

ఒడలను నూపిరి యుండెడు నంతకు
నడుగును గుశలము నరుగును జెంతకు
నడఁగిన శ్వాసము లాడుట, మనమున
నడలును ప్రియురా లాకట్టెను గన—హరి. ౬

అనిశ మనర్థం బనుకొను మర్థము;
గన మం దేమి సుఖంబు; యథార్థము
ధనికులకును నులుకు తనయునివలనను
విదిహిత మగు నివ్విధ మెవ్వలనను—హరి. ౭

నిసువున కాటల నిచ్చలుఁ దగులము;
నొసపరి సకిపయి యువకుని దగులము;
ముసలికిఁ జింతల మోపుగఁ దగులము;
నెనఁగుఁ బరముడెన నెవనికిఁ దగులము—హరి. ౮

ఆ లెవ్వతె నీ కాత్మజుఁ డేఁడుర?
చాల విచిత్రము సంసృతి, వేఁదుఱ!
నీలోఁ జూడుము నిజ మీ వే యన
పాలిజనుఁడ? వెట వచ్చితి? వో యన!—హరి. ౯

సంగ మడంగును సత్సంగ మయుతి.
బ్రుంగును సంగము మోహోచ్ఛ్రయహృతి.
గ్రుంగిన మోహముతో స్థిరతత్త్వము
భంగుర! యట జీవన్ముక్తత్వము—హరి. ౧౦

కడచినవయ సెటఁ గామవికారము?
జడ మింకిన, నెక్కడఁ గాసారము?
నెడయ నొడమి గలదే పరివారము?
పొడమిన జ్ఞానము, చెడు సంసారము—హరి. ౧౧

ధన జన యౌవన దర్పం బేలా?
తునుమును గాలము త్రుటి నది బేలా!
యని "మాయామయ మఖిలము" నిది విడి,
కని బ్రహ్మపదంబునఁ జొరు విడివడి—హరి. ౧౨

రేపులు మాపులు రేలుఁ బగళ్లును
దేవ బుతువు లరుదెంచును వెళ్లును
నైపుణికాలము నూపెడు. నుగ మఱు
సీ! పాడాశ నశింపదు. వగవరు—హరి. ౧౩

ఇరువురు మంజరు లీపం ద్రెండును
గురుబోధమునకు గోడులు చెండును.
కరుణను వైయాకరణుని గని ముని
పరమగురుఁడు శంకరుఁ డివి వినిచెను—హరి. ౧౪

ధనగత చింత సదా నీకాంతర
యనయా! నీకు నియంత కొఱంతర?
విను త్రిజగతి సజ్జన సంగాతము
దనరు భవాంబుధి తారణపోతము—హరి. ౧౫

జడకొప్పులు లుంఛన ముండనములు
వెడఁగుల కవి యొక వెడమండనములు
జడులు కని కనరు, ముకుతురు రూకలు
కడుపునిమిత్తము గద పలుపోకలు—హరి. ౧౬

ముండము పలితంబుం గళితము మయి
తుండము బోసి గతుల్ స్ఖలితము లయి,
దండముఁ గొని ముది దారు నటున్నను,
దండి దురాశ వదల దా యన్నను—హరి. ౧౭

ముందర నగ్గి, పిఱుందను భానువు;
చెందును రాతిరి చిబుకము జానువు
నందును బిచ్చము నఱచెయి; తరుతల
మం దునికి యయిన నాశ వినిశ్చల—హరి. ౧౮

సలిపిన గంగా సాగర గమనము
నిలిపిన నీవుల నేమముల మనము,
గలుగునె, యెత్తిన నిల జన్మాంతము?
తెలివిన ముక్తి; యిదే సర్వమతము—హరి. ౧౯

ఇరువ్రలు సురమందిరముఁ దరుతలముఁ
బరిధానము తోల్; పఱ పననితలము.
పొరయఁ బరిగ్రహభోగత్యాగము
నెరపదు సుఖ మెవ్వరికి విరాగము?—హరి. ౨౦

యోగియె గానీ భోగియె గానీ
చాఁగు! సుసంగుఁ డసంగుఁడు గాని
రాగిలు యన్మతి బ్రహ్మమునను సుఖ
సాగరమగ్నుఁడు సతము నతెఁడు. సఖ!—హరి. ౨౧

ఇంచుక గీత పఠించెను నెవ్వఁడు
కొంచెము గంగను గ్రోలెడు నెవ్వఁడు
కించిద్దళి మర్పించు హరి కతఁడు
కాంచఁడు గమనుని కడఁ జర్చ నతఁడు—హరి. ౨౨

తెన్నులచింపు లదికికొని బొంతను
బున్న మపుణ్యముఁ బొరయని పుంతను
దన్ను "నిసుం గున్మత్తః" డనంగను,
సన్నుత యోగాసంగుఁ డసంగను—హరి. ౨౩

"ఏ నీ వెన్వరి? మే తెంచితి మెట?
నీ నా తండ్రియు నీ తలి యెవరెట?"
లో నని రోయు మలుచ! సంసారము
మాని కనెడు కలవోని విచారము—హరి. ౨౪

"మఱిమఱి పుట్టుట మఱిమఱి చచ్చుట
మఱలను దల్లియుదరమునఁ జొచ్చుట
దరి గానను దుస్తరసంసృతి; నను
మురహర! ప్రోవుము ప్రేమము కృప నను—హరి. ౨౫

నీయెడ నాయెడ నేయెడ విష్ణుఁడ
పాయుము కసి నాపయి ససహిష్ణుఁడ!
చేయుమ యెల్లెడఁ జిత్తము సమగతి
వే యాసించితివే విష్ణుస్థితి—హరి. ౨౬

కోరిక మోహముఁ గ్రోధము లోభముఁ
దారిచి కను మాత్మను బహులాభము.
నారక మాత్మజ్ఞాన విహీనులు
చేరి పరితపించెద రట దీనులు—హరి. ౨౭

అను. విను. నామసహస్రము గీతలు
కను మది హరివిగ్రహమును జేతలు.
మను సజ్జనమైత్రిని నీ వనయము.
ధన మిడు దీనులకును గొని వినయము—హరి. ౨౮

కని మూఢ దుకృంక్షా్కరణే ధ్యాయుకిఁ
బొనరిచి రిహపరముల నెఱహోయికి
ససఘులు శంకరు నంతేవాసులు
ఘనబోధము నిటు కరుణాదాసులు— ౨౯

హరి భజియింపుర హరి భజియింపుర
హరి భజియింపుర హతబుద్ధీ!
మరణము దరి దాపుర మగుడు డుకృఞ్
కరణే కావదు కావదురా—హరి. 3౦

నూాలశ్లోకంబులవలెఁ దెలుఁగునఁ
గ్రాలిన మంజరికల్ రుచి గలుగు న
వేలము. భజగోవిందములకుఁ గవి
హాళిని వసురాయుండు పలికె నివి—హరి. 3౧

ప్రాయం బఱువదిపై నేడేఁడులు.
వ్రాయున విధి హరిభక్తిఁ దోఁడులు.
కా! యనుకూలపు టడ నను సిరిపతి
నేయమ్మున వసునిఁ బనిచె వరకృతి—హరి. 3౨

# గ్రామదేవతలు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

మన భారతదేశమునందు విశేషించి మనయాంధ్రదేశమందు "గ్రామదేవత" లను అమ్మవార్లు ప్రతి గ్రామమునందును ఒకరిద్దరు ముగ్గురు - గ్రామము ననుసరించి- పట్టణము ననుసరించి-తప్పక కలరు. వారి కాయా గ్రామస్థులును బట్టణవాసులును ప్రతివత్సరము వత్సరోత్సవములను మహోత్సవములను వీలుకొలఁదిగఁ జేయుచున్నారు. విషూచి మశూచి మొదలగు వ్యాధులు తమతమ గ్రామములలో వ్యాపించినపుడు పరగ్రామదేవతలీగ్రామములకు నశరీరరూపముతో వచ్చి జనులను హింసించుచున్న వని- ప్రకృతిశాస్త్రజ్ఞానాభావముచే- మూఢప్రజలు పరదేవతాసంతృప్తికొఱకును, స్వగ్రామదేవత తృప్తినొంది బలవతియై యన్యదేవతలఁ బాఱఁద్రోలుటకొఱకును, బలుల నుత్సవముల విశేషించి చేయుచున్నారు. ఆయుత్సవములలో సాధారణముగా నీచజాతిస్త్రీకిఁగాని, పురుషునికిఁగాని, గ్రామదేవత యావేశించి, శివ మాడును. క్వాచిత్కముగా, బ్రాహ్మణులకుఁగూడ శివమెత్తుట కలదు. ఈ గ్రామదేవత లెవరో వీరి వృత్తాంత మేమియో స్వల్పముగ విచారణ సేతము.

వేదవాఙ్మయమునందు గాని, స్మృతి పురాణ వాఙ్మయములందు గాని, ఈగ్రామదేవతల ప్రశంస కానరాదు. వైదిక వాఙ్మయమునందు బలులు కలవు. కాని యాబలివిధానము ఇంద్రాది వైదికదేవతలకొఱకే యగ్నిముఖమున వేల్వఁబడునదే యై యున్నది. ఏనాఁడు వామాచారయుక్తము లగు తంత్రములు బయలుదేఱెనో, నాఁటినుండియే, జంతుబలియును అన్యదేవతోపాసనార్హ మాయెను. వామాచారము ననుసరించి హైందవదేవతలలో మార్పు గలిగి వామాచారప్రోక్త "కాళి" హైందవాచారమున నీశ్వరపత్ని యగు పార్వతిగా మార్పు నొందెను. అట్లె తంత్రగ్రంథప్రోక్తలగు నన్యదేవతలు హైందవాచారమున లక్ష్మి సరస్వతి మొదలగు శాంతరూపిణుల మాఱురూపునొంది యారాధింపఁబడిరి. ఇంచుమించుగ నామార్పు ఆకాలమున వ్రాయఁబడిన పురాణగ్రంథములలో - నీ స్త్రీదేవతాగాథలు వారిజన్మములు- విచిత్రముగా పెంచి వ్రాయఁబడినవి. జాతివైషమ్యము పెరుఁగకుండుటకుఁ గాఁబోలు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర దేవతాస్త్రీలే గాక చాండాల దేవతలగు "మాతంగీ, శ్యామలా" మొదలగువారుకూడ సర్వవర్ణములవారిచేతను నుపాసింపఁబడిరి. ఇప్పటికిని నుపాసింపఁబడుచున్నారు. ఈయుపాసనలకుఁదగిన మంత్రతంత్రాదికములు గల సంకల్పములు పెక్కులు పుట్టినవి. కాని ఆదేవతల యుపాసనాదికము నేఁడు చాలవఱకు తగ్గియున్నది. కాని వాని నన్నింటిని మించి గ్రామదేవతోపాసనము విజృంభించినయది. ఈగ్రామదేవతలలోను బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర జాతి గ్రామదేవతలు కలరు. ఈగ్రామదేవతలకాయా గ్రామములలోఁ గొందఱకుఁబుట్టింటివారునుఁ గలరు. గ్రామదేవతలలోఁ గొందఱుదేవతలకు అప్పలగు దేవతలు- చెల్లెండ్రగు దేవతలునుఁ గలరు. బ్రాహ్మణీదేవతలకు బ్రాహ్మణ్యముగను మాంసవర్జితముగను, అబ్రాహ్మణీదేవత కబ్రాహ్మణ్యముగను మాంససహితముగను బలు లిడఁబడును. బ్రాహ్మణీదేవతలకు నన్నాదికము వడపప్పు పానకము శ్రీసూక్తవిధానార్చనము - బ్రాహ్మణుఁ డర్చించుట - శివము బ్రాహ్మణునికే ఎత్తుటయు కలుగును. గరగను మాత్రము చాకలి యెత్తికొని యాడును. అబ్రాహ్మణీదేవతారాధనమునఁ గోళ్లు, మేఁకలు మొదలగువానిబలులతో నెట్లుజరుగునో పెక్కండ్రకనుభవసిద్ధమే కావున వ్రాయ నవసరములేదు. ఈ గ్రామదేవత లెవ్వ రనఁగా- రాజా రామమోహనరాయలవారు, మహాప్రయత్నముచేసి - బ్రిటీషు ప్రభుత్వమును ప్రోత్సాహపఱచి సహగమనము నణఁపఁజేయుటకుఁ బూర్వము మనదేశమునందు సహగమనముం జేసినవీరవనితలే! సహగమనముఁ జేసిన ప్రతిస్త్రీయును గ్రామదేవతలు కాలేదు. పరప్రోత్సాహము ఇసుమంతయైన లేక పతియందేకాగ్రచిత్తయై - యగ్నిలో దుమికిన మహాపతివ్రతను- ఆయాగ్రామస్థులు, తమగ్రామమును రక్షించెడి పరదేవతఁగాఁదలఁచిఆమెను విగ్రహరూపిణినిఁగ జేసికొలుచుటకుఁ బ్రారంభించుచుండిరి. వీలుకొలఁది, దేవాలయాదులును బయలుదేఱినవి. ఆవీరవనితల యత్తవారికంటెఁ బుట్టినింటివారు (తమ యాఁడుపడుచు మహాపతివ్రతయనుట ఖ్యాతి

కరము గాన) ఆదేవతారాధనను విశేషముగఁ జేయుదురు. బ్రాహ్మణీదేవత మాంసమునుగోరదు. గాన జంతుబలిని ఆదేవత కొసంగరు. కొన్ని ఉదాహరణములు:— గోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకా చోడవరంలోని బంగారమ్మ, అంబికపల్లెగ్రహారములోని అంబికాలమ్మ బ్రాహ్మణీదేవతలు. అంబికాలమ్మ మాయింటి యాఁడుపడుచని ప్రఖ్యాతి. మానరసంభట్లుగారు 16 వ శతాబ్ది నగ్రహారమును సంపాదించి తనయాఁడుపడుచు పేరుఁ బెట్టెనఁట. అందువలననే అంబికపల్లెగ్రహారము అని ప్రసిద్ధియయ్యెనని వాడుకకలదు. కాకినాడతాలూకా మేడపాడులోని మహాలక్ష్మి చంద్రువారియాఁడుపడుచు. ఆమెపుట్టినింటివారి వంశస్థులింకనుఁ గలరు. ప్రతివత్సరోత్సవమునను జంద్రువా రాదేవతకు విశేషసత్కారములను జేతురు. వేండ్ర (కాకినాడతాలూకా) గ్రామవాసిని యగు వెలగాలమ్మ నర్లవారి యాఁడుపడుచు. ఈమె యప్ప రామచంద్రపురంతాలూకా పాణింగపల్లిలో గొల్లాలమ్మ యను పేరుతో నున్నది. ఈదేవతల యుత్సవములయం దన్యోన్యము గరగలు-అక్కను జూచుటకు చెల్లెలు - చెల్లెలను జూచుట కక్కయును - వచ్చుచుండును. నర్లవారీ యుభయదేవతలను సత్కరింతురు. గంగమ్మ యనుదేవత యుద్ధమున తనపతి మృతినొందుటచేఁ దానా భర్తతో కాకినాడతాలూకా బ్రహ్మదేవము మేడపాడు గ్రామముల మధ్యను యుద్ధభూమియందు సహగమనముచేయుటచే, నుభయగ్రామవాసులు నాదేవతకు విశేషోత్సవములను జేయుచుండిరి. ఆమెకు దండుగంగమ్మ యని పేరు. మఱియును గ్రామదేవతలలోఁ బడుచువాండ్రును ముసలివాండ్రునుఁగూడ కలరు శిలావిగ్రహములనుఁగూడ నిలుచుమనుష్యాకారముననే చేయించిరి. కాకినాడతాలూకా మేడపాడునందు ఆటపాకలవారి యాఁడుపడుచు చిన్నబ్బు పాల్లమ్మ 80 సంవత్సరముల యీడున సహగమనమును జేసెను కాఁబోలును! ఆమెను ముసలిదందురు. ఆమెవిగ్రహము 80 సంవత్సరములవయసుగల స్త్రీ కూర్చుండినట్టులు గాన్పించును. చోడవరములోని బంగారమ్మ ఇరువది ఇరువదియైదేండ్ల నిండు జవ్వనమున సహగమనమును జేసినట్లు లాదేవతాపూర్ణయువతీవిగ్రహముచే నూహ్యమగుచున్నది. సాధారణముగా 40, 50 సంవత్సరముల వయస్సు గల పతివ్రతలే గ్రామదేవతారూపముల నెత్తియుందురని విగ్రహముల ననేకమును జూచి యూహించితిని. 1890 ప్రాంతమున మా తండ్రిమాతామహుని మేనత్త సహగమనమును జేసెనఁట. గుడినిగట్టించుటకు గాని విగ్రహమును జేయించుటకుఁ గాని తత్కాలపరిస్థితులవలన వీలుపడలేదు. ఆపతివ్రతాతిలకము కొముక్క సహగమనసమయమునందిచ్చిన గుడ్డపేలికను మాపితామహియు నామెతల్లియును ప్రతిశుక్రవారమునఁ బూజించుచు ధూపములను వేయుచుండెడివారు. ఆయూరిలోనివారి కేదేని రోగబాధాధికము కలిగినయెడల నిపూజాక్షతలనుగొని రోగులుధరించినచో, కుదిరెడివఁట! 38 సంవత్సరముల క్రితము మాగృహము పరశురామప్రీతి కాఁగా నాపేలిక లందు దగ్ధమగుటచేత నీయక్షతలు నాటితో నంతమొందెను. మన సాంఘికచరిత్రములలో గ్రామదేవతాచరిత్రములు కూడ నిముడియున్నవి. కాని ఈచరిత్రములను మనము మఱచినాము. ఇట్లె ఇంకను ఎన్ని సాంఘికచరిత్రములను మఱచితిమో!!

# గిరి బ్రదర్సు

స్టేషనర్సు, ట్రిప్లికేను, మద్రాసు.

అన్నిరకముల స్టేషనరీ సామానులు, కాగితములు, పెన్సిళ్లు, కలములు, పాళీలు, నోటుబుక్కులు. విద్యార్థుల ఎక్సరుసైజు బుక్కులు, మొత్తముగాను, చిల్లరగాను తక్కువ వెలలకు అమ్మబడును.

ఫౌంటెను కలములు అన్నిరకములు మాయొద్ద దొరకును. మేలైన గ్లాసుబుడ్డి కలములు, చక్కని స్వానుకలములు, సొగసైన వాటరుమేను కలములు, నమ్మకమైన పెష్ట్యానుకలములు అనేక ఇతరరకముల ఫౌంటెనుకలములును మొత్తముగాను చిల్లరగాను మాయొద్ద దొరకును. మిక్కిలి తక్కువ వెలలు. ఉత్తరముల వ్రాసిన ధరలు తెలుపగలము. మాకంటె తక్కువ వెలలకు ఇతరచోట్ల దొరకవు.

ఫౌంటెను కలములలో పోయు సిరాలు, స్వాను, వాటరుమేను మొదలగు రకముల నేకములు కలవు.

# చాటుపద్యమణిమంజరి

ద్వితీయభాగము

ఆ పెండ్లిమండి యథాదిపరిశ్రమ జేసి యాంధ్రదేశ మన్నిభాగముల నుండి యీ కర్ణములకంటి చాటుధారలను సంపాదించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని వెలయించినారు. ప్రథమభాగమున లేని యపూర్వవిషయములు కలిగి యిది యపూర్వముగానున్నది. వెల 1-8-0. గ్లేజు పేపరు ప్రతి 1-10-0.

# మానాన్నాళ్ల ముచ్చట

హృద్యమగు చిన్న పద్యప్రబంధము, ప్రభాకర శాస్త్రి గారు రచించినది. పద్యము లచ్చతెలికెలకంటెను. కథయూవాంటి యాంధ్రదేశపుది. దీనితో నిండినది. వెల 0—6—0.

రెంటికిని ఒకేసారి ఆర్డరు పంపువారికి మానాన్నాళ్ల ముచ్చట రూ. 0-4-0 లకే పంపబడును.

విలాసము:— మణిమంజరి మేనేజరు, తిరువల్లిక్కేణి,
మద్రాసు.

శ్రీ సింహపురి సత్యాగ్రహస్టోరు, నెల్లూరు.

# మైకాచిమ్నీలు.

ఈ చిమ్నీలు మావల్ల తయారుచేయబడుచున్నవి. యీ చిమ్నీలు గ్లాసుచిమ్నీలవలె క్రిందపడినను కాంతి జాస్తి అయినను నీరు పడినను పగులవు. చాలా కాంతిగా వుండును. కండ్లకు చల్లదనముగా వుండును. చాలాకాలము పనిచేయును. యీ మైకా చిమ్నీలను అనేకులు వాడుకొనుచున్నారు.

ధరలు:— నెం 10 రు లాంపు మైకాచిమ్నీ 1-కి రు 0-12-0 నెం 14 రు లాంపు మైకాచిమ్నీ 1-కి రు 1-0-0, డీట్సు చేలాంద్రచిమ్నీ 1-కి రు 1-0-0, కొవ్వొత్తిస్టాండుచిమ్నీ 1-కి రు 0-12-0, ¾ అంచి గోడలాంపుచిమ్నీ 1-కి రు 0-8-0, నెం 5 రు గోడలాంపుచిమ్నీ 1-కి 0-6-0. పోస్టేజి వేరు.

కాపిబిళ్లలు:— పాలు పంచదార కాఫీపొడితో అవసరము లేదు. ఒకకప్ వేడినీళ్లలో ఒకబిళ్ల కరిగించిన శుద్ధమైన కాపీ త్రాగుటకు సిద్ధముగా నుండును. ఆఫీసర్లకు, ట్రావిలింగు పోవువారికిది చాలా అనుకూలము. 24 బిళ్లలు ప్యాకి రూ 1-4-0.

వరా:— వ్యాపారులకు మొత్తముగా ఖరీదుచేయువారికి కమీషను ధారాళముగా యివ్వబడును. అడ్వాన్సు లేని ఆర్డరును అంగీకరింపబడదు. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

D. Krishniah Gupta, Managing Proprietor.




# అమృతాంజనము

తలనొప్పులకు ప్రసిద్ధి కెక్కినది ఇతర వివిధమైన నొప్పులను కూడ మా అమృతాంజనము వాడినంత మాత్రమున నయమగును. వెల 0-10-0 అణాలు పంచభాష చీటి చూచికొనిన మోసము గలుగదు

# దంతచూర్ణము

వెల డబ్బీ 1-కి 0—2—0

ఈ దంతచూర్ణముతో పండ్లుతోముటవలన చిగుళ్లనుండి రక్తము స్రవించటమును, నోట దుర్గంధము లేక యుండును.

# తామర తైలము

తామర, తీట, గజ్జికి మంచి మందు.

డబ్బీ 1-కి 0-6-0 ఆరుఅణాలు మాత్రమే.

అమృతాంజనం డిపో, బొంబాయి లేక మద్రాసు.

# తిక్కన కవిత్వము

భోగరాజు నారాయణమూర్తిగారు

నన్నయతరువాత వాని కవితామార్గము ననుసరించి దానికిఁ గ్రొత్త శోభ గలిగించిన మహనీయుఁడు తిక్కన యని చెప్పుటకుఁ జక్కనికథ కల్పింపఁబడినది. "తన కంకితముగా నాంధ్రీకరింప నారంభించిన భారతమును బరిసమాప్తి నొందింపకయే నన్నయభట్టు మృతి నొందినందుకుఁ జింతాక్రాంతుఁడై రాజనరేంద్రుఁడు దాని నెట్టులైన సాంతము చేయింపవలె నని బహుప్రయత్నములు చేసి పండితులను రావించి చూపఁగా వా రెవ్వరును దన్మహాకార్యమునకు సమర్థులు గారైరట! నిర్వచనోత్తరరామాయణమును జేసి ప్రసిద్ధినొందిన యొక యాంధ్రకవీంద్రుఁడు నెల్లూరియం దుండె ననియు నతనివలన గ్రంథ పరిసమాప్తి కాఁగల దనియు విని పండితుల యనుమతిమీఁద సభా పర్వములోని—

మ. మద మాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్.

అను పద్యమును దాటాకులమీఁదఁ బ్రతులు వ్రాసి దానితో సమానమైన పద్యమును వ్రాయుఁడని తిక్కన రాజాస్థానములయందలి పండితులకును సిద్ధిరాజుసభయందున్న తిక్కనకును గూడఁ బంపినట్లును, మిగిలినవా రందఱును తమకుఁ దోఁచిన పద్యములను వ్రాసి పంపఁగా తిక్కనమాత్ర మట్లు చేయక తా నాపద్యమునే మఱల నచ్చటనే తాటాకుమీఁద వ్రాసి దానికి వర్ణము చేసి పంపినట్లును, రాజరాజనరేంద్రుఁడు మిగిలినకవులపద్యముల నన్నిఁటిని జదివి వానిలో నేదియు నన్నయపద్యముతో సరిరాకపోయినందున వానిని నిరాకరించి, తాను రచింపఁబోయెడు గ్రంథము నన్నయభట్టారకుని కవిత్వమువలెనే యుండినను దన దంతకంటె మెఱుఁగుగా నుండు నని సూచించుటకై తిక్కన యట్లు చేసె నని గ్రహించి యాతని బిలిపించినట్లును గ్రంథరచనకుఁ బూర్వముఁ దానిచేత గౌతమీతీరమున యజ్ఞముచేయించి భారతము సంపూర్ణము చేయించినట్లును చెప్పుదురు. మఱికొంద ఱట్లు పంపఁబడిన పద్యము, ఆదిపర్వములోని యీ క్రిందిపద్య మని చెప్పుదురు

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము. జగన్నుత! విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము. గావున విప్రుఁ డోపు; నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

చూ. ఆంధ్రకవులచరిత్ర.

తిక్కన కాలనిర్ణయసందర్భమున నుపయోగింపఁబడిన ఈకథ కవిత్వమునుగూర్చి ప్రజల మతభేదములను సూచించుటకుఁ బ్రస్తుతము మన కుపయోగపడుచున్నది. రాజరాజు రాజాస్థానపండితులకుఁ బంపించిన మచ్చుపద్యము మొదటిపద్య మని కొందఱును రెండవపద్య మని కొందఱును జనులు చెప్పుకొనుచుండి రనుటయందుఁ దగినంత భావము లేకపోలేదు. మొదటిపద్యమునందలి 'లసత్ - ఓలిన్ - కొని తెచ్చి - యిచ్చి - ముదమొప్పం గాంచి' - యనుపదములు తగినంత భావగర్భితములు గాక, చెక్కడిఱుపులతోఁ బాదపూరణముకొఱకుఁ బ్రయోగింపఁబడిన వనియు, ఆపద్యమున నన్నయ వర్ణింపదలఁచిన విషయము—

మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి-రి

అను రెండుపాదములలోనే, కర్తృకర్మపదవిశిష్టముగ ముగించె ననియు, నందుచే మూఁడవపాదమునందు,—

"అ య్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్"

అను కర్తృపదమును సాధ్యమైనంతవరకు పొడిగించి తక్కినభాగమును

"సంతతా। భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతా
పోదయున్"

అని ధర్మజుని విశేషణములతోఁ బూరించె ననియు, ద్వితీయపద్యపక్షము వారు విమర్శించి యట్టి విమర్శ కవకాశము లేని 'నిండుమనం' బను రెండవపద్యమును నీకథ కాధారముగఁ దెలిపియుందు రని మన మనుకొనవచ్చును. పైవిమర్శయందలి యుక్తాయుక్తము లెట్లున్నను భిన్నవాదములకు మాత్ర మీ రెండు పద్యములును నాధారములు కాకపోవు. ఇందలి మొదటిపద్యము బహుళసంస్కృతపదాఢ్యము. రెండవది బహుళాంధ్రపదోపేతము. మొదటిదానియందలి గుణము శబ్దగాంభీర్యము. రెండవదానియందలి గుణ మర్థగాంభీర్యము. మొదటిది నిరర్థకకవితాధారకమును, రెండవది సార్థకపదగుంఫనమును దృష్టాంతములు. మాధుర్యము మాత్రము రెండిఁటియందును సమమే.

ఇట్టి రెండుపద్యములయందలి భేదములనుబట్టి భిన్నవాదులైన నాఁటిజనులలోని రుచిభేదములను మన మూహ్యముగా విభాగించుకొనవచ్చును. కల్పితకథంగూర్చి యింతకన్నఁ జర్చింపవలసినది లే దన్నను మొదటిపద్యమునందలి నిరర్థకకవితాధారతో నేకీభవించి రెండవపద్యమునందలి కవితాగుణము లన్నియుఁ దిక్కనరచనలయందుఁ గాఁబడుచుండు నని చెప్పుటయే దీని పర్యవసానము.

అది యెట్లుండె—

"క. విమల కవిత్రయ నిర్మిత
సమధిక రసవత్ప్రబంధ సాహిత్యకళా
సుమన స్తటినీ కల్లో
లములన్........................"

అని శంకరకవి చెప్పినట్లు కవిత్రయమువారి కవితాధార వియన్నదీ ప్రవాహము. ఆప్రవాహావేగమున నందందుఁ జిన్నచిన్న వలుకు లుండిన నుండవచ్చును. అంతమాత్రమున జగత్ప్రఖ్యాతమును బుధమనోజ్ఞమును నగు నద్దానికిఁ గొఱంత వాటిల్లదు.

నన్నయకవితాచతురము బలె రచనం బట్టి తిక్కనకవితాచతురమును వెదకఁ గలసిన యవసరము మనకు లేకుండ నతఁడు తన యభిప్రాయమును స్పష్టముగ వెల్లడించెను. ఇందులకుఁ గారణము వాని స్వాతంత్ర్యమే. ఇంతటిస్వాతంత్ర్యము నన్నయ యందున్నట్లు కనఁబడదు. నిర్వచనోత్తరరామాయణ రచనాసందర్భమునఁ దిక్కనః—

"మ॥ అరులోఁ దార్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడన్ కళావిదుఁడ................."

అని స్వకవితాసామర్థ్యమును జెప్పుకొనుచోఁ గవిత్వము శిల్ప మని చెప్పెను. కేయూరబాహుచరిత్రకర్తయైన మంచనయుఁ దన కృతిపతి తన్నుం గోరినట్లుగ—

క. కేయూరబాహుచరితము
నేయుము నీ వాంధ్రభాష. శిల్పము మెఱయఁ

అని యీవిషయమునే యుగ్గడించెను. మఱియుఁ గావ్యనిర్మాణమునకుఁ బూనుకొనిన కవి ముఖ్యముగ గమనింపవలసిన విషయములను దిక్కన యీక్రిందివిధమున వెల్లడించెను.

ఉ. భూరివివేకచిత్తులకుఁ బోలునవం దలపన్ దశంబులన్
సౌరభమిచ్చు గంధవహుచందమునం బ్రకటంబుచేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకుల్ పరిగ్రుచ్చునట్లుగాఁ
జేయప చేరఁగా వలయుఁ జెప్పెడ నేఁ గృతి యన్నవారికిన్"

క. తెలుఁగు కవిత్వము చెప్పం
దలఁచినకవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలఁ గొని వళులం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమి ప్రచ్చుట చదురే?

క. అలవడ సంస్కృతశబ్దము
తెలుఁగుబడి విశేషణంబులేటపడంగాఁ
బలుకు నెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్.

నన్నయకావ్యరచన ముగిసిన తరువాతఁ దిక్కనకావ్యరచన ప్రారంభించుటకును గల మధ్యకాలమున రచింపఁబడిన గ్రంథములలో నన్నెచోడుని కుమారసంభవమును భాస్కరుని రామాయణమును ముఖ్యమైనవి. అందుఁ గుమారసంభవమునుగూర్చి మొన్న మొన్నటి వఱకు నాంధ్రదేశ మెఱుఁగనే యెఱుఁగదు. భాస్కరరామాయణము మాత్ర మీనాఁడువలెనే యానాఁడు సైతము నత్యంతజనాదరణము వహించియుండె నని దాని నిలుకడయే చెప్పక చెప్పుచున్నయది. మఱియు నట్టిజనాదరణము, నా గ్రంథమునకు లేకుండ నుండినయెడల ఆకావ్యమునందలి రచనావైదుష్యమునఁ దనకు గౌరవభావము లేక యుండినయెడలఁ, దిక్కన యీక్రిందిపద్యమును జెప్పియుండఁడు.

* గీ. పారశవితాభిరాము గుంటూరువిభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
రైన మన్ననమెయి లోక మాదరించు
బేఱ వాక్పతిగుణములు వేయు నేల?

చంద్రునియందలి కాంతియుఁ- బుష్పమునందలి సుగంధమును గావ్యమునందలిసుపలయుఁ- జేతులకు దొరకనివి. దాచిపెట్టుటకువీలులేనివి. కావున ననివారణమైన విపరీతకారణ మేదైనఁ దటస్థింపకున్నంతవఱకు నుత్తమకావ్య మెప్పటికిని మఱుఁగుపడనేరదు. అట్టికారణము లేకయే యొకానొక గ్రంథ మఱుఁగంటిపోయినయెడల దానికి హేతువు తద్గ్రంథప్రాశస్త్యలోప మనియే చెప్పవచ్చును. గ్రంథమునకుఁ గలుగు నత్యంతజనాదరణమే తత్ప్రాశస్త్య మని నామనవి.

తిక్కన తనకాలమునాఁటికవితలను నిత్యమును జూచుచు నందలి మంచిచెడ్డ లెఱుంగుచుండినవాఁ డగుటచేతను, అప్పటి కించుమించుగ నిన్నూఱేండ్లక్రిందట రచింపఁబడిన నన్నయభారతభాగము తననాఁటి జనసామాన్యముచే నెట్లాదరింపఁబడుచుండెనో తాను గన్నులారఁ జూచుచుండినవాఁ డగుటచేతను, తన తాతగారైన భాస్కరుఁడు రచించిన రామాయణము సైతము నన్నయకావ్యమువలెనే క్రమక్రమముగ నన్నివైపుల వ్యాప్తమగుచుండుటఁ గనిపెట్టుచుండినవాఁ డగుటచేతను, కావ్యనిర్మాణమునకై పూనుకొనిన కవి యన్నిలక్షణములకన్నను జనాదరణము ముఖ్యలక్షణముగా గమనింపవలసిన దని యొకసూత్రము చేర్చుకొనెను. కవిత్వ మిట్లుండవలయు నని వైపద్యము లయం దాతఁడు చెప్పినరీతు లన్నియు నీసూత్రము ననుసరించియే యున్నవి. మఱియుఁ దననాఁడు జనప్రచారమునందు లేక కేవలము ప్రాతవడినమాటలు చేర్చి కొందఱు కవితలల్లుచుండి రనియు, నట్టివి జనసామాన్యమునకు రుచింపక పోవుచుండె ననియుఁ, దిక్కన యొనర్చిన కుకవినిందవలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

చ. పలుకుల పొందులేక రసభంగము సేయుచుఁ బ్రాఁతకడ్డమా
టలఁ దమ చేర్చి చూపి యొకటన్ హృదయం బలరింపలేక, యే
పొలమును గానియట్టి క్రమముం దమ మెచ్చుగ లోక మెల్ల న
వ్వులఁ బొరయంజరించు కుకవుల్ ధర దుర్విటులట్లు చూడఁగన్.

వైపద్యమునందుఁ దిక్కన యొనర్చిన యాక్షేపణము నన్నెచోడున కన్వయించునేమో యని కొందఱయుద్దేశము. నన్నెచోడుని

* రామాయణకృతికర్త యీమంత్రిభాస్కరుఁడు కాఁ డని యొక వాదమున్నది.

రచనయందలి ప్రాతమాటలు నేటివారికే కాక నాటివారికి సైతము దుర్గ్రాహ్యములై యుండవచ్చును. ఆవిషయమునఁ బండితులొనర్చెడు విమర్శలను దిక్కన ప్రత్యక్షముగ నెఱిఁగి—పుట్టిపదములను దనకవిత యందు వీలైనంతవఱకుఁ జొరనీయకుండఁ గడుజాగరూకతతోఁ గావ్య రచనఁ గావించుచు, నంతతోఁ దృప్తినొందక తాను రచించుచుండిన భాగములు సరసులైన వారి కప్పుడప్పుడు వినిపించుచు వారి సమ్మతి వడయుచుండె నని యనుకొనుటకీ క్రిందిపద్య మవకాశము కలిగించు చున్నది.

సీ. ఎట్టికవి కైనఁ దనకృతి యింపుఁ బెంపుఁ
జాలఁ గావునఁ గావ్యంబు సరసులైన
కవులచెవులకు నెక్కఁగాఁ గాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు.

జాతీయపదప్రయోగమునందును యతిప్రాసనైర్మల్యమందును కవి బ్రహ్మకుఁ గల శక్తియు తెనుఁగుకవులలో మఱియొకరికి లేదు. అందు బగమధ్యయతు లున్నఁ దిక్కనకు నచ్చవు. ఎక్కువ విపులమైన భావమును గొలఁదిపదములలో నుడువుట అతనికి నలయం దాహార ముగుటచే నందందుఁ గొన్ని పద్యములయం దన్వయము కొంచెము కష్ట ముగా నుండినను నారికేళపాకమును జొరనీక యత్నేఁడు తెనుఁగుకవితకు సహజమైన ద్రాక్షాపాకమును నాద్యంతము నొక్కరీతిఁ బోషించుట యెంతయు శ్లాఘనీయము. ఈయంశమునే మనసునం దిడుకొని చదలు వాడ మల్లయ తిక్కనకవి నిట్లు స్తవముచేసెను.

"క. ప్రాకట నవరస కలనా
సాకల్యము మెఱయ మధురసమధుద్రాక్షా
పాకప్రబంధరచనన్
జోకం దగు తిక్కయజ్వ జూపుం దలఁతున్."

ఇట్లు కొలఁదిపదములలో గొప్పభావమును వెల్లడించుట నన్నయ కవితకుఁ దిక్కన పెట్టినపేరని జనులు చెప్పుకొనుటకుఁ గారణ మైన గుణములలో నొకగుణమై యుండవచ్చును. మఱియు—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా †కలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప...

అను నన్నయసూత్రమును దిక్కనయు ననుసరించి, ప్రసన్న కథాకలితార్థయుక్తికొఱకే ప్రయత్నించెను. గాని, కవితాతత్త్వజ్ఞు లం తగా సమ్మతింపని శబ్దాలంకారములకుఁ బ్రయాసపడలేదు. తాతగారిక వితయందుఁ దనకుఁగల గౌరవభావమును వెల్లడించుటకుఁగాఁబోలు నిర్వచనోత్తరరామాయణమునందు మాత్ర మచ్చటచ్చట భాస్కరుని శబ్దవైచిత్ర్యము నించుక చూపుచు వచ్చెను. అరకంటి శబ్దవైచిత్ర్య మైనను బద్యాంతములయందు మాత్రమే చేర్చుచు వచ్చుటచేత నతఁడు కేవలము శబ్దాలంకారప్రియుఁ డని నిశ్చయ మగుచున్నది. చూడుఁడు.

ఉ. పాటిత దుష్టసత్త్వ వనవాటిక సిద్ధబలావరుద్ధశృం
గాటక గ్రంథిలభ్రుకుటిగాఢలలాటకుఁ, గ్రూరతారకా
వాటక నాంత్రకాంచిపరిణద్ధ కచప్రపత త్రికూమిన్నృటా
కీటక రక్తసిక్తపటుఖేటకుఁ దాటకఁ గాంచి రయ్యెడన్. భా. రా.

శా. కోపంబారినఁ జంకవాపి ధరణిం గూర్పుండఁగాఁ బెట్టి ని
ష్పాపోల్లాసకటాక్షపల్లవోల్లసన్ ప్రౌఢస్మితజ్యోత్స్నల
జ్జాపూరాకృతి తన్ముఖాబ్జములపై సాంద్రంబుగాఁ జూపి ని
ర్వ్యాపారాముగనుం డరీప్రకరగర్భస్రావణున్ రావణున్.

ఉ. ఈ యనుమాన మేటికి నరేశ్వర! విరాపరిపాలనక్రియా
పాయము ధర్మనిష్ఠ యెడఁ గృపాగుణమున్ వినయంబు నెంపునన్
న్యాయవిశోధనంబును నిజుంత్రితసత్యవచోవిలాసమున్
బాయక విందు నెందు పరిధంజన మూరిజనానురంజనా! నిర్వ. రామా

అర్థాలంకారప్రియుఁ డగుటయే కాక, అందతిశయోక్త్యుత్ప్రే క్షోపమాద్యలంకారము లన్నింటికంటె స్వభావోక్తియే తిక్కనకు మి క్కిలి యభిమాన మని వాని రచనలను వర్ణనలను బట్టి తోఁచుచున్నది.

సీ. తిరగఱుంబ్యలలెక్క తూఁగియాడుచుఁ గూడి
పాడెడు మత్తాళిబాలికలను,
పలుకులు తోడన యలుకఁ దోడేఁగియు
చేరని కీరకుమారికలను,
నింపారు లేఁదూఁడు లేరి పిల్లలకుఁ బె
ట్టుచు నున్న పాంసుకుటుంబినులను,
ఫలరస మొండొంటి కెలమిఁ జూంచులనిచ్చు
తతిఁ జొక్కు కోకిలదంపతులను
జూచిచూచి యొండొరులకుఁ జూపిచూపి
చెలువలకు తేఁగించి కొనియాడి చెప్పిచెప్పి
చిత్తహారి విహార సంశేవఁ దగిలి
యుల్లసిల్లిరి వనితలు వల్లభులును.
నిర్వ. రామా.

ఇట్లు విమర్శించినకొలఁదిని దిక్కనకవితయందలి గుణములు వేన వేలుగఁ దోఁచుచుండును. "అమలోదాత్తమనీష..." అను పద్యమునం దుఁ గవిత్వము శిల్ప మని చెప్పుటయే గాక, కవితను గూర్చి చెప్పినప ద్యములలో "ఇంపారెడు పల్కులన్" అనియు, "సరసమధురవచోగుం ఫన" అనియు "లలితపదహృద్యపద్యంబుల" అనియుఁ దఱుచుగఁ బద ములయందలి మాధుర్యమును గూర్చియే నొక్కి చెప్పుచు వచ్చుటచేత సంగీతమునవలెఁ గవిత్వమునసైతము శ్రవణసుఖమును మాధుర్యమును బు ట్టించుచుండుట వానిమతము గాఁ దోఁచుచున్నది. ఇట్లు సంగీతచిత్రలేఖ నములు రెండును గవితయందుఁ బ్రాముఖ్యము వహింపవలెనను తిక్కన మ తము—కోలరిడ్జి—కీట్సు—షెల్లీ—మొదలగు కొంద ఱాంగ్లకవితాతత్త్వవేదు లమతములతో నేకీభవించుచున్నది. ఈవిషయమును "కీట్సు, హా స్రీ శేలెట్" అను నాఁ డీర్ఘముగా నిరూపించి యున్నాను.

† కలితార్థయుక్తి—అనిపాఠాంతరము.

"Poetry includes whatsoever of painting can be made visible to the mind's eye and wahtsoever of music can be conveyed by sound and proportion without singing or instrumentation. But it far surpasses those divine arts in suggestiveness, range and intellectual walth—the first in expression of thought, combination of images and the triumph over space and time; the second in all that can be done by speech, apart from the tones and modulotions of pure sound. Painting and music however include all those portions of the gift of poetry that can be expressed and hightened by the visible and melodious................Music and painting are proud to be related to poetry, and poetry loves and is proud of them."

సంగీతచిత్రలేఖనముల మాట యటుండ సౌందర్యసౌకుమార్యాదులతోఁ గవిత్వము కన్యకవలె హృదయంగమముగా నుండవలె నను నూహతోఁ గృతిపతిని గూర్చి ప్రసంగించు సందర్భమున—

"కం. ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగనిమ్ము భారతీ కన్యను..."

అని తిక్కన చెప్పియుండెను. ఇట్లే యాంధ్రకవు లనేకులు తమ గ్రంథములయందుఁ గృతిపతి ప్రసంగములలోఁ గవిత్వమునఁ గన్యాత్వము నారోపించుచు వచ్చిరి. యెట్లనఁగా:—(౧) "బాల రసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్" పోతన. (౨) "మదీయ కావ్యకన్యాయమనోహరం దగు రావూరి వసంతభూపాలరాఘవు వంశం బభివర్ణించెద" వెన్నెలకంటిసూరన-విష్ణుపురాణము (౩) "సజ్జనవిధేయమనకున్ గవితాస్త్రీలోలనకున్......" పెద్దన మనుచరిత్రము. (౪) "పరిగ్రహింపు మయ్య! రఘునాథభూపరసికాగ్రణి! మామక కావ్యకన్యకన్" చేమకూర - వేంకటకవి - విజయవిలాసము (౫) "రంగపతి యంగజుతండ్రి మదీయకావ్యసారంగవిలోచనామణికిఁ బ్రాణవిభుం డట భాగ్య మెట్టిదో!" కాకమాని మూర్తికవి. పాంచాలీపరిణయము.

నన్నెచోడుఁడుఁ గూడఁ గవిత్వమునందును స్త్రీత్వమునందును సమానధర్మముల నారోపించి స్త్రీవలెనే వర్ణించి చెప్పెను.

క. "చతురోక్తుల నతిపదబహు
గతుల నలంకారభావకాంతిరసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్"

కవితానుభవము కలిగినకొలఁదిని పదప్రయోగమును రచనావిధానమును దమంతటఁదామే సంస్కరింపఁబడుచుఁ గ్రొత్తశోభ వహించుచుండును. వయసు మారుకొలఁది-లోకానుభవము హెచ్చుకొలఁది- ప్రపంచమున మానవునిజీవితమందు మార్పులు కలుగునట్లే- కవితాప్రపంచమునందితము రచనానుభవమునుబట్టి కవికి రుచులుమారుట కలదు. పెక్కు వీకుమన్నకొలదిని సౌందర్యసౌకుమార్యసౌరభ్యాదు లతిశయించుచుండుటకు గావ్యరచన గావించుకొలఁదినిఁ బరిణతహృదయుఁ డగు కవియొక్క కవితయందలి పదములును- పదములతోడ భావములును భావములతోడ పాకాదులును - క్రొత్తదనములతో నొప్పుచుండును. విమర్శదృష్టితోఁ బరిశీలించినయెడల నీవిశేషములు మనయాంధ్రకవిముఖ్యుల కావ్యరత్నములందు గోచరింపకపోవు.

నిర్వచనోత్తరరామాయణమునందలి కవితాప్రసంగమున "భారతీకన్య" యనియొకచోటను, "కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పము" అని మఱియొకచోటఁ, బలువిధములఁ దనకవితామతిమును ప్రకటించిన తిక్కనయు భారతగ్రంథరచనకుఁ గడంగునపుడు మనసెంతవఱకుఁ బరిణతి నిగాంచెనో, తత్పరిణామమధ్యమదశయందు వానికవితాతత్త్వవిచార మెట్లు నూతనత్వము వహించెనో యిచట నించుక విచారింతము. మహాభారత సౌధారోహణమునకుఁ దనకుఁ బ్రథమసోపానమైన విరాటపర్వము ప్రారంభమునందు:—

"శా. విద్వత్త్వం స్తవనీయ భవ్యకవితావేశుండు......"

అని తిక్కన కృష్ణద్వైపాయనుని స్తుతిచేసెను. పరబ్రహ్మసంకాశుఁడైన వ్యాసునిఁ గవితావేశునిగా వర్ణించుటచేఁ గవిత్వ మొకవిధమైన యావేశ మని వానిమతము. ఆవేశ మనఁగా (Inspiration) అనుకొనవచ్చిది యనిర్వచనీయమైనట్టిదియు నకారణమైనట్టిదియు నగు నొక నూతనశక్తి. ఇట్టినూతనశక్తిస్వరూపమైన యావేశమువహించి రచించిన కావ్యములే నిజమైన కావ్యము లనఁబడుచున్నవి. తక్కినవి తాత్కాలికానందజనకములగు గారడీవిద్యలు. కవిత్వమావేశమను తిక్కనమతము "What is poetry, but the thought and words in which emmotion spontaneously inubodies itself" అను నొక యాంగ్లేయసూక్తిని బలపరచుచున్నది. మఱియుఁ గవితానందమునకును బ్రహ్మానందమునకును తిక్కన యభేదప్రతిపత్తిం గలిగించినట్లు తోఁచుచున్నది. కవితావేశపరవశుఁడైన కవియు-మహాయోగనిమగ్నుఁడైనపరమహంసయు-నామమాత్రభేదముచే నొక్కవిధమైన యానందము ననుభవించుచున్నారట! మహాయోగనిమగ్నుఁడై నిశ్చల ప్రశాంతముతోఁ బరబ్రహ్మమును ధ్యానించు పరమహంసకుఁ బరంజ్యోతిస్సందర్శనమువలనఁ గలుగు నానందమువంటి మహానందమే, తనకును సకలబ్రహ్మప్రార్థనంబున సంప్రాప్తమైనట్లుగ సోమయాజి యీవిధమున సూచించెను.

ఉ. "శ్రీయన గౌరినాఁ బరఁగుచెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్"

అని సకలబ్రహ్మప్రార్థనంబును జేసె తత్ప్రసాదాసాదిత కవిత్వతత్త్వ నిరతిశయానుభావానందభరితాంతఃకరణుండ నగుచు........"

యోగము వలెనే కవిత్వమునకును దీక్షవలయునట. దీక్షలే కయే చంచలస్వాంతముతోఁ గావించు యోగము గాని కవిత గాని పైని రచించిన యానందమును గలిగింపఁజాల దను నభిప్రాయము తిక్కన యీ క్రింది పద్యమున సూచించెను.

ఉ. "కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాం
ధ్రావళి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్"

అత్యంతమైన కవితాదీక్ష వహించి కావ్యరచనఁ గావించుచు న్నంతకాలమును గవికిఁ గలుగుచుండు సాత్వికాంత మనుభవైకవేద్యము. కవితావేశము లేకయే యట్టి దీక్ష వహించుటకు మనసు కుదురఁబడదు. బలవంతముగఁ గుదురుపఱచుకొందమన్నను సాధ్యముగాదు. అట్టి కవితావేశభాగ్యమును గావ్యదీక్షాపరతంత్రతయు నీశ్వరానుపాదితములు గాక కేవలము మానవాధీనము లైనయెడల "కవి ర్జాయతే నతు క్రియతే" యను సూక్తి పుట్టియుండదు గదా!

మఱియును- "విద్వత్సంస్తుతనీయ భవ్యకవితావేశుండు" అని సమస్తసద్గుణాతిశయములలోఁ గవితావేశమే ప్రధానముగాఁ గొని యట్టి మహాగుణముగలవాఁ డని యుదికలుడుఁ దా నొకసారి కర్ణించిన వ్యాసునే, తాను గవిత్వదీక్షయందుఁ గూర్చుండునప్పుడుఁ గూడ, స్మరించి "సాత్యవతేయసంస్మృతి శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ" అని చెప్పియుండుటచేతఁ దనకుఁగూడ నట్టి కవితావేశభాగ్యము సర్వేశ్వరుఁడు ప్రసాదించినట్లును, నందుచేఁ దాను గవిత్వదీక్షను వహించినట్లును తిక్కనయుద్దేశముగా స్ఫురించుచున్నది. ఇది యిట్లుండ "అని సకలబ్రహ్మప్రార్థనలు సేసి తత్ప్రసాదాసాదిత కవిత్వతత్త్వ నిరతిశయానుభావానందభరితాంతఃకరణుండనగుచుండి" అను వాక్యమునందును, "కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ" అనువాక్యమునందును గల యర్థములు రెండును నొండొంటితో సమన్వయించిచూడ నత్యంత పరిపక్వహృదయుం డగు తిక్కన, కవిత్వతత్త్వమహత్త్వమున కెంతటి యున్నతస్థాన మొసంగెనో తెలియఁగలదు. తెలియుటయే కాక, కవివహించు కవితానందమునకును, మహాయోగివహించు బ్రహ్మానందమునకును నతఁ డభేదప్రతిపత్తి గలిగించె నను నూహ యించుక మనకుం గొనవలసి వచ్చునేమో యని కూడఁ దోచుచున్నది. పరబ్రహ్మారాధనమునఁ బరమహంసకు బ్రహ్మానందముకలుగునట్లే సకలబ్రహ్మప్రార్థనమునఁ దనకును గవిత్వతత్త్వనిరతిశయానుభవానందము కలిగె నని చెప్పుటచేత నామమాత్రభేదములతో నీరెండానందములు నొక్కటియే యని తిక్కనమతముగా మన మిది కలుగ కనుగొంటిమి. కాని, పైరెండు వాక్యములను సమన్వయించినప్పుడు మాత్రము కవీశ్వరయోగీశ్వరానందములకు హెచ్చుతక్కువ లున్నట్లు తిక్కన సూచించినట్లు చెప్పవలసివచ్చుచున్నది. పరబ్రహ్మారాధనము వలన యోగీశ్వరుఁడు పొందు బ్రహ్మానందము తానే యనుభవింపఁగలఁడు. గాని-తదానందసౌఖ్యము తనదేశమువారికిఁ గాని-జాతివారికిఁ గాని-లేశమైన గలిగింపనేరఁడు. సంసారదారపుత్రాదులఁ బరిత్యజించి యరణ్యాంతరములయందో-పర్వతప్రాంతములయందో-కైవల్య మాశించి నిశ్చలచిత్తంబుల నీశ్వరారాధనమును గావించుచుండు మహాత్ములు నేఁడును మనదేశమున నుండకపోరు. ఉండకపో రని యూహించుకొనుటయే కాని ఆ మహాత్ము లెవ్వరో? వా రొనరించు తప మెట్టిదియో? తత్ప్రయోజనిత మైన యానంద మేమిటో? మన మెఱుంగము గదా! ఇంతకు నొక ప్రాణి మంచిదియో చెడ్డదియో యొకకర్మ నొనర్చినప్పుడు, తత్కర్మఫలానుభవము మఱియొక ప్రాణికిఁ జెందు ననుటకు వేదాంతు లొప్పుకొనరు. అందుచే నెవరితపము వారిదే! ఎవరి యానందము వారిదే. ఇచ్చటనే కవీశ్వరుని ప్రకృతి భిన్న మగుచున్నది. సకలబ్రహ్మప్రార్థనముఁ జేసి తత్ప్రసాదాసాదితమైన కవిత్వతత్త్వనిరతిశయానుభవానందము తిక్కన తా ననుభవించుటయే కాక "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" అని చెప్పి తదానందానుభవభాగ్యము తనజాతివారగు నాంధ్రులెల్లరును గూడ వహించునట్లుగఁ జేసెద నని మహాకవిత్వదీక్షాకంకణమును గట్టుకొని- యందుఁ గృతార్థుఁడై- మనల నందఱను గూడఁ గృతార్థులం జేసిన యాతనిమహామహిమ నెంతని కొనియాడవచ్చును!!!

క. "త్రిదశగ్రామాతారామని
పదముల కన్నిటికి నుపరిభాగంబునఁ జెం
పొదవు ధ్రువస్థానం బు
న్నది యచ్చో టిత్తు నీకు నరహరిపుత్రా!"

అని సనిపాపుఁడైన ధ్రువుని బ్రహ్మమయుం డగు మహావిష్ణువు కటాక్షించినట్లుగ - నించుమించుగ నిన్నూరేండ్లు తనకై మహాతపము గావించిన యాంధ్రకవితాబాలికకుఁ బ్రసన్నుఁడై యిట్టి యత్యున్నతస్థాన మొసఁగుటచేతనే తిక్కన తానును బ్రహ్మపదారూఢుఁడై "కవిబ్రహ్మ" యని కీర్తింపఁబడుచున్నాఁడు.

# ఆంధ్ర వ్యాకరణ విచారణము

పోరనంది రామశాస్త్రిగారు

వ్యాకరణములు భాషలో సిద్ధరూపముల నివ్యుత్పత్తిని దెలుపుటకే గాను సంస్కారములను విధించునది. వ్యాకరణము లన్నిభాషలలోను గ్రంథరచనల కుపకరించును. ఆంధ్రభాషకు వ్యాకరణము లనేకములు పుట్టియున్నవి. వీనిలో పూర్వపూర్వము త్తరోత్తరమునకు ప్రమాణముగా నుండును. ఈమర్యాద యన్ని శాస్త్రములలోను సమానమే. ఈవ్యాకరణములలో సర్వాద్యము నన్నయభట్టీయమై (ఆంధ్రశబ్దచింతామణియై) యున్నది. చింతామణికిఁ దనభారతరచనతోడనే యారంభించిన ట్లారంటిరలను దెలియఁబడును. చింతామణికిఁ బిమ్మటి వ్యాకరణములు కొంచెముకొంచెము భేదిల్లెను. రాను రాను- తుదకు బాలవ్యాకరణము చాల భేదిల్లినది. వృద్ధబాలురకు కాల ప్రయుక్తభేదము సిద్ధమే కదా! ఈభేదము- క్రమక్రమమున విరోధముగాఁ బరిణమించుచున్నది. ప్రాచీనాచార్య వ్యవహారవ్యుత్పత్తి విషయములకు నవీనములు విరోధించుచుండుట యెల్లరకును స్పష్టమే. అట్లే భాషలోఁగూడఁ గాన్పించుచున్నది. చింతామణిలోఁ బదాదియకారమును నన్నయభట్టుఁ డంగీకరించి యున్నాడు. పిమ్మటివారు దానిని నిషేధించుచున్నారు. బాలసరస్వతి తనటీకలో "యెప్పుడు" మొదలగువానిలోనిది పదాదియకారముగా నుదాహరణ మిచ్చినాడు. చింతామణిలో య, ర, ల, వ, లకు నాల్గింటికిని లఘ్వలఘుభావ రూపమగు ద్వైవిధ్యము తుల్య మయియుండగా రేఫమునకు మాత్ర మీయాంధ్రభాషలో వ్యవహారముచేతఁ గూడ మఱియొక ద్వైవిధ్యమే వైధర్మ్యముగాఁ జెప్పఁబడినది. ఆవైధర్మ్యమునే పిమ్మటివారు విరోధముగాఁ జెప్పుచున్నారు. ఈవిషయమున బాలసరస్వతి నుండిఁ బొరపడినట్లుగాన్పించుచున్నది. అతనిటీకలో—"ఆశ్వైషాం=కడమవాటికి, వైధర్మ్యం=విరోధము, న=లేదు. రలయోస్తు=లఘ్వలఘువులయిన రవర్ణములకైతే, నిత్యం స్యాత్ = నిత్యముగా విరోధము కద్దు. విరోధ మనఁగా తమలో యతిప్రాసములు చెల్లకుండుట" అని చెప్పి—

గీ. అక్కలు గలట్టి పెనుపాపరేళ్లఁ బంటి
కలుకుములుకులు తంధు నుక్కలఁగఁజేసి
పరమకల్యాణి గిరికులేశ్వరతనూజ
రణవినోదంబుసలిపె నిర్జరులు వొగడ"

అని యుదాహరణ మిచ్చినాడు. దీనిలోనే- స్వవచనవ్యాఘాతము గాన్పించుచున్నది. ఇందు లేఖకుని ప్రమాద మున్న నుండవచ్చును. ఇం దేమైనను, మూలమునకు టీక భేదించును. మూలములో ప్రథమాచార్యుఁడు 'రలౌ' అని-యొక్క-సమాసమున -నొక్క-రూపము వ-రెంటిని సంగ్రహించిచెప్పినాడు. ఒకపద్యములో - వేలు వేలు చరణములలో- వారెండు రేఫములును యతిప్రాసములు గారా దన్యోన్య విరోధము గలదని చెప్పవా? అవి యతిప్రాసము లయినప్పుడును, వానిరూపములను దాలుమాలు నీయక దేనిరూపములో దానినే యుంచవలయు నని, వైధర్మ్యమును నిత్యముగాఁ జెప్పినాడు. పిమ్మటివారు వైధర్మ్యమును విరోధముగా భావించి-వానిరూపములను మార్చుచున్నారు. చూడుడు. అప్పకవీయము 3 ఆశ్వా. ౯ వ పుట కవిజనాశ్రయము. "క. నెరయంగా నీఛందము తెలుగెలుంగక" నృసింహపురాణపీనపాదము" పరమాత్మ్యపదములఁ దొలఁగిపోరదు నేటికల గలదైభా. "ఆది" ర ఆ "౧౭" కాలుడవి క్రుం బాలుగ" గాంతి "క. క్రు 1 మాసన్"

ఇట్టి పాతవ్యత్యాసములను జూచి బాలసరస్వతియుఁ బొరపడి యుండును. దీనిని జూచి లాక్షణికులు- ఛందస్సులలో మఱికొన్ని వర్ణములకు విరోధమును మైత్రిం గల్పించుచున్నారు. ఈకల్పన- ఇదిగోపులి అన్న నదిగో తోక అనునట్లే యున్నది. వర్ణములకు విరోధమున కెట్టిది? యతిప్రాసములు చెల్లకుండుటయే కదా? అవియేల చెల్లవు? అనినచో 'విరోధముచేతను. విరోధ మేల? యతిప్రాసములు చెల్లకుండుటచేతను. ఈ యుపపత్తి యెంత యుచితముగా నుండునో విచక్షణులే విచారింపుడు. ఇఁక నీవిరోధము సహజమొక విధ మున్నచో నది- జలాగ్నులకును గోవ్యాఘ్రములకును గలదాని వంటిదా? లేక స్వాభావికమా? కాదు. వర్ణముల కీమైత్రీవిరోధములు కవులనోట నున్నవే కాని సహజములు గావు. దన్తతాలుభేదము నొందిన చవర్గీయములలో, అ ఇ ఉ ఏ ఓ లకు సావర్ణ్యము చింతామణిలోఁ జెప్పఁబడినది. వానికి స్థానభేదములేని వర్ణములతో సావర్ణ్యము లేదఁట! సావర్ణ్యమిచ్చుటకు మఱి స్థానభేద మున్నచోటనే, యావర్ణములకు, విరోధములేకుండ నెట్టిప్రతిబంధముగా లేనిచోట వానికి విరోధ మని నవీనాంధ్రసులు కొందఱు చెప్పుదురు. వీనికి అ ఆ ల విశ్రమమునకు, వక్రతమములే కాని, వక్రములు పనికి రావఁట. వానికి- ఐ ఔ లతో నయినది, గుణావళి యని ఛందస్సు లన్నియు నొప్పుకొనుచునే యున్నవి. గుణవళి యేల యొప్పికొనవో? తెలియరాదు. గుణవృద్ధులు రెండును సమానస్కంధములుగదా! గుణమున కర్హము గానిది వృద్ధి కెట్లర్హ మగును? తెనుఁగుభాషలోఁ గుణము లేదు గావున దానితో విశ్రమమును ఛందస్సులు చెప్పలే దన్నపక్షమున గుణములేని తెనుఁగునకు వృద్ధి యెట్లుండును? సంస్కృతమున లేని హ్రస్వము లగు 'ఎ' 'ఒ'లు తెనుఁగున నంగీకరింపఁబడినవి కదా! వానికి 'వక్ర' సంజ్ఞ గలదా? లేదా? ఉన్నచో నది సిద్ధించినప్పుడు- గుణ సంజ్ఞయు నేల సిద్ధింపదు? హ్రస్వదీర్ఘములను- చెలిఁ చేవ, చొక్క, చోటు, అనువాని

లో బాలవ్యాకరణము చెప్పుచున్నది. ఈ బాలలాక్షణికుల కీబాలవ్యాకరణమే కదా ముఖ్యప్రమాణము! సంస్కృతముపోలికను బట్టియే ఐ ఔ లకు, వృద్ధిసంజ్ఞ నంగీకరించుకొనినప్పుడు హ్రస్వములగు ఎ ఒ లకును దీనికిఁగూడ సంస్కృతము పోలికనుబట్టియేఁ గుణసంజ్ఞ నేల యంగీకరించుకొనరాదు? హ్రస్వములు దీర్ఘముల ప్రతిరూపములే. ఛందస్సు లట్లు చెప్పలే దన్నచో, నది వానిదోషమా? ప్రయోగించిన విద్వన్మహాకవులదోషమా? ఆ ఒ లకు ప్రాచీనమహాకవుల ప్రయోగములలో విశ్రమము గాన్పించుచుండ దానిం జూచి పిమ్మట ఛందస్సు లన్నియు, గతానుగతికముగా నది లుప్తవిసర్గకోత్వ విరామ మని చెప్పుచున్నవి. కాని మహాకవుల యభిప్రాయము నటుచేసినట్లు గానరాదు. అప్పటి- లుప్తవిసర్గక మనునది బహువ్రీహిసమాసమును నదీవిశేషణమును గదా? దేనికి ఉకారమున కా? ఉత్వమున కా? వీరికా భేదములేదు కాఁబోలు! అచట విసర్గములోపించినచో నుకారము దేనికివచ్చును. ఇట్టి యభిప్రాయములతోనే కృతికర్తలా ప్రయోగమును చేసినయెడల వారు వ్యాకరణశాస్త్రజ్ఞానము లేనివారే కాక తుదకు ధర్మధర్మిభావమునుగూడ తెలుఁగనివా రనవలసివచ్చును. అది యిష్టాపత్తి యన్నచోఁ దమదోషమును వారియందుఁ బెట్టు సాహసిక్యమే వీరికి సిద్ధించుగాని యభీష్టము సిద్ధింపదు. ఇది యెట్లున్న దనఁగా నిప్పుడు మనలో- నిత్యోపాసన మస్తమించినది. దానిని ప్రత్యాబ్దికము లోఁజున పురోహితుడు యజమానునిచేఁ జేయించి దానియందు దగ్నికరణమును జేయించుచున్నాఁడు. దానిని జూచి యీ యౌపాసనము నాబ్దికములోఁ జునేనే కాని యితరకాలమునందుఁ జేయరా దను ధర్మసూత్రము చేర్పడిన ట్లుండునో ఈలుప్తవిసర్గకోత్వవిరామలక్షణముగూడ నట్టిదిగానే కాన్పించుచున్నది. ఇప్పుడు లోకమున భాషాభిమానులు గొందఱు "ఆంధ్రభాషాభివర్ధనీసమాజ" మను పేర నొకసమాజమును స్థాపింప నింకొకరును భాషాభివర్ధనీసమాజమునే స్థాపించుచున్నారు. దానిఁ జూచి మఱియొకరును భాషాభివర్ధనీసమాజ మనియే స్థాపించుచున్నారు. దానిం జూచి కొందఱు అనురంజనీ, అనుమోదినీ, ఆమోదినీ, కలాపినీ అను పేర్లతోనే స్థాపింతురు. ఆసామాజికు లెవ్వరో? తెలియఁబడదు. ఈనాఁడీ సమాజము లెట్లు విలసిల్లుచున్నవో యానాఁ డా లక్షణములుగూడ నట్లే విలసిల్లియుండును.

"అనియామా ద్రాగ్వ్యంహి యత్ర స్యప్రభ్రంశః" అని చింతామణిలో - నన్నయభట్టుడు నియమములేని యపభ్రంశము శాబ్దాన్వయ మనియు, నది నియమపూర్వక మయినచోఁ గ్రాహ్యమే యనియు, గసడదవాదేశ సంహారమును చెప్పి, వాడు నేను, ఇత్యాదులు సాధువులుగానే- భారతమందు ప్రయోగించియున్నాఁడు. ఈనియమము, గ్రామ్యముల శోధనముకొఱకే యయినట్లు భట్టారకుని యభిప్రాయముగా గానఁబడుచున్నది. మఱియు- కఱకంఠాదులకు గ్రామ్యత్వమే లేనట్లు సమాసపరిచ్ఛేదమందు మిశ్రసమాసము నంగీకరించియున్నాఁడు. ఇట్లుండగాఁ- పిమ్మటి వారిలో ద్వితీయాచార్యుఁడు కఱకంఠముఖాహిత అని వానిని సమ్మతములుగానే చెప్పినాడు. కాని గ్రామ్యములుగాఁ జెప్పలేదు. పంచాకుము, తోపించాకుము, మున్నగునవి గ్రామ్యము లన్నాఁడు. అందును కఱకంఠాదులు లేవు. సీతారామాచార్యులు కిఱకంఠశబ్దముఁ గరకంఠశబ్దభవమనియుఁ బ్రాణగొడ్డము ప్రాణకట్టడభవమనియు- గ్రామ్యములు కావనియు ననిరి. కాని కపిలకన్నులు కపిలగడ్డము దినవెచ్చము- వీనికి సవరణఁ జేయలేదు.

అప్పకవి "లక్షణరహితకావ్యము వర్ణలోప మొంది చులకగా గ్రామ్యజనులు పలుకు- "వస్తాడు, తెస్తాడు" మొదలగునవి యపభ్రంశ గ్రామ్యము లగునని చెప్పినాడు.

చిన్నయసూరి తనబాలవ్యాకరణమందు "లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు" [౨౭ సూ] అని చెప్పి 'వస్తాఁడు తెస్తాఁడు' మొదలగువానిలో 'కఱకంఠుడు ప్రాణగడ్డము జీనగజ్జ కపిలకన్నులు కపిలగడ్డము కపిలజడలును' గ్రామ్యములుగాఁ జేర్చి "అర్థవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" [౨౩] అనివ్యాఖ్యానములో పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయినను గ్రహింపందగు నని భారతకర్తల ననుగ్రహించినట్లు చెప్పినాఁడు. లక్షణమున పెద్దియో చెప్పలేదు. దానికి శాస్త్రమున్నచోఁ కఱకంఠాదు లేశాస్త్రమునకు విరుద్ధములు? ప్రథమాచార్యుఁడు చింతామణిలో మిశ్రసమాసములను సాధించియుండ నది శాస్త్రవిరుద్ధము లెట్లు? బాలవ్యాకరణ మన షష్ఠీసమాసమా? కర్మధారయమా? మొదటిపక్షమున బాలుని వ్యాకరణము, లేక బాలురకు (కొఱకు) నైన వ్యాకరణ, మని కదా చెప్పవలయును. అప్పుడు కన్నుఁదెఱచియుఁ దెఱవకయు నున్నవారి కని లేక యట్టివారికొఱకైన దనియును సిద్ధించును. ఇఁకను రెండవపక్షమున నీ వ్యాకరణమే యట్టి బాల్యదశలో నుండి వృద్ధుల నాక్షేపించుట యిప్పటి కాలధర్మమే కావలయును.

చింతామణిలో నన్నయభట్టుడు సాంస్కృతిక పదములలోని క చ ట త ప ల కు, గ స డ ద వాదేశము గాని సరళాదేశము గాని చేయరా' దని చెప్పియుండ, నిప్పటివా రల్లెవల, విన్నలువిడిగా నిష్టమైనట్లు చేయుచున్నారు. ఇచట చిన్నయసూరి "తెనుగు మీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావు [౧౪ సంధిసూ] అని చెప్పినాడు. సంస్కృతమునఁ బరుష, సరళవ్యవహారమున్నదా? పరుష మను వార్తయే యెఱుఁగని సాంస్కృతిక పదములలోఁ బరుష సంజ్ఞకము లుండునా? సంజ్ఞయే లేక, సంజ్ఞాకార్య మెట్లు సిద్ధించును? ఈ నిర్వచనము గగనారవిందము ఘోటకవిందముల లె, రాత్రి ముకుళింపదు అనున ట్లున్నది. ఇచట కొందఱు తెనుగుమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు. కాని సాంస్కృతికములమీఁదివానికి రావచ్చును. అని వ్యాఖ్యానము చేయుచున్నారు. ఆవ్యాఖ్యానము నట్టిదే. "నవికృతేః ... స్వరః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః" అని చింతామణి సూత్రములోని 'వికృతిపదాత్' అనునది అధికారప్రాప్తమే కాని సాంస్కృతికపదములలో సిద్ధించుటకైన ప్రతిప్రసవము గాదు. గసడదవ, సరళాదేశములు రెంటికిని పూర్వపరనిమిత్తములు రెండును వైకృతములే యయి యుండవలయు

వని భట్టారకుని యభిప్రాయము. ఆ సూత్రములో సాంస్కృతికా నాం, అనుదానికి సాంస్కృతికపదీయ కచట తపల వని వ్యాఖ్యానము చేసికొనవలయును. సంస్కృతే భవన్తి సాంస్కృతికాః, అని విగ్రహము. సంస్కృతమున పరుష సంజ్ఞకములు లేవు గావున సాంస్కృతికానాం, అనుదానికి కచట తపానాం అని అధ్యాహారము చేసికొని సమన్వయము చెప్పుకొనవలయును. గాని యశాస్త్రీయమయిన పరుష సంజ్ఞను బలవంతముగా సంస్కృతపదములలోఁ బెట్టరాదు. ఇట్లే ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు, సరళము లగును. [౧౬. సూ] అను దానికిని నర్థము, చేసికొనవలసియుండును. దీని కుదాహరణములతో భూచెను + కలువలు = భూచెను గలువలు మున్నగువానితోఁ గలిపి నెగడెను + తిసములు = నెగడెను దిసములు, మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము" అని ప్రకృతివికృతివివేకము లేక యుల్లపోటను సరళాదేశము, చేయఁబడినది. ఈతను చెప్పినట్లే దిసములు నెగుడుచు పద్మము ముకుళించిన ట్లున్నది. గసడదవాదేశసూత్రములలో పూర్వని మిత్తములుఁ గొందఱు సంకేతము మెుందినను, వీనిలో ద్రుతప్రకృతిక అని స్పష్టముగానుండ నీకార్య మెట్లు సిద్ధించును. ఇట్టి వ్యాఖ్యానములను బఠియించి నవలాక్షణికులు నన్నయాది ప్రాచీనవిద్వన్మహాకవుల సాధనములకుఁ సంస్కారములను జేయ సాహసికు లగుచున్నారు. చూడుఁడు. భారతము:—విమలాదిత్యతనూజుఁడు విమలవిచారుఁడు గుమార

విద్యాధరుడు. దీనిలోఁ కుమారపదములోఁ గుకారము. ఈపద్యమందే నాలవచరణమున "విహితక్రముఁడు తుహినకరుఁడు" ఇచట మకారము లేదు. ఇట్టి వికల్ప మెట్లువచ్చెనో? ఈయాదేశమును గూర్చి ప్రథమాచార్యుడు అత్యాకృష్టదర్శక తాను, నేను, శబ్దములు దక్క దక్కిన ప్రథమాన్తములపైని వచ్చునని చెప్పుటలో నది నిత్యముగాను విభాక్తి పదములు వైకృతములగుటను, భూర్వనిమిత్తము వైకృతపదమే యని యుఁ దెలిపియున్నాడు. చిన్నయసూరి "ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగును [౧౩]" అని చెప్పినాడు గాని వ్యాకరణమర్యాదాప్రకారముగఁ బహుళ మనుచోట నాల్గుదాహరణముల నీయవలయును గదా! ఇవ్వలేదు. నిత్యప్రవృత్తి యెచ్చట? నిత్యాప్రవృత్తి యెచ్చట? విభాషయెచ్చట? అన్యకార్య మెచ్చట? ఇక సరళాదేశము ప డిత పామరసాధారణమయి యున్నది. ౧౦. వ. విమలమతిం బురాణములు" ఇచట నతిన్ బురాణములు- అని యున్నచో హానియేమైనఁ గలదా? కావరాదు గదా!

"భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యా విషమూర్ఛితా" అనురీతిని నన్నయభారతి కువ్యాఖ్యానములచే మూర్ఛిల్లి యుండి దుష్టసంస్కారములచే మరణావస్థనుఁ జెందుచు న్నట్లున్నది. దీనిని భాషాభిమానులగు కోవిదులు విచారింతురుగాక.

---

# ఎట్టిది విద్య?

సాహిత్యసరస్వతి డా. నారాయణమూర్తి శర్మ

ఎయ్యది దపత్యముం బిలరు వృద్ధదశం గనిపెట్టఁ జేయునో
యెయ్యది ధైర్యసాహస ధృతింగల సద్గుణరాశిఁ గూర్చునో
ఎయ్యది యింద్రియార్భటి జయించి మనోబల మిచ్చునో పరం
బెయ్య దెఱుంగఁజేయునో యదే యనవద్యపు విద్య నాఁదగున్.

ఉ. ఒక్కని పెట్టుకోఁతలకె యొగ్గుచు దోసిలి దాసకార్యముల్
మక్కువఁ జేసి జీవనము గడియించి సుఖర్వసౌఖ్య స
మ్యక్కుల మంచు మిసముల మాటికి దిద్దెకున ట్లొనర్చు బల్
దక్కరి విద్య కాదు ప్రకటంబుగ దిద్దియ! యంచు జెప్పగన్.

ఉ. వేసవివాఁగు లాచు బయిపేసమునూపెడు నాఁకువిద్య సం
తోస మొసంగి లోకుల సధోగతిద్రోయును బూటకంబుతో
గ్రాస మూపార్జనంబునకు గా దెనుగొన్నది లౌక్యవిద్య చే
తాసలఁగోసి శాశ్వతమువాత్తిమ విద్యయె విద్యనాఁ దగున్.

ఉ. ఎయ్యది స్వచ్ఛవృత్తి జనియింపఁగ బుద్ధిని వృద్ధిఁ జేయునో
ఎయ్యది తంత్రకల్మషనివృత్తి ఘటించునొ యేది ధర్మసా
హాయ్యమె పేదసాదల ప్యాదబ్జబికాస మొనర్చునో
ఎయ్యది శాంతిధామమెు యదే యగు నిద్ధమహార్హవిద్యనాన్.

VIZAGAPATAM MEDICAL STUDENTS



విశాఖపట్టణము వైద్యవిద్యార్థులు

THE LADY GRADUATES



యువతీస్నాతకలు

THE HINDI VIDYAPEETA, PRAYAG



హిందీ విద్యాపీఠము, ప్రయాగ

RAJAMANDRY HINDI PRACHARAK SANGAM



రాజమహేంద్రవర హిందీ ప్రచారక సంఘము

# కవిత్వ తత్త్వము

## కవికొండల వేంకటరావు గారు

తత్త్వము అనుపదము ఎచ్చటవచ్చినను మిగుల దుర్జ్ఞేయమైన పదము. "శరీరతత్త్వము" అని వాడుదుము. "శరీరము" అనుమాట సులభము. శరీరమును చూచుట-దానిరూపురేఖలను గొనియాడుట-దానిని చక్కగదిద్దుట - ఇదియెల్ల సులభము. కాని శరీరతత్త్వమును గమనించుట దుష్కరము. "వేదాంతతత్త్వము" అని మనము వాడుదుము. వేదాంత మనుమాట సులభము. వేదాంతప్రచారము వినుట-వేదాంతోపదేశములను పొందుట - వేదాంతులతో కలసితిరుగుట - ఇదియెల్ల సులభము. కాని వేదాంత తత్త్వమును గ్రహించుటమాత్రము దుష్కరము.

అట్లే కవిత్వమును కవిత్వతత్త్వమును. మన మొక కావ్యమును రసవంతముగ-రాగపురస్సరముగ - అనాయాసముగ చదువగలము. కాని ఆ కావ్యమందలి తత్త్వమును బోధచేసికొనుటయన్న ప్రయాసము. అట్లని తత్త్వవిచారణమును విడువరాదు.

తత్త్వము అనుమాట సర్వసామాన్యముగ మనము వాడుకొనునదియే! అందున వింతలేదు. దానిని శరీరపదముతో జతపఱచిన స్వభావమని యర్థమును చెప్పుకొనుచున్నాము. దానిని వేదాంతముతో జోడించిన పరమాత్మఅని అర్థము చెప్పుకొనుచున్నాము. దానినే ముక్కకుముక్కగ విడదీసి-తత్ =అది,త్వం=నీవు. అని ప్రతిపదార్థమును చెప్పుకొనుచున్నాము. కాని కవిత్వతత్త్వ మనుపదము క్రొంగ్రొత్తపదము. అయ్యది ఆధునిక విమర్శనాసందర్భమున నుత్పన్నమైనది.

కవిత్వమునకు స్వభావ మున్నదా? "బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్" అని మహాకవి యగు పోతన కవిత్వమును తీయమామిడిగున్నయొక్క క్రొంజివురుటాకంత కోమలమైన దానినిగ వర్ణించియున్నాడు. ఆంధ్రకవితాపితామహుడగు అల్లసాని పెద్దనార్యుడును ఇట్టులనే కవితను మిక్కిలి సున్నితమైనదానినిగ వర్ణించియున్నాడు. పింగళిసూరనామాత్యుడు "పలుకు నేర్పుట బహుతపఃఫలముగాదె" అని కవిత్వమును పూర్వజన్మవాసనాసంసిద్ధముగ సూచించియున్నాడు. కాళిదాసు "మందః కవియశః ప్రార్థీ" అనుచు కవిత్వమును ఎత్తైన చెట్టు కొట్టకొనకొమ్మను పండియుండి పొట్టివాని కందని ఫలమువలె దుర్లభమైనదానినిగ నుపమించి యున్నాడు. షేక్స్పియర్-స్థానికవర్ణనమును స్థానికస్ఫూర్తిని నొడకూర్చుదానినిగ నిరూపించియున్నాడు. మిల్టను స్వర్లోకవాసినినిగ నావాహనచేసియున్నాడు. వర్డ్స్వర్త్ "సకలజ్ఞానమునకు ప్రాణవాయువనియు, సకలాంతర్గత సార మనియు నిర్వచించి యున్నాడు. మేథ్యూ ఆర్నాల్డు "జనవిమర్శన" మని వాడియున్నాడు. కోలరిడ్జి "కళానందము" కొనియాడినాడు. రవీంద్రుడు దానినే "అనంతమైనదానినిగను శాశ్వతమైనదానినిగను" కీర్తించియున్నాడు. అరవిందుడు ఆకవిత్వమునే "ఆత్మవిశ్వసందర్శనముగ" హెచ్చరించి యున్నాడు.

ఇట్లు కవిపుంగవులచే వేయినోళ్ల నిరూపితముకాబడిన కవిత్వమునకు స్వభావములేదన నెవ్వరు సాహసింతురు? కవిత్వమునకు స్వభావ మున్నది. ఆస్వభావము నొక్కొక్కకవి యొక్కొక్కరీతిగ స్వస్వానుభవరచనావగాహన ప్రమాణములకొలది పొగడియున్నారు. ఒక్క ఉదాహరణము:

ఉ. "శ్రమణోదంచిత కర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో<br>
నవతంసాయిత కేకిపింఛములతో సంభోజధామంబుతో<br>
స్వవశుండై మధురాధరామృతముచే వంశమ్ము బూరించుచున్<br>
ఉవిదా! మాధవు డాలవెంట వనముం దొప్పారెడిన్ జూచితే"

అని పోతనామాత్యుడు భక్తిరసప్రబోధ మతికోమలముగ సూచించియున్నాడు. "ఉవిదా! మాధవు డాలవెంట వనముం దొప్పారెడిన్ జూచితే" అనువరణము - హృదయంగమమై - పాఠకుని హృదయమును సుద్బోధించుచున్నది. పైనివివరించిన వర్ణనమెల్ల బహుసరళభావబంధురితమై యున్నయది. "ఓభక్తుడా! కాళ్లకు గజ్జెలను చేతికి చిఱుతలను బుజమున దంబురయును ధరించి భజనము సేయుము! అదుగో! దేవుడు" అనిచెప్పుటకును పై పద్యమందలి సారస్యమునకు ఎంతయంతరమున్నదో ప్రతివారికిని గోచరమే. అట్లే "సత్యభామ శ్రీకృష్ణునకు భార్య. ఆవిడ శ్రీకృష్ణుని తన్నినది. తన్నగనే తన్నుతిని అతడు దాసిదాన్లు పట్టినాడు." అనుటకును—

శా. "జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన<br>
ర్చు లతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునన్<br>
దొలగం ద్రోచె లతాంగి. యట్లయగు నాథుల్ నేరముల్ సేయ నే<br>
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే!"

[వ. "నను భవదీయదాసుని మనంబున నెయ్యపుకిన్క బూని తాచినయది నాకు మన్ననయ. చెల్వగు నీపదపల్లవంబు మ<br>
త్తనుపులకాగ్రకంటకవితానము సోకిన నొచ్చునంచు నే<br>
ననియెద, నల్కమానవుకదా! యికనైన నరాళకుంతలా!"]

అనుటకును భేద మెంతకలదో యోచింపుడు. పద్యమందు క్రోధభావ మెంతకోమలముగ వర్ణింపబడినదో చూడుడు. మనుచరిత్రమునందు అల్లసానిపెద్దన మహాకవి చెప్పిన—

ఉ. పూతపసిండిపంటవలపున్ బవరించుకులమ్ము నీటికిన్<br>
లేరకదమ్మ, యిత్తెఱగు లేవు సురాంగన లెల్ల నిట్టి నీ<br>
సేవకు మెత్తురమ్మ, నయసేవకు తిన్ననిమేను వెన్నెలన్<br>
జేసు రటమ్మ, యింత కనువేదురు పెల్లునటమ్మ యింతికిన్"

అనుపద్యమునందలి సున్నితపుభావమును ఆ "నీటికిన్ లేరకదమ్మ", "తిన్ననిమేను వెన్నెలన్ జేసు రటమ్మ" అనుపదముల సౌకుమార్యమును-నిరుపమానములు గదా!

# అశ్వఘోషమహాకవి

దేవులపల్లి అప్పల నరసింహము గారు; ఎమ్. ఏ. ఎల్. టి.

అశ్వఘోషమహాకవి వ్రాసిన 'బుద్ధచరిత' యను మహాకావ్యము శ్రీతిరుపతివేంకటేశ్వరకవుల భాషాంతరీకరణమువలన నాంధ్రలోకమునకు పరిచితమై యున్నది గాని మన సంస్కృతపండితులును విద్యార్థులును దీనినిగురించి మిగుల నుపేక్షవహించియున్నా రని నానమ్మకము. ఉదారచరితుఁడగు బుద్ధదేవునిచరితము సర్వమతములవారికిని ఆనందదాయకముగ నుండవలసినది. దీనియందు హైందవవిద్యాలోకమునకు ఉత్సాహమును కలిగించుటకు కవెల్ పండితునివంటి పాశ్చాత్యవిద్వాంసులయొక్క ఉదారమగుకృషియే కారణము. చర్వితచర్వణముగ మనము పంచకావ్యములనుదక్క ఇతరములను గుర్తింప కుండుట తగదు. సరళపదజాలమును, శ్లోకములును అనతిదీర్ఘములును నగు సమాసములును, సులభగ్రాహ్యములును లలితములును అగు అనుప్రాసరూపకోపమానాద్యలంకారములును మనస్సునకు సంతసమును వికాసమును గలుగజేయువర్ణనలు నిందు గలవు. కథానాయకునిపుట్టుకకు మొదలు తపస్సిద్ధి వఱకును జరిగిన వృత్తాంతములను పొందుపఱచుటలో రచనాపటిమ సమానముగ నున్నది. మొత్తముమీద చదువరులకువిసుగుగలుగునట్టి గ్రంథభాగము లిందు లేవు. జన్మవృత్తాంతములను అందులకు సంబంధించిన నిమిత్తములను రాచనగరులోని ఉత్సవములను మొదటి సర్గయందును విద్యావిహారవిలాసములను రెండవసర్గమునందును వర్ణించెను. నాయకుని జీవితములో ముఖ్యమగు మార్పుగలుగు సందర్భమున సహజమైన మార్దవమును, పరలోక దుఃఖములను జూచినపైని మనస్సునగలిగిన వైరాగ్య సంరంభమును, చింతాప్రాదుర్భావమును విపులముగను మానవమనఃప్రకృతిని స్ఫురింపజేయగలుగునట్లుగను కవి వర్ణించియున్నాడు. బౌద్ధమతములకు అనవసరమైనను కవికిని జనసామాన్యమునకును రంజకములగు బంధువిలాపము బుద్ధునివెదకుట మఱలింపయత్నించుట అను భాగములు తగురీతిని భావపూర్ణముగఁ బ్రదర్శింపబడినవి. కడపటి నాలుగు సర్గలలోను బౌద్ధమతప్రచారమునుగుఱించియును ఆమతసిద్ధాంతములను గురించియును విస్తరించి వ్రాయఁబడినది. ఎంతయత్నించినను నాలుగు సర్గలును లభింపనందున అమృతానందుడను (బౌద్ధసన్యాసి) పండితుడు పూర్తిఁజేసె ననియును అని 1830 (క్రీ.శ.) సంవత్సరమునకు సమానమైన నేపాళమునుండి లభ్యమైన లిఖితప్రతియందు గానబడుచున్నది. అశ్వఘోషుఁడు వ్రాసిన ఆసర్గలుకూడ లభించు నెడల నవి హిందూవిద్వన్మండలమునకు అమోఘమగు ఆనందముఁ గలిగించి బౌద్ధధర్మముపట్ల నాదరణమును కలుగజేయు ననుకొందును.

2. వర్ణన: ఈ కావ్యమున వర్ణనలు చాల తక్కువ. ప్రకృతివర్ణనలు మిగుల కొలదిగను సూక్ష్మముగను నుండును. కపిలవస్తునగరవర్ణనము కావ్యారంభమునందు ఉచ్చబద్ధసూత్రితము లగు శ్లోకములతోఁ జేయఁబడె. కుమారసంభవమున హిమవంతునివర్ణనను జ్ఞప్తికిఁ దెచ్చును. రాజకుమారుఁడగు బుద్ధుఁడు ఉద్యానమునకు వెడలు సందర్భమున నగరాలంకారమును వర్ణించునవి ఈ క్రిందిశ్లోకములు:

శ్లో. తతః ప్రకీర్ణోజ్జ్వల పుష్పజాలం విషక్తమాల్యం ప్రచలత్పతాకం
మార్గం ప్రపేదే సదృశానుయాత్రః చంద్రః సనక్షత్ర ఇవాంతరిక్షమ్
కౌతూహలాత్ స్ఫీతతరైశ్చ నేత్రైః నీలోత్పలార్ధైరివ కీర్యమాణః
శనైశ్శనైః రాజపథం జగాహే పౌరైః సమంతాదభివీక్ష్యమాణః.

బుద్ధునికిని మారునికిని గలిగిన పోరాటమును 13 వ సర్గలో వర్ణించుచు మనోభావసంబంధద్యోతకముగ జేయక రణవీరుల కథలలో వలె శస్త్రాస్త్రప్రయోగమయము నగు యుద్ధముగా వర్ణించుట ప్రౌఢమనస్కులగు చదువరులకు రసహీనముగా దోఁచవచ్చును. పార్వతీదర్శనమువలనను మదనునిసమ్మోహనసాయకములవలనను తపస్వియగు శివునకు గలిగిన మనోభావవికారము చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినది. మన్మథుని సాయుధమూర్తిత్వము ఒక్క శ్లోకములో మాత్రమే సూచింపబడినది. ప్రాచీనాంగ్లభాషలోని కొన్ని కావ్యములలో సత్యశ్రేయుఁడగు క్రీస్తు కవచధారియు శూలపాణియు యోధుడునై మూర్తిభూత మగు అరిషడ్వర్గమో యన తన్నెదిరించు సైతానుమొదలగు దయ్యములను పాఱ ద్రోలినట్లు వర్ణింపబడినాడు. ప్రాఁకవి యగు మిల్టను క్రీస్తునకు సైతానునకు జరిగినపోరాటమును మనోభావపరీక్షక మగువివాదముగా నిర్మించియున్నాడు. కాని అశ్వఘోషుఁ డటులఁజేయలేదు. ఇది బౌద్ధగ్రంథములలోని వర్ణన సంప్రదాయము ననుసరించి యుండు ననుకొనెదను.

3. పాత్రపోషణము: నాయకుని ధీరోదాత్తత వినయము భూతదయ ఆయాచోట్ల నుచితరీతిని ప్రదర్శింపబడియున్నవి. కొన్నిచోట్ల "గర్వితుడై పలికెను" అని చెప్పుట యాధీమంతుని వినయమునకు కళంకముగ నగుచున్నది. [సర్గ 9. శ్లో. 69.]

బుద్ధునితండ్రి యగు శుద్ధోదనరాజుయొక్కయు, బుద్ధునిభార్యయగు యశోధరయొక్కయు విచారమును నిరూపించుటలో కవి మంచి కౌశలమును ప్రదర్శించియున్నాడు. మృదులములగు మానవభావములను సరసముగఁ గనబఱచియున్నాడు. వనవాసగతుఁడగు బుద్ధుని వార్త విని శుద్ధోదనమహారాజు రామశోకపరితప్తుఁడగు దశరథునివలె స్మృతి దప్పి ఇట్లు విలపించెను:

శ్లో. దశరథ ఇవ రామశోకవశ్యో బహు విలలాప నృపో విసంజ్ఞకల్పః
ఇమే పరీప్సంతి హి మే పిపాసవో మమాసవః ప్రేతగతిం యియాసవః.

బుద్ధుని పుట్టుకసమయమందు పెద్దలు ఏమని ఆశీర్వదించెదరో వంశాభివృద్ధి ఎట్లుండునో యను సాందోళము కుమారునికి చింతాక్లేశము కలుగకుండ జేయు ఏర్పాటులు, కుమారుని సన్న్యసింపకుండ మఱలింపు

జాలిమాటలు పన్న్యసించినవెనుక పంపినసందేశము అన్నియు అముదునలి రాజునందు చదువరికి అనురాగమును జాలినిఁ గొలుపునదిగ నిరూపింపఁబడియున్నవి:

శ్లో. వమాపి కామం హృదయం సుదారుణమ్
శిలామయం వా హ్యయసాపి వా కృతమ్
అనాథవత్ శ్రీరహితే సుఖోచితే వనంగతే ధర్మరతే యశస్వినీ దీర్యతే॥

యశోధరావిలాపసందర్భమునందుఁ గల యీ శ్లోకము కుమారసంభవములోని యీ క్రింది శ్లోకభాగమును అనుకరించునట్లు తోఁచుచున్నది చూడుడు:

శ్లో. న విదీర్యే కఠినాః ఖలు స్త్రియః (VIII 60 70)

మొత్తముమీఁద యశోధరావిలాపము కొంతవఱకు రతీవిలాపము ననుకరించుచున్నది.

సుఖం విధిః మా మపహాయ రోషణామ్।
మహేంద్రలోకే ఽప్సరసో జిఘృక్షతి॥

ఈశ్లోకము రతీవిలాపములోని యీ క్రిందిశ్లోకమును పోలుచున్నది.

శ్లో. అహ మేత్య పతంగవర్త్మనా పున రంకాశ్రయిణీ భవామి తే
చతురైః సురకామినీజనైః ప్రియ యావ న్న విలోభ్యసే దివి

యశోధరాపాత్ర మింకను విపులముగా పోషించిన బాగుండు ననుకొనియెదను. యశోధర తన్ను రోషణ (అనఁగా కోపన) అనుకొనుటకు తగిన కారణమును కవి కనఁబరచియుండలేదు. రతి తన దేవతాత్వమును మఱచి అగ్నిప్రవేశముఁ జేసి ప్రియుని కలసికొనియెద ననుటయు వింతగా నున్నది. రతిమన్మథులు దేవతలు గారా? లేక ఆకాలమునకు అమృతమునకొఱకు పాలసముద్రము తరువఁబడలేదా? కవిభావనలు నిరంకుశములు. అనువాదమున గాని వీనిని సమర్థింప వీలులేదా? తక్కినపాత్రములలో ముఖ్యమైనవి లేవు. గుఱ్ఱపువాఁడును సారథియును నగు ఛందకుఁడును, రాజుచే కుమారుని మఱల్చుటకు పంపబడిన మంత్రిపురోహితులును, సూచనమాత్రముగా ప్రదర్శింపబడినారు. వారు రాజు నోదార్చుట-తరువాత కుమారునికి బోధసేయుట-వారిబ్రాహ్మణజన్మమునకును రాజభక్తికిని, బుద్ధిసంపదకునుఁదగినధీరత్వమునుమార్దవమునుకలిగియున్నవి.బుద్ధుని మనస్సు స్త్రీలవైపు మఱల్చుటకు 4వ సర్గములో రాజుచే నేర్పరుపబడిన స్నేహితుఁడు చేయుపని యెట్టిదైనను స్నేహభావముతోను నేర్పుతోను రాజుహితముకొఱకు నెఱవేర్చినాఁడు. 10వ సర్గలో మగధరాజగు బింబిసారుఁడు ఉదారభావముతో మహాత్ముఁ డగు బుద్ధుని సగౌరవముగఁ బ్రేమఁజూచుచు గృహస్థాశ్రమమునకు మఱలింప యత్నించియు నతని విషయ కామనింద జేయుగా విస్మితుఁడై "మహాత్మా నీవు జ్ఞానమును పొందినవెనుక నన్నుఁ గృతార్థునిఁ జేయుము" అని ప్రార్థించెను.

**4. కవికాల ప్రశంస:** కవెల్ పండితుఁడు ఆర్యన్ సిరీస్ మొదటివాల్యుము ఏడవపాళ్లలో బుద్ధచరితకు ఉపోద్ఘాత వ్రాయుచు నీతఁడు సభాకావ్యకర్తలకు (అనఁగామహాకావ్యకర్తలకు) మార్గదర్శకుఁడనియును, కాళిదాసునకు ముందువాఁ డనియును, వ్రాసియున్నాఁడు. ఇందులకు రెండు ముఖ్యకారణములు జెప్పియున్నాఁడు. (1) కాళిదాసునకు బౌద్ధమతము బాగుగఁ బరిచితమని అతని నాటకములవల్ల తెలియును. ఈ వాదమునకు బదులు చెప్పుట సులభము. అశ్వఘోషునకు కుమారసంభవ కథ — శివుని తపస్సు, మన్మథుని పోరాటము — తెలిసినట్లు ఈకావ్యపాఠకులకు నసేకచోట్ల కనుపట్టును. కాన అశ్వఘోషునికాల నిర్ణయమునకు ఇది ఆధారము కానేరదు. బుద్ధచరితను గాక కొన్ని స్తుతి పుస్తకములను కూడ నీతఁడు రచియించె ననియు ప్రాచీన బౌద్ధమతాచార్యులలో నీతఁడు నొకఁ డనియును, నాగార్జునార్యదేవాచార్యులకు ముందువాఁ డనియు, ఇట్సింగ్ అను చీనాయాత్రికుఁడు (675 క్రీ. శ.) సంవత్సరమున వ్రాసియున్నాఁడు. ఈకావ్యము క్రీ. శ. ఐదవ శతాబ్దప్రారంభములో చీనాభాషలోనికిఁ దర్జుమా చేయబడె నని కవెల్ పండితుఁడు చెప్పుచున్నాఁడు. ఇండియాలో ప్రసిద్ధినొందుటకు సుమారు రెండుశతాబ్దములు పట్టియుండవలెను. అశ్వఘోషుఁడు మూడవ లేకనాలవ శతాబ్దివాఁడై యుండవలెను నని కవెల్ పండితుని అభిప్రాయము. 'ఒకటవ శతాబ్దపు రాజగు కనిష్కునకు మిగుల సహాయముచేసిన గురువు ఈ అశ్వఘోషుడే అయి యుండు ననుటకు వీలుకలదు అని సూచించుచున్నాఁడు. బొంబాయి కాశీపండితుఁడు ప్రబలనిదర్శనములతోఁ గాళిదాసు క్రీస్తుకుముందు ఒకటవ లేక రెండవ శతాబ్దిలలో నుండినవాఁ డనియు అగ్నిమిత్రరాజు నొద్దనో అతని పుత్రపౌత్రులలోనో ఏ యొకరి ఆస్థానమునో అలంకరించి రాజవంశమునకు శ్రీతికర మగు మాళవికాగ్నిమిత్ర మను నాటకమును వ్రాసియుండవలె ననియు నభిప్రాయము నిచ్చియున్నాఁడు. కాశీగారి అభిప్రాయమునుబట్టి అశ్వఘోషుని కనిష్కరాజునకు గురువుగా నొప్పినను అతఁడు కాళిదాసునకు ముందువాఁడని చెప్పుటకు వీలులేదు. హానుత్సాంగు అను చీనాయాత్రికుఁడు — అశ్వఘోషుఁడు దేవుఁడు, నాగార్జునుఁడు, కుమారలబ్ధుఁడు ప్రాచీనగురువు లని క్రీ॥ శ॥ 444 సంవత్సరమున వ్రాసియున్నాఁడు. ప్రాచీనశబ్దమునకు ఎన్ని శతాబ్దములు వెనుకకు లెక్కపెట్టవలయునో నిర్ణయింపవీలులేదు.

ii **రెండవవాదము:** మూఁడవసర్గలోబుద్ధుఁడు వచ్చుచున్న వార్త నాకర్ణించి పెద్దల అనుజ్ఞనుపొంది అనేకవిధముల సంభ్రమముతో గవాక్షములయొద్ద గుమిగూడి చూచుచున్న పురస్త్రీలను వర్ణించుటలో "ముఖములు మేడల నలంకరించుటకై ఉంచిన పద్మగుచ్ఛముల వలె నున్నవి" అని కవి వర్ణించినాఁడు. ఇది 3వ సర్గలోని 19వ శ్లోకము. మఱల నీ వర్ణననే స్వల్పభేదములతో 21వ శ్లోకమున కూడ జేసియున్నాఁడు. చూడుడు:

శ్లో. వాతాయనేభ్యస్తు వినిస్సృతాని పరస్పరోపాసిత కుండలాని
స్త్రీణాం విరేజు ర్ముఖపంకజాని సక్తాని హర్మ్యేష్వివ పంకజాని
తతో విమానై ర్యువతీకలాపైః కౌతూహలోద్ఘాటిత వాతయానైః
శ్రీమత్సమంతా న్నగరం బభాసే వియద్విమానై రివసాప్సరోభిః॥
వాతాయనానా మవిశాలభావా దన్యోన్య గండార్పిత కుండలాని
ముఖాని రేజుః ప్రమదోత్తమానామ్ బద్ధాః కలాపా ఇవ పంకజానామ్.

రఘువంశములోను కుమారసంభవములోను పెండ్లికుమారు లగు అజుఁడును శివుఁడును అత్తవారియూరఁ బ్రవేశించునవసరమునఁ గూడ నిట్టి వర్ణనలే కలవు. చూడుడు:

సూర్యునియందైనను మచ్చలఁ జూపకలసియుండును. కవుల తారతమ్యముల గ్రహించుట కిదియె మార్గము. కవిత్వములోని రసాస్వాదనకు ఇట్టి విమర్శనములు తోడ్పడును. ఇది కవి ప్రతిభానిరసనము కాదని చదువరులు గ్రహింపవలెను. సంస్కృతవాఙ్మయమున సభాకావ్యనిర్మాతలలో కాళిదాసాశ్వఘోషులు సమముగ ప్రథమమార్గదర్శకు లని చెప్పవచ్చును. ఇద్దఱును వాల్మీకినుండియే ప్రతిభాదీప్తి నొందినవారుగాని కాళిదాసుని ఉపమానములలో లాలిత్యము, స్వాతంత్ర్యము, ఔచిత్యము తఱుచుగా నుండును. అశ్వఘోషుని ఉపమానములలో అక్కడక్కడ స్వాతంత్ర్య మున్నను, ఔచిత్యము తక్కువగుని తోఁచును. మీఁదను నాకోపమను దాహరించితిని. 6-వ సర్గలో సన్యసించినబుద్ధునకు సారథి యగుఛందకుడు చెప్పువాక్యములలో వాడిన ఉపమానములు ఔచిత్యశూన్యములని తోఁచును. ఉపమానభాగములు వదలినచో ఛందకుని మిగిలిన వాక్యములలో కరుణరసము సమంజసముగ నున్నది. చూడుఁడు సర్గ 6. శ్లో 31-34. కాని మెుత్తముపైన ఈయనయుదాహరణములు చాల వఱకు మనోజ్ఞములుగను సరసములుగను నుండును. కొన్నిటిని పరికింపుడు:

1. సంధ్యాభ్రజాలోపరి సన్నివిష్టం నవోడురాజం విజిగాయ లక్ష్మ్యా॥

2. ముహుర్ముహు ర్మదవ్యాజ ముక్తనీలాంశుకా పరా । ఆలక్ష్యరశనా రేజే స్ఫురద్విద్యు దివ క్షపా. (iv 33.)

3. ప్రతి సంకుచితారవిందకక్షాః సవితర్యస్తమితే యథా నలిన్యః॥ (v 59)

ఈ నిదరశ్లోకోక్తరీతి వాల్మీకిసుందరకాండమున 10-35 వ నిట్లు గానవచ్చును: ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే పున స్సంవృతపత్రాణి రాత్రావివ బభు స్తదా॥

అశ్వఘోషుఁడు ఉదాహరణములలో భారతరామాయణగాథలను వాడుట తఱుచు కనఁబడును. ఇది గాక అనేక పురాణగాథలను తడవుచున్నాఁడు. ఆయాగాథలను విమర్శించినయెడల ఈతనికాలమునకు ముందున్న పురాణము లేవో తెలియ వీలగును. ఇట్టి ఉదాహరణము నొకటి నిచ్చెదను.

ఐడశ్చ రాజా...లోభాద్ద్విషిభ్య (?) స్తవశం జహీర్షుః
జగామ నాశం విషయేష్వశక్తః (xi. 15.)

ఐడవి నాశనకథ ఋగ్వేదమునందును భాగవతమునందును గలదు. కాని ఋషిధనమును అపహరించుటవలన నశించెను అనుట క్రొత్త. ఇందుల కాధార మేమొ?

6. కథాసంక్షేపణక్రమము: ఈమహాకావ్యమున కథానాయకుడు సర్వార్థసిద్ధియు అహింసాబోధకుడును అగు బుద్ధదేవుఁడు. ఇందు 17 సర్గలు కలవు. సర్గాంతగద్యలయందు వరుసగ నీ క్రింది పేరుంచబడి యున్నవి. 1. భగవత్ప్రసూతి 2 అంతఃపురవిహారము 3. సంవేగోత్పత్తి. 4. స్త్రీవిఘాతనము. 5. అభినిష్క్రమణము. 6. ఛందకనివర్తనము 7. తపోవనప్రవేశము 8. అంతఃపురవిలాపము 9. కుమారాన్వేషణము 10. శ్రేణ్యాభిగమనము 11. కామవిగర్హణము 12. అరాడదర్శనము 13. మారవిజయము 14. అభిసంబోధనసంస్తవము 15. ధర్మచక్రప్రవర్తనాధ్యేషణము 16. ధర్మచక్రప్రవర్తనము 17. లుంబినీయాత్రికము అని. కడపటి నాలుగు సర్గలును మతసంబంధములైనవి. బౌద్ధమతప్రచారమును వర్ణించుచున్నవి. కావ్యములోని రసవంతమగు భాగము మారవిజయముతో ముగిసినది.

నాయకుని జననమునకుఁ బూర్వమే ఇంద్రాదిదేవతలు మానవోద్ధారణకై బుద్ధుఁడవతరించు నని కుతూహలము గలిగియుండిరి. శుభముహూర్తమున బుద్ధుఁ డుద్భవింపఁగనే దేవతలు వచ్చి అంతరంగగాధారలచే నభిషేకముచేసి ఆశీర్వదించిరి. తర్వాత అసితుడనుఋషి వచ్చి చూచి ఉప్పొంగి కన్నీరు గార్చెను. శుద్ధోదనమహారాజు భయముతో శంకించెను. అందుపైని అసితుడు నీవు వేఱువిధముగాఁ దలఁపవలదు. నేను ముసలి నగుటచే ఈమహానుభావుడు జీవలోకరక్షణధర్మమును బోధించువఱకు జీవింపనుగదా యని విచారించితి ననెను. రాజు సంతసించి జాతకర్మాదులను ఉత్సాహముతో జరిగించెను.

తరువాత యుక్తవయస్కుడైన బుద్ధుడు కౌశికమునివరుని సహాయమాత్రమున స్వల్పకాలములో సకలవిద్యల నభ్యసించి యశోవిశాల యగు 'యశోధరాదేవి'ని పరిణయ మాడెను. సకల శృంగారాస్పదములు సుఖానందపరిపూర్ణములు నగు భవనములు విమానములు ఈయనకొఱకు ఏర్పాటుచేయఁబడినవి. రాజు ఈతఁడు సన్యసించునను భయముచే విచారజనకములగు వస్తువులను గాని అసహ్యకరములగు మనుష్యులను గాని యూరికి దరిచేరనీయలేదు.

ఇట్లుండ నొకనాఁడు పురోద్యానవిహారముకొఱకు రాజకుమారుఁడు రాజమార్గమునఁ బోవుచుండఁగా, జరారోగజీర్ణాంగుఁడగు మనుజుఁ డొకఁడు దేవప్రేరితుఁడై వెలువడియెనఁట. రాజకుమారుని దృష్టి వానియందు లగ్నమాయెను. సారథి వచింపఁగా, నాతఁడు ఎల్ల జీవులకును జరావ్యాధిమృత్యుభయము తప్పదనెను. ఉద్యానవనమునకు పోవక రాజకుమారుడు విచారముతో భవనమునకు మరలెను.

ఇంకొకమారు తిరిగి వెళ్లునపుడు శ్మశానమునకుఁ గొనిపోబడుచున్న శవ మగపడఁగా సారథిని ప్రశ్నించి బుద్ధుడు మనస్సును చింతామగ్నమును గావించుకొనెను. ఉద్యానములో స్త్రీలనేకవిధముల యౌవనశోల్లాసముల నీతని కరఁగింప యత్నించియు విఫలలైరి. రాజుచే నియోగింపఁబడిన స్నేహితుని బోధలు గూడ నిష్ఫలము లాయెను.

జరా వ్యాధిశ్చ మృత్యుశ్చ యదిన స్యా దిదం త్రయం
మమాపిహి మనోజ్ఞేషు విషయేషు రతి ర్భవేత్

అని బుద్ధుడు జవాబిచ్చెను. సకలంతయు ఉద్యానవనము నలంకరించి జనశోభ సాయంతనమున దానిని వదలుటను జూచి అన్నివస్తువుల యందును గల అనిత్యత్వమును ఆలోచించుచు రాజకుమారుఁడు తిరిగి తనభవనమును ప్రవేశించెను.

మరి కొన్నాళ్లకు మంత్రిసుతులు చిత్రకథలు చెప్పుచు వెంట రాఁగా, వనభూమి చూచుకుతూహలముతో బయలు వెడలి "వ్యవసాయమువలన నశింపఁ జేయబడిన మొక్కలను చిన్న పురుగులను చూచి

తన బంధువుల నాశమునకుఁ బోలె దుఃఖించుచు గాలి, ఎండ, ధూళి వీనిచే వర్ణము మారియున్న కర్షకులను నాగలి లాగు శ్రమచే నలిగియున్న ఎడ్లను జూచి మిగుల జాలినొంది అనుచరులను విడిచి ఒంటరిగా నొక జంబూవృక్షము క్రింద కూర్చుండి తనబుద్ధిని నిర్మలము చేసికొన యత్నించెను. అంతలో అదృశ్యరూపమున సన్న్యాసియొకడు "నేను జన్మమృత్యుభీతుఁడనై మోక్షమార్గమును వెదకికొనుటకు సన్న్యసించితిని" అని చెప్పి ఆకాశమార్గమునఁ బోయెను. తరువాత రాజకుమారుఁడింటికిఁ బోవుచుండగా "ఆహా! ఇటువంటి పతిఁగల భామిని సుఖమును నిర్వాణమును బొందినదే కదా." అని యనునొక కాంతమాటలను విని శాంతిని బొందెను. వెంటనే సభాసీనుఁడగు రాజునొద్దకుఁ బోయి తాను సన్న్యసించుటకు అనుజ్ఞనిమ్మని కోరెను. రాజు వానిని బ్రతిమాలి మరలింప యత్నించెను. పిమ్మట నంతఃపురమున స్వర్ణసింహాసనముఁ గూర్చుండెను." అంతఃపురజనులు మృదంగవేణువీణాదులతో నాతనిని సేవించిరి. కాని దైవప్రేరితమై ఒక్కుమ్మడిగా వారిని నిద్ర ఆవేశించెను. ఆ నిద్రావశలైన యువతుల చేష్టలవలన బుద్ధునకు మనసు విరిగి యిదియే సమయమని బయటికిఁజని సారథిని బిలువఁగా నతఁడును దైవప్రేరితుఁడై కఠినమైన రాజాజ్ఞ నెఱింగియు రాజకుమారునికొఱకు గుఱ్ఱమును దెచ్చెను. గుఱ్ఱముకూడ నిశ్శబ్దముగా వచ్చెను. దానిని ప్రేమతో బుద్ధుఁడు కౌఁగిలించి తనహస్తకమలములతో నిమిరి సేనలోనికిఁ బోవు వీరునివలె మధురములగు మాటలతో బుజ్జగించి దాని నధిష్ఠించెను. దైవమాయవలన ద్వారములన్నియు తమంతట తెఱచుకొనియెను. యూరు వెలుపడినతరువాత బుద్ధుఁడు వెనుకకుఁదిరిగి "జననమరణములయొక్క ఆవలితీరము గనుఁగొనక కపిలవస్తుపురమును తిరిగి నేను ప్రవేశింపను" అని ప్రతిజ్ఞచేసి వెడలెను.

దైవమాయాసహాయమున బహుయోజనములఁ గడచి "భార్గవాశ్రమ"మును "భృగువు ఆశ్రమమును" జేరెను. గుఱ్ఱము దిగి ఛందకుని మంచిమాటలతో మరలింపుమని కంథక యను పేరుగల ఆ ఉత్తమాశ్వము వేడికన్నీళ్లను విడుచుచు రాకుమారుని పాదముల స్పృశింపఁగా- స్నేహితునితో మాటలాడినట్లు మాటలాడి వదలెను. ఇంద్రుఁడొక వేటగానివలె కాషాయవస్త్రములను ధరించిరాఁగా బుద్ధుఁడు అవి తనకిమ్మని పుచ్చుకొని ధరించెను. ఛందకుఁడు చేయునదిలేక గుఱ్ఱమును బట్టుకొని ఏడ్చుచు అవశుఁడై ఖాళీపడుచు శరీరమాత్రముతో పురమును జేరెను. అట బుద్ధుఁడు ఆశ్రమవాసుల తపోమహిమ క్రియలను జూచి తృప్తినొందక వింధ్యప్రాంతమున నున్న "ఆరాడ" ముని ఆశ్రమమును వెదకికొనుచుఁ బోయెను.

ఎనిమిదవ సర్గ అంతఃపురవిలాపముతో నిండియున్నది. ఈసర్గ ఎంతయు కవియొక్క శైలీమాధుర్యమును అంతరంగిక భావగ్రహణ కౌశలమును కనబఱచుచున్నది. చక్కనినాటకరంగమును బోలియున్నది.

9 - వ సర్గలో మంత్రిపురోహితులు బుద్ధుని వెదకి కనుఁగొని బోధించి మరల్పఁజూచిరి గాని విఫలప్రయత్నులై పురమునకు తిరిగి వచ్చిరి.

అటుపైని బుద్ధుఁడు ఆరాడాశ్రమమును వెదకికొనుచు "రాజగృహ" మను మగధరాజ్యముఖ్యపట్టణమును జేరి భిక్షఁజేసికొని యూరి వెలుపల నుండు కొండప్రక్కను విశ్రమించియుండెను. మగధరాజు బింబిసారుఁడు (శ్రేణికుడు) ఈతనిఁజూచి హితవాక్యములచే సంసారమార్గమునకు మరలింపఁజూచెను. బుద్ధుఁడు కామవిగర్హణముచేసి ప్రత్యుత్తరమిచ్చెను. 11-వ సర్గయంతయు నీ కామనిందతో నిండియున్నది. జ్ఞానమోక్షమార్గములఁ గనుఁగొని తన్ను ఉద్ధరింపవలసిన దని బింబిసారుఁడు వేడికొని పురమునకుఁ బోయెను. బుద్ధుఁడు ఆరాడమునిని దర్శించెను. ఆయనయొక్క ఆదరణకు సంతసించెను గాని ఆయనయొక్క వేదాంతము దనకు మిథ్యయని తోఁప అక్కడనుండి రుద్రకమునికడ కేగెను. అక్కడను తృప్తిఁగాంచక నైరంజనానదీతీరమున కేగి తపముఁజేయ నారంభించెను. కాని క్రమముగా ఆ తపస్సువలన లాభము లేదని గ్రహించి నడ్డి బిగించుకొని అశ్వత్థమూలమునఁ గూర్చుండి ధ్యానించుచుండెను. ఈసందర్భమున నే మారునితోఁ బోరి బుద్ధుఁడు విజయము గాంచెను.

14-వ సర్గములో బుద్ధునికి దివ్యజ్ఞాన మలవడుట తెలిసి అర్హతులు ఆ కేతులు వచ్చి స్తుతించుట వర్ణింపఁబడెను. తరువాతిసర్గలలో బుద్ధునిసంచారము, ధర్మచక్రప్రవర్తనము, స్వరాజ్యమునకు వచ్చి తాను పుట్టిన "లుంబినీ" అను పేరుగల ఉద్యానమున బసచేసి తనవారల నంద అను మోక్షమార్గమునకుఁ ద్రిప్పుటయును విపులముగాఁ జెప్పఁబడినవి.

7. కథాపోషణ విమర్శనము: ఇట్టి మహాత్ముని చరిత్రము కథావస్తువుగాఁ గలది ఆధ్యాత్మికకావ్య మనవొప్పును. వైరాగ్యపూరితమై శాంతరసప్రధానమైన యీకథను 2, 3, 4, 5 సర్గలలో బుద్ధుని అంతఃపురవిహారములయందు వివిధశృంగారరసకళలతోను, 8-వ సర్గలో బుద్ధునిప్రత్యేబనానంతరము అంతఃపురవిలాపకరుణారసముతోను మారుని సమరసందర్భమున వీరరసములోను భూతగణముల వర్ణనమందు కొంచెము హాస్యరసస్పర్శ గలిగిన భయానకరసములోను ఉదారచరితుఁడగు నాయకునకు దైవసహాయమును సూచించు ఆయాసందర్భములయందు హృదయమునకు మితిమీఱిన వికాసమును ప్రమోదమును గలిగించు నద్భుతరసములోను పలురసముల సమ్మేళనమును గోరు సారస్వతాసక్తులగు సామాన్యచదువరులకు ఇంపుగొలుపునట్లు కవి యొనర్చినాఁడు. మామూలుగ బుద్ధచరితలో మనము వినుచుండు కొన్ని యంశములను ఈకవి వదలినాఁడు. (1) బుద్ధుఁడు ఒక చెట్టుక్రింద కూర్చుండియుండ ఆయనమాహాత్మ్యముకలన ఆనీడ పొద్దు తిరిగినను కదలకుండెనట. ఇది "లలితవిస్తర" మను బౌద్ధగ్రంథముఁ గలదు. కాళిదాసు రఘువంశములో రాముఁడు సీతతోడనై కలసికొని చెట్లనీడల నిద్రింప నిట్టులే చెట్లనీడ నిశ్చలముగా నుండుట చెప్పియున్నాఁడు. ఈయద్భుతకథ అశ్వఘోషుని కాలమునకు చెప్పఁబడియుండలేదనియు కాళిదాసు లలితవిస్తరమునుండి గ్రహించెననియు కవెల్ పండితుని అభిప్రాయము. పురాణము చెప్పను ఇప్పటినున్నరీతిగా వ్రాయఁబడినను వానిలోని గాథలుమాత్రము సనాతనము లని వీబరు పండితుఁడును మెక్డొనెల్ పండితుఁడును ఒప్పుకొనియున్నారు

ఇట్టి అద్భుతములను పురాణ గాథలలోనుండి ప్రజలు, ప్రజల నుండి కాళిదాసాదికవులు సామాన్యముగా గ్రహించి యుందురు. (ii) బుద్ధుఁడు రాత్రి నగరువిడిచి వెళ్లుటకు ముందు నిద్రించుచున్న యశోధరను - పిల్లవానిని - విడువలేక ముమ్మారు తిరిగివచ్చి చూచి శయ్యకు ప్రదక్షిణము జేసి ముఖముపై వస్త్రము గప్పుకొని పడకగది విడిచి వెళ్లెనని సర్ ఎడ్విన్ ఆర్నాల్డు కవియొక్క "లైట్ ఆఫ్ ఏషియా" అను కావ్యమున ఆంగ్లవిద్య నభ్యసించినవారికి తెలిసినవిషయము. ఇది కావ్యమునకు మితిలేని వన్నెపెట్టు నంశము. అశ్వఘోషుఁడేల వదలెను? (iii) లలితవిస్తర మను గ్రంథమున యశోధర, గోప, మృగాజ్ఞ యను ముగ్గురుభార్యలును, అఱువదివేలయువతీయుతమగు నంతఃపురమును ఉండెనని చెప్పఁబడియున్నది. యువతీజన సంఖ్యను పెంపుగా ప్రదర్శింపక పోవుటయును, ఒక్క యశోధరాదేవిని మాత్రమే పేర్కొనుటయును, 8-వ సర్గములోని కరుణారసపుష్టికి తోడ్పడిన వని నా అభిప్రాయము. (iv) బుద్ధుతల్లి యగు మాయాదేవి యాతఁడు పుట్టిన కొలఁదికాలములోనే మృతినొందె నని చెప్పఁబడి యున్నది. అశ్వఘోషుఁడు ఆమె బ్రదికియున్నట్లును, సన్న్యసించుట విని దుఃఖించినట్లును, వర్ణించియున్నాఁడు. (viii-24, vi-32) కాని మెఱి యాశ్లోకమున (vii-24) గౌతమి యని పిలువఁబడియున్నది.

## 8. కాళిదాస వాల్మీకులతో పరిచయము:

మొత్తముమీఁదనీమహాకావ్యము వాల్మీకిరామాయణశైలిని అనుకరించుఆసక్తిని కనఁబఱచునట్లు దోఁచుచున్నది. కాని కథావస్తువు కొంచెముగా నుంచుకొని చిత్రవిచిత్రములగు నలంకారములు, వర్ణనలు, ఉత్ప్రేక్షలు ముఖ్యమైన ఆదర్శములుగ నుంచుకొన్నటుల కనఁబడుచున్నది. మనోభావ ప్రదర్శనములలోఁగాని వర్ణనలలోఁగాని భారతరామాయణములనుండు ఉత్సాహముగాని విరివిగాని లేవు. సామాన్యజనులకుతూహలమును వృద్ధి జేయురీతి వేఱు. రాజసభలను రంజింపఁజేయురీతి వేఱు. దీనికి భావ సూచనయందును రచనయందును నేర్పు మితవాక్యసరళియు ప్రధానములు. దానికి భావములను నొక్కినొక్కి చెప్పుట, అతిశయముగ వర్ణించుట అవసరము. సభాకావ్యములలో కథకు నగమునగము సంబంధము గల ప్రసంగములకును గాథలకును చోటు లేదు. ఇందుచేతనే "కుమారసంభవ" మను పేరునుబట్టి, కుమారస్వామిజన్మతరువాతిసర్గలు కాళిదాసు రచించినవి కావని కొంద అభిప్రాయపడుచున్నారు. అయితే, రఘువంశము విషాదాంతమయి యున్నది. ఇట్టిది కావ్యమునకుఁ గూడునా? కాళిదాసుకావ్యములలో నొకటి 17, యింకొకటి 19 సర్గలు కలిగియున్నవి. ఒకటి అనుకొన్న కథను మించియున్నది; ఇంకొకటి అనుకొన్న వంశావళిని ముగింపక విరమించినది. సభాకావ్యములకు క్రొత్తత్రోవదీయుటలో నియమములు పెట్టుకొనకుండ వ్రాసినా? అశ్వఘోషుఁడు తన కావ్యమునకు 17 సర్గలను నియమించినాఁడు. అశ్వఘోషుఁడు వ్యాసవాల్మీకుల పేర్లను స్మరించినాఁడు. వాల్మీకిరామాయణముతోఁ గల సంబంధము పుస్తకమందంతటను స్ఫురించును. అనుప్రాసయందు అశ్వఘోషుఁడు వాల్మీకికి శిష్యుఁడని తోఁచును. ఉదా:

> తచ్ఛ్రుత్వా స ప విచచార రాజమానః
> కైలాసో గిరి రివ నైకచిత్రసానుః.

శ్లేష మొత్తముమీఁద కనఁబడదు. "అవ" ధాతువు బుద్ధుఁడు బింబిసారుని ఆశీర్వదించు శ్లోకమున ననేకార్థములలో వాడిన ట్లున్నది.

> అథేంద్రవ ద్దివ్యవ శశ్వ దర్కవత్
> గుణైరవ శ్రేయ ఇహావ గామవ
> అవాయు రార్యై రవ సత్సుతా నవ
> శ్రియశ్చ రాజ న్నవ ధర్మ మాత్మనః.

'పరా' అను ఉపసర్గగల 'ఇ' ధాతు వొకటి క్రమాలంకార మొకటి ఈ కవికి ప్రియము లని ఈసందర్భమున చెప్పవలసియున్నది. "పరైమి" "పరేహి" ఈశబ్దములు తఱచుగా కనఁబడును. క్రమాలంకారములు మెండుగఁ గలవు. క్రమాలంకారము రామాయణములో కనఁబడదు. కాళిదాసునందును నాచదివినంతవఱకు లేదని జ్ఞాపకము. అశ్వఘోషుని అనుప్రాసలు మాత్రము వాల్మీకిని పెక్కుచోట్ల స్ఫురణకు దెచ్చుచున్నవి. ఉపమానములలోఁగూడ వాల్మీకిస్ఫురణ 6-వ సర్గలోను ఇంకను ఇతరచోట్లను మనస్సునకు తట్టును. కాళిదాసునకు అశ్వఘోషునకు-సభాకావ్యశైలి-సమాసప్రయోగము. సామాన్యములు. కుమారసంభవకథాస్మరణము బుద్ధచరిత్రమున స్పష్టముగా కనుపట్టుచున్నది. కొన్ని ఉదాహరణములు:

1. భవ ఇవ షణ్ముఖజన్మనా ప్రతీతః
2. శైలేంద్రపుత్రీం ప్రతియేనవిద్ధో
   దేవోఽపి శంభు శ్చలితో బభూవ.

పురస్త్రీలు రాజపుత్రుని చూచుటను వర్ణించుశ్లోకములు (III, 13-24) శివుని ఓషధిప్రస్థవిలాసినీజనులు చూచుటను వర్ణించుశ్లోకములఁ బోలియున్న వని యిదివఱకు చెప్పియుంటిని. ఇట్టివర్ణన ఆదికావ్యమందలి నియమము గాదు. సభాకావ్యములలో నాచారముగా నున్నది. భాగవతపురాణమందు కృష్ణుఁడు హస్తినాపురము విడిచి వెళ్లునప్పుడు పురయువతులు అతని మహిమను సౌందర్యమును గుఱించి చెప్పుకొన్నట్లు వర్ణింపఁబడినది. ఇందు బుద్ధునిఁ జూచి ధన్యాస్య భార్యేతి శనై రవోచన్ శుద్ధై ర్మనోభిః ఖలు నాన్యభావాత్ అనిరి. కాని ఇందు, ఇతరభావముతోఁ గాదు అని కవి చెప్పవలయునా? బుద్ధుని జన్మసందర్భమున శుభసూచనలు కుమారజన్మసందర్భమునఁ జెప్పఁబడిన శుభసూచనలఁ బోలియున్నవి. కొన్నిచోట్ల ఒకేశబ్దములు గూడ ప్రయోగింపఁబడి యున్నవి. ఇందుకు ఒకఉదాహరణము: వాతావవుః స్పర్శసుఖాః మనోజ్ఞాః (బుద్ధచరిత) వాతావవుః సౌఖ్యకరాః (కుమారసంభవము.)

కాళిదాసు "జలము లన్నియు నిర్మలము లాయెను" నని వర్ణింప, పులిమీఁది పుట్రవలె అశ్వఘోషుఁడు "ఇంటియొక్క ఈశాన్యదిక్కునందు తనంతట తానే (త్రవ్వకుండఁగనే) తెల్లని నీరు గల నూతము ఉద్భవించెను" అని చెప్పెను. ఈయూహ ఎవరికి మెండుగఁ గలిగి యుండును? సూక్ష్మముగ చెప్పినవానికా? విపులముగ చెప్పినవానికా

కవెల్ పండితునివంటి వారు నిర్ణయింపవలయును. I. 76. శ్లోకములో ధర్మనదీరూపకమును తటిశిలగా ప్రయోగించిన కవి ఉపమానముల నల్లుటలోఁ దీసిపోఁడు. కావున కేవలనైపుణ్యమునుబట్టి కవి కాలనిర్ణయము చేయుటకు వీలుపడదు.

ఈ గ్రంథమును చదువునపుడు నాకు స్ఫురణకువచ్చిన కాళిదాసవాక్యములను మఱికొన్నిటి నిటఁ బొందుపఱచెదను. 10-వ సర్గలో బింబిసారుని మందలింపుమాటలు రఘువంశములోని 2-వ సర్గలో మాయాసింహము దిలీపుని మందలించు వాక్యములను స్ఫురణకుఁ దెచ్చినవి:
ఆదిత్యపూర్వం విపులం కులం తే నవం వయో దీప్తమిదం వపుశ్చ (బుద్ధచరిత)
నవం వయః కాంతమిదం వపుశ్చ (రఘువంశమ్) "తద్యుంత్స్వ" యను పదముగూడ రెండు సందర్భములలోను కనఁబడుచున్నది. బుద్ధచరితలో భూమిని 'సముద్రవస్త్రా' యని XI. 12. లో వర్ణించియున్నాఁడు. 'సాగరాంబరా' 'యనియో' 'సాగరమేఖలా' యనియో రఘువంశమున చదివినట్లు జ్ఞాపకము.

ఇట్టివి చాల జాగ్రత్తగా నిష్పక్షపాతముగా పండితులు విమర్శింపవలసియున్నది. కాళిదాసు గ్రంథములను అశ్వఘోషుఁడు చదివియుండును. సమకాలికుఁ డగుటనో వాల్మీకియందలి అధికప్రేమచేతనో సందర్భ మేమియు లేకపోవుటచేతనో కాళిదాసుని పేరును ఉదాహరింపక పోయి యుండును. పండితవరులు నాచెప్పినదానిని సాదరముగ గమనించి అశ్వఘోషకవికి తగు గౌరవపదము నిర్ణయించి ఈ మహాకావ్యమునకు వ్యాఖ్యానమును రచించి చదువరులకు సంపూర్ణానందము నొసగూర్పఁ బ్రార్థితులు.

# కుసుమగుచ్ఛములు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

## ౧. పెనుఁగొండ కొండ

[మోహనరాగము - త్రిపుట - చాపుతాళమున గేయము]

పెనుఁగొండ కొండ (పల్లవి)
చనిన నాటిల తెనుఁగు కత్తుల
సానపెట్టిన బండ
ఈ పెనుఁగొండ కొండ.

౧. శత్రుములఁ బ్రహరించు కత్తుల
రక్తధారలఁ ద్రాగి త్రేఁచిన
ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల
కటికి నెలవుగఁ బండ;
ఈ పెనుఁగొండ కొండ.

౨. వేఱపు తెలుఁగని బిరుదు పడకల
విజయనగరపు రాచకొడుకులు
పోరులఁ బోయఁగఁ గరుడు గట్టిన
పచ్చిమెత్తుర కండ;
యీ పెనుఁగొండ కొండ.

3. తిరుమలేంద్రుని కీర్తి తేనెలు
జేరసి దించిన కావు కవనపు
నిరుపమ ద్రాక్షారసంబులు
నిండి తొలఁకెడు కుండ;
యీ పెనుఁగొండ కొండ.

## ౨. పరిహాసలీల

"పూలఁ బూజింపు మని నిద్ర మేలుకొలిపి,
తట్టలోఁ గాయమొగ్గలు పెట్టినావు!
నిశ్చలంబుగ మదిని ధ్యానింపు మనుచు
కంటి ముక్కాలిపీట కెక్కర్చినావు!
పరవశంబుగ గొంతెత్తి పాడు మనుచుఁ
దెగిన తంబురఁ జేతి కందిచ్చినావు!!
అందముకోలేని పేరాసలను ఘటించి
ప్రణయమధుర బిన్నముల పొల్పుఱచి దయిత!
యీవు నవ్వుచు నన్ను నవ్వించె దేల!"

## 3. ముసలి వీణ

"వలపు కోలాహలముల సౌఖ్యంబు చెడిన
రసపిపాసార్తుఁ డగు నన్నుఁ గోసరి కోసరి
పెండ్లియింటి 'కచ్చేరి'కిఁ బిలుతు వేల?
పద్దెలల పద్దులను మెచ్చ మఱిగినట్టి
మీ విశాలసౌధంబుల మిద్దె లెల్ల
నాదసుకుమారి నాదు వీణామతల్లి
మృదుల గానంబు మనసిచ్చి యెఱుఁగునొకో!
ఓడలు గంపించు సాధన కోర్వలేదు;
సాగుపాడంపు బిరుదుల సైఁపలేదు;
మాఘపలుకుల భావంపు సొగసు లెఱిఁగి
పులకరించెడు మనసుల కలమఁ గాని,
ముఖరముఖరాగములకు నా ముసలివీణ
తీవతంత్రుల బలిమిఁ ద్రెంచికొనలేదు;
పెండ్లియింటి కచ్చేరికిఁ బిలుతు వేల!"

## ౪. సంధ్యావందనము

౧. సంధ్య వార్చంగ రండు-కాలంబు-వ్యర్థమయి పోవు రెండు
వింధ్య హిమగిరుల నడుమ-మహోజ్జ్వలపు-కొల్లలు పాఱనిండు.
౨. కటికచీకటి నూకను-నిక్కమ్ము-నవ్వు వెల్లెడఁ జేసెను
చిటికలోఁ దూర్పు మింటి-వెలతెరి-చిత్తరువులను వ్రాసెను (సంధ్య)
3. చంద్రనిష్ప్రభ మైన పోటి-కిరణము-చంద్రుఁ గొడ్డలికి పాటి
కిందఁ దించి సరసుపొడిచి-సూర్యుఁడు-తేఁకిఁ దెలుపు నిద్ర దాటి (సం)
౪. మంద్ర నినదనాత 'దమ-మాకొన్నాసి-సంద్రములు మనలఁ గూడ
సాంద్రపుణ్యవ్రతులకు-ఏకలెల్ల-సాదరంబుగఁ దొంగిచూడ. (సం)
౫. మఱచిపోయిన మంత్రము-జ్ఞాపించుఁ-దివ్యతేజపు యంత్రము
స్థిరము లగు చిత్తములతో-మన మిప్పుడు-చేసెదదియే తంత్రము. (సం)

# మనుచరిత్ర విమర్శనము

యడ్లపాటి వేంకటసుబ్బారావు గారు

మన మున్న యీ యిరువదియవ శతాబ్దిని నవలాయుగ మని నాటక యుగ మని ఎట్లు ప్రసిద్ధిగాంచుచున్నదో అట్లే 16-17 శతాబ్దులు ప్రబంధయుగము లని పేరు గాంచినవి. ఆ కాలములో బయలు వెడలిన ప్రబంధములలో సాధారణముగా నొకదానికి మఱి యొకటి అనుకరణ మని చెప్పవచ్చును. కాని ఒక్కొకటి మాత్రము వీనిలోనుండి విడఁదీయక తప్పినది కాదు. అట్టిదే పింగళి సూరనామా త్యుని. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలముతో ప్రబంధ యుగ మారంభమైనట్లు గాన్పించుచున్నది. దానితరువాత ప్రసిద్ధికి వచ్చిన ప్రబంధము అల్లసాని పెద్దన్న గారిది. ఈ ప్రబంధమునకు 'మను చరిత్రము' అనియును 'స్వారోచిషమనుసంభవము' అనియును రెండు పేర్లు గలవు. ఈ ప్రబంధమున కీనామములు సమంజసములేనా యని ప్రథమమున విచారింతము. కథాభాగమును పరికించిన నీ రెండు పేర్లును వివాదాంశములే! మనుచరిత్ర మనునది యీ ప్రబంధమున కన్వ యింప దని నా యభిప్రాయము. చరిత్రమనఁగా నర్థమేమి? ఏదైన నొక వ్యక్తికి సంబంధించిన జీవితవృత్తము. అయినచో ఆవ్యక్తి కథ ఆమూలా గ్రముగ ప్రస్ఫుటము కావలయును. మనుచరిత్రలో మనుప్రసక్తి యే మాత్ర మున్నదో విచారింతము. ఆఱవ ఆశ్వాసములో 99-వ పద్యము నందు ఈమనువు జననమును గూర్చి కలదు. పిమ్మట 27 గద్యపద్య ములతో గ్రంథము ముగియుచున్నది. మొత్తము గ్రంథమంతయు సుమారు 660 గద్యపద్యములతో పూర్తి యగుచున్నది. కనుక మిగిలిన 633 గద్యపద్యములు ఇతరులచరిత్రకు సంబంధించినవి. అట్టిచో మనువు జీవితకథావర్ణన మెక్కడ? లేనియెడల తచ్చరిత్ర మెట్లగును? 27 గద్యపద్యములలో వాని చరిత్ర యంతయు ముగించి గ్రంథమునకు వాని పేరిడుట సమంజసమా? గ్రంథము పేరు వినినంతనే ఆదియంతయు మనువుయొక్క చరిత్రమే యని భ్రాంతి కలుగును. కాని దానిని చదివినను వాని ప్రసక్తియే యుండదు. మనువుచరిత్రము చే తెలిసి కొనఁగోరి చదువువారికి కొంతయు నిరుత్సాహము జనింపక మానదు. ఇట్టిస్థితిలో గ్రంథమునకు మనుచరిత్ర మని యేల పేరిడవలయును? పెద్దన్న గారొక చోట "మనుచరిత్రంబందుకొనువేళ పురమేఁగ బల్లకి తనకేల నెత్తినయట్టి" అని కృష్ణదేవరాయలను పేర్కొనియున్నాఁడు. ఇదెట్లు సంభవించును? ఇఁక రెండవ పేరును విచారింతము. స్వారోచిషమనుసంభవ మని కూడ దీనిని పిలుచుటకు సమంజసముగా నున్నట్లు తోఁపదు. ఇక్కడ కూడ కర్తయొక్క యేదో గ్రంథము పేరు వేఱుగా నగుచున్నది. ఉత్తర కథకు నాయిక యగు మనోరమ మనువునకు తల్లి కాదు. అకస్మాత్తుగ తటస్థించిన వనదేవతకును స్వారోచికిని మనువు జన్మించినాఁడు. కనుక చరిత్రతో నంతగా సంబంధము లేని జననమును చరిత్రకు నామకరణ ముగా నిరూపించుట బాగుగ లేదు. దీనినిబట్టి గ్రంథమునకు స్వారోచి చరిత్ర మని పేరిడినచో బాగుండు నని తోఁచుచున్నది. ఏమనఁగా లేని స్వా రోచియే పూర్వకథానాయికానాయకు లగు వరూథినీమాయాప్రవరు లకు జన్మించెను. ఈ ఉత్తరకథకు నాయకుఁడుగా నేర్పడెను. కనుక నీపేరే సమంజసముగా నున్నది.

ఈ ప్రబంధమును మొదటి మూఁడాశ్వాసములు పూర్వకథగను చివర మూఁడాశ్వాసములు ఉత్తరకథగను, రెండుభాగములుగ విభ జింపవచ్చును. వరూథినీప్రవరుల చరిత్ర మొదటి మూఁడాశ్వాసము లతో ముగియుచున్నది. చివర కథాభాగములో వారిప్రస్తావనయే లేదు. మాయాప్రవరాఖ్యుని వృత్తాంతము తెలిపోయినను వరూథినీవృ త్తాంతమైనను కనఁబడలేదు. వరూథిని యేమైనదియు కూడ చదువరులకు తెలియదు. వచ్చునప్పుడు పోవునప్పుడు నుండెడి వన్నె మాయాప్రవరుఁ డేమై నాఁడు? అతనివలనఁ గాను సందర్భమున గాఢ్యము గట్టి లేచ్చిన వరూథిని యే మైనది? గర్భవతియైన ఆమె ఏమి లభించినది? లభింప కున్న ఆమె పూర్వవృత్తాంతమేదైన సమర్థింపలేదా? ఇటువంటి సంశ యములతో ప్రథమభాగము పూర్తి యగుచున్నది. ద్వితీయభాగము నకు నాయికానాయకులు మనోరమయును స్వారోచియును.

పూర్వభాగమున నాయికానాయకులు వరూథినీప్రవరులు. ప్ర బంధమున కంతకును ఈకథాఘట్టమే జీవనాడియై తనరారుచున్నది. ప్రేమపరిణామమునందేమి ఉపాఖ్యానమునందేమి కవిత్వప్రభావము నందేమి యిది మిన్నయై యున్నది. ఆలోకించిన ఆపలుకుబడుల సొగసు అకల్పనాసామర్థ్యము అర్థగాంభీర్యము అడుగడుగునకును అందుల్లసితమైన వస్తువును అల్లసాని పెద్దన్నగారి విద్యాపాటవ మును కవితాశక్తిసామర్థ్యములను వేనోళ్ల చాటుచున్నది.

ఈ వరూథినీప్రవరుల చరిత్ర తలఁచుకొన్నప్పుడెల్ల చిత్రాంగి సారంగధరుల చరిత్రము స్ఫురణకు వచ్చుచున్నది. కథాసందర్భములో దానికిదానికి చాల పోలికలు గలవు. కాని వరూథిని కన్య, దేవతాంగన. చిత్రాంగి గృహిణి. వరూథిని ప్రేమాస్పదుఁడు పరపురుషుఁడు. చిత్రాంగి ప్రేమాస్పదుఁడు సవతికొడుకు! అనఁగా కుమారుఁడు. చిత్రాంగిప్రేమ కన్న వరూథినిప్రేమయే పవిత్రమైనది; అయినను చిత్రాంగిని మాత్ర మంతకులటగాఁ దోషిగ వ్రాసినారు. ప్రేమ అపవిత్రమైనదే కావ చ్చును. కాని అందులకు గారణ మెవరు? చిత్రాంగి కాదు; వృద్ధరాజే. చిత్రాంగి యువతి. కాని ప్రథమమున సారంగధరునకు నిర్దిష్ట. సారంగ ధరుని మనోహరవిగ్రహమును తనహృదయఫలకమునఁ జిత్రించుకొని యున్నది. మోహావిష్టుఁడైన ముసలి యగు రాజు నిజకుమారనిర్దిష్ట యగు వధువును పాణిగ్రహణ మొనర్చినాఁడు. కాని వధూమనోభావ ములు సారంగధరునియందే లగ్నమైనవి. కనుక చిత్రాంగిప్రవర్తనలో తప్పు కానరాదు. సారంగధరుని ప్రవర్తనము మాత్రము పూజ్యము,

అత్యద్భుతము. ఎటువంటి పాపిష్ఠుడైనను తల్లిని మోహదృష్టులఁ జూడఁ జాలఁడు. అట్టిచో మహామహుఁ డగు సారంగధరుని విషయము చెప్ప నేల? ఇఁకను వరూథినీప్రవరుల చరిత్ర యట్టిది కాదు. వరూథిని అనూఢ. తగినవరుని కాంక్షించుచున్నది. తలఁపని తలఁపుగ సుందరపురుష దర్శన మయినది. ఆ దివ్యసుందరమూర్తిని చూచుటతోడనే ఆమెకు హావభావము లుదయించినవి. కోరిక ఫలించినటులే సంతసించినది. కాని ప్రవరుఁ డాహితాగ్ని; ఏకపత్నీవ్రతుఁడు. వరూథినిని చూచి నంతనే యాతనికి మోహావేశమును కలుగలేదు. ఈపట్టున సారంగ ధరునికన్న నితఁడు మిన్నయని చెప్పవచ్చును. ఏల యనఁగా వరూథి ప్రేమ చిత్రాంగిప్రేమవంటిది కాదు. చిత్రాంగి తాత్కాలికసుఖమును మాత్రమే యాశించినది. వరూథిని చిరకాలసుఖమును కోరుచున్నది. ఇది సంభవము. అది అసంభవము. ఇది సంభావితము అది అసంభావితము.

ఒకపాత్రమును ప్రేమపాశము చిక్కులంబెట్లు నిర్మించి రెండవ దానిలో ప్రేమాభావము వ్యక్తమగునట్లు వర్ణించుట ప్రేమపరిణామ రసపోషణముల కనుకూలముగ నుండును. వరూథిని చూచినతోడనే ప్రవరుఁడు వరూథినిప్రేమమాయాపాశములోఁ దగుల్కొనినయెడల మనుచరిత్రలోని పూర్వభాగ మంతయు నిరర్థకమే యగును. చిలుక దినంబటు తాను చనచేతికిఁ జిక్కుటలోను దానిని పట్ట ప్రయత్నించి చేయునట్టి ప్రయత్నపూర్వక సాధనములోను గల ఆనందములో నెంతశ్రేయస్సు మున్నదో చూడుఁడు. నిరాశాప్రవాహములో లభించిన ఆశాలతయే ప్రాణప్రదము. అదియే అన్నివిధముల నత్యుత్తమము. వరూథినీ ప్రవరుల చరిత్ర యిట్టిది. ప్రవరునియందు వరూథినికి అత్యధికమగు ప్రేమ జనించినది. కాని వరూథినిపైఁ బ్రవరున కాంతయేని ప్రేమ లేదు. కనుక నిచ్చట శృంగార సమ్మిశ్రిత మగు కరుణారసము చిప్పిలు చున్నయది.

ఈ ఘట్టమున రసపోషణ మెంతయుఁ బ్రశంసనీయము. వరూథిని విద్యుల్లతాంగి; శతపత్రేక్షణ; చంచరీకచికుర; చంద్రాస్య. యౌవనవతియైయుండి జయంత వసంతకంతులను చక్కఁదనములోఁ గెలువఁ జాలిన భూసురుని వీక్షించినది. వెంటనే మోహభ్రాంతి కలిగినది. ప్రవరునకు ఆవాసనయే యెట్టలేదు. "త్రోవఁజెప్పితివి. దారిఁ జూపుము పోయి శుభ మగు" నను చుండఁగా, వరూథిని ఏమనుచున్నదో చూడుఁడు:

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించుటల్
గంతయె కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు! నీ
కింత భయంబులే కడుఁగ నెల్లిద మైతిమి మాటలేటికిన్?

ప్రవరుఁ డీమాటల నంతగాఁ బాటింపలేదు. కాని వరూథిని అంతటితో విరమింపలేదు. నిజభాగ్యము నేరువు పెట్టినది. ప్రేమ పూర్ణములగు నాలాపములను గురిపించినది. అతిథ్యముఁ గైకొను మని ప్రార్థించినది. కుందనమువంటి మేను మధ్యందినాతపోష్మహతిఁ గంది నదిగదా! యని పరితాపపడినది. ఆహా! ఏమి యీప్రేమవిలాసము!

ప్రవరుఁ డింతటితో వరూథినికి వశుఁ డైనయెడల రసపోషణ మింతటితో నంతరించియుండును. ఇట్లేల చేయుదువా యనియే అతని యాందోళనము. తల్లీ! అని వరూథినిని అతఁడు సంబోధించినాఁడు. తన్ను ప్రజలలోఁ బడవేయుమని బ్రతిమాలుచున్నాఁడు. కాని వరూథిని చిఱునవ్వుతో నేమనుచున్నదో చూడుఁడు:

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కె దీ
వక్కట! మీకుటీరనిలయంబులకున్ సరిరాకపోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్.

ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన! యింక నీపయిన్
జిక్కె మనంబు నాకు నను జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యములు ద్రావుచుఁ బాటలువాడు తేఁట్ల సొం
పెక్కినయట్టి పూఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో.

కాని ప్రవరుండు వైదికకర్మపరతంత్రుఁడై త్రోవచూపుమనియే ప్రార్థించుచున్నాఁడు. మోహమునకుఁ గార్యము నెఱవేఱునట్లు లేదని వరూథిని దూషణములకు ప్రారంభించినది. ఆ దూషణముకూడ ప్రేమ పూర్ణమే కాని కోపసంజనితము కాదు. క్రమముగా విషయలోలుపతా-అవిస్మృతి-ద్వైతత్వముల-బ్రదర్శించి అందువలన ఫలముఁ గానక-ప్రాంచద్భూషణబాహామూలరుచితో సఖ్యముఁ జూపింప నుపక్రమించినది. ఇదియే రసప్రకర్షకుఁ బరమావధి. ప్రవరుఁడు వరూథినిఁ ద్రోసివేసి నప్పుడు నిజముగ పాఠకుల భావనావిలోకనములలో ఆ చిత్రకళా ప్రదర్శనము వ్యక్తమగుచుండును. కళకళపోటుతో నున్న ప్రవరుఁ డును లజ్జావశయై క్రోధమూర్తియైన వరూథినియును మనకుఁ బ్రత్యక్షమైనారు. త్రోపుపడి అవమానింపఁబడినను వరూథినికి ప్రవరునిపైఁ గల మోహము తగ్గలేదు. అతఁ డెవఁ బోసినను వరూథిని కాలినియందు ప్రేమ తగ్గలేదు. త్రోసి వెడలు దన్నవాఁ డెక్కడికి పోఁగలఁ డన్న ధైర్యము. మనసు తిరుగకపోవునా యన్న ఆశ. ఈరెండును వరూథిని నిట్టటుచేయుచున్నవి. ఇటువంటి అవస్థలో మాయాప్రవరుఁడు పుష్పాపచయవ్యాజమున నరుదెంచినాఁడు. సంక్షుభితములగు ప్రాణములు వరూథినికి గుదుటుపడినవి. మోహమగ్నయై అతఁడు పెట్టిన కట్టడ లన్నిటికి నంగీకరించి అతనిని పొందినది. ఇంతటితో వరూథినీప్రవరులసంబంధమైన ఘట్టము ముగియుచున్నది. ఇందు రసపోషణమునకేమాత్రము లోప ము లేదని తెలుచున్నది.

ఈ పూర్వకథాభాగములో నొక యసందర్భము కనుపట్టుచు న్నది. ప్రవరుఁడు మార్గాన్వేషణ మొనర్చుచుండ ఋషు లెవ్వ రాతని కంటఁ బడి యుండలేదు. ఒక్కవరూథిని లతాగృహము మాత్రమే అతనికి దృగ్గోచర మైనది. వరూథినీప్రవరుల సమావేశముకొఱకు అది కలలో నున్న ఋషిపాత్రములు మాయమాయెనా! లేక ఋషిపాత్ర ములే లేవా? లేనిచో ఋషులు స్వరోచిజననకాలమునం దెక్కడ నుండి వచ్చిరి? స్వరోచి పుట్టుటతోడనే అతని జాతకర్మవిద్యాభ్యా సాదులకై ఋషు లాప్రదేశమున నిండినారు కాఁబోలును!

ఉత్తరకథకు నాయికానాయకులు మనోరమయును స్వరోచియును. మనోరమను స్వరోచితో సంధింపఁజేయుటకు వేట యవసరమైనది. ఘోరరాక్షసునిచేఁ దఱుమఁబడి మనోరమ విక్రాంతుఁడగు రాజును శరణు వేఁడినది కదా! భయవిహ్వలచిత్తయైన మనోరమ స్వగతార్థ మతని నర్థించుటకు ముందుగ తన పుట్టుపూర్వోత్తరముల చెకరువు పెట్టుట ఏ మంతయుచితము? ఈవర్ణనమువలనఁ దనగొప్పతనము చూచి స్వరోచి రక్షింప వలయునా? శుద్ధవీరుఁడు శరణాగతులను వంశోన్నతినిబట్టియా రక్షించును? సహజముగ నే యాతఁడు శరణాగతులను రక్షించును గదా! లేనిచో. స్వచరిత్రము విన్నతరువాత తనపై జనించిన అనురాగప్రభావ మతనిని రాక్షసునితోఁ బోరుటకు పురికొల్పవలయునా? మఱియును మనోరమనుండి మంత్రము గ్రహించి దానవుని సంహరించినటు లున్నది. ఈయంశమువలన స్వరోచిశౌర్యమునకు కళంకము కలుగుచున్నది. మనోరమ దన చరితమును ప్రథమమున నే చెప్పక దానవుని వధానంతరము చెప్పిన నెంతయో రమ్యముగ నుండెడిది. మఱియొక సంశయము కూడ కలుగుచున్నది. దానవుఁడు వెంటాడుచున్నప్పుడు స్వచరితమును చెప్పునంతటి యవకాశ మెట్లు కల్గినదో గదా! మఱియును పరాక్రాంత రాజునకును దానవునకును కలహము సంభవించినయెడల సంభ్రమాశ్చర్యములు కలిగెడివి. స్వరోచి బాహుబలము వెల్లడి యయ్యెడిది. ఇప్పుడన్ననో దానవుని సంహారము స్వరోచిశక్తినుండి తొలఁగి మనోరమమంత్రముపై నాధారపడినది.

మనోరమ చెలికత్తెలు తమతమ విద్యలను స్వరోచికిచ్చి వానిని వివాహమాడిరి. అనఁగా రాజు విద్య నాశించి వారిని పరిణయ మైనట్లున్నదేగాని ప్రేమచేఁ గాదని తేలుచున్నది. పోనీ తమ రుజను మాన్పినందులకు వారు స్వయముగ నే ఆవిద్య నాతని కిచ్చిరనుకొందము. అటులైనయెడల వివాహానంతర మీయఁగూడదా? అప్పుడెంతో సమంజసముగ నుండును కదా. విభావరి యేమనుచున్నది? నా విద్య తీసికొని నన్ను పెండ్లిచేసికొమ్మనుచున్నది. చక్రవాకి వీరిని దలఁచి పరిహసించుచున్నది. జలవిహారసందర్భమునందు చక్రవాకి యొసఁగిన బహుభార్యాసాహచర్యనిషేధమును వినియును మఱల నెప్పటియట్లు చరించుట యను నది రాజుమనోదౌర్బల్యము సూచించుచున్నది. రాజునకు పక్షిభాష నేర్పినది విభావరి. పక్షులు మాటలాడినప్పుడు విభావరి అచ్చటనే యున్నది. ఈ పక్షుల హేళనను ఆమె గమనింపకుండుట ఈవింతలో మఱొకవింత. ఈ కథాసందర్భమును ప్రధానచరిత్రలోఁ జొప్పించుట నిరర్థకమైనది. ఏమనఁగా నందువలన స్వరోచిప్రవర్తన మేమియును మాఱలేదు.

ఇఁక నిందలి కవితామాధుర్యముఁ గూర్చి యించుక చర్చింతము. వర్ణనాసమర్థములగు పదగుంఫనలు పదములకుఁ దగిన మార్దవ మాధుర్యములు- అందులకనువులగు సమాసప్రయోగములు- సామెతలు- ఈ గ్రంథరాజమునకు పెట్టని భూషణములు. ఉదాహరణార్థమై ఈ క్రింది పద్యములను చిత్తగింప వేఁడెదను:

మ. బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులం బొల్చు ని
మ్నహిమాహార్యమునన్ జలంబు లెదుకన్ ద్రోచున్ నభోవాహినీ
లహరీశీకర గంధవాహపరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంతారసంతానముల్.

మ. పవమాన ప్లవమాన కైరవరజఃపాళీ కిశోరచ్ఛవీ
ధవదభ్యర్ణవికీర్ణ కృత్రిమ సరిత్పావ...రంగాహితైం
దవపాషాణ వితర్దికాతలమునన్ నాళీకపత్రాక్షు లం
ద్సావ మెప్పున్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగన్.

మఱియు నిందలి వర్ణనలు స్వాభావికములై భావశక్తి విలసితములై యున్నవి. ఒకటి రెండు ఉదాహరణములు చూడుఁడు.

చ. మరువ కొసంగఁ గాలము తమశ్ఛట గాటుక గా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక శోణిత సిక్తసితోరుభక్తమున్
హరిహయదిగ్భిత్తిస్థలమునన్ బలిచల్లి కటాంకమున్ వమూ
త్కరతరకోటులై వెలుఁగఁ గాంచి సుధాంధి నెత్తె నత్తఱిన్.

చ. పలుకులు నేర్చువేళ కలభాషిణి నీ విటులుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గోకుచున్
నిలుకుచు నాపురించుచు ననీ విహగోత్కర మెట్లు కల్కి నీ
పులుకుల తొల్త నిని పల్కుఁడు వింటివె కీరశారికల్.

ఇట్టివి లెక్కకు మిక్కిలి యున్నవి. వానిని గుఱించిన రసానుభవము పాఠకులే స్వయముగ నిర్వహింప నర్హులు.

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ
స్థగితేతరపరిమళ మై
మగువపొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్.

ఈ పద్యము కవిప్రతిభావిశేషము వేనోళ్లఁ జాటుచున్నది. మున్ముందు నిర్మాణ మొనర్చు పెద్దనమహాకవి శృంగారసౌధమున కిది ప్రథమసోపానము. దగ్గఱకు వచ్చుటతోనే మన మెక్కఁబోవుచున్నది శృంగారసౌధము కదా యని పాఠకులకు వెంటనే స్ఫురించును. అటులఁ స్ఫురింపఁజేయుటయే కదా కవితాలక్షణము! ఇందులో నిముడ్చిన విషయములు శృంగార రససాధనములు. అందులకు నిలయమైనది మగువపొలుపు. నాయికను రంగములోనికి సముచితసాధనములతోఁ బ్రవేశపెట్టిన కవిప్రతిభామాహాత్మ్య మసాధారణము.

క. తెలతెల వేగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలల చప్పుళ్లు శిఖా
వలకుల కలకల రేకల
కలములు గల తలపోలంబు కమఁగొను వేడ్కన్.

ఈపద్యము చదువుటతోడనే కొండ చరియలనుండి ప్రవహించు సెలయేళ్లు-ఆ సమీపప్రాంతముల విహరించు నెమళ్లు-వాని మనోహరధ్వనులు-కండ్లకు కట్టినట్లుండును.

చిత్రకారుఁడు చిత్రఫలకములచే వస్తుప్రదర్శనము చేయును. కవి కవితారూపమున వస్తుప్రదర్శనము చేయును. పద్యము చదువుటతోడనే చిత్రనైపుణ్య మందు విశద మగుచుండును. చిత్రకారునకును కవికిని గల భేద మిదియే. ఇద్దఱభావములును సమానములే. కాని భావప్రదర్శనము వేర్వేఱురూపములఁ దాల్చుచున్నది. చిత్రకళాసౌందర్యము వెల్లివిరియుచుండునదే కవిత్వము కదా! ఋతువర్ణనము ఈ పైవాక్యమునకు నిదర్శనముగాఁ గైకొని చూడుఁడు.

శా. తావుల్ క్రేవలఁ జల్లు తెంగలువకేదారంబు తీరంబునన్
మావుల్ క్రొవ్వులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత శాయమాన జటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబున్ గాంచె సోత్కర్ణమున్.

# నవలా సారస్వతము

ఆ. వేంకట శాస్త్రి గారు

నవల యన స్త్రీ యని యర్థము గలదు. నవలలు అనఁగా-సాధారణముగ జనుల కందఱ కర్థమగు సులభశైలిలో స్వేచ్ఛగల కవన రచనాచమత్కృతితో విరాజిల్లుచు, సాంఘిక నైతిక చారిత్రిక పౌరాణిక అపరాధపరిశోధక ప్రభృతు లగు సాంప్రదాయముల త్రోవలను బట్టి రచింపబడిన గ్రంథములు "నదీనాం సాగరో గతిః" అన్నట్లు నవలలు ఏసాంప్రదాయములనుబట్టి రచింపఁబడినను అవి జనసామాన్యము నాకర్షింపఁగలిగినయెడల నవలారచనాశయము చాల వఱకు నెఱవేఱిన ట్లెంచవచ్చును. నవలలలో స్త్రీలే ముఖ్యపాత్రము లుగ నుండి యా ముఖ్యపాత్రముల కన్నిదిశలను, పుష్పముతోని రేకుల వలె పురుషులుకూడ పాత్రలుగ నుండునట్లు రచింపఁబడినవి. కొన్ని కొన్ని నవలలకు ముఖ్యపాత్రలుగా పురుషులే యుందురు. స్త్రీ లట్టి నవలల యందు ముఖ్యపాత్రలుగా గైకొనఁబడకుండుటకు కారణ మాగాథ యందు పురుషుల పాత్రాధిక్యమును బట్టి ప్రాధాన్య మియ్యఁబడియుండుట నాటకమునకు నవలకు భేద మెందుఁ గనఁబడుచున్న దన నాటకమున ననేకపాత్రధారులను కవి యొకరితో నొకరు మాటలాడునట్లు చేయును. అవ్విధమున వారిచే మాటలాడించినపుడు గ్రంథకర్త తానే యాపాత్రలవేషములను ధరించినట్లు తలఁచి యాపాత్రల యౌచిత్యమునుబట్టి తద్ద్వారా మాటలాడును.

నవలాకథావిధానమో చాల చమత్కారమైనది. కవి యొక్క మనస్సును సరసురాలైన యొక ముద్దుగుమ్మ (విద్యావతియు, సరసురాలును అగు భార్య యుండు, సౌహార్దముతో) నవలాపాఠకుఁడను ప్రియుని హస్తమును పట్టుకొని అతఁడు చూచియుండని-తా నిది వఱకు చూచినట్టిది అగు నొక యుద్యానవనముఁ గొనిపోవుచు త్రోవలోని సౌందర్యములను చూపుచు పాఠకుని మన స్సానందడోలికలో నూపఁబడునట్లు తోఁపఁజేయుటచే సర్వమును మఱచి త్వరలో గమ్యస్థానమునకు నన్ను జేర్పవే! ముద్దియా! యను నుత్కంఠ పాఠకునికి గలుగఁజేయఁగల యట్టిదే నిజమైన నవల.

నవలల యాకర్షకశక్తి ప్రపంచమున ప్రతివస్తువును ఏదో యొకవిధమున మనుజుని నేత్రములను తనవైపున కాకర్షించుకొనఁ గల్గును. పుష్పముల మూలమున వృక్షము తన సంతతిని వృద్ధిచేసికొను స్వభావమును గల్గియున్నది.

పుష్పము, కాయగా పరివర్తనమునొందుటకు పురుషపుష్పములోని పుప్పొడి యొక స్త్రీపుష్పములోని కీలాగ్రమునఁ బడవలయును. పుష్పములు కీటకములను తేనెటీఁగలను తమకడ కాకర్షింపఁ శక్తిఁగలిగి యుండవలయును. అందుచేతనే సృష్టిలో గల పుష్పము లన్నియు మనకు నేత్రోత్సవమును గలుగఁజేయుచు వివిధవర్ణములతో విరాజిల్లుచున్నవి. పుష్పముల రేకులు వివిధములైన రంగులు గలిగియుండుటలో గొప్పయుద్దేశము గలదు. కీటకాదు లాపుష్పముల రంగులచే నాకర్షింపఁబడుటయు, వానిచే తెలియఁబడకుండ వానికాళ్లకంటుకొనుటచే పుప్పొడి గొనిరాఁబడి పుష్పములోని కీలాగ్రమునఁ బడుటయు, నంత పుష్పము తనయొక్క జీవితోద్దేశము నెఱవేర్చుకొనుటయు నగును. ఇదే విధముగ స్త్రీలు తమసహజసౌందర్యమునకు కొంచెము వన్నెఁ బెట్టు భూషణాంబరములతో తమ భర్తలకు మనోహరలుగ కనఁబడునట్లు ప్రయత్నించు స్త్రీలు కులధర్మ్యవత్న్యు లని యొక మహామహుఁడు వచించెను. నవలలు కూడ తమ సహజ వర్ణనా గాంభీర్యము గల ప్రకరణములతోడను, మార్దవమై, మానసములను రంజించు శైలితోడను, కథారచనా చమత్కృతితోడను, సాలీడు తాను తీఁదలచిన పురుగును తాను నిర్మించుకొన్న గూడుమీఁదకు రాగానే యెట్లు పట్టుకొనునో యట్లే పాఠకునికూడ పట్టుకొని యాతని మానసమును తుదివఱకు గొనిపోఁజాలి యుండవలయును. ఇదియే నవలలకుఁగల యాకర్షకశక్తి. అందులకే నవలాగ్రంథకర్తలు తాము నవలలను రచించునపు డానవలలలో నెట్టనెంకటి ప్రకరణములు పాఠకున కెట్లాకర్షకములుగ నుండునో, తనబుద్ధికి తోఁచినకొలది, వాని నాకర్షకములుగా నుండునట్లు చేయుదురు. కొన్నినవలలలో మొదటి ప్రకరణములు విసుగుగలిగించునవియైనను క్రమముగ చదువుచుండఁగా మన కపూర్వముగ కనిపించు గొంగళిపురుగు కాలక్రమమున నింపుగులుకు సీతాకోకచిలుకగా మాఱునందమున యొకనవలలో మొదటి ప్రకరణములు చదివినకొలది, యానందసంధాయక మగు కథాభాగము వచ్చునట్లు వ్రాయఁబడిన కొన్నినవలలు గలవు. చక్కని స్వభావ వర్ణనలతో ప్రారంభింపఁబడిన నవలలు పాఠకులను వడిగా చివఱకుఁ గొనిపోఁగల్గును. ఇంగ్లీషుభాషలో రైనాల్డ్సు వ్రాసిన నవలలను చదువ నారంభించితిమా యందలి భాషాశైలి, మెల్లమెల్లగ, పాఠకుని సమ్మోహింపజేసి, నవలాంతమునకుఁ గొనిపోఁగల్గును. కొందఱాధునికులు రైనాల్డ్సునవలలు చదువఁదగినవి కావనియు, అవి శీలభంగకరము లనియు నందురు. కాని చదువువారు, యుక్తాయుక్తవివక్షణ గల వారైన నట్టి దోషములు వారి నంటవు.

స్వభావవిరుద్ధములు, నసౌందర్యవైరుధ్యములు నగు పాత్రలను, సంభాషణలను కల్పింపఁబడిన నవలలు నైలెను సహజముగ మన కాలి పాదములు పెరిగినపుడు గల సౌందర్యములకంటె కాలిపాదములు పెరుగకుండ చిన్న బూట్సుజోళ్లలో నిఱికింపఁబడిన నెక్కువ శృంగారముగ నుండు నని తలంచు చీనావారిపాదములవలెనే కొన్ని

యతిప్రయత్నముచే నల్లఁబడినపద్యములు సంధానము. మన పూర్వోక్తలలో నిర్దేశింపఁబడిన చీనావారిపాదములను చీనావారిదృష్టితో పరికించుచో నవి యందముగఁ దోఁపవచ్చును. అట్లే, యసహజములను, సంభవముగ నమ్ముటకు వీలులేనివియు నగు సంగతులను వ్రాసినగ్రంథములలో వాగ్రంథకర్తలదృష్టితో చూచుచో నట్టివి పొడకట్టవు. కాని చక్కని విమర్శకదృష్టితో మనము చూచుచో సహజములును అసహజములు నగు వర్ణనములను నవలలం పరికింపఁగలము.

రసపుష్టి:— నవలలలో నవసరములలో కొన్నిటినైన వీలైనంత మట్టునకు పోషింపఁ జూడవలయును. మనోజ్ఞముగ, లేనభావములను వెల్లడింపఁగలవానికి వచనములలోఁగూడ నవరసములలో కొన్నిటినైన చిప్పిలునట్లు చేయవచ్చును.

సాధారణముగా మనహిందూదేశములోనినవలలు కష్టములయనంతరమున కథానాయకులు సుఖములఁబొందినట్లు రచింపఁబడును. ఇంగ్లాండుదేశపు కొన్నినవలలలో నవలాంతమున హాస్యలతో, కష్టములలో ముగింపఁబడును. అందుచే వానిఁ జదివినచోఁ జదువరు దుఃఖకరమైన వర్ణనల నవలాంతిమభాగమున నుండువాని నసహ్యించుకొనును. కొందఱు తాము చదువునవలల తుదకు హాస్యములో ముగిసె నని విచారమవస్తు లయ్యెదరు.

మంచి సాంఘికనవలలును, దేశరాజకీయపరిస్థితులను వర్ణించు నవలలును దేశములోని వారి సద్భ్యున్నతకు గొనిరాగల్గును. దేశమందంకటను వట్టి పంచినవలలు బయలుదేఱకలయును. ప్రస్తుతము అసహాయోద్యమమును గూర్చి నాటకము లెట్టు రచింపఁబడినవో అట్లే నవలలరూపమున వ్రాయఁబడి దేశస్థితిగతులను వర్ణించునవలలు ప్రజలలో నుద్బోధము గలిగించుట కవశ్యములు. నవలాసాహిత్య మను పేటికలో అపరాధపరిశోధక, చరిత్రాత్మక, సాంఘిక, రాజకీయ స్వకస్థలవర్ణన లుంగబడి భద్రము చేయఁబడకలెను. సోమరాజు రామానుజరావుగారను నొక నవలాగ్రంథకర్త లావధ్య మనప్రభుత్వము వారికి యుద్ధములో జయము గలిగినపు డాజయమును సూచించుటకు 'విజయధ్వజ' మను నవలను వ్రాసిరి. అట్లే ప్రస్తుతపు మనవలా రచనాదక్షులు, మనదేశస్థితులనుగూర్చి నవలారూపకముగ, నవలాయుపన్యాసధోరణిలో, తేట తెల్లముగ రచించుట దేశహితైక కార్యము. నవలానిర్మాణకౌశలు లిట్టి నవలాసారస్వతమును స్ఫురించి యావిధముగ దేశసేవను జేసి ధన్యు లయ్యెదరు గాక!

# ఆంధ్ర భాషా ప్రశంస

ఏ. వి. నరసింహము పంతులు గారు

వేదకాలమునాఁడె • విశ్రుతిఁ గాంచి
వేదప్రసిద్ధమై • వెలయు నాంధ్రంబు
అదియ ప్రాకృత మను • నభిధాన మొందె
నదె పల్కు వెలఁది శా•ల్యమునాఁటి బాప
గొపకొని వైదికో•క్తులఁ గూడి యాంధ్రి
ఘనవైదికార్హ సం•స్కార యై తనరె
ఆంధ్రంబ యటు లౌట•నగును సంస్కృతము
ఆంధ్రి ద్రావిడవాణి • యాంధ్రికర్ణాటి
వినుతుఁడౌ శ్రీరామ • విభునికాలమున
ననుపమాస్థితి • నమర నాంధ్రంబు
ఆంధ్ర విఘ్ననుజ • వాకణ్వమునియు
నాంధ్రవ్యాకృతిఁ జేసి • యతిధన్యుఁ డయ్యె
ఘనుఁడైన యయ్యశో•కమ్మాట్శెంద్రు
ననవద్య శౌర్య వి•హారంబుతోడ
బాధ్యమతావాప్తి • ప్రబలుకాలమున
నిధ్యయశోవ్యాప్తి • నెసఁగ నాంధ్రంబు
చోళ చాళుక్య వి• శ్రుతపవిత్రముల
చోళప్రతాపాగ్ని • స్రుక్క వాఙ్మయము
చాళుక్యవంశ వి•స్తారుండు ఘనుఁడు
చాళుక్య రాజరా•జనరేంద్రచంద్రుఁ
డాచంద్రతారార్క•మై కీర్తిలతిక
ప్రాచీదిశం బట్టి • పశ్చ దిగ్వితతి
దన్నుదరింపఁగఁ • దనరె నాంధ్రంబు
సన్నుత వైదుష్య • సంపన్నులైన
నక్కవీంద్రులు దన • నరసతఁ గాంచి
యాత్మాంత్యముఁగ గొల్వ • నలరార నాంధ్రి
ప్రాకృత సంస్కృత • బంధవేణులను
శ్రీకారవదనలు • చెన్నొందు మత్త
కోకిలాలాపలు • కుసుమవిచిత్ర
ప్రాకటగాత్రలో • భావకుల్ పనులు
మత్తవిక్రీడితల్ • మంజుభాషిణులు
మత్తేభగమనల్ సు•మంగళీమణులు
మహి మహోత్సుకతను • మధ్యసుందరులు
రహిఁగ విరాజ వి•రాజితకావ్య
ధన్యకామణు లట్టు • గానాచి యగుచు
దస్యత్వమున మించు • ధరణి నాంధ్రంబు
మార్దవ మాంధ్రంబు • మధుర మాంధ్రంబు
హార్దమై శ్రావ్యమై • యాంధ్రంబ తనరు.

DR. R. SUBRAMANIYM



శ్రీయుత, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

SRY. K. V. R. SWAMY NAIDU
BARRISTER



శ్రీయుత, కందుల
వీరరాఘవస్వామి నాయుడు

SRY. L. SATYANARAYANA



శ్రీయుత, లింగమల్లు సత్యనారాయణ

SRY. B. VEERANNA



శ్రీయుత, బేతిని వీరన్న

SRY. K. VENFATA RAMA RAU



శ్రీయుత, కటికనేని వెంకటరామారావు

SRY. B. SATYANARAYANA



శ్రీయుత, భమిడిపాటి సత్యనారాయణ

SRY. P. MALLIKARJUNA RAU



శ్రీయుత, పంజిరి మల్లికార్జునరావు

H

SRY V. VENKATA SUBBIAYYA



శ్రీయుత్, టిక్కవరపు రామిరెడ్డి

SRY T. RAMI REDDY



శ్రీయుత్, వెన్నపూస రామిరెడ్డి

SRY. B. CHENDRASEKHARA REDDY



శ్రీయుత్, బెజవాడ చంద్రశేఖరరెడ్డి

JANAB MUHUMMAD KHAJA MOIDEEN



మహమ్మదు ఖాజా మొహిద్దీను సాహేబు

# ఆత్మీయస్వారాజ్యము

ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రి గారు

లోకమునఁ గల ప్రాణు లెల్లరు నిరతిశయసుఖముఁ గోరుటయు దుఃఖము నపేక్షింపక యుండుటయు సహజము. సుఖ మనఁగా ఇంద్రియములకుఁ బ్రియమైనది. (సు+ఖం) ఇంద్రియములకు లెస్స యని వ్యుత్పత్త్యర్థము. విషయేంద్రియ సంయోగమువలనఁ గలిగిన సుఖము మొదట నమృతతుల్యముగ నుండి పిమ్మట విషసదృశ మగును. కావున నట్టి సుఖము నిరతిశయసుఖము కాదనియు దుఃఖమిశ్రమ మనియు ఆధ్యాత్మికశాస్త్రజ్ఞులు కనుఁగొనుచున్నారు. ఇంద్రియాతీతమై బాహ్యవిషయజన్యము గాక, ఆత్మైకవేద్యమైనది నిరతిశయసుఖ మనఁబడును. పాశ్చాత్త్యులు భౌతికవిషయ పరాయణులై ధనమును విశేషముగ నార్జించి ధనమువలననే నిరతిశయసుఖము కలదని యనుకొనిరి. కాని దానివలనఁ దృష్ణయును దుఃఖమును నతిశయించెను. కాఁబట్టి ధనము నిరతిశయసుఖసాధనము కాదు. ధనము లేకున్నను నిఱుపేదలు సుఖసంతోషముల ననుభవించుటయు, ధనాఢ్యులు తృష్ణాపీడితులై చిత్తవిశ్రాంతినిగాని సుఖమును గాని దుఃఖమునుగాని యనుభవించుటయు నెల్లరకు విదితము. దీనినిఁబట్టి పరిశీలింపగా మనస్సంతృప్తినిబట్టి సుఖసంతోషములు కలిగియున్నవే గాని ధనమును బట్టి లేవని స్పష్టమగుచున్నది.

శ్లో. సంతోషామృతతృప్తానాం యత్సుఖం శాంతచేతసాం
కుత స్తద్ధనలుబ్ధానా మితశ్చేతశ్చ ధావతాం?

అను నార్యోక్తి పై విషయమును విశదీకరించుచున్నయది. కొందఱు పుత్త్రమిత్రకళత్రగృహక్షేత్రాదికము సుఖము నిచ్చునని తలంతురు. కాని వీని వియోగమందు మితిలేని దుఃఖము కలుగునని యోజింపరు. పుత్త్రులు మిత్రులు కళత్రము బంధువులు-వీరి యానుకూల్యమందు సుఖమును ప్రాతికూల్యమందు దుఃఖమును గలుగుచుండుటవలన నిది దుఃఖమిశ్రితసుఖమే గాని నిరతిశయసుఖము కాఁజాలదు. ఇట్టి నిరతిశయసుఖ మెట్లు కలుగు ననఁగా ఆత్మవలననే కలుగును. అనఁగా బాహ్యవిషయము లగు, ధనపుత్త్రకళత్రాదులపై నాధారపడక తనయందే ఆయత్తమై యుండునది. తనసుఖము పరులపై నాధారపడియుండినచో; వారి కనుగ్రహము కలిగినపుడు తనకు సుఖంబును, వారికి కోపము కలిగినపుడు తనకు దుఃఖమును సంభవించుచుండును. ఇట్టి దుఃఖమిశ్రితమైన సుఖము నిరతిశయసుఖము గాఁజాలదు. కాబట్టియే:—

శ్లో. సర్వం పరవశం దుఃఖం సర్వ మాత్మవశం సుఖమ్.

అను శ్లోకప్రకారము పరాధీనమైన దంతయు దుఃఖమును ఆత్మాధీనమైన దంతయు (స్వాధీనమైనది) సుఖము నని ప్రాచీను లనుభవజ్ఞులు వక్కాణించిరి. ఈ దృష్టాంతమును బట్టియే స్వదేశీయము లగు వస్తువులను జేయ మఱచి యొకవేళనుం దినను విడిచి విదేశీయవస్తువుల మీఁదనే యాధారపడి సుఖ మనుభవింపఁదలఁచినపుడు ఏదేని కారణాంతరముచే విదేశీయవస్తువులు ప్రాప్తించనపుడు కష్టము కలుగుచున్నది. దుఃఖజనకములును పరాధీనములు నగు విదేశీయవస్తువులపై నాధారపడక స్వదేశీయవస్తువుల నాశ్రయించి సుఖమును స్వాధీనముగ నుంచుకొనుట సమంజస మని యిప్పటి బుద్ధిమంతులు అనుభవమువలనఁ దెలిసికొనిరి. రమణీయములును చిత్తవ్యామోహజనకములు నగు విదేశీయపదార్థములు భారతీయుల చిత్తముల నాకర్షించినందున సుఖముకొఱకై యెంతేని ద్రవ్యము వ్యయపఱచి ఆవస్తువుల గ్రహించుచు స్వదేశీయవస్తువులను జేయుటకు మఱచి, యొకవేళఁ జేసినను విదేశీయవస్తువులవలె రమణీయములుగా నుండమిచే నుపేక్షించియుఁ, బరాధీనసుఖమునకు వశ్యులై యుండిరి.

శ్లో. అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి
యత్తదగ్రే విషమివ పరిణామే హ్యమృతోపమం
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.

అను భగవద్గీతాశ్లోకప్రకారము సాత్త్వికసుఖము మొదట విషతుల్యముగ నుండి అభ్యాసవశంబున నమృతముగఁ బరిణమించును. అట్లులనే స్వదేశీయవస్తువులు మొదట ముదుకగను కఠినముగను కష్టముగను నున్నను అభ్యాసవశంబునఁ బ్రీతితో స్వీకరించుకొనఁదగిన మృదువులుగను రమ్యములుగను ఆనందదాయకములుగను గన్ప

ట్టును. సుఖమును గోరుటవలన కష్టములు కలుగును. కష్టము లని భయముం జెందక శంకింపక స్వధర్మముల ననుష్ఠించుకొలఁదిని సుఖము కలుగును. యథార్థమయిన సుఖముకొఱకు (ఆత్మీయసుఖము) బాహ్యసుఖములను విడువవలయు నని స్పష్ట మగుచున్నది.

శ్లో. సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం
సుఖదుఃఖే మనుష్యాణాం చక్రవ త్పరివర్తతః

అను మహాభారత శ్లోకప్రకారము సుఖానంతరము దుఃఖము- దుఃఖానంతరము సుఖము- చక్రము నందలి యాకులవలెఁ- బ్రాణులకుఁ గలుగు చుండును. సుఖముగాని, దుఃఖముగాని స్థిరముగ నుండక శుక్లకృష్ణపక్షములవలెను, వెన్నెల చీఁకటిచందమునను ఒకదాని వెంబడి నొకటిగ వచ్చుచుండును.

శ్లో. అప్రార్థితాని దుఃఖాని యథైవాయాంతి దేహినాం
సుఖానిచ తథా మన్యే దైన్య మత్రాతిరిచ్యతే.

కోరకుండ దుఃఖము లెవ్విధంబునఁ బ్రాణులకు సంభవించు చుండునో, సుఖములును అవ్విధంబుగనే బ్రాప్తించుచుండు. అట్టియెడ సుఖములకై నిరీక్షించి కోరుట దీనస్వభావ మనఁబడును. ఆయా ఋతుకాలధర్మముల ననుసరించి వృక్షమున ఫలములు పుట్టుచుండు చందంబున దేహ మను వృక్షమునందును, కాలక్రమానుసారంబుగ జనియించు సుఖదుఃఖ ఫలంబులను (దేహి) జీవుఁ డనుభవించుచుండును. ఒక ఋతువునందుఁ గలుగవలసినఫలమును వేఱొకఋతువునందుఁ గోరుటచే లభింపనిచందమున సుఖంబును నిర్ణీతకాలంబునఁ బ్రాప్తించునే గాని కోరినపుడు లభింపదు. ఎండమావులలోని నీటికై మృగములు పరుగిడు చందమున మానవుల మనంబులును బాహ్యవిషయసుఖములకై ప్రధావించుచుండును. ఒకవేళ కష్టపడి సుఖములఁ బొందినను స్థిరముగ నుండక సుఖానుభవానంతరమున దుఃఖము లొదవుచుండును. కాఁబట్టి దుఃఖములు స్థిరముగనుండునని తలఁచి అభ్యాసవశంబునఁ గష్టములనోర్చియుండు ధీరునకు సుఖము లేశంబైనను అనంతముగ నుండును. ఎల్లప్పుడు సుఖముల ననుభవించుచుఁ గోరుచు, వాని నెడఁబాయఁ జాలని భోగాలసుఁడగు నధీరునకు దుఃఖ మల్ప మయినను అనంతముగ నుండును.

శ్లో. దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధ స్థితధీ ర్ముని రుచ్యతే.

అను భగవద్గీతా శ్లోకప్రకారము దుఃఖములు కలిగినపుడు మనస్సు క్షోభముఁ జెందనివాఁడును సుఖములందు కోరిక లేనివాఁడును రాగద్వేషభయములను విడనాడినవాఁడును స్థితప్రజ్ఞుఁ డనఁబడు. కాఁబట్టి యీస్థితప్రజ్ఞునివలె సుఖదుఃఖములు కలిగినపుడు నిర్వికారుఁడై యుండవలెను. సుఖానుభవమువలనఁ గలిగిన రుచిచేత తన కెల్లప్పుడు సుఖము గావలయునని కోరుట రాగమనియు, దుఃఖానుభవమువలనఁ గలిగిన తాపముచేత తన కెప్పుడు దుఃఖము వలదని కోరుట ద్వేషమనియు, జెప్పఁబడును. ఈసుఖదుఃఖములయందు మనస్సు లగ్నమగుటవలన రాగద్వేషములు కలుగును. ద్వంద్వములగు నీసుఖదుఃఖములయందు వివేకి నిర్వికారుఁడగుటవలన రాగద్వేషముల నొందఁజాలఁడు. దుఃఖానుభవమునందు సుఖమును సుఖానుభవమునందు దుఃఖమును అజ్ఞానికిఁ గలుగును. ఎట్టు లనగా? దుఃఖము ననుభవించు కాలంబున తనకు దుఃఖాంతమున సుఖముఁ గలుగు నని భావించుటచే మనోభావనావిశేషంబున దుఃఖ మనుభవించుచున్నను సుఖముగ నుండును. సుఖానుభవకాలంబున తనకు సుఖాంతమున దుఃఖము కలుగు నని భావించుటచే భావనాతిశయంబున సుఖ మనుభవించుచున్నను దుఃఖముగ నుండును. పుణ్యకర్మఫలంబువలన సుఖము కలుగును. సుఖ మనుభవించుకొలఁదిని, పుణ్యకర్మఫలము క్షయించుచున్నది. ఈ సుఖదుఃఖములు రెండును వారి వారి మనఃపరిపక్వమును బట్టి - పరిస్థితులనుబట్టి - మాఱి యుండును. ఒకనికి సుఖకరముగ నుండు పదార్థము వేఱొకనికి దుఃఖకరముగను, వేఱొకనికి దుఃఖకరముగ నుండునది మఱియొకనికి సుఖదాయకముగను నుండును. ఎల్లరకు భయంకరమైనదియు, దుఃఖదాయకమైనదియు నరకతుల్యమయినదియు నగు కారాగృహము; కాలవిశేషంబున స్వార్థత్యాగులును దేశభక్తులు నగు ధీరులకు నిర్భయమయినదియు, సుఖదాయకమయినదియు, స్వర్గతుల్య మయినదియు నై కన్పట్టుచున్నది. ఏకాంతవాసంబునకును, చిత్తవిశ్రాంతికిని, జ్ఞానాభివృద్ధికిని శ్రీకృష్ణజన్మనిలయమునకన్న వేఱొక యావాసము లేదని, ధీరోత్తములగు దేశభక్తుల యనుభవమై చూపట్టుచున్నది. ఒక కాలమునందు సుఖదాయకము లగు పదార్థములు వేఱొక కాలమునందు దుఃఖదాయకములై కన్పట్టుచుండును. కాముకులకు సుఖదములగు కాంతాదులు విరక్తులకు హేయములై కన్పట్టును. దీనిఁబట్టి పరిశీలింప మన

స్థితినిబట్టి సుఖదుఃఖములు కలుగుచున్న వేగాని, బాహ్య పదార్థములయందుఁ గన్పింప వని తేలుచున్నది. సుఖ దుఃఖములు మనఃకల్పితములే గాని పరమార్థమున లేవు. దుఃఖ ముండుటంబట్టియే సుఖముయొక్క విలువ తెలియును. ఎల్లప్పుడు సుఖములోనుండువానికి సుఖస్థితి తెలియదు. దుఃఖములు (విపత్తులు) జ్ఞానవైరాగ్య జనక ములై భగవత్తత్త్వమును జూపించును. సుఖములు భోగ దాయకములై భగవత్తత్త్వమునుండి తొలఁగించును. కాఁబట్టియే జ్ఞానులగు భక్తులు విపత్తులు జ్ఞానదూతిక లని యపేక్షింతురు. దుఃఖముల ననుభవించుటకు నల వడినవానిని ప్రాపంచికవిషయములు బాధింపవు. కావున పారమార్థికసుఖమునకై బాహ్యసుఖమును విడువవల యును. దుఃఖమిశ్రితముకాని నిరతిశయసుఖము (ఆత్మీ యసుఖము) ఎట్లు లభించు ననఁగా, యోగాభ్యాసము వలన లభించును. యోగ మనఁగా చిత్తవృత్తినిరోధ మని పాతంజలయోగశాస్త్రమునఁ జెప్పఁబడినది. విష యములయందుఁ జేరి బహిర్ముఖమైన చిత్తవృత్తిని అంత ర్ముఖముగఁ జేసి పరమాత్మయందు లయింపఁజేయుట యని భావము. జీవుఁడు స్వస్వరూప మగు నిరతిశయా నందసుఖస్వరూపమును మఱచి, ఇంద్రియవ్యాపారము లకు లోఁబడి విషయగహనములోఁ బ్రవేశించి స్వత్వ మునుఁ గోల్పోయి వ్యథలపాలయినపుడు మహనీయుఁ డగు గురువు యోగాభ్యాసముచే విషయగహనమునుండి మఱలించి స్వస్వరూపమును బొందఁజేయుటకు యోగము సాధనము. చిరకాలము పారతంత్ర్యమును బొంది యాత్మీయశక్తిని మఱచిన భారతమండలమును పారతం త్ర్యమునుండి వదలించి స్వాతంత్ర్యమును బొందించు టకు యోగాభ్యాస మావశ్యకమై యున్నది.

ఇట్టి యోగము అష్టాంగములు గలది యని పాతంజలయోగశాస్త్రమునఁ జెప్పఁబడినది.

సూ॥ యమ నియమాసన ప్రాణాయామ
ప్రత్యాహార ధారణధ్యానసమాధయః

యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణ ధ్యానము సమాధి యనెడు నివి అష్టాంగములు. అనగా ఎనిమిది సాధనములు గలవి. ఇందు యమాదు లయిదును యోగమునకు బాహ్యాంగములు. ధారణాదులు మూఁడును అంతరంగములు.

౧. ఇందు యమ మనఁగా, ఇంద్రియవర్గమును లోఁబఱచుకొను ప్రయత్నము. ఇయ్యది పది విధములు. అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము దయ ఆర్జవము క్షమ ధృతి మితాహారము శౌచము.

౨. నియమము ౧౦ విధములు. తపస్సు సంతో షము ఆస్తిక్యము దానము ఈశ్వరపూజనము వేదాంత శ్రవణము లజ్జ మతి జపము వ్రతము—యమనియమ ములు రెండును శరీరమనస్సుల రెంటిని ఉద్వృత్తిలోనికిఁ బోనీయక నియమించి స్వాధీనమందుంచుకొనును.

3. ఆసనము. అనఁగా శరీరము యొక్కయు, మనస్సుయొక్కయు చంచలస్థితియైన రజోధర్మమును పోఁగొట్టునది యగుటచే స్థిరత్వమునుఁ గలుగఁజేయును. ఇయ్యవి హఠయోగప్రదీపిక ప్రకారము ౧౨౮ ఆసన ములు. పద్మాసనము. స్వస్తికాసనము. వీరాసనము మొదలగునవి.

౪. ప్రాణాయామము:—శరీరస్థితికి మూలమగు ప్రాణవాయువును దాని యిచ్చవచ్చినట్లు ప్రవర్తింపఁజే యక నిరోధించి స్వాధీనమం దుంచుకొనుట. అగ్నియం దుంచి కాచినంతమాత్రమున స్వర్ణముమొదలగు ధాతు వులయొక్క మలినము పోయినట్లు ప్రాణాయామమువలన ఇంద్రియదోషము లన్నియు నశించును. రేచక పూరక కుంభకము లని ప్రాణాయామము త్రివిధము.

౫. ప్రత్యాహారము:-విషయములయందు సంచ రించు నేత్రాదులను క్రమప్రకారము మఱలించుట. అనఁగా- ఇంద్రియవృత్తులను బహిర్ముఖమునుండి మఱ లించుట యని భావము.

౬. ధారణ:—ఏదేని విషయమందుఁగాని (పదా ర్థము) దేశమందుఁగాని, చిత్తమును బంధించియుండుట ధారణ యనఁబడును.

౭. ధ్యానము:—ఏదేని పదార్థమందు బంధింపఁ బడిన చిత్తముచే నాపదార్థము నేకాగ్రముగ ధ్యానిం చుట ధ్యాన మనఁబడును.

౮. సమాధి:—చిరకాలము ధ్యానముచేయు టచే ధ్యేయపదార్థమం దైక్యముఁ జెందుట. ధ్యాతృ ధ్యాన ధ్యేయము లను త్రిపుటిభేదము లేక యేకా కారముగ నుండుట. ఇదియే సమాధి. ఇదియే ఆత్మీయ స్వారాజ్యము. అనఁగా సహజానందస్థితి.

ఆత్మీయస్వారాజ్యప్రాప్తికి సాధన మగు యోగ మున కష్టాంగము లున్నట్టుల స్వరాజ్యప్రాప్తికిని అష్టాంగ ములు సాధనము లని మహనీయులచే నిరూపితములు:—

౧. శాసనసభాబహిష్కారము. తత్సభాసభ్యత్వపదవికై ప్రయత్నింపకుండుట. ౨. న్యాయస్థాన బహిష్కారము. న్యాయవాదులు తమవృత్తుల వదలుకొనుట. 3. ప్రభుత్వపాఠశాలా బహిష్కారము. జాతీయవిద్యాప్రతిష్ఠాపనము. ౪. మద్యపాననిషేధము. నీతిబోధ. దుర్వ్యయములను నివారించుట. ౫. విదేశీయవస్త్రబహిష్కారము-స్వదేశీయవస్త్రధారణము. ౬. అస్పృశ్యతావిసర్జనము. ౭. పన్నుల నీయనిరాకరించుట. ౮. శాసనోల్లంఘనము.

నిరాకరణోద్యమయోగంబునకు మొదటివి యైదును బాహ్యాంగములు. అస్పృశ్యతావిసర్జనాదు లగు మూడును అంతరంగములు. బాహ్యాంగముల నైదింటి ననుష్ఠించుటకు జనసామాన్యమునకు సాధ్యము గాని, అంతరంగముల మూడింటి ననుష్ఠించుటకు సాధ్యము కాఁజాలదు. సాధ్య మయ్యెనేని, స్వారాజ్యప్రాప్తి కరస్థ మగును. ఇంద్రియముల జయించి దేహాభిమానము లేని సర్వభూతదయాళు వగు యోగికి సమాధి సిద్ధించిన చందంబున గృహక్షేత్ర కాంతాకనకాదులయెడ నాస వదలి దేహమందు నభిమానము లేని ధీరోత్తమునకు సమాధితుల్య మగు శాసనోల్లంఘనముఁ గావించుటకు సాధ్య మగును. అప్పుడు పారతంత్ర్యము తొలఁగి స్వాతంత్ర్యము లభించు నని మహనీయుల సిద్ధాంతము. ప్రపంచము కాంతాకనకమయము. కాంతాకనకాదులయెడ నాసవదలి త్యాగశీలుఁడగు ధీరోత్తమునకు స్వారాజ్యప్రాప్తి కలుగు నని యిదివఱలోఁ జెప్పఁబడెను. స్వారాజ్య మనఁగా నాత్మీయమైనది గాని ప్రాపంచికమైనది కాఁజాలదు. ప్రపంచములో నిదివఱకు జరిగిన సంగ్రామములు పోరాటములు కలహములు తృష్ణాజనకములగు క్షేత్ర కనక కాంతాదిరూప భోగైశ్వర్యములకుఁ గాని, తత్త్యాగమునకుఁ గాదు. ప్రకృతము ఆత్మీయస్వారాజ్యప్రాప్తికై సలుపు నిరాకరణోద్యమరూప ధర్మసంగ్రామమున ప్రాపంచికవిషయము లగు గృహక్షేత్రధనదారాదులయెడ నాస వదలి దేహాత్మాభిమానము త్యజించి త్యాగబుద్ధి గలిగి యహింసావ్రతము నవలంబించి మెలఁగవలసి యున్నది. అట్లు మెలఁగుట కెట్టి త్యాగము కావలసియున్నదో ఎంతకష్టమో విజ్ఞులఱుఁగుదురు గాత. మహత్తరవిపత్తు రానున్నతఱి గృహక్షేత్ర ధనకనకాదిసర్వస్వము త్యజించుటకన్న విపత్తు రాకమున్నే మనఃపూర్వకముగ ధనక్షేత్రాదులను కడుఁబీదలకు నొసంగుచుఁ బుణ్యాత్ములగు ధీరులు తమ త్యాగశీలతనుఁ బరీక్షించుకొనుచుండవచ్చును. ఇట్లు త్యాగశీలత నభ్యసించుచు రాఁగా సర్వస్వమును ద్యజింపవలసినపుడు విశేషకష్ట ముండఁజాలదు. ఇవ్విషయమునే భర్తృహరి యోగీంద్రుఁడు తన వైరాగ్యశతకంబున "అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాపి విషయాః" అను శ్లోకమునందుఁ జెప్పియున్నాఁడు. విషయసుఖంబు లస్థిరంబులను వివేకబుద్ధితోఁ ద్యజించుకొలఁదిని వైరాగ్య మలవడును. లోకములోఁ గొందఱు పొలముల సరిహద్దులలోఁ గాని- ఇండ్లహద్దులలోఁ గాని- గోష్పాదమంత తమసోదరులకుఁ బోయినచో సైపఁజాలక రాగద్వేషపూరితులై యుత్తమోత్తమన్యాయస్థానముల కెక్కి సొమ్మును విశేషముగ వ్యయపఱచుకొనువారు సహాసబుద్ధితోఁ గడుఁబీదలకు నొసంగుచు నితరు లాక్రమించుకొనినపుడు నిర్వికారులై యుండినచో వారి త్యాగశీలత నేమని కొనియాడవచ్చు? రాగద్వేషరహితు లని వేఱ చెప్పవలెనా? అట్టి ద్వేషరహితు లగు త్యాగశీలురకు స్వారాజ్యము కరతలామలకము. కొందఱు తమ ప్రాణములనైన సమర్పింతురు. శ్రీకృష్ణజన్మనిలయము నైన నాశ్రయింతురు. కాని పిత్రుపైతామహార్జిత మగు క్షేత్రాదులను వదలఁజాలరు. వదలఁగలిగినచో ధీరోత్తము లని చెప్పుట కించుకేని సంశయ ముండదు. ఇట్లు పరిశీలింపగా స్వారాజ్యప్రాప్తి త్యాగశీలతపై నాధారపడి యున్నట్లు కన్పించుచున్నది. యోగాంగములలో నొకటియగు యమములో మొదటిదియగు "అహింస" యోగాభ్యాసమునకు పునాదివంటిది. మనోవాక్కాయకర్మలయందును దౌర్జన్యరహిత మగు "అహింస" నిరాకరణోద్యమయోగమునకును మూలాధారము. అహింసావ్రతము నవలంబించువానికిఁ గ్రిందిమహిమ పాతంజలియోగశాస్త్రమునఁ జెప్పఁబడినది.

సూ. అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః.

౨ పా. 3౫ సూత్రం

అహింసావ్రత మవలంబించువాని సన్నిధియందుఁ బరస్పరము జాతివైరముగల ముంగిససర్పములకును; గోవ్యాఘ్రములకును; మూషికమార్జాలములకును, వైరము లేక మైత్రి కలిగియుండును. అందువలననే మహాత్మునిసన్నిధియందు జాతివైరము లేక మైత్రి కలిగియుండుట. యమాదులలో నొకటియగు క్షమ నభ్యసించె నేని ఇతరులు తన్ను బాధించినను దూషించినను వికారతఁ జెందక

యోర్పు కలుగును. దీనివలన యోగసిద్ధియు శత్రులకు సైతము కనికరమును కలుగును. వేయేల? యమాదుల పదింటిని నభ్యసించినచో నుభయలోకములను జయింప వచ్చును. యమాదులలో నొక్కటిని చక్కఁగ నభ్యసింపఁబడనిచో యోగభంగము (విఘ్నము) కలుగునని వేఱ జెప్పనలయునా? కాఁబట్టియే మహనీయుఁడు దౌర్జన్య రహిత మగు నహింసావ్రతావలంబనము యోగసిద్ధికి మూలాధార మని మాటిమాటికి నుద్బోధించుచున్న వాఁడు. చిరకాలము విషయసుఖముల మఱగి యుద్వృత్తిలోఁ బ్రవర్తించుచున్న ఇంద్రియవర్గమును ప్రవృత్తి మార్గమునుండి నివృత్తిమార్గములోనికి మఱలించునపుడు మహత్తరసంక్షోభము కలుగుచుండఁ బ్రకృతోద్యమము నందును పూర్వాభ్యస్తమార్గమునుండితొలఁగించి నూతన మార్గమునఁ బ్రవేశపెట్టునపుడు సంక్షోభము కలుగకుండు నని యెవరు చెప్పఁగలరు? ఆత్మీయస్వారాజ్యప్రాప్తికై, తుచ్ఛములగు నైహికవిషయసుఖభోగముల విడనాడవలసి నపుడు మహత్తరక్లేశములు సంక్షోభములు కలుగుచున్నను స్వారాజ్యప్రాప్త్యనంతరము నిరతిశయసుఖానందములు కలుగుననుట కించుకేని సందియ ముండదు. కాని ప్రాపంచికవిషయసుఖముల త్యజించుటే మహత్తరకష్టము. పరమాత్మ, ఈశ్వరుఁడు-పశుపతి-యనఁబడును. ఇంద్రియ వర్గమునకు లోఁబడి యైహికవిషయసుఖము లనుభవించు జీవులు పశువు లనఁబడుదురు. ఇంద్రియవర్గముచేఁ గావింపఁబడు పశుబలమునకన్న, క్షమదమాహింసాది గుణములు గల ఆత్మీయబలము గొప్పది. ఇంద్రియవర్గమునకు లోఁబడి యైహికవిషయసుఖముల మఱగి యవివేకి యైన జీవుని ఆత్మీయబలముచే నింద్రియవర్గమును జయించి వానినుండి వదలించి స్వస్వరూపప్రాప్తి కలిగించుటయే స్వారాజ్యపరమార్థము. తన స్వత్వమును మఱచి, భ్రాంతిచే ద్వంద్వప్రపంచమునఁ బడిన జీవుని, విముక్తునిఁ గావించుటయందు ఆత్మీయబలమునకన్న వేఱొక బలము కనిపింపదు. ఇంద్రియవర్గబల మగు పశుబలమునకు లోఁబడినపుడు అవివేకముచే జీవుఁ డనియు, పశుబలమగు నింద్రియవర్గమును ప్రకృతిని జయించి స్వస్వరూపస్థితినిఁ జెంది దివ్యతేజోవిరాజితుఁ డైనపుడు పరమాత్మ యనియుఁ జెప్పఁబడును.

శ్లో. సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
సమం పశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి.

సకలభూతములయందుఁ బరమాత్మ కలఁ డని యును, పరమాత్మయం దెల్లభూతములు కలవనియు జ్ఞానదృష్టిచేఁ దెలిసికొని సకలప్రాణులయందును, సమానముగ వర్తించు మహాత్మునకు (అనఁగా యోగికి) స్వారాజ్యసిద్ధి (అనఁగా బంధమోక్షస్థితి) కలుగుచున్న దని రాజయోగరత్నాకర గ్రంథమునఁ జెప్పఁబడినది.

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

అను శ్రీభగవద్గీతాశ్లోక ప్రకారము సకలజీవుల యందు తాను (ఆత్మ) ఉన్నా ననియు, తనయందు (ఆత్మయందు) సకలజీవు లున్నవనియు, యోగదృష్టిచేఁ జూచుచున్నవాఁడై సకలప్రాణులయందు సమభావముగల మహాత్మునకు స్వారాజ్యరూపమోక్షము సిద్ధించుచున్నది. ఏమహనీయుఁడు సర్వకాలసర్వావస్థలయందుఁ బరమాత్మస్వరూపులగు జీవుల మేలుకోఱకై యెల్లకష్టములను జెందుచు వీరి నెల్లరను తనవారిగఁ జూచుకొనుచు వారిహృదయముల తా నెప్పుడు మెలఁగుచుండునో, అట్టి వానికి స్వారాజ్యసిద్ధి కలుగుననుట కించుకేనియు సంశయముండదు. స్వారాజ్యప్రాప్తి (స్వాతంత్ర్యస్థితి) వారివారి మనస్సులకు గోచరించునది కాని బాహ్యమునకుఁ దెలియునది కాదు.

శ్లో. మదర్థే త్యక్తకర్మాణ స్త్యక్తస్వజనబాంధవాః

అను న్యాయంబున తననిమిత్తము (తనవాగ్గౌరవముచే) బంధు మిత్ర కళత్రాదుల నెడఁబాసి, గృహ క్షేత్ర విత్తసుఖభోగాదుల విడనాడి, పలువిధములగు కష్టములఁ జెందుచున్నా రని తలపోసి, వారి యెల్లరకష్టములు తనకష్టములుగ భావించి, బంధవిముక్తికై పాటుబడు గాంధిమహాత్ముఁడు పరిశుద్ధాంతఃకరణుఁడగుటచే-నెక్కడేని విపత్తు సంక్షోభము పొసఁగనేని, తననిమిత్తము సంభవించిన దని తత్పాపపరిహారార్థము శుద్ధోపవాసములుఁ గావించుచు- నెవరేని యొనరించు దూషణభూషణలకు మనసీయక భగవత్పాదారవిందముల యొద్దఁ బెట్టుచు, నిర్వికారుఁడై దేహేంద్రియమనఃప్రాణంబులను దేశసేవకై సమర్పించుచు, భగవంతుఁడు సర్వభూతమయుఁ డని, ఎల్లభూతములకు మేలు గావించుచు నిరహంకారియై సమయము పొసఁగినపుడు సాక్షీపనిన్నైన జేయుచు, నెల్లరకు సభ్యతుఁడై దేశీయుల సంతతిని తనవాచోధర్మసూత్రమునఁ గట్టి నడిపించుచు, నాశాల గోపాలమునకు సంస్తవనీయుఁడై సకల ప్రపంచవాసుల మనోవీథుల విహరించుచు నుండుట మహత్తరతపఃప్రభా

వంబుగాదె? అట్టిమహాసేయునికి స్వారాజ్యప్రాప్తి కరతలామలకము అనుట ధ్రువము. కాబట్టి స్వారాజ్యప్రాప్తి ఆత్మీయమైనదిగాని భౌతికమైనది కాదు. బద్ధుఁడగు జీవుఁడు వినశ్వరము లగు నింద్రియవిషయసుఖములనుండి మఱలి యంతర్ముఖుఁడై పంచకోశవిలక్షణుఁడును అవస్థాత్రయసాక్షియు శరీరత్రయాతీతుఁడును దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నుఁడును, అవ్యయుఁడును, అనంతుఁడును, సర్వవ్యాపియు, సర్వజ్ఞుఁడును, సచ్చిదానందస్వరూపుఁడు నగు పరమాత్మ తానే నని తెలిసికొనుట బంధవిముక్తియు స్వస్వరూపప్రాప్తియు స్వారాజ్యసిద్ధియు ననఁబడును. తనయందే (పరబ్రహ్మమునందు) అంతయుఁ గల్పిత మనియు; తనకన్న భిన్నమైన పదార్థము లేదనియుఁ దెలిసికొనుట అద్వైతసిద్ధి. సచ్చిదానందస్వరూపుఁడగు పరమాత్మ యెల్లరకు నిరతిశయ సుఖమును జ్ఞాన వైరాగ్యమును ఒసంగి బ్రోచుఁ గాత!

# స్వదేశవ్రతము

**ఒక దేశభక్తుడు**

సాధ్యమన లేదు కాలము. భూపులతో ధ్వజమెత్తినల్పు యుద్ధమ్మన లేదు. భాగ్యధనధాన్యము లిమ్మనికోరలేదు. పుణ్యమ్ము స్వదేశవస్త్రధరణ వ్రతమున్ గొనుమంటి నింతమాత్రమ్మొనరింపలేవె! భరతక్షితి మాతకునై కుమారకా!

ఉ. కోరి విదేశవస్త్రములకున్ దినమున్ మనమిచ్చు సర్వముల్
నూఱులు గావు. వేలు! వెయి నూఱులునున్ వతిగావు; కోటులున్!
భూరులు! తద్ధనంబు పరభూములకున్ జన కిందెయున్న చో
భారతభాగ్యలక్ష్మి వెఱవాఁగలలక్ష్మి సధఃకరింపదే!

సీ. పితృవాక్య మొనరింపఁ బృథురాజ్యముఁ దొఱంగి
యడవుల కేగ మహాత్ముఁ డొకఁడు;
సవతితల్లికిఁ బ్రీతిజనకంబుగా వివా
హము రాజ్యమునువీడె సఖుఁ డొకఁడు;
అర్థి యాచింప నెయ్యంబార దేహంపు
టస్థులొసంగె వదాన్యుఁ డొకఁడు;
గురువాక్యమని సరిజ్ఞరికి సడ్డను సేసె
స్వతనూలతిక ధృతవ్రతుఁ డొకండు;

తే. విమల తద్వంశవార్ధి రత్నమవు నీవు. తల్లి కెలసంబుఁజేయు టెంత
పని నీకుఁ? జరపరదాస్యమును నేఁడె బరిహరింపు. ధృతియుత
వివార! భారతక్షితికుమార!

సీ. తినఁగూడుఁ గట్ట నొయ్యనవస్త్రమును లేక
నడలు సోదరసహస్రములఁ జూచి;
నానాఁటి కడరి దైన్యము జనాలికిఁదెచ్చు
దేశదారిద్ర్యంబు తెఱఁగుఁజూచి;
ప్రియబంధునై పరోర్వికిఁబోక యుండరా
పురమున్నకలవు టొంటు మఱఁజూచి;
అనుదినంబును నంతకంత కెచ్చుచుగాని
తఱుగని బలిసంపు ధరలుచూచి;

తే. ఎఱిఁగి యెఱిఁగి ప్రతీకారదృష్టి లేక, మొఱకుతనమున నిట్టుండు
టుచితమె నీకు? ధర్మ మొనరించుపోట మాంద్యమ్ము దగునె? ధృతి
యుతవిచార! భారతక్షితికుమార!

ఉ. ఎందఱు న్యాయవాదులు వహింపరు లెందఱు కాంతలెందఱుం
దంద విదేశవస్త్రదహనాభిరతిన్ దమకెంపు నూపఁగా
నెందుకుఁగాక యొక్కరుఁ డవీ వటు లాశ్రితారకంబుగా
విందక సగ్గుమయ్యెదవె? నీవికఁ జూన్ బరవస్త్రధారణన్.

ఉ. భారతమాతకున్ దనయభావము నొందవొ? భాగ్యసిద్ధికిన్
దారిదొఱుఁ గవో? వసనధారణ మొగ్గనరింప దంచవో?
తీఱని యుద్యమంబని ధృతిన్ విడనాడితొ? నీతలంపు నెం
పారఁగఁ జెప్పుమయ్య; శుభమయ్యెడి నీకుఁ గుమారశేఖరా!

సీ. భారతవర్షసంభవుఁడ గావందువా?
యీమాట సుచిదితంబైన కల్ల;
భాగ్యసిద్ధికి నిద్ది పథము కాదందువా?
మహితు లెల్లరు నిదె మార్గ మనిరి;
వసనధృతియె మహాపదగొల్పదందువా
కలుషంబులకు మూలకంద మదియె;
అశుభలంబు చేయని పూన్కి యందువా
ఫల మింతకేఁ గొంత వ్యక్త మయ్యె

తే. ఏల సందేహ మేల నిస్పృహత నీకు? నన్ను దెఱచి ప్రపంచంబు
గాంచుమయ్య! మాతృదుఃఖంబు కొంతేని మాన్పుమయ్య! పరులు
నీలోంట్లకును జెప్పువార లయ్య?

సీ. కన్నులంబోవ నల్లడల వార్తాపత్రి
కాలఁ జదువుచున్న యాత్రమంబు
తోపాడి ముందుకూర్చుండి కాంగ్రెసు నుప
న్యాసంబు లాలించినట్టి శ్రద్ధ
మనకై చెఱలలోన వసరుచున్న పదంతు
కల పూరుషుల మనఃకాంక్షితములు
వృత్తు లుద్యోగముల్ విడిచి యిష్టప్రాప్తి
కవ్విభులారు యోగ్యుల తలఁపులు

తే. పొల్లువోకుండఁ బరవస్త్రములు ధరించి, యింకనుందల్లి నొగిలింప నిచ్చ
గింతె? హాహాహా! యెంతకఠినుండ వయ్య నీవు! జటిలవయధీర! భారత
క్షితికుమార!

శా. అన్నా! భారతపుత్ర! పూర్ణమతి నీయంఘ్రిద్వయిన్ వ్రాలెదన్
ఇన్నాళ్లెట్టు లున్నవంటి మిటుమీఁదేనిన్ స్వవస్త్రప్రభా
వోన్నత్యంబు నెఱింగి సన్యవసన వ్యాసక్తి వర్జింత మి
ట్లున్నన్ మాతృఋణంబుదీర్పఁగల మంతో యింతో సత్యంబుగాన్.

# ప్రాచీనాంధ్ర నౌకాజీవనము

భావరాజు వేంకటకృష్ణరావు గారు బి. ఏ., బి. ఎల్.

## పల్లవయుగము క్రీ. శ. ౨౦౦-౬౦౦ ల వఱకు అధినివేశనరాజ్యస్థాపన కాలము

ప్రాచీనాంధ్రులు—ఎంత యుత్సాహముతోను ఎంత పట్టుదలతోను తమ వర్తకమును నౌక సామ్రాజ్యము మొదలగు పశ్చిమదేశములతోఁ జరుపుచు భరతఖండమునకు మహైశ్వర్యమును జేకూర్చియుండిరో యంతకంటె వేయిమడుంగు లధికోత్సాహముతోఁ గార్యదీక్షతో వాణిజ్యార్థమై యేఁగుచు నొకప్పుడు ప్రాగ్ద్వీపసమూహామునందును, బర్మా (పెగు), సయాము కాంబోడియా (చంపకదేశము) లోనగు దేశములందును, అధినివేశరాజ్యములను నెలకొల్పి జగద్విఖ్యాతిని బడసియుండినట్లు సమకాలీనచారిత్రములను బట్టి తెలియవచ్చుచున్నది. ఈ యధినివేశరాజ్యసంస్థాపన ప్రయత్నము ఒక్క వాణిజ్యాభివృద్ధికే గాక హిందూదేశములోని బౌద్ధ బ్రాహ్మణ మతముల వ్యాపకతను చిత్రకళల విజ్ఞానమును విస్తరింపఁజేయుటకుఁ గూడ జరిగినట్లు చరిత్రకారుల యభిప్రాయమై యున్నది.[1] ఈ వలసరాజ్య స్థాపనమునందు ఆంధ్రులును కాళింగులును జూపినయుత్సాహమును, కార్యనిర్వహణదీక్షను బొగడుచు, ఫెర్గ్యూసను పండితుఁడు ధరణికోట అమరావతీస్తూపములం దిప్పటికిని జీర్ణావస్థయందు నిలిచియున్న కట్టడభాగములను, అందలి చిత్తరువులను, పూర్వ మొకప్పుడు కృష్ణా గోదావరీముఖద్వారములం దుండిన రేవుపట్టణములనుండి హిందూదేశములోని నానాప్రాంతములనుండి వచ్చుచుండిన బౌద్ధభిక్షువులు సువర్ణభూమి యనఁబరఁగు పెగు (దక్షిణ బర్మా) దేశమునకును, కాంబోడియా సయామదేశములకును, జావా బోర్నియో సుమత్రా, మున్నగు ప్రాగ్ద్వీపములకును, మతవ్యాపనార్థము వలసపోయినటులు సాక్ష్య మిచ్చుచున్నవని వచియించియున్నాఁడు.[2] ఆంధ్రులం దాకాలమున జాతీయైకమత్యోత్సాహము వెల్లివిరియుచుండుటచే నీ సాహసికజీవనమునకు ప్రబలకారణ మగుచుండెను. కాని యప్పుడప్పుడు దేశమున కలుగుచుండుచుండిన మతసాంఘికరాజకీయపరిస్థితులు కూడ దానిని పురికొల్పుటకు సాధనభూతము లయ్యెను.

మూఁడవశతాబ్దాంతమునకుఁ బూర్వమే ప్రాక్పశ్చిమసముద్రములవఱకు వ్యాపించి యుండిన యాంధ్రమహాసామ్రాజ్యము క్షీణింప నారంభించెను. ఆ సామ్రాజ్యమును బరిపాలించిన శాతవాహనవంశజులలోఁ గడపటివాఁ డగు మూఁడవ పులుమాయి చక్రవర్తి మరణానంతరము సామ్రాజ్యమున నల్లకల్లోలములు సంభవించుటచే నయ్యది యచిరకాలముననే భగ్నమై యదృశ్యమై పోయెను. అంతట నేప్రాంతమును బాలించుచుండిన జాతులవార లాప్రాంతమున స్వాతంత్ర్యమును బ్రకటించి రాజ్యములను నిర్మించియుండిరి. అట్టిసమయమునఁ బూర్వాంధ్రదేశమున దక్షిణమునఁ గాంచీపురము మొదలుకొని యుత్తరమున కళింగ, వేంగిదేశములపర్యంతము గల దేశమును పల్లవులను నొక తెగవారు స్వాధీనపఱచుకొని స్వతంత్రరాజ్యపరిపాలనమును జేయఁ బ్రారంభించిరి. శాతవాహనచక్రవర్తులు బౌద్ధమతావలంబకులుగను, బౌద్ధమతపోషకులుగను నుండ, వారికాలమున సామంతరాజులుగ నుండిన యీ పల్లవరాజులు బ్రాహ్మణమతాభిమానులై బ్రాహ్మణమతము నుద్ధరింప నిరంతరమును ప్రయత్నించుచుండిరి. ఆ కారణమున నాంధ్రసామ్రాజ్య మంతరించి, పల్లవులు విజృంభించిన కాలమునుండియే, బ్రాహ్మణ బౌద్ధమతములకు నొకవిధముగ సంఘర్షణ మారంభమయ్యెను. రాజాదరణ గలిగిన బ్రాహ్మణమత మప్పటినుండియు దినదినాభివృద్ధిఁ గాంచుచుఁ బ్రజాహృదయము నాకర్షించుచుండ బౌద్ధమతమునకు దేశమున నిలువ నీడయునుఁ బోషణయును లేకుండఁ బోవుచుండెను.

ఈ మతపరిస్థితులే గాక రాజకీయపరిస్థితులు కూడ నాంధ్రుల సాహసికజీవనమునకుఁ బురికొల్పి యుండినట్లు గాన్పించుచున్నది. నానాటికి మహైశ్వర్యము నొందుచుండిన యాంధ్రసామ్రాజ్యము యొక్క జనసంఖ్యయు నభివృద్ధి నొందుచుండెను. జనసంఖ్య యభివృద్ధినొందుకొలఁదిఁ బ్రజలయందు వాణిజ్యాభిరుచియును విదేశగమనాభిలాషయును గలిగియుండెను. అట్లు వాణిజ్యాభివృద్ధికై జనులందుఁ గలిగిన విదేశగమనాభిలాష వలసలను (Settlements) నెలకొల్పుటకుఁ బ్రోత్సహించియుండెను. ఆంధ్రులయం దాకాలమున నావిర్భవించిన కోర్కె లన్నియుఁ గార్యరూపమునఁ బుష్పించి ఫలించుచుండ, మతబోధకులును భిక్షుకులును మతసంరక్షణార్థమును, మతవ్యాపనార్థమును గూడ తమంతట తామే వర్తకులతోపాటు విదేశములకు దరలుచు నచ్చటిజనులను నాగరికులను జేయుచుండిరి. ఆకాలపుటాంధ్రు లిట్టి సాహసికజీవనమునందును వాణిజ్యమునందును విశేషముగ నభిలాషఁ గలిగియుండినను ఈకాలపు పాశ్చాత్యులవలె ననాగరకులైన విదేశములతో వర్తకముచేయుచుఁ గ్రమక్రమముగ వారి రాజ్యము నపహరించి స్వాతంత్ర్యమును మంటఁగలిపి యనేకవిధములఁ బీడించి మాతృదేశమున కన్యాయార్జితమైన యైశ్వర్యమును అపయశస్సును ఏమాత్రము చేకూర్పలేదు.

బౌద్ధగాథలను విమర్శించుచోఁ గ్రీస్తునకుఁ బూర్వ మేడవశతాబ్దినుండియే హిందూనావికులు దక్షిణమహాసముద్రముల నన్నిటిని జుట్టివచ్చుచుండిరనియును, హిందూదేశపు వర్తకులు దక్షిణమున సింహళద్వీపములోను తూర్పున బర్మా సయాము కాంబోడియా

1. History of Burma, by Sir A. P. Phayre p. 24.
2. Indian Architecture, page 103.

దేశములతోను వాణిజ్యసంబంధముఁ గలిగియుండి రనియు మాత్రము దెలుపడును. బౌద్ధగ్రంథము లిట్లు సందిగ్ధములైన సూచనలకు మాత్రమే తావొసంగుచుండ, బర్మా సయాముదేశములందును, జావా సుమత్రా బోర్నియో మున్నగు ప్రాగ్ద్వీపములందును నేటివఱకుఁ గాలానుగతముగ వచ్చుచుండిన గాథలు బౌద్ధసారస్వతములోని విషయములను ధ్రువపఱుచుచున్నవి. ఇట్లు ప్రాచీనకాలముననే యాంధ్రులయందుఁ జూడనూపిన సాహసికజీవనోద్యమముయొక్క విపులచారిత్రరచనము (కును తత్కాలనిర్ణయమునకును మనకు వీలుగాక యున్నది. ప్రాచీనాంధ్రభాషతోపాటు అందలి ప్రాచీనసారస్వతము గూడఁ గాలక్రమమున నాశమొందుటచే తెలుఁగు జాలరులగు మనపూర్వుల చారిత్రము కూడ లుప్తమైపోయినది. కాని బర్మాదేశచరిత్రలందును, అచ్చటచ్చట మనదేశమునందు నేటివఱకుఁ జెప్పఁబడుచున్న స్థలపురాణములందును ప్రాచీనాంధ్రసాహసికజీవనము లీలగఁ గాన్పించుచునే యున్నది. పెగుదేశములోని గాథలు ఆంధ్రులు మొదటిమాఱు బుద్ధునికిఁ బూర్వమే దక్షిణబర్మాదేశ మనఁ బరఁగు సువర్ణభూమికి వలస పోయి రాజ్యములు స్థాపించినట్లు సాక్ష్య మొసంగుచున్నవి. బర్మాదేశచరిత్రము వ్రాసిన సదస్యుఁడగు ఫేయిరుగారు "మిక్కిలి ప్రాచీనకాలముననే గోదావరీ, కృష్ణానదీ ముఖద్వార ప్రాంతదేశములనుండి హిందూదేశీయులు బంగాళాఖాతమును దాటివచ్చి, ఐరావతీ డెల్టాభూములయందును తెన్నెసెరభూములయందును వలస తీర్చుకొనినట్లు ఇచటి స్థలపురాణములవలనఁ దెలియుచున్నది. వా రాక్రమించుకొనిన ప్రదేశము బౌద్ధగాథలందు సువర్ణభూమి యనఁ బరఁగుచుండెను. ఈ సువర్ణభూమికి రాజధానియై ప్రఖ్యాతిఁగాంచిన 'తటోను' రేవుపట్టణమునకు గూడ "మన్" భాషయం దిట్టి యర్థమే కలదు. ఈ ప్రాంతమున కీ సువర్ణభూమి యని పే రచట సువర్ణము లభించుటచేఁ గలిగె నని తలఁపఁగూడదు. ప్రాచీనకాలమునుండియు నైరావతీనదిగుండా చీనాదేశములోని వాయవ్యభాగమునుండి సువర్ణమీ ప్రాంతమునకుఁ గొనిరాఁబడుచు నిచ్చటి 'తటోను' రేవుపట్టణమునుండి హిందూదేశమున కెగుమతియగుచుండె ననుకారణమున హిందూదేశీయు లీదేశమును 'సువర్ణభూమి' యని పిలిచియుండిరి." అని వ్రాసియున్నాఁడు.[1] కృష్ణాగోదావరీ మధ్యప్రదేశవాసు లీప్రాంతమునకుఁ దొలుత వాణిజ్యార్థమై వచ్చుచుఁ బోవుచుండినట్లు కాన్పించుచున్నది. ఆకాలమున దక్షిణబర్మాదేశమునకును, దక్షిణహిందూస్థానమునకును వర్తకవ్యాపారము జరుగుచుండినందున వర్తకులు తఱుచుగ వచ్చుచుఁ బోవుచుండిరి. సువర్ణభూమితో వర్తకము విశేషలాభకరముగ నుండుటచేతఁ గాఁబోలు అవకాశము గలిగినప్పుడు కొందఱచ్చటనే వలసగా చేర్పడి స్వదేశములతో వాణిజ్యము సాగించుకొనుచుండిరి. అంతట వాణిజ్య మభివృద్ధినొందుకొలఁది ఆంధ్రులు విరివిగ బర్మాదేశమునకు వలసవచ్చుచు నైరావతీముఖద్వారప్రాంతము నంతను వర్తకస్థానములతో నింపిరి. వలసవచ్చినయాంధ్రులు మంచివర్తకు లగుటచేతను నావికు లగుటచేతను ద్వరలోనే దమవర్తకము నభివృద్ధిచేసికొనుటయే గాక తమ వర్తకస్థానములను దేశములోనికి నైతము వ్యాపింపఁజేసి యుండిరి. అట్లు కొంతకాలము జరుగునప్పటికి మనవారలు స్వతంత్రరాజ్యమును నెలకొల్పఁగలిగి క్రమముగ సువర్ణభూమి నంతనుఁ దమ పరిపాలనము క్రిందికిఁ దేఁజాలియుండిరి. ఆంధ్రులు తొలుత నాక్రమించుకొనిన ప్రాంతము బర్మాలో నేటివఱకు "మన్" రాష్ట్ర మనఁ బరఁగుచున్నది.[2] నాగరకులైన తెలుఁగువారలయాలమున నా ప్రాంతప్రజలను కందఱికి గూడ 'తైలెంగు' లనుపేరు కలిగినట్లు లెఫ్టినెంటుజనరలు పైచ్చీగారు వ్రాసియున్నారు. ఈ విషయమునే మఱియొక చరిత్రకారుఁడగు యస్. డబ్ల్యు కాక్సు[3] గారు కూడ తమ బర్మాదేశపు చరిత్రయందు ధ్రువపఱిచినారు.

క్రమక్రమముగఁ దెలుఁగువారలవలన అభివృద్ధిఁ గాంచుచుండ వలసవచ్చిన తెలుఁగువార లచటిదేశీయులతో స్నేహభావమున మెలంగుచు, వారిని నాగరకులను జేయుచు, వారితో అన్నివిధము లగు సంబంధబాంధవ్యములను గల్పించుకొనుచుండి రని తెలియుచున్నది. ఆకాలమున బర్మాదేశమునకుఁ బోయిన తెలుఁగువారలు తమతోఁ గూడఁ దమ స్త్రీలను దీసికొనివెళ్లియుండి రనుట కాధారములు గాన్పించుట లే దని ఫేయరుగారు నుడివియున్నారు.[4] ఇట్లు వలసపోయిన తెలుఁగువంశజులు బర్మాదేశమునందుఁ గొంతకాలముండిన తరువాత నచ్చటివారితో నందు ముఖ్యముగ "మన్" జాతిస్త్రీలతో వివాహములు చేసికొనుచుండిరి. ఈ తెలుఁగు వారికిని 'మన్' జాతి స్త్రీలకును జనించిన సంతతివారలే 'తలైంగ్' 'తైలింగ్' లని తరువాతి కాలమున వ్యవహరింపఁబడుచు వచ్చిరి. కావుననే చరిత్రకారు లగు ఫేయిరుగారు ఆధునికకాలమున బర్మాదేశమున 'తలైంగు' 'తైలింగు' లని పిలువఁబడుచున్న జాతివార లొకప్పుడు దక్షిణాపథము నందలి త్రిలింగ (Telingaan) దేశములోని తూర్పుతీరమునుండి వలసపోయిన తెలుఁగువారల సంతతివార లనియు 'తలైంగు' 'తెలింగ్' శబ్దములు తెలుంగుశబ్దభవములే యనియు నూహించుచున్నారు.[5] మన పూర్వు లిట్టి మహాకార్యములను నిర్వహించి మాతృదేశమునకు ప్రఖ్యాతిని దెచ్చియుండి రని మన మిపుడు సంతోషభరితుల మగుచున్నను కాలవైపరీత్యమువలన వారు తమ ప్రత్యేకవ్యక్తిత్వమును నిలుపుకొనజాలక యచ్చటిదేశీయులతోఁ గలసిపోయి మాతృదేశముతోడి సంబంధమును సంపూర్ణముగ విడఁగొట్టుకొనిరని తెలుపుటప్పుడు విషాదపూరితులము గాకమానము.

ఈ "తైలింగ్" తలైంగ్ శబ్దములు తెలుఁగు శబ్దభవములే యని నిరూపించుటకు నొకటి రెండుకారణములు గన్పించుచున్నవి. అందొకటి యాంధ్రపదమునకుఁ బర్యాయపదముగ నున్న తెలుఁగు లేక తెలుంగు క్రీస్తుశకారంభకాలమునకుఁ బూర్వమునుండియు వాడుకలో

1. History of Burma by Sir A. Phayre, page 24. 2. Note on Mon by Lieutenant General A. Pytche in 'Burma' Vol, I. p 125. 3. A short history of Burma, by S. W. Cocks. M. A. Chap 11. 4. History of Pegu, by Sir A. Phayre in A. S. J. 5. Sir Arthur Phayre: History of the Burma Race A. S. J. No 1 1864, No 11 18 8.

నుండినట్లు కన్పట్టుచున్నది. పైశాచీభాషయం దీ తెలుంగుపదము 'తెలింగో'గాఁ గానవచ్చుచున్నది. ప్రాచీనమైన పైశాచీభాషయందు తెలుంగుపదము గానవచ్చుటచే తెలుంగుభాషయు నంతటి పురాతనమైన దనియే యూహింపవచ్చును. ఈ తెలుంగుభాష మొదటనుండి యీ త్రిలింగదేశమునందు నివసించు ఆంధ్రులకు మాతృభాషగా నుండిన కతన జనులు త్రిలింగదేశమునుబట్టి భాషకును జనులకును గూడ త్రిలింగశబ్దభవమగు తెలుఁగు పదము వాడఁబడుచువచ్చెను. అట్లగుట వలనఁ గొంతకాలమున కాంధ్ర తెలుఁగుశబ్దము లొకదాని కొకటి పర్యాయపదములుగ వ్యవహరింపఁబడ జొచ్చెను.

"తలైంగ్'' తెలైంగు" పదములకుఁ దెలుఁగుపదమునకుఁ గల పోలికఁబట్టి మాత్రమే గాక తెలుగువారలే తొలుత విదేశగమనమందును సముద్రయానమునందును వలసరాజ్య సంస్థాపనమునందును హిందూదేశీయుల కెల్లరకును మార్గదర్శకు లయి బర్మాదేశమునకు, జావా సుమత్రా దీవులకును తొలుతనే తమ నాగరకతను గొంపోయి వ్యాపింపఁజేసినవా రని నిర్ణయించుటకు మఱియొక ప్రమాణము గలదు. అయ్యది ప్రాచీనాంధ్రభాషాలిపికిని ప్రాచీనమన్ భాషాలిపికిని గల సాదృశ్యమని చెప్పదగును. బర్మాదేశములో శాసనపరిశోధనశాఖవారిచే వెలికిఁ దీయఁబడిన "మన్'' భాషాలిపి స్వరూపము త్రిలింగదేశము లోని (Telingana) ప్రాచీనలిపి బోలి యున్నదని అక్షరతత్త్వజ్ఞుల యభిప్రాయమై యున్నది. ఈ విషయము ఈ వఱకే మన్ జాతివారు తెలుఁగువారల సంతతివారలని దెలిపి యుండిన సుప్రసిద్ధచరిత్రకారుల యభిప్రాయమునకు బలమొసంగుచున్నది. మన్ భాషాశాసనలిపిని పరిశోధించిన అక్షరతత్త్వజ్ఞులు ఈలిపి ప్రాచీనకాలమునం దిచ్చటికి తెలుఁగువారలచే గొనిరాఁబడి క్రమక్రమముగా నభివృద్ధిచేయఁబడిన దని యూహించుచున్నారు. ఆకాలమున హిందూదేశమునకును తూర్పుతీరము నందలి దేశములకును రాకపోకలు వర్తకసంబంధములు నెక్కువగ నుండినకతన మనదేశమునందు వ్యవహారమునందుండిన ప్రతివిషయమును ప్రాగ్ద్వీపములకు దేశములకుగూడ వ్యాపించి యచ్చటి పరిస్థితుల ననుసరించి వృద్ధిపొందుచుండెను. క్రీస్తుశకారంభకాలమున వర్ధిల్లుచుండినది ఆంధ్రసామ్రాజ్యమే! కావున ఆంధ్రలిపినే ఆంధ్రనావికులును వర్తకులును వలసస్థాపకులును మున్నగు సాహసికజీవులు గొంపోయియుందురు.

ఇంతవఱకు బర్మాదేశమునకును ఆంధ్రదేశమునకును గల సంబంధమును సూచించియుంటిమి. ఇఁక మం దాసంబంధ మే విధముగఁ బరిణమించెనో తెలిసికొందము. ఆఱవశతాబ్దిని సువర్ణభూమికి రాజధాని యగు తటోనునగరమునందలి రాజకీయపరిస్థితులు ఆంధ్ర సువర్ణభూములకుఁగల యన్యోన్యసంబంధమును సూచింపఁజాలియున్నవి. ఆకాలమునం దచట రాజ్యముచేయుచుండిన రాజుయొక్క కుమారు లిరువురు విమల తిమల యనువారలు తమతల్లి సైఁగల దురభిమానముకలన పైతృక రాజ్యమును గోల్పోయి కొంతసైన్యమును గూర్చుకొని తటోనునగరమున కుత్తరముగాఁ జని యాప్రాంతమును జయించి యచ్చట నొకరాజ్యమును స్థాపించి పరిపాలించియుండిరని చరిత్రవలనఁ దెలియుచున్నది. ఈ విషయమందలి యథార్థ మెటులున్నను, "తిమల'' "విమల'' యను నామములనుబట్టి చూడఁగా వీరుగాని వీరిపూర్వులుగాని యాంధ్రుల యినట్లును మఱియు పల్లవులయిన శాలంకాయనులతో బృహత్పాలాయనులతో లేక విష్ణుకుండినులతో లేక వంతకంటె పూర్వచాళుక్య వంశమునతో చెందిన యొకశాఖవా రనియుఁ దోఁపక మానదు. ఇట్టి యభిప్రాయమునే సర్ ఆర్థరు ఫెయిరుగారు వెలిబుచ్చిరి. 1

ఆంధ్రదేశమునందు బౌద్ధమతము నిర్మూలముచేయఁబడిన తరువాత నాంధ్రుల ప్రాచీనచారిత్ర మెట్లు విస్మరింపఁబడెనో యట్లే బర్మాదేశమునందు తలైంగురాజ్య మస్తమించినతరువాత వారి చారిత్రము కూడ శత్రురాజులచే బుద్ధిపూర్వకముగ నాశనము గావింపఁబడెను. అంతట కాలానుగతములైన స్థలపురాణములుతప్ప ఇతరచరిత్రాధారము లన్నియు నదృశ్యమై పోయెను. అయిన నీ స్థలపురాణములును గాథలును మిక్కిలి ప్రాచీనములుగఁ దోఁచుచుండుటచే విశ్వసనీయములుగ నున్నవి. మొట్టమొదట బర్మాదేశములోని పెగూప్రాంతమునకు వలసపోయినవారు తెలుఁగువారని నిర్ధారణచేయుటకు కిచట నేఁటివఱకు చెప్పుకొనఁబడుచున్న స్థలపురాణములే సత్యాధారములుగ నున్నవి. ఈ కారణమున ఫెయిరుగారు తమబర్మాదేశచరిత్రమునందు "బర్మాదేశమునకు తొలుతనే వలసవచ్చియుండిన వారు తప్పక ప్రాచీనమగు తెలుఁగుదేశమునుండి వచ్చినవా రని యూహించుట కిచటిగాథలు ప్రబలకారణ మగుచున్న'' వని వ్రాసియుండిరి.

ఈ పూర్వోక్తసందర్భముల నన్నింటిని బాగుగ నెఱింగియుండిన సుప్రసిద్ధచరిత్రకారుఁ డగు ఎల్ఫిన్‌స్టన్ 'తూర్పుతీరవాసులు పశ్చిమతీరపుసోదరులకంటె ముందు సముద్రవ్యాపారమునందు ప్రసిద్ధి గాంచియుండి'రని చెప్పుచున్నాఁడు. దక్షిణమున గోదావరిమొదలుకొని యుత్తరమున గంగానది వఱకును వ్యాపించియుండిన కళింగదేశము ప్రాచీనకాలమునుండియు భరతఖండమున ప్రసిద్ధివడసిన రాజ్యములలో నొకటియై యుండుటయేగాక క్రీస్తునకుఁ బూర్వము మూఁడవశతాబ్దినుండియు సముద్రవాణిజ్యము నడపుచుండినట్లు గానవచ్చుచున్నది. 3 ఆంధ్రసామ్రాజ్యము శాతవాహనుల పరిపాలనమున నానాముఖముల విజృంభించినపుడు కళింగరాజ్యము దానిలో సమ్మిళితమై పోయెను. అటులు సమ్మిళితమై పోవుటయే గాక కళింగదేశము క్రమక్రమముగా నాంధ్రదేశములోని వేంగి మొదలగు ప్రాంతములట్లు ఆంధ్రదేశములోని యొకప్రాంతమునకు ప్రత్యేకనామ మగుట

1. Sir Arthur fhayre History of Burma page 30. 2. Ibid. 3. Huntir's Orissa Vol. 1 page 197.

తిష్ఠించెను.[1] అంతకుఁ బూర్వము కళింగరాజ్యమును బరిపాలించిన బౌద్ధరాజులు పరమతద్వేషులును గాక సహనముగల్గి విదేశగమనమును సముద్రయానవాణిజ్యములను విశేషముగ నభివృద్ధిపఱచియుండిరి.

నౌకాయానము సముద్రవాణిజ్యము కళింగరాజకుమారులు తప్పక యభ్యసింపవలసిన విద్యలుగ నుండె నని శాసనములవలనఁ దెలియుచున్నది.[2] కళింగాంధ్రులు తొలుత సింహళద్వీపముతో వ్యాపారము చేయ నారంభించి రాను రాను బంగాళాఖాతమునుగూడ దాఁటి హిందూ మహాసముద్రమును సైతము ప్రవేశింప నారంభించియుండిరి. బర్మా వారికి మతగ్రంథమైన "బుద్ధగటు"మందు కళింగదేశమునుండి బౌద్ధవర్తకులు బర్మాదేశమునకుఁ బోయి వర్తక మారంభించి లాభము పొందుచుండ బౌద్ధసన్యాసులు మతవ్యాప్తిగావించిరనియుఁ దుదకు కొందఱచ్చటనే యుండి దేశమునుగూడ జయించి రాజ్యస్థాపనముఁ గావించి రనియు వ్రాయబడియున్నది.[3] కళింగదేశమునకును బర్మాదేశమునకును విశేషముగ పరస్పరసంబంధముండినట్లు పెగూదేశమునందు దొరకిన నాణెముల మీఁదఁగల హిందూదేశచిహ్నములవలన ధ్రువపడుచున్న దని ఫేయిరు గారు వచించుచున్నారు.[4] ఈసంబంధము ఇంచుమించుగ పంద్రెం డవశతాబ్దమువఱకు వర్ధిల్లియుండినట్లును అది తలైంగురాజ్య మంత రించిన కొలఁదికాలమునకే విడిపోయియుండె ననియుఁ గూడ తెలియుచున్నది.

ప్రాచీనాంధ్రులు బర్మాదేశమునందు వలస లేర్పఱచుకొనిన తరు వాతఁ గ్రమముగ మలాకాద్వీపకల్పములోనికిఁ గూడ ప్రాకియుండిరి. తూర్పుతీరపుదేశములకును మలాకాద్వీపకల్పమునకును రాకపోకలును వాణిజ్యసంబంధము నుండినట్లును మలయభాషలోని సంస్కృతభాషా ద్భవము లగు కొన్నిపదములవలన మార్స్డెను గారు నిశ్చయించు చున్నారు.[5] మఱియు నచ్చటిజనులు జావాద్వీపమునందువలెనే తూర్పుతీరమునుండి వచ్చినవారి నీకాలమున క్లింగులని పిలుచుచున్నా రని కూడ చెప్పుచున్నాఁడు. ఒకప్పు డాక్లింగుపదము కళింగదేశమునుండి వచ్చినవారి కుపయోగింపఁబడి యుండినను నేఁటికాలమున తక్కువజాతి హిందువులకు చెన్నరాజధానినుండి వచ్చి కూలినాలి చేసి కొను జనులకును వ్యవహరింపఁబడుచున్నది. తూర్పుతీరవాసులకును, మలాకాద్వీపకల్పవాసులకును విశేషసంబంధ ముండెననుట కేవిధమయిన సందేహము లేదనియు నట్టిసంబంధము బౌద్ధమత మభివృద్ధిలో నుండిన కాలమున- ననఁగా క్రీస్తుశక మైదారు శతాబ్దములవఱకు-మిక్కిలి బలీ యముగ నుండెననియు సర్ వాల్టరు ఎలియటుగారు అభిప్రాయపడు చున్నారు.[6] పినాకినీముఖద్వారము మొదలుకొని కాంచీపురమువఱకుఁ గల ప్రాంతమునందు దొరికిన కురుంబా లను పల్లవులలోని నొకతెగవారి నాణెములను బరీక్షచేయుసందర్భమున నీపల్లవరాజుల కాలమున విశేష ముగఁ బశ్చిమదేశములతో సముద్రవాణిజ్యము లేకపోయినను దూర్పున బర్మా, కాంబోడియా దేశములతోడను మలాకాద్వీపకల్పముతోడను సుమత్రా జావా మొదలగు ద్వీపములతోను జనులు తమసొంతయోడ లలో సముద్రముమీఁద వర్తకముచేయుచుండినట్లు తెలియుచున్న దని వ్రాసియుండిరి.[7] ఈవర్తక మేమి కారణముననో బౌద్ధమతము సన్న గిల్లి బ్రాహ్మణ పౌరాణిక హిందూమతము లభివృద్ధి నొందు కాలమున తగ్గిపోయెను.

పల్లవరాజులకాలమున బౌద్ధమతమునకు దేశమునుండి యుద్వా సన మిప్పింపఁబడిరో యని యీ వఱకే తెలిపియుంటిమి. అట్టిమొద వర్త కులు వాణిజ్యార్థమై సముద్రాంతరములకుఁ బోవుచుండ - బౌద్ధభిక్షువులు మతసంరక్షణార్థమై యితరదేశములందు మతవ్యాప్తి గావించుటకు విదేశములకుఁ బోవుచుండిరి. బౌద్ధభిక్షువు లట్లరుగుచుండ, బ్రాహ్మణులు కూడ కొన్ని వేళలందు స్వమతవ్యాపనార్థము బౌద్ధమతము నెడఁ గలుగు ద్వేషముచేఁ బ్రవాస మరుగుచుండిరి. క్రీస్తుశకము యైదవ శతాబ్దమున భరతఖండమును సందర్శింపవచ్చిన చీనాదేశయాత్రికుఁ డగు ఫాహి యాను ఆకాలపు స్థితిగతులను గూర్చి వ్రాయు సందర్భమున—వర్తకపు టోడలు, తామ్రలిప్తినగరమునుండి బయలుదేఱి తూర్పుతీరమువెంబడి ప్రయాణము చేయుచు సింహళద్వీపపు రేవుపట్టణములను జూచుకొని జావాద్వీపమునకుఁ బోవుచుండెనని చెప్పుచున్నాఁడు.[8] ఈయాత్రికుఁడు హిందూదేశమునందు క్రీ॥ శ॥ ౪౦౫ మొదలు ౪౧౧ వఱకును సంచా రము చేసిన పిదప తామ్రలిప్తినగరమున నోడ నెక్కి బహుదినములు పయనము సలిపి సింహళద్వీపమునుజేరి యచ్చటఁ గొంతకాలము నివసించి పిమ్మట వర్తకులు సరకులను గొంపోవునోడ నెక్కి తొంబదిదినములకు సతిప్రయాసముమీఁద యవద్వీపముఁ జేరెను. ఇతఁ డిన్నిదిన ములు ప్రయాణము చేయుటకు కారణమునుగూడ దెలిపియున్నాఁడు. ఇతఁ డెక్కిన యోడలో రెండువందల బాటసారు లుండిరి. ఆ నౌకకు చిన్న నావ యొకటి త్రాటితో వ్రేలాడఁగట్టఁబడి యుండెను. తుపాను మొదలగునవి సంభవించినపు డాచిన్ననావ ప్రయాణికులను సంరక్షిం

1 Sir Walter Elliot. 'Numismata Orientala, page 4. కళింగదేశములోని కాలింగులును, ఆంధ్రులును, ఒక్కతెగ లోనివారే యని యాంధ్రచరిత్రకారుని యభిప్రాయము. అదియుగాక కళింగము ఉత్తరకళింగము, మధ్యకళింగము, కళింగము, అని మూఁడు విధములుగ నుండెననియు నుత్తరకళింగము, ఈకాలపు ఒరిస్సా యని యనియు, మధ్యకళింగము గంజాముమండలములోని ముఖలింగప్రాంత మనియు, కళింగము గోదావరివఱకు గల యాంధ్రదేశమునకుఁ నామాంతరమనియు, కన్నింగుహాముగా రభిప్రాయపడుచున్నారు. ఈ కళింగము నకే త్రిలింగమని నామాంతరముండెననియు, నదియే త్రిలింగమని సాధురూప మయ్యెననియుఁ జెప్పుదురు. వీనినన్నిటిని ప్లైని పేర్కొనియుండెను.

2. Huntir's Orissa Vol. 1 page 188. 3 History of the Burma Ran by Col. A. P. Phayre A. S. J. No 1 1864; No 11 1868. 4. History of Burma by Sir R. P. Phayre page 31. 5. Mukherji's Indian shipping Etc. page 146. 6. Mukherji's Indian shipping. page. 146. 7. Ibid. 8. Fah-ian. Leggee page 113

చుటకై యుపయోగింపఁబడుచుండెనని యూహింపవచ్చును.[1] ఈతఁడు సముద్రముమీఁద ప్రయాణము చేయుచున్నప్పుడు ఓడలో నున్న బ్రాహ్మణు లందఱు నొకప్పుడు తుపానుఁ రాఁగా "నీ శ్రమణుఁడు మనతోఁగూడ నోడపై నుండుటచేత మన మదృష్టవిహీనులమై యీ విపత్తుపాల్పఁ బడితిమి. ఒక్కనికొఱకు మన మందఱము చావరాదు. ఏ ద్వీపము కానఁబడినను ఈ భిక్షువుని భూమిమీఁద విడిచిపెట్టి మనము పోదము" అని తమలోఁ దాము వితర్కించుకొని నిశ్చయించిరఁట. ఈ విషయమువలన నా కాలమున బౌద్ధమత మెంత యనాదరణీయమై యుండెనో విదితము. ఈయాత్రికుఁడు జావాద్వీపమునందు బౌద్ధులే గాక బ్రాహ్మణులును పాషండులును గూడ నెల్లెడ నుండి రని నుడివి యున్నాఁడు.[2] ఆంధ్రచరిత్రకారు లీ విషయమునుగూర్చి వ్రాయుచు, నాంధ్రరాజుల కాలమున నారంభింపఁబడిన సముద్రవర్తకము పాహియాను కాలమునకును నిర్విఘ్నముగ కొనసాగుచుండెనని చెప్పుటకు వీలగుచున్న దని వ్రాసియుండిరి.[3] నాల్గవ శతాబ్దమందు వేంగీరాజు లయిన పల్లవులు జావాసుమాత్రాద్వీపములను జయించినట్లు గానఁబడుచున్నది ఈ విషయము ఆ దీవులలోఁ గానవచ్చిన కొన్ని శాసనముల వలన నిశ్చయింపఁబడుచున్నది. కళింగదేశములోని నాగరకత జావా సుమాత్రా దీవులకు వ్యాపించె నని గాథలలోఁ జెప్పఁగొనటమాత్రముండెను. కాని చాలకాలమువఱకు ప్రత్యక్షనిదర్శన మేమియుఁ గానరాకుండెను. ఇటీవల కోహెను స్టూవర్టు గారిచేఁ గనుఁగొనఁబడిన రెండు శాసనములవలనను కాయిజావాలిపుల యుత్పత్తిత్వము బోధపడినది. ఈ శాసనములు రెండును సంస్కృతభాషయందు రచియింపఁబడి యున్నవి. వీనిలోని లిపి ప్రాచీనవేంగీరాజుల ప్రాచీనశాసనములలోని లిపిని బోలియున్నది.[4] ఆ ద్వీపములో బెయిటెనుజర్గునకు అనతిదూరమున నున్న జాంపియా జాంబో యను ప్రదేశములలోని కొండలపైని సంస్కృతశ్లోకము లతిమనోహరములుగాఁ జెక్కఁబడియున్నవి. మఱియు నీ కొండలపై హిందూరాజుల పాదములు చెక్కఁబడి యున్నవి. ఇవి యీద్వీపములను జయించిన జ్ఞాపకార్థము చెక్కఁబడినవని యూహింపఁ బడుచున్నవి. అప్పటి శాసనములందు ఆ ద్వీపములను జయించి రాజ్యమును స్థాపించినవాఁడు పూర్ణవర్మ యని తెలుపఁబడినది. ఇంకను పూర్ణవర్మశాసనములను బోలిన శాసనములు కొన్ని గలవు. కాని యవి శిథిలము లయి విశేషభాగము స్పష్టముగఁ దెలియరాకుండ నున్నవి. శాసనపరిశోధకు లీ పూర్ణవర్మ, కళింగమును వేంగిని కాంచీపురమును బరిపాలించిన పల్లవులలోనివాఁడై యుండు నని యభిప్రాయపడుచున్నారు. ఈతని శాసనములందలిలిపి ప్రాచీనవేంగీపల్లవశాసనముల లిపిని బోలి యుండుటచేత నైదవశతాబ్దమున కీవలివాఁడు కాఁడని చెప్పవలసి యుండును. ఆ కాలమునందలి పల్లవు లందఱు నొక్కకూటములోని వారే గాని యన్యులు గా రని డాక్టరు బర్నెలు గారు సయితము నుడువుచున్నారు.[5] కాంచీపురమును బాలించిన ప్రాచీనపల్లవుల దేశములో విశేషభాగ మాంధ్రదేశముగానే యుండుటచేతను పూర్ణవర్మయు నాంధ్రదేశములోనివాఁడే యనియు వానితో జావాద్వీపమునకుఁ బోయిన బ్రాహ్మణు లాంధ్ర ద్రావిడ బ్రాహ్మణులై యుందు రనియుఁ జెప్పవచ్చును. సుమాత్రా, జావాద్వీపములోని క్లింగులను కళింగదేశము నుండి వచ్చిన తెలుఁగువాండ్రని పెక్కండ్రు చరిత్రకారులు తలంచుచుండఁగా డాక్టరు బర్నెలుగారు ఉత్తరద్రవిడదేశ తీరమునుండి వచ్చిన ద్రవిడు లని యభిప్రాయపడుచున్నారు.[6] కాని యీ యభిప్రాయము సరిగాదు. తరువాతి కాలమున జావాసుమాత్రాదీవులకుఁ బోయినవారు ద్రావిడు లయినను ప్రాచీనక్లింగులు మాత్రము కళింగదేశమునుండి పోయినవా రని యూహింపక తప్పదు. ప్రాచీనక్లింగులు తోవ త్రోవ చూపిన తరువాతనే దక్షిణదేశీయు లాద్వీపములకు విశేషముగఁ బోవ నారంభించిరి. ఏది యె ట్లున్నను పల్లవరాజుల కాలమున నాంధ్రకళింగ దేశములు, సుమాత్రా జావా మున్నగు ద్వీపములతో వర్తక వ్యాపారము విశేషముగఁ జేయుచుండి రనియు నాంధ్ర ద్రావిడ బ్రాహ్మణులు నైత మేవిధమగు మత సాంఘికాచార నిరోధము లేనియు లేక సముద్రయానమును విదేశగమనమును జేయుచుండి రని నిశ్చయముగఁ జెప్పవచ్చును.[7]

ప్రాచీనకాలమునందే యావిర్భవించిన యీ సాహసికజీవనోద్యమము సాహసికు లగు నావికులను వర్తకులను క్రమక్రమముగా బంగాళాఖాతమును దాటి విశాలసముద్రమును బ్రవేశించి యచ్చటి ప్రాగ్ద్వీపములందు వర్తకస్థానములను వలసలను స్థాపింపఁజేసెను. కళింగదేశపు రేవులనుండియు కృష్ణా గోదావరీ ముఖద్వారములం దుండిన రేవులనుండియు వర్తకులు వాణిజ్యార్థమై నూతనదేశముల నారి యుండుము సముద్రయానము చేసి వచ్చుచుండిరి. అట్టియెడ మరాళి నివేశము గల బౌద్ధులు మతవ్యాపనార్థమై వర్తకులతోఁ గలసి ద్వీప ద్వీపాంతరములకుఁ బోవుచు తమ నాగరకతను మతమును నాటుచు పల్లవింపఁ జేయుచుండిరి. కావుననే ఎల్ఫిన్‌స్టను కళింగాంధ్రుల యధినివేశసంస్థాపనాచారిత్రమును వ్రాయుచు నసంఖ్యాకులగు నీదేశీయులు సాహసికులయి బయలుదేఱి బంగాళాఖాతమును దాటి హిందూమహా సముద్రమును దాఁటి యచ్చటి సుమాత్రాజావాద్వీపములను జేరి వలస లేర్పఱచుకొని యచ్చటి అనాగరకు లగు ద్వీపవాసులను నాగరకులనుజేసి యుద్ధరించి రనియును, తాము యవద్వీపప్రవేశచిహ్నముగ క్రీస్తుశకము ౭౮ వ సంవత్సరమున నొక శకము ప్రారంభించి యుండి రనియు జావాద్వీపచారిత్రమువలన దెలియుచున్న దని వ్రాసియున్నాడు.[8] ఆ సంవత్సరముననే కృష్ణా, గోదావరీముఖద్వారములం దుండిన

1. Fah ien Leggee page 111. 2. ఆంధ్రులచరిత్రము-పూర్వయుగము. పుట. ౨౫౦. 3. ఆంధ్రులచరిత్రము-మొ. భా. పుట ౨౫౦. 4. Rawlinson's Intercouse with Indian and the Western World page 139. 5. Barret's South Indian Paleography page 131. 6. Barnet's South Indian Paleography page 131. 7. ఆంధ్రులచరిత్రము-పూర్వయుగము. పుట ౨౫౧-౨౫౨. 8. Mukherji's Indian shipping page 14.

రేవుపట్టణములలో నొకదానినుండి యాదిత్యుఁడను రాకొమరు డొకఁడు సైన్యసమేతుఁడై జవద్వీపముపై దాడి వెడలి జయించెనని యాదేశమున మఱియొక ప్రతీతిగలదఁట. మఱియు నాదేశమున నాంధ్రరాజుల గూర్చి దెలిపెడి మహాగ్రంథ మొకటిగూడ గలదు. జావాదేశపు భాషాజ్ఞానము సంపాదింపఁగలిగినచో నాంధ్రదేశచరిత్రాత్మకము లగు నూతనాంశము లెన్నియో వెలికి రాఁగలవు.

ఈ పై యంశములను బరికించినచో పూర్ణవర్మ పరిపాలించు కాలమునాఁటికి జావాద్వీపమునందు ఆంధ్రుల వలసరాజ్యము లున్నతస్థితి యం దుండె నని యూహింపఁదగును. జావా సుమాత్రా బోర్నియో మొదలగు ప్రాగ్ద్వీపములం దాకారణమునఁ గళింగాంధ్రదేశమున నా కాలపు పట్టణ గ్రామ నామములతో నెన్నియో నగరములు వెలసి వర్ధిల్లుచుండెను. ఈదీవులందు గాక హిందూదేశీయుల వలసలు బర్మా దేశము మొదలుకొని మలాకాద్వీపకల్పమునకును అనేకములు వెలసి యుండెను. అప్పటికే బౌద్ధమతము చీనాదేశమునకు వ్యాపించియుండుట వలన బౌద్ధభిక్షువులు చీనాదేశమునుండి హిందూదేశమునకు - హిందూ దేశీయులు చీనాదేశమునకు - పోవుట తఱచుగ జరుగుచుండెను. ఇట్లు రాకపోకలు సలుపు బౌద్ధసన్యాసులకును వర్తకవ్యాపారము చేసికొను వర్తకులకును నచ్చటి దీవులందును మలాకాసముద్రప్రాంతము లందును వెలసియుండిన రేవుపట్టణములు వసతుల విశ్రాంతిస్థలములుగ నుండెను. అంతియగాక యొకప్పుడు యాత్రికులకు నోడలు మార్చుకొనవలసిన స్థలములుగూడ నై యుండెను. హిందూదేశమునకు బోయి యభ్యసింపఁ దలంచుకొన్న చీనాదేశీయు లగు బౌద్ధసన్యాసుల కీనగరములందు తొలుత హైందవనాగరకత జీవనము సాంప్రదాయములతో ప్రథమపరిచయము గలుగుచుండెను. 1 అట్లగుటచేత హిందూ సామ్రాజ్యము సముద్రాంతరములకు వ్యాపించి విదేశీయులకు సమ్మోహాముగ నుండె ననుటలో వింత యేమి గలదు?

కావున సుమాత్రా, జావా మొదలగు ప్రాగ్ద్వీపములలోని నాగరకత నిక్కముగా కళింగీల వేంగీదేశముల ప్రాంతములనుండి వ్యాపించె ననుట నిర్వివాదాంశము. భండార్కరు పండితుఁడు గూడ నొకచోట కళింగాంధ్రదేశములకును ప్రాగ్ద్వీపములకును గల సంబంధమును జరుగుచుండిన విశేషసముద్రవాణిజ్యమునుగూర్చి యచ్చట చెప్పఁబడుచున్న గాథలును, శిథిలావస్థయందు జీవించియున్న కట్టడభాగములును, గుహాలయములును, శిల్పకళాదులును గాక అచ్చట గానవచ్చిన శాసనములలోని లిపిగూడ స్పష్టముగ సూచించుచున్న దని చెప్పియుండిరి. 2 క్రీ. శ. ౧౭౫౦-వ ప్రాంతమున క్రాఫర్డు పండితుఁడు కూడ యవద్వీపచారిత్రమును వ్రాయుచు నొక సందర్భమున జావాద్వీపములోని హిందూనాగరకత కళింగదేశములోనుండి యొకప్పుడు వ్యాపించియుండవలయు నని వ్రాయుచున్నాఁడు. 3 ఇంతియేగాక హిందూ నాగరికత ప్రాగ్దేశములకును ద్వీపములకును వ్యాపించె ననుటకు సయాము, కాంబోడియాదేశములందు నయితము నేఁటివఱకు శాలివాహన శకము వాడుచుండుటకన్న మఱియేమి కావలయును.

క్రీస్తుశకారంభకాలముననే ప్రారంభమై యభివృద్ధిగాంచిన యిట్టి యాంధ్రుల యధినివేశసంస్థాపనచరిత్రమును సముద్రవాణిజ్యచారిత్రమును భారతీయేతిహాసమున కంతకు జగజ్జేయమానమైన వైభవమును సమకూర్చిన మహాకార్యములలో నొకటియై విరాజిల్లుచున్నది. ఇట్టి ఘన కార్యములు తొలుత మనపూర్వులే నిర్వహించి రని తెలియవచ్చు టెంతయు నుత్సాహజనకము ఆ మహాచరిత్ర మంతయుఁ విస్మరింపబడుట మన దౌర్భాగ్యము. ఆంధ్రదేశమునందు బౌద్ధమతము ప్రజాహృదయపీఠము నాక్రమించియుండినంత కాలము నిట్టి సాహసిక జీవన మభివృద్ధిలోనుండి బౌద్ధమతావలంబకులచేఁ బ్రోత్సాహింపఁబడి యుండెను. పల్లవసామ్రాజ్యము గూడ నంతరించి పూర్వచాళుక్యరాజ్య సంస్థాపనకాలమున నసఁగా క్రీస్తుశక మేడవశతాబ్దాదిని బౌద్ధమతమునకు సంపూర్ణముగ దేశమునుండి యుద్వాసన మిప్పింపబడి యుండుటచే, హింసింపబడిన బౌద్ధులకు ప్రాణత్యాగమో మతమును పరిత్యజించుటయో, లేక మతాభిమానముచే విదేశములపాలగుటయో ఘటస్థించుచుండెను. ఈ కాలముననే, కడసారి యాంధ్రుల సాహసిక జీవనమునకు నూతనోజ్జీవము గల్గింపబడియుండెను.

1. Mukherji's Indian shipping page. 2. Mukherji's India: shipping page 150. & Bombay Gazetter Part 1 Vol. 1 page 193. 3. Mukherjee's Indian shipping page 1'9.

# సంస్కృత భాషా ప్రాశస్త్యము

దుర్భా సుబ్రహ్మణ్య శర్మ గారు

ప్రతివర్ణమును సకీ♦ప్సితసిద్ధికర మైన, మంత్ర మై చెలువారు ♦ మహితభాష
ప్రతిశబ్దము నకుప్ర♦భాగచిత్రము గాక, వ్యుత్పత్తి నొసఁగు సం♦పూర్ణ భాష
ప్రతివాక్యమును శ్రోతృ♦శ్రవణపుటంబుల, నమృతంబు చిలుకు నె♦య్యంపుభాష
ప్రతికావ్యమును జతు♦ర్వర్గసాధకబోధ, లలితమై తగు నిష్క♦ళంక భాష

ఆ. సంస్కృతంబు విబుధ♦జనతాభినుతయోగ్య, గుణకలాప నట్టి♦కూర్మిభాష
పట్ల నార్యుఁ డెవఁడు ♦ పరమసౌహార్దంబు, నెఱపకుండు ధర్మ♦పరుఁడ యేని?

సీ. వివిధవిద్యాస్వ♦రూపిణి శారదా దేవి, యర్మిలి మాటాడి♦నట్టి భాష
శాపప్రసాద♦నిష్ణాతులౌ పూర్వర్షు, లట గారవించిన ♦ యట్టి భాష
పుణ్యైకనిధులు ♦ వేల్పుం బ్రోడలకు నోలి, వ్యవహారసాధనం ♦ బైన భాష
కాళిదాసాదిస♦త్కవివతంసములు కా, వ్యమ్ములు రచియించి♦నట్టి భాష

తే. సంస్కృతం బట్టి భువనప్ర♦శంసనీయ, వాఙ్మయంబున కెన వేఱు♦భాష కలదె?
ఆర్యదేశాభిమాని యౌ ♦ ననఘుఁ డెవ్వఁ, డుల్లమున దీనిపయిఁ బ్రేమ ♦ నుజ్జగించు?

సీ. అఖిలధర్మసమన్వ♦యము సేయు గీతతోఁ, బ్రతివచ్చుగ్రంథ ♦ మేభాషఁ గలదు?
సకలయోగరహస్య ♦ సంప్రదాయంబులు, పరిఢవించు కృతు ♦ లేభాషఁ గలవు?
పెఱవారు పేరైన ♦ వినని చతుష్షష్టి, పరిమితకళ లవే ♦ భాషఁ గలవు?
'పణినసూను'ని శాస్త్ర♦పంక్తికి నెనయైన, వ్యాకృతిప్రౌఢి యే♦భాషఁ గలదు?

తే. త్రిభువనవిభూష ♦ యౌర! యీ దేవభాష, దైవవశమున నేఁడింత ♦ తగ్గియున్న
ప్రజలకు స్వవస్తుసంప్రీతి ♦ ప్రబలుకొలఁది, దీప్తమై నాఁడునాఁట వర్ధిలక యున్నె?

సీ. తుది మొదల్ లేని యు♦త్తాలిపల్కు గముల పేర్మికి నబ్రపడని శ్రో♦త్రియుఁ డెవండు?
షడ్దర్శనముల యు♦చ్చపుఁ బోకడలఁ జూచి, స్తవ్యంబు లనని శా♦స్త్రజ్ఞుఁ డెవఁడు?
ధ్వనిరసాలంకృతి ♦ ప్రవిభేదముల సూక్ష్మతకుఁ బ్రీతిగొనని వి♦ద్వాంసుఁ డెవఁడు?
గీతనృత్తనవాద్య ♦ చేతోభవాగమం, బుల ప్రౌఢికల రని ♦ ప్రోడ యెవఁడు?

తే. ఆగమపురాణశంత్రేతి♦హాసపఙ్క్తి, వివిధ కాశ్చర్య మొందని ♦ విబుధుఁ డెవఁడు?
ఎఱిఁగి యెఱుఁగనివార లే♦మేమొ యన్న, సర్వతోముఖ మమరభా♦షకుఁ గొఱఁతయె?

చ. వితథములైన వాదములు ♦ వేయును నేటికి? నెందు నేని జీ
వితపరమార్థ సంశయని♦విష్టమనస్కుల సంశయాళిఁ జా
పి తెలుపుచూపు గ్రంథములు ♦ వేలుపు బాసను గాక పుట్టనే?
అతకడపుం గువాఙ్మయము ♦ లౌర! సమంబులె దివ్యభాషకున్?

సీ. ఫలకాంక్ష లేక శి♦ష్యుల నుపాధ్యాయు లా, మ్నాయముల్ వర్ణింపఁ ♦ జేయునాఁడు
ఒజ్జల ఋణమీఁగ ♦ నోడలు తృణంబుగాఁ, దలఁచి శిష్యులు ప్రవ♦ర్తిలెడు నాఁడు
దారిద్ర్య ముడిపి వి♦ద్వజ్జనంబుల కోర్కి, దివిరి భూమీశ్వరుల్ ♦ దీర్చునాఁడు
వర్ణాశ్రమవిభాగ ♦ పారిజాతకుజంబు, తృప్తిఫలముల వ♦ర్ధిలిననాఁడు

తే. ఎట్టియౌన్నత్య మెనసెనో ♦ యెట్టి గౌరవంబు గాంచెనో గీర్వాణ♦వాణి తొల్లి!
యట్టిశుభసిద్ధి క్రమ్మఱ♦నగునొ కాదొ! ఎఱుఁగు నెవఁడు సర్వేశుఁ♦డొక్కరుఁడు దక్క.

# పంచాయతీ సభలు

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు. బి. ఏ., బి. ఎల్. ఎల్టీ

పూర్వము మన గ్రామములు ప్రజాపరిపాలనము కలిగి యుండి ప్రభువు లొండొరులతో పోరాడుచుండినను గ్రామజీవనము నెమ్మదిగా జరుగుచునే యుండెను. రక్తపాతము జరుగుచున్న యుద్ధరంగముల సమీపముననే రయితులు తమ పొలములను నిర్భయముగ దున్నుకొనుచుండిరి. రైళ్లు తంతి మొదలైనవి లేకపోవుటచేత ఒక గ్రామములోనివారు దూరపు గ్రామములకు వెళ్ల నక్కఱ లేకపోయెను. దూరపుసంబంధ బాంధవ్యములు లేవు. గ్రామము మొత్తముమీద ప్రభువులయేజెంట్లు అయిన జమీందారులకు నివాడాకయిలు పద్ధతుల ప్రకారము పండినపంటలో కొంతభాగమును రయితులు ఇచ్చుచుండిరి. తక్కినవిషయములలో గ్రామపరిపాలనము గ్రామోద్యోగీయుల పెత్తనదార్ల స్వాధీనములోనే యుండెను. దరిమిలాను ఆసరాపద్ధతికి బదులు ఇజారాపద్ధతి ననుసరించి సాలియానా గ్రామమొత్తముమీద రొక్కరూపకముగాఁ గొంతపన్ను చెల్లించి, దానిని రయితులు తమపొలములమీద విలవరించుకొనుచుండిరి. ఈకారణముచేత ప్రతిగ్రామము పెత్తనదార్లచేతను మిరాశీదార్లచేతను పరిపాలింపబడుచు ప్రజలు ఐకమత్యముతో మెలగుచు తమలో బయలుదేరుచుండు కలహములను తామే నివారించుకొనుచుండిరి. ఈపద్ధతి నేటికిని నిజాము రాష్ట్రములో కనఁబడుచున్నది.

బ్రిటిషుపరిపాలనలో మనకు నాగరకము లగు సౌఖ్యములు పెక్కులు గలిగినను, స్వరాజ్యమునకు పునాదులైన ప్రజాస్వామ్యములగు గ్రామసంఘములను పూర్ణముగ భగ్నపరచి గ్రామకట్టడిని చంపివేసి, వ్యక్తిస్వాతంత్ర్యమును అన్నివిషయములలోను నెలకొల్పి రయితువారీపద్ధతిని మనదేశములో మనపరిపాలకులు స్థాపించినారు. దేశపరిపాలనాధికారమును కేంద్రీకృతముచేసి గ్రామప్రజలకు ఏవిషయములోను ఎట్టిస్వాతంత్ర్యముల నీయక పైనుండి క్రిందివరకున్న తమ యధికారులకు వారిని లోబడునట్లు చేసిరి. అనేకరాజ్యములను జమీందారీలను తాము ఏదియో యొకసాకు మీఁద లాగుకొని బ్రిటీషుయిండియా యను దేశము నేర్పాటుచేసి, మిగిలియున్న స్వదేశప్రభువులను తమకు బానిసలనుగ చేసివైచిరి. గ్రామమునసబుకరణములను నీచముగఁ జూడ మొదలుపెట్టిరి. పట్టణములలో కోర్టులను స్థాపించి ప్రజలను అక్కడకే పోవునట్లు చేయుటచేత గ్రామపంచాయతీలు నశించి వ్యక్తిస్వాతంత్ర్యము బలసి పార్టీలు మెండై వారిని చీటికిమాటికి కోర్టుల కెక్కునట్లుచేసి గ్రామైక్యమునకు భంగముకలిగించుటయే గాక ధనవంతులకే లాభముకలుగునట్లు న్యాయవిధానమును ఏర్పాటుచేసిరి. యంత్రములమీద చేయబడిన చవుక వస్తువులను మనదేశములోనికి దిగుమతిచేయించి మనము చేతితో నేసిన వస్త్రములు మొదలగు వస్తువులను విదేశములకు పోకుండ వానిమీద నధికసుంకములు వేసి మన గ్రామపరిశ్రమలు కళాకౌశలములు చేతిపనులు తలయెత్తకుండఁ జేయఁగలిగిరి. వ్యవసాయముమీఁదనే జనబాహుళ్యము ఆధారపడ వలసివచ్చి దారిద్ర్యము హెచ్చు అయినది. ఈ బీదదేశము భరింపలేనంత జీతములను పెన్షనులను తమ మిలిటరీ సివిలు నౌఖర్లకు యిప్పించుచు 150 సంవత్సరములనుండి యీవిధముగా ధనప్రవాహము వారిదేశమునకు పంపుటవలన నైశ్వర్యముతో నుండిన యీ దేశము ఇప్పుడు శోషిల్లినది. పూర్వము క్రూరులైన కొందఱు హిందూమహమ్మదీయ పరిపాలకులు దేశమును దోపిడిచేసినను వారు ఇక్కడనే నివాసమేర్పరుచుకొని యిక్కడనే తమద్రవ్యమును ఖర్చుపెట్టియుండుటచేత వారు ఈ బ్రిటిషువర్తకపరిపాలకులకంటె మేలే యనవచ్చును. వీరి యూడిగమునకు పనికివచ్చు విద్య మనకునేర్పి మనలను శరీరమనోదాసులుగ జేసి పల్లెటూరివారికిని ఆంగ్లేయవిద్యనభ్యసించు పట్టణవాసులకును అభిప్రాయములందును ఆదర్శము లందును మిక్కిలి యెడము కలుగఁజేసినారు. అందఱను నిరాయుధులనుగఁ జేసి అబలలకంటెను హీనస్థితికి తీసికొనివచ్చిరి. కోర్టులద్వారా ప్రజలలో కట్టడిచెడగొట్టి భేదోపాయముచేత పరిపాలించుచు, దేశములో నెమ్మదిని స్థాపించితి

మని ప్రగల్భములు కొట్టుచు మనలను స్వాతంత్ర్యేచ్ఛ లేని జీవచ్ఛవములుగ చేసివేసిరి.

ఇప్పుడు మహాత్మా గాంధిగారి యుపదేశమువలన ప్రతిమనుజుడుం దన్నుతాను తెలిసికొనుచున్నాడు. ఆయన ఆత్మస్వరాజ్యము, రాజకీయస్వరాజ్యము లెట్లు కలుగునో బోధచేయుచున్నాడు. మనకు భయమనునది పోయినది. భక్తి వారియందు ఎన్నాళ్ళక్రిందనో నశించినది. వాక్స్వాతంత్ర్య లేఖనస్వాతంత్ర్యముల నరికట్టు శాసనముల నుల్లంఘించి, శిక్షలకు పాత్రులగుటకు జనులు సంతోషముతో సిద్ధపడియున్నారు. పై పేరాలోని సంగతులు సత్యమని నమ్మి యిది యంతయును రాజద్రోహనేరము క్రింద వచ్చినను చావునకు కూడ తెగించి, వ్రాయుచుండుట లేదా! మాట్లాడుచుండుట లేదా! ఇది యంతయు మహాత్ముడు పెట్టిన భిక్ష మని ఆయనకు మన మందఱమును నిత్యమును ఈనిర్భయత్వగుణము నల వడఁజేసినందులకు అనేకవందనముల నాచరించుచుండవలయును.

ఇప్పుడు మన మందఱము స్వరాజ్యసంపాదనకు పూనుకొంటిమి. ఇది గ్రామకట్టుశీవలననే రాగలదు. ఈ కట్టుడిని భంగపరచుచున్నవి పట్టణములయందలి విదేశీయులు స్థాపించినకోర్టులే. ఒకకుటుంబములోనే, అనేకవిధములైన కలహము లున్నపుడు- ఒక గ్రామములో వివిధ కుటుంబములలో వివిధవర్ణములవారికి అనేకవిషయములలో తగవు లుండుట సహజమే. కాని వానిని సులువుగ నివారించుమార్గము గ్రామపంచాయతీస్థాపనముతప్ప మఱి యొకటి లేదు. దీనివలన ద్రవ్యనష్టమును శరీరకష్టమును తప్పును. శీఘ్రముగ తీర్పు లగును. నిజము సులభముగ బయటపడును. అప్పీళ్లుండవు. కాని యీకలియుగములో కొందఱు సాధారణముగా నన్యాయవాదులు ఈ పంచాయితీకి కలసిరాక బ్రిటీషుకోర్టులకే పోయి జూదమాడఁ దలంచుకొందురు. ఉభయపార్టీలు సమ్మతించిన గాని యీపంచాయితీకోర్టువారు పనిచేయఁజాలరు గనుక అబద్ధపు వ్యాజ్యెములు దాఖలుచేసి లేక అబద్ధపు ఆన్సర్లు పెట్టి, హైకోర్టువఱకు జూదమాడి నిరపరాధులను బాధపెట్టుటకు ప్రయత్నించువారిని నివారించు టెట్లు? నాకు ఒక్కటే మార్గము కనఁబడుచున్నది. ప్రతిగ్రామములోను పదిపండ్రెండుగురకంటె ఎక్కువ సంపన్నగృహస్థులును పలుకుబడిగలవారును ఉండరు. వీరే యీవ్యాజ్యెములకు కారకు లని నానమ్మకము. వీరు పార్టీలుగ గాని, సాక్షులుగగాని కోర్టులకు వెళ్లదలచినయెడల తక్కిన గ్రామస్థులుకూడ అక్కడకుఁ బోఁజాలరు. ఒకవేళ నెవరైనను పోవుటకు ప్రయత్నించినను న్యాయమైనకేసు గలవాఁడు ఎప్పుడు గ్రామపంచాయితీకి సాధారణముగా ఒప్పుకొనును. గనుక నీ పండ్రెండుగురు నన్యాయ్యముగ జూదమాడుటకు వెళ్లెడిపార్టీకిసహాయముచేయుటకు నిరాకరించుటయే గాక వానికి వ్యతిరేకముగ సాక్ష్యము చెప్పెదమన్నయెడల కోర్టుకు పోయిన ప్రయోజన ముండ దని ఆరెండవపార్టీకూడ గ్రామము విడిచిపోడు.

పంచాయితీ సంఘమును స్థాపించు విధానమును గుఱించి కొంచెము వ్రాసెదను. గ్రామములోని ధనవంతులు బలవంతులే గాక బీదవారలైనను సత్యవంతులను కూడ అన్నివర్ణములనుండియు సుమారు ముప్పదిమందినైనను పంచాయితీబోర్డుగా నేర్పరచుకొని వారికి ఒక ప్రెసిడెంటును ఒకసెక్రటరీని నియమించుకొనవలెను. ఈ సెక్రటరీగారు, దాఖలుతేది పంచాయితీదార్ల పేర్లు కక్షిదారులపేళ్లు, తీర్పుతేది వ్యాజ్యెపువిషయము మొదలగు ముఖ్యసంగతులను కనఁబరచు ఒకవ్యాజ్యెముల రిజస్టరు పెట్టి పంచాయతీకోర్టువారి రికార్డు జాగ్రత్తగ భద్రపరచవలయును. కక్షిదారులు ఈపంచాయితీబోర్డులో నుండి ఒక్కరు, ముగ్గురు లేక అయిదుగురిని ఏరుకొనవలెను. వీరు బేసిసంఖ్యగా నుండుట అవసరము. ఒకప్పుడు వీరిలో భేదాభిప్రాయములు కలిగినయెడల మెజారిటీవారు తీర్పు చెప్పగలిగియుండవలెను. ఉభయులు చెరి యొకరిని లేక చెరి యిద్దరిని ఏరికొని మిగిలిన పంచాయితీదారులు తాము గాని మొదట నెన్నుకొనబడిన పంచాయితీదార్లు గాని ఏరుకొనునట్లు ఏర్పరుచుకొనవచ్చును. అట్లు యేర్పడిన పంచాయితీదార్ల పేర నొక అర్ధరూపాయి స్టాంపుమీద ఖరారునామా వ్రాసి వారికి ఈయవలెను. అట్టి ఖరారునామాయొక్క మాదిరిని యీక్రింద పొందుపరచుచున్నాను.

కృష్ణాజిల్లా గుడివాడతాలూకా రామనపూడి గ్రామకాపురస్థులు బ్రాహ్మణులు — కోమట్లు — వారు వ్రాసికొన్న సమాఖ్య:—

1. మనఉభయులకు ఫలానా విషయములో (అనగా వారసత్వపుహక్కు, ఆస్తిపంపిణీ యిచ్చిపుచ్చుకొనుట, మొదలగు వర్తక వ్యాపారము మొదలగు విషయములు వక్కాణించుచు) కలిగినతకర

రను ఇందులో మనఉభయుల చే వ్రాల్లతో కనుపరచిన వివరములు కలదానిని గురించి యీ గ్రామపంచాయతీ బోర్డులో చేరిన ఫలాని వారిని పంచాయితీదార్లుగా కోరుకొని వారు సదరుసభ జరుగుచోటు నకు రేర్పడిన పద్ధతుల ననుసరించి న్యాయము ధర్మము ఉచితము అని తోచినలాగు విచారించి చేసేతీర్మానమును మనము ఉభయుల మున్ను ఆఖరుతీర్మానముగా నెంచుకొని ఒప్పుకొనగలవారము.

2. మనఉభయులము పైన యేర్పరచుకొన్న పంచాయితీదార్లను యేకారణముచేనైన వదలుకొనుటకు గాని యీపంచాయితీలో నుంచి తొలగిపోవుటకుగాని మన ఉభయులలో యెవరికిగాని హక్కు కలిగిఉండకుండునట్లు ఏర్పాటు చేసికొనవలసినది.

3. పైన కనుపరచిన ప్రకారము ఏర్పడే పంచాయితీదారులు చేసే తీర్మానము ఆఖరుతీర్మానముగాను, ఈవిషయములో మఃలో నెవరముగాని యేవిధమైన తకరరును పెట్టకుండా ఉండులాగును సదరు తీర్మానము అమలునుగురించి సదరు పంచాయితీలుచేసే యేర్పాటులకు కూడా మన ఉభయులము బాధ్యులమై ఒప్పుకొనులాగునన్ను మనస్ఫూర్తిగా నేర్పరచుకొనవలసినది.

సాక్షి దస్కతులు. దస్కతులు.

పంచాయితీదారులు చేసిన తీర్మానము ప్రకారము అమలుజరుపక యేకక్షిదారుడైనను నిరాకరించిన యెడల పంచాయితీబోర్డువారు అతనిని మందలించి ఒప్పించెదరు. అతనిని కులపెద్దలు బహిష్కరించెదరు. అప్పటికిని మొండివాడుగా నుండిన యెడల అతనిమీద మామూలు కోర్టులో అవార్డుయిచ్చిన ఆరుమాసములలోగా ఆయవార్డునుబట్టి ఒక అర్ధరూపాయి స్టాంపుమీద పిటీషను పెట్టి డిక్రీపొంది తద్ద్వారా అమలు జరిగించుకొనవచ్చును. అవార్డు ఆస్తి మొత్తము వేయిరూపాయలకు మించని యెడల పత్రపుస్టాంపుమీదను ఆపైన నెంత మొత్తమైనను అయిదురూపాయల స్టాంపుమీదను అవార్డు వ్రాయవలెను. కంపెనీవ్యాజ్యెములో పంపినీదస్తావేజుకు వలెనే స్టాంపుడ్యూటీని అవార్డుకు పెట్టవలెను. ఖర్చులకు ఉభయపార్టీలయొద్దనుండి నూటికి ఒకరూపాయి యైనను ముందుగా పంచాయితీబోర్డువారు వసూలు చేయుచుం డుట మంచిది.

# మహాత్ముని ప్రశంస

గోళ్లమూడీ రామరావు గారు

అజ్ఞానతిమిరంబు నణచివ్రేయుటకుఁ గాఁ
సజ్ఞాతుఁడే గాంధి యయ్యెనో క్రొ-
సుజ్ఞానదీపికల్ సొంపొందఁజేయఁ గాఁ
సూర్యుండే గాంధి యయ్యెనో క్రొ-
ఆర్తజనావళి నాదరించుటకుఁ గాఁ
వరదుఁడే గాంధియై వచ్చెనో క్రొ-
కష్టముల్ బోద్రోలి కష్టులఁ బ్రోవఁ గాఁ
రాముఁడే గాంధియై ప్రబలెనో క్రొ-
సర్వవర్ణ జాలకు సఖ్యంబుఁ గూర్పఁ గాఁ
బుద్ధుఁడే గాంధియై బుట్టెనో క్రొ-
అఖిలవిద్యలసొంపు నభివృద్ధిఁజేయఁ గాఁ
బరమేష్ఠి గాంధియై బరగెనో క్రొ-

తే. సుశీల శాంతకవచమాది సజ్జనుండు
కలుషరహితుండు పూజ్యుండు ఘనయశుండు
వసిష్ఠగుణసాంద్రచంద్రు డిమ్మహిని నేఁడు
విమలవిజ్ఞానవేత్తయై వెలసె గాంధి.

సీ. పరుషవాక్యంబులఁ బలుక నేరనివాఁడు
విజ్ఞానమూర్తియై వెలయువాఁడు
పరులనుఁ గోపించి పలుకరించనివాఁడు
నిర్మలహృదయుఁడై నెగడువాఁడు
పరులఁబాధలుఁ జూచి ప్రాలుమాలనివాఁడు
కడగండ్ల నోర్పుతోఁ గాంచువాఁడు
పరహితంబె మనకు భవ్యమంచనువాఁడు
ధర్మసంబద్ధుఁడై తనరువాఁడు

తే. అట్టిధీరుఁ డట్టిసుజను డట్టిమాన్యుఁ
డట్టిధీశాలి యసమధైర్యాన్వితుండు
కర్మపరివేత్తయైన శ్రీగాంధిమహాని
కిలను సములెవ్వ రీశ్వరుం డేఁ యగాని.

MACHARLA MAHAMMADANS



మాచర్ల మహమ్మదీయులు

SRI K. RAMOJI, SRI M. PURNICHENDRA RAM,
J. APPALA NARASIMHAM, A. HANUMANTA RAU NAIDU



శ్రీ కళాశి రామోజీ, మాతేటి పూర్ణిచంద్రరాం.
జొన్నలగడ్డ అప్పల నరసింహం, ఏలూరి హనుమంతరావునాయుడు

SRI BELGAM RAMA DOS NAIDU



శ్రీయుత బెల్గాం రామదాసు నాయుడు

SRI M. SATYA NARAYANA



శ్రీయుత మానికొండ సత్యనారాయణ

SRI K. RAMASAWMY NAIDU



శ్రీయుత కరణం రామస్వామినాయుడు

SRI G. VENKATA RAMANAPPA



శ్రీయుత ఘట్టు వెంకటరమణప్ప

SRI K SUBBA RAU



శ్రీయుత కల్లూరు సుబ్బారావు

SRI G. PUNNAYYA SASTRY



శ్రీయుత గుల్లపల్లి పున్నయ్యశాస్త్రి

SRI
A. PERANARYA KAVI



శ్రీయుత
అనంతగిరి పేరన్నార్యకవి

SRI ARYA BHANUMURTHY



శ్రీయుత ఆర్యభానుమూర్తి

SRI M. SREERAMACHENDRA MURTHY



శ్రీయుత మాదిరాజు శ్రీరామచంద్రమూర్తి

SRI
VENKATARAMANA
CHARYULU



శ్రీయుత
వెంకటరమణాచార్యులు

# Light Runing Fox New Model No. 24 Standard Typewriter.



**Approved for use in Schools and Colleges supplied at lowest rate.**

*Apply to:—*

## C. Y. IYER,

Sole Distributor. Post Box No. 128, MADRAS.

# Fox Portable Typewriter weight 7 lbs, nett.




In G. O. No. 436 Financial dated 9th May 1922 Government have sanctioned the inclusion of the above in the list of Machines authorised for issue to Pnblic offices. ... ...

(*Sd.*) **S. DUNCAN,**
ASST. SUPT., OF STY., MADRAS.

## CERTIFICATE.

*I am glad to certify that the "Fox (Portable) Typewriter" supplied to me by Mr. C. Y. Iyer, its sole agent Post Box 128, Madras, is giving me entire satisfaction.*

Apply to:—

**C Y. IYER,**
Sole Distributor Post Box No. 128, MADRAS.

**M. R. Balasubramania Iyer,**
**Auditor.**
15—6—22

# బ్రిటీషు ఇండియా - ఆఫ్ఘనుస్థానములు

దేశిభట్ల లక్ష్మీనరసింహాము గారు. ఎం. ఏ.

భారతదేశము నేలిన మొగలాయి చక్రవర్తుల సామ్రాజ్యమున నాఫ్ఘనుస్థాన మొకభాగముగ నుండెను. ఆఫ్ఘనుప్రభుత్వము క్షీణము కాఁగానే ఆఫ్ఘనుదేశము చాలభాగముల క్రింద వీడిపోయి స్వతంత్రరాజుల క్రిందకు వచ్చెను. 18-వ శతాబ్ది మధ్యమున అహమదు షాదురాణీ యను వీరుఁడు వీరిని లోఁబఱచుకొని సామ్రాజ్యమును స్థాపించి హిందూదేశముపై దండెత్తి పంజాబు కాశ్మీర రాష్ట్రములను లోఁజేసికొనుటయే గాక ఆఫ్ఘనుదేశపు చుట్టుపట్లనుండు నితర ప్రదేశముల కొన్నిటిని జయించి ఖ్యాతిని బడసెను. కాని యీతని సామ్రాజ్యము బుద్బుదప్రాయమై యతని మరణముతోడనే యంతరించెను. తిరిగి స్వతంత్రరాజు లనేకు లేర్పడిరి. వీరిలో ప్రముఖుఁడు పెషావరునకు అధిపతిగనున్న జమానుషా. ఈయన శైర్యసాహసములచే దురాణీ వంశమును తొలగించి తనవంశమే రాజవంశముగ స్థాపింపఁగోరి ఆఫ్ఘను ప్రదేశముల లోఁబఱచుకొని తానును ఉత్తరహిందూస్థానముపై దండయాత్రఁ జేయ సమకట్టెను.

ఇది 19-వ శతాబ్దినాటిమాట. ఆంగ్లేయప్రభుత్వ మప్పటికి మన దేశముపై గట్టిగ నెలకొని యుండెను. వెలస్లీ ప్రభువు గవర్నరుజనరలు గారుగ నుండిరి. అప్పుడు ఆంగ్లేయులకు ఆఫ్ఘనువిషయములలో జోక్యము కలుగఁజేసికొన నవసర మయ్యెను. ఐరోపాఖండము నంతటిని జయించి బ్రిటిషువారి రాష్ట్రమును - వ్యాపారమును - రూపు మాపవలయు నని బద్ధకంకణుఁడై యుండిన నెపోలియను ఇండియా నెట్లయిన నుత్తర దిక్కు నుండి దండెత్తవలయు నను నిశ్చయముతో పరిషియావారితో రాయబారములు జరుపుచుండెను. ఈ కారణమున వెలస్లీప్రభువు వ్యాకులచిత్తుఁడై 1801-లో పరిషియాబాదుషాకు జానుమేల్కాము అను పేరుగల రాయబారిని పంపి స్నేహాభివృద్ధికై యొక సంధిని చేసికొని రమ్మనెను. మేల్కాము చాకచక్యముగ నట్లే యొనర్చెను. సంధి ప్రకారము ఆఫ్ఘనుజమానుషా ఇండియాపై దండెత్తిన పక్షమున తాను జమానుషాపై యుద్ధము చేయుటకును, నెపోలియను సేనలను తనదేశమునకు రానీయకుండుటకును, పరిషియా ప్రభు వొప్పుకొనెను. ఇట్లొప్పుకొనుటకు ముఖ్యకారణ మేమనఁగ పరిషియాదేశపు టుత్తరభాగమున నున్న రష్యా, ఫ్రెంచివారితో (నెపోలియను దేశీయులతో) రహస్యముగ సఖ్యముగ నుండి, పరిషియాకు సంబంధించిన కాకసస్‌జిల్లాల నాక్రమింప యత్నముచేయుచుండెను. పరిషియా ప్రభువు దానివలన భయపడఁజొచ్చెను. సంధి జరిగిన కారణమున జమానుషా సంకల్పించుకొనియున్న ఇండియాదేశపు దండయాత్ర జరుగలేదు. కాని చివరకు పరిషియా బాదుషాగారి భయములకుఁ గారణము లుండె నని తేలెను. 1802-వ ఆ ప్రాంతములను రష్యావా రాక్రమించుకొనిరి. నెపోలియను తిరిగి పరిషియాకు గూఢమంత్రులను బంపి రష్యాకు భిన్నముగా పరిషియాకు సహాయము చేసెద నని తెలియఁజేసెను. మనస్సున ఫ్రెంచివారి సహాయముతో రష్యానోడించి తన జిల్లాలను రాఁబట్టుకొనుట యిష్టమే. కాని, ఒక సంవత్సరం పూర్వమే ఇంగ్లీషువారితో సంధిచేసికొని యుంటి నిగదా యని పరిషియా ప్రభువు అందోళనమున మునిగియుండెను.

ఇట్లు జరుగుచుండఁగ కొలదిసంవత్సరములలో గొప్ప మార్పు వచ్చెను. రాజనీతిధురంధరుఁడగు నెపోలియను 1807-వ సం॥ జూలై నెలలో రష్యాప్రభువుతో సఖ్యపడి యొక బహిరంగసమాధానముఁ జేసికొనెను. ఇదియే టిల్సిటుసంధి.

ఈ వార్త విని బ్రిటిషుమంత్రులు గుసగుస లాడఁజొచ్చిరి. లండనునుండి యొక రాయబారి పరిషియాకు వెడలెను. ఆయన ఇండియాగవర్నమెంటువారి యుత్తరువుల ననుసరించి నియుక్తుఁడయ్యెను. గవర్నరు జనరలు గారు (మింటో ప్రభువు)కూడ తిరిగి జాన్ మేల్కాము రాయబారిగ పరిషియాకు పంపెను. మింటో ప్రభువు ఆఫ్ఘనుస్థానమునకుఁ గూడ నొక రాయబారిని బంపెను.

ఆఫ్ఘనుస్థానములోని రాజ్యస్థితి యిట్లుండెను. జమానుషా ప్రభుత్వ మంతమై, సింహాసనమునకై రక్తపాతము జరిగి, తుదకు ఆయనసోదరుఁడగు షాషూజా యను నతఁడు కాబూలురాజ్యమునకు వచ్చెను. ఈయనతో ఎల్ఫిన్‌స్టను ఒక సమాధానము చేసికొనెను. కాని షాషూజ జనులకు ప్రియుఁడు కానికారణమున దేశమునుండి యనతికాలముననే తఱుమఁగొట్టఁబడి పంజాబుదేశాధిపతి యగు రంజితసింగు మహారాజుగారిని శరణుఁ జొచ్చెను. అచట తగిన మర్యాదలు పడయక తాను ఇండియా గవర్నమెంటువారి సహాయము నాసింపఁగా వా రాయన కొక నివాసస్థాన మేర్పఱచిరి. ఇంతలో ఆఫ్ఘనుదేశములో సంక్షోభము హెచ్చయి చిట్టచివరకు దోస్తుమహమ్మద్ అను మంత్రివంశస్థుఁ డొకఁడు కాబూలు మొదలు గాఁగల ముఖ్యస్థానములను స్వాధీనము చేసికొనెను. ఈయన జనప్రియుఁడు. ఇండియా గవర్నమెంటువారీయనను గొప్పవానిగ నెంచి యీయనయొద్ద కొక రాయబారిని బార్నెస్ అనువానిని బంపిరి.

ఇదియిట్లుండఁగ రష్యావారు క్రమక్రమముగ పరిషియాప్రాంతముల నున్న జిల్లాల నతికొన్నిటి నాక్రమించుటయే గాక ఆఫ్ఘనుప్రదేశములో హీరటు అను జిల్లాను పట్టుకొనుటకై పరిషియా ప్రభువును పురికొల్పిరి. ఇంగ్లీషువారి భయము హెచ్చగుచుండెను. దీనికిఁ దోడుగ దోస్తుమహమ్మదు రష్యారాయబారిని తన పురమునకు రా ననుజ్ఞ చేసెను.

తత్క్షణమే ఇండియా గవర్నమెంటువారు ఆఫ్ఘనుదేశమునకును ఇండియాకును మధ్య మంచియడ్డు నేర్పఱుప నెంచి రంజిత్సింగుతోను తమ శరణున నుండిన ఆఫ్ఘను షాషూజాతోను స్నేహసమాధానములను జేసికొనిరి. ఆక్లండు ప్రభువు జనప్రియుఁడైన దోస్తుమహమ్మదును త్రోసివేసి షాషూజాను రాజ్యాభిషిక్తునిగఁ జేయ నిశ్చయించెను. ఇందుచేత ఆక్లండు ప్రభువు గొప్పయుద్ధమును తెచ్చిపెట్టుకొనెను. ఇదియే మొదటి ఆఫ్ఘనుయుద్ధము. (1839-40) ఇండియానుండి కొండలోయలను దాటి ఇంగ్లీషువారి సేనలు ఆఫ్ఘనుదేశమును ప్రవేశించి రెండు సంవత్సరములు ఘోరయుద్ధ మాదేశములో జేసెను. చివరకు ఆఫ్ఘనుల కెవరికి నిష్టములేని షాషూజా రాజ్యాభిషిక్తు డాయెను. ప్రజలు కోపోద్దీపితులై తమ దేశమున నున్న ఇంగ్లీషురాయబారు లగు బొరన్సు, మెక్నాటనుల నఱికివేసి షాషూజాను వెళ్లఁగొట్టిరి. తిరిగి దోస్తుమహమ్మదునే రాజ్యమునందు నిల్పిరి. పర్యవసాన మేమనఁగా ఇంగ్లీషువారు నిష్కారణముగ యుద్ధమున కొడిగట్టి 2, 3 కోట్ల రూప్యముల నష్టపడుటయే గాక 20 వేలమంది ప్రాణములను గోల్పోయిరి. ప్రతిఫలమా సున్న. కన్నులొట్టపోను ఎట్లో యిల్లు చేరఁగలిగిరి.

తరువాత 10, 12 సంవత్సరములలో క్రొత్తవిషయములు తల చూపెను. రంజిత్సింగుగారి మరణానంతరము (1839 సం॥ తర్వాత) కొన్ని కల్లోలములచే పంజాబు తొలుమా అగుచుండఁగా, ఇంగ్లీషువారు సిక్కుల నోడించి పంజాబు నాక్రమించుకొనిరి. దానికి దక్షిణమున నుండిన సింధుప్రదేశము కూడ వారిచేతఁ జిక్కెను. ఇట్లు 1854 సం॥ నాటికి సింధూనదిప్రాంతము గాఁగల హిందూస్థానమంతయు బ్రిటిషువారికి స్వాధీనమయ్యెను.

ఇక దీనికి వాయవ్యపు సరిహద్దున కొండలపంక్తు లున్నవి. కొండలోయలలో కొండజాతులవారి ప్రదేశములును, ఆ ప్రదేశముల వెనుక ఆఫ్ఘనుస్థానములు నున్నవి. కొండజాతులవారిలో సుమారెండులును వీరమహమ్మదీయులు. ఒకరికి లోఁబడువారు కారు. ఆఫ్ఘను అమీరు దోస్తుమహమ్మదు మాత్రము వీరందఱు తనకు లోఁబడినవా రనుకొనెడి వాఁడు. బ్రిటిషువారికి మాత్రము రష్యావలని భయమును నీకొండవారి వలని భయమును మెండుగ నుండెను.

దోస్తుమహమ్మదు జనప్రియుఁడై ఆఫ్ఘనుస్థాన మంతయు తన క్రింద నుంచుకొని రాజ్యము చేయుచుండుటను చూచి, ఇండియా గవర్నమెంటువారు వానితో స్నేహభావమున నుండుట మంచి దని తెలిసికొని 1855 లో నొకసంధిని కుదుర్చుకొనిరి. 1857 లో కూడ నట్లే రెండవ సమాధానము జరిగెను. దీనిప్రకారము ఇండియా గవర్నమెంటు తాము అమీరునకు 12 లక్షల రూప్యముల నిచ్చుటకును కాబూలులో తమ తరఫున నొక రేజిడెంటుండుటకును ఏర్పఱచికొనిరి. దోస్తుమహమ్మదు రెండవ షరత్తునకు సంపూర్ణముగ నొప్పికొనక వలసినచో ఇంగ్లీషువారి రేజిడెంటొక డుండవచ్చు ననెను. పిమ్మట 1863 లో దోస్తుమహమ్మదు చనిపోయెను. తత్క్షణమే ఆఫ్ఘనురాజ్యపు వారసత్వమునకు జగడములు జరిగినవి. చివర కతనికుమారులలో నొకఁడగు షర్ అలీ జితుఁ డయ్యెను. అనేకు లితరదేశములకు పాఱిపోయిరి. ఇట్లు వెళ్లినవారిలో నొకఁడు [అబ్దుర్ రహిమాన్ ఖాను అనువాఁడు] రష్యాదేశము ప్రవేశించెను. ఆయన షర్ అలీసోదరులలో నొకని కుమారుడు.

ఇట్టి యల్లరులలో "రష్యాను ఇండియావైపు రానియ్యఁగూడదు. వాస్తవమే. కాని దీనికొఱకై మనము ఆఫ్ఘనువిషయములలో జోక్యము కలుగఁజేసికొనఁగూడదు. ప్రజలచే నంగీకరింపబడిన అమీరే మనకు నంగీకారము. అతఁ డెప్పుడు ఆ అమీరే మనస్నేహితుఁ డగును" అని వైస్రాయి లారెన్సుగారు తన భావమును తెలియఁజేసిరి. వీరివెనుక వచ్చిన వైస్రాయి యగు మేయోప్రభువు షర్ అలీతో స్నేహ మభివృద్ధి గాంచవలయు నని అంబాలాపురమున నొక దర్బారు జరిపి యచటి కతని నాహ్వానించెను. అమీ రచటికి కేతెంచి అన్నిసంగతులఁ జర్చించిన పిదప తన కొడుకులలో అబ్దుల్లాజా అనువానిని తన వారసునిగ నింగ్లీషువా రొప్పుకొనవలయు నని యడుగఁగ వైస్రాయిగారు కొన్ని కారణములచే నొప్పుకొనక మఱియొకకొడుకగు యాకూబుఖానునే వారసునిగ నంగీకరించిరి. అప్పటి కేమి విపరీతము జరుగకపోయినను అమీరు మనస్సున నీసంగతి గట్టిగ నాటుకొనియుండెను. మఱికొన్ని కారణములచే నీ వైమనస్యము హెచ్చయ్యెను. అందులో నొకటి పర్షియాకును ఆఫ్ఘనుస్థానమునకును సరిహద్దున నుండిన సిస్టనుపరగణాలోని పరస్పర వివాదములవిషయమై ఇంగ్లీషువారు మధ్యవర్తిత్వము చేయఁగోరఁ దగా వారు అమీరుగారికి సంతృప్తికరముగ తీర్పులు చేయలేదు. ఇట్లుండఁగ రష్యానుండి అమీరున కుత్తరప్రత్యుత్తరములు నడచుచుండెను. ఇండియా వైస్రాయిగా నగు లిట్టను ప్రభువు భయపడి అమీరువద్దకు నొక రాయబారిని పంపఁగా వానికిఁ దగిన మర్యాదలు జరుగలేదు. అంతియ కాదు. రష్యావారు పర్షియా సరిహద్దుప్రదేశముల నాక్రమించుట యెఱిఁగి ఇండియాపైబడ యత్నింతు రను భీతిలో లిట్టను ప్రభువు కాలములో బెలూచిస్థానములో నున్న క్వెట్టా యను ప్రదేశమును తమసేనల నిలయముగ నుండుటకై యింగ్లీషువారు సంపాదించిరి. అమీరునకు దీనివలన మఱింత కోపము వచ్చెను. ఇంగ్లీషువారియందు నమ్మక ముంచుట పాడి గాదని రష్యారాయబారిని అమీరు తన ముఖ్యస్థానమున కాహ్వానము చేయుటయు వానిద్వారా రష్యావారితో సమాధానము చేసికొనుటయు జరుగుచుండెను. లిట్టను ప్రభువు పంపిన ఇంగ్లీషురాయబారి తిరుగఁగొట్టబడెను. ఈ కారణములచే నిరుపార్టీల వారికి గొప్పయుద్ధము 1878-79 లలో జరిగెను.

ఈ రెండవ సంగ్రామమున షర్ అలీ పరాజితుఁ డైపోయెను. తత్క్షణమే ఆతనికొడుకు యాకూబుఖానే అమీరుగా నధిష్ఠితుఁ డయ్యెను. ఆంగ్లేయ రాయబారులు వానితో సంధి చేసికొనిరి. ఈ సంధి షరతుల ప్రకారము తాను ఇతర రాజ్యములతో యుద్ధముగాని యితర సంబంధములు గాని ఇంగ్లీషువారి యొప్పుదల లేకుండ చేయనని తన దేశములో వీరికి వ్యాపారసౌలభ్యములు కలుగఁజేసెద నని తనదేశమునకును ఇండియాకును సరిహద్దున నున్న కొండమార్గములపై హక్కులను ఇంగ్లీషువారికి వదలుకొనెద నని మున్నగు విషయులను అమీ రొప్పుకొనెను.

అఫ్ఘను ప్రజలకు మాత్రము ఇంగ్లీషువారన్న కోపము వచ్చుచుండెను. అందుచేత నీ హక్కుల సంపాదించిన యింగ్లీషువారిని, ఇచ్చిన అమీరును వారు దూరక విడిచిపెట్టలేదు. కాబూలునందుండ బడిన ఆంగ్లేయరాయబారిని (కావిగ్నేరి యనువానిని) వాని ఆఫీసర్లను చంపివేసిరి. దానిపై నిండియా గవర్నమెంటువారికి పట్టరాని కోపము వచ్చుటచే యుద్ధము తిరుగ ప్రారంభమై జరుగుచుండ యాకూబుఖాను దేశమునుండి పారిపోయెను. ఇది యిట్లుండ నింతకుముందు పారిపోయి రష్యావారి సహాయములో నున్న అబ్దుర్ రహిమాన్ ఖాను అఫ్ఘను ప్రాంతములకుఁ రాఁ దటస్థించెను. 1880 లో నింగ్లీషువారి యేజంట్లు ఆయనను కాబూలుకు తీసికొనివచ్చి తనకు తగిన సహాయము చేసిన అమీరుగ నొప్పుకొనెద మనియు, పరదేశములకు సంబంధించిన విషయములలో తాను ఇంగ్లీషువారి సలహా పుచ్చుకొనుచుండవలయు ననియు, తన యంతరరాజ్యవిషయములలో తమ కేమి జోక్యము కలుగఁజేసికొన మనియు వారు చెప్పఁగా అబ్దుర్ రహిమానుఖాను సమ్మతించెను. తత్క్షణమే కొందఱు అఫ్ఘనుసర్దారుల ఇంగ్లీషు సేనల మధ్య ఆయనకు రాజ్యాభిషేకము జరిగెను. 1, 2 సంవత్సరము లైన తర్వాత ఇంగ్లీషువారు ఆయనకు సం॥నకు 10 లక్షల రూప్యముల (తన ఉత్తరపు సరిహద్దును రష్యావారి బారినుండి కాపాడుకొను నిమిత్తము) నీయ మొదలుపెట్టిరి.

అబ్దురహిమానుఖాను ఈ పైకముతోను ఇంక నితర విధములుగను తన యుద్ధబలముల నభివృద్ధి చేసికొనుచు తనదేశముయొక్క అంతరభివృద్ధికై పాటుపడుచుండెను. ఇండియా సరిహద్దుల నందు వీర మహమ్మదీయు లగు కొండజాతులవారిపై తనయందలి భక్తిని తాను వృద్ధిచేసికొనుచుండెను. అంతియకాని మనస్ఫూర్తిగ నింగ్లీషువారితో నుత్తర ప్రత్యుత్తరము లైనను జరుపుట కతని కిష్టము లేకయుండెను. కాని ఆయన వారితో నెన్నడును కయ్యమునకు కాలు దువ్వలేదు. ఇంగ్లీషువారు మాత్రము అతనిని తమచేతిలో నుంచుకొన నెన్నిపర్యాయములో వ్యవహారములు జరిపిరి. కొండజాతులవారును అమీరును కలిసినచో బ్రిటిషు ఇండియాకు అపాయము వాటిల్లునను భయము ఇంగ్లీషువారి మనసున నుండె ననుటకు సందియము లేదు.

1893 సం॥మున ఇండియా అఫ్ఘనుస్థానములమధ్య హద్దుగీతను నిర్ణయించుటకు ఇండియా గవర్నమెంటువారు డురాండు అను నాయకుని క్రింద నొక కమిషనును బంపిరి. ఇంగ్లీషువారితో జగడమునకు రా నిష్టములేక తనకు సంపూర్ణముగ సమ్మతము లేకపోయినను వారు గీచిన గీతకే అమీ రొప్పుకొనెను. దీనివలన కొండజాతులవారి జిల్లాలపై తన కున్న యధికారమును తాను వదలుకొనవలసివచ్చెను. అంతట నింగ్లీషువారు అమీరునకుఁ గావలసిన మందు గుండు ఆయుధములను బ్రిటిషు యిండియాద్వారా పరదేశములనుండి దిగుమతి చేసికొనుట కొడంబడిరి. మఱియును అమీరునకు తా మిచ్చుచున్న వార్షికమును 18 లక్షలు చేసిరి. ఇన్ని యుపాయము లింగ్లీషువారు చేసినను, అబ్దుర్ రహిమాన్ ఖాను వారిని కొంతదూరముగనే యుంచుచు వచ్చెను. కర్జను ప్రభువుగారి హయాములో నిరుపార్శ్వములవారికిని మనస్పర్థలు కలిగెను. కాని బహిరంగయుద్ధకారణములు రాలేదు. ఇంతకు నాంగ్లేయులకు అఫ్ఘనుస్థానమున నెవ్వరు రాజ్యము చేసినను రష్యాను, ఇండియాపైఁ బడనీయక అఫ్ఘనుస్థానము సద్దుగ నుండవలె నని తప్ప వేఱే యుద్దేశము లేదు.

1901 సం॥ అక్టోబరు నెలలో అబ్దుర్ రహిమానుఖాను చనిపోయెను. అతని కుమారుడు హబీబుల్లాఖాను అమీ రాయెను. తాను తన తండ్రికన్న నెక్కుడుగ నింగ్లీషువారిజోక్య మన్న నిష్టపడెడివాఁడు కాఁడు. తొలుదొల్త కొన్ని సంవత్సరములు తన తండ్రిగారికి వా రిచ్చుచున్న వార్షికముల నిరాకరించెను. కర్జను ప్రభు వెన్నియో పర్యాయము లతనిని ఇండియా దర్శింప నాహ్వానింపగా, తా నంగీకరింపలేదు. బహుశః రష్యాతో స్నేహముగ నుండఁ దాను యత్నించు నేమో యని కొందఱ కనుమానము కలుగుచుండెను. అతనికి సోదరవరుసలో నున్న నాజరుల్లాఖాను అఫ్ఘనుస్థానములో గొప్పపరపతి కలిగియుండి యతనికి సలహా నిచ్చుచుండెను. హబీబుల్లాఖాను తనకు ఇండియాద్వారా యుద్ధసామగ్రులు దిగుమతి చేయుటకు హక్కున్న దని వాక్రుచ్చుచు ఒక పర్యాయము పెషావరునొద్ద అవి ఆపబడఁగాఁ జాల కోపించెను.

ఇట్టి కారణములచే కర్జను ప్రభువు అఫ్ఘనుసమస్యను చాల చాతుర్యముతో నడుపవలసివచ్చుచుండెను. 1904 సం॥ తాను సెలవు మీఁద సీమకు వెళ్లఁగా, ఆంప్తిల్ ప్రభువు ఆయనకు బదులు వైస్రాయిగ నున్న కాలములో అమీరుతో సఖ్యము కలుగున ట్లేర్పాటు జరుపుటకై లూయిడేను అనువాని క్రింద నొక కమిషను పంపెను. అయితే కాబూలులో కమిషనునకు తగిన మర్యాద జరుగలేదు. లూయిడేనుగారు తయారుచేసి అమీరుకుఁ బెట్టిన షరతులను అమీ రొప్పుకొనక తానే స్వయముగ కొన్ని షరతులను తయారుచేసి వాని ప్రకారము నడిచెద నని చెప్పెను. ఈ షరతుల ప్రకారము యుద్ధసామగ్రులను బ్రిటిషు ఇండియాద్వారా దిగుమతి చేసికొనుటకు తనకు హక్కున్న దనియును తన తండ్రిగారి కిచ్చుచున్న 18 లక్షల రూప్యముల వార్షికమును తనకుఁగూడ నింగ్లీషువారు చెల్లింపవలసిన దనియు, ఆనాఁటివఱకు వారు చెల్లింపవలసిన వార్షికపుబాకీ లియ్యవలసినదనియును తన దేశముపై తన కన్నివిధములైన స్వతంత్రాధికారము లున్న వనియు మొదలుగాఁగల నిబంధన లేర్పడెను. అంతియగాని కొంచెమైన నింగ్లీషువారి కనుకూలముగ నొక్కషరతైనను లేదు. అన్యమార్గము కానరాక కమిషనువారు షరతు లన్నిటికి తమ సమ్మతి నిచ్చి ఇండియాకు తిరిగి వచ్చిరి. ఇంగ్లీషువారికి గౌరవభంగము దీనివలన కొంతవట్టు కలిగె నని వేఱుగ చెప్ప నక్కఱలేదు.

1907 లో హబీబుల్లాఖాను ఇండియాను దర్శించెను. వైస్రాయి మింటోగారు తగిన మర్యాదలు చేసిరి.

కొన్ని నెలల తర్వాత ఆంగ్లేయులకును రష్యాదేశమునకును ఒక గొప్ప ఒడంబడిక జరిగెను. ఇది పర్షియా అఫ్ఘనుస్థానము టిబెటు రాష్ట్రములలో వీరిరువురిజోక్య మెంత యనువిషయమైన యొడంబడిక.

ఆఫ్ఘనస్థానపు విషయమై యందు వివరింపఁబడిన అంశముల సారాంశ మేమనఁగా ఇంగ్లీషువారు ఆఫ్ఘనస్థానపు రాజ్యాంగవిషయములలో జే మార్పును చేయునుద్దేశము లేదనియును రష్యావారికి ఆఫ్ఘనులను పురికొల్ప మని యొప్పుకొనుట. దానికిఁగాను రష్యా ఆఫ్ఘనస్థానముపై తన కెట్టి సౌక్యము లేదని యొప్పుకొనుట. అయితే రెండుదేశములవారును ఆఫ్ఘనస్థానములో వ్యాపారపు అవకాశముల సమముగ ననుభవింప సమ్మతించుటా

తనదేశవిషయమై పరులు తనతో నాలోచించకుండ సంధులు చేసికొనుట విపరీతముగ నున్నదని అమీరు న్యాయముగ కోపపడెను. పూర్వపు కోపాగ్నికి ఆజ్యము పోసిన ట్లయ్యెను. ఐరోపావా రన్న అందు ముఖ్యముగ నింగ్లీషువా రన్న అమీరు కేమాత్రము కిట్టక వారిని తన దేశమునకు వీలైనమట్టుకు రానిచ్చెడివాఁడు కాఁడు.

అంతఃకలహములు లేకుండ తన దేశక్షేమమునకై పాటుపడుచు జనహితుఁడై హబీబుల్లాఖాను 1919 సం॥ వఱకు రాజ్యముచేసి చనిపోయెను. ఈయన తన కాలములో జరిగిన ఐరోపామహాసంగ్రామమున జర్మనీ పార్టీవారిచేతిలోను చిక్కక జాగ్రత్తగ మెలఁగెను. కాని ఖిలాఫత్ విషయములో నితనికిని తీవ్రమహమ్మదీయాభిప్రాయములే యుండె ననవచ్చును.

ఈయన చనిపోయిన కొలఁదిదినములలో సింహాసనమునకై యంతఃకలహములు పుట్టెను. నాజరుల్లాఖాను కొన్ని దినములు సింహాసన మధిష్ఠించెను. 1919 సంవత్సరాంతమున హబీబుల్లాఖాను చిన్నకొడుకు అమానుల్లాఖాను అనునతఁడు రాజ్యాభిషిక్తుఁ డయ్యెను. ఈయనయే యిప్పటి అమీరు. ప్రజాప్రియుఁడు. పారంపర్యముగ వచ్చుచున్న యింగ్లీషువారియందలి వైమనస్యభావ మీయనకు హెచ్చుగ నున్నది. రష్యాసోవియటువారితో తాను సఖ్యముగ నుండఁగోరియుండు నను భీతి గూడ కొందఱికి కలదు. ఈ రెండు సం॥లనుండి సరిహద్దుల కొండజాతులవారికలన ఇండియా వాయవ్యప్రాంతములో చాల అల్లరులు జరుగుచున్నది. ఇంగ్లీషువారు వాని నడఁచుచున్నారు. ఇట్టి స్థితిలో ఇండియా గవర్నమెంటువారు డాబ్సు అను రాయబారి క్రింద నొక కమిషనును బంపి అమీరుతో చాలా ప్రయత్నముమీద 1921 సం॥ నవంబరు 21-వ తేదిని సంధిచేసికొనిరి. ఆ సంధినిబంధనలసారాంశ మిది:— రష్యాకాన్సలులను (ఏజెంట్లను) ఆఫ్ఘనదేశములోనికి జేరనీకుండుట-ఆఫ్ఘనదేశముయొక్క అంతర్విషయములందే కాక బాహ్యవిషయములందుకూడ ఇంగ్లీషువారి కెట్టిజోక్యములేకుండుట-అనఁగ అమీరుకు తనదేశముపై సర్వస్వతంత్రాధికారముండుట-ఆఫ్ఘనమంత్రియొకఁడు లండనులోను ఆంగ్లేయమంత్రియొకఁడు కాబూలులోను ఉంచుటకు నిరుపార్వ్యములవారొప్పుకొనుట- అట్లే ఆఫ్ఘనకాన్సలులు ఇండియా ముఖ్యపట్టణములలోను ఇండియా గవర్నమెంటువారి కాన్సలులు ఆఫ్ఘనముఖ్యస్థానములలో నుండుట కొప్పుకొనుట- యుద్ధసామగ్రిని అమీరు ఇండియాద్వారా యథేచ్ఛముగ పరదేశములనుండి దిగుమతి చేయుటకు హక్కు కలుగుట- ఆఫ్ఘనదేశమునుండి ఇండియావారికి నేమిరైన వస్తువులు కావలె నన్న అవి ఆఫ్ఘనదేశజనులకు సరిపోఁగా మిగిలినయెడల ఇండియావారు తెప్పించుకొనుటకు హక్కు కలుగుట- ఇవిగాక సరిహద్దుల విషయమై కొన్ని తీర్మానములు చేయఁబడినవి. ఇండియా గవర్నమెంటువారు అమీరుకిచ్చుచున్న వార్షికమును గూర్చి సంధిలో నేమియు చెప్పబడలేదు. ఈ సంధిని బ్రిటిషుసామ్రాజ్య గవర్నమెంటువారును అమీరుగారును ఒప్పుకొనినట్లు పత్రికల ప్రకారము సర్దార్ అబ్దుల్ హాదిఖాను ఆఫ్ఘనవారితరఫున మంత్రిగ లండనుకు ప్రయాణ మయ్యెననియు, ఇంగ్లీషువారి తరఫున మంత్రిగ మేజరు హంఫ్రీగారు కాబూలుకు వెళ్లుచున్నారనియు నిన్న మొన్నటి తంత్రివార్తలవలన తెలియుచున్నది.

ఆఫ్ఘనదేశమం దైరోపాప్రజల సంపర్క మెంతమాత్రము లేక పోయినను అమీరు స్వదేశాభివృద్ధికై వలయు పాశ్చాత్యనాగరకతాచిహ్నవ్యాప్తిని ప్రోత్సాహపఱుచుచున్నాఁడు.

అమానుల్లాఖాను తీవ్రమహమ్మదీయుఁ డనుటకు సందేహము లేదు. పై సంధి జరిగిన తర్వాత తాను డాబ్సుగారితో భాషించిన సంగతులఁ బట్టి చూడ ఖిలాఫత్ సమస్య తీవ్రమహమ్మదీయాభిప్రాయమున కనుకూలముగ పైసలగునట్లు ఇంగ్లీషువారు చేయవలయు నని తన యభిప్రాయముగ మనకు తెలియుచున్నది.

పై చరిత్రవలన మొదటినుండియు పరులు ఇండియాపైఁ బడుదురను భయముచేత ఆఫ్ఘనవ్యవహారములలో ఇంగ్లీషువారు జోక్యము కలుగఁజేసికొన నవసరము వచ్చె నని చదువరులకు స్పష్టమగును. ఈ భీతి కారణసహిత మైనదా యను విషయము నానావిధములుగ చర్చింపఁబడుచున్నది. కాని యన్ని మతములవారును ఆఫ్ఘన అమీరుతో నింగ్లీషువారు స్నేహభావమున నుండవలయు నని యొప్పుకొనుచున్నారు.

# శ్రీ గోవిందభగవత్పాదులు - రసహృదయ తంత్రము

శ్రీ కాంచబుషి. మృత్యుంజయ శర్మ గారు

అఖిల భారతీయ రసతంత్రవేత్తలలో "రసహృదయతంత్ర" మను రసశాస్త్రమును రచించిన గోవిందభిక్షు లగ్రగణ్యులు. భారతీయరసాయనశాస్త్రేతిహాస మను గ్రంథమును రచించిన ప్రఫుల్ల చంద్ర రాయిగారు గోవిందభిక్షులను బౌద్ధభిక్షు వని యభిప్రాయపడిరి. కాని వీరిని భిక్షుశబ్దమాత్రమున బౌద్ధసన్న్యాసినిగ నూహించుట కాధారము లేదు. ఈ గోవిందభిక్షువు నిజముగ బౌద్ధభిక్షు వైనయెడల తమ రసహృదయతంత్ర మను గ్రంథమున నాదిని పారిహారమంగళాచరణము చేయుటయును, ప్రథమావబోధంబున వేదాంతైకగమ్య మగు బ్రహ్మము ను ప్రతిపాదించుటయును సంభవింపదు. మఱియును 19వ శ్లోకమున

శ్లో॥ యజ్ఞా ద్దానా త్తపసో వేదాధ్యయనా ద్దమా త్సదాచారాత్
అత్యంతం శ్రేయః కిల యోగవశా దాత్మ సంవిత్తేః

అని ప్రశంసించుటవలన నీ తంత్రకర్తను బౌద్ధభిక్షుగ నెంచుట కవకాశము. ఏల యన యజ్ఞదానాదులు నిష్ఫలప్రదము లని బుద్ధాగమప్రసిద్ధము కదా? మఱియును క్షణికవిజ్ఞానవాదు లగు బౌద్ధు లఖండైక బ్రహ్మపదార్థము నెఱిఁగికొనఁ జాలరు. కావున శ్రీ గోవిందభిక్షులు వైదికధర్మానుయాయులే గాని బౌద్ధధర్మావలంబులు కాఁజాలరు. ఈ రసహృదయతంత్రకర్త శ్రీజగద్గురుశంకరాచార్యుల దేశికు లగు శ్రీ గోవిందభగవత్పాదులే యనుటకు కొన్ని యాధారములు కలవు. శంకరమతానుయాయియు వేదభాష్యకర్తయు నగు శ్రీ మాధవాచార్యులు 'సర్వదర్శనసంగ్రహమున' ఈ రసతంత్రవేత్తను సబహుమానముగ నుదాహరించినాఁడు. మఱియును రసహృదయతంత్ర ప్రథమావబోధమున 30 వ శ్లోకమున గల ఈ శ్లోకార్థమును శంకరాచార్యులు ఈ క్రిందిరీతిని సంగ్రహించి యున్నారు.

* శ్లో॥ బాలష్షోడశవర్షో విషయరసాస్వాదలంపటః పరతః
యాతవివేకో వృద్ధో మర్త్యః కథమాప్నుయాన్ముక్తిమ్

"శ్లో॥ బాల స్తావ త్క్రీడాసక్త స్తరుణ స్తావ త్తరుణీసక్తః।
వృద్ధ స్తావ చ్చింతాసక్తః పరే బ్రహ్మణి కోఽపి నసక్తః॥

దీనివలన గురుశిష్యభావము సూచితమగుచున్నది. యోగవిషయమై రసహృదయతంత్రమునఁగల

శ్లో. భ్రూయుగ మధ్యగతం యచ్ఛిఖివిద్యు న్నిర్మలం జగద్భాతి
కేషాంచి త్పుణ్యకృతా మున్మీలతి చిన్మయం జ్యోతిః
పరమానందైకమయం పరమంజ్యోతిః స్వభావ మవికల్పం।
విగళితసర్వక్లేశం జ్ఞేయం శాంతం స్వయం వేద్యమ్॥

అని శ్లోకములను మాధవాచార్యులు రసేశ్వరదర్శనమున శిఖివిద్యుత్సా ర్యకజ్జగద్భాసి-అనియు 'పుణ్యకృతా మున్మీలతి' అనుటకు 'పుణ్యదృశా మున్మీలతి' అనియు 'స్వయం వేద్యః' అనుటకు 'స్వసంవేద్యః' అనియుఁ బాఠాంతరములు లిఖించిరి. దీనిఁబట్టి మాధవాచార్యులు గోవిందభగవత్పాదాచార్యుల పరంపరానుగతు లగుట సూచితము. కనుక ఈ రసతంత్రకర్తయగు గోవిందభిక్షువు శంకరాచార్యుల గురువులగు గోవిందభగవత్పాదులే గాని వేరొక బౌద్ధభిక్షువు కాఁడనుట నిర్వివాదము. కేవల బౌద్ధభిక్షులకే గాక వైదికమతానుయాయు లగు నాచార్యపరంపరకుఁ గూడ 'విజ్ఞానభిక్షు' మొదలగు భిక్షుశబ్దప్రయోగము లున్నవి. ఈ గోవిందభిక్షు లగు రసతంత్రవేత్తను గుఱించి సర్వదర్శనసంగ్రహమునందును, రసేశ్వరదర్శనమునందును, 'గోవిందభగవత్పాదాచార్యైరపి ఉక్త మాచార్యైః' అని యున్నది. రసేశ్వరసిద్ధాంతమున గోవిందభగవత్పాదాచార్యో గోవిందనాయకః అనియు శ్రీరామచంద్రగుహులను సిద్ధునిచే రచింపఁబడిన రసేంద్రచింతామణి యను రసగ్రంథమున "భగవద్గోవిందపాదాస్తు కేఽగాంత మేక..." అనియు లిఖింపఁబడి యున్నది. ఇందువలనఁ బ్రసిద్ధరసతంత్రవేత్తలలో నీగోవిందభిక్షు లగ్రగణ్యు లని యూహింపఁదగును. తమ తమ శరీరములు రసమయము లుగాఁ జేసికొని జీవన్ముక్తులైన సిద్ధులు దేవదానవమానవులలో గొందఱు పూర్వ ముండియున్నట్లు గ్రంథాంతరములం దున్నది :—

" దేవాః కేచి న్మహేశాద్యాః దైత్యాః కంసపురస్సరాః
మునయో వాలఖిల్యాద్యా నృపాః సోమేశ్వరాదయః
గోవిందభగవత్పాదాచార్యో గోవిందనాయకః
చర్పటిః కపిలో వ్యాళిః కాపాలిః కందలాయనః
ఏతేఽన్యే బహవ స్సిద్ధాః జీవన్ముక్తా శ్చరన్తి హి
తనుం రసమయీ మాప్య తదాత్మకకథావశాః "

ఈ యుద్ధృత శ్లోకముల వలన గోవిందభగవత్పాదాచార్యులు జీవన్ముక్తులైన రససిద్ధులలో నొక్క రని స్పష్టమగుచున్నది.

గోవిందభిక్షులు రసహృదయతంత్రమున నాత్మవృత్తాంత మిట్లు ఉద్ఘాటించియున్నారు.

" శీతాంశువంశసంభవ హైహయకులజన్మజనిత గుణమహిమా
సజయతి శ్రీమదనశ్చ కిరాతనాథో రసాచార్యః
తస్య స్వయ మవతీర్ణా రసవిద్యా సకలమంగళాధారా
పరమశ్రేయోహేతుః శ్రేయసీ పరమేష్ఠినః పూర్వం।
తస్మా త్కిరాతనృపతే ర్బహుమాన మవాప్య రసకర్మరతః।
రసహృదయాఖ్యం తంత్రం విరచితవాన్ భిక్షుగోవిందః "

ఇందు ఉల్లేఖింపఁబడిన కిరాతదేశము.—"త ప్తకుండం సమారభ్య రామక్షేత్రాంతకం శివే। కిరాతదేశో విజ్ఞేయో వింధ్యశైలే ఽవస్థితః॥

* ఈ పాఠముగానే రసేశ్వరదర్శనమున మాధవాచార్యులవారును సంగ్రహించిరి.

అని శివశక్తిసంగమతంత్రంబునఁ జెప్పంబడినది. కనుక గోవిందభిక్షులు కూడ వింధ్యాద్రిసమీపస్థ కిరాతదేశవాసియే యని యూహింపదగును. ఎనిమిదవ శతాబ్దంబునఁ గామదేవుఁడనురాజు రాజ్యాధీశుఁడైన ట్లును, కామదేవుఁ డనునది మదనశబ్దపర్యాయము కావచ్చు ననియును, మదనగోవిందభిక్షులు సమకాలీనులగుటవలన నీ "రసహృదయతంత్రము" క్రీస్తుశక మెనిమిదవశతాబ్దిని రచింపఁబడియుండు ననియుఁ, గొన్ని పాశ్చాత్యాభిప్రాయముల ననుసరించి కాలనిర్ణయము చేసినట్లు 'త్ర్యంబకశాస్త్రి' గారు నిశ్చయించిరి. శ్రీ గోవిందభిక్షులవారిచే మదననృపతి యనుట కీయుక్తి చాలదు. మదనకామదేవశబ్దంబులు పర్యాయశబ్దము లైనను నామనిర్దేశము లగునప్పు డొకే వ్యక్త్యర్థము నుపయోగింపుట లేదు. సూరయ్య యనువానిని భానుమూర్తి యని పిలుచు టొప్పదు. కనుక మదననృపతిని కామదేవనృపతి యని నిర్ణయించుట సమంజసము గాదు. ఒకేపదము రెండుమూఁడుసార్లు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు కలిగినంతమాత్రమున నే వ్యక్త్యంతరభేదాన్వయము గలుగుచున్నది. మాఘాచారివేఱు మాధవకరుఁడు వేఱు, కాళిదాసు వేఱు కాళిదాసు వేఱు కాఁడు గదా! హైహయవంశావళియందు రెండవ కామదేవనృపతి లేకపోవచ్చును. కాని యాకామదేవనృపతి కిరాతదేశాధిపతి యైన ట్లాధారము లేదని నా నమ్మకము. కాని యెనిమిదవ శతాబ్దిని హైహయవంశీయుఁ డగు కామదేవనృపతి కిరాతదేశ మేలుచు నుండిన నుండవచ్చును. లేక కిరాతదేశమే యేలుచుఁ గామదేవనృపతి యుండియున్న నైన నేతన్మూన్య మేడవ శతాబ్దంబున నున్న శ్రీశంకరాచార్యులవారికి సమకాలీనులైన శ్రీగోవిందభిక్షుల కాలమునఁ గిరాతదేశ మేలుచు నొక మదననృపతి యుండుట యసంభవము. కనుక నీ మదననృపతియు శ్రీగోవిందభిక్షులు నేడవశతాబ్దంబునను, కామదేవనృపతి యెనిమిదవ శతాబ్దంబునను నుండవచ్చు ననుటయే సమంజసము.

శ్రీవాగ్భటాచారి క్రీ. శ. 600 లలోను, బృందమాధవులు 9 వ శతాబ్దంబునను, చక్రపాణి క్రీ. శ. 1050 ను ఉండునని శ్రీ ప్రఫుల్ల చంద్రరాయి గారు హిందూకెమిష్ట్రీయను గ్రంథమందు వ్రాసినట్లుగా కీర్తిశేషులైన శ్రీ వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు తమ ఆంధ్రరసప్రదీపికోపోద్ఘాతమున నుదాహరించిరి. దీనినిబట్టి 7 వ శతాబ్దము నాఁటి గోవిందభిక్షులకంటె వాగ్భటాచారి ప్రాచీనుఁడైనట్లు కనఁబడుచున్నది. అది అసంభవము. ఏల యనఁగా శ్రీవాగ్భటాచారి తన 'రసరత్నసముచ్చయ' మను రసతంత్రమునఁ బూర్వరసతంత్రజ్ఞులగు వైద్యవేత్తల నుదాహరించుచు—' నాగార్జున స్సురానందో నాగబోధి యశోధనః । ఖండః కాపాలికో బ్రహ్మా గోవిందో లంపకో హరిః ॥' అని యనేకులను రసతంత్రవేత్తల నుద్ఘాటించి వాగ్భటాచారి గోవిందాచార్యులవారిని కూడ స్మరించుటచేత వాగ్భటాచారికంటె గోవిందాచారి ప్రాచీను డనుట నిర్వివాదము. వాగ్భటాచారి నిత్యనాథసిద్ధుని యట్టిక ఈ పందు స్మరింపకపోవుటచే వాగ్భటాచారికంటె నిత్యనాథసిద్ధుఁడు ప్రాచీనుఁడు కాఁడు. నిత్యనాథసిద్ధునిచే రచింపఁబడిన 'రసరత్నాకర' మను గ్రంథమునందు మహాదేవకపాలీచర్పటసిద్ధనాగార్జునాదులఁ జేర్కొనుచు రసరత్నాకరము వ్రాయుట కనేకరసతంత్రములు సంహితలు నాగమములు శాస్త్రములు కుత్సితవాగ్భటకృత గ్రంథములు సిద్ధుల రసాయనవిధులు తాను పరిశీలించినట్లు వ్రాసెను. దీనివలన నిత్యనాథసిద్ధునికంటె వాగ్భటాచారి ప్రాచీనుఁ డనుట సిద్ధాంతము. రసేంద్రచూడామణిని రచించిన సోమదేవుఁడు గోవిందభిక్షులను స్మరించి వాగ్భటనిత్యనాథాదుల స్మరింపకపోవుటచేత నిత్యనాథునికంటె వాగ్భటాచారియు, వాగ్భటాచారికంటె సోమదేవుఁడును, సోమదేవునికంటె గోవిందాచార్యులవారును ప్రాచీను లైనట్లు తోఁచుచున్నది.

రసతంత్రవేత్తలలో గోవిందశబ్దవాచ్యులు ముగ్గురు గన్పించుచున్నారు. ఈ ముగ్గురు రసతంత్రవేత్తలలో శ్రీగోవిందభిక్షు లెవరై యుండవచ్చునో యూహింపవలసియున్నది. 'రసగోవింద' మను రసతంత్రమును రచించిన గోవిందుఁడు 'రససార' మను రసతంత్రమును రచించిన గోవిందాచారికంటెఁ బ్రాచీనుఁడో యర్వాచీనుఁడో తెలియదు. గాని శ్రీ ప్రఫుల్లచంద్రరాయిగారు తమ హిందూకెమిష్ట్రీయందు రససారతంత్రకర్త క్రీస్తుశకము పదుమూఁడవ శతాబ్దమునాఁటి నాఁడని బౌద్ధమతావలంబి యని అభిప్రాయ మిచ్చిరి. అట్లైన రససారతంత్రకర్తయగు గోవిందాచారి రసహృదయతంత్రకర్తకంటె నర్వాచీనుఁ డగుచున్నాఁడు. రససార మను శాస్త్రమును రచించిన తంత్రకర్తకును రసహృదయకర్తకును ఆచార్యశబ్ద ముపయోగింపఁబడినది. రసగోవిందతంత్రకర్త గోవిందనాముఁడు. ఇందువలన గోవిందభిక్షువు గోవిందభగవత్పాదులు గారని సందేహము కలుగవచ్చును. కాని, సాంప్రతికులావతంసుఁడగు మాధవునిచే రచింపఁబడిన రసమాధవమను తంత్రమున నష్టకియాధ్యాయమున "శ్రీగోవిందపాదాస్తు అన్యాన్యేవ గగనమారణాని భేషజాని లిఖన్తి" అని యుదాహరించెను. అందు గ్రాసచారణప్రమాణము నుదాహరించుచు "భగవద్గోవిందపాదాస్తు కలాంశమేవ గ్రాసం లిఖన్తి" అని లిఖించిరి. శ్రీరామచంద్ర గుహాసిద్ధుఁడను కూడ రసేంద్రచింతామణి యను రససిద్ధాంతప్రకరణమునఁ బతివాదముగ లోహశాస్త్రమును శాసించిన సిద్ధనాగార్జునుని స్మరించుచు గ్రాసవిధులయందు రసహృదయతంత్రకర్త యగు గోవిందభగవత్పాదులవారిని అర్ధస్మరణకొఱకు నైహితము నె లిఖించిరి. ఇందు శ్రీగోవిందపాద భగవద్గోవిందపాద ప్రయోగములు శ్రీగోవిందభిక్షువాక్యము లగు శ్రీగోవిందభగవత్పాదులవారికే చెందుచున్నవి. కనుక రసహృదయతంత్రకర్త యగు గోవిందభిక్షులు శ్రీగోవిందభగవత్పాదులే యనుట నిర్వివాదము. ఆచార్యశబ్దముకంటె భగవత్పాదశబ్దముచే మఱింత సందేహనివృత్తి యగుచున్నది. వాగ్భటాచారి పదునాఱవ శతాబ్దివాఁడని యొక సిద్ధాంత మున్నది. అష్టాంగహృదయగ్రంథకర్త యగు వాగ్భటాచారి వేఱు, రసరత్నసముచ్చయమును రచించిన వాగ్భటాచారి వేఱు. రసరత్నసముచ్చయకర్తయు రసవాగ్భటుని రసమాధవుఁడు ప్రయోగించెను. పదియాఱవశతాబ్దిని భావమిశ్రుల భావప్రకాశమును ప్రమాణముగ నంగీకరించిన రసమాధవుఁడు క్రీస్తుశకము పదియేడవశతాబ్దివాఁడని యొక సిద్ధాంత మున్నది. రససారతంత్రకర్త యగు గోవిందా

చారి క్రీస్తుశకము పదుమూడవశతాబ్దమునాఁటి వాఁడని యొకసిద్ధాంత
మున్నది. ఈ రసహృదయతంత్రమువలె స్వతంత్రముగా వ్రాయఁబడిన
దగుటచేతను ఇందు పూర్వతాంత్రికులను స్మరింపకపోవుటచేతను వాగ్భ
టాచారికి ప్రాచీనుఁడో యర్వాచీనుఁడో తెలియదు. కాని
ప్రఫుల్లచంద్రరాయిగారు 13 వ శతాబ్దిని రసపారగ్రంథకర్త
యున్నట్లు సిద్ధాంతపర్చెను. యశోధరుఁ డను నొక రసశాస్త్రజ్ఞుఁడు
'రసప్రకాశసుధాకర' మను రసతంత్రమును క్రీ. శ 13 వ శతాబ్దిని
రచించినట్లొక సిద్ధాంతమున్నది. అందు రసవాగ్భట్టుయొక్క రస
రత్నసముచ్చయ గ్రంథస్థవిషయము లనేకముఁ గన్పట్టుచున్నవి. కాని
రసరత్నసముచ్చయమున రసవాగ్భట్టు యశోధరుని స్మరించియుండెను.
ఆయశోధరుఁడే యీయశోధరుఁ డైనయెడల రసవాగ్భట్టునకంటె
రసప్రకాశసుధాకరతంత్రకర్త ప్రాచీనుఁడై యుండవలయును. సిద్ధనాగార్జు
నునిశిష్యుఁడగు శ్వేతాంబరభిక్షువు విక్రమశకము 1296 వ యోగరత్న
మాలను రచించెను. కనుక సిద్ధనాగార్జునుఁడు వాగ్భటాచారికంటె
ప్రాచీనుఁడగుచున్నాఁడు. ఇఁకనలవ వాగ్భటాచారి పదుమూడవశతా
బ్దమున రసరత్నసముచ్చయము రచించినట్లూహింపవచ్చును. నాగార్జున
సిద్ధుని కర్వాచీనుఁడైన వాగ్భటాచారి యేడవశతాబ్దినాఁటివాఁడనుటకు
వీలులేదు. కనుక ఈ రసహృదయతంత్రమును శ్రీగోవిందభగవత్పాదుల
వారు క్రీ. శ 710 శక కాలప్రాంతమున రచించినట్లు నిశ్చయింపవచ్చును

రసహృదయ తంత్రముఁ బ్రథమావబోధమున 'మూర్ఛిత్వా
హరతి రుజ-' అనునది మొదలు 'హరగౌరీసృష్టిసంయోగాత్' అనునదివ
గల వృత్తము లిరువదియేడింటిలో 5,7,20,24 వృత్తములతప్ప తక్కిన
వృత్తము లన్నియు రసరత్నసముచ్చయమునఁ బూర్వఖండమున లిఖింపఁ
బడియున్నవి. ఈరసహృదయతంత్రకర్తను ఏడవశతాబ్దము మొద
లుకొని యాధునికరసతంత్రకర్తలెల్లరు నాప్తప్రామాణికునిగ గౌర
వించిరి. 8 వ శతాబ్దము మొదలు బౌద్ధులు జైనసిద్ధులు రసశాస్త్రముల
నభివృద్ధిచేసియుండిరి. శ్రీగోవిందభగవత్పాదులకు పూర్వము వేనవేలు
రసతంత్రసిద్ధులు రసశాస్త్రములు రచించియున్నను వానియందు
దుర్బోధములగు స్వల్పవిషయము లుండుటచేత సుబోధముగను విరళ
ముగ నుండువట్లీ తంత్రమును శ్రీభగవత్పాదులవారు రచించి రస
శాస్త్రగౌరవము లోకవిఖ్యాతి మగునట్లనుగ్రహించియుండిరి. రస
విద్యకు హృదయభూతముగా నుండుటవలన నీతంత్రమునకు రసహృ
దయ మను నభిధేయ మొసఁగిరి. అర్వాచీనులగు చతుర్భుజమిశ్రుల
వారు "ముగ్ధావబోధినీటీక" వ్రాసి రసహృదయగౌరవమును పోషిం
చిరి. ఈరసతంత్రమున గంధకజారణాదివిధులు విపులముగా నిరూ
పింపఁబడినవి. ఇందుఁగల మహావిషయములు, స్థాలీపులాకన్యాయమున
సంక్షేపముగ నిట విమర్శింపఁబడును. రోగనివృత్తినిమిత్తము స్థిరదేహ
కల్పకత్వమును, జరామరణవర్జితశరీరప్రశంసయు, రసమున కష్టాదశసం
స్కారావశ్యకతయును, స్థిరదేహప్రయోజనమును, స్వేదనాదిదీపనాం
తమగు నష్టసంస్కారనిరూపణంబును, అభ్రకగ్రాసవిధానంబును, ధాతు
పరిమాణనిరూపణంబును, గంధకాభ్రకములవలన రసపక్షచ్ఛేదకత్వవిధా
నంబును, రసపక్షచ్ఛేదనాభావములవలనఁ గలిగెడు నిందయు, అభ్రకచా
రణమున గాక రసబంధనము సంభవింపని కారణమును, అమరసంజీవనీ
గుటికామృతసంజీవనీ గుటికాప్రశంసయు, రసవాదానంతత్వమును,
మున్నగు పెక్కువిషయములు వివరింపఁబడియున్నవి. ప్రతిలోహము
నకు సత్త్వపాతనము, అనేకసత్త్వములయొక్క యన్యోన్య సమ్మేళన
ములు, గనోపరససాధారణరసములు, లోహాదులు, సత్త్వపాతన, జారణ
చారణ, సారణ, క్రామణ, ద్రావణాది సంస్కారములఁ జేసి పరస్పర
మేళనవిధానంబున రసాయనములుగా మార్చుట మొదలగు ననేక మహా
విషయము లిందు ప్రౌఢముగా నిరూపింపఁబడినవి.

పూర్వము రససిద్ధులు వేనవే లుండిరి. అందు ప్రముఖులగువారు:-

"మంథానభైరవో యోగీ సిద్ధబుద్ధశ్చ కంథడీ
కోరంటకః సురానందః సిద్ధపాదశ్చ చర్పటీ
కనేరీ పూజ్యపాదశ్చ నిత్యనాథో నిరంజనః
కపాలీ బిందునాథశ్చ కాకచండీశ్వరో గజః
అల్లమప్రభుదేవశ్చ ఘోడాచోళీ చ టింటిణీ
భాలుకీ నాగదేవశ్చ ఖండః కాపాలిక స్తథా
ఇత్యాదయో మహాసిద్ధా రసభోగప్రసాదకః
ఖండయిత్వా కాలదండం త్రిలోక్యాం విచరంతి తే

ఇందుదాహరింపఁబడిన వారిలో పూజ్యపాద, సిద్ధపాద, సిద్ధబుద్ధా
దులు జైనబౌద్ధప్రసిద్ధసిద్ధులై యున్నారు. కొందఱు కాపాలికులు.
ఋషిపుంగవులును గలరు. అల్లమప్రభువు అఘోరీమతోద్ధారకుఁడై
యుండవచ్చును. వీర లందఱును రససేవవలనఁ గాయసిద్ధిం బొంది
త్రిలోకసంచారులైన మహాసిద్ధులు. ఇందలి నాగదేవుఁడే కామరత్న
మను మహాతంత్రమును రచించిన నాగభట్టు కావచ్చును. కాలనాథ
శిష్యుండగు శ్రీధుంధుకనాథుఁ డను నొక రసాచార్యుఁడు "రసేంద్ర
చింతామణి" యను నొక గ్రంథమును రచించెను. మతిసూ, జావల,
ధనపతి కల్యాణభట్ట చక్రపాణి నీలాంబరపురోహిత హరిహర
సిద్ధకాళీనాథ నాహారి త్రిమల్లభట్ట హేమసూర్యకపాలి హంసరాజ
భోజదేవ ముండీ జయదేవ వరరుచి పరశురామ రేవణసిద్ధ శివసం
దనగోస్వామి ఐండీమిశ్ర చాముండ ప్రతాపరుద్రాదు లనేకులు రస
తంత్రములను రచించిరి. ఆయాగ్రంథములతోఁ గూడ తద్గ్రంథకర్తలు
సైతము ప్రకృతము నామమాత్రావశిష్టులైరి. ప్రతి వైద్యశాస్త్రవే
త్తయు ముందు రసగ్రంథములను (Chemistries) పరిశీలించి యనం
తరము నిదానచికిత్సాభాగంబుల దెలిసికొనుట ముఖ్యకర్తవ్యము.
ఆంధ్రభాషయందు రసతంత్రము లరుదుగా నున్నవి. ఆ లోపము
తీరినఁ గాని రసతంత్రవిజ్ఞానమును, దానివలన గలుగఁగల చికిత్సాసా
ధకజ్ఞానమును నభివృద్ధిని బొందఁజాలవు. ఆయుర్వేదాభిమాను లగు
ప్రభువులును ధనవంతులును బూనుకొని యాయుర్వేద ప్రసిద్ధరసతంత్ర
సిద్ధు లగు పండితుల సహాయముచే నాంధ్రభాషలో టీకాతాత్పర్య
సహితముగ నట్టి రసతంత్రములను బ్రకటింపంజేసినం గాని వైద్యప్ర
పంచ ముద్ధరింపఁబడదు. అట్టి శుభకాలము త్వరలోఁ బ్రసాదింపఁబడు
గాక.

# ఏకాంత ప్రేమ

[ఒక చిన్న కథ.]

చిర్రావూరు కామేశ్వరరావు గారు బి. ఏ.

'రామనాథము ' చాల తెలివైనవాఁడు
న్యాయవాదులలోన మెఱుఁగైనవాఁడు!
ఆంధ్రవాఙ్మయమందు నభిమాన మూని
తనకుఁ దోఁచిన సేవ నొనరించువాఁడు.
చెఱుగులోఁ గలమంచి కనులారఁ గాంచి
జీవనావధి సానుభూతిగాఁ దలఁచి
పేరు కెక్కినవాఁడు కడు మంచివాఁడు.

అతనిసోదరి ' శారద ' యనెడు కాంత,
చక్కఁదనముల చుక్క, సుగుణాలవాల.
' నీనామ మెయ్యది? ' యని యెవ్వరైన
ముచ్చటగాఁ బ్రశ్న సేయంగ, మిగుల
లజ్జించి, నెఱసంజ మోమునం బొలయఁ,
దలవాల్చు కోమలప్రాయంబునందుఁ
బరిణయం బామెకు నెఱవేర్పఁబడియె!

కాలవశంబున విధివ్రాలువలన,
పాప మాశారద వైధవ్యమొందె!—
అంతకంతకు శరచ్చంద్రికాస్ఫురణ
నిరసించి తరళించె నెఱజవ్వనంబు!

తనముద్దుచెల్లెలు దనకంటియెదుట
కడుముద్దరాలునై బ్రతుకులో వెలితి,
తలఁపులోఁ బొలయుచు ములికిరూపమునఁ
గలఁచివేయఁగ దుఃఖపడుచుంటఁ గాంచి
రామనాథము మానవ్రతమూనె నకట!

ఒకనాఁడు బంగారు మలుసంజవేళ
మేడయరుగున శారద ప్రాలుమాలి
పలుయోజనలు వెల్లివిరియంగ నెదను
బరపెఁ దీయనిచూపు పొరుగింటిపైని.
నూనూఁగుమీసాల నవయౌవనుండు
పసిఁడిచాయలు మోముపైఁ జిందులాడ
నగుపించె నామెకుఁ గనువిందు గొలిపి!

రామనాథము భార్య ఫలహారములను
విభుని ముంగల శుభ్రముగ సిద్ధపఱచి
దరహాసవదనంబు హృదయంబుఁ దెలుప
' వదినరో! ' యని ముద్దు కలకంఠ మెత్తి
పిలువంగ, కలనుండి మేల్కాంచురీతి
చకితయై శారద క్రింది కేతెంచె!

రామనాథము సహోదరిరాక దెలిసి
కరుణాకటాక్షమాలిక లామెపైని
బరపి యెదురుపెదవులమీఁదఁ దేలి
మొలకలై మొగఁ బ్రాకు మృదుహాసకాంతి,
తన మనోగతక్లేశమును గప్పివేయ
' శారదా!' యని పిల్చి మాటాడలేక
వెండిపళ్లెములోని కమలాఫలంబు
వాత్సల్యహస్తంబుతో నామె కొసఁగె!

ఆమెయు ననురాగమున దానిఁ గొనుచు
నొలిచి, తీయని యీఁడలను గొన్ని తీసి,
యన్నగారి కొసంగి కడుగారవమున,
మఱికొన్ని వదినకు మరియాద గదుర
నొసఁగి వారలతోడ కుతుకంబుతోడఁ
దిని మనోగతమును వెలుఁగొందఁ జేసె.

రామనాథము నీటుదుస్తులం దాల్చి
జలతారు కండువా వలెవాటు వైచి
దంతపు చేతికఱ్ఱను గేల నడసి
కణుసుచర్మముచెప్పులను కాలఁ దొడిగి
నల్లచీమలబారు నిరసింపఁ జాలు
మురువైన మీసాల జిగి క్రమ్ముకొనఁగ,
వీథిలోనికిఁ బోయి యూరి యావలను
గడు మనోహరశాంతిసముదంచితంబు
నిర్మలసుకుమార శాద్వలస్థలముఁ
దిలకించి తన్మధ్యమునఁ గూరుచుండె!

రాకాశశాంకుఁడు మేఘమాలికల
నూఁగులాడుచు సుధాధారలం గురిసె
శారద మేడపై నొకబొమ్మవోలె

నిలిచి యవ్యక్తసంతసము పైకొనఁగ
పొరుగింటినడవలో నుచితాసనమున
వసియించి 'టెనిసను' కవికృతంబైన
'డోరా' యను మనోహరలలితగాథఁ
జదువుచుఁ దన్మయానంద ముప్పొంగ,
హాయిగా నున్న యౌవనమోహనాంగుఁ
గాంచి నెమ్మది తన్ను విడనాడినట్లు
బొడకట్టఁ గన్నుల బాష్పము ల్జిమ్మ
'హా!' యని వెచ్చ నిట్టూర్పులఁ బుచ్చి
రామనాథము గృహమ్మున కేగుదేర
భయము నుద్వేగంబు మెలికలై తోఁప
క్రింది కేతెంచె నాచిగురాకుఁబోఁడి!

నాఁటఁగోలెను శారదాలలితాంగి
కనుకలి సవయుంగఁ గడఁగె సంతతము!—
పరిమళ మకరంద బిందుతుందిలము,
మందారమంజరి కాలాగ్నిఁ బడియె!

చూపుల నవ్యక్తరాయబారములు
వెడలి యాయువకుని హృదయంబు గొనియె!
పెరటిలోఁ గల మాలతీతీఁగె టెంటఁ
గలసి యా యౌవనావిర్భావమతులు,
కడు మనోహరలీల నిశ్శబ్దనిశలు
గడపిరి సుస్నేహమున నోలలాడి!—

గిరగిర దిరిగెను కాలచక్రంబు
వింతమార్పులు దుఃఖపరిణామ మొందె
యామినీ హార్దిక సంభాషణములు
మధుశీతల మంద సంశ్లేషణములు
అవ్యక్తమగు ముగ్ధ పరితోషణములు
అంతకంతకుఁ గ్రొత్తలై ప్రేమ గొలిపి
పరిణయం బెఱుఁగని యాదంపతులను
కడు భయంకరతీరమునఁ ద్రోసివైచె!

రామనాథము సోదరీవర్తనంబుఁ
గనులారఁ గనుఁగొని కడు జాలిఁ బొంది,
"ఏమి సేయుదు నింక తలయెత్తు టెట్లు?
నవమాసములు నిండె గతి యొండు లేదు!
వేయికన్నులు దాల్చి ఛాందసోత్తములు
నాయిల్లు బెఱకి పందిరి వేయఁగలరు!
అని బెంగపడి— సిగ్గుపడి— దుఃఖపడియె!

సుముఖి శారద విన్నఁదన మొంది యెడఁద
బెడిద మగు పిడుగు పడినట్లు దోఁప
తన జీవనపథంబు చిమ్మచీఁకటుల
మునిఁగిపోయెను వేఱుగతి లేదటంచు.
భయము నిస్పృహా సిగ్గు గలసి పైకొనఁగ
ఏకాంతమున బాష్పములు జాలువాఱ
విలవిల వసుమతీవలయంబు గదలి
పాతాళమున కేగుచున్నట్లు దోఁప
మిన్ను పైఁబడినట్లు భారంబు గాఁగ
కాంతిహీనంబైన బంగారుప్రతిమ
వలె పాప మాశారదాసుకుమారి
మందిరంబున వాఁడిమలికయై తోఁచె!

ఒకనాఁడు రామనాథము భార్యతోడ
శయ్యాగృహంబున నుచితాసనమున,
నాసీనుఁడై చాలఁగా మాటలాడి
సంఘదురాచారములఁ గూర్చి పలికి,
"కటకటా! మర్యాద గలయింటఁ బుట్టి
తలవంపు గలిగించె నాముద్దుచెల్లి!—
అని కన్నుఁగవ నశ్రువులు గ్రమ్ముకొనఁగ,
నామహాత్ముఁడు ద్రెళ్ళె దుఃఖానలమున

"ఎఱుకసానులు మంత్రతంత్రంబులందు
నిరుపమప్రజ్ఞాసమన్వితులైన
వారల రప్పించి బ్రతిమాలియైన
గతిఁ జూడవలె నంచుఁ దనభార్య పలుక
విని రామనాథము భయమొంది యనియె.
"వనితా! ఇదేటి వెఱ్ఱి గలిగె నీకు?
ఎవరి ప్రాప్త మెవరు దప్పింపఁగలరు?
పురాకృతఫలంబు భుజియింప వలదె?—

* * *

బాలార్కు నిరసించు సౌందర్యప్రతిభ
మిఱుమిట్లు గలిగించి వెలుఁగొందుచున్న
తన ముద్దుకొమరునిఁ గనులారఁ జూచి
పాప మా శారదాకమలాయతాక్షి
తనివి తీరక కన్నులకు నద్దినట్లు
గనుఁగొంచు వాత్సల్యభావంబుతోడఁ
గడపెను దిన మొక్క నిమిషమై తిరుగ;
గాని మనోహరుఁ డగు యౌవనుండు
చిన్నకొమరునిఁ జూడ రాకున్న వెలితి
క్రమముగాఁ బెరిఁగి, గభీరమై మఱియు
కష్టతరంబునై కలఁచివేయఁగను,

ఆ యమాయిక శారద కృశింప సాగె.
జంటఁ బాసిన గువ్వపిట్ట చందాన!—

భోజనప్రియులైన మొండి బ్రాహ్మణులు,
శ్లోకాలు చదువుచు చీకాకుపడుచు
పొగఁ బడ్డ తేనెటీఁగల రీతి రేఁగి
గృహమున శాంతిభంగముఁ జేసినారు!

ముసలి గొల్లగురవఁ డొకనాఁటి రాత్రి
టక్కుటక్కున చేతికఱ్ఱతో దారి
తడవుచు నరుదెంచి, "రామయ్యబాబు!—
పిలిసిన కత మేమి?—" యని కఱ్ఱమీఁద
పండుగడ్డముఁ బెట్టి నిలుచున్నయంత,
రామనాథము వలవల యేడ్చి యనియె.
"ఓగొల్లతాతా! బ్రతుకు తెల్లవాఱె!—
చాల రోజులు నిన్నుఁ బోషించినాను;
ఎట్టి ప్రతీకారమును గోరలేను.
అనుభవంబులు చాలఁ గలిగియున్నావు;
ప్రాణరక్షణకంటెఁ బరమపుణ్యంబు
లేదులేదని శాస్త్రములు ఘోషసేయు;—
మాయింట నొక దీనుఁ డగు బిడ్డ గలఁడు,—
వాని రక్షణభారమును నీవు గొనుము!"

ముసలిగొల్లఁడు బిడ్డలవాఁడు గాన,
మురిసిపోవుచు శిశువును గొంచుపోయె.

ఆనాఁటఁగోలె శారద మాటలేక
మూఁగదయ్యమువోలెఁ దిరుగాడె నింట!

యువకుఁడు దనప్రేయసిని బాయలేక,
'శారదా! శారదా!' యని తీఁగయెలుఁగు
కంపింపఁ బిలుచుచుఁ, దమప్రేమఫలము
గొల్లవానికుటీరమున హాయిగాను
నాటల పాటల సుఖమున్నమాట
తేటతెల్లము గాఁగ నెఱిఁగించి, హృదయ
పరితాపము శమింప ముద్దాడి, విన్నఁ
దనమొంది భయమొంది, యెడఁబాసిపోవు!

రామనాథ మొసంగు ధనసహాయమున,
యువకుని ప్రోత్సాహమున గొల్లవాఁడు
బాలుని పాఠశాలకుఁ బంపఁదొడఁగె

శారద మోదించె సంవాద మెఱిఁగి.—
క్షణమైన బాలుని మదిఁ బాయలేదు!

ఫలహారములు ఖజ్జములు పానకములు
విలువైనవస్తువులు ఈప్సితార్థములు
ప్రచ్ఛన్నముగ బాలునకు నందఁజేసి,
తనకుఁ జెందినవిధముగా నాత్మఁ దలఁచి,
సమ్మదాశ్రులు గ్రమ్మఁ బరితోష మొందు!—

బాలుఁడు చుఱుకుగా నుత్తీర్ణుఁ డగుచు,
తన యుపాధ్యాయుల యభిమాన మొంది,
నానాఁటికిఁ బ్రవర్ధమానుఁడై వెలసె!

న్యాయశాస్త్రపరీక్షలోఁ దేరనెంచి,
యువకుఁ డేగెను మాఘమాసంబునందు,
నగరీలలామంబు నగు చెన్నపురికి;—
గాని గాదిలిశారదావియోగమును
భరియింపఁగాలేక పొగబండిలోన
నతఁడు పొందిన దుఃఖమును జెప్పఁగలమె?
అంతకంతకు గాఢాంధకార మయ్యె;
అందఱిలో నాతఁ డేకాకి యయ్యె!—
కను మోడ్చి, మాలతీకుంజంబునందు,
ముక్తకేశిని శారదా ప్రేమగాత్రి
గాఁగిటం దనుఁ జేర్చి, యెలుఁగు రాల్పడఁగ,
చిరవియోగవిలాప గీతంబుఁ బాడె!

'ఓహృదయేశ్వర! ఓకరుణాకర!
నెమ్మది నీవిఁక నన్నుఁ దలంతువా?

నీపదములదరి ప్రణయవ్రతంబును,
గడగొనఁ జేయఁగ బ్రాప్తము లేదు! "ఓ"
మేఘము లాకస గోళము గప్పెను,
గడగడ పిడుగులు నెడనెడ వెడలెను! "ఓ"
పాపపుఁ గన్నులు గప్పు నిరంతర
బాష్పస్రవంతిలో మునిఁగి ప్రార్థించెద: "ఓ"
నీ నగుమోమును నామదిలోపలఁ
దాల్చి యనన్యనై దినములు గడపెద! "ఓ"
వెచ్చనిట్టూర్పుతోఁ దెలివొంది లేచి
తెరవోలెఁ జెలువొందు జలధితీరమున
నాటవెలఁదిఁ బోలి కిలకిలలాడు
మద్రాజనగరంబునకు వచ్చి చేరె!—

రామనాథము భార్య నింకుమాలాలు
మాతృగృహవాసమును గోరి, వేడ్క—
పొదలంగఁ దరళితదరహాస మందు
నునుసిగ్గువెన్నెలవలె నింపుకొనఁగ

కలకంఠమునఁ బ్రేమ తళుకొత్తుపాటలు,
స్వీయనాథున కీప్సితార్థంబు దెలిపె!
అతఁడును హృదయసమ్మతిఁ జెప్పఁ గాని
శ్రోత్రియు లావేళ పంచాంగములను
శోధించి, యోజించి, రామనాథుని
ఎదురుచుక్క యటంచు బెదరించినారు!

చిన్ని వెన్నెలతేని సరిపోలువాఁడు,
నైసర్గదరహాసమునఁ బొల్చువాఁడు,
కడుమనోహరతర సుకుమారమూర్తి
ఆదంపతుల ప్రేమఫలరూప మగుచు,
నొక కుమారుఁడు పుట్టి మోదాబ్ధిఁ దేల్చె

విమల శైశవలీలలను దేలియాడు
బాలకుని వదనమును ముద్దులాడి,
మ్లానమనోరవిందమున నొకింత
సంతోషమకరందము స్రవింప బాష్ప
ములు గ్రమ్మ కనుఁగొలంకుల నీటుఁదనము
చక్కఁదనాలమోమునఁ బ్రాఁకుకొనఁగ,
హృదయకల్లోలిని విశ్రాంతి వడయ,
వెలఁగుసోదరిఁ గాంచి, యాన్యాయవాది,
"కటకటా! ఎంతటి కష్టకాలంబు!
మాతృహృదయాగ్నిభీరత నెన్నఁదరమె?"
యని దురంతవిషాదమునఁ గూలిపోయె!

ఆకాశమున నీలమేఘ ఖండములు
గుమిగూడి చిత్రవిచిత్రంబు లగుచు,
గర్జానినాదముల్ ప్రతిరావ మొసఁగ
తొలుకారు ముసురువానలు మొదలుకొనియె!

ఒకనాఁటి చిమ్మచీకటిరాత్రి యందు
హోరున బెడిదంపు వడి గాలివాన
పడియె నిరంతరముగ నెల్లయెడల!
చెట్లకొమ్మలు ఫెళ్లున విఱిగిపోయె!—

తాటియాకుల గొడుగు వలకేలఁ దాల్చి,
టక్కుటక్కున పాదుకలు భీతి గొలుప,
చేపాటి కఱ్ఱతోఁ బాటఁ జూచుచును
అర్ధరాత్రమునందు నా గొల్లవాఁడు
రామనాథము గారి యింటి కేతెంచి,
"రామయ్య బాబూ!" యని పిలిచినాఁడు.

ఆర్తనాదముబోని సంబోధనంబు
వెంటనే శారద మదిఁ బొల్చుకొనియె!

ఠివ్వునఁ దలుపు దగ్గర కేగి, తీసి,
"ఓతాత! ఈరాత్రి నిందు వచ్చుటకుఁ
గారణం బేమి?— మాయన్నతో నేమి?—
అని కుమారునిఁ గూర్చి యడుగ నూహించి,
సిగ్గు విచారంబు పెల్లుబ్బుకొనఁగ,
కన్నుల దీనత్వ మొలుక వీక్షించె!—

అంతలో రామనాథము లేచి వచ్చి
గొల్లతాతను లోపలికిఁ బిల్చి యనియె!
"తాతా! కుమారుఁడు సుఖమున్నవాఁడె?
తలనొప్పిచేఁ జాల శ్రమ జెందినాఁడు!
అని మొన్న నమ్మృతాంజన మడిగినావు!
మఱి యేమియును బాధ లేదుగా యిపుడు?"

ముసలిగొల్లఁడు బాష్పములు రాల్చి యనియె:
"ఓబాబు! తలనొప్పి గిలనొప్పి గాదు—
పిన్నోడు నెగనేడు కృచియించినాడు!
మెతుకైన దిననేడు పది దినా లయ్యె!
లోకాన మందు లన్నియు నేసినాము,
రచ్చరేకులు కానగాఁ గట్టినాము!
అని మోమున నేమి రాచెనో బమ్మ?
మానేత మఱి నేదు, నీ సిత్తమయ్య!"

వాని నాలించి శారద బొమ్మవోలెఁ
జేతనం బుడిగె లోకము గూలినట్లు!

గొల్లవానితో రామనాథ మావలికిఁ
బోయి, "శారదా! పోయి వచ్చెదను!
అని గొల్లవీథికిఁ జని వానియింటఁ
జాపలో నున్న రని పొరలువాని,
మిక్కిలి కృశియించి బలము గోల్పోయి,
అస్థిపంజర రూపమున నున్నవాని,
తిలకించి, భయమొంది, యానిమేషమున
డాక్టరుగారింటి కరిగి చేఁదడిపి
కొనివచ్చె— అతఁడును నాడి వీక్షించి,
మోమెత్తి యోజించి, భ్రూలతల్ ముడిచి,
"ఉదయాన జ్యూబిలీవైద్యాలయమున
కితనిఁ దోడుకరండు, మందు వేసెదను!"—
అని చెప్పి యరిగె నింటికిఁ గాలినడక.

రామనాథము శారదా! యంచుఁ బిలిచి,
బాలుని యస్వస్థతను గూర్చి పలికె—
కొంతసేపటికి ఘల్లునఁ దెల్లవాఱె!

ముసురు తగ్గెను గొంత. కాని మేఘములు
సాంద్రంబులై సూర్యభగవానుఁ గప్పె!
చలిగాలి రివ్వున వీవంగఁ దొడఁగె;
ప్రకృతి దోఁచెను శోకమున మునిఁగినట్లు!
వికలాంగు లీఁగలవలె మూఁగుచోఁటు.
బలురోగవంతుల కనుతాపగృహము.
బీభత్సదేవతా వాసస్థలంబు.
మానవసేవ నేర్పఁగ పాఠశాల,
సువిశాల వైద్యాలయమునందుఁ జేర్చి
బాలుని యారోగ్యసంవర్ధమునకు,
రామనాథము చాల శ్రమఁ బొందెఁ గాని,
లాభ మించుకయైన నగుపింపలేదు!—
తెల్లవాఱె వసంతపుణ్యవ్రతంబు.
సముచితోపకరణ నికరంబు గూర్చి
శారద వైద్యాలయముఁ జేరఁబోయె!
జనులసందడి లేని యానిశీథమున
ఇనుపమంచమునందుఁ గనుమోడ్చియున్న
నిజకుమారునిఁ గాంచి— కన్నీరు నించి—
మనసార పలుమాఱు కొసరి ముద్దాడె!
"అమ్మా!" యని యతఁడు పొరపాటువలన,
కలవరించినయట్లు పిలిచి మూర్ఛిల్లె!—

"కడు పుణ్యవతులైన సతులగర్భమునఁ
బుట్టక నా కెందులకుఁ బుట్టినావు!
కటకటా! నేనింక సైరింపఁ గలనె?—
నాజీవనావధి నాకింక లేదు!—
అని వేగ రామనాథముఁ జేరఁ జీరి,
వచియించె గనులారఁ గనుఁగొన్న మాట!

తెల్లవాఱెను గొల్లు జగమెల్ల నిండె.—
వ్రతవిధానము పూర్తి యగునంతలోన,
సంజచీఁకటి ప్రాఁక వైద్యాలయమున
బాలుఁడు కన్నోడ్చి మైఁ బాసిపోయె!—

ఆరాత్రి శారద శయ్యాగృహంబుఁ
జేరి మృణాలబాహు వుపధానముగ
శయనించి కన్నీటివఱదలో మునిఁగి,
"పుత్రికా! వాత్సల్య మొక మాయ యేని?
మన కీభవంబున ఋణమెల్లఁ దీఱె!"—
అని నిద్రపోయెను!— మఱి లేవ లేదు!—

* * * *

ఉపవాసవ్రతమున వసివాళ్లు వాడి
మరణించె నని లోకులు దలంచినారు!

# జమీన్‌దారులు — వ్యవసాయక్షేత్రములు

మందపాటి సత్యనారాయణరాజు గారు

పూర్వమునుండియు, మహారాజులు జమీనుదారులు, మొఖాసాదారులు మొదలైన భూమిఖామందులు పెక్కు సేరీలను నెలకొల్పి నట్లిప్పటికిని నిలిచియున్న కొన్ని జమీనుదారీ సేరీలవలన తెలియుచున్నది.

పూర్వ మిట్టిసేరీలు ఎందునిమిత్తము స్థాపించిరని, సేరీలయొక్క ప్రాముఖ్య మెట్టుండినది, భూమిఖామందులు రైతులయెడల నెట్టి బాధ్యత కలిగియుండెడివారైనది మొదలైన కొన్ని విషయములను విశదీకరించుచున్నాను.

భూమిఖామందులు ఆయాచోట్ల స్వంత సేరీలను నెలకొల్పి స్వయముగా పంటలు పండించి, భూములకు తరమువారిశిస్తుగాని, రాజభాగం తినస్నులు గాని అన్యాయములేకుండ ఏర్పాటుచేసి రైతులకు భూములను సాగున కిచ్చుటకై మొట్టమొదట నిట్టిసేరీలను నెలకొల్పినట్లు కానవచ్చుచున్నది.

ఇటీవల రైతుప్రజ తమకు కొంతభూమిని సాగుచేయనిచ్చి దానిపైని సాలుసరిపన్నులు వసూలుచేసికొను భూమిఖామందును సర్కారనియు తివాణమనియు పిల్చుకొనుచు సర్వ కష్టసుఖములకును వారిపైనే యాధారపడియుండునట్లు ఏటుస్థించెను. భూమిఖామందులు కూడ రైతుప్రజకు సర్వవిధముల తోడ్పడుచు వారి తగవుధర్మములను తీర్చుచు ప్రజాకర్షకరణము కలిగి మిక్కిలిఖ్యాతిని పొందుచుండెడివారు. మఱియు నతివృష్టి యనావృష్టిదోషములచే పంటలు పోయినయెడల భూమిఖామందులు రైతులను పన్నులకొఱకు నిర్బంధపకుండుటయే గాక రయితు నిలువలేక పారిపోవుననే కారణముచే రయితునకు కావలసిన విత్తనములు, పశువులు, మొదలగువానిని అరువిచ్చుట భూమిఖామందులవిధి యయ్యెను. అందుచే రయితులకు మంచి విత్తనములు, పశువులు మొదలైనవి సులభముగా లభించుటకును, జమీనుదారులకు కావలసిన పాడిపంటలకును, మంచి ధాన్యపురకములను పశువులను వివిధ జాతుల ఫలవృక్షములను నితరస్థలములనుండి తెప్పించి అత్యుత్సాహముతో వ్యవసాయప్రయాసములకు లక్ష్యముచేయక అపారమైన కృషి సలుపుచుండెడివారు. ఇట్టి సేరీలకై తెప్పించిన ఢిల్లీభోగములు మొదలైన ధాన్యములు-ఒంగోలు ఢిల్లీ ఆవులరకములు-బొబ్బిలిపోతులు- మొదలైనవి రైతులకు సులభముగా లభించుటకే

పెక్కు సేరీలు నశించినప్పటికిని పదునారుశకము లిప్పటికిని మనదేశోన్నత్యమును వేనోళ్ల చాటుచున్నవి.

క్రమేణా నీరువారము విచక్షణలేక ప్రతివారును గవర్నమెంటు వారిపై ఆధారపడునట్లు ఏర్పడుటచే రయితులకును, భూస్వాములకును గల దైవికమైత్యము, సంపర్కము దూరమై 'ఎవరికి వారే యమునాతీరే' యను సామెత సార్థకమునకు వచ్చెను. రయితులకు పల్లెటూళ్ల సాహుకార్ల ఆధారమైరి. సేలభూములయందుల పన్నుల కనూళ్లకు ల్యాండు అక్టునందలి 112 వ సెక్షను ఆధారమాయెను. జమీనుదారులకు రైతుల యందలి బాధ్యత తగ్గుటచేతను ఇతర కారణములచేతను సేరీలు నానాటికి నశించుచుండెను. రైతులకు మంచి విత్తనముల కును, మంచిరకముల పశువులకును కఱవాయెను. జమీనుదారులు కూడ వారికి కావలసిన పాడిపంటలు బజారులో కొనునట్లు ఏర్పడుచుండెను. అప్పటప్పట కొన్ని జమీనుదారీ సేరీ లున్నప్పటికిని తగినంత ఉత్సాహముతో పని జరుగకుండు టెంతయు రయితుల దురదృష్టమే.

ఇటీవల గవర్నమెంటువారు వ్యవసాయదారుల యభివృద్ధికొఱకు వ్యవసాయపు డిపార్టుమెంటును, వ్యవసాయపు కళాశాలలను నెలకొల్పిరి. కాని చాలమందికి వ్యవసాయపుడిపార్టుమెం టనగా నేమో తెలియదు. ఇంక కళాశాలల యభివృద్ధి యెట్లున్నది యెల్లరకు తెలిసినవిషయమే. గవర్నమెంటువారు అప్పటప్పట నుంచిన పరిశోధక స్థానాదులు రయితు ప్రజకు దూరముగా నున్నందునను, అవసరమైన కొన్ని మార్పులు జరుగనందునను అవి రైతు ప్రజ కంతగా ననుకూలించుట లేదు.

ఇట్టి కొరతను తీర్చుటకు గవర్నమెంటువారే కాక, మహారాజులు, జమీనుదారులు, పెద్దపెద్ద భూమిఖామందులు, పెక్కుసూత్రాంశములను తెలుపుటకును, వ్యవసాయపుశాఖవారు పరిశోధించి చెప్పినసంగతులను రైతులకు నిదర్శనపూర్వకముగా తెలియజేయుటకును దొంగరహితము లగు పరిశోధకస్థానములను పెక్కుచోట్ల నెలకొల్పి పూర్వపుటౌన్నత్యమును కాపాడవలసియున్నది.

ఇప్పటికి అయాచోట్ల నిలిచియున్న జమీనుదారీ సేరీలవలన జమీనుదారులకు నష్టదాయకముగాను రైతుప్రజకు నేరుగ యుపయోగము లేకయును నుండుటకు అనేక కారణము లున్నవి. వాని నన్నిటి నిప్పుడు వ్రాయుటకన్న ప్రస్తుత కాలమందు రైతుప్రజ కవసరమైన కొన్ని మార్పులను గురించియు, దేవాదాయపుభూములు, బంజరుచేలలు, ఇసుకదిబ్బలు, చవిటిభూములు మొదలైనవి బాగుచేసి రాబడి హెచ్చుచేయుమార్గములను గురించియును వివరించెదను.

1. మాదిరిసస్యములు:—ఇందునుగురించి రయితులకు బోధన లవసరము లేదు. క్షేత్రాధిపతులు సంగతులను గ్రహించి పైరుచేసిన మాదిరి సస్యములను రైతులు చూచి అవలంబించుచుందురు. అందుచే ఎందుకు పనికిరాదని వదలిన భూములకు సహితము విలువ హెచ్చి, సంస్థానముకును, రైతులకును మంచి రాబడికి మార్గ మేర్పడును. ఇట్టివి చూచి అవలంబించునప్పుడు, సదరు సస్యముల నిమిత్తము భూమిని బాగుచేయుట, ఎరువువేయుట, విత్తనములు సంగ్రహించుట మొదలైన సంగతులు సులభముగా ప్రజలు గ్రహింపగలరు.

2. మంచివిత్తనములు:—మనము మంచిరకముల విత్తనములు దూరస్థలములనుండి గాని, గవర్నమెంటువారి సేరీలనుండి గాని హెచ్చు ఖరీదునకు సహితము స్వల్పముగా తెచ్చి జమీనుదారీసేరీలలో మొట్టమొదట సాగుచేసి విత్తనము కల్తీ మొదలైనవి లేకుండచేసి స్వల్ప ఖరీదునకు లభించునట్లు చేయవలసియున్నది.

3. ఆబోతులు:—పూర్వము మన పెద్దలు ప్రతిగ్రామమందును ఒక ఆబోతును వదలిచేసి దానిని భక్తితో పూజించుచు దానిని కొట్టిన యెడల పాపమని స్వేచ్ఛగా వదలిచేయుట ఆచారము. ఇట్టి ఆబోతుల వలన మంచిమాడలు కలుగుట కలదు. కాని నానాటికి నిట్టియెడ్ల ఉపయోగములను మఱచి మొక్కుబడిని ఏదో ఒకదానిని ఎవరో ఒకరు వదలిచేయుచున్నారు. ఇవి స్వేచ్ఛగా తిరుగుచు, చేలు మేయుచు రయితులకు ఇప్పటి ధరలలో హెచ్చుగా నష్టము కలిగించుచుండుటయే గాక చెడుగుణములుగలవై త్వరలో నశించుచున్నవి. ఇట్టి కారణములవలన నిటువంటి ఆబోతులకు దిగిన మాడలు వ్యవసాయమునకు అనుకూలములు గాకుండెను. ఈ కొఱతను తీర్చుటకు జమీనుదారీ సేరీలలో మంచిరకముల ఆబోతుల నుంపించియు, సంఘములమీద మంచి ఎద్దులను తెప్పించియు, రైతులకు ఉపకారము చేయవలసియున్నది. మంచి పనిచేయు ఎడ్లను పాడియావులను సమకూర్చుటకు అనుకూలించేయెడ్లను ఏర్పాటు జాగ్రత్తచేయుట మిక్కిలి అవసరము. ఇప్పటివఱకును తుని, పిఠాపురము, మొదలైన జమీనుదారీ సేరీలలో నున్న మంచి యాబోతుల మూలమున నాయాచుట్టుపట్ల రైతులకు మంచిమాడలు లభించి ఎక్కువలాభమును పొందుటకు వీలగుచున్నది.

4. సహకారసంఘములు:—జమీనుదారుల క్షేత్రాధిపతులును, రివిన్యూఉద్యోగస్థులును, సహకారసంఘముల నెలకొల్పి, వ్యవసాయ సామగ్రి మొదలైనవి మొత్తముగా కొనుట, పండిన దినుసులు మొదలైనవి మొత్తముగా విక్రయించుట సహకారపద్ధతిని, ధాన్యపు మరలు నెలకొల్పుట మొదలైనవి చేయవలసియున్నది.

5. సామాన్యశాస్త్రజ్ఞానమును నేర్పుట:—గవర్నమెంటువారి యొక్కయు, జమీనుదారులయొక్కయు సేరీలచుట్టుపట్లనున్న గ్రామాదులలో స్కూళ్ళవిద్యార్థులు సెలవుదినములలోను మఱికొన్ని యితర కాలములయందును సేరీలకు వచ్చునట్లును, క్షేత్రాధిపతులు అప్పుడప్పుడు స్కూళ్లకు వెళ్లునట్లును ఏర్పాట్లు గావించుకొని, వ్యవసాయమును స్వయముగా చేయించి పశ్వౌషధ, పశువైద్యముల నేర్పునట్లు చేయవలయును.

6. సామాన్య పరిశ్రమలు:—వ్యవసాయపరిశ్రమలతోపాటు నూలువడుకుట, పట్టుపురుగులను పెంచుట, బట్టలు నేయుట, వడ్రము, కమ్మరము చేయుట, యిటుక పెంకు తీయుట మొదలైనవి నేర్పవలయును. పోటీపరీక్షలు, ప్రదర్శనములు మొదలైనవి నెలకొల్పి పరిశ్రమలయందు దక్షతగల పట్టుదల మొదలైనవి అలవడునట్లు చేయవలెను. వ్యవసాయపుపనులు లేని తీరికసమయములలో నిట్టిపరిశ్రమలను చేయుచుండిన యెడల నెంతయు లాభకరముగా నుండగలదు.

ప్రస్తుతము జనసంఖ్య హెచ్చుటవలన సాగునకు తగినంత భూమి లభింపకున్నది. క్షామ కాటకము సంభవించుచున్నందున పంటలు నాసిగిలుచున్నవి. భూములు విస్తారము లైనవి. కోరికలు హెచ్చినవి. ధరలు పెరిగినవి. వృత్తులు నశించుటచే ప్రతివానికిని భూమిని బద్దలుచేసికొని తినుట అట్టివారిపై నాధారపడుట తటస్థించినది. ప్రజకు జీవనాధారము బహుదుస్తరముగా నుండెను. కాన నిట్టిసమయమందు జమీనుదారులును భూస్వాములును ఇతరమహనీయులును, తమ జీవయాత్ర గడపుకొనుటతో సంతుష్టి నొందక తోడి మానవులకు జీవనోపాధి కలుగజేయుటకై మనదేశమునకు ప్రధాన వృత్తియగు వ్యవసాయమును దానికి సంబంధించిన యితరవృత్తులను పెంపొందించుటకు పరిశ్రమలతో నిండిన వ్యవసాయక్షేత్రములను నెలకొల్పుట మిక్కిలి అవసరమైయున్నది.

# ప్రాచీన హిందూదేశ ప్రభుత్వ పరిపాలనము

న్యాపతి నారాయణరావుగారు బి. ఏ., బి. ఎల్.

ప్రాచీన హిందూదేశమునందు విజ్ఞానమంతయు చతుర్భాగములుగ విభజింపఁబడినది. తత్త్వము వేదము వార్తదండనీతిఅని. రాజనీతిశాస్త్రమనాదరణీయమైనపుడు వేదములు సమస్తసుగుణములు నంతరించునని భారతము చెప్పుచున్నది. రాజ్యపరిపాలనవిధానము చాణక్యుని అర్థశాస్త్రమునందు విశదీకరింపఁబడినది. అందు నిర్వచింపఁబడిన ఫలితము సాధనమును సమర్థించునని రాజనీతిసిద్ధాంతము తత్పూర్వపు నైతికగ్రంథములకు తగ్గిపోవును. మెగస్తనీసుయొక్క పంజాబువర్ణనలఁబట్టి రాజ్యముయొక్క జడనీతిస్వరూపములు వెల్లడియగును. జనులకు నాహారవసతులు నెక్కువగ నుండుటచే నసాధారణ శారీరౌన్నత్యమును కలిగియుండిరి. క్షామరహితమై సస్యములకు గొఱంత లేకయుండిరని చెప్పవచ్చును.

హిందూదేశమున రాజు మతగురువు కాఁడు. రాజుయొక్క ముఖ్యబాధ్యత సంఘశ్రేయమే గాని ఆధ్యాత్మికముక్తి కాదు. మతనైతికాభివృద్ధులతో మిళితమగు ధర్మము రాజ్యాధికారమునకు మూలకారణము. వ్యక్తులయొక్క రాజకీయత్వమునకును మతసాంకేతములకును ఏమియు సంబంధము లేదు. ప్రాచీనహిందూదేశమునందు మనుష్యులకు వ్యక్తులుగ హక్కులు లేవు. హక్కులును విధులును సంఘము ననుసరించి యుండును. మహాభారతకాలమందు హిందూజాతికి నేకవిధమగు ప్రజాహితప్రతిష్ఠాపనలు గలవు. బౌద్ధవిజృంభణకాలమందు ఎక్కువజాతులయందు ప్రజాహితరాజ్యప్రతిష్ఠాపనలు గలవు. అలెగ్జాండరు దండయాత్రకాలమునందు నహితము పంజాబునందు ప్రజాప్రభుత్వములుఁ గలవు. ఒకప్పుడు రాష్ట్రము ప్రముఖులయొక్క సంఘాధ్యక్షునివలన పరిపాలింపఁబడుచుండెడిది. ప్రజాప్రభుత్వములు నియమితరాజ్యములవలన నంతరింపఁబడెను. క్రమముగా సామ్రాట్టువిజృంభణము ప్రాముఖ్యమునకు వచ్చెను. ధర్మశాస్త్రముల స్వాభావికసంఘపోషకులును విద్యావంతులు నగు బ్రాహ్మణజాతియొక్క పలుకుబడియు మంత్రిగణముయొక్క సలహాలును కలిసి రాజ్యాధికారము నరికట్టెను. ప్రజాసౌఖ్యైశ్వర్యాదులును వాఙ్మయ కళా శాస్త్రవిజృంభణమును నాగరకౌన్నత్యభివృద్ధియు సుపరిపాలనయొక్క ఫలితములు. అశోకసామ్రాజ్యము ఇప్పటి ఆంగ్లసామ్రాజ్యమునకన్ను నెక్కువ విస్తీర్ణమైనది.

వేదముల కాలమునాఁడు ప్రభువులు ప్రజలవలన నెన్నుకొనఁబడిరి. ప్రభువులు జనులచే తొలఁగింపఁబడిరి. ప్రభువునకు ప్రజలు ప్రభుత్వాధికారము అను భారము నిచ్చుటవసరముగ నుండెను. క్రమముగా 'నా విష్ణుః పృథివీపతిః' అను న్యాయము ప్రబలెను. ప్రభువునకును ప్రజలకును సంబంధము ప్రథమమున ఒడంబడికమీఁద ఆధారపడినది.

పూర్వకాలమునందు మనదేశమున రాజు రాజ్యమునకు దాసుఁడ ననుకొనుచుండెను. శుక్రనీతి యిట్లు చెప్పుచున్నది: "రాజు ప్రజలకు దాసునిగ బ్రహ్మదేవుఁడు సృజించెను. ప్రజలు పంటయొక్క కొంతభాగ మాయన కిచ్చుట దానికి ఆయనకు బత్తెము. రాజు ప్రజలను రక్షించుటకే రాజచిహ్నమును పొందియున్నాఁడు. సుగుణమునకు నీతికి అధికారమునకు శత్రు వయ్యు నడవడిని దుర్మార్గుఁ డయ్యెనేని అట్టిరాజును రాష్ట్రహంతకునిగ నిశ్చయించి జనులు పారఁద్రోలవలయును. నిరంకుశపరిపాలనము హిందూబుద్ధికి గోచరింపదు. రాజెప్పుడును చట్టమునకు బద్ధుఁడు. ఏకాలమునను వాదమునకైన రాజుయొక్క అధికారము నిరంకుశము గాదు. రాజ్=సంతోషింపజేయుట. రాజధాతువునుండి రాజపదము వచ్చినట్టు మహాభారతమువలన మనకు తెలియును. ఆయుద్గ్రంథమునందు రాజుయొక్క విధులు ఈవిధముగ చెప్పబడియున్నవి:— (1) జనులను తృప్తిపఱచుట. (2) వారిని రక్షించుట. (3) సర్వకాలము వారియొక్క శ్రేయస్సు నపేక్షించుట. ఆధునికకాలమునం దివి యన్నియు మనదేశమున మాసిపోయినవి. స్వతంత్రప్రజాప్రభుత్వదేశములం దివి యున్నను మనదేశమువంటి దేశములం దియ్యవి మృగ్యములు.

ప్రభుత్వవిధానమున రెండుకూటములు గలవు. సమితి-సభ-అని ప్రాచీనబౌద్ధకాలమున ప్రజాహితసమాజములు సరియైన ప్రతిష్ఠాపనలుగఁ బరిణమించినవి. ఇవి అధికసంఖ్యాకులచే నిర్ణయింపఁబడుపద్ధతులలో నుండెడివి. మంత్రి పరిషత్తు పాలనాధికారమును కలిగియుండెను. దానికి ఎక్కువయధికారమును స్వాతంత్ర్యమును గలదు. అవసరసమయములందు రాజు నెన్నుకొను నధికారము దానికిఁ గలదు. మెగస్తినీస్ చెప్పినటులు సంఖ్యనుబట్టి కొయొక చిన్నతరగతి ధర్మమునందును విజ్ఞానమునను నది విరాజిల్లుచుండును. నీతివాక్యామృతము నిటులు చెప్పుచున్నది. 'ఏకీభావమును' బొందుట కష్టతర మగుటచే వారిసంఖ్య బేసిగ నుండవలయును. గొప్పరాజ్యముల యొక్కయు సామ్రాజ్యముల యొక్కయు పాలనము వారి అభీష్టమునం దుండును. అందువలన అమాత్యశేఖరులు సరళజీవులై న్యాయమునందును నిష్పక్షపాతబుద్ధియందును శీలౌన్నత్యమునందును ఎక్కువ వన్నె కెక్కియుండిరి. ప్రాచీనపరిషత్తులు ఆధునికశాసనసభల నతిశయించియుండును. చట్టమును సృష్టించుట- దానిని వ్యాఖ్యానముచేయుట-వారి పనిగాదు. కాని వారివిధి నెరవేర్చుటలో కాలానుగుణముగా మారెడి స్థితిగతుల ననుసరించి చట్టముల మార్పు జేయుచుండెను. ప్రాచీనకాలమునందును ఆచరణవిధులు నిరంకుశముగ లేవు. వేదములయొక్కయును స్మృతులయొక్కయును అపౌరుషేయమును స్పష్టపఱచినను, చట్టములయొక్కభావమును వారు మార్చుచుండురు. గ్రంథకర్తలు ప్రాతచట్టములను క్రోడీకరించుటలో ధర్మశాస్త్రగమనమును మార్చిరి. తర్వాతి వ్యాఖ్యాతలుకూడ నిందులకుసాయపడిరి. అప్పటిన్యాయపరిపాలనము ఆధునికనాగరకాగ్రగణ్యచట్టముయొక్క విధమునసే అనుగడించెను. ప్రభువు- ప్రాడ్వివాకుడు- ముగ్గురు నలుగురు ధార్మికులు- కలసి ఉన్నతన్యాయస్థానమయ్యెను. రాజున్నను ప్రాడ్వివాకుడే ఆ సభకు నధ్యక్షుడుగనుండి పనిజేయుచుండును.

అసలుదావాలను అప్పీళ్లను విచారించుటకు ఆయనకు అధికారము గలదు. దానికి దిగువ మండలన్యాయసభలును వానిదిగువ గ్రామన్యాయసభలును గలవు. గ్రామపెద్ద-గ్రామాధికారి-అందు సభ్యులు. దిగువన్యాయస్థానములనుండి పైన్యాయస్థానములకు అప్పీలు గలదు. విచారణ బహిరంగముగ జరుగును. శుక్రనీతి చెప్పునటుల రాజుగాని న్యాయస్థానసభ్యులుగాని రహస్యముగ వివాదములను విచారింపగూడదు. ఆధునికకాలమునందు పూర్వముకన్న వ్యాజ్యెములు మెండని మన మనుకొనుచుందుము. కాని నారదునికాలమునుండి అదియే వినబడుచున్నది. "జనులు వారివారి విధులను నిర్వర్తించుటయందు సంసిద్ధులై యుండి సత్యశీలురై యున్నప్పుడు, దావాలుగాని ఈర్ష్యగాని స్వార్థపరత్వముగాని ఉండుటకు వీలులేదు. విధుల ననుసరించి నడచుభారము నశించినపుడు వ్యాజ్యెములు తలయెత్తును." అని ఆయన నుడివెను. పూర్వము న్యాయవాదు లుండెడివారు. వారికి ప్రతినిధులని పేరు. సత్యాన్వేషణమందు న్యాయాధిపతులకు నాలుగుమార్గములు గలవు. ప్రత్యక్షము- యుక్తి- అనుమానము- (informer) ఉపమానము. సాక్షిసామగ్రులవల్ల నిజము బయటపడనప్పుడు అది అగ్నిపరీక్షలవల్ల పరిష్కరింపఁబడుచుండెడిది. నేరములలో దండనపద్ధతి ఉపయోగింపఁబడె నని హ్యూనిత్సాంగు చెప్పినాఁడు.

"చట్టములయెడల సమత్వము ప్రాచీనకాలమం దభివృద్ధి కాలేదు. హిందూధర్మశాస్త్రమునందు ఒకవిధమైన ఆధిక్యమును ప్రోత్సాహపఱచెను. ధర్మశాస్త్రమందఱకు నేకవిధముగా వర్తింపదు. వ్యక్తుల హోదా ననుసరించి వర్తించును. విధిగా బ్రాహ్మణులు నీచశిక్షలకు లోనుగాకుండిరి. హిందూవాఙ్మయమువల్లను విదేశచరిత్రకారులవల్లను హిందూదేశమునందు ప్రాచీనకాలమున ధర్మశాస్త్రపరిపాలనము ఉత్కృష్టముగ నున్నదని స్పష్టము. న్యాయాధిపతుల సుశీలత- రక్షకభటులదిట్టతనము- జనసామాన్యముయొక్క న్యాయబుద్ధియు దీని కాధారములు.

విష్ణువు విజయుని కిట్లు చెప్పుచున్నాఁడు:— "శత్రుదేశమును జయించినపుడు ఆ దేశపు చట్టముల నిర్మూలింపఁజనదు. శత్రునగరమును జయించినపుడు, ఆ దేశపు రాజకుటుంబములోని రాకుమారుని రాజమర్యాదలతో గద్దెపై నెక్కింపవలెను. రాజకుటుంబమును నాశనము చేయరాదు. విజితదేశముయొక్క పద్ధతులు- ఆచారములు-కట్టు- రాజు ననుకరింపవలయును. వారి జాతీయ మతసాంఘికాచారోత్సవాదులను ఈరాజు గౌరవింపవలయును."

దేశమునందు రాజులు తమలో తాము పోట్లాడుకొనుచుండగా, మన దేశము విదేశీయులదాడికి పా

ల్పడెను. ఈ దాడులవలన మన రాజ్యాంగవిధానము నందు లోపము మనకు గోచర మయ్యెను. రణశక్తియు సైనికప్రతిష్ఠాపనల సౌష్ఠవమును మన జాతీయస్వాతంత్ర్యమును కాపాడలేకపోయెను. అలెగ్జాండరు దాడి వెడలినప్పుడు పంజాబునం దుండెడి స్వతంత్రరాజులు ఏకముఖముగా పోట్లాడలేకపోయిరి. ఎవరికి వారు యుద్ధము చేయుటవలన త్వరలో లొంగిపోయిరి. దేశీయరాజులందఱు ఏకమై ఎదిరించునెడల ఆయనయొక్క అదృష్టము సింధునదియందు పతనమై యుండును. మహమ్మదీయుల దాడికిని నిదియే కారణము. మనదేశమంతయు సంస్థానాధిపతులచే పాలింపఁబడి ఒకరి కొకరు ద్వేషులై యుండుటచేత జనసంఖ్య బలమునైనను తగ్గించి పరరాజులు ఆక్రమించుకొనిరి.

ఆంగ్లేయరాజ్యమునందు నయితము అదియే గోచరమగుచున్నది. కావున దేశ మెప్పుడును కేంద్రీకృతమై పరిపాలింపఁబడునప్పుడు రాగద్వేషములు ప్రబలుటకు వీలు లేక జాతీయలాభముకొఱకే అందఱును శ్రమపడుదురు. అందువలన మనజాతీయత యెక్కువగా ప్రబలి మనజనసంఖ్యబలిమివలన-రణకౌశలమువలన- విదేశీయుల దాడి నరికట్టుటకు వీలు గలుగును. అధునిక కాలమునందు పూర్వలోపములను సవరించుట ముఖ్యావసరము. ఇప్పటి ఆంగ్లప్రభుత్వమువలన పరిపాలన కేంద్రీకృతమై వివిధ రాష్ట్రములవారును అన్యోన్యముగ నుండి పని చేయుచున్నారు. దానినే కాంగ్రెసువారునయితము గ్రహించి వారిఆందోళనమును కేంద్రీకృతము చేసియున్నారు. స్వరాజ్యము వచ్చినప్పుడు పూర్వపులోపములు పోయి ప్రాచీనకాలమునందు మనజాత్యభివృద్ధికి కారణభూతములైన సుగుణము లన్నియు ననుకరించుటవలన విశ్వభారతమునందు మనదేశము ఔన్నత్యమునకు రాఁగలుగును.

# ప్రణయతత్త్వము

హరి - వేంకటేశ్వర్లు గారు

మంచిగంధంబు విరిసిన మల్లెపూలు
నగరువత్తులు తాంబూల మాదియైన
పరిమళద్రవ్యములఁ గూర్చి పాన్పుపైని
ప్రణయదేవి నుపాసించు పడుచుదాన!
ముద్దుటుంగరమును కళ్ల నద్దుకొనుచు
కడు నొయారముగా నేల మెడలు వాల్చి
బాసలను చేసి మఱచిన భర్తకొఱకు
జాబువ్రాయంగ పైఁజూచు సన్నుతాంగి!
ప్రియునిజా బందుకొని దాని వేగ విప్పి
మొదటి మూఁడక్షరాలకే మోదమంది
విసుపులేకుండ నాలేఖ వేయిసార్లు
చూచిననుఁ దృప్తిఁ జెందని సుందరాంగి!
ప్రణయభావము లెట్టులో పగలు దాఁచి
రేయి నిదిరింపనేగిన ప్రియునిఁ జూచి
అతనికంటను బడకుండ నతిరయమున
కౌఁగిలినిఁ గూడఁ బాఱెడు కాంచనాంగి!

పురిటికై పుట్టినింటికి పోవునపుడు
ప్రియుని బలవంతముగ వీడి వెడలలేక
అపనిని సీపనిని జేసి యతనిఁ జూచి
కాలయాపన మొనరించు గడుసుదాన!
ఘోరరణమున నాథుండు పోరి ప్రాణ
ములను బాసెనంచును విని ముదముఁ జెంది
అతనిఁ బాయంగఁజాలక యాక్షణంబ!
ఆత్మహత్యకు గడఁగు పుణ్యాత్మురాల!
పడుచుప్రాయంపువారు. నే తడవు సేసి
వేఱువేఱుగ మిమ్ముల వేడనేల?
ప్రతిదినము మీరు చేసెడి వలపునోము
నాచరించెడి విధ మేమి? అంతమందు
వలయు నుద్యాపనం బెట్లు? ఫల మదేమి?
వ్రతము సాంతంబు గాదేని బాధ యేమి?
అన్నియును జెప్పి పొండమ్మలార! ప్రణయ
తత్త్వ మడుగుచున్నాఁడు—గీతాప్రియుండు.

SRI G. RAMA MURTHY



శ్రీయుత గాజాల రామమూర్తి

LATE M. VENKATA SUBBA RAU



కీ. శే. మిట్టకోడ్డి వేంకటసుబ్బారావు

SRI M. RAMASAWMY NAIDU



శ్రీయుత ఎం. రామస్వామి నాయుడు

SRI K. SIVA RAU



శ్రీయుత కతికి శివరావు

SRI J. JAGANNADHA RAU



శ్రీయుత జములాపురపు జగన్నాధరావు

SRI M. VEERABADRA RAU



శ్రీయుత మోటుపల్లి వీరభద్రరావు

# హైందవ నాటక చరిత్రము

పాలకోడేటి వేంకట రామశర్మ గారు

నాటకకళ ప్రారంభమున గ్రీకుదేశమున నుద్భవించె ననియు, ఏదో విధముగ నాటకబీజములు ఇతరజాతులందును నుండుటచే గ్రీకునాటకములు ఇతరదేశనాటకములకు ప్రోత్సాహము గలిగించె ననియు పెక్కురు విరోపావిద్వాంసుల యభిప్రాయము. కాని ఈమధ్య విల్సను కోన్సు మొదలగు విదేశపండితులు హిందూదేశమందు నాటకప్రోత్సాహము గలుగుటకు గ్రీకు నాటకములు కారణమై యుండునా యని వితర్కించి తగిన నిదర్శనములు అగపడ వని చెప్పుటను సందిగ్ధముగా వదలిరి. జర్మనుపండితులు కూడ నిట్టి అభిప్రాయము గలిగియే తమ విమర్శనములను సమర్థింప మొదలిడిరి.

ఒక చరిత్రజ్ఞుడు హిందూదేశమున నాటకప్రోత్సాహము గలుగుటకు చైనాదేశము కారణ మనెను. కాని చైనాదేశమున పురాతన నాటకము లేవియుఁ గానరాకున్నవి. క్రీస్తుకుపూర్వము నాటకరచనమే చైనాదేశమందుఁ గానరాదు.

హిందూదేశనాటకములకు ఇతరదేశములు ప్రోత్సాహ మిచ్చె ననుటకు కారణము ఏదియును లేదు. హిందూదేశమందు నాటక కుతూహలము గలిగినపుడు గ్రీకురాష్ట్రము అనాగరకముగనే యున్నట్లు చెప్పవచ్చును. భారతీయ నాట్యశాస్త్రము క్రీ. పూ. 600 ల సంలకు పైబడిన కాలమున రచితమయ్యె నని కొందఱు హిందూచరిత్రకారులు పల్కిరి. పాణినిముని తన వ్యాకరణశాస్త్రమునందు 'శిలాలిని' మున్నగు నాట్యసూత్రకారులను పేర్కొనియున్నాఁడు. క్రీ. పూ. 400-300లో నుండిన పతంజలి 'కంసవధ' 'బలిబంధనము' మొదలగు నాటకములను పేర్కొనెను. ధనంజయుఁడు దశరూపకమునందు భరతనాట్యశాస్త్రమునందలి సూత్రములను గ్రహించినటులు చెప్పెను. దీనినిబట్టి భరతనాట్యశాస్త్రముయొక్క పురాతనత్వము శంకింప వీలు లేదు. అలెగ్జాండరు దండయాత్రకాలమునఁ గల భారతనాట్యశాస్త్రమును కొందఱు గ్రీకు పండితులు చూచినటులు కొందఱు చెప్పిరి.

సాధారణముగా సూత్రములకు పూర్వమే నాటకములు రచింపఁబడియుండవలెను గదా! మొట్టమొదట భావమే లేనియెడల వ్యాకరణ రచనము ఎట్లు సాధ్యపడును? కనుక భారతీయ నాట్యశాస్త్రరచనకు పూర్వమే నాటకయుగ మొకటి హిందూదేశమున నుండిన దనవలసి యున్నది. ఈయుగము క్రీ. పూ. 1000—800 సంవత్సరముల మధ్య కాల మయి యుండును. ఈకాలమునందు హిందూదేశమున పెక్కు స్వతంత్ర్యరాజములు వెలువడి పండితపోషకు లగు చక్రవర్తులు అనేకులు పాలనము చేయుచుండిరి.

బాబిలోను నగరమును నిర్మించి ఆనందదాయకము లగు వివిధకళలను వృద్ధిపఱచి గ్రీకుప్రజలను మోహింపఁజేసిన సెమిరమిసు లేక సమూర్యమాత అను రాణియును, అస్సీరియానాగరకతను వృద్ధిపఱచిన అస్సరహార్దను అనువాఁడును ఆర్యసంతతివారే. వీరుచక్రవర్తులు. ఈతఁడు హిందూధర్మమును అవలంబించెననుటకు తన కుమారుని రాజ్యమర్పించి వానప్రస్థాశ్రమమునుచేరిన అతని నడవడియే తార్కాణము. సమూర్యమాత సింధునదిప్రాంతములపై దండెత్తినపుడు సింధురాజుపౌరుషమును జూచి సిగ్గుపడి అతనిని తనకుమారునిగా స్వీకరించెనట!

ఇట్టి యున్నతస్థితియందున్న హిందూదేశమున నాటకకళ విజృంభింపకుండునా? తక్షశిల ఉజ్జయిని మొదలగు చోట్ల అన్ని కళలయందును విజ్ఞానము గఱపఁబడుచుండెను. వివిధదేశములనుండియును యువకులు వచ్చి ఆయాధర్మములను నేర్చుకొని పోవుచుండిరి. ఆకాలమునందు నాటకములకు ఇతివృత్తములను పురాణములనుండి స్వీకరించుటయే గాక రామాయణ మహాభారత కథలను నాటకశైలిని వ్రాయఁబడినవి.

క్రమముగ అస్సీరియా గ్రీకు యుద్ధములచేతను పారసీక గ్రీకు యుద్ధములచేతను గ్రీకుదేశమందు నూతనసంచలనము గలిగి ఒకవిధమైన జ్ఞానకిరణము గ్రీకుదేశమునందు ప్రసరించి ఈ కలయికచే గ్రీకులు పెక్కంశములను నేర్చుకొని రందురు. కాని నాటకరంగమున నూతనభావములు అంకురించుటకు కారణముల నారయువారు లేరు. గ్రీకు నాటకము క్రీ.పూ. 600లో నాగరికతతో జన్మించెనట. కాని యితఁడు రచించినది నాటకమే కాదు. తరువాత నాటకరచనము ఏథెన్సునగరములో క్రీ. పూ. 500—400 లకు మధ్యను ప్రారంభింపఁబడి పెక్కుమార్పులను పొంది ఉత్కృష్టమైన నాటకములుగా పరిగణింపబడుచుండెను. ఈకాలమునన్నియు విషాదాంత నాటకములు. గ్రీకునాటకములు మతసంస్కారములు జరుగునపుడు ఆడఁబడుచుండెడివి. వారిదేవతల నారాధించుటకు ఈనాటకములు సృష్టింపఁబడెను. ప్రారంభమున వీనిని సంభాషణశైలిని ఇద్దఱు గాని రెండుభాగములుగ గాని సుద్దులుగా భక్తిపూర్వక మగు పద్యములుగా పాడెడివారు. వీనినే 'కోరస్సం'దురు. ఇందలి గాథ వారి ప్రకృతిపురాణమందలి గాథయై యుండును. కథకు కాళ్లుచేతులు లేనట్లుగా నీతి కథయందు ఏ మాత్రమును గానరాదు. కాని నాటకరచనమునందు ఇందులోఁగూడను మంచి నిపుణత అవసరము. దేశపద్ధతులను మార్చకుండ ఎన్ని మార్పులయిన గావింపవచ్చును. దైవవిధి దూత కోరస్సు మొదలగునవి కొన్ని ప్రతినాటకమునను ముఖ్యములు. వేఱువేఱుకవులు ఈ కోరస్సును వేఱువిధముగ నుపయోగపఱచినను, గ్రంథకర్త తత్వమంతయు వీటిమూలమున తెలియపరచవలయును. కోరస్సు చెప్పెడి వాక్యములందు కవీశ్వరుని హృదయభావములు బయలుపడుచుండును.

ఇట్టి మార్పులు నాటకరంగమునందు జరుగుటకు కారణము గ్రీకులకు గల్గిన ప్రాచ్యదేశస్థుల సంపర్కమే! ఈరీతిగా హిందూదేశనాటకము ఒకవిధముగ గ్రీకునాటకరంగమున నూతనశక మేర్పాటుచేసెను.

హిందూదేశమునందు ఈకాలమున నాటకము హీనదశకు వచ్చుటకు కారణము హిందూమతోచ్ఛేదక మగు బౌద్ధమతమే. అప్పటప్పట హిందూమతమును పోషించు రాజులు నాటకములందు కుతూహలమును కనఁబఱచుచున్నను బౌద్ధమతకాలమునందు నాటకరంగము నూతన ఫుంత ద్రొక్కెను. ప్రప్రథమమున నాటకమే బౌద్ధమతస్థులచే ఆదరింపఁబడలేదు. అశోకునకు నాటకకుతూహల ముండినటులు గానరాదు. కాని బౌద్ధునిశిష్యులగు మంకగుల్యాన మొదలగువారు వారియెదుట నాటకమాడఁగాఁ జూచి యానందించినటుల బౌద్ధగ్రంథములం దున్నదని యొకరు చెప్పుచుండెను.

బౌద్ధనాటకములు క్రైస్తవనాటకములవలె మతవ్యాప్తికై రచింపఁబడుచుండెను. అందువలనఁ గళాభాసము జరుగుచునుటలో ఆశ్చర్యము లేదు. ఇటువంటి నాటకముల ప్రోత్సాహముచేతనే అలెగ్జాండ్రియానగరమందలి మినాండరు మొదలగు నాటకకర్తలు విషాదాంత నాటకములను త్యజించి నీతిని బోధించు నాటకములు రచింప నారంభించిరి. అందు కళాసామర్థ్యము అంతగా అవసరము లేకుండుటచే పెక్కునాటకములు రచింపబడెను. నాటకమునకు ఇట్టి హీనదశ కలుగుటచే అరిస్టాటులు నాట్యలక్షణములను గూర్చి విమర్శన మొకటి ఆకాలమునందు వ్రాసియుండెను. హిందూదేశమునందు పాతంజల వ్యాకరణమందు నాటకములను పేర్కొనినకాలముననే అరిస్టాటులు అలెగ్జాండ్రియానగరమునందు ఈ విమర్శనమును వ్రాసియుండెను.

ఇట్లు హిందూదేశనాటకము గ్రీకులనాటకకుతూహలమునకు పెక్కువిధముల ప్రోత్సాహమును గలిగించెననుటలో ఆశ్చర్యము లేదు. నాటకయుగము అలెగ్జాండ్రియానగరమందు క్రీ. పూ. 300 ల సంవత్సరములతో సంతరించెను. అప్పటినుండియే రోమునగరము ప్రఖ్యాతివడసెను. నాటకము రోమునగరమునందు క్రీస్తుశకారంభమువఱకు ప్రోత్సాహమును పొందుచుండెను.

ఈకాలమున హిందూదేశమున నాటకకళాభివృద్ధి ఉన్నతదశకు వచ్చియుండెను. రొమాంటిక్ కామెడీసు అనఁబడు శృంగార విషాద నాటకములు హిందూదేశమున రచింపబడుచుండెను. ఇవి నాటకములలో ఉత్కృష్టము లైనవని ఆయిరోపావిద్వాంసులు చెప్పుచున్నారు. అందువలననే షేక్స్పియరు రచించిన టెంపెస్టు నాటకము, ఒథెల్లో వెనిసువర్తకుడు హేమలెట్టు, మొదలగు నాటకములు పొగడఁబడుచుండెను. ఆకాలమునందు హిందూదేశమునఁ బ్రఖ్యాత నాటకకర్తలుగ కాళిదాసు మున్నగువారు వెలుఁగొందిరి. ఉజ్జయిని సర్వవిధముల ప్రఖ్యాతివడసిన పట్టణములలో నొకటి. ఈ పట్టణమందు నాటకకళ మహోత్కృష్టదశ నొందెను. ఇక్కాలమున ధారా కనోజు మొదలగు పశ్చిమప్రాంతములందును వింధ్యపర్వతసామీప్యమునను నాటకములు రచింపఁబడుటయేగాక ప్రదర్శింపఁబడుచుకూడ నుండెను. సౌమిల్లుఁడు కాళిదాసునకుఁ బూర్వమే కొన్ని శృంగారవిషాదనాటకములను రచించెను. ఈ సౌమిల్లుని నాటకములు కొన్ని ఈమధ్యను అమెరికానగరమునఁ బ్రదర్శింపఁబడెననియు నచ్చటి పండితులు దీనిని మెచ్చుకొనిరనియు వార్తాపత్రికలయందుఁ గలదు. మఱియు నీతని నాటకములు బంగాళాపండితుఁ డొకఁడు అచ్చొత్తించె నట! మన ఆంధ్రదేశమునను ప్రఖ్యాతివడసిన ఆంధ్రమిల్టను అను పేరుపొందిన చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు ఈ నాటకములలో కొన్నింటిని మనోరమపత్రికయందు ఆంధ్రమున తెనిఁగింపఁగా చదివియుంటిని. కథాచమత్కృతియందు లోటులేదు. సంభాషణశైలియందు లోటు లేదు. నాటకము అంకములుగా విభజింపఁబడెను. రంగములకు బదులు విష్కంభములు గలవు. అయినను కళాసంపన్నతయందు ఇవి యూరోపియను నాటకములతో పోల్పవచ్చును. కాని కాళిదాసునినాటకచమత్కృతి వేఱు. కొన్ని విషయములయందు షేక్స్పియర్ ఆ నాటకకర్తకు సాటిరాఁడు. కాళిదాసునకును షేక్స్పియరునకును తూర్పు పడమరలకు ఎంత తారతమ్యము గలదో అంత కలదు. ఎవరి కళాసంపన్నతయందు వారు పరిపూర్ణులు. ఒకరిని మించినవారు ఒకరుగా కనుపట్టుచున్నారు.

కాళిదాసు కాలమును విదేశపండితులు గుప్తకాల మని చెప్పుచున్నారు. కొందఱు క్రీ. పూ. 300 లనియు కొందఱు క్రీస్తుశకారంభ మనియును, మఱికొందఱు క్రీ. శ. 300 మొదలు 1000 వఱకు అనియును చెప్పిరి. కాని హైందవపండితులలో పెక్కుర యభిప్రాయము ననుసరించి క్రీ॥ శ॥ 500 ప్రాంతమువాఁ డని నా తలంపు.

రోముగ్రంథములను కొన్ని పరీక్షించిన అగస్టసు చక్రవర్తికాలమున హిందూదేశమునుండి రోమునగరమునకు రాయబారులు పోయిరనియు అందు ఒకబ్రాహ్మణుఁ డుండె ననియు, హిందూదేశచక్రవర్తి ఏనుఁగులు రత్నములు మొదలగునవి కానుకలుగా పంపెననియు, ఈ రాజు బహుపరాక్రమవంతుఁడును, భాగ్యశాలి అనియు చెప్పియుండెను. అట్టిరాజు హిందూదేశమున ఎప్పటఁ గలఁడు? ఒక ఉజ్జయినినగరము మాత్రము గొప్పవర్తకము జరుగు పట్టణముగను, మంచి కళలు మొదలగువానికి నిలయముగను, దేశప్రఖ్యాతి గాంచుటచే ఆ యుపాయనమును బంపినది తప్పక ఉజ్జయినీనగరాధ్యక్షుఁ డనియే గ్రహింపవలయును. అప్పటికి కనిష్కచక్రవర్తిగాని ఆతని మునుపు కుషనులు గాని ప్రాముఖ్యమునకు రాలేదు. అట్టితతి ఉజ్జయినీనగరమున నీ కాలమున శకరాడి నరికట్టి అగస్టసు చక్రవర్తికి రాయబారిని పంపిన హిందూదేశ యోధుఁడు ఎవరు? ఇది ఎవరును ఆలోచింపలేదు. కొందఱు ఇట్టి యోధుఁడు లేఁడనిరి. కొందఱిది వట్టిభ్రాంతి అనిరి. కాని నిజమును గ్రహించుటకు కృషి ఇంకను ఈ మార్గమున సఫలమైయుండును. తప్పక విక్రమార్కుఁడే యా రాజు.

అప్పటినుండి-అనఁగా క్రీస్తుశకారంభమునుండి కుషను దండయాత్రలు అధిక మగుటచేతను, ఉజ్జయిని కుషనులవశ మగుటచేతను ఉజ్జయినీనగరప్రభ తగ్గెను. కుషనుచక్రవర్తులు బౌద్ధులు. అందువలన బౌద్ధమతము విజృంభించుచుండె. అశ్వఘోషుఁడు మొదలగుపండితులు

నాటకములు రచించియు ప్రదర్శించియు మతమును దేశదేశములకు వ్యాపింపఁజేయుచుండిరి. ఈ కాలమున బౌద్ధమతసూత్రములు చైనా పర్షియా మొదలగు దేశములకు ప్రాకుచుండెను. చైనాదేశము త్వరలో బౌద్ధమతము నవలంబించెను. బౌద్ధనాటకములు ఇచ్చట ప్రోత్సహింపఁబడెను. కాని యూ ఏచీ హూణ దండయాత్రలచే హిందూదేశమున నాటకకళ క్రీ. శ. 100 మొదలు 300 ల వఱకు ప్రోత్సహింపఁబడలేదు. తరువాత 500 మొదలు 1000 ల వఱకు నాటకరంగములు వెలసెను. పండితులు నాటకములను వ్రాయ మొదలిడిరి. కాని గుప్తరాజులు నాటకములందు కుతూహలమును కనఁబఱుపలేదు. కాశి కనోజి కాశ్మీరము మొదలగు ప్రాంతములందే నాటకరచన పోషింపఁబడుచుండెను. ఇక్కాలమున హిందూదేశమున పెక్కురు నాటకకర్తలు నాటకములను వ్రాసిరి. అందు భవభూతి శ్రీహర్ష ప్రభృతులు ముఖ్యులు. కాళిదాసునాటకములు ఆ కాలమున పామరులు గూడ గ్రహింపఁజాలియుండిరి. ధనంజయుని 'దశరూపకము' ప్రచురించినకాలమునుండి నాటకము మఱల అవనతమార్గములు పట్టెనని గ్రహింపఁదగును. మహమ్మదీయదండయాత్రలు అందులకు ముఖ్య కారణములు.

హిందూనాటకములు చిరకాలమునుండి అంకములుగ విభజింపఁబడెను. అగస్టసుకాలమున రోమునగరమున నీ విషయమై కొంచెము మార్పు సంభవించెను. అంతకుఁ బూర్వము గ్రీకు రోమునాటకములు అంకములుగా విభజింపఁబడలేదు. ఈ అంకవిభజనను రోమునగరమునందు 'సెనీకా' ప్రారంభించె నని చెప్పుదురు. అప్పటినుండి అయిదంకములవిభజన యూరోపాఖండనాటకములందుఁ గానవచ్చెడిని. హిందూదేశమున కాళిదాసునకు పూర్వపుకవులు గూడ నిట్లు అంకవిభజన చేసియుండిరి. అందువలన రోమునగరమునందు ఈ మార్పు గలుగుటకు కూడ హిందూసంపర్కమే కారణమై యుండనోపును.

క్రీస్తుశకారంభమునుండి క్రీస్తుమతవిజృంభణకై బౌద్ధనాటకములవలె క్రీస్తుమతస్థులును క్రీస్తుపుట్టుక మరణము మొదలగు కథలను నాటకములుగా ప్రదర్శించుచుండిరి. రోమునగరము క్రైస్తవరాజుల చేతులఁ బడినదాది నాటకములు మతబోధకము లాయెను. కళాచాతుర్యముగల ప్రాతనాటకములు అణఁగద్రొక్కఁబడెను. యూరోపాఖండమంతటను ఇట్టి నాటకములే ఆడఁబడుచుండెను. ప్రజలు స్వాతంత్ర్యవిహీనులైరి. నాటకములు వారి కింపుగ లేకున్నను మతగురువుల కోపమునకు జంకి చూచుటకు వచ్చుచుండిరి. కొందఱు మతగురువుల ఆజ్ఞల ధిక్కరించి నూతనసంస్కారములు గావింపఁజూచిరి. ఇట్లు పదు మూఁడవశతాబ్దాంతమువఱకు యూరోపాఖండము అజ్ఞానాంధకారమం దుండెను. దీనినే అంధకారయుగము (Dark Ages) అని పిలిచిరి. అటుగా నితరకళ లీ కాలమున వృద్ధిచెందుచున్నను జ్ఞానవిహీనత అగపడుచుండెను. ఆసియాఖండజ్ఞానముకొఱకు తిరిగి యూరపుఖండ ప్రాంతము లువ్విళ్లూరుచుండెను. కాన్స్టాంటినోపిలు మహమ్మదీయుల వశమయ్యెను. అప్పటి క్రైస్తవవిద్వాంసులు శిల్పులు మొదలగువారందఱు యూరపుఖండపు వివిధదేశములకు పారిపోయిరి. పెక్కుమంది రోమునగరము నాశ్రయించిరి. రోమునగరమున నూతనవికాసము గలిగెను. అయినను మతబోధకుల ఆజ్ఞ పూర్తిగ నుల్లంఘింప వీలులేదు గాన ప్రాచీనకళావిజ్ఞానమును అప్పటి కళావిజ్ఞానము కలిసి నూతనకళావిజ్ఞానమునకు మార్గ మేర్పడెను.

శృంగారమే లేని యూరపుఖండ నాటకములందు శృంగారము వర్ణింపఁబడుట ప్రారంభించెను. విషాదభావము ఇటలీలోనే వారు గ్రహించిరి. అన్నిరంగములందు ఇట్టిమార్పు సంభవించెను. శిల్పమందు కళలందు నాటకములందుఁ గూడ నీ మిశ్రమము అవలంబింపఁబడెను. స్పైను త్వరలో ఈపద్ధతిని స్వీకరించెను. ఇంగ్లాండు ఆదారినే పట్టెను. షేక్స్పియరు ఈ భావములను సంపూర్తిగా వర్ణించెను. అతని మించిన నాటకకర్త తిరిగి ప్రపంచకమందు పుట్టలేదు. విప్లవములు వృద్ధి ఆయెను. యూరపు అంతయు నీ నూతనవిజృంభణము గాంచి తల్లడిల్లఁ జొచ్చెను. విద్వాంసులు విద్య పాడగుచుండె నని భయపడిరి. శిల్పులు శిల్పము తప్పుమార్గముల ద్రొక్కుచుండె నని చింతిల్లిరి. మతగురువులు మతభ్రష్టత కలుగుచుండె నని భయపడిరి. కాని అన్నియును మంచికే జరిగినవి. సర్వవిధముల యూరపుఖండపు నాగరకతను పొందుచుండెను. దేశాభిమానము మతాభిమానము వృద్ధి అగుచుండెను. కాళిదాసాదులు గ్రహించినటులు ప్రకృతిభావములను గ్రహించుటకు షేక్స్పియరువంటి కవులు పెక్కురు జనింపవలసిరి.

తిరిగి 1800 సంవత్సరమునుండి హిందూదేశమున ఆంగ్లనాటకసంపర్కముచే నాటకరంగము విజృంభించెను. షేక్స్పియరుని నాటకములు కళాశాలలందు బాలురకు పఠనీయగ్రంథములుగ నుండుటచే, దేశభాషలందు ఇట్టి నాటకములు రచించుటకు కవులు ఉత్సాహమును చూపిరి. కాళిదాసాది నాటకకర్తలు మఱల హిందూకవుల స్మరణకు వచ్చిరి. కనుక హిందూదేశనాటకరంగము పూర్తిగ ఆంగ్లనాటకములవలెఁ గాక పూర్తిగ సంస్కృతనాటకములవలెను గాక మధ్యత్రోవను స్వీకరించెను. కాని కళాచమత్కృతియందు కళావిద్యయందు ఇప్పటి నాటకములు షేక్స్పియరు కాళిదాసాదుల నాటకములతో సరిపోలవు.

# భారతస్వరాజ్యాదర్శము

తాడిమేటి వేంకట రామకృష్ణ రావుగారు. బి. ఏ.

భారతభూమి ఈశ్వరుని విశుద్ధలీలా ప్రకటనమునకై ప్రత్యేకింపఁబడిన మహత్తరమగు పవిత్ర క్షేత్రము. సృష్టినంతను ఈశ్వరమయముగను, ప్రపంచ మందలి వివిధ జీవులను ఆనందముకొఱకు ప్రదర్శించు జగన్నాటక పాత్రములుగను, తత్కృతకార్యముల నెల్ల అజ్ఞానజన్య మగు బహుత్వభావమునుండి జ్ఞానజన్యమగు ఏకత్వభావోపలబ్ధికై జరుగవలసిన క్రమపరిణామమందలి యంతరములుగను, గ్రహించువానిదృష్టికి - భారతాత్మ నేఁడు ఇచ్ఛించునది కేవలము రాజకీయార్థిక స్వాతంత్ర్యము మాత్రమే కాదని గోచరింపక మానదు. ఇట్టి స్వతంత్రతకై మహాత్యాగ మొనర్చి, వంగవిభజన సందర్భమున జాతీయవాదనాయకులందు అగ్రేసరుఁడని ఖ్యాతివడసిన శ్రీ అరవిందఘోషు ఆలీపూరు జైలులో ఈశ్వరసాక్షాత్కారము నొందినతరువాత ఉత్తర్పరయను పట్టణమున నిచ్చిన యుపన్యాసమున చెప్పిన "భారతావని యెన్నడును స్వార్థమునకై మనియుండ లేదు. నేఁడు తిరిగి మనమాతృభూమి తలయెత్తుచున్నదనిన అమూల్య మగు సనాతనధర్మమును ప్రపంచమునఁ బ్రచారము చేయుటకే!" అను సంగతిని మనము బాగుగా గ్రహింపవలెను. జాతిమతద్వేషములు- కార్మికులలశాంతి- దుర్బల దేశముల దాస్యము మొదలగునవి - మానవజాతిని ప్రస్తుత మెదుర్కొనిన క్లిష్టసమస్యాపరిష్కారమునకై జరుపఁబడిన అంతర్జాతీయసభలును - సమ్మేళనములును నిరర్థకమైనట్లు వ్యక్తమైనకొలది, అంతరంగ మగు మార్పుయొక్క ఆవశ్యకత దినదినమును స్పష్టముగా గమనింపఁబడుచున్నది. అట్టిపరిణామము మానవహృదయమున కలుగవలయు ననిన నేదేని ఒకజాతిదానిని తెలిసికొని, తన సామాన్యదైనిక జీవనమందు వ్యక్తముచేయుట అవసరము. అనేక సూచనలను బట్టి ఈవిషయమున భారతజాతియే నాయకత్వము వహించి, లోకకల్యాణమునకు మార్గదర్శి యగునని తలఁపవలసియున్నది.

అహింసయే పరమధర్మముగా విశ్వసించుచు, రాజ్యాంగమును నీతినుండి వేఱుచేయని గాంధిమహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్యమును బడయుటకు దేశము సమకట్టుటయే ఈసూచన లన్నిటియందును గొప్పది. కాని దేశమునకు అహింస సమత్వభావోపలబ్ధి నిచ్చు సాధనమే కాని నాయకునకువలె పరమప్రాప్య మగు సంపూర్ణస్వధర్మము కాదు. అందుచేతనే ఇరువదిమాసము లెంతయో ప్రశంసనీయముగ అహింసాశపథమును పాలించి- బొంబయి అల్లరులతరువాత దౌర్జన్యమును తొలగించుటకు మహాప్రయత్నము లొనర్చి- చౌరీ చౌరాదురంతములతో స్వశక్తియందలి విశ్వాసమును గోల్పోయి, "ఇట్టిమహాదేశమున నుండు ముప్పదిరెండు కోట్ల ప్రజలును గాంధివంటిఋషులను కాజాలను. అట్లగువరకును స్వరాజ్యము రానియెడల మనము యుగ యుగములకును బానిసలుగా నుండవలసినదేనా? కావున నేదేని మరియొకమార్గమునను, అవసరమగునెడల వేరొక నాయకునిక్రిందను స్వతంత్రమును బడయుదము" అని దేశము లోలోన విసుగుకొనుచున్నది. కాని ప్రస్తుతము బాహ్యమున నెంతవెదకినను వేరుమార్గము గాని, నాయకుఁడుగాని కనిపింపలేదు. కాని జాతీయాహంకారమునకు కలిగిన- ఈ యాశాభంగమును- అసంతృప్తియు- విషాదమును- క్రమముగా హైందవమానసమును అంతర్ముఖమునకు త్రిప్పి భారతబుద్ధిని వికసింపఁజేసి, ఎట్టి సవ్యమార్గమున నైనను అహంకారముతో నడచి గమ్యస్థానము చేరుట యసాధ్యమనియు, కోరిక లెన్ని యున్నను ఈశ్వరసంకల్పానుసార మగునవి మాత్రము నెఱవేఱు ననియు, అందుచే నిష్కామముగ స్వధర్మమును ఆత్మసమర్పణబుద్ధితో చేయవలెననియు గోచరింపఁజేయును. గతించి

సహాయనిరాకరణయుగమందు తనశక్తినిమాత్ర మిచ్చి గాంధిరూపమున దేశమును నడపిన ఈశ్వరుఁడే అప్పుడు తిరిగి మఱొక మహాపురుషునికి తన యమోఘమగు శక్తినేగాక విశుద్ధజ్ఞానసిద్ధినికూడఁ గలిగించి, ఆ సిద్ధపురుష రూపమున భారతమునకును మానవజాతికిని ఆత్మసమర్పణ యోగ దీక్షను స్వరాజ్యసిద్ధిని ఇచ్చు లోకగురు వగునని దృఢముగ నమ్మవచ్చును. పదునొకండు సంవత్సరముల నుండి దేశముచే దాదాపుగ మఱవఁబడి అకస్మాత్తుగ నాగ పురజాతీయమహాసభ కధ్యక్షుడుగా నుండుటకై ప్రార్థింప బడుటనుబట్టియును గాంధి కారాగారమున కేగినయెడల నాయకత్వము వహించు నని దేశములో మూలమూలలను గ్రామములయందును నిర్హేతుకముగ ప్రబలిన నమ్మకమును బట్టియు, ఇప్పటికి సుమారేబది వత్సరముల క్రిందట (1872 సం॥ ఆగస్టు 15) వంగదేశమున జన్మించి, ఇంగ్లండునందే చిన్ననాఁటనుండియు విద్య గఱచి, మహామేధావియు బహుభాషాపరిచయుఁడు నై, ప్రాచ్య పాశ్చాత్త్య నాగరకతలను సంపూర్ణముగ గ్రహించి, ద్వాదశవత్సరములుగా మాతృభూమికొఱకును ప్రపంచ కల్యాణముకొఱకును మహాతపస్వియై సంపూర్ణయోగ నిష్ఠాగరిష్ఠుడై ప్రకృతిపురుషుల యాధ్యాత్మికాధిభౌతిక సత్యతలు భిన్నధర్మములు మొదలగు విరుద్ధద్వంద్వముల కొంకు సమన్వయతత్త్వము నుపలబ్ధి నొంది, మానవుని యందు విజ్ఞానమయకోశవికాసము తనద్వారా ప్రదర్శించుటయే ఈశ్వరోద్దేశ మని ఇటీవలనే సెలవిచ్చిన శ్రీ అరవిందనాముఁ డగు "భగవాన్ (అరవిందు)డే" యుక్తకాలమున కార్యక్షేత్రముఁ జొచ్చి స్వరాజ్యసిద్ధి నొసంగు నని గ్రహించుటకూడ కష్టము కాదు.

సత్యము, అహింస, ప్రేమ మొదలగు నేవో కొన్ని ధర్మములను పాలించుటకు కాదు భారతాత్మ నేడు సంకల్పించినది. మనోబుద్ధిచిత్తాహంకారములకు ప్రభువగు జాతీయాత్మ తమస్సునుండి మేల్కాంచి, తన యంతరంగరాజ్యమును చక్కఁజేసికొని సర్వధర్మసమన్విత మగు స్వరాజ్యసిద్ధిని, బహిఃప్రపంచమున స్థాపించి సామ్రాజ్యసిద్ధిని పొందుటకై మనదేశమున మహత్తర మగు యోగసాధన మారంభ మైనది. శుద్ధి ముక్తి సిద్ధి భుక్తి యను అరవిందుని "పూర్ణయోగము" నందలి నాలుగంతరములలోను రెంటిని దేశము కొంతవఱకు సాధించినది. శుద్ధియు ముక్తియుఁ బొందిన మహాపురుషుఁ డగుటచేతనే గాంధిమహాత్ముఁడు ద్వేషభోగ లాలసాది కిల్బిషములనుండి పరిశుద్ధముగను, భయక్రోధాదికంటకములనుండి ముక్తముగను చేసి, భారతక్షేత్రమును అజ్ఞానజన్యమగు అహంకార మహాయజ్ఞమునకు సిద్ధము చేయఁగలిగినాఁడు. కాని ఈసాధనము సకామము [సాత్త్వికమైనను] అహంకారయుతము నగుటచే సిద్ధికి భంగము కలిగినది. అహంకారనిర్మూలనము చేసి ఆత్మసమర్పణదీక్షకు దేశమును సిద్ధము చేయుటకై ఈశ్వరుఁడు ప్రదర్శించిన లీలవలననే ఉద్యమమునకు విఘ్నము కలిగిన దను తాత్కాలిక భ్రమయును, మహాత్ముని కారాగృహప్రవేశమును కలిగినవి. తాను ఈశ్వరుని యుపకరణమునుమాత్రమేయనియును, సహస్రవత్సరములనుండి పరజాతుల దాస్యమునఁ గొన్ని యుత్కృష్టములగుపాఠములను నేర్పుటకు నియోగించిన ఈశ్వరుఁడే నేఁడు మఱల లోకమునకు గురుస్థానమునాక్రమించి మానవకల్యాణమునకు పాటుపడుటకై తన్ను లేవనెత్తి స్వతంత్రము నిచ్చుచున్నాఁడను. జ్ఞానము భారతీయులకు కలిగినప్పుడే భారతము స్వరాజ్యయోగదీక్షను బూనుట కర్హమై యుండును. అట్టి యర్హత దేశమునకు కలిగినప్పుడు ఈశ్వరుఁడు గురువును ప్రసాదించి స్వరాజ్యసిద్ధి నొసంగును.

సంపూర్ణస్వరాజ్య మనిన విజాతీయబంధనములు లేని రాజకీ యార్థిక స్వాతంత్ర్యము మాత్రమే కాదనియును, అంతరంగమున నుపలబ్ధమైన ఆత్మరాజ్యముయొక్క సంపూర్ణమగు బాహ్యపరిణామమే యనియునుఁ దెలిసికొనుట అవసరము. ఇట్టి ఆత్మరాజ్యసిద్ధినొందిన వ్యక్తులు ప్రతిదేశమునను బ్రతిజాతి యందును ఎల్లప్పుడును ఉందురు. కాని వారు సామాన్యముగ నేకాకులై ఏయరణ్యముననో పావభూయిష్ఠమగు నీప్రపంచముతో సాధ్యమైనంత తక్కువసంబంధముతో సచ్చిదానందనిమగ్నులై జీవితములను గడపుచుందురు. కాని అట్టి యాధ్యాత్మికజీవనప్రాప్తి ఇప్పుడు

వ్యక్తులకుమాత్రము కాక సమష్టిమానవసంఘమునకే కలుగుసూచన లనేకములు కనఁబడుచున్నవి. విప్లవములు యుద్ధములు మొదలగు స్వాస్థ్యసంకటములచే మానవజాతియందలి యపరిశుద్ధత చాలభాగము తొలగింపబడుచున్నది. మానవహృదయమున మొన్నటిమహాయుద్ధము పశుబలముఁగూర్చిన ప్రబలవైరాగ్యమునకు కారణమైనది. కాని యాపశుత్వమునకు సంపూర్ణభుక్తి మఱియొక ఘనతరసంగ్రామముతోఁ గాని కలుగకపోవచ్చును. తదనంతరమైనను మానవజాతి భౌతికబలప్రధానమగు పశుత్వమును పూర్తిగా విడనాడి, బుద్ధిసత్వప్రధానమగు పరిశుద్ధమానవత్వమును పొంది, విజ్ఞానమే ప్రధానముగాఁ గల దేనజీవనమునకు పునాదులను వేయుననుటకు, ఏసందియము లేదు. శీఘ్రకాలమున నంతరింపనున్న ప్రస్తుతయుగమున నహంకారమే ప్రతిసంస్థకును పునాదిగా నున్నది. నేను బ్రాహ్మణుఁడను నేను మహమ్మదీయుడను నేను శ్వేతజాతికిఁ జెందినవాఁడను నేను కోటీశ్వరుఁడను నేను విద్వాంసుఁడను అను నహంకారమే ప్రపంచమున స్వతంత్ర ప్రతిష్ఠాపనమునకును, సమత్వభావవికసనమునకును, సర్వసోదరభావవ్యాపనమునకును ప్రతిబంధకముగా నున్నది. ఈయహంకారము తొలఁగి యీ బాహ్యనామరూపగుణములకు వెనుక నొకేయాత్మతత్వ మందఱియందును నిండియున్నదను విశుద్ధజ్ఞానోపలబ్ధి కలిగినప్పుడు ప్రతిమానవుఁడును "సర్వభూతములయందును నేనే నివసించుచున్నాను. నాయందే సర్వమును కలదు. నేను కానిది సృష్టియందిసుమంతయు లేదు" అని తెలిసికొనును. అప్పుడు సర్వమతసమన్వయము- జాతులయైక్యత - ప్రకృతిపురుషుల యవినాభావసంబంధజ్ఞానము- కలుగును. అప్పుడు జ్ఞానము నార్జించుటకు కార్యకారణవివేచనయును తర్కమును ధర్మముగాగల మనస్సు ఇప్పటివలె ప్రతిబంధకముగా నుండుట మాని, వికసించిన విజ్ఞానకోశమందలి సత్యప్రకటనమునకు విశుద్ధమార్గ మగును. పూర్వము సమాధిస్థితియందు మాత్రమే దివ్యదృష్టి గల ఋషీశ్వరులవలెఁ గాక, భావిమానవుఁడు దివ్యదృష్టినే సామాన్యధర్మముగా గలిగి, ఎల్లప్పుడును జాగ్రత్సమాధియందే యుండి ఈశ్వరుని విశుద్ధలీలకును, ఆనందమునకునునిలయమై అమృతత్వమును బడయును.

అట్టి మహోత్కృష్ట మగు సంపూర్ణ స్వరాజ్యసిద్ధిని తాను ముందుగా నుపలబ్ధి నొంది లోకమందలి ఇతర జాతులకు దాని నిచ్చు అఖండబాధ్యత భారతదేశమునకుఁ గలదు. కావున సత్వరరాజ్యాంగస్వతంత్రము నందలి మోహమును వీడి - ఆర్థికస్వపరిపాలనకామ్య బంధనమును త్రెంచివైచి- అహంకారయజ్ఞమునకుబూని- ఈశ్వరహస్తములయందు పరిశుద్ధోపకరణమువలె - స్వధర్మము ననుసరించి నిష్కామకర్మయోగమునకు బూనుట ధర్మము. సంకుచిత మగు జ్ఞానముతో కామ్యకర్మలఁ జేయువారికి తత్కామ్యసిద్ధియే కలుగును. నిష్కామకర్మయోగి యవసరముల నన్నిటిని సర్వజ్ఞుఁడగు ఈశ్వరుఁడు గుర్తెఱిగి సర్వఫలసిద్ధిని కలుగఁజేసి తానుకూడ వానియందు నివసించును. అంతరంగమున నైతానుపాలన మున్నంతకాలము వ్యక్తులకుఁ గాని జాతులకుఁ గాని నిజమగు స్వాతంత్ర్యానుభవమునకు అర్హత యుండదు. కావనే నిజమగు స్వరాజ్యము లోకమున మృగ్యముగ నున్నది. బాహ్యసంస్థలను మాత్రము మార్చి స్వతంత్రమును, ఆనందమును భూమిపై ప్రతిష్ఠించుటకు చేయు ప్రయత్నము లన్నియును బూటకములును నిరర్థకములును నగును.

కావున నాత్మసమర్పణయోగసాధనచే ఆత్మరాజ్యసిద్ధిని బొందుటయే మాతృభూమికిని స్వారాజ్యసిద్ధిని కలుగఁజేయుటకునుగలముఖ్యమార్గమని గ్రహించుట ధర్మము.

# పాలకురికి సోమనాథ కవి

బండారు తమ్మయ్య గారు

ఈతఁడు నిజామురాష్ట్రమునందలి ఓరుగల్లుప్రాంతమున నున్న పాలకురికినివాఁడు ఁ డయినట్లు లీతనియింటిపేరును బట్టియుఁ బిడుపర్తి సోమనాథకవికృత మయిన పద్యబసవపురాణమును బట్టియును దెలియవచ్చుచున్నది. ఈతని ప్రశిష్యకోటిలోఁ జేరిన యొకకవిచే నీతని కంకితముగా రచింపఁబడిన "అన్యవాదకోలాహలము" అను సీసశతకమునందలి యీ దిగువపద్యము గూడ నీ విషయమును విస్పష్టముగా విశదీకరించుచున్నది.

సీ. భవదీయసంబంధ బంధురం బరయ్యో నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
భవదంఘ్రిపూజనా పరుల కిమ్మరయ్యో నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యిమ్మహిద్విహార సంచయ క్రమై వెలసె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యిమ్మహీయాత్రయా తుల్యస్థితిఁ బొందె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి

గీ. పాలకురికి యెట్టి భాగ్యంబు చేసెనో
నీస్వనామపూర్వ నిహిత మయ్యె.
ఈహితానుమంగ ! యేకామ్రగురుచరిత్ర
నలినభృంగ ! సోమనాథలింగ.

ఈ కవి మొదటి ప్రతాపరుద్రునివలన సమ్మానములఁ బొందినట్లు పద్యబసవపురాణములోఁ బిడుపర్తి సోమనాథుఁడు చెప్పియుండుటచేతను, మొదటి ప్రతాపరుద్రుఁడు క్రీ. శ 1140 మొదలు 1196 వఱకు రాజ్యమేలినట్లు కనఁబడుటచేతను, కర్ణాటకవిచరిత్రకారు లీతఁడు బసవేశ్వరుని శిష్యపుత్త్రుఁ డని తలంచి యీతఁడు క్రీ. శ. 1195 వ ప్రాంతమం దుండినట్లు చెప్పవచ్చు నని వ్రాసియుండుటచేతను శ్రీ వీరేశలింగము పంతులుగారు కొన్ని యుపపత్తులతో నీతఁడు క్రీ. శ. 1180 ప్రాంతమువాఁ డని కవిచరిత్రములో నిర్ణయించిరి. ఈతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁ డనుట నిర్వివాదాంశము. పంతులువారొనర్చిన కాలనిర్ణయము గూడ నించుమించుగ సరియైనదే గాని కర్ణాటకవిచరిత్రకారు లేమి శ్రీ పంతులుగా రేమి యీతఁడు బసవేశ్వరునియెడఁ జెప్పికొన్న సంబంధవిశేషములఁ బట్టి యీతని కాలమును నిర్ణయించుట సరికాదని విన్నవించుచున్నాఁడను. ఇతఁడు తాను బసవేశ్వరుని శిష్యపుత్త్రుఁడ నని చెప్పికొన్నాఁ డన్న యంశమునుబట్టి వీ రీతనికాలమును నిర్ణయించి యున్నారు. సోమనాథుఁడు వాస్తవముగాఁ జెప్పినది "బసవేశభుజిష్యాత్మభవో బసవకింకరః" అని కాని "శిష్యాత్మభవః" అని కాదు. భుజిష్యుఁ డనఁగాఁ కింకరుఁడు గాని శిష్యుఁడు కాఁడు. భుజిష్యశబ్దమును శిష్యశబ్ద పర్యాయ మని భ్రమించినట్లు తోఁచుచున్నది. వా రుదాహరించిన శ్లోకములోనే పయిపాదములలోఁ గవి తాను "గురులింగార్యస్య దయాహస్తగర్భ సముద్భవః బసవేశస్య తనయః బసవేశ్వరగోత్రకః" అని చెప్పికొనియుండుటచే, "దీనినిబట్టి సోమనార్యుఁడు లింగార్యునిపాత్త్రుఁ డయినట్లును బసవేశ్వరుని పుత్త్రుఁ డయినట్లును గనఁబడుచున్నాఁడు" అని కూడ పంతులువారు వ్రాసిరి. సోమనాథుఁడు బసవేశ్వరునిపుత్త్రుఁ డయినట్లు అభిప్రాయపడుట కూడ మఱింత ప్రమాదము. బసవేశ్వరునిపుత్త్రుఁడ నని గాని, తద్గోత్త్రుఁడ నని గాని, తత్కింకరుఁడ నని గాని, సోమనాథుఁ డెట్టు లేమి చెప్పికొనినను బసవేశ్వరునం దాతనికున్న నిరతిశయ భక్తిపారవశ్యముచేతనే గాని నిజముగా నాతనికి బసవేశ్వరునితో నాడు సంబంధము లున్నయవి యుండుటచేఁ గాదు. అట్లు గానిచో నాతఁడు బసవేశ్వరునకు స్వీయ పుత్త్రుఁడు కింకరపుత్త్రుఁడు కూడ నెట్లు కాఁగలఁడు? కనుక ఈతఁడు బసవేశ్వరునకు సమకాలీనుఁడే కాఁడని నా యభిప్రాయము. అయిన ట్లాధారములను గన్పింపవు. వేయేల! సోమనాథుఁడే తాను బసవని చరితమును భక్తులచే విన్నవిధమునఁ బురాణముగా రచించితి నని చెప్పికొన్నాఁడు చూడుఁడు:—

"ప్రస్తుతింపంగ సద్భక్తివిస్ఫూర్తిఁ, బ్రస్తుతికెక్కిన బసవనిచరిత
చెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ, దప్పకుండంగను దా శక్తిఁ జేసి"

(బసవపురాణము. ఆ-7.)

సోమన బసవనకు సమకాలీనుఁడే యైయుండినచో నాతనిచరితమును స్వయముగా నెఱింగినవాఁడే యైనచో నిట్లు చెప్పుట తటస్థింపదు. కనుక బసవేశ్వరుని యెడ నీతఁ డెట్టి సంబంధములు చెప్పికొన్నను నట్లు చెప్పికొనుట భక్తిపారవశ్యముచేతనే యని యూహింపవలెను. బసవేశ్వరునందు భక్తిపారవశ్య మీతని కెంతవఱ కుండెడిదో యాతని పండితారాధ్య చరిత్రమునందలి దీక్షాప్రకరణమును జూచినచో గ్రహింపవచ్చును. శివభక్తులకుఁ దాము కొడుకులమని-భృత్యులమని-బంటులమని వర్ణించుకొనుట వీరశైవుల మతసంప్రదాయము. కావున బసవేశ్వరుని యెడ నీకవి చెప్పికొనిన సంబంధములఁ బట్టి యీతని కాలనిర్ణయమును జేయఁబూనుట ప్రమాదము. సోమనాథకవి తన గ్రంథములలో బసవపురాణమునకు గొబ్బూరి సంగనామాత్యుని, పండితారాధ్యచరిత్రమునకుఁ బాలకురికి మారనామాత్యుని, అనుభవసారమునకు గోడగి త్రిపురారిని శ్రోతలుగాఁ జూపుకొనినాఁడు. ఈ ముగ్గురి కాలమును నిర్ణయించినచో సోమనాథుని కాలమును సులభముగా నిర్ణయింపవచ్చును. కాని యందులకుఁ దగిన యాధారములు నా కేమియు దొరకలేదు. ఇఁక సోమనాథుఁడే పండితారాధ్య చరిత్రములోఁ దాను "పే ర్కొన్నఁబడిన

శ్రీ బెలిదేవ వేమనారాధ్యులను పరమారాధ్యదేవు మనుమని శిష్యుండ" నని చెప్పికొనియున్నాఁడు. ఈ బెలిదేవ వేమనారాధ్యుఁడు జంగముఁడు. ఈతఁడును సూరసానమ్మ యను భక్తురాలును మఱికొందఱు జంగములును మల్లికార్జున పండితారాధ్యులకడ కేఁగుదెంచి యాతనిచేఁ బూజలంది కల్యాణపురమున శ్రీ బసవేశ్వరుఁ డొసర్చు మహత్త్వములను జంగమార్చనావిశేషములను నాతనికి వర్ణించినట్లు పండితారాధ్యచరితమునఁ జెప్పఁబడినది. [చూ. పండితారాధ్యచరిత్ర - దీక్షాప్రకరణము.] బసవేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1162 ప్రాంతమున రాజ్యమేలిన బిజ్జలునిమంత్రి యగుటచే వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడైన మన సోమనాథుఁడు బసవేశ్వరుని యనంతరము స్వల్పకాలమునకో లేక యతని యవసానదశయందో జనవమంది ప్రతాపరుద్రుని కాలములోఁ అనఁగా - క్రీ. శ. 1192 సంవత్సర ప్రాంతమునందు ప్రసిద్ధుఁడైనట్లు తెలియవచ్చును.

సోమనాథుఁడు బ్రాహ్మణుఁ డని కొందఱును, లింగధారి యగు నారాధ్యబ్రాహ్మణుఁ డని కొందఱును, జంగముఁ డని కొందఱు నభిప్రాయపడుచున్నారు. ఈతఁడు బ్రాహ్మణుఁడు గాని యారాధ్యబ్రాహ్మణుఁడు గాని కాక, తప్పక సహజవీరశైవుం డగు జంగముఁడే యని నా దృఢాభిప్రాయము. అనుభవసారములో నీతఁడు తన కులగోత్రాదికమును గూర్చి యేమి చెప్పికొనినాఁడో చూడుఁడు:—

కం. "భృంగిరిటిగోత్రుఁ డను గురు
లింగతనూజుండ, శివకులీనుఁడ, దుర్వ్యా
సంగవివర్జితచరితుఁడ,
జంగమలింగప్రసాద సత్ప్రాణుండన్."

ఈతఁడు భృంగిరిటిగోత్రజుం డని పిడుపర్తి సోమనాథుఁడు గూడఁ బద్యబసవపురాణములో చెప్పియున్నాఁడు.

వీరశైవభక్తు లగు జంగములకును లింగాయతులకును గోత్రాధికారులు- బ్రాహ్మణులకు నారాధ్యబ్రాహ్మణులకు వలె- గౌతమభారద్వాజాదిమునీశ్వరులు కాక, శివునిపంచముఖములనుండి యుద్భవించిన వృష నందీశ్వర భృంగి (భృంగిరిటి) వీరస్కందులు అయియున్నారు. కావుననే వీరశైవులు శివకులీను లైరి. ఇందులకు సుప్రభేదాగమ ప్రమాణములఁ జూడుఁడు.

శ్లో. సద్యోజాతశ్చ ప్రథమో వామదేవో ద్వితీయకః
అఘోరస్తు తృతీయస్తు తత్పురుష శ్చతుర్థకః
ఈశానః పంచమ శ్చేతి ముఖాని మమ సర్వశః
తా న్యాననాని గోత్రాణి వేదోక్తాని న సంశయః
వృషో నందీ తథా భృంగీ వీరశ్చ స్కంద ఏవచ
మత్స్వరూపా స్త్వముత్పన్నాః పంచ గోత్రాధికారిణః.

సోమనాథుని గురువునకుఁ దాతయైన బెలిదేవవేమనారాధ్యుఁడు జంగముం డని పైని చెప్పియుంటిని గదా. మఱియు నీతని ప్రశిష్యప్రశిష్యుఁడును, బసవపురాణమును పద్యకావ్యముగా రచించి యాతనికే కృతియిచ్చినవాఁడును నైన పిడుపర్తి సోమనాథుఁడు కూడ జంగముఁడే. ఈ పిడుపర్తి సోమనాథుఁడు శైవబ్రాహ్మణుఁ డని శ్రీ వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రములో వ్రాసిరి. కాని యది ప్రమాదము. పిడుపర్తివారిలో జంగము లిప్పటికిని గుంటూరుమండలమునందలి-కనగాల, గరుడాచలపాలెము మున్నగు గ్రామములలోఁ- గలరు. పిడుపర్తి సోమన పాల్కురికి సోమనాథుని కులదేశికుఁ డని కూడఁ జెప్పెను.

కావున జంగములకు శిష్యుఁడును గురుఁడును కులదేశికుఁడు నైన పాలకుర్కి- సోమనాథుఁడు కూడ జంగముఁడు కాక మఱొకఁ డెట్లగును? ఈతఁడు బ్రాహ్మణులను త్రాటమాల లనియు, పచ్చిమాల లనియు, కర్మచండాలు రనియుఁ దనగ్రంథములలో నిరసించి యున్నాఁడు యజ్ఞోపవీతధారి యగు బ్రాహ్మణుఁడు గాని యారాధ్యబ్రాహ్మణుఁడు గాని యైనచో వారి నిట్టి విశేషణములతో నీతఁడు నిందించునా? పండితారాధ్యచరిత్రమునకు శ్రోతయైన సూరనామాత్యుఁడు, ఆపస్తంబసూత్రుఁ డనియు, హారితసగోత్రుఁ డనియు, నా గ్రంథములోఁ జెప్పఁబడినది. ఆతనిని శ్రోతగా చేర్చుకొనిన కారణములను సోమనాథుఁడు చేర్కొనుచు, నందులో సూరనామాత్యునిఁ దన ముద్దుమఱఁదిగా సోమనాథుఁడు చెప్పియుండుటచే నాతనివలెనే యీతఁడు గూడ నారాధ్యబ్రాహ్మణుఁ డైయుండు నని కొందఱు వాదింపఁ జూచెదరు. ఈ సూరనామాత్యు నింటిపేరును సోమనాథకవి యేవాక్యములలోఁ జేర్కొనలేదు. కాని పురాతనవాదప్రకరణారంభములందు నాతనిఁ గూర్చి వ్రాయుచు—

"శ్రీవృషాధీశ సంచితదయాపాంగ! భావుకమంత్రీశ పాల్కుర్కిసూర!"
"శ్రీగురులింగసంచితదయాపాంగ! భాగవహోదార పాల్కుర్కిసూర!"

అని చేసిన సంబోధనములఁబట్టి యాతనియింటిపేరు గూడఁ బాల్కురికి వా రనియు నాతఁడు గూడఁ బాల్కురికివాసుఁడై యుండు ననియుఁ దోఁచుచున్నది. సోమనాథ సూరనామాత్య లిరువురు నిజముగా మఱఁదు లయినచో వారొక్కయింటిపేరువా రెట్లగుదురు? వారిరువురు నారాధ్యబ్రాహ్మణులే యైనచో సూరనామాత్యునకు ఋషిగోత్రము చెప్పి సోమనాథుఁడు తనకు శివగోత్రము నేల చెప్పికొనెను? సూరనామాత్యుఁడు తనకు మెచ్చులికాఁ డనికూడఁ గవి చెప్పియున్నాఁడు. నిక్కమాలోచింప నాతఁ డీతనికి మిత్రుఁడే కాని బాంధవుఁడు గాఁడని తోఁచును. ఈ స్నేహబాంధవములను మహిమాప్రకరణాంతమునఁ గూడ సోమనాథుఁడు మఱొకసారి చేర్కొనినాఁడు చూడుఁడు. "అఖిలేనిసఖుఁడ! సూరార్య! నాముద్దు మఱఁది! విన్మిది మహిమాప్రకరణము" ఈ విషయముల నెల్లఁ బర్యాలోచింప, వీ రిరువు రేకవర్ణస్థులు గాకపోయినను అఖిలేని బావమఱఁదుల వరుసను బిలుచుకొనువా రనియును నీ బాంధవము తిక్కనమనుమసిద్ధుల మామయల్లుర సంబంధమువంటిదే యనియును గోచరింపక మానదు. ఆరాధ్యబ్రాహ్మణు లుపనయనసంస్కారమును వీడి బ్రాహ్మణత్వమును గేవలము త్యజింపకున్నను శైవవ్రతమునందు జంగములకు వీరికినిఁ గూడ సమానధర్మములే. అప్పటికి నిప్పటికిఁగూడ వీరి కన్యోన్య సౌహార్ద గౌరవప్రేమములు కలిగియే యున్నవి. కావునఁ బైనిజెప్పిన యంశములవలన సోమనాథుఁడు శివకులీనుఁ డగు జంగమవర్ణస్థుఁడు గాని బ్రాహ్మణుఁడు గాఁడని నిస్సంశయముగా నెంచవచ్చును. శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యలో

మునకుఁ గృతిపతియైన ముమ్మయ్య కాంతయ్యయను నీ శాఖలోనివాఁడే, ఈ జంగమభక్తులనే ప్రస్తుత మాంధ్రదేశమునందు భక్తు లనియు మాహేశ్వరు లనియుఁ గూడ వ్యవహరించుచున్నారు.

ఇఁక సోమనాథుని తలిదండ్రు లెవరో విచారింతము. అనుభవసారములో "గురులింగతనూజుండ" నని చెప్పికొనుటచే నితనితండ్రి పేరు గురులింగమని యొకమాఱును "బసవేశస్వతనయుఁ" అని పండితారాధ్యచరితములోఁ జెప్పికొనుటచే బసవేశ్వరుఁ డని యొకమాఱును శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడిరి. పంతులవారు గురులింగమను నతఁడు కవికిఁ దండ్రి గాక గురుఁడైనట్లు జెంచి తుద కితని బసవేశ్వరుని పుత్రునిగా గణించినట్లు కవులచరిత్ర నూతనముద్రణమువలన వ్యక్తమగుచున్నది. గురులింగ మనునతఁడు సోమనాథునకుఁ గురుఁడైయుండునను పంతులవారి యభిప్రాయము సరియైనదే. కాని సోమనాథుఁడు బసవేశునిపుత్రుఁ డనువారి యభిప్రాయము కేవలము ప్రమాదము. కనుక గురులింగ మనునతఁ డీతనికి దీక్షాగురు వైనట్లు స్పష్టమగుచున్నది. గురుఁడు లింగసాహిత్య మొసఁగి హస్తమస్తకసంయోగమున భౌతికశరీరమును లింగశరీరముగా మార్చినంతనే తనకు వేఱొకజన్మము కలిగిన దనియు నందుచే దీక్షాగురుఁడే తనకు జనకుఁ డనియు నతనిహస్తాంబుజమే జన్మభూమి యనియును దలంచుట వీరశైవుల మతసంప్రదాయము. మఱియును గురులింగ మనునది సోమనాథుని దీక్షాగురుని వాస్తవ నామధేయము కాక గురుశబ్దమునకు వీరశైవాచారసిద్ధమగు విశేషణ మని కూడఁ దోఁచుచున్నది. గురు లింగ జంగమశబ్దములకు భేదములేదనియు గురుఁడే లింగ మనియును జంగమ మనియును వీరశైవమతసిద్ధాంతము.

అట్లైనచో నీతనిఁ గన్న తలిదండ్రు లెవరో తెలియవలసి యున్నది. "భక్తకారుణ్యాభిషిక్తుండఁ బాశ | ముక్తుండఁ గేవలభక్తిగోత్రుండను | శ్రాతజ్ఞుఁ డగువిష్ణు రామదేవుండను | తేజమ్మనగు శ్రియాదేవి యమ్మ యును | గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ" అను బసవపురాణ వాక్యములనుబట్టి యీతని తలిదండ్రుల నామములు విష్ణురామదేవ శ్రియాదేవు లని తోఁచుచున్నది. "ఖ్యాతిచే సద్భక్తిగల కట్టకూరి పోతిదేవుని పదాంబుజ షట్పదుండ" అను బసవపురాణవాక్యమువలనఁ గట్టకూరి పోతిదేవుఁ డనునతఁడు గూడ నీతని గురువులలో నొకఁ డని తెలియుచున్నది. సోమనాథునికిఁ గవితావిద్యాగురువు కరస్థలము విశ్వనాథుఁ డనునతఁడు. ఈ యంశము "సుకృతాత్ముఁ డగు కరస్థలము విశ్వేశు | ప్రకటవరప్రసాద కవిత్వయుతుఁడ" అను బసవపురాణోక్తివలనను "గీ. విమలచిత్తవృత్తి" అను ననుభవసారమందలి పద్యము వలనను రూఢి యగుచున్నది. సోమనాథునివంటి సుకవిచంద్రునికిఁ గవితాగురుఁడైన యా కరస్థలము విశ్వనాథకవీంద్రుని గ్రంథ మొకటియైన నిప్పటికి నాంధ్రలోకమునకు లభింపకుండుట మిక్కిలి శోచనీయము.

## సోమనాథుని పాండిత్యవిశేషాదులు

ఈతఁడు చతుర్వేదపారగుఁడు. స్మృతిశాస్త్రపురాణేతిహాసాదు లెల్ల సంపూర్ణముగ నాకళించిన విద్యావిశారదుఁడు. అష్టభాషాకవితా ప్రవీణుఁడు. ఈతని చతుర్వేదపారగత్వమునకు ఈతని గ్రంథములనుండి యనేకోదాహరణముల నీయవచ్చును. సోమేశ్వరశతక మీతనిచే రచింపఁబడినట్లు ప్రబలదృష్టాంతములు లేను కారణమునఁ గొందఱితఁడు కర్ణాటభాషఁ గవి యను నంశమును శంకించిరి. కాని యది యవిచారమూలకము. సోమేశ్వరశతకముమాట యె ట్లున్నను గంగోత్పత్తిరగడ, వృషభరగడ మున్నగు స్తోత్రములు కర్ణాటభాషారచితము లీతనివిగ ననేకములు గానవచ్చుచున్నవి. సుప్రసిద్ధకర్ణాటకవు లగు సోమరాజు భీమకవి మున్నగువారు తమ గ్రంథములలో నీతనిఁ బూర్వకవిగా నుతించియున్నారు. ఇట్టిచో నీతఁడు కర్ణాటభాషాకవి కాకుండు టెట్లు సంభవ మగును? మఱియు నీతఁడు తన బహుభాషాకవితాప్రావీణ్యమును వెల్లడించుటకో యన వృషాధిపశతకములోఁ ద్రావిడకర్ణాటాది భాషలలోఁ గొన్ని పద్యములను వ్రాసియున్నాఁడు. ఆ పద్యము లీతని యష్ట భాషాప్రావీణ్యమునకుఁ బరిపూర్ణనిదర్శనములు కాఁగలవు. ఈతఁ డసదృశపాండితీవిభవవిలసనంబుచే నా కాలమందలి ప్రతివాదుల నెల్లఁ బ్రక్కలోని బల్లెపై - బౌద్ధ జైన చార్వాకాద్వైతమాయావాదుల నెల్ల నుద్భటవివాదముల నోడించి-వీరశైవమతమును వ్యాపింపఁజేసిన-మహానీయుఁడు. ఈతని శక్తిసామర్థ్యము లెట్టివో పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణమునందలి యీ క్రిందిపద్యమువలన నించుక గ్రహింపవచ్చును.

సీ. లిపి లిఖింపక మున్న యపరిమితార్థోక్తి
  శక్తి యాతనిజిహ్వ జరగుచుండు
ఛందోధికరణాది సరణిఁ జూడకమున్న
  మది నుండుఁ గావ్యనిర్మాణశక్తి
భాష్యసంతతులు చెప్పంగఁ జూడక మున్న
  రుద్రభాష్యక్రియారూఢి వెలయు
తర్కశాస్త్రాది విద్యలు పఠింపక మున్న
  పరపక్షనిగ్రహప్రౌఢి వెలయు
గీ. అతని నుతియింప నాకోటి కలవి యగునె?
జైన పుస్తక విన్యస్త శాత శూల
కలితబిజ్జల తలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాథుఁడు.

సంగీతశాస్త్రమునందుఁ గూడ నీతఁ డపారపాండిత్యము గలవాఁడు. బసవపురాణమున నున్న సకలేశ్వర మాదిరాజయ్యగారి కథను జదివినచో నీతని గానకళాపారీణత చదువరుల కించుక బోధపడఁగలదు. పలుమాట లేల? ఆంధ్రకవులలో నింత యపారపాండిత్యప్రతిభ గలిగినవాఁడు మఱియొకఁడు లేఁడనుట సత్యదూరము కానేరదు. నా మిత్రులగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవ పీఠికలో నాంధ్రకవులలో సర్వజ్ఞులైనవారు - నన్నెచోడుఁడు-తిక్కన- నాచనసోముఁడు- ఎఱ్ఱాప్రెగడ అను నలువురుమాత్రమే యని వ్రాసియున్నారు. పైని జేర్కొనఁబడిన యా నలువురకుఁ గూడఁ బూర్వుఁడై - కవితాపథమునందు వారికెల్ల మార్గదర్శకుఁడై - తన సర్వజ్ఞత్వమును బహుముఖములుగాఁ బ్రదర్శించిన యీ విద్వత్కవివరేణ్యునిఁ గూడఁ జేర్చికొనినఁ గాని రామకృష్ణకవిగారి పట్టిక పరిపూర్ణము కానేరదు. ఈతఁడు భృంగియవతార మని వీరశైవులు తలంచెదరు. వీరశైవమతవ్యాప్తికై యవతరించిన బసవేశ్వరుని చరిత్ర

మును సకలభక్తకథామణి సూత్రభాతిగా రచియించుటకై శివుఁడు భృంగి నాజ్ఞాపింపఁగా నాతఁడే పాల్కురికిసోముఁడై యవతరించె నని పిడుపర్తి సోమనాథుఁడు కూడ వ్రాసియున్నాఁడు.

## సోమనాథుని గ్రంథములు

ఈ కవి రచించిన గ్రంథములలోఁ గొన్నింటిని పిడుపర్తి సోమనాథుఁ డీక్రింది పద్యములోఁ జేర్కొనియున్నాఁడు.

సీ. బసవపురాణంబు పండితారాధ్యుల
చరితంబు ననుభవసారమును జ
తుర్వేదసారసూక్తులు సోమనాథభా
ష్యంబు శ్రీరుద్రభాష్యంబు బసవ
రగడ గంగోత్పత్తి రగడ శ్రీబసవాఢ్య
రగడయు సద్గురురగడ చెన్న
మల్లుసీసములు నమస్కార గద్యవృ
షాధిపశతకంబు నక్షరాంక

గీ. గద్యపద్యముల్ పంచప్రకార గద్య
యష్టకము పంచకము నుదాహరణయుగ్మ
మాది యగు కృతుల్ భక్తిహితార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు.

ఈ పద్యమునఁ జేర్కొని ఈ కవిగ్రంథములలో బసవపురాణము- పండితారాధ్యచరిత్రము - అనుభవసారము [తెనుఁగు]-అన్యవాదకోలాహలము-బసవపంచగద్య-సోమనాథభాష్యము (సంస్కృతము) తక్కినవి కన్నడము" అని వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. పంతులుగారు చెప్పినప్రకారము గాక, యీ కవిగ్రంథములలో చతుర్వేదసారసూక్తులు - చెన్నమల్లు సీసములు - వృషాధిపశతకమును గూడ నాంధ్రభాషారచితములే యై యున్నవి. శ్రీరుద్రభాష్య మింతవఱకు దొరకినట్లు కానరాదు. కాని యది గూడ సోమనాథభాష్యమువలెనే సంస్కృతగ్రంథమని తెలియవచ్చుచున్నది. పైపద్యములోఁ జేర్కొనఁబడని యన్యవాదకోలాహల మొకదానినిగూడఁ బంతులవా రీతనికృతిగా నుదాహరించి యది సంస్కృతగ్రంథ మనిరి. ఇందుల కాధార మేమో తెలియకున్నది. అన్యవాదకోలాహల మను సీసశతక మొకటి తెలుఁగు భాషలోనే వ్యాప్తమైయున్నది. అది సోమనాథుని ప్రశిష్యపరంపరలోఁ జేరిన కవిచే రచింపఁబడినదై యున్నదే కాని సోమనాథుఁడు స్వయముగా రచించినది మాత్రము కాదు. సోమనాథస్తవ మను మఱియొక ద్విపదస్తవము తెలుఁగుభాషలోనే యీ కవివరుని దొకటి కలదు. పైని చెప్పఁబడిన గ్రంథములు గాక సోమనాథుఁడు బసవరాజీయ మను మఱియొక గ్రంథమును గూడ రచించినట్లు అన్యవాదకోలాహలమునందుఁ గలదు.

## సోముని యాచారవ్యవహారాదులు

ఈతని వీరమాహేశ్వరాచారసంపత్తి వర్ణనాతీత మైనది. వీరశైవమతమునందలి చతుష్షష్టిశీలముల యాచరణ మీమహనీయునితోడనే యంతరించిన దని కోవిదులు చెప్పుదురు. లింగధారి గానివానిని వీరశైవపరిభాషలో భవి యని వ్యవహరింతురు. అట్టివాని ముఖదర్శనమైనను నీతఁ డొప్పెడువాఁడు కాఁడట. వీరశైవమతాంతరులగు బ్రాహ్మణులు జైనులు మున్నగువారిని వాదములో నోడించుట కేఁగినప్పు డీతఁడు కాండపటము వెనుకనుండి వాదించెడివాఁడట. దుష్కరంబగు నిట్టి యఘోరవీరవ్రతంబునఁ జరించుచు నీమహనీయుఁడు వృద్ధదశలోఁ గన్నడభూమికరిగి యచ్చటఁ గలికె యను గ్రామమునందు సమాధి నేర్పఱచుకొని యందు బసవపదధ్యానాంతరంగుం డై తప మొనర్చుచు నచ్చటనే శివసాయుజ్యము నందెను.

## సోమనాథుని కవితావిశేషములు

తెలుఁగుకవితావిన్యాసము-జాతీయములును రసోచితములు నగు తెలుఁగు పలుకుబడులలోనే కల దని యెంచి నన్నయభట్టారకుని మార్గమునకు వన్నె పెట్టి నిక్కమైన తెలుఁగుకవితను వెలయించి తిక్కనాది మహాకవులకు మార్గదర్శకుఁ డైనవాఁ డీసోమనాథుఁడే యని వెనుక వ్రాసియుంటిని. కించిజ్జ్ఞుఁడ నగు నే నిట్లువ్రాత వ్రాయుట యత్యుక్తి యని కొందఱు తలంపవచ్చును. కానీ - కావ్యవ్యాకరణతీర్థులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు — ఆంధ్రపత్రిక పదియవ సంవత్సరాదిసంచికలో "ద్విపదకవిత్వము" అను శీర్షికతోఁ దాము వ్రాసిన వ్యాసములో నీ మహాకవినిఁ గూర్చి ప్రశంసించుచు నాతనికవిత్వమును గూర్చి యెట్టి యభిప్రాయమును వెలిబుచ్చిరో తిలకింపుఁడు:—

"ఈ రెండు గ్రంథములును (బసవపురాణము, పండితారాధ్యచరిత్రము) నెక్కడఁ జూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవునంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహముం బోలె నీ మహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణి యగు పోతన్న భక్తిపారవశ్యపు కవిత్వమునకును - కవిసార్వభౌముఁ డగు శ్రీనాథ మహాకవి నుడికారముల గడుసుతనంపు దిన్నెలకును - కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియు నగు కృష్ణదేవరాయమహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణనాపటిష్ఠము లగు సందర్భములకును - దీనికి దాని కనియేల - ఇంతదనుక మన యాంధ్రసారస్వతమునఁ గల హృద్యము లగు రసవద్వర్ణనోదంచితము లగు కావ్యపు మెఱుఁగుల కన్నిటికిని - ఈ రెండు ద్విపదకావ్యములే మార్గదర్శకములై రాజిల్లిన వని యనుటలో నేమియును సందియము లేదు."

పాత్రోచితము లగు భావములను శ్రోత్రరుచిరము లగు పదపరికరములతోఁ బ్రదర్శించుటలో నీ కవివరుని ప్రతిభ నిరుపమాన మైనది. దృష్టాంతమునకై గ్రంథవిస్తరభీతిచే నొకటి రెండు సందర్భములు మాత్ర మీక్రింద నుదాహరించెదను.

బెజ్జమహాదేవి యను ముగ్ధభక్తురాలు-శివుఁడు తల్లిదండ్రులు లేని వాఁడనుమాటను విని- విచారమంది - తానే యతనికి తల్లినై యాతని పాలించెదనను తలంపుతోఁ దన యిష్టలింగమూర్తికి నుపచారములు చేయు పట్టునుజూడుఁడు:—

"తల్లి కల్గిన నేల తపసిగా నిచ్చు?
తల్లి కల్గిన నేల తలజడల్ గట్టు?
తల్లి యున్న విషముం ద్రావ నేల యిచ్చు?
తల్లి యుండినఁ దోలు తాల్ప నేల యిచ్చు?
తల్లి పాముల నేల ధరియింప నిచ్చు?
తల్లి బూడిద యేల తల బ్రుంగ నిచ్చు?
తల్లి పుచ్చునె భువిఁ దనయునిఁ దిరియ?
తల్లి పుచ్చునె సుతు వల్లకాటికిని?
తల్లి లేకుండిన తనయుండు గానఁ
బ్రల్లదుండయి యున్ని పాట్లకు వచ్చె.
చన్నిచ్చి పలుమాఱు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నన్ని పాలును బోసి
యాఁకొనకుండంగ నరసి పాలించి
సాఁకుచుఁ బెనుపదే జనని గల్గినను?
దా నింతవాఁ డయ్యెఁ దల్లి లేకయును
దా నెంత పెరుఁగునో తల్లి గల్గినను!
అనయంబు బెజ్జమహాదేవి తాను
జననియై పరమేశుఁ దనయుఁ గావించి. [చూ. బసవ. ఆ-3.]

శివదేవుఁ డను భక్తుఁడును నాతని భార్యయును బ్రతిదినము శివాలయమున కేఁగి కొంచెడు పాలు లింగమున కారగింపఁగఁ బెట్టు నేమంబు నెరపుచు నొకనాఁడు పొరుగూరికిఁ గార్యాంతరము మీఁదఁ బోవఁ దటస్థింపఁగా దమ కూఁతు గొడగూచిని దాము తిరిగివచ్చువఱకుఁ దమ వ్రతమును జరుపుమందు మనుటయు నామె యట్లొనర్చి శివుఁ డాపాలను నిజముగాఁ ద్రావు నని నమ్మిన దగుటచేత నట్లు జరుగకుండుటకుఁ జూచి దుఃఖించి శివునిఁ బ్రార్థించు విధమును జూడుఁడు:—

"క్షీర మొండటఁ బెట్టి ధారుణి మ్రొక్కి
యారగింపవె దేవ యని విన్నవించి
పిలుపు పని యొక్కింత వెలుపున నిలిచి
మఱి వచ్చి చూడుఁడుఁ గొఱగామి పాలు
చాలఁ దల్లడమంది భయమును బొంది
పాలేల యారగింపవు లింగమూర్తి?
కాఁచుట చాలదో? కమ్మ వల్లమినో?
ప్రాఁచిదో? వితెగనో? పడుచ నే ననియొ?
ప్రొద్దెక్కెనో యొండె? పొగవట్టి చెడెనో?
బుద్ధిపుట్టదో? నెయ్యి పోయకుండినదో?
కడుఁ జేడిదో? నీరు గలిపిన దనియొ?
యొడవాద్యములు లేక యేను దెచ్చితినో?
చాలవో? యివి యాలపాలుగా వనియొ?
పాలపైఁ జిత్తము లేఁ బఱిచితి ననియొ?
కోర బెడంగనో కంచెడు లేదో?
యారగింపఁగఁ బెట్టనేరకుండినను
వీఁడు పోయెఁ గదా? వీఁగడ లేదొ?
యేఁ దెచ్చునెడ నెవ్వరేఁ జూచి రనియొ?
యూర కేమిటికిఁ బాలొల్లవు త్రావఁ
గారణం బేమేనిఁ గలదని చెప్పుము!
నిక్కపు టాఁకలి నీకు లేదని
స్రుక్కఁ దైనను గొని చిక్కించుకొనఁ
గుడుపున కియ్యెడ గుడగుడ లేల
కడికెడు తిత్తునా గుజ్జు నోగిరము!
మాలపన్నారుల యాలోనిలోనఁ
బోల లున్నవి పంపు పోయి తెచ్చెదను.
నుట్టిపై బానలో మన్నది నెయ్యి
యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే నీకు! [చూ. బసవ. 3-ఆ.]

ఆహా! పాత్రముల ముగ్ధత్వమునకుఁ దగిన భావములును - దద్వ్యక్తిస్ఫురణమునకుఁ దగిన జాతీయపదములును సోమనాథుఁ డెంత మనోహరముగాఁ గూర్చినాఁడు!! ఇట్టి పద ప్రయోగముల విన్నాణంపుసొంపు లీతనికి వెన్నతోఁడఁ బెట్టినవిగదా! ప్రకృతివర్ణనముల నతిస్వాభావికముగాఁ గన్నులఁ గట్టినట్లు వర్ణించుటలో నీతని మించినవాఁడు లేఁడని చెప్పవచ్చును. మచ్చునకుఁ గోడికూఁతను వర్ణించిన యాక్రింది పంక్తులను జూడుఁడు.

"తొలుకోడి కను విచ్చి నిలిచి మైవెంచి
జలజల రెక్కలు సడలించి నీల్గి
గ్రుక్కనఁ గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
వెక్కించి మెడ సాఁచి నిక్కి మిన్నూచి
కొక్కొరోకుఱ్ఱని కూయక మున్న"
(పండితారాధ్యచరిత్రము. ప్రక. 2)

వేకువను గూఁతకూయునప్పుడు కోడియొక్క వివిధావయవము లందుఁ గలుగు గాత్రవిక్షేపములను ఈకవి యెంతటి విశదముగా వివరించి మూర్తీభవింపఁజేసినాఁడు!

కవిత్వము చిత్రకళ యని యెఱింగి చిత్తరువుల లిఖించినట్లు పాత్రముల రూపవర్ణన మొనర్చి వానిని జదువరుల హృదయఫలకములఁ జిత్రించు నేర్పు మహాకవి కలవడినట్లు మఱియొకని కలవడలేదు. ఈతని మార్గము ననుసరించి నన్నెచోడుఁడు - తిక్కన - నాచనసోముఁడు శ్రీనాథుఁడు - నీవిధముగ జాలవఱకుఁ గృతార్థులైరి. శ్రీనాథుఁ డీతని గ్రంథముల నతిశ్రద్ధతోఁ జదివి వానిలోఁ బండితారాధ్యచరితమును బద్యకావ్యముగా రచించి యీచిత్రకళానైపుణ్యము నలవరించుకొనెను. ఈ క్రిందివర్ణనములవలన సోమనాథునియందుఁ గల యీ కవితావిశేష మెంతటి వ్యక్తము కాఁగలదు.

శివుఁడు గొల్ల వేసమున నొకభక్తునిఁ జేకుట.

మొలకత్తి నడుచుఁగోకలుఁ జూడఁ గొడుపు
లవిత్తి నిడి దొడ్డ మొలఁ గచ్చకట్టి

గాలిదప్పుపు వెంద్రుకలు దూలియాడ
నీలవెట్టుచు నిఱిమిఱిమి చూచుచును
గుక్కలఁ బిలుచుచు ఱిక్కవెట్టుచును
నెక్కొన నోరగాలఁ నిలుచుచుఁ జనుచు
గొడ్డలి బరిగమ్ము కాటికుండయును
దుడ్డుగోలయుఁ బట్టి తోడితోడి కొన్ని
మేఁకపిల్లలఁ దనచాఁకటి నిలికి
మీఁక దబ్బుఱవాటు విసరి వ్రేయుచును
కొన్ని మేఁకల రొప్పి కొనివచ్చి తుమ్మ
మన్ను కాయలు రాల్చియును నంతఁ బోక."

(సోమనాథుఁడు. బసవపురాణము ఆ. 3)

**శివుఁడు చండాలవేషమున నొకభక్తురాలికడ కేఁగుట.**

"వలి దొడ్డ రుద్రాక్షములు దొడ్డ పటిక
ములు నూల మానిపూసల పేర్లు దాల్చి
తలవెండ్రుకల వెడకొప్పులోపలను
గఱకంఠుఁ గట్టిన కరి గానిపింప
బలువుగా శివమాత్ర మలవడఁ గట్టి
మెలవరవణిఁ దూఁటి తల నటఁ జుట్టి
యూరియుఁ గత్తియు నట్టలు మూఁపు
వారెనల్ వ్రాకులు వలచేత నొక్క
పెంబలికోలయుఁ జెన్నొందఁ శివుఁడు
పంచిన యంత్యజభాగంబుఁ దాల్చి

(పండితారాధ్యచరిత్రము ప్ర.క. 2)

ఈతని సర్వజ్ఞత్వమును నవ్యక్తపటిమవర్ణనములను గ్రంథవిస్తర భీతిచే నిచ్చట వివరింప మానితిని. భోగ్యము- దుర్యోగము- నీటత్వము- రసవాదము మొదలగు ననేక విషయములను సందర్భోచితముగ వర్ణించిన పట్టులనుజూచెదమేని సోమనాథకవియొక్క సర్వంకషప్రతిభ స్పష్టమగుచుండక పోదు. పండితారాధ్యచరితమునందలి వాదప్రకరణమున వివరింపఁబడిన బహుమతవాదఖండనము లీతని యపారపాండిత్యమున కాదర్శములై యున్నవి. చక్కని లోకోక్తులను జాతీయములను సందర్భోచితముగ నుపయోగించు విన్నాణమునందుఁ గూడ నీతఁడు నిరుపమానుఁ డని చెప్పవచ్చును.

సోమనాథుఁ డతనితర్వాత వెలసిన నన్నెచోడ తిక్కనాదికవులకు నిక్కమైన యాంధ్రకవితానిర్మాణమునందు మార్గదర్శకుఁడై వెలసె నని పైని చెప్పియుంటిని గదా? వెనుక ప్రదర్శించిన భాగముల వలననే యీయంశము గొంతవఱకుఁ దేటపడఁగలదు. ఈ విషయము నందలి యాథార్థ్యమును సంపూర్ణముగా నెఱుంగఁగోరువారు సోమనాథకవి గ్రంథములను నాయాకవుల కావ్యములను సుసూక్ష్మముగాఁ జదివినయెడల వారి కది తెల్లము కాక మానదు. అయినను పాఠకుల మనః పరితృప్తికై యాయాకవులు సోమనాథునిదెసఁ బూజ్యభావమును జూపుచునై యొనర్చు ననుకరణములలో నొకటి రెండు స్థూలదృష్టాంతములను మాత్రము ఇచ్చట చూపెదను.

పాల్కురికి సోమనాథకవి:—

"బసవలింగము కృతిపతియఁటె! కృతియు
రసికతఁ బండితారాధ్యచరిత్ర
మఁటె! పాల్కురికిసోమనార్యుఁడు సుకవి
యఁటె! కథాశ్రోత మారామాత్యుఁ డట్టె
కృతిపతి కృతికవి కృతికథాశ్రోత
క్షితిఁ జెప్పనొప్పదే శివభక్తసభల.

(1) నన్నెచోడకవి:—

చ. రవికులశేఖరుండు కవిరాజశిఖామణి కావ్యకర్త! స
త్కవి భువి నన్నెచోడుఁ డఁటె! కావ్యము దివ్యకథన్ గుమారసం
భవమఁటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ డట్టె వినం గొనియాడఁ జాలదే.

(2) పోతనామాత్యుఁడు:—

క. పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుండఁట నే
బలికిన భవహర మగునఁట
పలికెద. వేరొండుగాథ పలుకఁగ నేలా?

పాల్కురికి సోమనాథకవి:—

"ఒనర ముందఱ శిరం బుండ వెనుకాలి
కిని సేసవెట్టంగఁ గ్రియగొనినట్లు.

(1) నాచన సోమనాథుఁడు:—

క. ఏలిక నాగు మఖాంశ
శ్రీలకు నొరుఁజడదనేల! శిరముండఁగ వెనుఁ
గాలికి సేసలువెట్టుట
బేలతనము గాక వీనిఁ బెద్దఱికంబే!

నన్నెచోడుఁడు చాలఁ బ్రాచీనకవి యను నభిప్రాయము వ్యాప్తమైనందునఁ బైని చేర్కొనఁబడిన యాతని పద్యములనే సోమనాథుఁ డేల యనుకరించి యుండఁగూడ దని కొందఱు తలంపవచ్చును. నన్నెచోడుని కాలమును గూర్చి యెన్ని చర్చలు జరిగినను దాని నింతవఱకు నిర్వివాదముగా నిదమిత్థమని తేల్చినవారు లేరు. నన్నయభట్టునకు మాత్ర మాతఁ డెన్నఁటికిఁ బూర్వుఁడు కానేరఁ డనియు, క్రీ॥ శ॥ 1150 సంవత్సరమున కిటీవలనే యాతఁ డుండియుండవలె ననియు నిప్పటి కేర్పడిన సిద్ధాంతములలోఁ బలువుర యభిప్రాయమై యున్నది. ఆతఁడు తిక్కనకుఁ గూడఁ దరువాతివాఁడై యుండునని తలంచువారు నయితము లేకపోలేదు. ఇతఁడు తిక్కనకుఁ దరువాతివాఁడు కాకపోయినను నాతనికి సమకాలికుఁడో- లేక యించుక పూర్వుఁడో- యై యుండు ననియుఁ బాలకురికి సోమనాథునికి మాత్రము కొంచె మిటీవలివాఁడై యుండునని మాతలంపు. సోమనాథుని గ్రంథములను నన్నెచోడుని కుమారసంభవమును విమర్శకదృష్టితోఁ జదువువారి కాకావ్యములందుఁ గల పోలికలు సంవాదములు పెక్కులు గాన్పించి సోమనాథునే నన్నెచోడుఁ డనుకరించినాఁ డనుభావము

గలుగకపోదు. ద్విపదలలో నున్న వర్ణనములను భావములను ననుకరించి సాత్మ్యముగాఁ బద్యములలోఁ గూర్చికొనుట స్వాభావికమును సాధారణమును నగునే కాని, పద్యములో నున్నవానిని ద్విపదలలోఁ గూర్చికొనుట యస్వాభావికము నసాధారణమును గాకమానదు. ఏకథయైనను ముందు ద్విపదకావ్యములలో వెలసియుండఁగా దానినే తరువాతికవులు పద్యకావ్యములలోనికిఁ గూర్చుచు వచ్చిరి. మన సోమనాథుని ద్విపద బసవపురాణమును బట్టి కర్ణాటాంధ్రభాషలలో భీమకవి పిడుపర్తి సోమనాథకవులు రచించిన పద్యబసవపురాణములును, పండితారాధ్యచరిత్రమును బట్టి శ్రీనాథుఁ డాపేరనే రచించిన పద్యకావ్యమును, ఈ సోమనాథుని శిష్యుఁడే యని ప్రతాపచరిత్రములోఁ జెప్పఁబడిన రంగనాథుఁడు రచించిన ద్విపదరామాయణమును బట్టి తరువాత భాస్కరాదులు పద్యకావ్యములుగా రచించిన రామాయణములును, నిందులకు చక్కని దృష్టాంతములు కాఁగలవు.

శతకకవులుగూడ నీమహాకవిగ్రంథములఁ జదివి యారీతి ననుకరించిన జాడలు పెక్కులు చూపవచ్చును. మచ్చునకు సుప్రసిద్ధశతకరాజ మగు సుమతిశతకమునకుఁ గర్తయైన బద్దెభూపాలుఁ డీతని ననుకరించినవిధమును జూడుఁడు.

“నల్లవో భామల యుల్లం బెఱుఁగక
గొల్లవాఁడైనను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి
నొల్లనిచెలిఁ బాయఁ నొల్లఁ డేనియును
గొల్లండు వాఁడే గా కెల్లెడ జాతి
గొల్లఁడు గొల్లండె గొల్లఁ డేనియును!”

(పండితారాధ్యచరిత్రము ప్ర. 2)

కం. ఒల్లనిసతి నొల్లనిపతి
నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే
గొల్లండు గాక ధరలో
గొల్లండును గొల్లఁ డవునె గుణమున సుమతీ.

(సుమతిశతకము)

వేదేల శ్రీ ఆదినారాయణ శాస్త్రి గారు మనభాషలో హృద్యము లయి రసవద్వర్ణనోదంచితము లైన కావ్యపు మెలుకువలఁ జూపిన మహాకవుల కెల్ల నీసుకవిసోముఁడే మార్గదర్శకుఁ డని వ్రాసిన వాక్యములను రూఢిపఱచుటకు లెక్కలేని దృష్టాంతములను జూపవచ్చును. గ్రంథవిస్తరభీతిచేతను నా కించిజ్జ్ఞతచేతను నీవిషయము నింతటితో విరమించుచున్నాఁడను.

భాషావ్యుత్పత్తియందుఁ బరిపూర్ణుండై - పాండితీవిక్రమంబున నజేయుండై జాతీయకవితానిర్మాణమునం దగ్రేసరుండై-రసపోషణమున నసమానుండై - యాంధ్రీకరణ యుగారంభమునందే స్వతంత్రగ్రంథ రచనమునకుఁ గడంగిన-యీమహాకవి కావ్యగుణములను గూర్చి యెంత వ్రాసినను తనివితీఱదు. ఇట్టి మహాకవిని శ్రీ సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరములో నైదవతరగతిలోఁ జేర్చుట మిక్కిలి శోచనీయము. ఆచార్యులవా రీతని బసవపురాణ పండితారాధ్యచరిత్రములను తమ గ్రంథములపట్టికలోఁ జేర్చినను వా రాగ్రంథములను బాగుగాఁ బరికించినట్లు కానరాదు. అట్లు చదివియే యున్నచో వారీతని ని ట్లయిదవతరగతిలోఁ జేర్చి యుండరు. కవితాప్రాశస్త్యమునం దీతఁడు తిక్కనాదులతోఁ దులఁదూఁగి మొదటి తరగతి యందుఁ జేర్పఁదగినవాఁ డగును గాని సామాన్యుఁడు కాఁడు. ద్విపదలోఁ బ్రాసయతిఁ గూర్చుటయందు వ్యాకరణవిషయములలోఁ గొంత స్వాతంత్ర్యమును గొనుటయందు నీతనికిఁ గల బహుభాషాసంప్రదాయ లక్షణజ్ఞత్వమును స్వాతంత్ర్యప్రియత్వమును సూచించునే గాని యీతని పాండిత్యప్రతిభ నించుకయుఁ గొంచెపఱుపఁ జేరవు.

ఈ కవివరుని బసవపురాణ పండితారాధ్యచరిత్రము లింతవఱకుఁ బరిశుద్ధముగ ముద్రింపఁబడకుండుట కరము విచారకరము. గ్రంథము లమ్ముపడినఁ జాలు ననియే తప్పులతడికలుగనో వీరశైవమతాభిమానులు కొందఱు వెనుక ముద్రించిన ప్రతులైనను నిప్పుడు దొరకక యీ గ్రంథములు పునర్ముద్రణము లేక పడియున్నవి. ద్విపదకావ్యము లని నిరసింపక యాంధ్రభాషాభిమాను లీ గ్రంథములను త్వరలోఁ బరిశుద్ధముగ ముద్రింపించి విశేషవ్యాప్తిలోనికిఁ దెచ్చి సోమనాథుఁడు మన భాష కొనర్చిన మహోపకారమును మన సంతతివారు స్మరించునట్టులు చేయవలసిన భారము మనపైని గలదు.

# కాళింగులు

చిలుకూరి నారాయణరావు గారు. ఎం. ఏ., ఎల్. టీ.

పూర్వకాలమున కళింగరాజ్యము విస్తీర్ణమునందును జనసంఖ్యయందును నెట్టి పరివర్తనములఁ బొందుచు వచ్చినను, ప్రస్తుతము కాళింగు లని పిలువఁబడువారు ముఖ్యముగ గంజాముజిల్లాలోని ఇచ్ఛాపురముననుండి విశాఖపట్టణములోని చీపురుపల్లికిని మధ్యనుమాత్ర మెక్కువగ కనిపించుచున్నారు. కాని వీరీప్రదేశమునందే కాక చాల ప్రదేశములందును నక్కడక్కడ నివాసముల నేర్పఱచుకొనిరే యనున్నట్లు ఈ క్రింది జనాభా లెక్కలనుబట్టి తెలిసికొనవచ్చును.

| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|---|
| 1. గంజాము | 50,014 | 54,067 | 1911 జనాభా | |
| ఏజెన్సీ | 139 | 29 | | |
| 2. విశాఖపట్టణము | 9,764 | 10,807 | 10,084 | 11,058 |
| ఏజెన్సీ | 208 | 164 | | |
| 3. గోదావరి | 830 | 727 | | |
| ఏజన్సీ | 9 | ... | | |
| 4. కృష్ణా | 151 | 152 | | |

61,110 + 65,4361=26,546

1911 సంగరము జనాభా లెక్కలలో వీరిసంఖ్య యిట్లీయఁబడినది

| | మొత్తము | పురుషులు | స్త్రీలు. |
|---|---|---|---|
| కాలంగ (హిందువులు) | 5,825 | 2,811 | 3,014 |
| బీహారు, ఒరిస్సాలు | 4,066 | 1,937 | 2,129 |
| తక్కినప్రదేశములు | 1,759 | 374 | 885 |
| కాళింగి హిందువులు, చెన్న రాజధాని) 83,442 | | 39,978 | 43,464 |
| కాళింజి (హిందువులు, చెన్నధాని) 57,558 | | 22,809 | 28,789 |

1351,000

నైజనాభాపట్టికలలో కొన్ని సంశయములను మొదట విడఁదీసికొనవలసియున్నది. 1901 లో కాళింగుల సంఖ్య 126,546 అయియుండఁగా, 1911 లో 83,442 అయియున్నది. ఈజాతివారు క్షీణించిపోవుచున్నారా యను సంశయము దీనివలన కలుగవచ్చును. కాని 1911 సంవత్సరము లెక్కలలో 'కాళింజి'యను మఱియొకజాతివారు చూపఁబడియున్నారు. న్యాయముగా కాళింగులును కాళింజులును నొక్కజాతివారే. తక్కినజాతులవారు కాళింజులను కాళింగు లనియే పిలిచెదరు కాళింగులు తెనుఁగు మాట్లాడుదురు. కాళింజులు ఓఢ్రము మాట్లాడుదురు. కాళింగులవలె కాళింజులకును వృత్తి వ్యవసాయమే. ఈకాళింజులయుత్పత్తిని గూర్చి యీ క్రిందికథను చెప్పికొందురు. భట్టుకున్నరడీ ' యను గ్రామసమీపమున నున్న యొకకోటలోఁ గొందఱు దోపిడిగాండ్రు నివాస మేర్పఱచికొని జనులను బాధించుచుండఁగా నాజనులు వారిని తోలివేయుటకు పురీరాజును సహాయము కోరిరఁట. ఆరాజుసేనలో ఖాండైతోజాతివాఁ డగు నొకయోధుఁడు రాజాజ్ఞఁ గొని యాదోపిడిగాండ్రను తఱిమివేసెనఁట. అతని శౌర్యసాహసములకు మెచ్చి జను లాతని " బొడోకాళింజ " (ధీరవ్యాఘ్రయుఁడు) అని పిలుచుచుండి రఁట! ఆతఁడు తన యనుచరులతో గంజాము మండలమునకు మరలివచ్చెనఁట. వీరి సంతతివారే 'కాళింజు' లఁట!

కాళింగులకును కాళింజులకును కొంత భేదము లేకపోలేదు. కాళింగులు జందెము వేసికొందురు. కాళింజులు వేసికొనరు. జందెము ధరించుటయే గాని దానిప్రయోజనమును గమనింపని కాళింగులకును కాళింజులకును నీభేద మంత పట్టింపులోనిది కాదు. నిరుపయోగమని జందెమును వీరు విసర్జించిరైన నందురు. లేదా వీరు కాళింగులలోని తొల్లింటి చతుర్థవర్ణజులుగా నైన నుండవచ్చును. 1901-సంవత్సరమున వీరందఱును కాళింగుల మనియే చెప్పికొనియుందురు. 1901 లో కాళింజుజాతివారు జనాభా లెక్కలలో చేరకపోవుటయు 1911 లో కనఁబడుటయు, 1901 లోని కాళింగుల జనసంఖ్యకును, 1911 లోని కాళింగి కాళింజులు కలిసిన జనసంఖ్యకును నించుమించుగా సరిపోవుటయుఁ జూడ, నీరెండుజాతులవారు నొక్కరే యని తలంపవలసియున్నది. అట్లు కాకుండినఁ బది సంవత్సరములలో కాళింగు లంత తగ్గియుందురా?

ఈ కాళింగులను గూర్చి తెలిసినంతవఱకు తొలుత చెప్పివేయుట యుక్తము. వీరిలో చాల తెగలవారున్నట్లు కాన్పింపదు. కాని మొహరి కాళింగులను నొకతెగవారున్నారు. మొహరి యనునది గంజాములోని యొకఖండము. ఈఖండములోని కాళింజులందఱును నొకరితో నొకరు సంబంధబాంధవములఁ జేసికొందురు. వీరు ప్రత్యేకముగా నొకతెగవారని మాత్రము చెప్ప వీలు లేదు. ఓఢ్రదేశమునకు వలసవచ్చిన తెలుఁగుకాళింగులే మొహరికాళింజు లని వాడుకయున్నది తక్కినయోఢ్రజాతులవారివలె వీరికిని 'బానో'(సూర్యుఁడు) 'నుక్రో' '(నక్రము)' సంకో (శంఖము), 'భగో' వ్యాఘ్రము), 'నాగో' (పాము), అను మొదలుగాఁగల గోత్రము లున్నవి. వివాహవిషయములో నీగోత్రములఁ గూర్చిన చిక్కులు చాల ఉన్నవి. కొంతమంది కాళింజులలో సగోత్రికులు వివాహము చేసికొందురు. కొంతమంది చేసికొనరు. వీరిలో 'బోరకో' 'బిసోయి' 'బారికో' 'బెహరా' 'దొలై' 'గాడ్' 'జెన్న' 'మెలికో' 'నాయికో' 'పాత్రో' 'పాథానో' 'పుల్లెయి' 'రావుతో' 'సాంతో' 'సావు'

'స్వాయి' 'గురు'—ఈరీతిగా బిరుదములు కానవచ్చును. ఇవి యన్నియు వారివారి పూర్వు లవలంబించిన వృత్తులంబట్టి కలిగిన వని యూహింపవచ్చును. కొన్ని ప్రదేశములలో నీబిరుదములంబట్టి వంశము లేర్పడె నని తలంచి వీరు స్వవంశీయులతో సంబంధములు చేసికొనరు.

కాళింజుల నాయకునికి 'సాంతో' అని పేరు. ఇతనికి సహాయుఁడుగా నొక 'పాత్రో' యుండును. వీరిలో వర్తమానములఁ దీసికొనిపోవుట కొక 'భాల్లాధియా' యుండును. ఈ కాళింజులకు నలుగురు 'సాంతో'లును నలుగురు 'పాత్రో'లును నున్నారఁట. వీరు అతగడా, చిన్నకిమిడి, పెద్దకిమిడి, మొహారిలలో నున్నారు. గాయముగాని పురుగులు కొఱుకుచున్న వ్రణముగాని యున్న వానిని వీరు వెలివేయుదురు. అవి మానినపిదప కులసభలోనివా రంగీకరించిఁగాని మరల చేర్చుకొనరు.

కన్యకలకు ఆర్తవమునకు పూర్వమే వివాహము చేసెదరు. యుక్తవరుఁడు దొరకనప్పుడు అక్క పెనిమిటితో లేక తెగలోని యొక పెద్దవానితో యిచ్చి యొక కృత్రిమ వివాహమును చేసెదరు. విధవావివాహము చేసికొనక పూర్వము వరుఁడు 'సాదో' వృక్షమును పెండ్లిచేసికొనవలెను. విధవావివాహముల కభ్యంతరము లేదు. బావమఱఁదియున్న విధవ యవిభక్తకుటుంబములోనుండి పైకివచ్చిఁగాని తిరిగి పెండ్లి చేసికొనఁగూడదు. వివాహపు తంతంతయు నోఢ్రులలోవలె నుండును. కొన్ని ప్రదేశములలో వధూవరులచేతులను దారముతో కట్టుటయుండక, వారి చిటికనవ్రేళ్లను మాత్రము కట్టెదరు. వివాహము నాల్గవ రోజున నొకమంగలి (భండారి) వివాహవేదికపై కొన్ని బియ్యమును కలకండను ఉంచును. వానిని వధూవరులు ధాన్యముపకుసు సొమ్మునకును దమబంధువుల కమ్ముదురు. అట్లు వచ్చినదంతయు మంగలికి వెళ్లును. ఏడవదినమున వేదికపై వరుఁ డొక కుండను పగలఁగొట్టి వధువుతో వెడలిపోవును. వారు వెళ్లునప్పుడు బావమఱఁది యతనిపై బంకమట్టులను విసరును.

వీరిలో మృతులను కాల్చెదరు. చనిపోయిన మరుసటిదినమున ప్రేతకు పేపాకు కలిపినయన్నమును చూపుదురు. అస్థులలో నొకదానిని తీసి యొకరావిచెట్టు మొదట పాతుదురు. పదియవదినమున ఆకును ప్రతిరోజును ఏడుసార్లామొమునకుయున్నచోటుపై నీళ్లు పోయుదురు. మృతినొందిన యతఁడు వృద్ధుఁడైనయెడల నొక కుండకు కన్నములు పొడిచి 'జొలజొలహాండి' యను నుత్తరక్రియ నాచరింతురు.

'కాలింగ' యనుపదము 1911 సం॥ రము జనాభాలోఁ గాన్పించుచున్నది. అంతకుపూర్వము వీరిని కాళింగుల క్రిందనే పరిగణించిరి. 'కాలంగ' లనువారు మధ్యపరగణాలలోని వ్యవసాయదారులు. 1911 సం॥ రములో వీరి సంఖ్య 800 గా నియ్యఁబడియున్నది. సంబలపూరు పరగణాలో వీరు ముఖ్యముగా 'చటిస్కాడు'నకును ఓఢ్రప్రదేశమునకును మధ్యనున్న 'బూర్జాదు' జమీందారీలో నెక్కువగ నున్నారు. వీరు క్షత్రవృత్తిని స్వీకరించి యీ ప్రాంతములకు వచ్చియుందురు. వీరు చాలమట్టుకు కావరుజాతివారితోఁ గలసిపోయియున్నారు. పూర్వాచారములో వీరియందు 'కళింగీయ' 'కవారు' 'చెరొకలంగ' యను మూఁడుశాఖలున్నవి. 'కవారు' 'చెరొకలంగ' వారు మిశ్రజాతులును, కళింగీయులు తొల్లింటి కాళింకులునై యుందురు. ఈకాలంగలు, కవరుజాతివారివలె కౌరవసంతతివార మనియు, నుత్తరహిందూస్థానమునుండి పాట్నా రాజులతోఁ గలసి వచ్చి వారిచే కనిపెట్టుకొని యున్నామనియుఁ జెప్పుదురు. కాని వీరి రూపరేఖలను నాచారములను జూడ దక్షిణహిందూస్థానమునుండియే వచ్చినట్లు కాన్పించును. వీరిలో శిశువు జనించినంతనే యొకకోడిని పీక నులిమి దాని రక్తమును శిశువు నదుటికి పూయుదురు. వీరు తమ సైనఁగుఘాషను నెఱచి యింటిలో ఛత్తీస్గారీ భాషనే మాటలాడుదురు. చాలమంది కోఢ్రభాషయుఁ వచ్చును. వీరిలో నిజమగు శాఖలు లేవు. గాని తిర్యగ్జదపదార్థముల పేళ్లతోడను వృత్తుల బిరుదములు మొదలగువానిని తెలియఁజేయు పేళ్లతోడను గోత్రములు కాన్పించుచున్నవి. బార్హా (వరాహ), మగర్ (మకర), బిఛి (వృశ్చిక) సరియా (ఒకవిధమైన ధాన్యము), ధటి (పుట్టగొడుగు), ఖుమ్రి (ఆకుల గొడుగు) మొదలగునవి గోత్రనామములు. ఆయాగోత్రములవారు తమ గోత్రములవారు తమగోత్రమునకు పేరిచ్చిన యాయా జంతువులను పదార్థములను పూజించుచు వాని కెట్టి యపాయమును గలుగఁజేయక వానిని భుజింపకయుందురు. వానిని చూచినపుడెల్ల నమస్కరించుచుందురు. ఈపేళ్లేగాక మాంఝి (మునసబు), బెహారా (వంటవాఁడు), గుండా (ధూళి), కపాట (కవాటము) భూండి (కన్నము), చీక (బురద), భీల్ (భిల్లజాతి), రెండియా (కలహగొండి), బెర్వియా (గొంతుకలు పిసుకువాఁడు) అను వంశనామములును వీరియందు గలవు. పైనామములను బట్టి యితరజాతులవారును కాళింగులలో సంక్రమించిరని తెలిసికొనవచ్చును. కాళింజులలోవలె వీరిలోఁగూడ పురుగులు కొఱుకు వ్రణములు గలవారిని వెలివేయుట కలదు.

ఒకేవర్గమువారు తమలోఁ దాము సంబంధబాంధవ్యములఁ జేసికొనరు. వీరిలో మేనరికములు లేవు. యుక్తవయస్సు వచ్చినపిదపనే వధూవరులకు తలిదండ్రులు వివాహముచేయుదురు. చాలధాన్యమును, ఐదు పంచలచాపులును, ఐదు రూపాయలును పెండ్లి కుమారుఁడు మామగారికీయవలయును. పెండ్లిపందిరిని వేసి యేఁడు రావికొమ్మను పాతియుంచఁగా, పెండ్లి నాఁటికి మూఁడురోజులు ముందుగా 'గాండా' యను పురోహితుఁడు వచ్చి యచట గ్రామదేవతలను బూజించును. పెండ్లి మొదటిమూఁడుదినములును వధూవరులు కొమ్మ కేడుమాఱులు ప్రదక్షిణముచేయుదురు. పెండ్లి నాలుగురోజులు జరుగును. అందు మొదటిరెండుదినములును వధూవరుల తల్లిదండ్రులు కులమువారందఱికిని ఒకపూఁట సంతర్పణలు చేయుదురు. నాలుగురోజులను రెండవసారి భోజనమును కులమువారందఱును కలపి పెట్టుదురు. దీనినిబట్టి పూర్వకాలమున నీజాతివా రందఱును దగ్గఱసంబంధములు చేసికొనినవారై యుండవచ్చు నని యూహింపనగును. వీరిలో మాఱుమనువు లున్నవి; కాని, తిరిగి పెండ్లిచేసికొనవలెను స్త్రీ కులమువారి యనుజ్ఞను బడయుటయేఁగాక, వారికి విందు చేయవలసి యుండును. విధవకుఁబుత్రకులు పిల్లలు లేక, భర్తయాస్తికి వారసులు లేనప్పుడు, ఆధనమును కులమువారికి విందులక్రింద నుపయోగింపవలెను. స్త్రీ మగనికి విడాకు లీయ

వచ్చును. అట్లు చేయుటకు కులపంచాయతీముందట స్వామి గాజులను బద్దలు కొట్టుకొనును. వీరు పూర్వము శాస్త్రము నవలంబించియుండుటచే కాబోలు శ్రావణపూర్ణిమనాఁడును ఆశ్వయుజశుద్ధనవమినాఁడును కత్తికి పూజచేయుదురు. ఆశ్వయుజమాసములోనే వీరు పెద్దలకు పెట్టుకొందురు. బలవన్మరణము నొందినవారికి మాత్రము వీరు తర్పణముచేయరు. వీరిప్రేతల కెట్టులైన శాంతినిఁగలిగించుటకు ఇంటిముందట కొన్ని బియ్యమును వేసి, అబియ్యమును తగిలియుండునట్లొక యుంగరమును ప్రేలాడఁగట్టి, యొక మేఁకను దెచ్చి దానిచే నాబియ్యమును తినిపింతురు. అది తినినయెడల ప్రేత దానియందు ప్రవేశించినదని యూహించి, దానిని చంపి మాంసము నింటివారు తిందురు. దానితో మృతి నొందినవానికి ప్రేతావస్థ పోయినదని వారియూహ. మేఁక బియ్యమును తిననియెడల, బలవంతముగ తినిపింతురు. పులివాతఁ బడినవాని ప్రేతకు శాంతి కలిగించుటకుమాత్రము 'పులియా' యను నొక మాంత్రికుఁడు రావలయును. అతఁడు పులివలె నటించుచు మఱియొక దిల్లంగి వానిపైఁ బడినట్లు నటించినచో నాప్రేతకు శాంతి కలుగు నని వారినమ్మకము.

ప్రస్తుతము కాలంగులు వ్యవసాయదారులుగను, కంచాయులుగను నున్నారు. ఇప్పుడు పైజాతులవారిని తమలో కలుపుకొనరు గాని కాలంగపురుషుని కేస్త్రీయందు పుట్టిన పిల్లలనైనను చేర్చికొందురు. గురితయాజాతివాఁడు నీళ్లు కలుపకుండవండినవంటలను వీరు భుజింతురు. కాని, సాధారణముగ తినుసాహారము నితరజాతులవారినుండి స్వీకరింపరు. వీరియన్నము పంచమజాతులవారు తప్ప నితరులు తినరు. వీరియందు త్రాగు డున్నది. వీరు కోళ్లను ఎలుకలను తిందురు. గొడ్డుమాంసమును పందిమాంసమును తినరు. చెవులు తెగినవానిని వీరు వెలివేయుదురు. ఈ వెలి మఱికొన్ని నేరములకును గలదు. మఱియొకజాతివానితో వ్యభిచరించిన స్త్రీని వీరు శాశ్వతముగా వెలివేయుదురు. కాళింగులవలెఁ గాక వీరు కొంచెము పొడవరులు.

## కాళింగులు

కాళింగులందఱును వ్యవసాయదారులే. వీరిని చుట్టుపట్లవారు శూద్రులుగనే చూతురు. కాని వారిలోఁ గొందఱు బ్రాహ్మణుల మని చెప్పుకొనుచు బ్రాహ్మణాచారవ్యవహారముల ననుసరింతురు. సంధ్యావందనమును పురుషసూక్తమును వేదములలోఁ గొన్ని భాగములను నభ్యసించుచు, బ్రాహ్మణులవలె 'ఆచారము'ను జేయువారును వీరిలోఁ గొంద రున్నారు. కొన్ని గ్రామములలోని కాళింగులు సంస్కృతమున పాండిత్యమును సంపాదించికొని, దుస్తులు ఆహారము మున్నగు అలవాట్లయందు తెనుఁగు వైష్ణవులవలెఁ గాన్పింతురు. ముఖలింగములోని కాళింగులు మధుకేశ్వరుని యర్చకులుగా నుండి తమవృత్తియందు బ్రాహ్మణులకుతీసిపోమని చెప్పికొందురు. కొందఱు పౌరోహిత్యము నవలంబించి తమ జాతివారియందే కాక, గొల్లలు మీలలు మాలలు మొదలగు జాతులవారి వివాహములఁ జేయించుచుందురు. అట్టికర్మలను వారు మంత్రోక్తముగ నడిపించుట యుత్తదే కాని, జరుగవలసిన తంతుమాత్రము క్రమము తప్పకుండునట్లు చూతురు. మఱికొందఱు తక్కువజాతులవారికి గురువులుగా నుండి పండుగపర్వములయందు కట్నములను పుచ్చుకొనచుందురు.

ఈ రీతిగా వీరు బ్రాహ్మణులవలె నున్నట్లు నటించినను తక్కిన వారు మాత్రము వీరిని శూద్రులుగనే చూతురు. బ్రాహ్మణుల వాఙ్మయమునం దెల్లచోట్లను వీరు కర్మబాహ్యులనియుఁ గళింగదేశములోఁ గాలుపెట్టినవాఁడు పాపసంబంధమగు నపచారము చేయుననియు, నట్టి పాపమును బాపికొనుటకు కొన్ని ప్రాయశ్చిత్తములను జేసికొనవలయుననియుఁ జెప్పఁబడి యున్నది. పంజాబులోని ఆరట్టులును సౌవీరులును దక్షిణ ఇండియాలోని కారస్కరులును, ఉత్తరబంగాళములోని పుండ్రులును, తూర్పుబంగాళములోని వంగులును, ఓఢ్రదేశమునందలి కాళింగులును ప్రాణానులును కర్మబాహ్య లనియు, వారితో సంసర్గము గలిగియుండుటచే నపవిత్రత కలుగుననియు, వారిదేశములోనికి వెళ్లినవారు ప్రాయశ్చిత్తార్థమై పునస్తోమమునో, సర్వపృష్ఠమునో యాచరింపవలయు నని బోధాయనుఁడు చెప్పియున్నాఁడు. పద్మపురాణాంతర్గతమగు శ్రీ కూర్మమాహాత్మ్యములో నీకాళింగులను గూర్చి కఠోరముగా వ్రాయఁబడియున్నది. అందు లక్ష్మి విష్ణువుతో నట్టిపాపులు వసించు దేశమున నెట్లు వసింప నిచ్చపుట్టె నని యడిగినట్లు చెప్పఁబడియున్నది.

కాని, మెగాస్తనీసు వీరినిఁ గూర్చి వ్రాయుచు వీరు చాల నాగరకులనియును పనేకవృత్తులనవలంబించి చాల తెగలుగ విడియుండి రనియును బాగుగ చదువుకొనినవా రనియును వేదాంత చర్చలయందు పాల్గొనుచుండిరనియును దెలిపియున్నాఁడు. వీరు బ్రాహ్మణులయినదియుఁ గానిదియు మాత్ర మాతఁడు వచించియుండ లేదు. ప్రస్తుతము బ్రాహ్మణులకు వారిని గూర్చి యెట్టి యభిప్రాయ మున్నను, తొలుదొల్త వారియందు చతుర్వర్ణములవారు నుండి రనియు, నంపు వైశ్యులు తప్ప తక్కిన మూఁడువర్ణములవారును నేఁడిదేయో కారణమున శూద్రులుగ పరిగణింపఁబడియుందు రనియుఁ దలంచుట కవకాశ మున్నది. కళింగదేశము చాలకాలము బౌద్ధమతాక్రాంత మగుటయును బౌద్ధులకును బ్రాహ్మణులకును సహజద్వేష ముండుటయును దీనికి కారణమయి యుండవచ్చును. వ్యవసాయము చేయుట, బండ్లు తోలుట మొదలగు వృత్తుల కలవాటుపడుటయును దక్షిణహిందూదేశ బ్రాహ్మణు లసహ్యించుకొను మత్స్యమాంసాహారమును సేవించుటయును వారియందు వేదోక్తకర్మలు నశించి నానాటికిని మతగురువులుగ నుండుటను వదలిపెట్టుకొని విద్యావిహీనులై శూద్రులయాచారములను నలవాటులను నాహారమును వస్త్రములను అలంకారములను నవలంబించుటయును మొదలగునవికూడ వారిప్రస్తుతస్థితికిఁ గారణములై యుండవచ్చును.

జనప్రతీతినిఁబట్టిమాత్రము వీరు తొలుత పంచములఁట! కృష్ణదేవరాయ లీదేశమునకు వచ్చినప్పుడు తల్లితద్దినమును పెట్టవలసివచ్చి, యుత్తములను వారిచే వంటచేయింపఁగోరె నఁట. తిమ్మరుసు పెద్దకులము వారే వంటచేయవలసిన దని యాజ్ఞాపింపఁగా, పెద్దకులమనఁగా పంచము లనియే వ్యవహారములో నర్థముండుటవలన పంచములే వంటచేసిరఁట! కొంతకాలమునకు తిమ్మరు సీపొరఁబాటును తెలిసికొని, దానిని సవరిం

SRI P. SIMHACHALAM PANTULU



శ్రీయుత పోతాప్రగడ సింహాచలం పంతులు

SRI
G. HARISARVOTTAMA RAU



శ్రీయుత
గాడిచెర్ల హరిసర్వోత్తమరావు

SRI R. RAMA SUBBAYYA



శ్రీయుత రాళ్లపల్లి రామసుబ్బయ్య

SRI V. RAGHAVAYYA



శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్య

SRI P. SUBBARAJU



శ్రీయుత పేరిచర్ల సుబ్బరాజు

BARISTER GIRI, COCANADA



బారిష్టరు గిరి, కాకినాడ

ముట కాపంచములకు యజ్ఞోపవీతములను వేయించి బ్రాహ్మణులఁగా మార్చెనట! ఈపిట్టకథకుం దెట్టి నమ్మకము నుంచుటకును వీలులేదు. కాళింగుల విషయములో మాత్ర మట్టి యూహ కవకాశ మిసుమంతయును లేదు.

కాని బ్రాహ్మణులు తక్కువజాతివారిలోఁ గలసిపోవుటయు దక్కువజాతివారు బ్రాహ్మణు లగుటయును జరిత్రనుబట్టి తెలియవచ్చుచునే యున్నది. హంటరు 'ఒరిస్సా' యను గ్రంథమున హిందూదేశములోని పెక్కొకండ్ల ప్రదేశములనుండి యిట్టిమార్పుల కుదాహరణముల నిచ్చియున్నాఁడు. హిమాలయపర్వతముదగ్గఱ నున్న బ్రాహ్మణులు సేద్యవృత్తి నవలంబించి గొల్లలకంటెఁ గాన్పించుచు, వర్తకవ్యాపారముల యందు మట్టుపట్లనుండువారిలోనికి సక్రమించియున్నారు. కాఁగ్రా లోయలోని బ్రాహ్మణులు దుక్కి దున్నకొని బ్రతుకుచున్నారు. నూతనముగా సప్తకోశకండలి బ్రాహ్మణులు పర్వతప్రాంతములకేగి, యచటి సామంతరాజులకు పురోహితులుగా నున్నారు. పార్వతీయబ్రాహ్మణులవలెఁ గాక వీరు మాంసమును వర్జింతురు. పార్వతీయులు పూర్వమువలె పూజారులుగనే యున్నారు. అయినను తరువాతవచ్చిన బ్రాహ్మణులు తొల్లిటివారి యాచారవ్యవహారముల నవలంబించుచున్నారు. పాటియాలా బ్రాహ్మణులు కూలిపనిని చేసికొనుచు పల్లకులను మోయుచున్నారు. గంగాయమునలకు మధ్యనున్న కొందఱు పౌరోహిత్యమును వదలి వ్యవసాయము నవలంబించుచున్నారు. బిహారు లోని బ్రాహ్మణులలో మూఁడవవంతువారు వ్యవసాయదారులై శూద్రులవంటివారు నికృష్టులుగఁ జూడఁబడుచున్నారు. వీరిలో 'దూసా' భాగమువారిలో విధవావివాహము లున్నవి. వీరు ప్రత్యేకవర్ణముగనే యున్నారు. జయపూరులోని బ్రాహ్మణులవంటి కొందఱు బ్రాహ్మణులు యజ్ఞములకు గౌరవముఁ గల్పించుటకై యేర్పడినవారుగా నున్నారు. వీరిలోఁ జాలమంది యయోధ్యకు వెళ్లిరి. గాని బ్రాహ్మణులు వారిని తమవర్ణములో నికిఁ జేర్చుకొనరైరి. అయోధ్యరాజు తాను చేయుచుండిన యజ్ఞమునందు సహాయులకు బ్రాహ్మణు లవశ్యముఁ బూరకలయిన పని యుంచి సాధారణశూద్రులకును యజ్ఞోపవీతమును ధరించు నధికారమును వారికొసంగెనట. వీరిలోఁ గొందఱు శ్రీకృష్ణుఁడే తమ్ము బ్రాహ్మణులుగఁ జేసెనని చెప్పికొందురు. తక్కినవారు అట్లు చెప్పికొనక క్షత్రియులలోఁ జేర్చుకొని యంతటితోఁ దృప్తినొందిరి.

బవారియ జిల్లాలోను గంగాసరిసాదుగుపను నున్న వ్యవసాయదారులలో వేరులు బ్రాహ్మణుల పని చెప్పుకొనుచున్నారు. పూర్వకాలమున బ్రాహ్మణులకు వలె వీరికిని మరణదండనము విధింపఁబడెడిది కాదట. బొంబాయి రాష్ట్రములో భాగల్పూరు జిల్లాలోని బ్రాహ్మణులయందు నూటికి డెబ్బదియైదుగురు వ్యవసాయదారు లగుటయే గాక పూర్వకాలమున నూతనముగ సృష్టింపఁబడిన లక్షమంది బ్రాహ్మణుల సంతతివారలమనియుఁ జెప్పికొందురు. ఒరిస్సాలోని జాజ్పూరుజిల్లాలో బంగాళీదుంపలు వ్యవసాయముచేయు బ్రాహ్మణులు గలరు. వృత్తిచేత వేఱుగ జాతిచేతనుగూడ వీరికిని తక్కువజాతిబ్రాహ్మణులకును చాల భేదము గలదు. కృష్ణానదీతీరమునను మలబారునందును మైసూరులోను పతితులయిన యనేక బ్రాహ్మణు లున్నారు. గంజాంజిల్లాలోని పాణ్యాద బ్రాహ్మణులు నట్టివారే. మధురజిల్లాలోని చోళబ్రాహ్మణులును వరాపతితులే యని వాడుక. సింహళములోఁ గూడ బ్రాహ్మణేతరులనుండి బ్రాహ్మణులు సృష్టింపఁబడుచుండుట స్పష్టముగఁ గాన్పించును. ఇట్టిపరివర్తనములు పూర్వమే కాక యిప్పుడుకూడ మనము చూచుచునే యున్నాము. బ్రాహ్మణేతరసోదరులలో నొకభాగముగ బ్రాహ్మణపురోహితులను వర్జించి తమవారినే యేర్పఱచుకొనుచుండుటయుఁ గంసాలులు విశ్వబ్రాహ్మణనామముతోడను కమ్మవారు కమ్మబ్రాహ్మణనామముతోడను వ్యవహరింపఁ జేయుటయును నిందుకు నిదర్శనములు.

ఈరీతిగా దేశకాలావస్థలననుసరించి యెక్కువజాతివారు తక్కువజాతివారగుటయు తక్కువజాతివా రెక్కువజాతివా రగుటయు సంభవించుచుండును. ప్రస్తుతము కాళింగులందఱును శూద్రాచారముల నవలంబించువారే యైనను, తొలుత వారు లందఱుఁ దొకలె వీరియందును చతుర్వర్ణములవారును నుండియుండవలెను. కళింగరాజుల సేనానులందఱును నాయకు లను బిరుదములు గలిగిన క్షత్రియులై యుండిరి. ఈ 'నాయక' శబ్దమే 'నాయుఁడు' అను ప్రకృతినామముగా మారినది. ప్రస్తుత కాళింగు లందఱును 'నాయుఁడు'లను పేరనే వ్యవహరింపఁబడుచున్నారు. వెలమకాళింగులు స్పష్టముగ శూద్రు లగుటకు వారు జందెమును ధరింపకుండుటయే నిదర్శనము. వారియందు వేదోక్తకర్మలు మంత్రసహితములుగ నుండకున్నను ఇంతులో నెట్టి మార్పును లేకుండుటచేఁ బూర్వకాలమున వీరియందును బ్రాహ్మణు లుండిరని యూహించుట కవకాశ మున్నది. కళింగవైశ్యులు ప్రత్యేకశాఖగా నుండియే యున్నారు. వైశ్యులు సాధారణముగాఁ బూర్వాచారపరాయణులై, శీఘ్రముగఁ బరివర్తనములకుఁ బాల్పడరు. వీరు ప్రత్యేకశాఖగా నిలుచుటయే యీ చతుర్వర్ణములవారును గాళింగులయం దుండిరనుటకు ప్రబల నిదర్శనము. కాని, ఏకారణములచేతనో కాళింగ బ్రాహ్మణ క్షత్రియు శూద్రు లైపోయి యొకటే పెద్దతెగగా నేర్పడిరి. వైశ్యులుమాత్రము తమ ప్రత్యేకత్వమును నిలిపికొనిరి. వైశ్యులఁగూర్చి వేఱె ముచ్చటించి, యిచ్చట గంజాము విశాఖపట్టణములలోని కాళింగులను గూర్చి వ్రాసెదను.

పూర్వము చెప్పినట్లు కాళింగులకందఱకును వ్యవసాయమే వృత్తి. వీరు చాలమట్టుకు మెట్టపంటలను పల్లపుపంటలను గూడ పండింతురు. విశాఖపట్టణముజిల్లాలో కూరగాయలు పండించువారు ముఖ్యముగా వీరే. వీరు సాధారణముగా నొకరితోనొకరు కలిసియే వ్యవహారము చేసికొనుచుందురు. పండినపంటను టోకున అమ్మివేయుదురు, గాని చిల్లరగా నమ్మరు. వీరికి మంచికూడిక. కుటుంబమువా రందఱును గలిసి సంపాదించుకొందురు. పురుషులు సొమ్మును తమయొద్ద నుంచుకొనక స్త్రీల యధీనముననే యుంతురు. వారికి మంచినట్టి ఎంతో ఆలోచించినగాని దమ్మిడీ ఖర్చుపెట్టరు. రెండేమన్న మున్నపుకాయలో సొమ్ముంచి దానిని త్రిప్పుచు నాలోచించి మఱియు వ్యయము చేయుచుందురు. నాగరకుల చర్యనుండి సొమ్ముపైకి ద్రుళ్లిపోవుచుండునే గాని వీరి మున్నపుకాయనుండి మాత్రము సందేహించుచు సందేహించుచు వచ్చు

ను. వీరిలో చాలమంది ధనవంతు లున్నారు. మొత్తముమీద నందఱును జరుగుబాటుకు లోపములేనివారే యని చెప్పవచ్చును. కావుననే, వీరు దేశమును విడిచి కూలివాండ్రై పరదేశములకు పోవుట చాల తక్కువ. తక్కిన శూద్రజాతులయందువలెఁగాక వీరిలో త్రాగుడు బొత్తిగా లేదనియే చెప్పవచ్చును. వీరిలో నేరములు చేయువా రెక్కువ నున్నారని చెప్పుదురు. కాని తగినయాధారము లేనిది యిదమిత్థ మని చెప్పుటకు వీలులేదు. వీరు దక్షిణభాగములలో తెనుఁగుభాషను నుత్తరభాగములయందు ఓఢ్రమును తెనుఁగునుగూడ మాటలాడుదురు. వీరు బండ్లు తోలుటకు మిక్కిలిగా నలవాటుపడియున్నారు. రైల్వే పడక పూర్వము వీరు యాత్రికులను కాశీరామేశ్వరములకుఁ దీసికొని పోవుచుండిరి. ఇప్పటికిని వీరు త్తరమున కటకమునకును దక్షిణమున చెన్నపట్టణమునకును బండ్లుతోలుకొని పోవుచుఁ గొలలకాలమున కిండ్లకు చేరికొనుచుందురు.

వీరు సాధారణముగా బూరగాము కాళింగు లనియు,కింతలి కాళింగు లనియు రెండు తెగలుగా నున్నారు. బూరగాము పర్లాకిమిడి దగ్గఱ నున్నది. కింతలి శ్రీకాకుళముదగ్గఱ నున్నది. ఈ రెండు స్థలముల నుండియే యీ రెండు తెగలవారును వ్యాపించియుందురు. ఎక్కువ యుత్తరభాగమున నున్నవారు బూరగాము కాళింగు లనియు దక్షిణమున నున్నవారు కింతలి కాళింగు లనియు చెప్పవచ్చును. ఆచారవ్యవహారములలో నీ రెండు తెగలవారికిని కొన్ని భేదము లున్నవి. కింతలివారు చారకంద హెచ్చుగా పండింతురు. వీరు తల ముందు భాగమున క్షౌరము చేసికొనరు. బూరగామువారిలో మారుమనువులు లేవు. కింతలివారిలో నున్నవి. అందుచేతనే కాఁబోలు కింతలి వారియందుకంటె బూరగామువారియందు వ్యభిచార మెక్కువగా నున్నదని చెప్పికొందురు. అతిబాల్యవివాహము లుండుటచేత వీరిలోని విధవలసంఖ్య హెచ్చుగానున్నది. అయినను, భర్తతోఁ గొన్నాళ్లు మనినస్త్రీ సాధారణముగా మఱియొక మనువునకు పోకయుండుటయే మర్యాదగా నెంచుచుండుట కలదు.

పై తెగలవారే గాక బెహరాణి కాళింగులను మఱియొక తెగ కలదు. జాతినుండి వెలిపొందినవా రందఱును నీ తెగవారిలోఁ జేరుదురని చెప్పుకొందురు.

కాళింగులలో చదువుకొనినవారిసంఖ్య చాలతక్కువ. వీరికి మూర్ఖపుపట్టుదల యెక్కువ. ఏదయిన నొకదురభిప్రాయము తలకెక్కిన యెడల, 'ససేమిరా' యెంతచెప్పినను మతి వినుటలేదు. కొందఱు తెనుఁగు చదువుకొనుటయుఁ గలదు. కొన్నికొల్లామువారు సంస్కృతములో పండితులగుటను గూర్చి పూర్వము చెప్పియేయున్నాము. పురోహితులు-పూజారులు-గురువులుగ నున్నవారు- సాధారణముగ కొద్దియో గొప్పయో చదువుకొనినవారే యై యుందురు. వీరిలో నింగ్లీషువిద్య బాగుగ వ్యాపింపలేదు. నాకు తెలిసినంతవఱకు విద్యాశాఖమంత్రిగ నున్న గా. అన్నెపు పరశురామపాత్రో గారును, మ. రా. రా. పానువంతు సూర్యనారాయణ నాయుడు గారును మాత్రము ఉత్తమ విద్య నభ్యసించినవారు. ఇద్దఱును బి. యే. బి. యల్. ప్యాసయినవారే. సెకండరీ విద్య నభ్యసించినవారి సంఖ్యయైనను వీరిలో చాలతక్కువ.

వీరిలో స్త్రీలు సాధారణముగా వదులుమూలుకోకలనే కట్టుకొందురు. కట్టినకోక మోకాళ్లక్రిందికి దిగదు. పేగివాటివారు ప్రాదులవలె వీరికి కడిపైట. కోకచెప్పకును బొడ్డుక్రిందికే కట్టుకొందురు. పురుషులు తక్కినశూద్రులకంటె పెద్దపంచలను కట్టుకొందురు. గోచీకట్టుకొనినవారిని తక్కినశూద్రులయందువలె వీరిలోనుఁ గానము.

అలంకారవిషయములో, స్త్రీలు తక్కినశూద్రజాతుల ననుసరింతురు. గాని తక్కినవారు 'చేఁద' లను రెండుచేతులకు పెట్టుకొనఁగా వీరొక్క యెడమచేతికే పెట్టుకొందురు. వీరిలో ముఖ్యమగు నలంకారము మెడమట్టు నుండు కుత్తుకంటు. దీనిలో రెండు పగడము లుండును. ఈపగడము లెంత పెద్దవిగ నుండిన నంత శుభ మట అందుచేతనే, కొందఱు మెడ ముందుకు వంచలేనంత పెద్దపగడములను కుత్తుకంటులో గ్రుచ్చుకొందురు. ఈకుత్తుకంటులో మఱియొక విశేష మున్నది. దీనికొనకు దగ్గఱనుండి యొకతోక వీపుపైకి వ్రేలాడుచుండును. దీనిలో 'పిట్టముడి' యనియు నిట్లే మఱిరెండు పేర్లు కలిగిన మూఁడు పూస లుండును. ఈతోక తక్కినశూద్రులయం దుండదు.

మంత్రయుతముగఁ గాకపోయినను వీరిలో వివాహవిషయమున బ్రాహ్మణుల తంతంతయు జరుగునని తెలుపఁబడియే యున్నది. పురోహితుఁ డేవో సంస్కృతశ్లోకములనో తెనుఁగుపద్యములనో చదివివేయవచ్చును. గాని తంతులోని క్రమముమాత్రము తప్పుటకు వీలు లేదు. ఆక్రమ మొకింతమాత్రము తప్పినను పురోహితునిపాట్లకు మితి లేదు. విఘ్నేశ్వరపూజ- కంకణధారణము - లగ్నపత్రిక - యజ్ఞోపవీతధారణము- అర్ఘ్యము- పాద్యము- కన్యాదానము- సుముహూర్తము- మంగళసూత్రపూజ- అజ్యలాజాహోమములు- మంగళసూత్రధారణము- తలఁబ్రాలు- బ్రహ్మముడులు- సప్తపదములు- అరుంధతీదర్శనము- తొంగరునీళ్లపూజ__అని ఈక్రమములో సర్వమును జరుగవలెను. తరువాత వధూవరుల తల్లిదండ్రులు వారికి కట్నములు చదివింతురు. రెండవ దినమున 'షడేయులు'అను పేర కంకణవిసర్జనము జరుగును. అప్పుడు బంధువులును స్నేహితులును 'పైట్టంకాలు' అనుకట్నములు చదివింతురు. సొమ్ము, వస్త్రములనే గాక కంచములు, ముంతలు, తక్కినగృహోపకరణములను కట్నములుగా చదువుదురు.

పై కర్మలన్నియుఁ దక్కినశూద్రులందు లేవు. తొంగరునీళ్లపూజ వీరియందు విశేషము. వివాహమునాఁ డుదయముననే యొకకుండలో నీళ్లు తెచ్చి, దానిమూతి కొకగుడ్డను కట్టి, దానిమీఁద పసుపుముంచెదరు. దీనిని చాలఁ బవిత్రముగఁ జూచెదరు.

అగ్నిహోత్రముచేయుటకు కందిపుల్లలుమాత్రమే ఉపయోగింతురు. ఈఅగ్ని ఎంతోసేపుండదు. పురోహితుఁడు దీని నారిపోకుండ నుంచుటకు చాల కష్టాలఁబడుచుండును. నోటితో నూదిగాని, విసనకఱ్ఱతో విసిరిగాని ప్రజ్వరిల్లఁ జేయఁగూడదు. కావలసిన నద్దాపులతో విసరవచ్చును.

వివాహములందు కాళింగులు పురోహితుని చాల బాధపెట్టుదురు. సొమ్ము కాకపడిగాని, లేకున్న నెవ్వరును పౌరోహిత్యమునకు

పూనుకొనరు. పురుషులకంటెను పురోహితుఁడు బోధకుఁడగును. ఇతనిని వారు చాల చీకాకు పెట్టెదరు. ఈయల్లరి యెట్లాంధ్ర మన్యములో గాని ఇది యొకయాచారము క్రింద దిగినది. పురోహితుఁ డెంతయేచ్చికొనిన వధూవరుల కంత శ్రేయస్సని వీరు తలంచునంతవట్టుకు వచ్చినది ఇది చూచి పురోహితులందఱును కాళింగులయిండ్లకు పోఁగూడదని కట్టుకట్టుటచే నీదురాచారము కొంతవఱకును తగ్గి పోయినది.

ఈ వివాహములు చేయించునప్పుడు పురోహితుఁడు సాధారణముగాఁ బదిపండ్రెండు ఇండ్లలో కంట్రాక్టుపద్ధతిని ఒప్పుకొనును. కాళింగులలో వివాహములు జరుగునప్పు డన్నియిండ్లలోను సాధారణముగా నొక్కముహూర్తముననే జరుగుచుండును.

వీరిలో నతిబాల్యవివాహములు మెండు. పిల్లపుట్టిన పదకొండు రోజులలో పెండ్లియైనయెడల మిక్కిలి శుభమని వీరు తలంతురు. శిశువులకు వివాహము చేయునప్పుడు తల్లి శిశువు నొడిలో నుంచుకొని కూర్చుండఁగాఁ బురోహితుఁడే పుస్తె కట్టివేసి తరువాత పెండ్లికొడుకు చేత ముట్టించును ఇట్టి బాల్యవివాహములమూలమున పునర్వివాహములు లేని బూరగాముకాళింగులలో వ్యభిచార మున్న దని చెప్పికొందురు. కాని, చిన్నతప్పులకు వీరిని వెలివేయరఁట. వ్రేలు చూపినయెడల నా స్త్రీని తిరిగి కులములో చేర్చికొనుట యరుదు. కళింగులలో మేనరికములను, ఎదురుమేనరికములనుగూడ నున్నవి. ఎదురుమేనరికములు వారిమట్టుపట్ల నున్న జాతులవారి కిష్టము లేదు.

పైవిషయములను నేను విన్నంత కన్నంతమట్టుకు వ్రాసితిని. ఇందు తప్పులభిప్రాయములు నుండవచ్చును. అట్టివాని నెవ్వరైనఁ జూపినచో దిద్దికొందును.

# దేశమాతృసంకీర్తనము

వెదురుమూడి శేషగిరిరావు పంతులుగారు

భువనపావన సుగుణ సముపేత - భారతమాత -
పూత సత్సుత సుగుణవిఖ్యాతా.
శ్రీసమేతవు శ్రీసఖివి సు-
శ్రీవిభాసుర వార్యజననీ!
దాసదాసుల మగు తనూజుల -
దయను వేగ సముద్ధరింపుము - భు॥

కన్నబిడ్డల ధర్మవర్తనుల - గావించువారలు -
సన్నుతంబుగ తల్లిదండ్రులెగా
తండ్రి యా జగదీశ్వరుఁడు మా.
తల్లివీవె గదమ్మ భారతి!
మీ శుభాశీర్వాద మొక్కటె -
మమ్ము ధన్యుల జేయఁజాలదె! భు॥

భూరితేజుల గర్భమందునను - పుట్టిరు తనూజులు -
సారహీను లధర్ములై మనిన -
ఘోర దుర్దశ నొందవదే సువి-
చారు లగు తలిదండ్రులకు దయ।
మీరగా మ మ్ముద్ధరింపక -
తగునె యుపేక్షఁ జేయఁగ? భు॥

భారతీయుల వీరవిఖ్యాతి - అరిమర్దన విజయవి-
భూతి సుస్థిర త్యాగశీలములు -
ఘన సదాచారాభిరతియును -
శాంతిభూత దయావిశేషము।
లలమె భువనములెల్ల తొల్లి -
యిదేల మీదయ దప్పె నేటికి - భు॥

రత్నగర్భవు కాంచనాన్వితవు - ఘన నదీనదనగ
భాసురవు వరసస్యశాలినివి -
కలుములకు నిలయంబ వగు నీ -
కన్నబిడ్డలు కూడుగుడ్డల।
బడయఁజాలక పరాధీనులు -
బానిసలునై బ్రదుకఁజూచెదె? భు॥

మహిత తేజులు ధర్మతత్పరులు-మాయమ్మ గాంధిమ-
హాత్ము డాదిగ నీ తనూభవులు
తల్లి యిరువదివేలపుత్రులు -
త్యాగులై కారాగృహంబున -
దాస్య ముక్తికి తపము చేయఁగ -
దయ స్వరాజ్యం బొసగదగదే? భు

# రెండవ ప్రతాపరుద్రుని రాజ్యపాలన విధానము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

తెలుఁగు దేశము నేలిన సుప్రసిద్ధ రాజవంశములలోఁ గాకతీయవంశ మొకటి. కాకతీయ ప్రభుపుంగవులకు ఓరుగల్లు రాజధాని. ఓరుగంటి కాకతీయులలో గణపతిదేవచక్రవర్తి - రాణీ రుద్రమదేవి - మున్నగువారలు ఆంధ్రులకు విశ్రుతపూర్వులు. కాకతీయ ప్రభువులలోఁ గడపటివాఁడును శ్రేష్ఠుఁడును ప్రతాపరుద్రదేవ చక్రవర్తి. ఇతనిని చరిత్రజ్ఞులు రెండవ ప్రతాపరుద్రుఁ డందురు. ఈతఁడు గణపతిదేవ చక్రవర్తియనంతర మాంధ్రదేశము నేలిన రుద్రమదేవికి దౌహిత్రుఁడు. రుద్రమదేవి తనకుఁ బుత్రసంతానము లేకపోవుటచేత నితనిఁ గుమారునిగ భావించుకొని తనయనంతరము రాజ్యభారమును వహింపఁజేసెను. ఈ ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౨౯౫ సం. మొదలు ౧౩౨౬ సంవత్సరము వఱకు రాజ్యము చేసెను.

### పరిపాలనారంభదశ - దేశస్థితి

ప్రతాపరుద్రుఁడు రాజ్యమునకు వచ్చునప్పటికి దేశమంతయు నల్లకల్లోలము నుండెను. అంతవఱకుఁ జోళులకు లోఁబడి వారికిఁ గప్పము చెల్లించుచు దిన సామంతప్రభువులు స్వతంత్రులై చోళసామ్రాజ్యమును కబళించుచుండిరి. మధురానగరపు పాండ్యులు విజృంభించి చోళరాజ్యము నాక్రమించుకొనుచుండిరి. ఒకవైపునఁ బల్లవకంశజులైన శంభువరాయనులు తమరాజ్యమును విస్తరింపఁ దలపెట్టుచుండ నింకొకవంకఁ గేరళులు పాండ్యుల నడిమి కప్పముఁ గైకొన సాహసించుచుండిరి. తెలుఁగుచోళులు కాంచీపురమును రాజధానిఁ జేసికొని స్వతంత్రులై పరిపాలించుచుండిరి. మఱియొకప్రక్క హొయిసలరాజులు శంభువరాయనులను జయించి చోళమండలము నంతను గ్రసింపఁ దలపడుచుండిరి. ఇంకనొకవైపు దేవగిరియాదవులు ఓరుగంటి కాకతీయాంధ్రమహాసామ్రాజ్యమును నాపోశనముఁబట్టి వేచి యుండిరి. ఇన్నియుఁ గాక నిల్లుండ పాండ్యులలోఁ బాండ్యులే రాజ్యాధిపత్యమునకై పోరుచు ఢిల్లీపాదుషా [?]ఘైన అల్లాయుద్దీను సాయము నపేక్షించుచుండిరి. దేశమంతయు నిట్టి విషమదశయం దున్నసమయమున రుద్రమదేవి కాలధర్మము నొందెను. అంతవఱకు రుద్రమదేవికి సామంతులుగ నుండినవారు స్వతంత్రులైరి. మాండలిక బ్రహ్మరాక్షస గండపెండేర ప్రభృతి బిరుదములను వహించిన కాయస్థులైన అంబదేవమహారాజు స్వాతంత్ర్యమును బ్రకటించి కందనోలుసీమలోని త్రిపురాంతకమునకుఁ గల దేశమునంతయు జయించెను. అ తఱువాత విక్రమసింహపుర మను నెల్లూరి సింహాసనము నధిష్ఠించి యుండిన కాకతీయసామంతుని జంపి యా యంబదేవరా జన్యుల మనుమగండగోపాలుఁ డనువానిని బ్రతిష్ఠించెను. మఱియును తన స్థితిని చక్క చేసికొనుటకై ప్రతాపరుద్రునికి శత్రువులగు పాండ్యులతోను యాదవులతోను స్నేహము చేసెను. ఇది ప్రతాపరుద్రుఁడు రాజ్యమునకు వచ్చునప్పటికి దేశ మున్న స్థితి.

### ప్రథమరాజ్యాంగసంస్కరణము

మున్ముందు రాజ్యమును భద్రపఱచుకొనుటకుఁ గొందఱు క్రొత్త నాయకుల నతఁడేర్పఱిచెను. ఉత్తమజాతులవారే నాయకత్వమున కర్హులు అనియు గణపతిదేవచక్రవర్తి నానావర్ణములవారికి నాయకత్వ మిచ్చుటచే రాజ్యము బహునాయకమై చెడుచుండె ననియు నిర్ణయించి పద్మనాయకులను బిలిచి సమ్మానించి ఓరుగంటి ప్రాకారంబునకు డెబ్బదియేను క్రొత్తడంబు లుండఁజేసి, డెబ్బదియేడు గోత్రంబులందు నొక్కొక్కరి నేర్చి డెబ్బదియేడుగురకు నాయకత్వంబు లొసంగి యొక్కొక్క క్రొత్తడంబు నొక్కొక్కరి యధీనం బొనరించి వారి బంధువర్గంబునకుఁ బుట్టకోట క్రొత్తడంబులకు నాయకత్వం బొసంగి వారి వందఱను గౌరవించి తన సామ్రాజ్యంబునఁ దనవశంబైన రాజ్యంబు తన భాండారంబునకు నల్లంకేసి యొకభాగంబు డెబ్బదేడుగురు పద్మనాయకులకును ఒక్కభాగంబు బంధువర్గంబునకును ఒక్కభాగంబు తన మూలబలంబులకును ఒక్కభాగంబు బ్రాహ్మణులకును నొసంగి పరిపాలనావిధానమును నిర్ణయపఱచెను.*

గణపతిదేవుని కాలమునందువలెనే యీ ప్రతాపరుద్రుని కాలమునను దేశమంతయు నాడుల క్రిందను సీమల క్రిందను స్థలముల క్రిందను విభజింపఁబడినది. శాసనాధారమున ప్రతాపరుద్రుని రాజ్యమున నీ క్రిందిస్థలములు గానవచ్చుచున్నవి. వెలనాంటిస్థలము [౧] మహాదేవిచర్లస్థలము [౨] గురిజాలస్థలము [౩] పింగళిస్థలము [౪] కొండపారిస్థలము [౫] గండ్యాలస్థలము [౬] ఒక్కొక్కస్థలమును ఇప్పటి తాలూకావంటిది. నాఁడు ఇప్పుడున్న యొకమండలము వంటిది. ఒక్కొక్కస్థలమున కొక్కొక్క నాయకుఁ డధికారిగ నుండెను. నాయకుని యధీనమున నున్న స్థలము నాయంకర మనఁబడును.

### శ్రీశైలయాత్ర - దక్షిణదిగ్విజయము

ప్రతాపరుద్రుఁడు శ్రీశైలయాత్ర చేయుటకుఁ బూర్వము దత్తమండలములలోఁ జాలభాగము అరణ్యమయము. ఈయన శ్రీశైలము మొదలగు దేశములకు వెడలినప్పుడు వనములలో గల యడవి నఱికించి గ్రామములను నిర్మించెను. అతఁడు శ్రీశైలమునుండి పర్వతపంక్తులమీఁదుగ

---

* ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము — ఆం. సా. ప. పత్రిక. సం ౭. సం ౪. పుటలు ౨౩౭—౨౩౮.

౧. A. R. 125/1893. ౨. Ep. Coll. 585/1909. ౩&౪. Ep. Coll. 560/1909. ౫. Ep. Coll. 715/1920.
౬. C. P. No 11 of 1918/1919.

"ఈ శాసనమునఁ జెప్పిన కవిచక్రవర్తులకు ముమ్మడమ్మంగారు ఇచ్చిన వృత్తి అయిదు రేఖపుట్లు.

ఎకరమునకు ఎనిమిది నివర్తనములు.

## వ్యవసాయము

ప్రతాపరుద్రుని కాలమునఁ గూడ భూములు - పల్లపుభూములు మెట్టభూములు అని - రెండువిధములుగ విభజింపఁబడినవి. వరిపంట కను కూలమయిన పల్లపుభూమిని నీరునేల యనియు, మెట్టభూములను వెలిచే లనియు వ్యవహరించిరి. వ్యవసాయము ముఖ్యముగఁ జెఱువుల యాధారమున సాగుచుండెను. తటాకనిర్మాణ మాకాలమున మతధర్మముగను పుణ్యకార్యముగను విశ్వసింపఁబడుచువచ్చెను. ఓరుగంటి కాకతీయులు తటాకనిర్మాత లని పేరొందిరి. కాకతీయరాజ్యమున నపరిమితముగఁ దటాకము లుండుటవలన తటాకరాష్ట్ర మని ఆంగ్లేయులు పేరుఁ బెట్టిరి. కాల్వలయాధారమునఁ గూడ వ్యవసాయము జరుగుచుండెను. కాకతీయ సామంతు లనేకులు గొప్పగొప్ప కాల్వలు త్రవ్వించినారు.

## పన్ను - పర్యాయములు

ప్రతాపరుద్రునికాలములో పన్నులు తేలికగ నుండెడి వనియు, ఏమాత్రము నొప్పి కలుగకుండ రాజు శుల్కమును గ్రహించుచుండె ననియు నూహింపవచ్చును. హిందూరాజుల యనంతరము చాలకాలము మహమ్మదీయులు పరిపాలించియుండుటచేత నా పూర్వకాలపునాఁటి పదములును - 'రివిన్యూ' పదములును - చాలభాగము వాడుకలో లేక యున్నవి. కంపెనీవారి ప్రభుత్వము దేశమున స్థిరముగ నాటుకొనువఱకు నఁనగా రెండువందల యేండ్ల క్రిందటివఱకు మహమ్మదీయులే పరిపాలనము చేయుచుండుటచే వారి పరిపాలన పదములు ఇంకను వాడుకలో నుండుటయును మనకు జ్ఞాపకముండుటయును సంభవించుచున్నది.

ఇప్పటివలెఁ బన్నులు నాణెమురూపమున గాక సాధారణముగ నన్నియు ధాన్యమురూపమునఁ జెల్లింపఁబడుచుండెను. పండినపంటలో 'కోరులు' - అనఁగా రాజుపాలు పోను మిగిలినది - కాపు తీసికొనును. రాజుపాలికివచ్చు నీధాన్యరూపమైనపన్నును వసూలుచేయువారికి ఇంత ధాన్యశుల్కమున కిన్ని మేర లని యిచ్చెడివారు. మేర లనఁగా ధాన్య రూపమైన జీతము. ధాన్యములఁ గొలుచువారికి కొంత ప్రతిఫలము ముట్టఁ జెప్పువారు, అట్టి ప్రతిఫలమును ఒక్కొక్కప్పుడు ధాన్యరూపమున నిచ్చువారు మఱొకప్పుడు నాణెమురూపమున నిచ్చువారు ధాన్యరూప మున నిచ్చుదానికి పుట్టిపహిండి (పుట్టిపకిండి) యని పేరు. కాని కొన్నికొన్ని గ్రామములలో హిందూరాజుల కాలమున మెట్టచేలకుఁ బసిండిరూపమునను, పల్లపుచేలకు ధాన్యరూపమునను పన్నులు వసూలు చేయఁబడుచుండినట్లు కూడఁ గానవచ్చుచున్నది.[౧]

ప్రతాపరుద్రునికాలమున నీ క్రింది పన్నుపర్యాయములు ఉండి నట్లు శాసనాధారమునఁ దెలియవచ్చుచున్నది. ౧. దాయము. దత్తి ౨. పెఱ-పంగము ౩. కానుక-కడ్డాయము ౪. బిల్లఱ ౫. పుల్లరి ౬. పీసబడి ౭. సుంకము ౮. అడ్డగడ ౯. అంగటిముద్రసుంకము ౧౦. అడ్డసుంకము. శాసనాధారమున మనకుఁ దెలియవచ్చు పన్ను లివియే. ఈ పన్నులను 'అవనాయా' లందురు. అవనాయము లనఁగా రక్షణము కొఱకు ఏర్పడిన పన్నులని యర్థము.

## సుంకము

సుంక మనునది పన్నునకు సర్వసామాన్యపదము. భూమిమీఁద తీయునట్టిగాని రోడ్డరేవులయొద్దఁ దీయునట్టిగాని గ్రామము వెడలను కాని, సంతసావిడులనుగాని తీయు నిప్పటి 'ఆసీలుకంటో' శుల్కమునకు సుంక మని పేరు. ఈ యాసీలువంటి సుంకమును వసూలుచేయుటకు కొచ్చర్లకోట (ఒంగోలుతాలూకా) ఓరుగల్లు మొదలగు పట్టణరాజ ములలో సుంకపుపేట లుండెను. ఈసుంకపుపేటలలో 'పెఱిక'కు ఎంతో కొంత-చొప్పున సుంకము వసూలు చేయుచుండువారు. 'పెఱిక' యనఁగా ఎద్దు లోనగువానిమీఁద మోయించెడు గోనెమూట. ఈపెఱికలలో భేద ములు కలవు. పోతుపెఱిక యని-ఎద్దుపెఱిక యని-గాడిదపెఱిక యని. సరకుమోయించుట కెడ్లను గట్టిన నెద్దుపెఱిక. గాడిదలను గట్టిన గాడిద పెఱిక. ఇట్లే పోతుపెఱిక. ఎడ్లు గాడిదలు మొదలగునవి మోయఁ గలిగిన బరువులో విభేదముండుటవలన పోతుపెఱిక కొకవిధమునను-ఎద్దు పెఱిక కొకవిధమునను-గాడిదపెఱిక కింకొకవిధమునను సుంకము విధించు చుండువారు. ఈవిషయము బుట్టయతెంకి గోంకయరెడ్డి శాసనమువలన సువ్యక్త మగుచున్నది.[3]

సుంకపుపేటలలో విధించు సుంకములోఁగూడ దిగుమతిసరకుపై విధింపఁబడు పన్నునకు 'లోపలిసుంక' మనియు నెగుమతిసరకులపై విధింపఁ బడు పన్నునకు 'వెలుపలిసుంక' మనియుఁ బేరు.[౪] భూమిమీఁదఁ దీయు శుల్కమునకు మెట్టుసుంక మనియును, నేలసుంక మనియును, ఇతర సము ద్రాంతరములనుండి వచ్చు సరకుమీఁదను, దేశాంతరములకు సముద్రము మీఁద నెగుమతి యగు సరకుమీఁదను, విధింపఁబడు పన్నును గూడ సుంకమందురు.[౫] సుంకమును దీయు నుద్యోగులను సుంకరు లందురు. నేలసుంకము, లేక మెట్టుసుంకము-అనఁగా భూమిశిస్తు - వసూలు చేయు వారిని నేలసుంకరులందురు. అంగటిసరకులమీఁదఁ దీయు పన్నునకు 'అంగటిముద్రసుంకము' అని పేరు. దీనినే అంగటిసిద్ధాయ మనియు నందురు. లాభముమీఁదఁ దీయు పన్నునకు మాలవీసాలని యు,[౬] వీసబడి (శాసనముల 'విసాబడి') యనియుఁ గూడ నందురు. వర్తకులు చెల్లించు నిప్పటి రాబడి పన్ను Income-taxను, మాలవీసాలను ఒక్కటియే

---

౧. Dt. Manuel, Kurnool, Section 11, Page 52. ౨. కానుకలు, కట్నములు, దాయము, దత్తి మొదలగునవి నిజము నకుఁ బన్నుకు పర్యాయములలోఁ జేరవు. అవి బహుమతులు, దానములవంటివి. అయినను ఆయాయధికారులు దయదలంచి మానినఁనే గాని తప్పక యీయవలసినవియే యగుటచేత దానినిగూడఁ బన్ను పర్యాయములందుఁ జేర్చియున్నాను. 3. Dt. Munual, Kurnool Section 11, Page 52. ౪. Ep. Ind. Vol xi, p 188, Loc. Rec. Vol 4?, P 422, Ep. Rep. 602 of 190 . ౫. సంతలో నమ్మఁదెచ్చిన సరకుమీఁద సంతరాశికి 'తూములు' తీయుచుండువారు. ౬. Nel. Ins. Vol III, Glossary & Ep. Inds. Vol V, p 23, Note 6.

యని యూహింపవచ్చును. అంగడిముద్రసుంకముగాని సుంకముగాని సరకులమీఁద నే పద్ధతి ప్రకారము తీయువారో మనకు తెలిసికొనుటకు శాసనాధారము లేదియుఁ గానరావు. గాని కేతన రచించిన విజ్ఞానేశ్వరీయమున౧ నీ పద్ధతినిగురించి కొంత చెప్పఁబడియున్నది. [చూడు: ప్రాయశ్చిత్తకాండము 83, 85 పద్యములు.]

'అడ్డసుంక' మనియు, 'అడ్డగడ సుంక' మనియు నింక రెండు పన్ను లుండినవి. గొల్లెల సమ్మెవారికి విధించు పన్నును అడ్డసుంక మనియు వాడుకగఁ గొంతకొంత నియమిత కాలమునకుఁ జెల్లింపవలసిన పన్నును అడ్డగడసుంక మనియు నందురు. ఈ కడ్డాయ మనియొక పన్నుండినట్లు కాన్పించును. సరకులకు అధికారులు బలవంతముగ నమ్మి తీరవలెనని నియమించు ధర నే కడ్డాయ మందురు.

### నాణెములు

కాకతీయుల తామ్రశాసనములమీఁది ముద్రల ననుసరించియు నాణెములమీఁది ముద్రల ననుసరించియు నాణెములనుగూర్చి యీ క్రింది సంగతులు తెలియవచ్చుచున్నవి. కాకతీయులకు నందిముద్ర ప్రధాన చిహ్నము. నందికిపైన నొక ఛత్రమును ఇరుప్రక్కల నొక్కొక్క చామరమునుఁ గలవు. ప్రతాపరుద్రుని నాణెములలో బంగారువియు వెండివియు రాగివియుఁ గూడఁ గలవు. దక్షిణహిందూదేశపు నాణెములను గూర్చి వ్రాసిన ఎలియటు దొరగారు కాకతీయుల నాణెములను గొన్నిటిని సంపాదించియున్నారు. అందొక రాగినాణెము౩మీఁద నొక ప్రక్క నంది కలదు. ఆ నాణెమునకు మఱియొక ప్రక్క పురాతనపు నాగరాక్షరములతో "శ్రీమతు .........క.........కాకతి ప్రతాప రా......య(?)" అని వ్రాయఁబడియున్నది. మూఁడో మీఁద నొక ప్రక్క నంది కలదు. పణమునమీఁద నొక ప్రక్క కుడివైపుగ నంది కలదు. రెండవ ప్రక్క నేమియున్నదియుఁ దెలియరాలేదు. ఈపణము రమారమి గొంచెము తక్కువగ నేడుధాన్యపుగింజల యెత్తు కలదు. ఈ నాణెము లన్నియుఁ బ్రతాపరుద్రునివే యని చెప్పఁజాలము. కాని కాకతీయ నాణెముల పద్ధతి తెలిసికొనుట కివి కొంత వీనికిఁ దోడ్పడుచున్న వని యంగీకరింపక తీరదు.౬

కాకతీయులకాలమున నీక్రింది నాణెములు వాడుకలో నుండి నట్లు తెలియుచున్నది. ౧. చిల్లర (కొంచెపాటినాణెము) ౨. కర్షము (పదునాఱుమాషముల యెత్తు); 3. కార్షాపణము (పదియాఱు పణముల యెత్తు) పణములు రెండువిధములుగఁ గలవు. రాగిపణములని బంగారుపణములని. కర్షమెత్తు రాగిటంకమును పణ మందురు. హిందువులు ప్రభుత్వము చేసినంతకాలము పరంపరాగతముగ వచ్చుచుండిన నాణెముల పద్ధతియే చెల్లుచుండె నని యూహించుట కవకాశము కలదు. ఈ పణములను మాషములను గుఱించి విజ్ఞానేశ్వరీయమున వివరింపఁబడి యున్నది.

ఇదియిట్లుండఁగా పావులూరి మల్లన ప్రతాపరుద్రభూషణము గుఱించి యొక్కింత చెప్పియున్నాఁడు. దీని ననుసరించి కాకతీయుల కాలమున ప్రతాపమాడ యొకటి యుండె ననియు అప్పుడు చెల్లుచుండిన వరహాను ప్రతాపవరహా యని పేరుండె ననియుఁ దెలియవచ్చుచున్నది.

### ప్రత్యేకనాణెములు

మఱియును కొన్నికొన్ని ప్రదేశములలో ప్రత్యేకనాణెములు వాడుకలో నుండెను. కాకతీయులకు లోఁబడక స్వతంత్రులై పరిపాలించిన మహామండలేశ్వరులు తమ పేరఁ బ్రత్యేకనాణెములను వాడుక చేసియున్నారు. అట్టి ప్రత్యేకనాణెములలోఁ జేరినది గండగోపాల మాడ. ఈమాడ కాంచీపురమునను, తొండమండలమునను చెల్లుచుండెను. ప్రతాపరుద్రుని కాలమునకు కాంచీపురము రాజధానిగ తొండమండలమును విజయగండగోపాలుఁడు పరిపాలించుచుండెను. గండగోపాల బిరుదమును వహించిన పల్లవవంశీయులును తెలుఁగుచోళులును గండగోపాలమాడను వాడిరి. కాంచీనగరమును గణపతిదేవుఁడు జయించిన నాఁటినుండియు ఆప్రాంతీయ రాజులు కాకతీయులకు సామంతులుగ నుండి కప్పము కట్టుచుండిరి. కాకతి ప్రతాపరుద్రుని సైన్యాధిపతి కాంచీనగరమును జయించునప్పటికి ఆప్రాంతమునందు గండగోపాలమాడ వాడుకలో నుండినట్లు తెలియుచున్నది. ముప్పిడినాయంక పురుషుని దానశాసనము ననుసరించి యెన్ని పణములైన ఒక గండగోపాల మాడయో తెలియుచున్నది.

### సివిలు పరిపాలనము

ప్రతాపరుద్రుని కాలపు సివిలు పరిపాలనమును తెలిసికొనుట కాధారము లేదియుఁ గానరావు. కాని యాకాలమునఁ బ్రతి యాఖ్యాయోగమును పంచాయతీలవలనఁ బరిపాలింపఁబడుచుండినట్లును - నేరములను విచారించుటకై యట్టి పంచాయతీసభలను ఊరి దేవాలయమొక పుణ్యస్థలమున సమావేశపఱచుచుండినట్లును - క్రీడాభిరామములోని యీ క్రింది వివరములవలనఁ దెలియవచ్చుచున్నది

'అనుచు నటునని వేశ్యవాటంబు వెడలి భైరవాలయద్వారంబున పాడిపంతంబునం గూడినవారలఁ గాంచి లోకంబునం గనుంగొని యేమి ధర్మాసనంబుఁ దీర్చిన రాఁడో యని యడిగిన...

---

౧. విజ్ఞానేశ్వరీయ మను గ్రంథము యాజ్ఞవల్క్యస్మృతికిఁ దెలుగు. ఇది యొక పద్యకావ్యము: దీనిని రచియించినవాఁడు మూలఘటిక కేతనకవి. ధర్మశాస్త్రములను దెనిఁగించి పద్యకావ్యముగ వ్రాసినవాఁడు ఆంధ్రకవులలో నితఁ డొక్కఁడే. ఈతఁడు తిక్కన సోమయాజికాలమున నున్నవాఁడని యాతని యాంధ్రభాషాభూషణములోని 'కవిత చెప్పి' - యను గీతపద్యమును బట్టి స్థిరపడుచున్నది. గజపతుల కాలమునకును యాజ్ఞవల్క్యస్మృతి వాడుకలో నుండినట్లు కనఁబడుచున్నది. విజ్ఞానేశ్వరీయమున మూఁడు కాండలు గలవు (౧) ఆచారకాండ (౨) ప్రాయశ్చిత్త కాండ (3) వ్యవహారకాండము. రెడ్డిరాజుల యనంతరము రాజ్యముచేసిన గజపతులలో ప్రతాపరుద్రగజపతి సరస్వతీవిలాస మను ధర్మశాస్త్రమును రచియించెను. అంతవఱకు నధర్మశాస్త్ర విషయమున విజ్ఞానేశ్వరీయమే ప్రమాణముగ నుండినట్లు కాన్పించును. ౨. Brown's Telugu English Dictionary. 3. Elliot's Coins of Southern India, Page ... ౪. India, page 8. ౫. Elliot Collection No ... ౬. కాకతీయులకుఁ దరువాత తెలుఁగుదేశము నేలిన రెడ్డిరాజులును గాకతీయుల ముద్రలమీఁది చిహ్నములనే ధరించిరని వారి నాణెములమీఁది నంది, లింగము ఈ మొదలగువానినిబట్టి తెలియుచున్నదని ఇలియటుదొరగారు వ్రాయుచున్నారు. Elliot Page 102.

గీ. పిల్ల కోపముతో నిల్లు వెళ్లివచ్చి
తలవరుల కీ ప్రసంగ మంతయును జెప్ప
వారు రప్పించ వచ్చె నీవదరుజరభిం
.........ఇది గుల్లాము గాక.

ఈ విధమైన పంచాయతీసభమాత్రమే గాక రాజసభకూడ నుండె ననియుఁ దెలియుచున్నది. రాజసభలోని సభ్యులను గూర్చి విజ్ఞానేశ్వరీయ మిట్లు నుడువుచున్నది:—

ఆ. వె. వివేకిఁ గల్గువారి, వేదజ్ఞు లగువారి,
సత్యధనుల, ధర్మశాస్త్రవిదుల
ద్వేష రాగరహితవిప్రుల, హితుల, స
భ్యులుగఁ జేయవలయు భూవిభుండు

కం. అవిప్రు లెవ్వ రైనను
నేవురు మువ్వురును నైన నిమ్మహిలోఁ జన్
భావితసభ యగుఁ గావున
మూవు రవశ్యంబు వలయు ముఖ్యులు సభకున్.

### అగ్రహారములు - సభలు

పైసభలుగాక యగ్రహారములకుఁ బ్రత్యేకసభ లుండినట్లు కరి వేనకైఁయతలవలన విశద మగుచున్నది. బ్రాహ్మణగ్రామములకు నాంధ్రదేశమున నగ్రహారము లనియును తమిళదేశమున మంగలము లనియుఁ బేరు. తమిళుల యాచారముల ననుసరించిన తెలుఁగు చాళుక్యచోళుల కాలమున నాంధ్రదేశమునఁగూడ నగ్రహారములకు బదులుగ మంగలములు మొలకలెత్తినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది.[3] ఇట్టి మంగలములలోను అగ్రహారములలోను నుండిన సభలను గమనించియే ప్రతిగ్రామము నొక చిన్న స్వతంత్రరాజ్య మని యాంగ్లేయు లభివర్ణించి యున్నారు.[4] ఈ మంగలములలోని సభల నిర్మాణపద్ధతిని గురించియును స్వరూపస్థితిని గురించియును తమిళశాసనములందు సంపూర్తిగఁ దెలుపఁబడియున్నది కాని యాంధ్రదేశములోని యగ్రహారములందలి సభలను గురించిన వివరము లేవియుఁ దెలియరావు. అయినను దక్షిణదేశమునందలి మంగలసభలకును తెలుఁగుదేశమునందలి యగ్రహారసభలకును వానినిర్మాణమునందును వ్యవహారమునందును ఒండొంటికిఁ గొన్నికొన్ని పోలిక లుండియుండు నని మన మూహింపవచ్చును.

౧. శ్రీడాభిరామము. పుట ౩౧, ప ౨౬౪-౫. ౨. Loc. Rec. Vol 55, Page 131. 3. Ep. Ind. Vol V. Pp 70-9. ౪. Srs Charle, (Aftrwams Lond) Metcalfe-Vide Dor Manual, Finne Velly, 21. ౫. Ep. Coll. nos 1 and 2 of 1898.

## అస్పృశ్యులా?

యన్. శాస్త్రి గారు



ఎవ రస్పృశ్యులు? మాతృదేశ వినిమోచేచ్ఛావిరుద్ధక్రియా
ప్రవణాసహ్య వినూత్న సంస్కరణ డంబ వ్యూహ నిర్భేద సైం
ధవులా? భిన్నమత ప్రబోధ పరిఘాత వ్రాతవిచ్ఛేది మా
ర్గ్రవమాన ప్రతిరోధ బాంధవుల? యత్యాచార మిందేదియో? ౧

ఎవ రస్పృశ్యులు? తోడఁబుట్ల నవమానింపించు నారాజకీ
యవిధానంబున దాస్య మీఁకొను నగస్త్యభ్రాతలా? విశ్వమా
నవసౌభ్రాత్రమునన్ సహోదర పదాఖ్యద్భక్తిమై భారతీ
యవిధానంబున కేవగింపని యనాద్యభ్రాతలా! యెంచుఁడీ. ౨

# యుద్ధమల్లుని బెజవాడ శాసనము - ఈ యుద్ధమల్లుఁ డేకాలపువాఁడు?

కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు.

'సత్యాశ్రయ' యనఁ జాళుక్యుఁ డనియు, బెజవాడ యుద్ధమల్లుఁడు చాళుక్యుఁడే యనియు నే నిదివఱకు నాంధ్రపత్రిక సారస్వతానుబంధమునందు శాసనప్రమాణములతో నిశ్చయపఱచితిని. ఇప్పుడు ఆ చాళుక్యయుద్ధమల్లుఁ డెవఁడు? ఏ నాఁటి వాఁడు? అని శాసనప్రమాణముల సాయమునసే తెలిసికొనుటకు యత్నించెదను.*

శ్రీ బ్రహ్మయ్య శాస్త్రిగారి మతమున నీ యుద్ధమల్లుఁడు చాళుక్యుఁడు కానేకాఁడు. ఒకవేళ చాళుక్యుఁడే యైనను నన్నయకుఁ దరువాతివాఁడే కాని పూర్వుఁడు కానేకాఁడు! ‡ఇట్టి ద్వంద్వవాదము పెట్టుటచేత, చాళుక్యుఁడు కాఁడన్న మాటయందును శాస్త్రులవారికి పూర్తిగ నమ్మకలే దనియు, నన్నయకుఁ దరువాతివాఁ డన్న మాటయందుఁ గూడ పూర్తిగ నమ్మకము లేదనియుఁ, దేటపడుచున్నది. చాళుక్యుఁడు కాకపోవుటయే నిజమగునేని తరువాతి చాళుక్యుఁ డెట్లగును? తరువాతి చాళుక్యుఁడే యగుట నిశ్చయమేని చాళుక్యుఁడు కాకపోవుట యెట్లు సంభవించును?

## శాసనపు రాతిని అడుగుఁడు

మనము విశేషము శ్రమచేయక శాసనముగల రాతినే శ్రద్ధతో నడిగినయెడల నదియే మనకు తనకాలమును తెలుపఁగలదు. యుద్ధమల్లుని శాసనపు స్తంభమునకు నాలుగు ప్రక్కలు గలవు. శాసనము ప్రారంభింపఁబడిన వైపును మనము ఎదుటిప్రక్క యందము. దాని తరువాతిభాగము దానికి యెడమప్రక్క నున్నది. దానిపైని క్రిందినుండి పైకి వ్రాయఁబడినది. చివరపంక్తి యసంపూర్తిగ విడువఁబడినది. ఎదుటి ప్రక్కకుఁ గుడిప్రక్కను కొంతవఱకు శాసనము చెక్కఁబడి యసంపూర్తిగ విడిచివేయఁబడినది దానిక్రింద ఆ ప్రక్కననే తరువాతికాలమున ఈశ్వరభట్ట సోమయాజు లొక శాసనమును చెక్కించెను. ఈ మూఁడు ప్రక్కలు గాక వెనుకవైపున నున్నదానిని మనము వెనుకప్రక్క యందము. అం దేమున్నది? మొదటే యుద్ధమల్లుని శాసనమువంటి మూఁడు అక్షరములు "ంబుఙ్గా" అనునవి కలవు. వానికి క్రింద కులోత్తుంగచోళుని పరిపాలన కాలములో 41-వ ఏట చెక్కించిన అఱవ శాసన మొక్కటి కలదు.

## ఈశ్వరభట్టు శాసనము

యుద్ధమల్లుని శాసనమునకుఁ దరువాత నదేరాతిమీఁదఁ జెక్కఁబడిన పై రెండుశాసనములలో ఆయాశాసనములకాలము లియ్యఁబడినవి. కాన యుద్ధమల్లుని శాసన మంతకుముందే చెక్కఁబడెనని యా శాసనము లుద్ఘోషించుచున్నవి. కుడిప్రక్కనున్న యీశ్వరభట్టు శాసనముఁ దీసికొందము. అందలి శకము 1087 (క్రీ. శ. 1165) అని రామయ్య పంతులవారు వ్రాసిరి. అది 1019 (క్రీ. శ. 1097) అని జగన్నాథరావుగా రనుచున్నారు. కాని వాదసౌకర్యమునకై బ్రహ్మయ్యగారి కనుకూలమైన 1087 నే తీసికొందము. యుద్ధమల్లుని శాసన మింతకుఁ బూర్వపుదియై యుండవలయును గదా! కావున అసలు శాసనము వ్రాయించిన యుద్ధమల్లుఁడు శా. శ. 1087 అనగా క్రీ. శ. 1165-వ యేటికి పూర్వమే రాజ్యము చేసినవాఁడు అయియుండవలెను.

## కులోత్తుంగునినాటి శాసనము

ఇఁక వెనుకప్రక్క నున్న అఱవ శాసనము యుద్ధమల్లుని శాసనపు మూఁడక్షరముల క్రింద వ్రాయఁబడినది. అయ్యది కులోత్తుంగుఁడు రాజ్యమునకు వచ్చిన తర్వాత 41-వ సంవత్సరమున చెక్కింపఁబడినది. అనగా శా. శ. 1026 (క్రీ. శ. 1104) నాటిది. తస్మాత్-యుద్ధమల్లుని శాసనమును-అది వేయించిన యుద్ధమల్లుఁ డను చాళుక్యరాజును-క్రీ. శ. 1104 కంటె పూర్వపువా రనుట నిశ్చయము.

ఇచ్చట వెనుకప్రక్కను యుద్ధమల్లుని శాసనాక్షరములవంటి మూఁ డక్షరములు-సందర్భము లేనివి-మొదట ఎట్లు చెక్కఁబడియె నని చదువరులకు సంశయము కలుగవచ్చును. కాని కొంచెము వితర్కబుద్ధితో శాసనమును రాతిని పరికించినయెడల ఈ సంశయము తీరఁగలదు. మొదట శాసనము నాలుగు ప్రక్కలను చెక్కించుటకు నిశ్చయింపఁబడి సుతారి మొదట బొగ్గుతోనో సున్నముతోనో మఱి వేఱువర్ణముతోడనో నాలుగువైపులను చెక్కవలసిన యక్షరము లన్నియు వ్రాసికొని యుండును. తరువాత వాని యుప్పప్రకారము అక్షరములను చెక్కఁ మొదలుపెట్టెను. ఈ ప్రకారము చెక్కుచువచ్చి యెదుటిప్రక్క పూర్తిగఁ జెక్కెను. ఎడమప్రక్క పూర్తిగఁ జెక్కెను గాని చివరపంక్తిమాత్రము పూర్తిగఁ జెక్కలేదు. ఆ పంక్తి పూర్తిగఁ జెక్కియుండినయెడల వెనుకప్రక్క నున్న "ంబుఙ్గా" అను అక్షరములతో సంబంధము

---

* చూఁడు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము, దుర్మతి మాఘ బ॥ ౬, శనివారము.

‡ ఒకవాది కోర్టులో 'ప్రతివాది నాయొద్దనుండి వేయిరూపాయలు అప్పు తీసికొనెను, ఇప్పించవలసినది' అని వ్యాజ్యెము వేయగా 'నేను వాదియొద్దనుండి యెన్నఁడును అప్పుతీసికొనలేదు. ఒకవేళ తీసికొంటి ననుకొన్నను, వాది చెప్పెడి మొత్తముకంటె తక్కువగా-అనఁగా 1500 రూపాయలు నే నిదివఱకే తీర్చివేసినాను' అని ప్రతివాది ప్రత్యుత్తరము చెప్పిన నెట్లుండునో యట్లే బ్రహ్మయ్యశాస్త్రిగారి ఈద్వంద్వవాద మున్నది.

సీ. పిల్ల కోపంబుతో నిల్లు వెళ్లివచ్చి
తలవరుల కీ ప్రసంగ మంతయును జెప్ప
వారు రప్పింప వచ్చె నీవదరుబరలిగ
.........ఇది గుల్లాము గాక.

ఈ విధమైన పంచాయతీసభమాత్రమేగాక రాజసభకూడ నుండె ననియుఁ దెలియుచున్నది. రాజసభలోని సభ్యులను గూర్చి విజ్ఞానేశ్వరీయ మిట్లు నుడువుచున్నది:—

ఆ. వె. వినికిఁ గల్గువారి, వేదజ్ఞు లగువారి,
సత్యయుతుల, ధర్మశాస్త్రవిదుల
ద్వేష రాగరహితవిప్రుల, హితుల, స
భ్యులుగఁ జేయవలయు భూవిభుండు

కం. ఆవిప్రు లేడ్వు రైనను
నేవురు ముగ్వురును నైన నిమ్మహిలోనన్
భావితసభ యగుఁ గావున
మూవు రవశ్యంబు వలయు ముఖ్యులు సభకున్.

## అగ్రహారములు - సభలు

పైసభలుగాక యగ్రహారములకుఁ బ్రత్యేకసభ లుండినట్లు కరివెనకైశీయతుకలన౫ విశద మగుచున్నది. బ్రాహ్మణగ్రామములకు నంధ్రదేశమున నగ్రహారము లనియును తమిళదేశమున మంగలము లనియుఁ బేరు. తమిళుల యాచారముల ననుసరించిన తెలుఁగు చాళుక్యచోళుల కాలమున నాంధ్రదేశమునఁగూడ నగ్రహారములకు బదులుగ మంగలములు మొలక లెత్తినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ౩ ఇట్టి మంగలములలోను అగ్రహారములలోను నుండిన సభలను గమనించియే ప్రతిగ్రామము నొక చిన్న స్వతంత్రరాజ్య మని యాంగ్లేయు లభివర్ణించియున్నారు. ౪ ఈ మంగలములోని సభల నిర్మాణపద్ధతిని గుఱించియును వ్యవహారస్థితిని గురించియును తమిళశాసనములందు సంపూర్తిగఁ దెలుపఁబడియున్నది కాని యాంధ్రదేశములోని యగ్రహారములందలి సభలను గుఱించిన వివరము లేవియుఁ దెలియరావు. అయినను దక్షిణదేశమునందలి మంగలసభలకును తెలుఁగుదేశమునందలి యగ్రహారసభలకును వానినిర్మాణమునందును వ్యవహారమునందును ఒండొంటికిఁ గొన్నిగొన్ని పోలిక లుండియుండు నని మన మూహింపవచ్చును.

౧. శ్రీడాభిరామము. పుట ౩౧, ప ౨౬౪-౫. ౨. Loc. Rec. Vol 55, Page 131. 3. Ep. Ind. Vol V. Pp 70-9. ౪. Srs Charle, (Aftrwams Lond) Metcalfe-Vide Dor Manual, Finne Velly, ౨౧. ౫. Ep. Coll. nos 1 and 2 of 1898.

# అస్పృశ్యులా?

యస్. శాస్త్రి గారు

ఎవ రస్పృశ్యులు? మాతృదేశ వినిమోక్షేచ్ఛావిరుద్ధక్రియా
ప్రవణాసహ్య వినూత్న సంస్కరణ డంబ వ్యూహ నిర్భేద సైం
ధవులా? భిన్నమత ప్రబోధ పరిభూత వ్రాతవిచ్ఛేది మా
త్రవమాన ప్రతిరోధ బాంధవుల? యత్యాచార మిందేదియో? ౧

ఎవ రస్పృశ్యులు? తోడఁబుట్ల నవమానింపించు నారాజకీ
యవిధానంబున దాస్య మీఁగొను నగస్త్యభ్రాతలా? విశ్వమా
నవసౌభ్రాత్రమునన్ సహోదర పదాఖ్యద్భక్తిమై భారతీ
యవిధానంబున సేవగింపని యనాద్యభ్రాతలా! మెంచుఁడీ. ౨

# యుద్ధమల్లుని బెజవాడ శాసనము - ఈ యుద్ధమల్లుఁ డేకాలపువాఁడు?

కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు.

'సల్కి' యనఁ జాళుక్యుఁడనియు, బెజవాడ యుద్ధమల్లుఁడు చాళుక్యుఁడే యనియు నే నిదివఱకు నాంధ్రపత్రిక సారస్వతానుబంధమునందు శాసనప్రమాణములతో నిశ్చయపఱచితిని. ఇప్పుడు ఆ చాళుక్యయుద్ధమల్లుఁ డెవఁడు? ఏ నాఁటి వాఁడు? అని శాసనప్రమాణముల సాయముననే తెలిసికొనుటకు యత్నించెదను.*

శ్రీ బ్రహ్మయ్య శాస్త్రిగారి మతమున నీ యుద్ధమల్లుఁడు చాళుక్యుఁడు కానేకాఁడు. ఒకవేళ చాళుక్యుఁడే యైనను నన్నయకుఁ దరువాతివాఁడే కాని పూర్వుఁడు కానేకాఁడు! ‡ఇట్టి ద్వంద్వవాదము పెట్టుటచేత, చాళుక్యుఁడు కాఁడన్నమాటయందును శాస్త్రులవారికి పూర్తిగ నమ్మికలేదనియు, నన్నయకుఁ దరువాతివాఁడన్న మాటయందుఁ గూడ పూర్తిగ నమ్మకము లేదనియుఁ, దేటపడుచున్నది. చాళుక్యుఁడు కాకపోవుటయే నిజమగునేని తరువాతి చాళుక్యుఁ డెట్లగును? తరువాతి చాళుక్యుఁడే యగుట నిశ్చయమేని చాళుక్యుఁడు కాకపోవుట యెట్లు సంభవించును?

## శాసనపు రాతిని అడుగుఁడు

మనము విశేషము శ్రమచేయక శాసనముగల రాతినే శ్రద్ధతో నడిగినయెడల నదియే మనకు తనకాలమును తెలుపఁగలదు. యుద్ధమల్లుని శాసనపు స్తంభమునకు నాలుగు ప్రక్కలు గలవు. శాసనము ప్రారంభింపఁబడిన వైపును మనము ఎదుటిప్రక్క యందము. దాని తరువాతిభాగము దానికి నెడమప్రక్క నున్నది. దానిపైని క్రిందినుండి పైకి వ్రాయఁబడినది. చివరపంక్తి యసంపూర్తిగ విడువఁబడినది. ఎదుటి ప్రక్కకుఁ గుడిప్రక్కను కొంతవఱకు శాసనము చెక్కఁబడి యసంపూర్తిగ విడిచి వేయఁబడినది దానిక్రింద ఆ ప్రక్కననే తరువాతికాలమున ఈశ్వరభట్ట సోమయాజి యొక శాసనమును జెక్కించెను. ఈ మూఁడు ప్రక్కలు గాక వెనుకవైపున నున్నదానిని మనము వెనుకప్రక్క యందము. అం దేమున్నది? మొదటి యుద్ధమల్లుని శాసనమువంటి మూఁడు అక్షరములు "ంబుణ్డు" అనునవి కలవు. వానికి క్రింద కులోత్తుంగచోళుని పరిపాలన కాలములో 41-వ ఏట చెక్కించిన అఱవ శాసన మొక్కటి కలదు.

## ఈశ్వరభట్టు శాసనము

యుద్ధమల్లుని శాసనమునకుఁ దరువాత నదేరాతిమీఁదఁ జెక్కఁబడిన పై రెండుశాసనములలో ఆయాశాసనముల కాలము వ్రాయఁబడినవి. కాన యుద్ధమల్లుని శాసన మంతకుముందే చెక్కఁబడెనని యా శాసనము లుద్ఘోషించుచున్నవి. కుడిప్రక్కనున్న యీశ్వరభట్టు శాసనముఁ దీసికొందము. అందలి శకము 1087 (క్రీ. శ. 1165) అని రామయ్య పంతులవారు వ్రాసిరి. అది 1019 (క్రీ. శ. 1097) అని జగన్నాథరావుగారనుచున్నారు. కాని వాదసౌకర్యమునకై బ్రహ్మయ్యగారి కనుకూలమైన 1087 నే తీసికొందము. యుద్ధమల్లుని శాసన మింతకుఁ బూర్వపుదై యుండవలయును గదా! కావున అసలు శాసనము వ్రాయించిన యుద్ధమల్లుఁడు శా. శ. 1087 అనగా క్రీ. శ. 1165-వ యేఁటికి పూర్వమే రాజ్యము చేసినవాఁడు అయియుండవలెను.

## కులోత్తుంగునినాఁటి శాసనము

ఇఁక వెనుకప్రక్క నున్న అఱవ శాసనము యుద్ధమల్లుని శాసనపు మూఁడక్షరముల క్రింద వ్రాయఁబడినది. అయ్యది కులోత్తుంగుఁడు రాజ్యమునకు వచ్చిన తర్వాత 41-వ సంవత్సరమున చెక్కింపఁబడినది. అనగా శా. శ. 1026 (క్రీ. శ. 1104) నాఁటిది. తస్మాత్-యుద్ధమల్లుని శాసనమును-అది వేయించిన యుద్ధమల్లుఁడును చాళుక్యరాజును-క్రీ. శ. 1104 కంటె పూర్వపువారనుట నిశ్చయము.

ఇచ్చట వెనకప్రక్కను యుద్ధమల్లుని శాసనాక్షరములకంటె మూఁడక్షరములు-సందర్భము లేనివి-మొదట ఎట్లు చెక్కఁబడియె నని చదువరులకు సంశయము కలుగవచ్చును. కాని కొంచెము విమర్శబుద్ధితో శాసనమును రాతిని పరికించినయెడల ఈ సంశయము తీరఁగలదు. మొదట శాసనము నాలుగు ప్రక్కలను చెక్కించుటకు నిశ్చయింపఁబడి సుతారి మొదట బొగ్గుతోనో సున్నముతోనో మఱి వేఱువర్ణముతోడనో నాలుగువైపులను చెక్కవలసిన యక్షరము లన్నియు వ్రాసికొని యుండును. తరువాత వాని యిష్టప్రకారము అక్షరములను చెక్కుచుఁ బోయెను. ఈ ప్రకారము చెక్కుచువచ్చి యెదుటిప్రక్క పూర్తిగఁ జెక్కెను. ఎడమప్రక్క పూర్తిగఁ జెక్కెను గాని చివరపంక్తిమాత్రము పూర్తిగఁ జెక్కలేదు. ఆ పంక్తి పూర్తిగఁ జెక్కియుండినయెడల వెనుకప్రక్క నున్న "ంబుణ్డు" అను అక్షరములతో సంబంధము

---

* చూడుఁడు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము, దుర్మతి మాఘ బ॥ ౬, శనివారము.

‡ ఒకవాది కోర్టులో 'ప్రతివాది నాయొద్దనుండి వేయిరూపాయలు అప్పు తీసికొనెను, ఇప్పించవలసినది' అని వ్యాజ్యము వేయగా 'నేను వానియొద్దనుండి యెన్నఁడును అప్పుతీసికొనలేదు. ఒకవేళ తీసికొంటినన్నను, వాని చెప్పెడి మొత్తముకంటె హెచ్చుగా-అనఁగా 1500 రూపాయలు నేనిదివఱకే తీర్చివేసినాను' అని ప్రతివాది ప్రత్యుత్తరము చెప్పిన టెట్లుండునో యట్లే బ్రహ్మయ్యశాస్త్రిగారి ఈద్వంద్వవాద మున్నది.

కల్గియుండును. ఈ వెనుకప్రక్క మూడు అక్షరములు మాత్రము చెక్కి మిగత పన్నియు చెక్కలేదు. కుడిప్రక్కన తొమ్మిది పంక్తులు పూర్తిగను పదవ పంక్తిలో మూడక్షరములు మాత్రమును చెక్కి మిగతభాగము అసంపూర్తిగ వదలెను. ఒకవేళ వెనుకప్రక్క యక్షరములు కుడిప్రక్క యక్షరముల తరువాతివి యైనను అయియుండవచ్చును. కుడిప్రక్క వంతయు చెక్కియుండినయెడల సందర్భము కలిసియుండునేమో.

శాసనములు, చెక్కువాఁడు శాసనాక్షరములు ఒకటి తరువాత నొకటి క్రమముగాఁ జెక్కుకొని రాక అక్కడ కొన్ని యక్షరములు ఇక్కడ కొన్ని యక్షరములు చెక్కుట యొక వింత కాదు. ఇప్పుడు పటాదుల కొరకై బిమ్మలను చెక్కెడి ఎన్‌గ్రేవర్లు ఈలాగే చేయుచుందురు వారివారి పీలు ప్రకారమును, సోలుపుగ చెక్కుట వీసిగత్తెడి పని యైనందునను, ఒకప్పుడీవైపు మఱియొకప్పుడావైపు ఒకతూరి ఈమూల మఱియొకతూరి యామూల చెక్కి, చివరకు పని యంతయుఁ బూర్తిచేయుదురు. యుద్ధమల్లుని శాసనము చెక్కిన పనివాఁడును ఇట్లే చేసియుండును. కాని, ఏ కారణముచేతనో పనియంతయు పూర్తిచేయలేక పోయెను. పూర్తిచేయులోగ పనివానికేదైన నాపద సంభవించెనో లేదా రాజునకేదైన నాపద సంభవించెనో మనము చెప్పఁజాలము.

ఇదియొక్క శాసనమా? పెక్కుశాసనములా? యను చిన్న వాద మొకటిగలదు. కాని యీశాసనమంతయు నొక్కచేతివ్రాతతో వ్రాయఁబడినది గాన నొక్కశాసనమని చెప్పుటయే సమంజసమని నా యభిప్రాయము.

## తేలిన సారాంశము

ఇంతకు తేలినవిషయ మేమన - శాసనము చెక్కించిన చాళుక్య యుద్ధమల్లుఁడు క్రీ. శ. 1104 కు పూర్వపువాఁడు. శాసనమునందు ఇతనికే మల్లఁడు అను మాఱుపేరు కలదు. 'నామైకదేశగ్రహణే నామగ్రహణం' అన్న నియమము కొన్ని శబ్దములకు చెల్లును. సంస్కృతము నందు సత్యభామాదు లిటువంటివి. తెనుఁగులో వెంకటప్పయ్య వెంకడ లగునవి యిట్టివి. అట్టిదే యుద్ధమల్ల శబ్దము. యుద్ధమల్లుని మల్లఁడన వచ్చును. ఈ యుద్ధమల్లుని తాత మల్లపరాజు అని శాసనమునందుఁ గలదు.

ఇక క్రీ. శ. 1104 పూర్వము పూర్వచాళుక్యులలో యుద్ధమల్లు లెవరైనఁ గలరా యని పూర్వశాసనములను శోధింపగా ఇద్దరు యుద్ధమల్లులు మాత్రము గానవచ్చుచున్నారు. ఒకఁడు క్రీ. శ. 844 మొదలు 888 వఱకు రాజ్యము చేసిన గుణగవిజయాదిత్యుని కడగొట్టు తమ్ముఁడు. ఇతఁడు రాజ్యము చేసినట్లు కానరాదు. రెండవవాఁడు ఇతని మనమఁడైన యుద్ధమల్లుఁడు. ఇతఁడు క్రీ. శ. 927-934 వఱకు ఏడు సంవత్సరములు రాజ్యమేలెను. ఈతఁడే బెజవాడలోని శాసనము వేయించినవాఁడని మనము గట్టిగ నిశ్చయింపవచ్చును. ఏలయన నితని తాతయైన యుద్ధమల్లుఁ డీశాసనము వేయించెనని యందుమేని అతనికి మల్లపరాజు అనిగాని యుద్ధమల్లుఁ డనిగాని పేరుగల తాత లేఁడు. అతని తాత కలి విష్ణువర్ధనుఁడు. ఇదియుఁగాక నీ యుద్ధమల్లుఁడు రాజ్యము చేయలేదు. శాసనము వేసిన యుద్ధమల్లుఁడు ఆకాలమున రాజ్యము చేయుచున్నట్లు ఆ శాసనమునందే స్పష్టముగా చెప్పఁబడి యున్నది. తాళపరాజు కుమారుఁడైన ఈ రెండవ యుద్ధమల్లుని మల్ల, మల్లప యను నామములతో కూడ వ్యవహరించుచుండిరని యితరశాసనములు చెప్పుచున్నవి. C.P.No 1. of 1916-17; C.P.No [illegible]. of 1908-9) (1) కావున నీ యుద్ధమల్లుఁడే శాసనకర్తయని మనము నిస్సంశయముగను నిశ్చయముగను నొక్కి చెప్పవచ్చును.

## పూర్వపక్షము

ఇందుపై బ్రహ్మయ్యగారి చిన్న పూర్వపక్ష మొకటి కలదు. అది యితరు లెవరైన చేసియున్నయెడల నవ్వి యూరకుండి యుందును. బ్రహ్మయ్యగారి మాటకుగాను ప్రత్యుత్తరము చెప్పవలసివచ్చినది. బెజవాడశాసనకర్త 'యుద్ధమల్లుఁడు' లేక 'మల్లుఁడు' మాత్రము అఁట! అతనిని 'మల్లప' యని అనకూడదఁట. అతనితాత మల్లప అఁట. ఆ తాతను మల్ల, యుద్ధమల్ల అని అనకూడదఁట. బెజవాడ యుద్ధమల్లుని తాతపేరు ఎచ్చట చూచినను యుద్ధమల్లుఁడని యుండును గాని మల్లప యని యుండదు. కావున ఈ యుద్ధమల్లుఁడు బెజవాడ శాసనపు యుద్ధమల్లుఁడు కాఁడని బ్రహ్మయ్యగారి సిద్ధాంతము. కాని మల్ల, మల్లప యను నామము లొక్కటియే యనియు 'ప' యనునది గౌరవార్థ ప్రత్యయమైన 'అప్ప' అనునదియే యనియు, మూలనామములోని భాగము కాదనియు, ఏ ప్రమాణము లేకయే తెలుఁగుదేశమంతటి బాలురుగూడ ఒప్పెదరని నా నిశ్చయము. ప్రమాణమే కావలయు నన్న రెండవ యుద్ధమల్లునికి మల్లపయను పేరు గలదని చెప్పు నేము పైన నుదాహరించిన శాసనములును శాస్త్రిగారి మల్లని పిఠాపురపు శాసనమును చాలును. ఇక మనమనికి తాతకు నొక్కపేరుండుటయందు వింతయేమియు లేదు. మనమఁడగు రెండవ యుద్ధమల్లునకు శాసనమునందే యుద్ధమల్లుఁడు మల్లుఁడను రెండు నామములు కలవనియు, తాతకు మల్లపనామము గలదనియు బ్రహ్మయ్యగారే ఒప్పుకొనిరి. ఇక తాతకు వచ్చిన మల్లనామము మనుమనికి వచ్చెనేని యుద్ధమల్ల శబ్దముయొక్క ఏకదేశమని మనమూహించుట సహజమైన యూహయే గాని వేరు కాదు; వింత కాదు.

## శ్రీ బ్రహ్మయ్యగారి మల్లఁడు

ఇట్లు బెజవాడశాసనము గుణకవిజయాదిత్యుని తమ్ముని మనమనిచే వేయించఁబడెనని శాసనప్రమాణములవలన స్థిరపడుచుండగ ఈ వాద మింతటితో ఆగవలసినదే. కాని బ్రహ్మయ్య శాస్త్రిగారు తాతకు మనుమనికి మల్లనామధేయము గలవాని నొకనిని క్రీ. శ. 1204-వ సంవత్సరము పట్టాభిషిక్తుఁ డైనవానిని బ్రహ్మరథముబట్టి తీసికొనివచ్చి - వాఁడే వీఁడని - అట్టహాసము చేసినందున ఆ భాగమునకు కొంచెము జవాబు చెప్పవలసి యున్నది.

శ్రీ బ్రహ్మయ్యగారి మల్లఁడు బెజవాడశాసనము వేసినవాఁడు కానేరఁడు. ఇందుకు నీ క్రింది యేడు కారణములు కలవు:— (౧) బ్రహ్మయ్యగారి మల్లఁడు క్రీ. శ. ౧౨౦౪ లో రాజ్యమునకు వచ్చెను. (౨) బ్రహ్మయ్యగారి ప్రమాణ మప్రమాణము. (3) వీఁడు మల్లఁడు; యుద్ధమల్లుఁడు కాఁడు. (౪) కాలవిపర్యాస దోషభూయిష్ఠము కావున నాలేఖ నమ్మఁదగినది కాదు. (౫) ఇద్దఱి శాసనముల భావలకు భేదము కలదు. (౬) అక్షరములకు భేదము కలదు. ఇందలి యొక్కొక్క హేతువును కొంచెము వివరించెదను.

(౧) యుద్ధమల్లుని బెజవాడశాసనము క్రీ. శ. ౧౧౦౮-వ సంవత్సరమునకుఁ బూర్వకాలపుది యని హైని స్థిరపడినది. ఇఁక క్రీ. శ. ౧౨౦౮-లోఁ గాని పట్టాభిషిక్తుఁడు కాని రాజు నూఱుసంవత్సరముల క్రిందటనే బెజవాడ శాసన మెట్లు చెక్కించెనో బ్రహ్మయ్యగారే చెప్పవలెను!

(౨) బ్రహ్మయ్యగారు తాత 'మల్లప మాత్రము' మనుమఁడు 'మల్ల మాత్రము' ఉండి రనుటకు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్న దని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరని యొక ప్రాచీన విలేఖను 'మఖిప మఖి' గా ఉదాహరించిరి. కాని యీ లేఖ వ్రాసినవాఁ డెవఁడు? ఎప్పుడు వ్రాసెను? ఏ యాధారమున వ్రాసెను? అను ప్రశ్నలు వారు వేసికొనలేదు. వానికి జవాబు చెప్పుటకుఁ బ్రయత్నింపలేదు. ఈ ప్రశ్నలకు జవాబులేని లేఖను ఎవరైనను ప్రమాణముగఁ దీసికొందురా? ఇది అనామికము. కాలము తెలియదు. దేనిని పట్టి యెవరు వ్రాసినది తెలియదు. బహుశః పిఠాపురమునందలి మల్లుని శాసనము బాగుగ చదువలేనివాఁ డెవఁడో ఆ శాసనము సారాంశము ఇందు వ్రాసియుండును. బ్రహ్మయ్యగారిమల్లుఁడు వేసిన శాసనమే పిఠాపురములో నుండఁగా-దాని ప్రతి సప్రమాణ మైనది ఎపిగ్రాఫియా ఇండికా యొక్క నాల్గవసంపుటమునందుఁ బ్రకటింపఁబడి యుండఁగా-దానిని జారవిడిచి, తప్పుల తడికగా నున్న యీ అనామికలేఖను బ్రహ్మయ్యగారు గొప్పప్రమాణముగా ముందునకుఁ దెచ్చుట చూడ, అసలు శాసనములోనే బ్రహ్మయ్యగారికి ప్రబల ప్రతికూల మైనమాట లున్నవని మనము నిశ్చయించుకొనవచ్చును. అందు శాసనకర్తయు ౧౨౦౮లో రాజ్యాధిపతి యైనవాఁడును అగు మల్లునికి 'మల్లపరాజు' అనికూడ నామ మున్నది. (చూఁడు 87-వ పంక్తి 'మల్లపదేవచక్రవర్తి') ఇది శాస్త్రిగారి కిష్టము లేదు. వారి వాదమునకు వ్యతిరేకము. వారి మతమున తాతయే మల్లపగా నుండవలెను. అనామికలేఖలో నట్లున్నది. కావున నిది ప్రమాణము. ఈ శాసనమందు నట్లులేదు. కావున నిది యప్రమాణము!

(3) బ్రహ్మయ్యగారి మల్లుని శాసనములం దన్నిటిలోను అతని పేరు మల్లపరాజు, మల్లభూపాలుఁడు అని వచ్చునే గాని ఎచ్చటను 'యుద్ధమల్లుఁ' డని రాదు. కావున వీఁడే యుద్ధమల్లుఁ డనుట సాహసము కాదా? బెజవాడ శాసనమునందు యుద్ధమల్ల మల్లనామములు రెండును వచ్చినవి గదా! వానిలో నేది యున్నను చాలదా యందురేమో? యుద్ధమల్లుఁ డన్న మల్లుఁ డనుటకు వేఱు ప్రమాణ మక్కఱ లేదు గాని మల్లుఁ డని యున్నయెడల వానికి యుద్ధమల్లుఁ డనికూడఁ బేరుండె ననుటకు వేఱు ప్రమాణ ముండవలెను. వేంకటప్పయ్యను అప్పయ్య యందురు. కాని అప్పయ్యను వేంకటప్పయ్య అందురా?

ఇదియుఁ గాక వేంకటప్పయ్య అనువాఁడు తనపేరు చెప్పుకొనవలసివచ్చినప్పుడు కృత్యాదికముల యిబ్బందియున్నఁ గాని అప్పయ్య అని చెప్పుకొనఁడు. వేంకటప్పయ్య యనియే చెప్పుకొనును. అట్లే బ్రహ్మయ్యగారి మల్లుఁడు తనకు యుద్ధమల్లుఁడన్న ఘనతను సూచించు పేరుండి యున్న యెడల శాసనాదు లిచ్చునప్పుడు, తనపేరు బిరుదులతో చెప్పుగ జెప్పునప్పుడు యుద్ధమల్లుఁ డని చెప్పుకొనక 'మల్ల, మల్లప రాజు' లను సాధారణ నామములను, గద్యములలోఁ గూడఁ జెప్పుకొనునా? పిఠాపుర శాసనము చూడుఁడు:—

"స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులైన మల్లప దేవచక్రవర్తిఁ శ్రీ పిఠాపురమున శ్రీ కుంతీ మాధవదేవర సన్నిధి నభిషిక్తుండై" (86-87 పంక్తులు).

ఇచ్చటఁ దనకుఁ గల గొప్పపేళ్లన్నియు, బిరుదు లన్నియు చెప్పుకొనుట రాజుయొక్క యుద్దేశము గదా? ఛందస్సు అడ్డము వచ్చుట లేదుకదా? 'యుద్ధమల్లుఁ' డను ఘనతగ నుండు పేరు చెప్పక పేలవముగ నుండు 'మల్లప' అని యేల చెప్పవలెను? ఇందువలన యుద్ధమల్ల నామ మతనికి లేదనుట స్పష్టము.

(౪) మనకు శాసనములవలన నిశ్చయముగ దెలిసిన రాజుల కాలములు శాస్త్రిగారి ప్రమాణమునందు విపరీతముగ వ్రాయఁబడినవి. గనుక నీ లేఖ యెంతమాత్రము ప్రమాణముగాఁ దీసికొనుటకు వీలు లేదు. చూడుఁ డిందేమి చెప్పఁబడియున్నదో. "రాజేంద్రచోళమహారాజు పుట్టెను. ఇతని కొమారుడు విక్రమచోళుడు. తర్వాత అమ్మభూపాలుడు. ఇతని కొమారుడు ఛేతరాజు. ఇతని కొమారుడు సత్యాశ్రయుడు ......" విక్రమచోళరాజు 1112 మొదలు 1127 వఱకు నని మన మెఱుఁగుదుము. ఈతని తరువాత అమ్మరాజు, అతని కొమారుఁ డైన ఛేతరాజు రాజ్యమునకు వచ్చినట్లు శాస్త్రిగారి కర్తృనామరహిత ప్రమాణము చెప్పుచున్నది! ఈ ప్రమాణమును లిఖించినవానికి బేటరాజో ఛేతరాజో అనికూడఁ దెలియదు. అన్ని శాసనములలోను బేట విజయాదిత్యుఁ డనియే యుండును. 'మురారే స్తృతీయః పన్థాః' అన్నట్లు వీఁడు 'ఛేతరాజు' అని పేరు పెట్టెను. అది అట్లుండ నిండు. అమ్మరాజు విష్ణువర్ధనుఁడు 918 మొదలు 925 వఱకు రాజ్యముచేసెను. అతని కొమారుఁ డైన బేటవిజయాదిత్యుఁడు 925లో రాజ్యము చేసెను వీ రిద్దఱును 1127 సంవత్సరమున నున్న విక్రమచోడునకు తరువాత రాజ్యమునకు వచ్చిరని కాల విపర్యాసము గావించి తలక్రిందులుగఁ జరిత్ర చెప్పెడి యీ పిచ్చివ్రాతను నమ్మి యీ ప్రభుశాసనాధారములతో స్థిరమగుచున్న యుద్ధమల్లుని కాలమును వదలుకొనుట!

(౫) ఈ రెండు శాసనములలోని తెలుఁగు భాషలకు నెంతయో భేదము కలదు. బెజవాడ శాసనమందలి భాష అక్షరములవలెనే పురాతనము. మల్లుని పిఠాపురశాసనమందలి తెలుఁగుభాష దానికంటె నాఁటిది కమని యీ రెండు శాసనములలోని తెలుఁగు చదువువారికిఁ బైపైనే తెలియఁగలదు. ఇంకను కొంచెమునూక్ష్మబుద్ధితోఁ జదివినయెడల నన్నయ తెలుఁగునకును యుద్ధమల్లునిశాసనమందు తెలుఁగునకును భేదము తెలియఁగలదు. రెంటికిని వందల సంవత్సరముల కాల మంతర ముండవలయును.

(౬) రెండు శాసనముల అక్షరస్వరూపమునుబట్టియు బెజవాడ శాసనము మిక్కిలి పురాతనకాలపునాటి దని నిశ్చయింప వచ్చును. వేయి వ్రాతలకంటె నొక రెండు పటముల నీయఁగలిగితి మేని-అవి యీ సంగతిని చదువరులకు చక్కఁగ బోధించునని తలఁచి పిఠాపురశాసనపు ప్రతియుఁ దెప్పించి యందలి కొంతభాగముయొక్క పటము చేయించుటకు నిచ్చితిని గాని ఆ పటము సమయమునకు రానందున ఈ విషయ మింకొక వ్యాసముకై ఆపియుంచవలసి వచ్చినది.

# అనవేముని ఉప్పుగల్లు శాసనము

శ్రీ శతావధానులు శేషాద్రిరమణ కవులు.

శాసనస్వరూపము:—ఇది మూఁడంగుళములున్నర వెడల్పు పది యంగుళములు పొడుగుఁ గల రాగిరేకులు నాలిగింటిపై రెండువైపుల వ్రాయఁబడినది. నాలుగురేకుల కొకరంధ్రము చేయఁబడెను. వలయాగ్రమునఁ బ్రతిరు గుఱుతింప వీలుకాకుండ నఱిగిపోయినది. శాసనపత్రములఁ గూర్చిన వలయము విఱిగియున్నది. ఈశాసనము కృష్ణాజిల్లాలోని మంతెనలో భూమిత్రవ్వుచుండ నిటీవల దొరికినది. ఈశాసనము సురక్షితముగ నుంచి పరీక్షార్థము మాకుఁ బంపిన శ్రీయుత కపిలవాయి వేంకటసుబ్బారావుగారికిఁ గృతజ్ఞులము.

శాసనభాష:—శాసనమంతయు శ్లోకములతో నిండియున్నది. గ్రామసరిహద్దులు మాత్రము తెలుగుభాషలో వ్రాయఁబడియున్నవి. ఇట్టి యాచారము తఱుచుగ నన్నిశాసనములందును గానవచ్చును. శాసనలిపి అనితల్లి కలువచేఱు శాసనలిపికంటె నించుక మెఱుఁగుగ నున్నది. అందందుఁ గొన్నివర్ణంబులు లోపించినను మొత్తముమీఁద శాసనమంతయుఁ జదువఁదగిన స్థితిలో నున్నది. పూర్ణానుస్వారమునకు ముందుఁగల వర్ణములకుఁ దఱుచుగ ద్విత్వము నుపయోగింపఁబడి యున్నది. 'ఈ' యనువర్ణము "ఙ్గ" అని వ్రాయఁబడియున్నది. గుడికి దీర్ఘము ఏత్వము ఓత్వములకుఁ బొల్లులు లేవు. వ, వత్తు వ, వత్తువలె నున్నది. వ, బ, వ, లోనగువర్ణముల కొత్తులు లేవు. వలపలగిలక రేఫకు మాఱుగాఁ బ్రయోగింపఁబడినది. టవర్ణము తలకట్టు గల డవర్ణమువలె నున్నది. కృష్ణరాయల కాలమునాటి శాసనలిపికంటెఁ గొంచెము మెఱుఁగును బ్రతాపరుద్రునినాటి శాసనలిపికంటె కొంచెము నాగరికముగను నీలిపి కానవచ్చుచున్నది. హద్దులలో నున్న "వెలఁగ" శబ్దమునకు వెలఁగచెట్టనియే యర్థమేని బిందు విటు విచార్యము. వెలఁగశబ్దము వృక్షవాచకమైనప్పుడు సార్థబిందుకము కాదు. కాన శబ్దస్వరూపము విచారణీయము. ఫుట్టి యనుశబ్దము దేవళమునకుఁ బర్యాయపదముగ హద్దులలో వాడఁబడెను. ఇది గ్రంథస్థమగు నర్థము కాదు. 'తెలుపుమోచె' అను పదమందలి "మోచె" శబ్దమున కర్థము తెలియరాదు. క్రీ. శ. 1416 లోనిదగు శ్రీనాథుఁడు వ్రాసిన ఫిరంగిపురము శాసనములో నీశాసనమునందుఁగల ధ్యానశ్లోకములు రెండు వ్రాయఁబడియున్నవి. ప్రకృతశాసనపు ప్రాచీనతను బట్టి విచారించినచో శ్రీనాథుఁడే తన శాసనగ్రంథమున నిందలి ధ్యానశ్లోకముల నుదాహరించికొనె నని స్ఫురించును. శ్రీనాథుఁడు కోమటివేమునియొద్ద విద్యాధికారి కావునను ఉప్పుగల్లుశాసనము కోమటివేమునివంశీయులు స్థాపించిన దగుటవలనను స్వీకరించి యాశ్లోకముల సంగ్రహించియుండును. ప్రాచీనశాసనములలోఁ దఱుచుగ నిట్టి యాచారమున్నటులఁ దెలఁగలదు.

శాసనచరిత్రాంశము:— సమస్తజాతులలోఁ జతుర్థజాతి శ్రేష్ఠమైనది. కాలక్రమమున నావంశమునఁ బ్రోలరాజు జన్మించెను. ఇతఁడు మిగులఁ బరోపకారశీలుఁడు. ఇతనికి శ్రీశైలాహోబిలాద్రులకు మెట్లు కట్టించినవాఁడును వీరనారాయణ బిరుదాంకితుఁడును సత్యచూడామణియు నగు వేమభూపాలుఁడు జనించెను. వేమభూపాలునకు సూర్యేందుతుల్యు లగు అనపోత భూపాలకుఁడు అనవేమభూపాలకుఁడు జనించిరి. అందనపోతభూపాలుఁడు కుమారచూడామణియై యాంధ్రదేశము నిష్కంటకముగఁ బరిపాలించెను. కనిష్ఠుఁడగు ననవేమభూపాలుఁడు భ్రాత గతించినపిమ్మట రాజ్యమునకు వచ్చి నైష్ఠికరాజ్యము బరిపాలించుచుఁ బూర్వము మ్లేచ్ఛాపహృతములగు నగ్రహారములను మఱల నొసంగి యసమానకీర్తి గడించెను. అటు లొసంగఁబడిన వానిలో నుప్పుగల్లుగ్రామ మొకటియై యున్నది. అనవేమభూపాలుఁడు "ఉప్పుగల్లు" గ్రామమును శా. శ. ౧౨౮౩ సరియగు క్రీ. శ. ౧౩౬౧ సంవత్సరమునఁ బూర్వభాగస్వాములకుఁ జంద్రగ్రహణసమయమున దానము గావించెను. పరిగ్రహీతలను గూర్చిన విశేషాంశము లేమియుఁ జెప్పఁబడలేదు. శాసనగ్రంథకర్తయగు ననపోతారెడ్డి యాస్థానపండితుఁ డగు బాలసరస్వతిని గూర్చి విశేషాంశములు తెలియవు.

చరిత్రపరిశీలనము:—చిరకాల మాంధ్రదేశమును గట్టుదిట్టములతోఁ గాకతీయసామ్రాజ్యము పాలించి కీర్తిఁగాంచెను. ప్రతాపరుద్రదేవుఁడు ఢిల్లీపరిపాలకుఁ డగు యవనరాజన్యునిచేఁ జెఱఁగొనఁబడు టతోఁ గాకతీయాంధ్రరాజ్య మస్తమించెను. ఆంధ్రసామ్రాజ్యమునకు సంబంధించిన సర్వైశ్వర్యములను జాఱఁగొని మహమ్మదీయులు నివాసమునకుఁ జేరినపిమ్మట సామంతులందఱు స్వతంత్రులై విజృంభించి తమతమ దుర్గములకుఁ దామే ప్రభులైరి. అప్పుడప్పుడు మహమ్మదీయులు దాడివెడలుచుఁ గూడుకొనుచున్న యాంధ్రరాజ్యమును సర్వవిధముల భంగముఁ జేయుచుఁ బూర్వదత్తములగు వృత్తుల హరించుచు ధర్మవిప్లవము గావింపసాగిరి. ఈ సందిగ్ధావస్థలోఁ గత్తిఁగట్టి నిలచినవారిలోఁ బ్రశంసార్హులు రెడ్డివారు వెలమవారునై యుండిరి. వెలమవారు రాచకొండలో రాజ్యము స్థాపించిరి. రెడ్డివారు గుంటూరుమండలమున రాజ్యము స్థాపించిరి. ఏకామిషవాంఛచే వర్తించు నీవెలమరెడ్డి వంశములవారు తీవ్రవైరములకు లోనై వర్తింపసాగిరి. ప్రతాపరుద్రునియొద్ద సేనానాయకుఁడుగా నీశాసనారంభమునఁ జెప్పఁబడిన ప్రోలరాజు చిరకాల ముండెను. కాకతీయరాజ్య మంతరింపఁగనే యితఁడు స్వతంత్రపతాకమును నెలకొల్పెను. ఇట్లు స్వతంత్రము వహించిన వారిలో రావుసింగమనాయఁ డొకఁడు. సమానవ్యసనులు సమకాలికులు నగు ప్రోలారెడ్డి సింగమనాయఁడు తమలోఁదాము నెలకొల్పుకొనిన విరోధవహ్నికి నుభయవంశీయులు క్రమక్రమముగా నింధనముల నొసంగి ప్రజ్వలింపఁ జేయసాగిరి.

## 1 ప్రోలారెడ్డి

ప్రకృతశాసనస్థాపకుఁ డగు ననవేమమహీపాలుఁడు ప్రోలక్షితీశుఁడని చెప్పఁబడిన ప్రోలరాజునకు మనుమఁడు. పంటరెడ్డివంశీయుఁడు. వీరివంశజులను దొంతివారని దేసటివారని వ్యవహరించు చున్నటు లాధారములు కలవు. ప్రోలారెడ్డి ప్రతాపరుద్రచక్రవర్తియొక్క శిలాశాసనరము పాలించుసమయమున సామంతుఁడుగ నద్దంకిప్రాంతములఁ బరిపాలించుచున్నటుల నూహింప నవకాశములు కలవు. ఇతని గూర్చి విశేషాంశములు తెలియరావు.

## 2 వేమారెడ్డి (౧౩౨౪-౫౦)

ఈ రాజన్యుఁడు, విద్యాభిమాని, వీరమాహాత్మ్యశీలియై యప్రతిమానయశమును గడించి నూరిలోకమునకు వందనీయుఁ డయ్యెను. శ్రీశైలమునకు సహోబిలమునకు విశేషస్యయము గావించి సోపానములు గావించుటయే గాక యెఱ్ఱాప్రెగడచే రామాయణము హరివంశము వ్రాయించి యంకితమొందిన వాఙ్మయమున కింతంతనరాని యుపకారమును గావించెను. వేముఁడు అద్దంకి రాజధానిగా నాంధ్రరాజ్యము పరిపాలించినటుల స్పష్టముగా హరివంశములో నున్నది:—

"ఘనుఁ డద్దంకి తగు రాజధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజతనుజ బాంధవమిత్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమమహీశ్వరునకు."

ఇతరశాసనాదులలో నీవేమక్షితీశుఁడే కొండవీటిలో రాజ్యము స్థాపించినటులఁ జెప్పఁబడియున్నది ముందు అద్దంకిలో రాజ్య మేలుచుఁ గ్రమముగఁ బరాక్రమముచే నాంధ్రదేశభాగమును సాధించి - వేమక్షితీశుఁడు త్రిలింగదేశములోని చాలభాగమునకుఁ బ్రభువయ్యెను.

వేమభూపాలుని రాజ్యము కృష్ణాగోదావరీ గుంటూరు మండలములలోనిదిగ నుండెనని ప్రకృతశాసనములనను దదితరశాసనములవలనను బోధ కాగలదు. అమరావతి శాసనములో వేమభూపాలునకు "మాద్య స్మన్మన్నృపాల తూలపవనః" అనువిశేషణము చెప్పబడినది. దీనిచే వేమభూపాలకుఁడు విశాఖపట్టణమండలములోని మన్నెరాజులను సైతము జయించినటులఁ దెలియుచున్నది. వేమభూపాలకుఁడు కళింగదేశమున రాజ్యము స్థాపించినటులఁ గాని-యాచటి రాజులు సామంతులుగ వర్తించిరనిగాని - యితరాధారములు లభించుకొలఁదు నీ విశేషణము విమర్శచేయకుండుట యుక్తము.

## 3 అనపోతారెడ్డి. (క్రీ. శ. ౧౩౫౦-౬౨)

వేమభూపాలుని కుమారుఁ డగు నీయనపోతారెడ్డి మిగుల శూరుఁడు. రాజనీతిధురంధరుఁడు. వీరశిఖామణి. పితృరాజ్యము నితఁడు నిష్కంటకముగఁ బరిపాలించుటయే గాక సముద్రవ్యాపారము సయితము వ్యాపింపఁజేసి దేశాభివృద్ధికరములగు ననేక సదుద్యమముల యందుఁ బాలుగొనెను. అనపోతారెడ్డి కృష్ణా గోదావరీప్రాంతప్రదేశమునంతయు బలాత్కారముగ స్వాధీనము గావించుకొని విరోధుల వంచించినటులఁ బ్రకృతశాసనమునఁ జెప్పఁబడియున్నది. అనపోతారెడ్డి పద్మనాయకవీరులగు రేచెర్ల అనపోతానాయకుఁడు మాదానాయకుని తోఁ బోరి గెలిచినటులఁ గొందఱు వ్రాసియున్నారు. రెడ్డిరాజులపై బద్ధసాలెబుద్ధిగల చరిత్రకారు లాయంశము నంగీకరించుట లేదు. ప్రకృతాంశమును బోధించు చాటుపద్య మొకటి వాడుకలో నున్నది. గాని యీ విషయము కేవలము కల్పిత మన సాహసింపము.

ఉ. ధనకొఱ్ఱ్యం డగు మాధవాధిపుని ధాకటా ధీతి విభ్రమ్రసా
ధనుఁడై దిన్నల కోటయొద్ద ననపోతారెడ్డి మానంబు వీ
గ్గుమ బోవాడి రణంబునన్ బరకఁగా ఛిన్నోశిస్థలిన్ జూడ నేఁ
డును నచ్చో నడిసూలపై కనవుపాటున్ లేదు తోవాటబేన్

ఏది యెటులున్నను అనపోతారెడ్డి యకాలమరణము నొందిన మాట వాస్తవము. రాజ్యమును బదిరెండు సంవత్సరములు మాత్రమె పరిపాలించెను. ఇతఁడు పితృరాజ్యము నంతగా విస్తరింపఁజేసినటులఁ గానుపింపదు. రాచకొండపరిపాలించు ననపోతానాయకునితో మాదానాయకునితోఁ గృష్ణాతీరమునఁ బలుమారితఁడు సంగ్రామము గావించెను. దేశోపకారకార్యము లనేకములు నిర్వహింప సంకల్పించి యనపోతానాయకుఁడు మధ్యవయస్కులో గతించుటచేఁ జరిత్రము సమాప్తము చేయవలసి వచ్చినది. లేకున్నచో నీవీరుని పవిత్రజీవితము నొక గ్రంథముగ వ్రాయవలసి వచ్చెడిది. ఇతని పుత్రుఁడు కుమారగిరిరెడ్డి బాలుఁ డగుటచేత సహోదరుఁ డగు ననవేమభూపాలుఁడు భ్రాతృరాజ్యము పరిపాలించెను.

## అనవేమారెడ్డి (క్రీ. శ. ౧౩౬౨-౮౦)

ఇతఁడే ప్రకృతదానదాత. ఈతనిచరిత్రముతో మన శాసనగ్రంథము ముగియుచున్నది. ఎఱ్ఱాప్రెగడ హరివంశముకలన వేమారెడ్డికి అనపోతారెడ్డి యొక్కఁడే తనయుఁడని వ్యక్తమగుచున్నది గాని యితరాధారములచే వేమారెడ్డికి "అనపోతారెడ్డి అనవేమారెడ్డి కోమటిరెడ్డి జనించిరనియుఁ, గోమటిరెడ్డి బాల్యముననే గతించి యుండుననియుఁ దెలియుచున్నది. హరివంశము కృతినొందునప్పటికి వేమారెడ్డికి అనపోతారెడ్డి యొక్కఁడే తనయుఁ డనియుఁ బిమ్మట ననవేమారెడ్డి జనించి యుండు ననియు నూహించుట సమంజసము కాకపోదు. ప్రకృతశాసనములలో వేమారెడ్డికి—అనపోత అనవేమారెడ్డు లిరువురు పుత్రు లని స్పష్టముగా నీక్రిందివిధముగాఁ జెప్పఁబడియున్నది.

"తస్మాదస్య వేమనృపతే రుదయ దివాద్రే
ర్జాతౌ ప్రతాపవరకీర్తినిధీ కుమారౌ
సూర్యేందుతుల్య మహసా వనపోతభూప
శ్రీయన్న వేమనృపతి ర్జగరక్షపాలః."

రాచకొండప్రాంతమునుండి ధరణికోటప్రాంతమునకు వచ్చి పలుమా రెదిరించుచున్న పద్మనాయకవీరులగు ననపోతానాయకుఁడు మాదానాయకులవలన రాజ్యమున కెట్టి విప్లవము కలుగకుండ ననవేమారెడ్డి పలుమాఱు సంరక్షించెను. అంతియుగాక విస్తృతమగు తనరాజ్యము

గృధశిఖరమును కృష్ణాతరంగిణీపరిరక్షితము శాత్రవసమీపస్థము నగు కొండవీటి కద్దంకినుండి మార్చి నిజపరాక్రమము వెలయించి పరిపాలించెను. ఈయంశము కొండవీటి శాసనమున నైతము సువ్యక్తముగాఁ జెప్పఁబడియున్నది.

"తతోఽన్నవేమనృపతిః పరిపాలనకర్మణి
అపాలయ త్తస్య పుత్రః
తదంతేంద్రసుధరాం
కొండవీడుం రాజధానిం
సలిత్రాం పరికల్పయాత్."

(Elliot's Collections Page 270)

స్థూలదృష్టిచేఁ గొండవీడుదుర్గమునే యనవేమారెడ్డి స్థాపించెనని యీశాసనాంశములవలన వ్యక్తమగును గాని యంతకుఁ బూర్వమే యట నొక దృఢతరమగు కోట గలదనియుఁ గొంతకాలము చాళుక్యుల ప్రతినిధియు మఱికొంతకాలము కాకతీయ ప్రతినిధులు నాదుర్గమున నున్నటుల స్థానిక చరిత్రమునఁ గలదు. అనవేముని నాటికి కొండవీడుదుర్గము శాసనస్థమై శాశ్వతమ్మువుండెను. గాన ననవేముఁడు కొండవీటిదుర్గము పునరుద్ధరించిన ట్లెంచవగును. మ్లేచ్ఛనృపాలకాపహృతములగు పవిత్రాగ్రహారములను విశేషముగ నుద్ధరించి తిరిగి బ్రాహ్మణుల కొసంగుటయే గాక శా. శ. ౧౨౯౩ లో ననవేముఁ డుప్పుగల్లుగ్రామము బ్రాహ్మణులకు దానము గావించి ప్రసిద్ధి గనినటులఁ బ్రకృత శాసనమునఁ జెప్పఁబడెను. బ్రాహ్మణాదుల యగ్రహారాదివృత్తులు మహమ్మదీయులచే నెట్లు హరింపఁబడెనో తెలిసికొనుట కాధారము లీశాసనమున లేవు. ఆంధ్రరాష్ట్రమును బాలించు కాకతీయ ప్రతాపరుద్రచక్రవర్తి బంధితుఁ డగుటతోడనే మహమ్మదీయులు విజృంభించి దేశమును కొల్లగొని యవాంతిని స్థాపించి వృత్తులను హరించిరని మన మూహింపవచ్చును. పిమ్మట పద్మనాయకులు-రెడ్డివారు-స్వతంత్ర రాజ్యములు స్థాపించి యవనులను బాలద్రోలి దేశము నాక్రమించుకొని ప్రాచీనదానములఁ బునరుద్ధరిప పసాగిరి. ఇది కేవలమూహామాత్రము కాదు. కాకతీయ రాజ్యావసానమున దేశభూవృత్తులకు భంగము కలిగినటుల శాసనాదికములలో నైతము వాకొనఁబడినది. వేమారెడ్డి "అను మలతి శాసనములోఁ దాను కాకతీయప్రతాపరుద్రునికాలములో మ్లేచ్ఛాపహృతములైన యగ్రహారముల తిరిగి యొసఁగితి నని వ్రాసియున్నాఁడు. కనుక ప్రతాపరుద్రుని యనంతరము మ్లేచ్ఛు లాక్రమించినదే యని మనము విశ్వసింపవచ్చును. పద్మనాయకసామ్రాజ్యము రెడ్డిసామ్రాజ్యము విజృంభించుకాలములో మ్లేచ్ఛులు తెలుఁగుదేశముపై దండెత్తి ధర్మాదికముల హరించినటుల నాధారములు లేవు. ఆంధ్రదేశమున ధర్మవిప్లవము ప్రతాపరుద్రుని యనంతరమే జరిగినట్లు దేశచరిత్ర మూధారము కాఁగలదు. అనవేమారెడ్డి పరాక్రమించి పద్మనాయక రాజ్యములోనిదియుఁ గృష్ణాతీరమందలిదియు నగు వాడపల్లిప్రాంతముగూడ నాక్రమించినటుల వాలనిభృత్యుఁడగు కడియము పోతినాయకుఁడు స్థాపించిన వాడపల్లి శాసనము వలనను-అనవేమారెడ్డి పేరుతో నున్న మఱియొక శాసనము వలనను-వ్యక్తమగుచున్నది. అనవేముఁడు సంగీతసాహిత్యవిద్యావినోదియై పెక్కు గ్రామములు దానముచేసెను. వెంత్రముమీఁద నితని త్యాగశక్యసౌశీల్యునిగఁ దలంచుటకు సందియము లేదు. కవులకు బ్రాహ్మణులకు మిక్కుటముగ గ్రామము లొసంగుటయే గాక సంగీతసాహిత్యవతులగు కంచి, పేరి, పొన్ని యను వేశ్యల విద్యానైపుణ్యమునకు సానందించి కంచికిఁ గంచకపర్లయుఁ, బొన్నికి పొన్నవరము పేరికి పేరకలపాడును అగ్రహారములుగా నిచ్చి యౌదార్యము బ్రకటించినటుల స్థానిక చరిత్రములోఁ గలదు. అనవేముని విద్యారసికత వెల్లడించు చాటుపద్యములు పెక్కులు కలవు.

అనపోతభూపాలుఁడు ఇంచుమించుగఁ బదునెనిమిదిసంవత్సరములు రాజ్యముఁ బరిపాలించి ధర్మసంస్థాపనమునకు జీవితసర్వస్వము వ్యయము గావించి ప్రతిష్ఠఁగడించెను. ఈతని జీవితకాలమును నిరూపించుటలోఁ జరిత్రకారులు తలకొక త్రోవను బోయిరి. అనవేముని రాజ్యకాలము క్రీ. శ. ౧౩౭౭-౮౮ అని జయంతి రామయ్య గారును, క్రీ. శ. ౧౩౬౪-౮౦ అని చిలుకూరి వీరభద్రరావుగారును, క్రీ. శ. ౧౩౬౯-౮౧ అని సర్వాశలుగారును, క్రీ. శ. ౧౩౬౪-౧౩౮౩ అని దండకవిలెలును, క్రీ. శ. ౧౩౬౪-౧౩౭౩ అని వీరేశలింగము పంతులుగారును, వ్రాసియున్నారు. ఇందేది విశ్వాసపాత్రమో నిరూపించుట దుస్సాధ్యము.

అనవేమభూపాలుఁడు చిరకాలము రాజ్యముఁ బరిపాలించి పిమ్మట నన్నభూపాలునిచే వధింపఁబడెనని కొందఱు; ఈ యన్నభూపాలుఁడే యనపోతభూపాలుఁ డనియుఁ గనపోతారెడ్డితోఁ బోరిన యనపోతనాయకునకు నన్నఁడనియు వెలుగోటివారివంశచరిత్రకారులు వ్రాసియున్నారు. దృష్టాంతముగ నొకచాటుపద్యమును నైన ముదాహరించియున్నారు. అప్పద్యమును బరిశీలించినచో ననపోతారెడ్డి నెదిరించిన యనపోతనాయఁడే యనవేమారెడ్డి నెదిరించినటుల వ్యక్తమగును. గాని యాతనిమనుమఁడనుటకు వీలు కలుగదు. కేవల మీచాటుపద్యమునే పరమప్రమాణముగ స్వీకరించి యనపోతనాయఁ డనవేముని వధించినటుల విశ్వసించుట సాహసము. అశక్యకములగు నిట్టి చాటుపద్యములలో నొక్కొక్కప్పుడు సత్యముండును గాని యితరాధారములు లభించినగాని వానిని విశ్వసింప వీలుపడదు. అనవేమవిభుఁడు రణరంగమున మరణించుఁగాక, మఱియొకవిధముగ మరణించుఁగాక. జీవితకాలమంతయు ననపోతనాయకుని నెదిరించుచు జరిపెననుట నిర్వివాదాంశము.

"సీ. పటుసోమకులరాజ పరశురామాంకుఁడై
సమ్మెటసోమునిఁ జక్కఁజేసె
ఖడ్గనారాయణ గాయగోపాలుఁడై
పరిపల్లెరాజుల సంహరించె
పట్టుతెలాటాంక బల్లరగండఁడై
యనవేమరెడ్డిని నాఁడునిచె
జగమందు రాచవేశ్యాభుజంగాంకుఁడై
సురధాముని బలంబు సారిది గెలిచె.

తే. గీ. ధరణి నాతఁడు భీమప్రతాపవిజయ
బాహుబలశాలి నిత్యసౌభాగ్యశీలి
లలితసుగుణుండు రేచెర్లకులపవిత్రుఁ
డనఁగ వెలసెను సింగయయన్నవిభుఁడు.

THE HON. SIR IBRAHIM RAHIM TULLA (BOMBAY)



గౌ. సర్ రహీముతుల్లా

THE HON. MR. JUSTICE M. VENKATA SUBBA RAU



గౌ. న్యాయమూర్తి వెంకటసుబ్బారావు

THE HON. MR. JUSTICE M. D. DEVADOSS



గౌ. న్యాయమూర్తి ఎమ్. డి. దేవదాసు

SRY. C. RAMALINGA REDDY M. L. C.



శ్రీయుత, కట్టమంచి రామలింగారెడ్డి

RAO BAHADUR K. RAGHAVENDRA RAU



శ్రీ రావుబహాదుర్ కె. రాఘవేంద్రరావు

SRY. VADREV VENKATA KRISHNA RAU



శ్రీ వాడ్రేవు వెంకటకృష్ణారావు

# ఆంధ్ర ప్రబోధము

మంగిపూడి వేంకట శర్మ గారు

శ్రీ జగద్గురు శంకరాచార్యులే ఖైదు సుఖ మొకించుక రుచిచూచి రాఁగ
కేసరిప్రతిము లాలీసోదరులు పీర్ గులాము కిచ్లూలు జైళ్లను గృశింప
రామదాసుం డాంధ్రరత్న గోపాలకృష్ణయ కృష్ణజన్మాలయము భజింప
సుకుమారమూర్తి రాజకుమార వేంకట కృష్ణరాయుండు సంకెళ్ల బడల
చండమార్తాండ తేజశ్శాలి లజపతి రాయి బంధనమందిరమున కేఁగ
దేవేంద్రనిభుఁడు మోతీలాలు నెహ్రూ సబాంధవంబుగఁ జెఱఁ బొందియుండ
శ్రీమంతుడై మించు చిత్తరంజనదాసు సకుటుంబముగఁ జెఱసాల కరుగ
యువకోటిమేటియై యొప్పుహీరాలాలు గాంధి తానుగ బందిఖానఁ జొరఁగ

తే. ఎంతకాలంబు నిద్రింతు రింక మీరు, మేలుకొనుఁ డుద్యమంబునఁ బాలుగొనుఁడు
పాలుకొని మేలుకొని రాజ్య మేలుకొనుఁడు, ఆర్యరత్నమ్ములార యోయాంధ్రులార.

మ. సుకుమారీమణు లెంద రెందఱొ మహాశుద్ధాంత సౌధంబులం
దకలంకస్థిర సౌఖ్యలీలల నసూర్యంపశ్యలై యొప్పువా
రకటా ! రాజ్యరమానుభూతిమతిమై నల్లాడుచుండంగ నే
టికి నింకన్ మగవారిపౌరుషము వీటిన్ బోయెనే నేఁటికిన్.

సీ. వృద్ధురా లల్ల యాలీసోదరులతల్లి యతిమోదమున ఖద్ద రమ్ముచుండ
పౌలోమిఁ బోలు మోతీలాలునిల్లాలు మూపుపై ఖద్దరు మోయుచుండ
శ్రితచేటికాశ్రేణి చిత్తరంజనురాణి ఖాది నమ్ముచు వీథివీథి దిరుగ
సౌకుమార్యముదీవి సరళామహాదేవి ఖాది నమ్మఁగ గ్రామగ్రామ మరుగ

ఆ. అబలలక్ష్మిదేవి యన్నపూర్ణాదేవి, గాంధియుద్యమమున గాలు నిల్పి
తెగువఁ జూపుచుండ మగవార లిట్లుండఁ దగునటయ్య యాంధ్రతనయులార !

సీ. అరుదెంచుచున్నారు ఆనందమును బొంది యాటరంగములకై యరుగుభంగి
చనుదెంచుచున్నారు సంతోషమునఁ బొంగి బువ్వమ్ముబంతికై పోవురీతి
నడతెంచుచున్నారు నవహర్షములతోడ వడుగుపెండ్లిండ్లకై వెడలుక్రివి
పఱతెంచుచున్నారు పరుగుపర్గున స్వామితిరునాళ్లు సేవింపఁ దరలుజాడ

తే. మాతపిలుపును ముందె తా మాలకించి వంగసంతతి వేనవే ల్వచ్చి శాంతి
సేనలోఁ జేరి మాత నర్చించుచుండ, ననదల ట్లుందురే యిట్టు లాంధ్రులార

సీ. రాటంబు ద్రిప్పఁగా రాదె యింకేదియు జేతఁగాకున్నట్టి చిన్నలార
ఖద్దరుబట్టైన గట్టరాదే పొట్ట సాగకున్నట్టి యుద్యోగులార
కలహంబు లడగింపఁగారాదె పంచాయితీలు స్థాపించి వకీలులార
వదలరాదే గౌరవము లేని పను లేల గ్రామాధికారివర్గంబులార

తే. మాన్పరే త్రాగుడును నీతిమాన్యులార, వదలరే యంటుదోషంబు సదయులార
ఖద్దరు తయారుచేయించి కలవుడీల, నమ్మరే వైశ్యవంశరత్నమ్ములార !

సీ. గాంధిసందేశంబు కర్ణంబులను బ్రతిధ్వని సేయలేదె విద్యార్థులార
మోతిలాలంపిన నీతిప్రబోధనం బంటదే చెవుల విద్యార్థులార
చిత్తరంజనదాసు చేసిన యుపదేశ మాలింపలేదె విద్యార్థులార
లజపతిరాయి తెల్లముగఁ దెల్పిన హితం బందదే మదికి విద్యార్థులార

తే. చదువుసంధ్యలసమయమా చాలు లెండు, రండు తడవేల యెల్ల కార్యములువిడిచి
మాతృసేవకు తరుణంబు మఱలరాదు, ధైర్యనిధులార ! ఆంధ్రవిద్యార్థులార !

ఉ. చోరులు జారులై చెఱలుసొచ్చుట తప్పగుఁగాని సత్క్రియా
శూరులు ధీరులున్ సుపథశోభితులై తగువారు జైళ్లలోఁ
జేరుట తప్పు గాదు మది సిగ్గిలఁబోకుఁడు దేశభక్తు లన్
సారత గల్గునాఁడు చెఱసాలలు గావు స్వరాజ్యశాలలే !

శా. ఆలోచించెద రేల ? యాంధ్రనరు లాహా ధర్మసంరంభ ము
ద్వేలంబై జగమెల్ల నల్లుకొనెడున్ ధీరాత్ములై లెండు లెం
డేలో టుండదు దానికిన్ మనము రాలేదన్న మాటుండు నేఁ
డేలా యీయపనింద ? వేగపడి రండీ ! తల్లి సేవింపఁగన్.

ఉ. రాటము కేతనం బయి విరాజిల, ధర్మమె యాయుధంబుగా
బాటిల, శాంతి దాంతి జవభాసురఘోటములై చెలంగఁగాఁ
గోటినభోమణిప్రభలు గూడ, స్వరాజ్యరథంబుపై నిరా
ఘాటరయంబునన్ గదలె గాంధిమహాత్ముఁడు తత్ప్రభావమున్
మేటికిరీటముల్ మగలమిన్న లనేకులు ము న్నెదిర్చి యా
ధాటికి దాసులై రిపుడు ధాత్రి సమస్తము దత్ప్రణాళికన్
సూటిగఁ జూచుచున్నయది చోద్య మెలర్ప నిరంకుశప్రభుల్
పోటికి నిల్వలేక తెలఁబోవుచునుండిరి సంశయింపకుం
డోటమి గల్గఁబోదు. విజయోత్సవమే మన కబ్బు, నబ్బురం
బేటి కతం డజేయుఁడు నమేయబలుం డిది కల్లఁగాదు టా
టోటు నిరంకుశత్వ మిఁకఁ డొంకకతప్పదు. భారతాంబ కా
రాటము దీఱు నయ్యనఘు రమ్యపదాంకము లాశ్రయింపుఁడీ.

# పుష్పాంజలి — శ్రీకృష్ణలీలాశుకకవి

మానవల్లి రామకృష్ణకవి గారు, ఎమ్. ఏ.

మందారమంజరీస్యందిమకరందరసాబ్ధయః । కస్య నాహ్లాదనాయాలం కర్ణామృతకవేర్గిరః

గంగాంబ

సకలజననిరంతరాస్వాద్య మగు కృష్ణకర్ణామృతము రచించిన మహాకవి యెవ్వఁడో యతనికీల పెట్టిదో యేదేశ మతనిఁ గని సాఫల్యము చెందెనో యతని పితృభ్రాతృకళత్రపుత్రాదు లెవ్వరో యను సందేహపరంపరలు విప్రసమారాధనములందును బుక్కపుబంగులందును వెన్నెలపులగములందును బోఅువేఁటల వనభోజనములందును కృష్ణకర్ణామృతకారుని వాగమృతధారలఁ గ్రోలినవారు పొందకుండరు. అతఁడు చింతామణి యను వేశ్యకై తనశీలమును దారవోసి తత్తేఁపమధరముచే జ్ఞానోదయము నొంది శృంగారసర్వస్వసాధిదేవత యగు శ్రీకృష్ణునిఁ బరమప్రేమమున భజించి యతనితో సాయుజ్యము పొందె నని కథలు చెప్పుదురు. అతఁ డాంధ్రుఁ డని మన మెల్లరము తలఁచియున్నారము. కృష్ణవేణ్ణానదీతీరమున నమరేశ్వరముచెంత నొక మఠమున నతఁడు జీవించియుండె ననియు శ్రీకాకుళక్షేత్రమున నుండె ననియు కొందఱును చెప్పుదురు. ఓఢ్రులును వంగదేశీయులును శ్రీపురుషోత్తమ మగు జగన్నాథమున నతఁడు నివసించె ననియు నతనియింట బిల్వవృక్షము మంగళాస్పదముగా నున్నందున నతనికి బిల్వమంగళస్వామి యని పేరు గల దనియు మొదలుగాఁ బెక్కు కథలు గూర్చి భాగవతమునఁ ద్రయోదశస్కంధము రచించి యతనిఁ బరమభాగవతాగ్రగణ్యుఁగా నొసర్చి యర్చింతురు. శ్రీకృష్ణపూజాపరమార్థు లగు నోఢ్రులకుఁ గృష్ణునిలీలాశుకం బారాధనీయుం బగుట యేమివింత?

నేటికాలమునఁ గవులచరిత్రము మాత్రము చక్కఁగాఁ దెలిసికొని యొండు రెండుపద్యములు నోటికి రప్పించుకొనినవో నొక్కఁ కని కవితాసర్వస్వ మంతయుఁ గ్రోలినంత సంతోషము పడుచున్నారము. ఇట్టి సులభసంతోషు లగు మనలఁ గీర్తిశేషు లగు కవులు స్వర్లోకమునుండి చూచుకేని తప్పక యామోదింతురు. కావున నతనిచరిత్రము విని తృప్తిఁ బొందుదము. లీలాశుకుం డెవ్వఁ డనుటు యతనిగ్రంథములు మఱికొన్ని లభింపఁగా నించుక తెలివడుచున్నది. మన యాంధ్రులకును నోఢ్రులకును మాళవ ఘూర్జరులకును నైక మాశాభంగము కలిగింపఁజాలిన యతని జన్మస్థానము కేరళదేశమున నని చెప్పుటకు సిగ్గువడుచున్నాఁడను. అతఁడు బాల్యముననే శంకరాచార్యులవలె సన్న్యసించినందున నతనిప్రియసర్వస్వమగు "చింతామణి" భక్తజనచింతామణి యగు కృష్ణుఁడే కాని చర్మసుందరి యగు నాఁడుది కాదు. తుకీయాశ్రమవర్తియై కేరళమున భారతనదీ తీరమునఁ దిరునావా యను నామాంతరము గల శ్వేతారణ్యమున నతఁడు దనకాలమంతయుఁ బుచ్చెను. అతని కృతులఁ జదువఁగా గంగాబృందావన ప్రాంతములఁ గొంతకాల మతఁడు విహరించియుండు నని తలఁపవలసియున్నది. ఇతఁడు మూఁడు వ్యాకరణముల నాచార్యుఁ డనఁదగినంత పాండిత్యము నుపార్జించి సంస్కృత ప్రాకృతవ్యాకరణములకు వ్యాఖ్యలం గూర్చె. దేవప్రణీత మగు దైవవ్యాకరణమునకుఁ బురుషకార మనువ్యాఖ్యయు భోజదేవుని యష్టాధ్యాయికిఁ గృష్ణలీలావినోద మనువృత్తియు, వరరుచికృత మగు ప్రాకృత ప్రకాశమున కొక్కొక్క సూత్రమున కుదాహరణముగా గోవిందాభిషేక మనుప్రాకృతకావ్యమును మఱికొన్ని కృతులును లీలాశుకుని శబ్దశాస్త్రపరిశ్రమ ముద్ఘోషించుచుండును. సుబంత తిఙంత సామ్రాజ్యము లను గ్రంథములు నితనివే యని నేను సందేహించెదను. అవి భోజుని యష్టాధ్యాయి ననుసరించి సిద్ధాంతకౌముదివలె శబ్దనిష్పత్తిప్రదర్శక మగు గ్రంథములు. "ఖభుక్తి ర్వైయాకరణం న భుజ్యతే" యన్నట్లు భక్తిరసమున దేఁకటిఁ గొనియున్న మన కతని వ్యాకరణరచనతోఁ బనిలేదు. లీలాశుకుఁడు గోవిందాభిషేకమున నెనిమిదిసర్గలు రచించి వరరుచిప్రాకృతవ్యాకరణమునకు మార్గము చూపిన పిదప నతని శిష్యుఁడు దుర్గాప్రసాదయతి దానికి వ్యాఖ్య రచించి మఱియు నాలుగుసర్గలు త్రివిక్రమ వ్యాకరణలక్ష్యముగా రచించి ముగించెను. ఇతఁడు లీలాశుకునిఁగూర్చి యేమనియె?

> " కోదండమంగళవరోగదితే హి ధామ్ని
> శ్రీకృష్ణదర్శనపరః కిల కర్ణపృక్తః
> జాతః క్రమేణ పరహంసపదే స్థితో౽స్మిన్
> రామో౽ంకస్థిత స్తు మవలోక్య జగామ తృప్తిమ్.
> శ్రీపద్మపాద మునివర్యవినేయవర్గ
> శ్రీభూషణం ముని రసౌ కవిసార్వభౌమః
> శ్రీకృష్ణరూప పరమామృతపానశీల
> శ్చక్రే తదీయచరితం బహుధా హితాయ.

అని వ్యాఖ్యాప్రారంభమునను,

> " శ్రీకృష్ణలీలాశుక బద్ధకావ్యం
> విస్మృత్య లోకస్య హితాయ పూర్వమ్
> తచ్ఛేషపూర్తిం చ పునర్విధాయ
> విష్ణుర్మహో౽థో తరభాగ మేతమ్.

అని నవమసర్గ ప్రారంభమునను,

> " ముక్తిస్థలాలయశివాపదభక్తిలేశా-
> ద్దుర్గాప్రసాదయతి రిత్యభిధాం దధానః
> కర్తా స్వయం సుకృతమత్రఫలానభిజ్ఞః
> కృష్ణే౽ర్పయా మ్యథ విశుద్ధికరా మహాంతః"

అని గ్రంథాంతమునను చెప్పుకొనియె. నడుమ నొకచో "చామమంగళ కృపయా యతీశ్వరః" అని లీలాశుకునిఁ జేర్కొనియె. పై విషయము

లాలోచింప నితని గృహనామము విల్వమంగళ మనియు (విల్వ యన గేరళభాషలో వింటిసంబంధ మనుట) నితఁడు పద్మపాదాచార్యుని వంశమునో శిష్యవంశమునో పవిత్రీకరించె ననియుఁ దోచుచున్నది. ముక్తిస్థలము శ్వేతారణ్యమునకు దక్షిణమున ముక్కుత్తల యని భగవతీ క్షేత్రము పశ్చిమాంబుధికిఁగొన్ని మైళ్లదూరమున నుండును. వబయో రభేద మను న్యాయమున విల్వమంగళశబ్దము జనించి పిదప బిల్వవృక్షమును దత్సంబంధ మగు చిలుకకథలను బుట్టించియుండు నేమో! ఇతనికాల మెప్పు డని స్పష్టముగాఁ జెప్పుటకు వలను గాదు. క్రీ. శ. 1050 వఱకు నుండిన భోజుని యష్టాధ్యాయికి నితఁడు వ్యాఖ్య రచించుటయుఁ బురుషకార మున హేమచంద్రు నుదాహరించుటయు నితనిగ్రంథముల విద్యా రణ్యులు ధాతువృత్తిలోఁ జేర్కొనుటయుఁ జూడ సుమారు క్రీ. శ. 1250-1300 ప్రాంతముల నుండె నని యూహింపవచ్చును. ఇతఁడు పెక్కుకృతులు నానావిషయముల రచించె. అన్నిటిలో శ్రీకృష్ణుని స్తుతియే ముఖ్యవిషయమై యుండును. ఇతఁడు పూర్వోత్తరమీమాంసల నుత్కృష్టపాండితి గడించె నని యితని కేనోపనిషద్భాష్యవ్యాఖ్యానము వలనఁ దెలియును. దానిపేరువలెనే నిక్కముగా నది "శంకరహృద యంగమ"మే. ఈతఁ డీశానదేవుఁ డను మహాతాంత్రికుని శిష్యుఁడు గావునఁ గృష్ణపూజాపరముగాఁ గ్రమదీపిక యను నొక తంత్రగ్రంథము నిర్మింపఁగలిగెను.

" ఈశానదేవచరణాభరణేన నీలీ
దామోదరస్థిరయశః స్తబకోద్గమేన
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాంతరేఽపి "

అని కృష్ణకర్ణామృతమునఁ జెప్పిన యితనిగురు వగు నీశానదేవుఁడు తంత్రపద్ధతి యను మహాగ్రంథమును రచించిన ఋషికల్పుఁడు. అతఁ డాదిత్యప్రజ్ఞుఁ డను మహాత్మునిశిష్యుఁడు.

ఆదిత్య ప్రజ్ఞసంజ్ఞం య దాదిత్యా దధికం మహః ।
నిర్జితః సమదృష్ట్యైవ నిర్లోలం యేన మన్మథః ।
అర్చితై రస్త్రకుసుమై రారాదారాధయన్ యతః॥

"నిర్లోలుఁ డగు నతనిసమదృష్టిచేతనే జయింపఁబడి మదనుఁడు సైతము తన యస్త్రార్థ మేతి తెచ్చిన కుసుమముల నతని పాదములఁ బూజించిపోవునంతటి యాదిత్యప్రజ్ఞముని శిష్యుఁడు—

ఈశానదేవ ఇత్యాసీ దీశానో మునితేజసామ్ ।
ఆస్పదస్య హి యస్యాసీ దశేషగుణసంపదామ్ ।
అద్వితీయ ఇతిఖ్యాతి రాత్మబుద్ధ్యా న కేవలమ్."

ఈశానదేవుఁ డాధ్యాత్మదృష్టిచేతను లోకమువారలకును నద్వి తీయుఁ డయ్యె. ఈ గురువుర నాశ్రయించిన శిష్యులు—

" తయోరనుగ్రహాపాంగ సంక్రాంతజ్ఞానసాగరాః ।
సాగరా ఇవ గంభీరాః సంతి ధన్యా స్సహస్రశః "

అని పెక్కండ్రు విద్యాసాగరులవంటి యతులు కీర్తిస్తంభముల వంటి కృతులు రచించుట యచ్చెరువేమి?

" తయోరేవ కృపాపాత్రం కృష్ణలీలాశుకో మునిః
యదాశ్రమాంగణే నిత్యం రమంతే తంత్రవిస్తరాః "

అని లీలాశుకుఁడు వారిశిష్యుఁడు పైకర్ణామృతశ్లోకములోని నీలీదామో దరులే యితనిఁ గన్న తల్లిదండ్రులు—

" తిలకం కులపాలీనాం నీలీతి నిలయం శ్రియామ్
యమకం జనయాంచక్రే యం చ కీర్తిం చ శాశ్వతీమ్ "

పతివ్రతాతిలక మగు నీలికి లీలాశుకుఁడును గీర్తియు నమడలుగా జనించిరఁట. మృత్యుభయము లేని కీర్తి యను కూఁతురే యామె సౌభాగ్యమును శాశ్వతముగా నిలిపెను.

" యస్య దామోదరో నామ సవితా సవితృసన్నిభః
అనృణస్య హి యస్యాసన్నధమర్ణా మరుద్గణాః "

ఇతని తండ్రి యగు దామోదరుఁడు హవిర్భాగముల నొసఁగి దేవతల నప్పులకాఁపులుగాఁ జేసికొనియెనఁట. ఇతని మిత్రుఁడు భాగవతాది వ్యాఖ్యాత యగు రాఘవేశానయతి. ఇతని మనస్సు—

" యస్య దక్షిణకైలాసలీలాపరిణతం మహః
చర్చా చందనగంధేన సుగంధయతి మానసమ్ "

అని దక్షిణకైలాస మను కీర్తికన్న శ్వేతారణ్యమునఁ బ్రసన్నుఁ డగు మృత్యుంజయస్వామిదర్శనముచే నిత్యవికసిత మగుచున్న దని,

" కృష్ణలీలాశుకస్యాస్య కిశోర మధిదైవతమ్
స్తుతిరత్న మిదం బ్రూతే వేణువాదిముఖేందునా "

శ్రీకృష్ణుఁడే మురళీనినాదమధుర మగు వాక్కున నీ కవిప్రశంస రచించె నని తనపుట్టువు నిందుక యిమ్మహాకవి స్మరించుకొనకున్న మనము సంశయవిభ్రమములపాలు గావలసివచ్చును. ఇతని కృతులు పెక్కు లుత్పన్నము లయ్యె. లభించినవానిలో త్రిభువనసుభగ, కాలవధము, గోవిందాభిషేకము, గణపతిస్తుతి, కర్కోటకస్తుతి, రామ చంద్రస్తుతి, అభవస్తుతి, కృష్ణచరితము, కృష్ణబాలక్రీడ, బృందావనస్తుతి, కౌస్తుభమాల, క్రమదీపిక, శంకరహృదయంగమము, మొదలగునవియు వ్యాకరణగ్రంథములును ముఖ్యములు.

కథానిర్వహణదక్షు లగుమహాకవుల ప్రతిభకును మనస్సు కరఁగి భక్తిపారవశ్యముచే "వాపవి లోనుగా నొడలివాకిళులం జొరమాపు తీపులం ద్రోచి" భగవంతుని దివ్యాకార సౌందర్యప్రవాహమున మునింగి యతని మహిమము నిలుపోపక కొనియాడు కవుల స్వచ్ఛందకవితకును మహాంతరము గలదు. స్తుతిపరము లగు కావ్యములలో విష్ణుస్తుతులే మృదు మధురపద సందర్భోచితములై హృదయావర్జకములై యున్నవి. దేవీ స్తుతులును మహేశ్వరస్తుతులును నిగూఢార్థగంభీరము లై ప్రౌఢోక్తి గుంఫసంభృతములై బహుతంత్రవేత్తలకుఁ గాని యన్యులకు నోరు మె దల్ప వీడనీయవు. "భగవదనుగ్రహవిశేషవాచా" విలాసుం డగు కాళిదాసుండును దనచిద్గగనచంద్రికలో నొసర్చిన దేవీస్తుతియుఁ దాత కుల పాండితీదర్పదళనము గావించుచున్నది. గేయప్రబంధరత్న మగు గీతగోవిందము పాదాంతప్రాసములతో మనోహరమై శృంగారరసపరి పాకబంధురమై పామరులకుఁ గృష్ణసాన్నిధ్యసోపానపరంపరఁ జే యూఁత యిచ్చుచున్నది. అతినిపుణపరీక్షకుల కందుఁ గొన్నిచోట్ల

నవిశిల్పము వెల్లడియై యుండి యుండుక కృత్రిమముగాఁ గానవచ్చును. రూపగోస్వామి ప్రభృతుల కృష్ణోల్లేఖనమున భక్తి ప్రవాహపాతము తో శబ్దతాండవము కలసియాడ నోపదు. కృష్ణలీలాశుకుఁడు కృష్ణబాల క్రీడలే తలంచుచు గోపగోపీజనంబులలోఁ దన్నుఁ గలుపుకొని పరిపక్వ మై యున్నది యున్నట్లు చెప్పఁజాలు తనసహజవాగ్ధోరణియు నూర కుండమిచే స్వేచ్ఛమైన వర్ణించుచుండఁగాఁ దాను "వసుదేవసుతసరోవర ములలో నోలాడుచున కాది దివ్యహంసములలోన" నొక హంసమై కాషా యమూర్తి రాగియై విలసిల్లుచుండె. ఇతని కృష్ణస్తుతిమహిమము కర్ణా మృతమున నెల్ల కెఱుంగుదురు. వేఱు కొన్ని యెడలనుండి కొంత యుదా హరించెదను. బృందారణ్యస్తుతిలో—

"దేవీ సరస్వతీ స్వైరం సేవావసరకాంక్షిణీ।
దేవదేవ మియం ధన్యా సేవతాం దేవకీసుతమ్.

కృష్ణస్తుతి సేవ యెప్పుడెప్పుడు కలుగునో యని యువ్విళులూరు చున్న సరస్వతి యింక యథేష్టము సేవించి ధన్యురాలగుఁగాక" యని తెర యెత్తి చూపిన లీలాశుకుని దివ్యవచనములు వినఁగోరెడు కృష్ణభక్తులు చెవులారఁ గ్రోలుదురు గాక.

వందే బృందావనేంద్రస్య విశ్వనాథస్య శైశవమ్
వైభవోద్గంధి మాంగల్యకటాక్షోక్షితదిఙ్ముఖమ్.
వందే కందర్పసామ్రాజ్యబృందావనవనేచరమ్
బృందైరిందీవరాక్షీణాం బందీకృత మిత స్తతః.
అవిశంక మనంగసంకులాభిర్వనితాభిర్వనితాభిరాత్తరాసమ్
కమలారమణం కిశోరవేషం పరిపువ్యన్మయ చిత్తమభ్యుదేతు.
మధ్యేమధ్యేకృష్ణమాణిక్యమిశ్రా మాలా కాచిద్వల్లవీనాం సహస్రైః
చిత్తాభోగైరభోగినాం ధన్యధన్యైః క్రియాదేషా దీర్ఘ మాఘ్రాయ
మాణా.

బృందావన వ్యసనిన స్తవ దేవకృష్ణ
లీలా శుకేన రచితం నిచితం రసాఢ్యైః
ప్రత్యక్షరం పరిమహా న్మధుకర్ణయో స్తే
స్తోత్రం త దేత దనిశం విలిహంతు ధన్యాః.

అని మొదలుగా నలువదిశ్లోకములలోఁ గృష్ణునిరాసక్రీడ వృత్తవిశేష ములతో నిక్కచ్చి వర్ణించెను. రాసక్రీడావర్ణనము పెక్కండ్రు శృంగార రసమనోజ్ఞముగా వర్ణించినను భక్తిప్రాధాన్యధన్యము గాదు. విద్యాచక్ర వర్తి యను మహాకవి రుక్మిణీకల్యాణమున రాసక్రీడ యత్యద్భుతముగాఁ దనవిద్యాగాంభీర్య మెఱుకపడ నొకసర్గ మంతయు వర్ణించెను.

శ్లిష్టోభయద్రుతవినిస్సరణోత్తరాణి
వ్యగ్రాగ్రచంక్రమణవంత్యవికీర్ణరేణు
అర్ధక్రమస్ఖలదనల్పణలంఘితాని
రేజుః పదాని సుదృశాం చలనూపురాణి.
స్వే స్వే సహోభినయసీమ్ని నిరత్యయాయాః
ప్రేమద్రుతాంతరతయా పరనిర్వ్యపేక్షః
రూపేషు పార్శ్వయుగసన్నిహితేషు విష్ణోః
గోపీజనస్య వవృతే మదనోపచారః.

ఇత్యాదిభావములు మనకుఁ గవితయుఁ బాండిత్యము నొసఁగుఁ గాని తీవ్రముగా హృదయగ్రంథిని ఛేదింపనా యని సంశయించెదను.

లీలాశుకుఁడు రచించిన పద్యము లెల్లనుఁ గృష్ణప్రోక్తము లనియే తలంచుచుఁ దన్నతనికి సర్వార్పణము చేసికొనియె. కాలవధకథ (మార్కండేయుని కొఱకు శివుఁడు యముని జయించుట) కృష్ణుఁడే యేమేని వినఁగోరిన గోపికలకుఁ జెప్పినట్లున్నది.

ఇత్యాత్మనా నిగదితం సకలవ్రజానాం
విస్మాపనాయ వచనామృతమాకలయ్య
అంతర్నిగూఢహసితేన జగత్త్రయస్య
నాథేన నిర్మిత మిదం శ్రవణామృతత్వం.
మందస్మితస్నపితముగ్ధముఖారవిందం
మందానిలాకలిత కోమలకాకపక్షమ్
అంగం తదేతదఖిలవ్రజలోచనానాం
మాంగల్యమస్తు కిమతః పరమస్తి కృత్యమ్.
పింఛావతంసరచనోచితకేశపాశం
పీనస్తనీనయనపంకజలోభనీయమ్
మందారకర్ణధరితం సురసుందరీభి-
ర్మందం ముహుః క్వణితవేణురసాభిరామమ్
కించేద మద్భుతరసం చరితం పురారేః
శృణ్వంతు"

అని శివునికథయుఁ గృష్ణునినోటనే వినుచున్నారము. యముని గర్వము సంహరించి శివుఁడు కోప ముపసంహరించుకొని విష్ణువుతో యథావిధి సుఖసల్లాపమున నుండ మహర్షివరులకు "రజతగిరి మీఁద హరిహరా రాధనంబు" గలిగెన—

అఖిలమునిజనానా మంతరన్వేషణీయం
నిఖిలనిగమానాం విభ్రమైర్లక్షణీయం
నయనపథము పేతం మంగళానందపూరం
సపది త మనుభూయ వ్యాజిగీషు ర్మునీంద్రాః

అని జగత్సృష్టికి సితాసితబీజరూప మగు నద్వైతద్వయమును నొక సర్గమున మాలినీవృత్తగంధి యగు ద్రుతద్రుపలోఁ బాడుచుఁ గొనియాడి ధన్యులైరి.

ఫణిఫణమణి లక్ష్మీపుంజమంజూకృతేన
ప్రతిభయ లలితాంగం దంతిదర్మాంబరేణ
మధురమమర నారీమంధరాపాంగలీలా
వ్యతిధురితవిహారాగారపీతాంబరేణ
గిరివరనిజకన్యాలోచనచ్ఛాయపూరై
రపి చ భుజగహారై రావృతం బాహుమధ్యే
నిచిత మురసి లక్ష్మ్యా దివ్యలీలారవిందై
రవిరతవనమాలాపట్టదామ్నా వారయంత్యా.
సజలజలదనీలం శారదాంభోదశీలం
కబళితనవనీతం కాలకూటానురాగి

ఘుసృణమసృణవేషం ఘూర్ణితోద్భ్రామిభావం
శరణమిదమిదం నః శాశ్వతం ధామ భూయాత్.

అవిచలితతరంగోత్తుంగగంగావతంసం
సమధురమధుధారాసారసారావతంసమ్
కలితశశికలాంశుశ్రేణిసంచారగౌరం
రుచిరవివిధరత్నప్రోద్గతోద్గారశారమ్.

అని మొదలుగా వర్ణనాస్తుతి స్వచ్ఛందధారామనోజ్ఞమని తలఁపవలయు. శివస్తుతిలో లీలాశుకుఁడు శాంతరసోచితభావములే కూర్చెను.

త్వామేకే ముకురాయమాణమనసః ప్రాహుస్ సమస్తాత్మనా
మన్యంతే కతిచిత్పునః పరిణతం వ్యస్తాత్మనా మన్వతే
అన్యే వ్యస్తతనుం సమస్తవపుషం జానంతి కేచిత్పునః
న వ్యస్తం న సమస్త మిత్యలముమాలోకే దూరే ధియాం తత్పదమ్.

దేవ త్వదీయచరణాంబుజభక్తిభాజాం
ధర్మార్థకామగతయః కమముక్తిలక్ష్మీ
దాసో భవేయమితి చిత్రమిదం న చేత్స్యాత్
బాణస్య వేశ్మని భవానపి వేత్రపాణిః.

అస్తోకవిస్తరభరైరపి వాఙ్మయానా
మస్పృష్టసీమ భువనాద్భుత మాదిధామ
కిం బ్రూమహే కియదిహా స్తుమహే మహేశ
కే వా వయం తవ గుణార్ణవవర్ణనేషు.

అని యయత్నసిద్ధముగాఁ బ్రవహించుకవిత—

జిహ్వారసాయనసుధాగుళికా సుధానాం
కర్ణావతంసరచనా చ కవీశ్వరాణామ్
విశ్వాధికస్తుతిరియం తవ దేవ కృష్ణ
లీలాశుకస్య సహజా విజయాయ భూయాత్.

అని లీలాశుకునికి శ్రీకృష్ణవిలాసమై యుండుట యేమి యచ్చెరువు? లీలాశుకాది యతీశ్వరులు, శృంగారరసభావముందును భగవంతుని లీలలు వర్ణించినప్పుడు కేవల మద్వంద్వులై సాక్షిపదభూతులై యంటుజంటెఱుంగక తత్త్వజ్ఞానమాత్రతనులై హృదయసంవాది భగవచ్చేష్టా సంవిత్పరిస్పందపరమానందభరితులై యుందురు. వారికేగాక మన యట్టి విమరోన్మజ్జననిమజ్జనులకుఁ దద్భాసమాన మగు తత్త్వవిశేష మెఱుంగఁ బోలునే?

అర్ధోన్మీలిత లోచనస్య పిబతః పర్యాప్త మేకం స్తనం
సద్యః ప్రస్నుతదుగ్ధదిగ్ధమపరం హస్తేన సంమార్జతః
మాత్రా చాంగులి లాలితస్య చిబుకే స్మేరాయమాణే ముఖే
విష్ణోః క్షీరకణాంబుధామధవళా దంతద్యుతిః పాతు నః.

అని యిట్లు స్వభావోక్తిరమ్యముగా స్తుతించుకవి యెఁక జన్మమెత్తి మరల జననీ స్తన్యపానము చేయఁగలుగునా? (లీలాశుకుని యీబాలకృష్ణస్తన్యపానలీలావర్ణనము వినియుండకేని రవివర్మ తనచిత్రలేఖనకౌశలము చూపుచు మతియొకచిత్రపటమును మన కనుగ్రహించియుండును) ఈపద్యమునం దశ్లీలదోషము కల దందురేమో! ఈదేహమున నీజగంబున నిందుక కనుదెఱచిచూచినవార లశ్లీలము జుగుప్సయు లేని యాబాలులైనను గానఁజాలరు. అదోషములు దొలఁగిన మనమును లీలాశుకునివంటి భాగవతులమే యగుదుము.

పర మిమ ముపదేశ మాద్రియధ్వం
నిగమవనేషు నితాంత ఖేద ఖిన్నాః
విచినుత భవనేషు వల్లవీనా-
ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్

అని లీలాశుకుఁడు ద్వైతాద్వైత శూన్యవాదాది పథభ్రమణ ఖిన్నులై దరిగానక యలయుచుండు జనులకు సులభముగా గోపికలు రోటికిఁ గట్టఁ గలిగిన యాపరతత్త్వమే యుపనిషత్తులు వెదకి వేసారిన పరలక్ష్య మని భక్తిరసపారమిత లోకమున కనుగ్రహించె. లీలాశుకుని ప్రభావ మంతయు నుదాహరణములతో గ్రంథరూపముగాఁ ద్వరలోఁ బ్రకటించుట యే యుత్తమ మని దీని నింతటితో విరమించుచున్నాఁడ.

# రసశాస్త్రములు

## భిషగ్రాజ పండిత వేంకటేశ్వరరావు మాండలిక గారు

రసశాస్త్రము ప్రప్రథమమున నీశ్వరునిచే పార్వతి కుపదేశింపఁబడినట్లు రసార్ణవమను గ్రంథమునఁ వ్రాయఁబడినది. ఈరసార్ణవము నాధారము చేసికొని పార్వతీపుత్ర, సిద్ధ నిత్యనాథుఁడు మొదలుగాఁగల యనేకులు రససిద్ధులు వారివారి యనుభవములను చేర్చి వ్రాసియున్నారు. ఇందులోఁ ప్రధానము రసవాదము. అనఁగా బంగారముచేయుట, క్షుద్రలోహములను మహౌషధికల సంయోగముచే సువర్ణరజతములఁ జేయుట రెండవది రసాయనవిభాగము- అనఁగా దేహవేధ శక్తి ద్వారా శక్తినిఁ గలిగించుట అజరామరత్వము జీవన్ముక్తి యోగాభ్యాసము మొదలగు విషయములను బోధించుచున్నది. ఈగ్రంథములో రసవాదముతో సంబంధించిన సాంకేతికపదములు బహుళముగాఁ ప్రయోగింపఁబడినవి. మొత్తముమీఁద విమర్శింపగా రసార్ణవాది వాదగ్రంథములలోను ప్రస్తుతము వైద్యోపయోగములగు మందులను దెలియఁజేయు గ్రంథములలోను - రసములు, మహారసములు ఉపరసములు సాధారణరసములు విషములు ఉపవిషములు లోహములు రత్నములు, మొదలగునవి యొల్ల సమానములుగానే కాన్పించుచున్నవి. కాని రసవాదములో విశేషసంస్కారములు చేర్పఁబడినవి. ప్రకృత వైద్యవిషయములలో సామాన్యసంస్కారములు చెప్పఁబడి యున్నవి. కాని విశేషసంస్కారములచేత రసమునకు చంచలత్వము లేకుండఁ జేసినయెడల సమస్తమైన పదార్థములును దానిలో లయ మగును.

శ్లో. యదాచ నిశ్చలం ధ్యాయే ద్యదాచ నిశ్చలంమనః
బిన్దుమధ్యే తదా నాలో బధ్యతే నిశ్చల స్తథా ॥

[రసార్ణవ. ౨ పట.]

ఈప్రకారమే మనశ్చంచలత్వములేనిచో యోగసిద్ధి యగునని యభిప్రాయ మిచ్చియున్నారు. మఱియు నీ రసేశ్వరసిద్ధాంతములో కణాద వైశేషిక నైయాయిక మతసిద్ధాంతము లక్కడక్కడ నిమిడియున్నవి. వీరు అప్రత్యక్షమును ప్రత్యక్షముగాఁ గనుఁగొనఁగలిగిరి. పైనఁజెప్పిన మహారసములు మొదలగువానిని శరీరసాత్మ్యము- [అనఁగా జీవాణువున కుత్తేజకత్వము] గలిగించువానినిగా సిద్ధముచేసి ప్రత్యక్షముచేయుటకు నీసిద్ధాంతములోని ముఖ్యవిషయముగాఁ గానిపించుచున్నది. మఱియును భూగర్భశాస్త్రము - అనఁగా లోహాదులు మొదలగు భూమిప్రదేశములు గనుఁగొనువిధానములు వానిని త్రవ్వి తీయు విధానములు వాని సత్త్వపాతనములు- అనఁగా భూమిలోనుండి త్రవ్వి తీసినపిమ్మట వానిని లోహములుగాఁ దయారుచేయుట- గనుఁగొనిరి. పిమ్మటను ఆ రసాదుల ననేకవిధము లగు రసాయనసంయోగములను చేయుటకు అనేకములైన మూషలు, మొదలగు పరికరములద్వారా వండి సిద్ధముచేయుట గనుఁగొనిరి. రసశాల యుండవలసినవిధము, ఆరసశాలలో నుండెడి పరికరములును రసార్ణవమునం దిట్లు వర్ణింపఁబడినవి:—

శ్లో. రసోపరసలోహాని వసనం కాంజికం బిడం
ధమనీలోహయంత్రాణి ఖల్వపాషాణమర్దకం
కోష్ఠికావక్రనాళంచ గోమయం సార మింధనం
మృణ్మయానిచ యంత్రాణి ముసలోలూఖలానిచ
సందంశీ పట్టసం దంశం మృత్పాత్రాయః కశోరికం
ప్రతిమానాని చ తులాఛేదనాని కషోపలం,
వంశనాళీ లోహనాళీ మూషాం గారాంతదౌషధీః
స్నేహామ్ల లవణ క్షార విషా ణ్యుపవిషాణిచ
ఏవం సంగృహ్య సంభారం కర్మయోగం సమారభేత్

[రసార్ణవ. పట ౪.]

(1) రసములు (2) ఉపరసములు (3) లోహములు మొదలగునవి (4) వసనం (5) కాంజికము (6) బిడలు (7) ధమని (8) లోహయంత్రములు (9) ఖల్వములు (10) కోష్టిక = తిత్తి (11) వక్రనాళము = వంకరగొట్టము (12) గోమయము (13) సారమంధనము (14) మృణ్మయయంత్రములు (15) రోకలి, రోలు (16) సందంశి = కారు (17) పట్టసందంశం = వంకకారు (18) మృత్పాత్రములు (19) లోహపాత్రలు. (20) త్రాసు = పరిమాణములు (21) ఛేదనములు = కత్తులు (22) కషోపలము = గీటురాయి (23) వంశనాళి (24) లోహనాళములు (25) మూసలు (26) అంగారములు (27) ఓషధులు (28) స్నేహములు (29) ఆమ్లములు (30) లవణములు (31) క్షారములు (32) విషములు (33) ఉపవిషములు ఈమొదలగు వనిముట్లను, మఱియు డోలాయంత్ర మూషాయంత్ర గర్భయంత్ర భూధరయంత్రము హంసపాకయంత్రాది యంత్రములను సంపాదించి పని నారంభింపవలయును.

మూషలుచేయుటకు మృత్తికాలక్షణములను వజ్రమూష వర్ణమూష భస్మమూష ప్రకాశమూష మొదలగు మూషలను చెప్పఁబడినవి. మఱియు లోహాదులు మూసలలో కరఁగుచున్నప్పుడు వానిరంగులు ఈక్రిందివిధమున రూపింపఁబడినవి:-

శ్లో. ఆవర్తమానే కనకే పీతా, తారే సితప్రభా
శుల్బే నీలనిభా తీక్ష్ణే కృష్ణవర్ణా, సురేశ్వరీ
వంగే జ్వాలా కపోతాభా నాగే మలినధూమికా
శైలేతు ధూసరా దేవి! ఆయసే కపిలప్రభా
అయస్కాంతే ధూమ్రవర్ణా సస్యకే లోహితా భవేత్
వజ్రే నానావిధా జ్వాలాఖసత్వే పాండురప్రభా

[రసార్ణవ. పటల ౪.]

కరఁగునప్పుడు విశుద్ధలోహము లుండువిధ మీశ్లోకములలో నిరూపింపఁబడినది.

శ్లో. న విస్ఫులింగో నచ బుద్బుదం చ యదా నరేఖాపటలం న శబ్దః
మూషాగతం రత్నసమం స్థిరంచ తదా విశుద్ధం ప్రవదన్తి లోహమ్.

లోహములు మూసలో కరఁగునప్పుడు కరఁగకుండ నుండఁ గూడదు. గొడుగు ఎత్తఁగూడదు. బ్రద్దలగుటగూడదు. ధ్వని కూడదు. కాని కరఁగునప్పుడు రత్నసమానముగను- నిలుకడగను- గరఁగినచో శ్రేష్ఠ లోహ మగును. [రసార్ణవ. పట ౧౪.]

దీనివలన భూగర్భమునుండి తీసి లోహములు తయారుచేయుట. కరఁగుచున్నప్పుడు నిదానము- మొదలగువిషయములు గనిపెట్టియున్నారు. మఱియు నీవిషయమై పారిభాషికపదము లీక్రిందివిధమున వర్ణింపఁబడినవి.

శ్లో. ప్రతీవాపః పురా యోజ్యో నిషేకం తదనంతరమ్
ఛాదనంతు ప్రతీవాపో నిషేకం మజ్జనం విదుః
అభిషేక స్త దిచ్ఛంతి స్నపనం క్రియతేతు యత్
వాపో నిషేకః స్నపనం ద్రుతే నిర్మలతాం గతే
ఉష్ణే నైవహి వాంఛంతి శీతలం నచ వాంఛతి
శుక్లదీప్తిః సశబ్దంచ యదా స్యాద్వాప లోహవేత్
[రసార్ణవ. పట ౪.]

ప్రతీవాపము ముందుగా చేయవలెను. అనఁగా శుద్ధిచేయుటకు వెలిగారము, పటిక మొదలగునవి నిషేకము ఛాదనము ప్రతీవాపము నిషేకము మజ్జనము అభిషేకము స్నపనము ఈకార్యములు లోహములు కరఁగుచున్నప్పుడు కొన్ని, కరఁగినపిమ్మటఁ గొన్ని, చేయవలసియున్నవి. లోహములు వేడిచే శోధను గాని శైత్యమును మాత్రము కోరవు. మఱియు- శ్లో. లోహావర్త స విజ్ఞేయః సత్త్వం పతతి నిర్మలమ్. నిప్పు తెల్లనైన కాంతి గలిగియుండిన నిర్మలమైన సత్త్వము దిగినదని గుర్తుంగునది. దీనినే లోహావర్త మనెదరు.

శ్లో. ద్రుతే ద్రవ్యాంతరక్షేపో లోహాద్యైః క్రియతేతు యః
స ఆవాపః ప్రతీవాప స్తదేవాచ్ఛాదనం మతమ్
శ్లో. ద్రుతే వహ్నిస్థితే లోహే తిరమ్యాఖ్యనిషేచకమ్
సలిలస్యోపరి క్షేపః సోభిషేక ఇతి స్మృతః.
శ్లో. త త్రస్యాప్సు వినిక్షేపో నివాపః స్నపనం చ తత్.
ప్రతీవాపాదికం కార్యం ద్రుతే లోహే సునిర్మలే
శ్లో. యదా హుతాశో దీప్తార్చిః శుక్లోత్థానసమన్వితః
శుద్ధావర్త స్తదా జ్ఞేయః సకాలఃసత్త్వనిర్గమే

మఱియు నేయే బొగ్గులు పనికివచ్చునో కోష్ఠికల ప్రమాణములు అనర్చువిధానములు ఎట్టివో విపులముగా వర్ణింపఁబడినవి. సత్త్వపాతనానంతరము లోహాదులను శోధనజారణ మారణములు, రస మహారసోపరస, సాధారణరస, విషోపవిషశోధనాదులు, జారణాదులు మొదలగునవి కొంచెము మతభేదములలో గ్రంథకర్తలందఱును ఒక విధానముగనే సమర్థించియున్నారు.

(1) మహారసములు = అభ్రకము వైక్రాంతము మాక్షికము విమల శిలాజిత్తు మైలతుత్థము చపలము ఉల్లిపాషాణము రసకము, ఇవి మహారసము లని రసప్రదీపికయందును, రసరత్నసముచ్చయములోను చెప్పఁబడినవి. అభ్రకము రసకము ఈరెండును ఆయుర్వేదప్రకాశికలో నుపరసములలోఁ జేర్పఁబడినవి.

(2) ఉపరసములు:-గంధకము గైరికము కాశీసము పటిక తాళకము మణిశిల అంజనములు కంకుష్ఠము అను నీయెనిమిది ఉపరసములుగా రసప్రదీపిక గ్రంథకర్తయు, రసవాగ్భట్టును వాడియున్నారు.

మఱియు హింగుళము అభ్రకము రసకము వరాటికలు శంఖములు ఖటికము సికత బోళము - పైన చెప్పినవి గాక ఈయెనిమిదింటిని గూడ నాయుర్వేదప్రకాశికాకారు లుపరసముల క్రింద విభజించియున్నారు.

(3) సాధారణరసములు:- కంపిల్లము, గౌరీపాషాణము, నవాసారము, వరాటికలు, అగ్నిజారము, గిరిసిందూరము, హింగుళము, మృద్దారుశృంగి, ఈయెనిమిది సాధారణరసము లని రసవాగ్భట్టును సిద్ధనాగార్జునాదులు సిద్ధాంతీకరించిరి. కంపిల్లము, చపలము, ఈరెండును, ఆయుర్వేదప్రకాశికాకారులు సాధారణరసములలోఁ జేర్చియున్నారు.

(4) మహావిషములు.- కాలకూటము, వత్సనాభము, శృంగకము ప్రదీపనము, హాలాహలము, బ్రహ్మపుత్రము, హారిద్రకము, సక్తుకము, సౌరాష్ట్రికము, అని తొమ్మిది మహావిషములు చెప్పఁబడియున్నవి. అందు వత్సనాభము ఒకటియే ప్రస్తుతము వాడుకలో నున్నది.

(5) ఉపవిషములు = జిల్లేడు, జొంతజెముడు, ధుత్తూరము, లాంగలి, కరవీరము, గుంజ, నల్లదుంప, ఈయేడును ఉపవిషములని శార్ఙ్గధరుఁడు వాడియున్నాడు. ఈనల్లమందు శార్ఙ్గధరునకు బహుశః వాడినట్లు శాస్త్రములవలనఁ గానుపించదు. విషతిందుకములు, జేపాళములు, మొదలగునవి మహావిషములలోఁ గాని ఉపవిషములలోఁ గాని చేర్పఁబడలేదు. అహిఫేనము గరళము పైనివ్రాసిన విభాగములో జేర్పబడలేదు: అహిఫేనము అనఁగా—

శ్లో. సముద్రేచైవ జాయంతే విషమత్స్యా శ్చతుర్విధాః
తేషాం ఫేనం సముత్పన్నం మహిఫేనం చతుర్విధమ్
కేచి ద్వదన్తి సర్పస్య ఫేనా స్యాదహిఫేనకమ్

రససారము 60 పుటలో గోవిందాచార్యులవారు సముద్రములో నాలుగువిధములైనవిషమత్స్యములుగలవనియువాటిఫేను అహిఫేనమనియు చెప్పియున్నారు, ఈవిషమత్స్యముల విషము త్రాచుపాముపిషము కన్న తీవ్రమైనదని వ్రాయుచు మద్రాసుఆక్వేరియములో నట్టివిషమత్స్యములను పెట్టియున్నారు. కొందఱందు కృష్ణసర్పగరళమును వాడుచున్నారు.

అష్టలోహములు :— ఇందులో స్వర్ణము, తారము, తామ్రము, లోహము, వంగము, నాగము అను నీయాఱును శుద్ధలోహములుగాను పిత్తళము, కాంస్యము, ఈరెండును మిశ్రలోహములుగాను, ఈయెనిమిదియుఁ గలసి అష్టలోహములుగాను రసప్రదీపకారులు విభజించిరి. యోగరత్నాకరములో సప్తలోహములని పైని చెప్పఁబడిన విశుద్ధలోహములలో కాంస్యమును జేర్చిన సప్తలోహములగు ననియు నెనిమిదవలోహము పాదరసమనియుఁ జెప్పఁబడినది. మఱియుఁ బైనిఁ జెప్పఁబడిన శుద్ధలోహములతో (యశదము) సత్తును జేర్చిన సప్తధాతువు లగు

వని యాయుర్వేదప్రకాశికలోఁ జెప్పఁబడినది. మఱియు స్వర్ణము, రజతము, తామ్రము, లోహము, కాంతము, ముండము, నాగము, వంగము ఈ యెనిమిదియు నష్టలోహము లనియు, పిత్తలము, కాంస్యము, వర్తలోహము, ఈ మూడును మిశ్రలోహములనియు, రసరత్నసముచ్చయములోఁ జెప్పఁబడి యున్నది. రత్నములు=మాణిక్యము (కెంపు) మౌక్తికము, ప్రవాళము, పచ్చ, పుష్యరాగము, వజ్రము, నీలము, గోమేధికము, వైడూర్యము, ఈతొమ్మిదియు నవరత్నములని రసప్రదీపికలోఁ జెప్పఁబడియున్నవి. మఱియు మహారత్నములు, ఉపరత్నములు అని ఆయుర్వేదప్రకాశికలో నీవిధముగా విభాగింపఁబడినవి.

మహారత్నములు:— మౌక్తికము వజ్రము వైడూర్యము పద్మరాగము పుష్యరాగము గోమేధము నీలము గారుత్మతము ప్రవాళము ఈ తొమ్మిదియు మహారత్నములనియు వైక్రాంతము సూర్యకాంతము చంద్రకాంతము రాజావర్తము ఫిరోజా ముక్తాశుక్తి శంఖము కర్పూరశిల కాచము మొదలగునవి ఉపరత్నములుగాను ఆయుర్వేదప్రకాశికలో వర్ణింపఁబడినవి. రసరత్నసముచ్చయములోఁ గూడఁ బైప్రకారము వర్ణించుచు, పద్మరాగము ఇంద్రనీలము మరకతము పుష్యరాగము వజ్రము ఈ యైదును పంచరత్నములుగా వర్ణింపఁబడినవి. ఈసముదాయమున విచారించిచూడఁగాఁ బై వస్తువుల యంతయు రసశాస్త్రములో నిమిడియున్నది. వీనిని తీయువిధానములు నిదానములు శోధనలు మారణములు భస్మవిధానములు ద్వంద్వమేళనములు శక్తులు గుణములు మొదలగునవి విశేషముగా వర్ణింపఁబడినవి. అంతె భస్మములు రెండువిధములు. ఒకటి వ్యాధిని నాశము చేయునది. మఱియొకవిధానము రసాయనోపయోగ మైనదిగా రసేంద్రసారసంగ్రహములోను, ఆయుర్వేదప్రకాశికలోను వర్ణింపఁబడినది. ఎట్లనిన:—

శ్లో. దశాదిస్తు శతాంత స్స్యాద్ వ్యాధినాశనకర్మణి
శతాదిస్తు సహస్రాంతః పుటోదేయోరసాయనే.

రసాయనమున కుపయోగించు భస్మములు వ్యాధులకుఁ బనికి వచ్చును. కాని వ్యాధులను నివారణచేయు భస్మాదులు మాత్రము రసాయనమున కంతమాత్రమును బనికిరావని కంఠోక్తిగాఁ జెప్పఁబడినది. ఎందుచేతననఁగా, ధాతువులకు పునర్భవము గలదు. పునర్భవము గలిగిన ధాతువులు వ్యాధినాశకములు. అపునర్భవములు రసాయనోపయోగముగ విభజింపఁబడినవి. దీనివలనఁ బరమాణువులు రూపాంతరములను బొందియున్న వని అపునర్భవములు జన్మరాహిత్యము గలవని సిద్ధాంతీకరింపఁబడినవి. పునర్భవములా? అపునర్భవములా? అని ప్రత్యక్షముగా మనము పరీక్షించి చూచి రోగనివారకభస్మములను రసాయనోపయోగభస్మములను గనుఁగొనుటకు నీదిగువ నుదాహరించిన సూత్రమును గనుఁగొనియున్నారు. గురివిందగింజలు నెయ్యి లక్క తేనె వెలిగారము గొంగళిపెండ్రుకలు ఈయాఱువస్తువులను నూరి మూసలో నుంచి దానిపై నేభస్మమునైనను వేసి దానిపైని వైకల్యము వేసి నిప్పులో కాఁచినను-లేక పుటము పెట్టిన-మఱల ధాతువుగా మాఱినట్లు కొన్ని గుర్తులు గానిపించును. భస్మము లన్నియు బాగుగాఁ గనిపించి నప్పటికిని పై విధానముచేత లోహముల పూర్వావస్థలు గనుఁగొని నిర్ధారణచేయఁగలుగుదుము. రసాయనోపయోగవిధానములచే సిద్ధము చేయఁబడిన భస్మములు పైగుంజాదికల్కములో పెట్టి తీవ్రాగ్నియం దుంపఁబడినప్పటికిని నిశ్చలముగా ధాతువులుగా మాఱకుండ నుండును. దీనినే సన్న్యాస మనియును జన్మరాహిత్య మనియు నపునర్భవ మనియుఁ జెప్పెదరు. ఈ విధానము యోగరత్నాకరములో వర్ణింపఁబడి యున్నది.

శ్లో. రక్తికాఘృతం లాక్షయా యుతం
క్షౌద్రమిశ్రితం టంకణాన్వితమ్
ఊర్ణయా తథా ధ్మాతతాం గతా
స్సప్తధాతవో యాన్తి జీవతామ్.

అని పునరుత్థానముం జెప్పియున్నారు.

శ్లో. సర్వ మేతత్స్మృతం లోహం ధ్మాతవ్యం మిత్రపంచకైః
ఇత్యేవం స్యా న్నిరుత్థానం సేవ్యం వారితరం భవేత్.

అని నిరుత్థానము లేక సన్న్యాసము, అపునర్భవము, జన్మరాహిత్యమును చెప్పియున్నారు. ఒకవేళ సన్న్యాసము అపునర్భవము అయినదని భ్రాంతిని తొలఁగించుకొని పైప్రకారము పరీక్షకు అగనిరెడల మరల గంధకాదులతో పుటములు వేసిన నిరుత్థాన మగునని చెప్పఁబడినది.

శ్లో. గంధకం చోత్థితం లోహం తుల్యం ఖల్వే విమర్దయేత్
దినైకం కన్యకాద్రావై రుద్ధ్వాగజపుటే పచేత్
ఇత్యేవం సర్వలోహానాం కర్తవ్యం త న్నిరుత్థితమ్.

అని చెప్పఁబడి యున్నది. కాని పాశ్చాత్యసిద్ధాంతములను పఠించిన ప్రఫుల్లచంద్రరేగారు వ్రాసిన "నవ్య రసాయనవిద్య" అను బంగాళీ పుస్తకములో పై గుంజాదులు మొదలగునవి కాలుటవలన అంగారామ్లము (బొగ్గుపులుసువాయువు) జనించు ననియును, ఆ బొగ్గుపులుసు వాయువుసంయోగముచే భస్మాదులకు సజాతీయధాతువుల గుణము బయలు వెడలు ననియును వ్రాసియున్నారు. దీనివలన మనము ప్రాచీను లేర్పాటుచేసిన రసేశ్వరసిద్ధాంతములలోని మార్పు లనేకములు గనుఁగొన వచ్చును. మన కన్ని పదార్థములు ప్రాచీనులు సిద్ధముచేసి యుంచిరి. కాని మనముమాత్రము పట్టి పరిశోధనములు గావింపకున్నందులకుఁ జింతింపవలసి యున్నది. కాని యిందులో లభ్యములైనవి మాత్రమే వైద్యశాస్త్రమునందుఁ బ్రస్తుతము వాడుచున్నారు.

శ్లో. ద్రుతయోపి న దృష్టాస్తే శాస్త్రే దృష్టా అపి ధ్రువమ్
వినా శంభోః ప్రసాదేన నసిద్ధ్యతి కదాచన.

రాగములు బీజసాధనము శక్తిచతుష్టయు నిరూపణము బీజరంజనము భూచరీజారణ ఖేచరీజారణాదు లగు జారణలు బంధములు హేమతారదశములు మొదలగునవి రసవాదములోఁ జేరియున్నవి. రసమునకు అష్టాదశసంస్కారములు గలవు. ఇందులో ఎనిమిది మాత్రము వైద్యోపయోగము లైనవి.

శ్లో. స్వేదన మర్దన మూర్ఛనోత్థాపన పాతన నిరోధ నియమాశ్చ
దీపనగగనగ్రాసప్రమాణ మథ చారణావిధానంచ

గర్భద్రుతి బాహ్యద్రుతి జారణరసరాగసారణంచైవ
క్రామణవేధా భక్షణ మష్టాదశధేతి రసకర్మ [రసహృ-15 పు.]

శింప స్వేదన మర్దన మూర్ఛనోత్థాపన పాతన బోధన నియమన సందీపనానువాసన గగనాది గ్రాసప్రమాణచారణ గర్భద్రుతి బాహ్య ద్రుతి జారణ రంజన సారణ క్రమణ వేధన భక్షణాఖ్యా ఊన వింశతిసంస్కారాః సూతసిద్ధిదా భవంతి. దీపనాన్తా అష్టౌ సంస్కారా దేహసిద్ధిదా భవంతి.

శ్లో. ఇత్యష్టౌ సూతసంస్కారాః సమా ద్రవ్యే రసాయనే
శేషా ద్రవ్యోపయోగిత్వా న్నతే వైద్యోపయోగినః. ఆ-ప్ర 4 పు

మిగత 10 సంస్కారములు రసేశ్వరసిద్ధాంతమతములోఁ జేరినవి. పై సిద్ధాంతమురీతిగా తయారుచేసిన వజ్రసుందరీగుటిక మొదలగు మందులు రసార్ణవరసరత్నాకరరసాయనఖండములలోను, ఆసరసారము రసహృదయము మొదలైన రసగ్రంథములలోను విశేషముగఁ జెప్పఁబడియున్నవి. కాని యవి పుచ్చుకొనుటకు ముందు క్షేత్రీకరణముఁ జేసినఁగాని పుచ్చుకొనఁగూడ దనిఁ జెప్పఁబడినది. క్షేత్రీకరణమునకును, పంచకర్మములకును, భేదము గానిపించదు. ఈ శాస్త్రము ననుసరించియే మకరధ్వజము స్వర్ణగుటికషడ్గుణబలిజారణ మకరధ్వజము సిద్ధమకరధ్వజము పూర్ణచంద్రోదయము మొదలగు మందులు చేయఁబడినవి. ప్రస్తుతము పైశాస్త్రమునకు భిన్నముగా కేవలము వైద్యోపయోగముగ మాత్రము వైద్యులు తయారుచేయుచున్నారు. పైనఁ జెప్పఁబడిన మందులలో హేమబీజములు రసములోఁ గలియు నట్లును హేమరసబీజము లయినట్లును వారు సిద్ధాంతీకరించి యున్నారు. ప్రస్తుతము మన పట్టి బీజసంయోగము చేయుటకు పైనఁ జెప్పఁబడిన రససంస్కారములు చేసినంగాని బీజసంయోగము కానేరదు. అట్టి సంస్కారములు చేయనులేదు. బీజసంయోగము కానులేదు. అందుచేతనే పైమందులు వండునప్పుడు స్వర్ణము అడుగున దిగి భస్మ రూపముగా నిలిచిపోవుచున్నది.

శ్లో. హేమ్ని జీర్ణే సహస్రైకగుణ సంప త్ప్రదాయకః॥ ఆ॥ ప్ర॥

సంస్కారములు చేసినచో రసహేమబీజ మగును. అప్పుడే రసాయన మగును.

శ్లో. సమే గంధేతు రోగఘ్నో ద్విగుణే రాజయక్ష్మనుత్
జీర్ణేతు త్రిగుణే గంధే కామినీ దర్పనాశనః
చతుర్గుణేతు తేజస్వీ సర్వశాస్త్రవిశారదః
భవే త్పంచగుణే సిద్ధఃషడ్గుణే మృత్యుజి ద్భవేత్.

ఆయు-ప్ర-కా-పుట-౫.

ప్రస్తుత పట్టి రాసాయనికసంయోగము లేకపోయినప్పటికిని కేవలము గంధకజారణమువలననే యట్టి మహాఫలము గలుగునని శాస్త్రములలోఁ జెప్పఁబడినది. పైయోగముల విభేదము తెలియుటకు వ్రాసిన ప్రకారముగ భాగములను నిర్ణయించి సిద్ధము చేయవలయును.

మకరధ్వజము.

శ్లో. స్వర్ణదశం పలంచైవ రసేంద్రంచ పలాష్టకమ్
రసస్య ద్విగుణం గంధం తేనైవ కజ్జలీకృతమ్
కుమారికారసై ర్భావ్యమ్..............భైషజ్యరత్నావళి.

(1) స్వర్ణపత్రము 8 తులములు (2) హింగుళోత్థపారదము 64 తులములు (3) శోధితగంధకము 128 తులములు—ఈ వస్తువులు కలబందరసములో నూరి ఆరఁబెట్టి గాజుకుప్పెలోఁ గాని, సీసాలోఁ గాని 2 రోజులు వండవలయును. దీనినే మకరధ్వజ మని వాడెదరు.

(2) స్వర్ణగుటిక షడ్గుణబలిజారణ మకరధ్వజము:—పై మకరధ్వజము సాంగశీతలముగఁ దీసి దానిలో మరల శోధితగంధకము 128 తులములు వేసి కుమారరసముపోసి మర్దనచేసి యేకుచీలవున్నలు పూసిన గాజుకుప్పెలోఁ గాని సమతలము గలిగియున్న సీసాలోఁ గాని వేసి వాలుకాయంత్రములో మూఁడుదినములు వండి సాంగశీతలముగఁ దీసి మరల శోధితగంధకము 128 తులములు వేసి కలబందరసము పోసి మర్దనచేసి ఆరించి గాజుకుప్పెలో వేసి వాలుకాయంత్రములో మూఁడుదినములు వండి సాంగశీతలముగఁ దీసినచో దానినే షడ్గుణ బలి జారణమకరధ్వజముగ వాడెదరు. భైషజ్యరత్నావళి బంగాళీ 115 పుట.

సిద్ధమకరధ్వజము:—

శ్లో. పలమానం రసం సమ్య గృహాసంస్కారసంస్కృతమ్
తథా పలద్వయం గంధం శుద్ధహేమద్విశాణ్ణికమ్.

భై-ర-బం-920-పు.

శోధితపారదము 8 తులములు, గంధకము 16 తులములు, స్వర్ణము 4 తులములు—ఈ వస్తువులు శోణఖల్వములో నెనిమిదిజాము లెఱ్ఱ ప్రత్తిపువ్వుల రసములోను తెల్లయూడిగపండ్ల రసముతోను, కలబంద రసములోను ప్రత్యేక ప్రత్యేకముగ నెనిమిది జాముల ప్రకారము నూరి ఆరించి 7 మృత్కర్పటములు వేసిన గాజుకుప్పెలోఁగాని సీసాలోఁగాని, వేసి, సాల సరళ ఖదిర బిల్వ కాష్ఠములు ఎండినవానితో నిరంతరముగ నెనిమిది యామములు వండవలెను. మొదటి రెండుజాములు మృద్వగ్ని చేతను, తరువాత రెండుజాములు మధ్యమాగ్ని చేతను, తరువాత రెండుజాములు తీవ్రాగ్ని చేతను, మిగత రెండుజాములు మరల మృద్వగ్ని చేతను, వండి సాంగశీతలమునఁ దీయునది. కుప్పెలోనుండి మందు దీసి మరల 32 తులములు గంధకము వేసి పైరసములచేత నూరి వాలుకాయంత్రములో । నెనిమిదిజాములు పూర్వప్రకారముగా పాకముచేసి సాంగశీతలమునఁ దీసిన నది సిద్ధమకరధ్వజ మని శాస్త్రములోఁ జెప్పఁ బడినది.

శ్లో. స్వయం త్రైలోక్యనాథేన త్రైలోక్యహిత మిచ్ఛతా
సమర్పితోయం సిద్ధేభ్యః కరుణార్ద్రేణ వై మతః
అతోయం భువనే ఖ్యాతః శ్రీసిద్ధమకరధ్వజః.

అని వ్రాయఁబడియున్నది. ఈశ్లోకముయొక్క శైలిని బురస్కరించుకొని ప్రాచీనమా? నవీనమా? అని సిద్ధాంతీకరింపవలసి యున్నది. ఏది యెటులున్నను ప్రస్తుతము వంగదేశములో నిది బహుళప్రచారము గలిగియున్న దనుటకు సందియము లేదు.

చంద్రోదయము:—

శ్లో. పలం మృదు స్వర్ణదళం రసేంద్రం పలాష్టకం షోడశగంధకంచ,
శోణైస్సుకార్పాసభవైః ప్రసూనైః సర్వం విమర్ద్యాథకుమారికాద్భిః
భై॥ ర॥ 735 పు॥ బ॥

1. స్వర్ణపత్రము 1 పలము 2. శోధితపారదము 8 పలములు 3. గంధకము 16 పలములు—ఈ వస్తువు లెఱ్ఱ ప్రత్తిపువ్వుల రసముతోను కలబందరసముతోను నూరి ఆరించి గాజుకుప్పెలోఁ గాని సమతల సీసాలోఁగాని పోసి వాలుకాయంత్రములో మూడురోజులు వండి సాంగశీతలమునకుఁ దీయునది. ఈ నాలుగుయోగములలోని మకరధ్వజము చంద్రోదయము ఈరెండును భాగములలోనైనను నేమి, పాకములోనైననేమి ఒక విధముగానే యున్నవి. స్వర్ణఘటిత షడ్గుణబలిజారణ మకరధ్వజమునకు గంధకము ఎక్కువచేర్చి మరిరెండుపర్యాయములు 6 రోజులు పాకము చెప్పఁబడియున్నది. సిద్ధమకరధ్వజములో చంద్రోదయము మకరధ్వజమువలెఁ గాక స్వర్ణము 3 రెట్లు హెచ్చుగఁ జేర్పఁబడుటయును, తొమ్మిదిదినములు పాకమును జెప్పఁబడినది. కాని వీనిలో స్వర్ణము తక్కువగ వేసినను ఎక్కువగ వేసినను పాకము చేయుటలో అడుగున నిలిచి యొకప్పుడు బూడిదరంగుగను, ఒకప్పుడెండుగడ్డి వర్ణముగను, ఒకప్పుడు స్వర్ణరజతముగను, పాకముల ననుసరించి యడుగున నుండిపోవును. ఎందుచేత ననఁగా హింగుళోత్థరసము వేయుటయును, రసమును సంస్కారములు చేయకపోవుటయు నని యూహింపవలసియున్నది. ఇంగిలీకమునుండి తీసినరసము నిర్దుష్టమైనదని యొకచోటఁ జెప్పఁబడినది. మఱియొకచోట హింగుళోత్థ పారదమునకు నపుంసకత్వాదిదోషములు గల వనియును దీనినిగూడఁ బారదసంస్కారములవలెఁ జేసినఁగాని ఫలప్రదము గాదనియును కొందఱుండి మతము. ఇంతకును ప్రస్తుతము ఈ వైద్యులచేయు వైద్యవేత్తలు లేరనియే దృఢముగాఁ జెప్పవచ్చును. పాకములలోను, చేయువిధానములలోను, చాలభేదములు కలవు. దక్షిణహిందూస్థానమువారు పైనిఁ జెప్పఁబడిన మందులలోనుండు రస గంధకములు కజ్జలు చేసి గాజుకుప్పెకు పాగ వెళ్లుటకు ద్వారము నుంచి పాకము చేయుచున్నారు. ఉత్తరహిందూస్థానములో వంగీయులు సైంధవలవణము ఖటుకము నూరి ముద్రవేసి పాకము చేయుచున్నారు. వీరు ముందుగా షడ్గుణబలిజారణవిధానముగా సిద్ధము చేసికొని ముద్రవేసి అంతర్ధూమవిపాచితము చేయుచున్నారు. ముందుగా శోధిత రసము నొకశరావములో వేసి ఆశరావము నినుకమీదఁ బెట్టి రసప్రమాణము గంధకము వేసి జారణచేసి పిమ్మట క్రమ క్రమముగా గంధకమును జీర్ణింపఁజేసి దానిలో స్వర్ణమును గలిపి గాజుకుప్పెలో వేసి సికతాయంత్రములో వండుచున్నారు.

శ్లో. సూతప్రమాణం సికతాఖ్యయంత్రే
దత్వా బలిం మృద్ఘటికేఽల్పభాండే
తైలావశేషంచ రసం నిదధ్యాత్
మగ్నార్ధకాయం ప్రవిలోక్య ధూయః.
అషడ్గుణం గంధక మల్పమల్పం
క్షీణే ద్రసోజీర్ణ బలి గ్రహీయాన్
రసేషు సర్వేషు నియోజితోయ
మసంశయం హంతిగదం జవేన ఆయుర్యోర్త్వత్తైస్య కాపీముఖే ముద్రా కార్యా ఇతి కేచిద్వదంతి. అన్యేతు ముద్రా మదత్త్వైవ రసభస్మ సంపాదయన్తి యథా సంప్రదాయం వ్యవస్థా ఆం॥ ప్ర॥ పుట॥ 46.

కాని, ఈషడ్గుణబలిజారణము పైని చెప్పినట్లుగాఁ జేసికొనిన గాజుకుప్పెలు 1-2 సరిపోవును. అదిమఱికే గంధకము జీర్ణించినది. కనుక ముద్ర మధ్యకాలములో వేసినను రసము పాకావసానములో పైకిపోకుండ మందు తెలుగు రాకుండ నుండును. కాని స్వర్ణము మామూలుగా అడుగుననే నిలిచియుండును. అడుగున నిలిచియున్న స్వర్ణభస్మము పైమందులలో కలిపివాడుట సంప్రదాయమై యున్నది. పైమందులలో నిదిగువవ్రాసిన కల్కములు చేర్చుకొని పొట్లములుగాని, వటికలుగాని కట్టి యుపయోగించిన గుణదాయకము.

శ్లో. నిష్పాద్యచైతస్యపలం పలాని చత్వారి కర్పూరరజస్తథైవ
జాతీఫలం చోషణ మింద్రపుష్పం కస్తూరికాయా ఇహశాణమేకమ్
భైషజ్యరత్నావళి 735 పు॥ బం॥

శ్లో. సంగృహ్య చైతస్య పలంచ సమ్యక్ పలంచ కర్పూరరజ స్తథైవ.
రసేంద్రసారసంగ్రహము 308 పుట (బంగాళీ)

ఈవిధముగానే దక్షిణహిందూస్థానములో వాడుకలోనున్న తాళపత్రలిఖితములలోఁ గూడ నున్నది. అయితే పైనివ్రాసిన భాగనిర్ణయము భైషజ్యరత్నావళి బంగాళీవ్యాఖ్యానములో నీక్రిందివిధానముగా నున్నది. 1. చంద్రోదయరజము 1 పలము, 2 పచ్చకర్పూరము 4 పలములు, 3 జాజికాయ 1 శాణము=అనగా $\frac{1}{2}$ తులం, 4 త్రికటుకచూర్ణము 1 శాణము, 5 లవంగము 1 శాణము, 6 కస్తూరి 1 శాణము. అని చెప్పఁబడినది. మఱియు రసేంద్రసార సంగ్రహము బంగాళీవ్యాఖ్య 460 పుటలో 1 స్వర్ణసహితచంద్రోదయము 1 పలం, 2 పచ్చకర్పూరము 1 పలం, 3 జాజికాయ 1 పలం, 4 మిరియాలు 1 పలం, లవంగాలు 1 పలం, 6 కస్తూరి 1 శాణము $\frac{1}{2}$ తులం అని చెప్పఁబడినది.

ఈవిధముగా ప్రాచీనతాళపత్రలిఖితములలోఁ గూడ స్వర్ణమిశ్రిత చంద్రోదయము పలము, మిగతనాలుగువస్తువులు నాల్గు పలములు కస్తూరి- శాణము- అనగా $\frac{1}{2}$ తులమని వ్రాయబడియున్నది. ఆంధ్రదేశములో మాత్రము ఈవిధానమే యుపయోగింపఁబడుచున్నది. మిరియాలు వేయుస్థలములో ప్రమేహశాంతికొఱకు చలవమిరియాలు వేసి తములపాకులరసము పన్నీరుతోను మర్దనచేసి వాడుచున్నారు. ఈచంద్రోదయమునకే కాక పైనివ్రాయఁబడిన మకరధ్వజము మొదలగు మందులకును సిందూరములకును గూడ నీకల్కము వేసికొనినచో గుణప్రదముగా నుండవచ్చును. ఈచంద్రోదయము విషయమై షుమారు 380 సంవత్సరముల క్రిందట జీవానందననాటకములో సూత్రధారుని ప్రస్తావనాంకమునందు.

శ్లో. రీతి స్సుఖపదన్యాసా శారదీయా విజృంభతే
పూర్ణచంద్రోదయ శ్చాయం నిహన్తి ధ్వాంత మామయం

అని చెప్పియున్నారు. అనఁగా శరత్కాలచంద్రుఁడు చీకటిని బోఁగొట్టి సంతోషమును గలిగించునట్లు పూర్ణచంద్రోదయము చీకట్లనెడి రోగములను బోఁగొట్టి వెలుతురు నిచ్చునని వర్ణింపఁబడినది. ఇందు కలనరసేశ్వరసిద్ధాంత మగు నీచంద్రోదయము వైష్ణవీశక్తిని (ఇమ్యూనిటు) గలిగించు నని బోధించుచున్నది. ఈ రసశాస్త్రములో ననేకవిషయములు పరిశోధించి వానిఫలితములు వ్రాయవలసియున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాఁడను.

# తిరుపతి కొండ భిక్షుకులు

పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు

శ్రీకరమై సాధుజన వ
శీకరమై వివిధవర్ణ - శ్రితజనసమ్మో
దాకరమై దివ్యమ్ముగలతి
కాకరమై యొప్పు వేంక - టాచలము మహిన్.

సీ. శ్రీవిభుదర్శన - సేవనముల కేగు
యాత్రికుల్ దాతలు - యాచకులకు
బదిమూప్యముల కగు - పైసలఁ గొని యొకో
క్కని కొకపైస లె - క్కఁగ నొసంగ
భిక్షుకులే చాల - వెనుకకు మిగులఁగ
లట్టి యసంఖ్యాకు - లచటి త్రోవ
గోవింద! గోవింద! - గోపాల! హరి యని
గోలగా యాత్రిక - గోష్ఠిఁ జూచి

తే. రండనుచు నొక్కఁ డీపాదరక్షలను గ
నుండనుచు వారిపైత్తిపై - కెండికోడు
లుంచి దెబ్బకు నొకయణా - నూడఁదీసి
దొరకునే పూర్వపుణ్యాన - దొరక యనును.

క. అజినపుఁ బాదుకలను గొని
కృజినహార మటంచుఁ గొట్టి - యుండు నసగుసల్
సుజనులకా? యే గానిదె
నిజముక్క మనుకొను నొకఁడు - నిష్ఠురమదితో.

క. ఒకరుఁడు పీవన చేఁ గొని
యొకపరి యటు వీచి యవల - హస్తంబును జా
చి కొసరికొసరి కడకు నొ
క్క కాలణాఁ గొని యతృప్తిఁ - గాన్పించు నొగిన్.

క. హెచ్చుగ రోదనసేయుచు
నిచ్చిన మతి యీయకున్న - నేఁపుచు జనులన్
బెచ్చుగ సేమో గొణుగుచు
రచ్చలు సేయుదురు మూఢ-ప్రజ లాత్రోవన్.

క. ఒక్కతె బిడ్డకుఁ దా నిరు
ప్రక్కలఁ బెనుతాళ్ల నునిచి - పై నొకతాటిం
జక్కఁగఁ బొందించి జనుల
కక్కజముగఁ జూపి వేఁడు - నతిదీనతతోన్.

ఉ. కొందఱురోగులై మఱియు - గొందఱు పాపకర్మధారులై
కొందఱు వారవేషులయి - కొందఱు పీడితతైర్థికాళులై
కొందఱు రోగులై యికను - గొందఱు సాయమెవర్చు పుణ్యులై
యందఱుఁ గాంచనంబును వ-యంబుగఁ గొంటకె యుండు రాగిరిన్

క. కోలఁకులఁ జూపెద రమ్మని,
కలపుణ్యస్థలము లెల్లఁ - గండు రనుచు, యో
గులగుహ లివి యని, మృగ్యాహం
బులఁ బాత్రలు సద్దె కనుచు - మొగిఁ గొండ యటన్.

క. ఒకభిక్షుకు డీ రోకఁ డుం
డక నానాగతుల నెలసి - నయముగ నవ్యా
రోకత్రోవను యొకపైసకె
సకలవిచిత్రనటనములు - సలుపఁగలారల్.

క. దానము కైకొనఁగఁదగిన
దీనులు నూఱులకొలంది - దేవుఁడ! యన్నం
బోనారాయణ! యని శో
కానం గుములఁగ మహా-కారులు గూడన్.

తే. చిలిమిగొట్టము గోచి తా-ల్చినజటలును
బట్టుకారు హిందుస్థాన-భావ చాల
దండిగా భోజనం బిడె-దరు మహెవ్వ
రెంత వాల్కపీకికొనిన - నిజుట లేదు.

సీ. పిప్పళ్లబస్తాలు - పేపిరుంపలు, చంద్ర
మొక్కలు బసిపెద్దు, - లుక్కుసునక
లగువారు సంసార-యాత్ర నెగ్గింపఁగ
నోమరులై యాడి - సులభమైన
తిరుపతియాత్రకై - దివ్యహా రవాగిపే
వము నూని మతమున - సౌఖ్యముగను
గాలంబు గడపుచుఁ - గాముకులై యాత్రి
కస్త్రీల నోరఁగాఁ - గనుచు నుంద్రు

తే. దొంగబైరాగు లిటు తిని - తుర్రుమంట్లు,
వర్థమును జాల పెచ్చించి - తైర్థికాళి
దూరమునమండి వచ్చి యెంతో యవస్థ
నొంది కోర్కులు నెగ్గక - కుందుచుంద్రు!

ఉ. కొందఱు పూర్వకర్మమున - గుంటులు గ్రుడ్డులు నంగహీనులై
కుందుచుఁ జేయలేక పని - కూటికె నేకరి యిట్టిచోటులం
జెంది పురంబులం దిరిగి - చెడ్డకు లోపడకుండ బిచ్చ మం
దందున నెత్తిఁ బొల్పదుట - యందఱ కన్నఁగ యుక్తమే కదా!

క. వీర లటుండఁగ మంచి శ
రీరాంగములం గలారు - రేపును మాపున్
నూరూరఁ జొచ్చి మా కిద
తీరనిజీవన మటంచుఁ - దిరిగెద రయరో!

తే. దేశమున సాధికార్యము - పేశలముగ
నడపుతి నాగదాడి ని-రంకుశముగ
నెగడెఁ దత్పీడనముపోలె - నింగి ముట్టె
భిక్షుకుల పెచ్చుఱంపుఁ బీ-పృథ్విమీఁద!

# బాలారోగ్యవిధానము

శ్రీమాన్ నారాయణం కేశవాచార్యులు గారు

మనహిందూదేశమునందు పాశ్చాత్య యువతీమణులు ప్రసవించినచో, శిశువునకు సాధారణముగ నాహారవ్యవహారాదులలో, వారిదేశపు ఆచారములనే పాటించెదరు. మనదేశపు స్త్రీలు ప్రసవమునకు ముందుగనే జాగ్రత్తతో తల్లికి వలయు ఆహారపదార్థముల తేర్చుకొని ప్రసవించినతరువాత శిశువునకు తల్లిపాలె ఆహారముగ నిచ్చుచున్నారు. మనవైద్యశాస్త్రములే కాక యితరశాస్త్రములు గూడ తల్లిపాలను మించినది మరొకటిలేదు అని చెప్పుచున్నవి. ప్రసవమయిన రెండుమూడుదివసములకును కొద్దికొద్దిగ పాలు వచ్చుచుండును. ఆ శిశువునకు తత్కాలపోషణమున కాకొద్దిపాలె సరిపోవును. ఆ సమయమునందు తల్లిపాలుమాత్రమే యిచ్చినందున, తత్పూర్వము శిశువు గర్భమునందున్నప్పుడు ప్రేగులలో నున్న దోషములను వెడలించుటకవి కడు నుపయోగకరముగ నుండును. ఇందువిషయమై విదేశీయులవలె వివిధాహారములను ఔషధములను నీయ నక్కఱలేదు. దేశముయొక్క సమశీతోష్ణతనుబట్టి యోచించి పనిజేయుట ముఖ్యవిషయము. అయితే ఇంగ్లీషువారుకొందఱు మనదేశీయులవలె పసిబిడ్డలకు ఆముదము నిచ్చు నాచారము గలదు. ప్రకృతపరిస్థితులలో [illegible] మనదేశీయు లందఱు పసిపిల్లలకు పలువిధము లగు విదేశాహారపదార్థముల నిచ్చి మనపూర్వీకులు శిశువులపోషణనిమిత్తమై నిచ్చు నాహారముల నీయక, రోగములపాలు జేయుచున్నారు. కుగ్రామవాసులు కొందఱు తల్లియొద్ద పాలులేకున్న ప్రసవించినవెంటనే డబ్బిపాలొసంగుటచే కొన్నివిషయములలో కష్టము సంభవించుచున్నది. విదేశములలో యంత్రసహాయముచే చేసి పంపుచున్న మెలిన్సుఫుడ్ హార్లిక్సు మొదలగువాటివల్ల గూడ విశేషలాభము లేదు. తల్లియొద్ద పాలు లేకపోయినచో ఆవుపాలు ఒకవంతు-కాచి శుద్ధపరచిననీరు మూడువంతులు - చొప్పున కలిపి సూక్ష్మముగ పటికబెల్లమును జేర్చి త్రాగించినమంచిది. కాని దేశీయ మగు బెల్లము మిశ్రము చేయరాదు.

## పాలిచ్చు స్త్రీల యారోగ్యము

తల్లిఅయినను లేక మరొకస్త్రీ అయినను శిశువునకుపాలొసంగువారు మంచి ఆరోగ్యస్థితియం దుండవలెను. పసిపిల్లలు త్రాగుపాలు మంచివిగను త్వరితముగ జీర్ణమగునవిగను నుండవలయును. ఇట్టి సద్గుణంబులు ఆరోగ్యము గల స్త్రీలపాలలోనే యుండును. కొన్నివేళల పసిబిడ్డలకు స్తన్య మొసంగు స్త్రీలు అజాగ్రత్తగ అపథ్యములు చేయుటవలనను కొన్ని తరుణములలో నశుచివలనను వ్యాధులవలనను ఆపసిపిల్లలకుగూడ రోగములు వచ్చుననుట నిస్సందిగ్ధము. తండ్రి వ్యాధిగ్రస్తుడైనను తల్లి యారోగ్యస్థితియం దున్నచో, పిల్లలకు ఆ వ్యాధులు సంక్రమింపవు కాని తల్లి వ్యాధిపాలయినను, పసిబిడ్డను నష్టపరచుటకు సందియ ముండదు. అన్నివిషయంబులలో ప్రథమమున ముఖ్యంబుగ స్త్రీయొక్క జీర్ణశక్తిని చక్కగ గనిపెట్టుచుండవలయును. మనలో కొందఱు తల్లులకు బలకర మగు ఆహార మొసంగుట వలన విశేషముగ పాలుపుట్టునని భ్రమపడెదరు. కాని, అందుచే, మేలునకు బదులుగ, అజీర్ణము మలబద్ధము మున్నగు కీడులు గూడ గలుగవచ్చును. శిశువునకు కూడ ఉదరము స్తబ్ధమగును. విరేచనము కాకుండును. ఇట్టి గుణములు గలిగినచో దల్లికి విరేచనబద్ధము వదలించుమందు లొసంగుట ముఖ్యము. అప్పుడు తల్లి పాలద్వారా పిల్లనికి గూడ శాంతి గలుగును. పిల్లవానికి విరేచనబద్ధము అధికముగ నున్నయెడల కొలదిగ వంటాముదమును ఇయ్యవలయును. మత్తుద్రవ్యములు పాశ్చాత్యస్త్రీలవలె మనస్త్రీల కియ్యరాదు. అయ్యది మన సమశీతోష్ణతకు గిట్టదు. విశేషబలహీన లగు స్త్రీలకు అప్పుడప్పుడు కొంచెము పోర్టువైను అన్నములో ఇచ్చినందువలన మంచిగుణ మొసంగును. తల్లిగానుండు స్త్రీ క్రమప్రకారము ఆయాకాలములలో నాహారము పుచ్చుకొనుచుండవలయును. తల్లు లగు స్త్రీలు ముఖ్యముగ గమనింపవలసిన విషయములు కొన్ని గలవు. (౧) భయము:—భయమువలన మనస్త్రీలకు అనేకకష్టములు వచ్చును. ఈ భయమువలన పాలలోని గుణము బొత్తిగ మారిపోవును. ప్రథమమున పాలు పలుచబడి ఆ పిమ్మట బొత్తిగ లేకుండబోవును. కొన్ని తరుణములలో విశేషభయము గల్గిన స్త్రీల స్తన్యము త్రావిన పిల్లనికి కంపము పుట్టును. (౨) కోపమువలన స్త్రీలపాలయందు కలుగు దుర్గుణములవలన శిశువునకు విరేచనములు ప్రారంభించి కొందఱకి జ్వరముగూడ సంప్రాప్త మగును. (౩) ప్రతిక్షణమునందు కోపగించుకొనుట. లేనిపోని విచారములను స్మరణకు దెచ్చుకొని చింతించుట. నానందముతో నుండకుండుట మొదలగువానిచే స్త్రీలపాలవల్ల శిశువునకు విరేచనములు ప్రారంభమై కడుపునొప్పి విశేషముగ కలిగి యేడ్చును. (౪) ఆహారనియమము:—పసిబిడ్డల తల్లులు భుజించునట్టి భిన్నములగు ఆహారములవలన పాలయందు భిన్నగుణములు గలుగుటయేగాక రుచినిగూడ మార్చును. ఈకారణమున నొక్కొక్కప్పుడు శిశువు ఎంతమాత్రము తల్లి స్తన్యమును నోటబెట్టక యేడ్వసాగును. మరి కొందఱు, ఏడువక, కొంతకాలము పాలత్రాగక యుందురు. మఱియు పసిబిడ్డలతల్లులు విశేషముగ పులుపు పదార్థములను ఊరగాయలు పచ్చళ్లు మున్నగు వస్తుసముదాయమును, భుజించుటవలన పాలయందు లవణపదార్థ మెక్కువగును. విశేషించి ఘృతముతినుటవలన పాల

యుందు విూగడ యను చమురుపదార్థ మెక్కువగును. కావున వీటిచే పసిపిల్లలయొక్క సుకుమారమగు జీర్ణకోశము అనేకములగు రోగములకు పాల్పడును. కాన పసిబిడ్డలతల్లులు జాగ్రత్తగ నుండవలెను. (గ) పాలాసంగు స్త్రీలు గర్భిణులైనచో, నట్టివారియొక్క పాలు పిల్లలకు జబ్బు చేయును గాన మఱొక స్త్రీచేత స్తన్యము నిప్పించిన మంచిది. (ఘ) పాలాసంగు స్త్రీలకు ఋతుస్రావ మారంభింపగనే అట్టిపాలు పసిపిల్లలకు సరిపడవు. అట్టివారిపాలు త్రావిన పిల్లలకు వాంతు లారంభించును. ఒక్కొక్క పర్యాయము విరేచనములు గూడ నగును. స్తన్యపానము జేయుటవలన పసిపిల్లలకు ఏదో ఒకవ్యాధి తప్పదు. (ఙ) ఆరోగ్యశాస్త్రానుసారము పిల్లలకు త్రికాలములలోను స్నానము పరిశుభ్రమగు వస్త్రధారణము పరిశుభ్రవాయుసేవనము మెండలగువాని విషయమయి తల్లులగు స్త్రీలు జాగ్రత్తతో గమనింపవలయును. ఔషధములగుణములు వెంటనే పాలయందు కాన్పించును. మనము ముఖ్యముగ ఔషధములను, తల్లికిచ్చినచో నట్టితల్లులపాలుత్రాగుపిల్లలకు తల్లి తినిన ఔషధగుణము లత్తిణమే గనఁబడును. మరి కొన్ని సమయములలో, విరుద్ధముగ పసిపిల్లలకే దుర్గుణములు గలుగవచ్చును. కావుననే పాలిచ్చు స్త్రీలకు ఔషధమియ్యవలసివచ్చినపుడు బాగుగ వైద్యులతో ఆలోచించి అటుపైని ఔషధముల నియ్యవలయును. పిల్లలు పెరుగు కొలది దినక్రమేణ పాలుతగ్గించుచు ఆరుమాసముల ప్రాయము వచ్చునంతలో దినమునకు నవఁగా రాత్రింబగళ్లు తల్లి మామూలుకంటె కొన్నిపర్యాయములు తగ్గించి పాలియ్యవలెను. పిమ్మట పదిమాసముల వయస్సు వచ్చునప్పటికి పాలు పూర్తిగ మాన్పింపవచ్చును.

### దీర్ఘకాలము పాలిచ్చుటవలన గలుగు దుర్గుణములు

చాలవయస్సు వచ్చువఱకు పాలు త్రాగించుటవలన గలుగు దుర్గుణము లసంఖ్యాకములు. అందు కొన్నింటిని మాత్రము వివరించెద. దీర్ఘకాలము స్తన్యపానమువలన ఇద్దరికి కష్టములు గలుగును. కొందఱు స్త్రీలు పసిపిల్లలకు పాలిచ్చుటవలన గర్భము నిలువదను భ్రమతో చాల కాలము పాలు త్రాగించుచునే యుందురు వాడుక కలదు. కాని సర్వసాధారణముగ బీదస్త్రీల బిడ్డలవిషయమై కొంచెము యోచింపుడు. బీదస్త్రీలు పిల్లలకు చాలకాలము పాలిచ్చుచునే యుందురు. పాలిచ్చు కాలములో గర్భవతులు కారనెడి స్త్రీలయభిప్రాయము కేవలము తప్పుగ కన్పించుచున్నది. అట్టిసమయములలో గూడ స్త్రీలు గర్భిణులగుదు రని ఆయుర్వేదశాస్త్రముకే కాక ఇతరశాస్త్రములుగూడ జెప్పుచున్నవి.

## బమ్మెర పోతరాజ స్మృతి

దేశిరాజు రామదాసు గారు

సిరిని దరిద్రదేవతను చిక్కనిమాపుల నొక్కవైఖరిన్
నిరతము జూచుచున్ మనసునీరజనాభుని వంకఁ ద్రిప్పి, యు
ద్ధరను సమత్వ మచ్చటన తాండవమాడుచు నున్నదో యనన్
బరగెడుపోతనార్యకవిభాస్వరు వార్ధకలంతు నిచ్చలున్.

సీ. దండనంబులకైన తనువొడ్డియుండెను
గాని స్వాతంత్ర్యవాంఛ మానఁ డయ్యె
సిరికి మోకాలొడ్డి చెచ్చెరఁ దోలఁ గెను
గాని శ్రీహరిభక్తి మానడయ్యె
కాయంబునకు నెంత కష్టంబు గలిగిన
నాధ్యాత్మికముఁ జూచు ననవరతము
ధనము లెన్నియొ యున్న రాజగు భక్తికి
వలె దేనియందును బారఁడయ్యె.

గీ. భళిర పోతనకవి ప్రథితకీర్తి
యమలస్వాతంత్ర్యభక్తి యాధ్యాత్మికము క
విత్వముల నీదు మార్గాన వెడలి రేని
ప్రవిమలాంధ్రుల కెల్ల స్వరాజ్య మరుదె.

క. పేశలము నీదుకబ్బము.
దేశంబో మిగులనవు విన్నదనంబున్
బోషించు నిన్ను నాంధ్రుల
భాషారామాహృతల్లి భళిరా గనియెన్.

క. కన్నందు కామెకీర్తిని
మిన్నందగఁ జేసినావు మేలుర మేల్ నీ
యన్నలు తెలుంగువారలు
కన్నఫలం బిందుకైన గాంచం బోరో.

క. బత్తియన నీదుబత్తియె
కత్తి యనన్ నీదుకత్తి చేకూరినచో
నిత్తరి నాంధ్రుల దేశము
కెత్తు తలలెత్తి నిలవ జేర్వారె త్వరలో.

క. కవనమున నీదె కవనము
జవమును జీవంబుఁ గలిగి జనులకు నెల్లన్
వివిధగతుల హృదయంగమ
మవు హృదయమునాటి మంచి యలవడఁ జేయున్.

# కొలచెలమవారు

## వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

[illegible] మహాగ్రంథములకు వ్యాఖ్యాతయై సంస్కృత సారస్వత ముద్రను విస్ఫురింపజేసిన మల్లినాథసూరి యింటిపేరు-కోలాచల కొలచల కోలచర్ల కొలచర్ల కొలచెలమ-అని యిన్ని తెఱఁగుల వ్రాఁతప్రతులలోను అచ్చులోను వాడుకలోను గానవచ్చుచున్నది. పలువురు పండితులు ఆపేళ్లుగల గ్రామములఁగూర్చి చర్చించియున్నారు. ఒకరు కోలాచలమును బురాణములందు వెదకి కనుఁగొనిరి. ఇంకొకరు 'పందిపాడు' అను గ్రామనామమునకు గీర్వాణీకరణ మనిరి. మఱొకరు కవ్యాకుమారి కడనున్న కొలచర్ల యనుగ్రామ మగునో యని యధికముగా పరిశోధించిరి. ఇదమిత్థమని యిదివఱకు జరిపిన పరిశోధనలవలన నిర్ధారణ చేయఁబడలేదు. నామిత్రులు బ్రహ్మశ్రీ కొలిచెన అప్పాశర్మ యం. ఏ. గారు ఈ విషయమును గూర్చి యాసక్తితో పరిశోధించుచున్నారు. వారియింటిపేరగు కొలిచిన మల్లినాథ సూరియింటిపేరి వికారమే యగు నని వారు తలంచుచున్నారు. కోలాచలము శ్రీనివాసరావు గారు మొదలగువారు తమయింటిపేరే మల్లినాథసూరియింటిపే రని తలంచిరి. వీరిద్దరును తెలగాణ్యులే యయినను గోత్రభేదము గలదఁట. ఒంగోలు ప్రాంతములందు వెలనాట్యులలోనే కొలచెలమ యనియింటిపేరు గల వారుకూడఁ గలరని వినుచున్నాము. వీరిలో మల్లినాథసూరివంశపరంపర లోనివా రెవ్వరైనఁ గలరేమో నిర్ణయింపదగిన యాధారములు కానరావు. మల్లినాథసూరిగోత్ర మేమో మనకుఁ దెలియరాలేదు.

చంపూరామాయణమునకుఁ బదయోజన మనుపేర మనమల్లినాథసూరివంశజుఁడు నారాయణపండితుఁడు వ్యాఖ్యానము రచియించెను. పీఠికాశ్లోకములను బట్టి చూడఁగా నాతఁడు మనయెఱుకలోనున్న మల్లినాథసూరి కెనిమిదవ తరమువాఁ డగుచున్నాఁడు. అతని పీఠికాశ్లోకముల నాధారపఱచుకొని ప్రధానముగా నీ వ్యాసము వ్రాయుచున్నాను. ఆ శ్లోకము లివి:—

కోలచెలాన్వయాబ్ధీందు ర్మల్లినాథో మహాయశాః
శతావధానవిఖ్యాతో వీరరుద్రాభిరక్షితః
మల్లినాథాత్మజ శ్రీమాన్ కపర్దీ మంత్రకోవిదః
అఖిలశ్రౌతకల్పస్య కారికావృత్తి మాతనోత్
కపర్దితనయో ధీమాన్ మల్లినాథో గ్రజస్స్మృతః
ద్వితీయ స్తనయో ధీమాన్ పెద్దిభట్టో మహోదయః
మహోపాధ్యాయ ఆఖ్యాతి స్సర్వదేశేషు సర్వతః
మాతులేయకృతా (కృతా) దివ్యే సర్వజ్ఞే నాభిరక్షితః
గణాధిప ప్రసాదేన ప్రోచే మంత్రవరాన్ బహూన్
నైషధకావ్యసహితానాం వ్యాఖ్యాతాఽభూ జ్జగద్గురుః
పెద్దిభట్టసుత శ్శ్రీమాన్ కుమారస్వామిసంజ్ఞకః
ప్రతాపరుద్రీయాఖ్యస్య వ్యాఖ్యాతా విద్వదగ్రిమః
తనయా స్తస్య చత్వారో మహాదేవ స్తదగ్రజః
మహాదేవాత్మజ శ్శంభు స్సప్తక్రతుభి రిష్టవాన్
తతో విశ్వజితం కృత్వా యజ్ఞం సర్వస్వదక్షిణమ్
శంభుయజ్వాత్మభూ ర్ధీమాన్ భాస్కరో భాస్కరప్రభః
శ్రీనాగేశ్వరయజ్వాఖ్య భాస్కరస్యాత్మసంభవః
పుత్రాః పౌత్రాశ్చ దౌహిత్రాః చత్వారో వేదవేదినః
జామాతరోఽపి చత్వార ఏతే త్వన్యత్రి తాధ్వరః
సర్వతోముఖపద్మాన్తై స్సర్వక్రతుభి రిష్టవాన్
తస్యాత్మజః కొండుభట్టో ద్వితీయో వేదవిత్కవిః
శ్రీనాగేశ్వరయజ్వాఖ్యః కొండుభట్టసుత స్సుధీః
నరసకాఖ్యశ్చ ధాత్యశ్చ శ్రీనాగేశ్వర యజ్వనః
నారాయణేన పుత్రేణ కోలచెలాన్వయేందునా
చంపురామాయణాఖ్యస్య ప్రబంధస్యాభిహారిణః
వివృతిః క్రియతే ప్రేమ్ణా యథామతి సమాసతః

మీఁదిశ్లోకములందు వారియింటిపేరు "కోలచెలమ"వా రని యున్నది. ఈవంశమువారికి ఓరుఁగల్లు రాజధానిగా రాజ్యమేలిన ప్రతాపరుద్రచక్రవర్తితోను రాచకొండ రాజధానిగా రాజ్యమేలిన సర్వజ్ఞసింగ భూపాలునితోను సంబంధము గలదని యీశ్లోకములు చెప్పుచున్నవి. వీరియింటిపేరగు కొలచెలమగ్రామముకూడ నక్కడికిఁ జేరువగా నుండఁదగును. కొలచెలమ గ్రామనామమని-యది రెండుఁగల్లు రాచకొండల చేరువను గలదని-యీక్రింది వెలుగోటివారి వంశప్రశస్తి పద్యములు చెప్పుచున్నవి:—

స్రగ్ధర. వీరుండా యాచవృథ్వీవిభుఁడు......భూగోరాజీన్ ధాటిఁ గెల్లం గొలచెలమపురీ ఘాటికాకోటిఁ దెచ్చెన్.

సీ. కొలచెల్మ కాడను బలిరుఁ డైరికులఁ గొట్టి యశ్వములనుబట్టి వాఁడు

ఇట్లుచూడఁగాఁ బురాణములందలి కోలాచలముగాని శ్రీకోలాచలం శ్రీనివాసరావు మొదలగువారు నిశ్చయించిన పందిపాడు గాని కన్యాకుమారికడ నున్న కొలచెర్ల కాని మల్లినాథసూరి యింటిపేరుగా నేర్పడిన గ్రామము కాదనవచ్చును. ఇంటిపేరు కొలచెలమ యని నిర్ణయించుకొందము.

### కొలచెలమ మల్లినాథుఁడు

ఈయన శతావధానము చేసి విఖ్యాతిఁ గాంచినవాఁడు. నేఁటికాలమున నస్మద్గురువర్యులు శ్రీతిరుపతివేంకటేశ్వరు లఖండప్రతిభతో నాచరించుచున్నట్టియు- నాంధ్రదేశమందే విపులప్రచారము గల్గినట్టియు నీశతావధాన మాసాఁడీమల్లినాథసూరి నిర్వహించినాఁడు. మనకుఁ దెలియవచ్చిన శతావధానచతురులలో నెల్ల నీతఁడే ప్రాచీనతముఁడు. అస్ఖలితప్రతిభా ప్రదర్శకమైనయాశతావధాన చాతుర్యము

నకు మెచ్చి కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి మన పండిత పరమేశ్వరునకుఁ గనకాభిషేకసత్కారము గావించినాఁడు.

సామ్రాజ్యలక్ష్మీ పీఠికాతంత్ర మని యొక గొప్పతంత్ర గ్రంథము తంజాపురపు సరస్వతీపుస్తకభాండాగారమం దున్నది. అందు రాజధర్మములు వారి దినచర్యాదులు మిక్కిలి చక్కఁగాఁ బ్రశంసింపఁబడినవి. రాజాస్థానమునఁ బండితగోష్ఠి యెట్లు నెఱపవలయునో- విద్వద్వివాదము లెట్లు నడుపవలెనో-జయించినవారి కెట్టిసత్కారము గావింపవలెనో యం దున్నది. విద్వద్వివాదమందు విజయమందినవారికిఁ జేయఁదగిన సత్కారములలోఁ గనకాభిషేక మొకటి. అభిషేకించిన స్వర్ణముద్రికాదుల నప్పు డచ్చటికి విచ్చేసియున్న పండితులకుఁ గవులకుఁ దరిద్రులకుఁ బంచిపెట్టవలె నఁట! కాని అయిదాఱేండ్లకుఁ బూర్వము పుస్తకాలలోఁ జూచి చదివినయాగ్రంథమందలి విషయము నిప్పుడింతకంటె హెచ్చుగా వ్రాయఁజాలకున్నాను. ప్రాచీన పండితగాథలను బరికిలింపఁగా నీకనకాభిషేకసత్కారముఁ గాంచినవా రాంధ్రులే పెక్కు రగపడుచున్నారు. ఈ వంశమువాఁడే యగు పెద్దిభట్టు శ్రీనాథుఁడు మొదలగువారు.

ఈ మల్లినాథుని కొమారుఁడు కపర్ది. ఈతఁడు శ్రౌతసూత్రకారికావృత్తికారుఁ డని మంత్రవేత్త యని చెప్పఁబడినది. కపర్దిస్వామి వైదిక బృందమునకు సుపరిచితుఁడు. ఆపస్తంబగృహ్యసూత్రాదులకు భాష్యములను రచించెను. కపర్దికారిక లని చెప్పఁబడెడు గృహ్యకారిక లను రచించిన కపర్దిస్వామి యీతఁడే కావలెను. కపర్దిస్వామి గ్రంథము లివి తెలియవచ్చుచున్నవి: ఆపస్తంబ గృహ్యసూత్రభాష్యము. 2 ఆపస్తంబగృహ్యపరిశిష్టభాష్యము. 3 ఆపస్తంబ శ్రౌతసూత్రభాష్యము. 4 దర్శపూర్ణమాసభాష్యము. 5 భారద్వాజగృహ్యసూత్రభాష్యము. 6 ఆపస్తంబగృహ్యకారికలు. ఇందు ఒకటి రెండుకంటె పెక్కుగ్రంథము లచ్చుపడలేదు. ఈతఁ డాంధ్రుఁడు కోలచెలవంశమువాఁడు నగుట యిదివఱకుఁ బ్రఖ్యాతముగా నెఱుకపడిన విషయము కాదు. ఈయన కిద్దఱు కుమారులు. పెద్దవాఁడు మల్లినాథుఁడు. జ్యేష్ఠుఁడగు నీమల్లినాథుఁడు విద్వాంసుఁడుగాఁ జెప్పఁబడలేదు. కనిష్ఠుఁడు - పెద్దిభట్టు. ఈతఁడు మహోదయుఁ డని - సర్వదేశములందును మహోపాధ్యాయుఁడుగా విఖ్యాతిఁ గాంచెనని - సర్వజ్ఞ (సింగ) భూపాలునిచేఁ గనకాభిషేక సత్కారము గాంచె నని - గణాధిప ప్రసాదముచే ననేకమంత్రములను [?] జెప్పె నని- నైషధాదికావ్యములకు జ్యోతిష గ్రంథములకు వ్యాఖ్యలు రచించె నని- చెప్పఁబడినది.

కోలచెల మల్లినాథకృతులుగా నా నైషధాదివ్యాఖ్యలను వానిగద్యములనుబట్టి మనమిప్పుడు తెలిసికొనుచున్నాము. కాని యిప్పుడుదాహరింపఁబడిన శ్లోకము లా గ్రంథములు రచించినవాఁడు మల్లినాథుఁడుగాక యాతనితమ్ముఁడు పెద్దిభట్టారకుఁ డని చెప్పుచున్నవి. లోకమునఁగూడఁ బెద్దిభట్టే గ్రంథకర్తయనియు వాఁడు తనగ్రంథముల నన్నగారగు మల్లినాథుని పేరఁ బ్రకటించెనని విద్వత్పరంపరనుండి యైతిహ్య మొకటి వినవచ్చుచున్నది. అట్లు ప్రకటించుటకుఁ గారణముగా నీక్రిందికథకూడ నున్నది.

"మల్లినాథుఁడును పెద్దిభట్టు నన్నదమ్ములు. మల్లినాథుఁడు మందబుద్ధి గలవాఁడు. పెద్దిభట్టు పెద్దబుద్ధిగలవాఁడు. వీరు నివసించు గ్రామముచేరువ నడవిలో నొక యోగీశ్వరుఁడు తపస్సు చేసికొనుచుండెను. మందబుద్ధి యగు మల్లినాథుఁడు తత్పరతతో నా యోగీశ్వరుని శుశ్రూషించుచుండెను. పెద్దిభట్టును సకృత్తుగా సందర్శించుచుండెడివాఁడు. మల్లినాథుఁ డొకప్పుడు కార్యవశమున గ్రామాంతరమున కరిగెను. అన్నగారిచే నాజ్ఞప్తుఁడై యప్పుడు పెద్దిభట్టా యోగి నారాధించుచుండెను. అది యాయోగికి నిర్యాణకాలమయ్యెను. మల్లినాథుఁడు దగ్గఱ లేఁ డయ్యెను. తన కిన్నాళ్లు చేసిన శుశ్రూషకై యా యోగి మల్లినాథునకు సారస్వతము నుపదేశించి యుద్ధరింపఁ దలఁచెను. కాని యట్లు కటాక్షింప దయ్యెను. అప్పుడు సేవించుచుఁ జెంతనున్న పెద్దిభట్టును జూచి మీయన్నకుఁ జేయఁ దలంచుకొన్న యుపదేశము వానిని యాసన్నిధిచే నీకుఁ జేయుచున్నాను. దీనిఫలము మీయన్నగారికే చెందఁజేయుదువు గాక యని యొక మంత్రము నుపదేశించి యాయోగి సిద్ధిపొందెను. పెద్దిభట్టంతతో మహోపాధ్యాయుఁ డయ్యెను. గుర్వాజ్ఞచొప్పున నాతఁడు తాను రచించిన గ్రంథముల నన్నింటిని నన్నగారగు మల్లినాథుని పేరనే ప్రకటించెను." ఈ కథ మీఁది శ్లోకములకుఁ దోడుపడుచున్నది.

## మల్లినాథుని వైదుష్యము

గ్రంథములందు మల్లినాథుఁడని పేరున్నది. కావున నా పేరే పేర్కొనియెదను. ఈయన స్వతంత్ర గ్రంథము లంతగా రచించినట్టు కానరాదు. హెచ్చుగా వ్యాఖ్యాన గ్రంథములే యగపడుచున్నవి. రఘువంశ కుమారసంభవ మేఘసందేశ కిరాతార్జునీయ శిశుపాలవధములకుఁ బంచకావ్యము లన్న పేరు కల్గుటయును, సంస్కృతభాష నభ్యసించు విద్యార్థు లీగ్రంథములనే ప్రధానముగా నారంభించి చదువుటయును, సుగమములైన మల్లినాథవ్యాఖ్యలు వెలసిన తర్వాతనే యేర్పడిన దని కొందఱు తలంచుట కలదు. కాని, తార్కికరక్షటీకలో మల్లినాథుఁడే "వ్యాటీకృతం నైషధస్యాబ్ధిః పంచకావ్యటీకాసు" అనుటవలన నాయననాఁటికే యాగ్రంథములకుఁ బంచకావ్యసంజ్ఞ కలదని యేర్పడుచున్నది. ప్రధానముగా విద్యార్థు లాగ్రంథములనే చదువుటకుఁ గారణము మల్లినాథవ్యాఖ్యలు కావచ్చును. రఘువంశాది కావ్యములకు మల్లినాథునకుఁ బూర్వకాలమందే పదులకొలఁది వ్యాఖ్యలున్నవి. కాని ఈయనవ్యాఖ్యలు వెలసిన తర్వాత వానికిఁ బ్రచారము తగ్గినది. ముద్రణాదిసౌకర్యము లేని యాకాలముననే మన మల్లినాథుని గ్రంథము లాసేతుశీతాచలము వ్యాపించినవి. ఇట్టి వ్యాప్తికి వాని ఘనతయే కారణము. ఇది యాంధ్రు లభిమానింపఁదగిన విషయము. "దుర్బోధమయిన పట్టును- స్పష్టార్థమ్ - అని విడుతురు. స్పష్టార్థ మగు పట్టును వ్యర్థముగా దీర్ఘసమాసాదులతో నింపి విస్తరింతురు. అస్థానమున ననుపయోగములగు జల్పములచే భ్రమము కలిగింతురు" అని కువ్యాఖ్యాతలను గర్హించిన భోజునిత్రోవ నీతఁడు చక్కఁగాఁ ద్రొక్కినాఁడు. "ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా

RAJASEKHARA VENKATESA KAVULU



శ్రీయుత, రాజశేఖర వేంకటేశకవులు

SRY. C. MANICKYA SARMA



శ్రీయుత, చక్రావధానుల మాణిక్యశర్మ

SRY. P. SURYANARAYANA



శ్రీయుత, పి. సూర్యనారాయణ

SRY. C. CHINASWAMY CHETTY



శ్రీయుత, చోడగిరి చిన్నస్వామి శ్రేష్ఠి

SRY. P. J. VENKAYYA



శ్రీయుత, పి. జె. వెంకయ్య

THE ANDHRA JATEEYA KALASALA, MASALIPATAM



ఆంధ్ర జాతీయ కళాశాల, బందరు

SREE RAJESWARA GRANDHALAYAM




శ్రీ రాజేశ్వర పుస్తక భాండాగారము

నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే అన్వయముఖముననే సర్వమును వ్యాఖ్యానము చేయుదును. మూలములేనిది కొంచెమైనఁగూడ వ్రాయను. అనావశ్యక మయినది చెప్పను"—అని మల్లినాథుని శపథము. ఈశపథము తప్పకుండ నీ యాతఁడు వ్యాఖ్యానరచనముఁ గావించెను. కాళిదాసాది మహాకవుల కావ్యములకును నింక నితర శాస్త్ర గ్రంథములకును సమర్థము లయిన వ్యాఖ్యలు రచించుటకు నాతనికి ప్రాచీనము లగు సర్వవిద్యలందును సంపూర్ణపాండిత్యము కావలసి యుండును. కణాదగౌతమ తర్కములందు- పూర్వోత్తరమీమాంసలందు- వ్యాకరణమందు- సాంఖ్యయోగములందు- జ్యోతిషమందు- నింక నితర విద్యలందు- మల్లినాథుఁడు మహాపండితుఁడు. షడ్వాస్త్ర పురాణపారావారపారీణుఁడని- మహోపాధ్యాయుఁడని- బిరుదులు. "కోశవాన్ ఆచార్యః" అన్నట్లుగా నెన్నివిద్య లభ్యసించినను ప్రసక్తి గల్గినప్పుడు పరిశోధించుటకుఁ దగినంత గ్రంథసంచయము గూడ నుండిఁగాని సర్వతోముఖమైన వైదుష్యము సమకూడదు. మల్లినాథుఁడు తన గ్రంథములందు ననేక ప్రాచీనగ్రంథముల నుదాహరించెను. అన్నిగ్రంథముల నాతఁ డెట్లు సంపాదించెనో యాశ్చర్యకరముగా నున్నది. పూర్వులు పరంపరగా గొప్పవిద్వాంసు లగుటచేత వారువా రార్జించిన గ్రంథసంచయము కొంత యింటనే యీతనికి లభించి యుండును. అది గాక కాకతీయ రుద్ర సర్వజ్ఞసింగభూపాలుర సంస్థానములతో సంబంధముండుట చేత నక్కడి సరస్వతీభండారములును దొరకి యుండును. ఈతఁడు తన వ్యాఖ్యలం దుదాహరించిన గ్రంథము లనేకము లిపుడు లభించుట లేదు. కొన్ని యిట్టివనిగూడఁ దెలియరాక యున్నవి. ఉదాహరణముగా నొకటిరెండు తెల్పెదను. సంగీతశాస్త్రవిషయములు వచ్చినప్పు డీతఁడు వ్యాఖ్యానములందు 'భరతమతంగః' అని యుదాహరించినాఁడు. తెలుఁగు ముద్రాపకులు కొందఱు 'మాతంగః' అని ముద్రించిరి. మతంగుఁడో మాతంగుఁడో సంగీతశాస్త్రమున నేమి గ్రంథము రచించెనో యిఁదివఱకెవరికిని దెలియరాకుండెను. ఈనడుమ శ్రీ మానవల్లి రామకృష్ణకవి (ఎం. ఏ.) గారు తంజావూరి రఘునాథరాయని సంగీతసుధలో "గ్రంథం బృహద్దేశ్యభిధం మతంగమునిప్రణీతం నిపుణం విలోక్య" అని యుండుటను బరిశీలించి తిరువనంతపుర మహారాజపుస్తకశాలవారి రిటీంల సంపాదించిన బృహద్దేశీగ్రంథభాగము మల్లినాథుఁ డుదాహరించిన మతంగకృతగ్రంథముగా గుర్తించిరి. మఱియుఁ గొన్నిచోట్ల "తథాచ చాతుష్యః" అని యున్నది. ఈ చాతుష్యుఁ డెవరో ఏమిగ్రంథము రచించెనో తెలియ దయ్యెను. ఇది రాజనీతిగ్రంథ మని శ్రీకవిగారే గుర్తింపఁగల్గినారు. మల్లినాథుఁ డుదాహరించిన మహాయాత్ర యను గ్రంథ మిట్టిదని యిదివఱకు తెలియకుండెను. అది యిప్పుడు ప్రాచ్యలిఖితపుస్తకశాలకు లభించినది. శాకునగ్రంథ మ్మగర్మీయము రాజపుత్రీయము మొదలగు గ్రంథము లిప్పుడు దొరకకున్నవి. ఉభయమీమాంసలందును న్యాయ తర్కములందును ప్రాచీనగ్రంథము లీతఁడు నుదాహరించినాఁడు. చార్వాకబౌద్ధగ్రంథముల నుదాహరించినాఁడు. అందుఁ గొన్ని యిప్పుడు కానరాకున్నవి. పంచకావ్యవ్యాఖ్యలం దీతఁడు దక్షిణావర్తనాథుఁ



డను నొక ప్రాచీనవ్యాఖ్యాతను - "నాథవచన మనాథవచన మేవ" ఇత్యాదివిధముల గర్హించినాఁడు. దక్షిణావర్తనాథుని వ్యాఖ్య లిప్పుడు దొరకినవి.

మల్లినాథుఁడు రచియించిన గ్రంథము లివి తెలియవచ్చుచున్నవి.- రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ, శిశుపాలవధము లను పంచకావ్యములకు వ్యాఖ్యలు. నైషధవ్యాఖ్య, భట్టికావ్యవ్యాఖ్య, ఏకావళివ్యాఖ్య, తంత్రవార్తికటీక, స్వరమంజరీ వ్యాఖ్య (పరిమళము) తార్కికరక్షటీక జ్యోతిషగ్రంథము, రఘువీరచరిత (?) రఘువీరచరితము మల్లినాథకృతి యగునో కాదో!

మీఁద నుదాహరింపఁబడిన చంపూరామాయణ వ్యాఖ్యాతృశ్లోకములందుఁ బెద్దిభట్టు సర్వజ్ఞ సింగభూపాలునిచే (మాతులేయక్రతౌ? కృతౌ?) మేనమామ కుమారుని యజ్ఞమునఁ గనకాభిషేకసత్కృత మందినట్లున్నది. సర్వజ్ఞసింగభూపాలకృతియగు రసార్ణవసుధాకరము నీతఁడు తనవ్యాఖ్యలం దుదాహరించినాఁడు. సర్వజ్ఞ సింగభూపాలుని సమ్మానాభిమానము నెట్టు పెద్దిభట్టు చూపినాఁ డనుకొనుచున్నాను. పెద్దిభట్టు సర్వజ్ఞ సింగభూపతి కాలమున నున్నవాఁ డనుటకు సాధకముగా నీ క్రిందిశ్లోకము లోకుల నోటఁ జేకూడినది:—

శ్లో. కిం వాససా చికిరిబాకిరేణ కిం దారుణా కంకరటింకరేణ
సర్వజ్ఞభూపాల విలోకనార్థం వైదుష్య మేకం విదుషాం సహాయమ్.

పెద్దిభట్టొకనాఁడు చీకిరిబాఁకిరిచినుఁగుఁ బాఁత కట్టుకొని కంకరటింకరపుఁ గఱ్ఱ చేతఁబట్టుకొని సర్వజ్ఞసింగభూపతి విద్వత్సభకుఁ బోవుచుండఁ ద్రోవలో నెవరో యడిగిరఁట. తాతగారూ! రాజసభ కిట్టి వేషములోఁ బోవుచున్నారే మని. అప్పు డాయన పై శ్లోకము చెప్పెనట!

మఱియుఁ బెద్దిభట్టు గణాధిపప్రసాదము గలవాఁ డని చంపూరామాయణవ్యాఖ్యాశ్లోకములం దున్నది. రఘువంశాదివ్యాఖ్యలందుఁ బ్రధానముగాఁ జేసిన గణపతిస్తుతిశ్లోకము లున్నవి.

పెద్దిభట్టుమీఁద నీ క్రిందికథలను గొందఱు చెప్పుచున్నారు. "పెద్దిభట్టు తోడియల్లుఁడు ఘనాంతము వేదవిద్య నేర్చినవాఁడు. మంచి కండపుష్టి గలవాఁడు. పెద్దిభట్టు మంచి సర్వసాహిత్యము శాస్త్ర పాండిత్యముఁ గలవాఁడుగదా! పెద్దయల్లుఁ డగు నా వేదముగుఁడును చిన్నయల్లుఁ డగు నీశాస్త్రవేత్తయును నత్తవారింటి కొకనాఁ డొకప్పుడే తెంచిరి. అత్తమామ లాపెద్దయల్లుని నలుష్యముతో సగౌరవముతోను, నీచిన్నయల్లుని మన్ననతో మర్యాదతోను జూడసాగిరి. అతని వేదవైదుష్యమును వెక్కిరించి - యీతని శాస్త్రచాతుర్యమును సన్మానించిరి. ఆతనికి నడవలోఁ జాఁపమీఁదను నీతనికిఁ బడకగదిలోఁ బట్టెమంచముమీఁదను శయనవిధాన మేర్పఱచిరి. పెద్దాతఁడు కోపమున గుములుచుండెను. చిన్నాతఁడు దుర్వాసమున నుప్పొంగుచుండెను. పడుకగదినుండి రాత్రి లఘుశంకకు బయలికేఁగుచు నీచిన్నాతఁడు త్రోవలో నడవలోఁ బండుకొనియున్న తోడియల్లు నొకతన్ను తన్ని యెఱుఁగక ప్రమాదమునఁ దన్నినట్టు నటించి "క్షంతవ్యమ్" అని

# ప్రకృతిశాస్త్రములు - ఆర్యధర్మములు

పెద్దిభట్ల వీరయ్య పంతులుగారు బి. ఏ. బి. ఎల్.

ఆర్యులధర్మములు పరమోత్కృష్టములు. అవి ప్రకృతిశాస్త్ర బోధల ననుసరించి యున్నవి. భారతవర్షమునందలి యాచారములు మతసంబద్ధములు. ఇతరదేశములందలి సాంఘికధర్మములకు నచ్చటి మతములకు సంబంధములేదు. రాజశాసనోల్లంఘనమునకే మరణాదిశిక్షలు విధింపబడుచున్నది ఇకను రాజాధిరాజుల కెల్లరకు సృష్టికర్తయగు దేవుని యాజ్ఞయెడల మానవకోటి యెట్టి భయభక్తులతో సంచరింపవలయునో వివరింప నవసరము లేదు. ఆర్యధర్మములు చిరకాలముగ నితరదేశములకు నాదర్శములుగ నున్నవి. కాని యిపుడు కాలమహిమచేత మనధర్మముల రహస్యములు దురవగాహములైనవి. వాని యాచరణము నానాటికి క్షీణించుచున్నది అందులకు గల కారణమును చర్చింప నిది యదను కాదు. పూర్వమున నుండిన ధర్మములను- వానికిని ప్రకృతిశాస్త్రఫలితములకును నెట్టి సంబంధము గలదో యట్టి విషయములను- నీవ్యాసమున గనబరుప దలచినాను. హైందవసంఘనిర్మాణము ప్రకృతిశాస్త్రపద్ధతులకు భిన్నము గాదనియు నార్యధర్మము లుత్కృష్టము లనియు పాశ్చాత్యశాస్త్రజ్ఞుల పరిశోధనలవలన దేలిన యంశముల నిందు బొందుపరచుచున్నాను.

ఉదయము నిదురలేచినది మొదలు రాత్రి నిదురపోవువఱకును మనుజుడు చేయవలసిన కార్యక్రమ మంతయును మన పవిత్రగ్రంథములందు గలదు. మనశాస్త్రములలో నుషఃకాలమున నిదుర లేచి- కాలకృత్యములు దీర్చికొని- స్నానసంధ్యాదికముల నిర్వర్తించి- హోమమాచరించి- యతిథి యభ్యాగతుల సత్కరించి- బలి నొసర్చి భుజించుట బ్రాహ్మణ ధర్మముగ విధింపబడినది ఇదిగాక గృహమునకు గసవు చిమ్మి యలికి ముగ్గు పెట్టుటయు నార్యధర్మములలో గలదు. మఱియు నాహారనియమములు వివాహనియమములు పారిశుద్ధ్యనిబంధన లనేకములు గలవు. వంశపారంపర్యముగ రాగల గుణాగుణములును వర్ణభేదముయొక్క ప్రాముఖ్యమును నందుగలవు. ఇట్టి విధు లన్నియు మతముయొక్క కట్టుబాట్లకు లోబడియుండుటచేత హిందూదేశమునందు మాత్రమే గలవు. పాశ్చాత్యదేశములం దట్టివియు లున్నంతవరకు నాచారము ననుసరించి, యచటులలో నున్నవి. మన పూర్వాచారములు నార్యధర్మములు కొన్ని ప్రత్యక్షముగ నర్థహీనముగ గన్పించుటయే గాక పాశ్చాత్యనాగరకత మనదేశమున వ్యాపించుటచేత మన దృక్పథమునందు గూడ మార్పు గలిగినది ఆవసరమగు సంస్కరణము లెట్లున్నను గొన్ని సంస్కరణలు మాత్రము మనసంఘముయొక్క పునాదికి భంగము గలుగునవి ప్రస్తుతము బహుళమగుచున్నవి. ఇది యెంతో శోచనీయము. మన పూర్వాచారములను నిరసించువారు- పాశ్చాత్యశాస్త్రజ్ఞులు మనధర్మములను గురించి- యెట్టి యమోఘవాక్యములను వ్రాసిరో తెలిసికొనుట ముఖ్యము.

అరుణోదయమునకు బూర్వమే నిద్రలేచు టేటికని మధ్యాహ్నమువఱకు నిద్రించువారు మనసంఘములో గలరు గదా. అట్టివారు హైడీయను శాస్త్రజ్ఞుడు వ్రాసిన సంగతులను గమనింపగోరుచున్నాను. మనజీవితములకు ముఖ్యాధారమగు ప్రాణవాయువు విశేషముగ నరుణోదయమందు విద్యుచ్ఛక్తిమార్పువల్ల నేర్పడుచున్నదట! వృక్షములు పగలు ప్రాణవాయువును ప్రతికూలవిద్యుచ్ఛక్తివల్లను రాత్రులందు భిన్నమగు గాలి ననుకూలవిద్యుచ్ఛక్తివల్లను వ్యాపింపజేయు నని శాస్త్రజ్ఞులు దెలుపుచున్నారు. రెండువిధములగు విద్యుచ్ఛక్తులు ప్రాణవాయువుతో నెట్టి సంబంధము గలిగియున్నదో తెలిసికొన్నప్పుడు ప్రాణాధారమగునట్టి వాయువు విరివిగా ప్రకృతియందు చిక్కు నవకాశమును బోగొట్టుకొనుటకు ప్రాణవాయు తత్త్వ మెఱింగినవా రెవ్వరును ప్రయత్నింపరు గదా! వాయువు ప్రాణాధార మనియు నందు ప్రాణవాయువు తగినంత లేనిచో జాడ్యములు మృత్యువు తప్పవనియు నెల్లరకు విదితమే. కాబట్టి ఉషఃకాలమునందు నిద్రలేచుట మనవిధి యని మన ధర్మశాస్త్రములే గాక పాశ్చాత్యశాస్త్రజ్ఞులుకూడ నంగీకరించుచు ప్రమాణమును గనబఱచుచున్నారు. దంతధావన మనగా నేమో యెఱుగని హైందవు లెవ్వరును లేరు. ఒకవేళ నున్నచో నదియది పాశ్చాత్యానుకరణ మట! దంతధావనము లేనికారణమున నెందఱో దంతభగ్నులగుచు ముప్పదియేండ్లకే ముసలితనాకారమును చెందుచున్నారు. కృత్రిమపుదంతముల నమర్చుకొనుట- కదలుచున్న దంతముల నూడలాగించుట- మొదలగు పనులయందు వీరికి విరామ ముండదు. చెట్టుపుల్లలతో కచ్చికతో నుపయోగింపక బ్రష్షుల నుపయోగించువారు కొందఱు గలరు. బ్రష్షులవల్ల నెట్టి యపాయము గలదో పాశ్చాత్యశాస్త్రజ్ఞులు దెలిపియున్నారు. ఎస్కిమోలగువారిలో నూటికి నొక్కనికి హైందవులలో నూటికి 6 వంతున చైనావారిలో నూటికి 40 వంతున ఐరోపాలో నూటికి 90 వంతున దంతరోగములను గలిగియున్నారు. బ్రిటిషు మెడికల్ జర్నలులో బ్రష్షుల నుపయోగించుట హానికర మనియు నణుజీవు లా బ్రష్షులో చేరియుండుననియు చెప్పుటకప్పుడు క్రొత్త బ్రష్షు నుపయోగింపవలసినదే గాని యొకమారు ఉపయోగించిన దానిని తిరిగి యుపయోగింపరా దని గొప్పడాక్టరు వ్రాసియున్నారు.

అన్నివిధములగు శీతోష్ణస్థితి గల మనదేశమునందు ప్రతిదినము స్నానమాచరించుట కెన్నియో సదుపాయములను దైవము ప్రసాదించి యున్నాడు. పాశ్చాత్యదేశములలో చలి విశేషమగుటచేత ప్రక్షాళనాదులకు నత్యంతరము కల్పింపబడుటయు స్నానములకు తగిన సదుపాయములు లేకపోవుటయును సంభవించుచున్నది. వారమున కొక్కసారి స్నానముచేయువారు కొందఱు మఱియొక్కువ కాలమువఱకు స్నానము

శాస్త్రవిద్వాంసుల సంఘమునందు దృష్టాంతములతో స్పష్టపరచి యుండిరి. ఈ విషయమునందు గాటిఝక్ అను శాస్త్రజ్ఞుడు విపులముగ జర్చించియున్నాడు. డాక్టరు బెర్ అను అమెరికా శాస్త్రజ్ఞుడు కొన్ని రోగములకు మాంసాహారము మేలు కాదనో- రెండువిధములగు ఆహారములకు గల తారతమ్య మేమో- న్యాయసభలో ఋజువుపరచి 10000 బంగారువరహాల బహుమానమును పొందెను. అస్కట్టు అను శాస్త్రజ్ఞుడొకటిరెండుదినముల యుపవాసమువలన జీర్ణకోశము చక్కబడి మనోదార్ఢ్య మధికమగునని వ్రాసియున్నాడు. డాక్టరు పార్లో దృష్టాంతపూర్వకముగ 'ఏకభుక్తం సదారోగ్యం' అను శ్లోకముచు రెండు పూర్ల కంటె హెచ్చు భుజించుట ప్రకృతిశాస్త్రవిరుద్ధ మని తెలిపియున్నాడు. ప్రొఫెసరు చిట్టెండేను 6 గురు మెదడు నుపయోగించి పని చేయువారిని 20 మంది సైనికులను 6 గురు జట్టీలను 6 మాసములు మామూలు ఆహారములో సగముఆహారములో నుంచి పరీక్షింపగా వారి యారోగ్యమును బలమును మిక్కిలి యభివృద్ధి చెందినట్లు తెలియజేసి యుండెను. అప్టనుసింక్లేరు అను శాస్త్రజ్ఞుడుపవాసమువలన రోగబలము తగ్గి యవయవములకు గొంత విశ్రాంతి యేర్పడు నని వ్రాయుచున్నాడు. హిందువుల యాహారనియమము లన్నియు ప్రకృతిశాస్త్రానుగుణ్యములే గాని హాస్యములు గావు. మనదేశమున నే యతిథి యభ్యాగతాదులకు సత్కారము గలదు. కాని యితరదేశములందు గానము. ఆర్యుల సర్వభూతదయాళుత్వమని నితర సాధారణము.

వివాహనియమములు:—పాతివ్రత్యధర్మమునకు ఆర్యావర్తమే పుట్టినిల్లని చెప్పవచ్చును. హిందువుల వివాహములు మతనిబంధనములకు లోబడినవి. శాకాహారులలో యువతీవివాహములకు ప్రతిబంధకములు గలవు. ఇప్పుడు మాంసాహారులలో గొందఱు బాల్యవివాహములను-శాకాహారులలో గొందఱు యువతీవివాహములను- సలుపుచున్నారు. స్వేచ్ఛాహారవిహారసమర్థదాయకమై యనారోగ్యకర మగుటయే గాక సంఘనాశకరము కూడ నగును. ఆంగ్లదేశమున 15 సం॥లలో వివాహములసంఖ్య పదివేలకు 150 నుండి 143 కు తగ్గినది. జననములు వెయ్యింటికి 27 నుండి 25 కు తగ్గినవి. ఫ్రాంసులో 1859 లో 1018000 జననములు; 1862 లో 984000; 1887 లో 879000; 1910 లో 775000. మనదేశమున జననములసంఖ్య హెచ్చుచున్నది. అతిబాల్యవివాహములు గర్హ్యములై యున్నవి. శాకాహారులలో యువతీవివాహములు లేని పద్ధతివారికి ఘోషా లేకుండ మాంసాహారులలో యువతీవివాహములను ఘోషా యుండుటయు జూడ భుజపరాక్రమయుతులగు వారిసంఘములకు గల ప్రత్యేకపద్ధతులు ప్రకృత్యనుకూలములుగ నున్నవి. త్రికరణశుద్ధిగ పాతివ్రత్యము నాచరించుటకు నై విధానము సహాకారిగ నున్నది. పెద్దలగువారు తమపిల్లలకు తగిన వరు నేర్పరుచుపద్ధతి యెక్కడ? ముక్కుపచ్చలారని యువతులు హైస్కూలను జూచి యావేశముతో వరించుట యెక్కడ? సత్కుల మేర్పడి వంశము సాగవలె నన్న దంపతుల పూర్వోత్తరములు వంశసాంప్రదాయము మొదలగునవి ఎన్నియో జ్ఞాపకముంచుకొనవలెను. 16 సంవత్సరముల లోపు బాలుర కెట్టి స్వాతంత్ర్యమును గలిగించుటకు ఇచ్చగింపనివారలగు స్త్రీలను వరాన్వేషణకై పాశ్చాత్యపద్ధతిని అనుకరించుట కెట్లు సమ్మతించెదరో.

హైందవసంఘమునందు చిరకాలముగ గుణకర్మల ననుసరించి చాతుర్వర్ణ్యములు గలవు. అట్టిది యార్థికశాస్త్రపద్ధతి కనుకూలముగ నున్నది. పాశ్చాత్యదేశములందలి వర్తకసంఘము లట్టివి గలవు. కాని మనదేశమునందలి వర్ణవిధానము మార్పున కవకాశములేని నియమములు గలిగియున్నది. పాశ్చాత్యదేశములం దట్టులు గాదు. చిరకాలముగను వంశపారంపర్యముగ నొకేవిధ మగు వృత్తియం దుండువారి కందు నిపుణత గలుగును. బ్రాహ్మణుడు నేడు చెప్పులుకుట్టి-రేపుండి చాకలిదుకాణము సాగించి-స్వేచ్ఛగ సంచరించుటకు బూనినచో నట్టివానివల్ల సంఘమున కెంతలాభముండునో! మనదేశమున కారణాంతరములచేత గొన్నివృత్తులు నశించినందున వానిని పునరుజ్జీవింపజేయు ప్రయత్నములు జరుగుచున్నవి. నల్లరాతిమీద నగిషీపనిచేయు శిల్పు లంతరించిరి. ఇట్టివెన్నో మనదేశమున గూపుమాసినవి. మనవర్ణవిభాగ మేకారణముచేత నేర్పడినను ఈవిధానమువల్లనే ఇతరదేశములందు గలుగుచున్న పాటకపుజనుల కార్మికకల్లోలములు మనదేశమున పాశ్చాత్యానుకరణసంఘములందు తప్ప ఇతరత్రగానము. హిందూదేశమునందలి వర్ణవిభాగమును పరిశీలించినచో నాలోచనచేసి బుద్ధిబలము నుపయోగించుపనులకు బ్రాహ్మణులను దేహబలము నుపయోగించుటకు మిగిలినవర్ణములను ప్రత్యేకింపబడినట్లు దోచగలదు. మనుజున కెట్లు బుద్ధిబలము దేహబలము నవసరమో సంఘమునకు నట్టిబలము లవసరములు. వర్ణభేదము లుండినను మనసంఘమింతకాలము నైకమత్యముతో నడచుటకు సాక్ష్య మగుటకు కారణ మీవర్ణములవారు సంఘక్షేమ పరస్పరసహాయక్రియలపై యాధారపడియున్న దని గ్రహించియుండుటయే యని తెలిసికొనవచ్చును. కాని కాలవశమున నీవర్ణములవారు రాజ్యసంఘములను ఆశ్రయించి జీవించుట తటస్థించినది. అంతకుబూర్వము హైందవసంఘము స్వశక్తిమీదనే నిలిచియుండెను. కాబట్టి నవీనకాలమున వివిధవర్ణములకు గల అన్యోన్యాశ్రయము సడలుటలో వింత లేదు. ఇందువలనే స్వధర్మవిసర్జనమే ప్రథమసోపాన మయ్యెను.

కర్మను విశ్వసించెడి భారతీయులు దైవయోగముచేత సనాతనధర్మములు మనదేశమున క్షీణించుచున్నవని నమ్ముచున్నారు. బుద్ధిబలమునకు దేహబలముకంటె ప్రతిదేశమునందు ప్రాధాన్య మియ్యబడుచున్నది. మతకర్తలగువారును మంత్రులను బుద్ధిమంతులుగ నుండవలయును. పూర్వమున బ్రాహ్మణులే మంత్రులుగను మతకర్తలుగ నుండిరి. క్షత్రియులు రాజ్యపరిపాలనమును వైశ్యులు వ్యవసాయాదికృత్యములను శూద్రులు పాటకపుపనులను నిర్వర్తించుచుండిరి. అప్పుడు నైసంఘములన్నియు దమతమగల బాధ్యతలను గుర్తెరిగి సంచరించినవనుటకు సందియము లేదు. ఈనాలుగువర్ణముల యైకమత్యమువలన హైందవసంఘము పెక్కువేలసంవత్సరములుగ నెన్ని పరదేశరాజులదాటీలు వచ్చినను విచ్ఛిన్నముగాక యుండగలిగెను. పూర్వకాలమున బ్రాహ్మణులు తమధర్మముల నాచరించుచు సత్యదీక్షతో మిగిలినవర్ణములవారి సంరక్షణలో నుండి వేదమును విద్యను కాపాడుచు మిగిలినవర్ణముల

వారికి మార్గదర్శకులుగ నుండిరి. ఇంతియు కాదు. వారు స్వార్థత్యాగులు. ఆర్థికముగ మిగిలిన వర్ణములవారే సంపన్నులు. భూభాగ్యవంతులు. ఇప్పుడు కాలము తారుమారైనది. పదచ్యుతి యేర్పడినది. ఆద్యుగి ముందు బ్రాహ్మణుని వాదహించెను. స్వదేశరాజ్యము అంతరించుట చేత ఆట్టిరాజులపై ఆధారపడిన బ్రాహ్మణులకు గత్యంతరము పర దేశరాజుల సేవ యయ్యెను. సేవకవృత్తిలో సహితము బ్రాహ్మణులు వశీకరణశక్తులను సంపాదించి పరిపాలనము కొనసాగించుచుండిరి. క్రమ ముగ దేశమునందలి వృత్తులు కొన్ని నశించుటయును క్షీణించుటయును, నందు చేత భూజీవనములేని శూద్రాదులు బ్రాహ్మణుల ననుకరింపవలసి వచ్చు టయును, ఏర్పడెను. భూజీవనములేని శూద్రాదులకును బ్రాహ్మణ విద్యాధికులకును అధికారపదవుల నాక్రమించుటలోను క్రిందివారిని సేవ నెత్తుటలోను గొన్ని వైషమ్యము లంకురించెను. అగ్నికి వాయువు సహాయమైనచందమున భూభాగ్యవంతులగువారును నిజవృత్తులను త్యజించి యధికారము చలాయించుటకు బూని బ్రాహ్మణులపై విద్వేషపూరిత మానసకటాక్షము గలవారై పోటీకి బూనిరి. అప్పటికి బుద్ధిబలప్రదర్శన మున నేకొలదినుండి శూద్రాదులలో తప్ప మిగిలినవారు బ్రాహ్మణుల ధాటికి నాగలేకపోయిరి. అధికారవర్గమువారికి ఏనోమళ్ళ తారాశమంత్రమై పోయినది. పరిపాలనవిధానమున గొన్ని మార్పులు గలిగి సాంఖ్య శాస్త్రమును ప్రయోగించుటచేత బుద్ధిబలప్రదర్శనమునకు గల యవకా శము తగ్గింపబడినది. నూతనపండితులకు మాంద్య మయ్యెను. స్వదేశ రాజ్యము అంతరించినప్పుడు గలిగిన పదచ్యుతిదినములు బ్రాహ్మణునికి జ్ఞప్తికి వచ్చుచున్నవి. తిరిగి పదచ్యుతి గలుగుటవల్ల గణితశాస్త్రపద్ధతి ననుసరించి రెండు వ్యతిరేకములలబ్ధ మనుకూల మగుచుటలు బ్రాహ్మ ణులకు పూర్వపు ఔన్నత్యము రానున్నదేమో యని తలంచుట కవ కాశము గలదు. ఒకవైపున స్వదేశప్రభుత్వపున ద్వారము తీవ్రము ప్రారం భమైనది. పరిపాలనవిధానపద్ధతులు రెంటికిని మనమతములో గాని వర్ణాశ్రమధర్మములతో గాని ఐక్యము కలిగించుకొనని తటస్థనియమ ములు కలిగియున్నవి. మనవృత్తులను సంరక్షించుకొని మతధర్మములను కాపాడుకొంటేకాని మనకు భుక్తి ముక్తి దొరకదు. పెక్కండ్రు బ్రాహ్మణవిద్యార్థులును విద్యాధికులును అధికారపదవుల కెందఱోలక జీవితకాంక్ష గలిగియున్నారు. వారు స్వదేశవృత్తులను ప్రోత్సాహపరచి యార్యధర్మములను పునరుద్ధారణము జేయుదురేని శాంతిస్వభావము గల వారై-సత్యసంధులై-త్యాగశీలురై-నిర్వికారముగ సుఖజీవనము జేయ గలుగుదు రని నమ్ముచున్నాను. కాబట్టి బ్రాహ్మణుడు దేశధర్మముల నిర్వ ర్తించి యితరవర్ణములవారి సన్నగ కెందుగలనో ముఖ్యముగ యోచింప దగియున్నది. తత్పద్ధతి యెట్లున్నను-బ్రాహ్మణేతర వాదకులు బ్రాహ్మ ణులు పూర్వప్రకీతిని లేకుండిన మన్నన కష్టములు గాదని యనుటచేత బ్రాహ్మణులు కేవలక లోపములను గనక యభివృద్ధికి కారకు లగు వారికి మనము కృతజ్ఞులమై యుండవలెను.

ఇప్పటికి కొన్నిసంవత్సరముల క్రిందట అమెరికాదేశమునందు 'భాగ్య మెటులు లభించును' అను పుస్తకమును వ్రాసిన ఎడ్విన్ టి క్రీడ్లీ యను మేధావి ఆపుస్తకమునందు సంఘవిభాగమును గుఱించి వ్రాసిన వాక్య ములు చదువరులు ముఖ్యముగ గమనింపవలెను. "యజమాని యగువాడు కేవలము శరీరదార్ఢ్యమును అందుకుదగిన బుద్ధిమాంద్యమును గలవారిని గాక బుద్ధివిశేషము జ్ఞానము లోకానుభవము గలవారినే లేఖకులందు నియ మింపవలెను. యునైటెడ్ స్టేట్సులో ప్రస్తుతము గుమాస్తాలు చేసే జనులు చేయవలసినపనులను చాలవఱకు కాపలవారందు జొరగూడనివారు- అనగా స్వాభావికముగ వ్యవసాయము చేసికొనవలసినవారు- చేయు చున్నారు. అందువలన వేలకొలది బుద్ధిమంతులు విద్యాధికులు నట్టి పనుల కర్హులైనవారు నిరుద్యోగపుడిపార్టుమెంటులో నున్నారు." ఈ పైవాక్యములకు వ్యాఖ్యాన మనవసర మని వదలివేయుచున్నాను.

ఆర్థికశాస్త్రానుగుణ్య మగు నిట్టి వర్ణవిభాగము గాని-పారిశుద్ధ్య శాస్త్రము ననుసరించి పరిశుభ్రమగు వృత్తులు గాని-లేనివారును, పరి శుభ్రము కాని జీవితము గలవారును, నీతిబాహ్య మగు వ్యభిచారాదిదో షంబులు గలవారును, సంఘమునకు వెలుపలగా నుంచబడుట స్వాభావిక ము. ఒకవృత్తినుండి మరియొకవృత్తికి స్వేచ్ఛగా మారుటకు పాశ్చాత్య దేశములందు గల యవకాశము మనవర్ణవిధానమున లేనిమాట సత్యము. అప్పుడు శిల్పములు పరిపూర్ణతజెందుట కవకాశము తగ్గి నశించుటకుగూడ వీలుగలదు. పారంపర్యముధనము నీటు గలుగుట యనావశ్యకము. అట్టి మార్పులు సంఘమునకు లాభదాయకములగుటకంటె పర్యవసానమున హాని కరములు కావచ్చును. సంఘోపద్రవమెుక్కనివల్ల సహితము పాలలోనుప్పు రాతిధంగి రావచ్చును. అందుచేత కులనియమము లెక్కువ జాగ్రత్తతో సంఘక్షేమమును కాపాడుచున్నవి. వృత్తులకు కొందఱకు మార్పు రుచింప వచ్చును. తాత్కాలికలాభముతో, జేరియుండవచ్చును. మన పాలీలు కూ లీలుగ మారినచో వారు తిరిగి కేర్పుగల పాలీలగుట కెంతకాలము పట్టునో చూడుడు. అందఱును కల్లకిరుక్కిన మేధావు లెవరు? వీరిలో వీరు వచ్చిందాలుపడి యెప్పటికప్పుడు నూతనసమస్య లేర్పడి తగవులాడు చుండుటవల్ల సంఘమునకు సంక్షోభమే గదా. అందఱు నొకవిధ మగు వృత్తినే చేయ వీలులేదు. పంపిణీ యవసరము. పలుగురుసోదరులలో నొక నికి నేడొకభాగము వచ్చిన రెండవవాడు మరువాడు తనభాగమును మార్చుకొనుమని పెద్దవాని నడిగిన నెట్లుండునో చూడుడు. మనవర్ణవి ధానమున బ్రాహ్మణులకంటె బ్రాహ్మణేతరులకే యార్థికసదుపాయములు గలవు. బ్రాహ్మణు లెంతవఱకు మిగిలినవర్ణములవారిచే పోషింపబడి గౌర వింపబడుచుండిరి. ఆగౌరవము బుద్ధిబలమున ననుసరించి యేర్పడినది. ఇతరవర్ణ ములపై ఆధారపడి బ్రాహ్మణు లావర్ణమువారి నగౌరవపఱుపఁజాలరు. వృత్తులవిభాగమందు గాని కొందఱను సంఘమునకు వెలుపలనుంచుటలో గాని యార్యులు స్వలాభమును గోరిగాని యొకరియెడ ద్వేషమువహించి గాని సంచరింపక సంఘముయొక్క సత్స్థితిలాభమునే యాలోచనచేసి నటులు గోచరమగుచున్నది. పాశ్చాత్యసంఘములను తిలకింపుడు. లార్డు లైనవారు సామాన్యజనులతో కలసి భుజించుటకు గాని సంబంధబాంధవ్య ములను గలిగియుండుటకు గాని యిష్టపడరు. జాతిభేదములు కొల్లలుగ విచ క్షణ పుట్టుక మొదలగున వెన్నియో పాశ్చాత్యులను బాధించుచున్నవి. పెద్దలార్జించినధనము యశస్సును పెద్దలమతమును సులభముగ వదలివేయు వారెదేశమునలేరు. నిమ్నజాతుల నుద్ధరించుట కాటంకము లుండగూడదు.

అందువలన నిమ్నవర్ణములవారు తమధర్మములను త్యజించుట కూడదనియు నొకరిని ధర్మపథమునకు తేబూనువారు తాము ధర్మబాహ్యులు కాగూడదనియు గ్రహింపవలెను. వ్యక్తులలో గలలోపములు సవరణ కాబడవలెను. కాని యావ్యక్తులకొఱకు సంఘనియమములను సడలించుట సబబు కాదు. ఆర్థికశాస్త్రానుకూల్యమగు వర్ణవిభాగము పారంపర్యముచే బలపడి శిల్పము పరిపూర్ణతకు సహకారియగుటచేతను పారిశుద్ధ్యశాస్త్రము ననుసరించి చేయబడిన నియమములనేకములు చిరకాలముగ మనదేశాచారములందుండుటయు వానియంతర రహస్యముల తత్త్వము చాలమందికి దురవగాహముగ నుండుటచేతను ప్రతిమతమువారును కులమువారును వారివారి మతములకు లోబడినకట్టుబాటుల ననుసరించి నడచుట సాంప్రదాయముగనుండుటచేతను మన ఆర్యధర్మములను పునరుజ్జీవింపచేయుట సమంజసముగాని వ్యక్తుల కొఱకు మతముతో సంబంధములేని సంఘనియమములు గలపాశ్చాత్యానుకరణము ననుసరించి సంస్కరణము గావింపగూడదు.

బ్రాహ్మణవిద్యార్థులును విద్యాధికులును ఆర్యావర్తచరిత్రను పాశ్చాత్యగ్రంథములనుబట్టి గాక మనదేశస్థులు పరిశోధనచేసి వ్రాసిన గ్రంథములనుండి తెలిసికొనవలయును. పూర్వ మెటు లార్యులు గంగాతీరమునందు గొన్నియావులను శిష్యకోటినిగలిగి జీతముల కాశింపక యాశ్రమముల నేర్పఱచుకొని వేదాధ్యయనముతో పేరాశలను జెందక స్వతంత్రజీవనము జేయుచు కృషాణ్యములను సలుపుచుండిరో తెలిసికొనినచో దేశమున వృత్తులు పునరుద్ధారణజెంది వైమనస్యములు కొంతవఱకు నశించుటకు తగిన పరిస్థితు లేర్పడగలవు. బ్రాహ్మణునికి గల మనోబలముచేతను మతాచరణమువలనను కేవలము తపస్సువలన ధన్యుడు కాగలడు. ముక్కుమూసికొని కూర్చుండువానికి ముక్తి దొరకునేమో గాని భుక్తి యెటులని సంశయింప బనిలేదు. విశ్వామిత్రునకు తప స్సెంత గొప్ప పదవిని కల్పించెనో తెలిసికొనుడు. పాశ్చాత్యశాస్త్రజ్ఞుల పరిశోధనలలో కేవలము గాలివల్ల మనుజుడు జీవించుట కవకాశము గలదా యనువిషయమును బాడ్లాట్ అను శాస్త్రజ్ఞుడు నిర్ధారణచేసియున్నాడు. వాయుధారణ తగినంత చేయబడుట కవకాశమున్నచో నందులో మనుజునకు కావలసిన జీవపదార్థములు గల వని వ్రాసియుండెను. యోగాభ్యాసపరుల కట్టి శక్తి యుండినటులు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు వ్రాసినవి చూడుడు. పొరుగింటి పుల్లగూర రుచి యని మన శాస్త్రములయందు విశ్వాసములేని విద్యార్థులును విద్యాధికులు నుండుట నే నెఱుంగుదును. గావుననే యట్టివారికై ప్రకృతిశాస్త్రజ్ఞుల నింతగా నెత్తి వ్రాయవలసివచ్చెను. 1705 లో ప్రచురింపబడిన లండను మెడికల్ ఫిజికల్ జర్నల్ 3వ వాల్యూము 409 పుటను ప్లాటర్ యొక్క ప్రకృతిచరిత్రగ్రంథములోనుగల దృష్టాంతములవలన హిందూయోగు లాహారము లేకుండ కుంభకమున ననేకదినము లుండినట్లు వ్రాయబడినది. ఇట్టి దృష్టాంతములు పెక్కులుగలవు. బ్రాహ్మణుల కుపనయనమువాటి యుపదేశము లెట్టివో గనుడు. ప్రాణాయామముచే శరీరారోగ్యమును దీర్ఘాయువును గలిగి యల్పాహారములో తృప్తిజెంది యార్థికముగ దేశభారమును తగ్గించుటకుగూడ నవకాశము గలదని నమ్మవలెను మనధర్మములను మనము త్యజించుటయు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు వానిరహస్యములను కొంతవఱకు తెలిసికొని మన యోగవిద్యామాహాత్మ్యమును గుఱించి యనేకగ్రంథములు రచించుటయే గాక అమెరికా మొదలగు దేశములం దనుష్ఠానత్రము చేయుచుండుటను బట్టి మన మేమి గ్రహింపగలమో యూహింపుడు.

లండనుహాస్పిటలులో శరీరశాస్త్రపండితు లగు డాక్టరు లియొనార్డు యొర్క్సిన్ హిల్ ఒకపరుగుపందెమున ప్రవేశించిన మల్లురలో కొందఱకు ప్రాణవాయువు నొత్తి నిండి పీల్చినంతలో మిగిలినవారికన్న వారు ముందుగా గమ్యస్థానము చెట్టిబడలిక లేకుండ చేరగలిగిరనియు వారికందఱకు చాల దప్పియుండదనియు నట్టి ప్రాణవాయువు వినియోగ బడినదనియు వ్రాసియున్నారు. ఇప్పుడు పాశ్చాత్యవైద్యశాలలలో ప్రాణవాయువుతో నెన్నియో మందులు కలుపబడుచున్నవి. పరిశుద్ధమైన ప్రాణవాయువు తక్కువగు శరీరములకు ఋణబాధ గలుగును. వారు ప్రాణవాయువు నుపయోగించి స్వస్థులగుచున్నారు. ప్రాణవాయువు చేయు నది తప్పదే. దీపమునకుగాని అగ్నికిగాని ప్రాణవాయువులేనిది యవకాశము లేదని ప్రకృతిశాస్త్రజ్ఞు లెఱింగిన విషయమే. ప్రాణాయామము వలనగాని తపస్సువలనగాని జరుగు వాయుధారణ మిట్టి ఫలితము నిచ్చును. తపశ్శబ్దము- తప్ ఆలోచనే- యను నర్థముగల ధాతువు నుండి వచ్చినది. విశ్వామిత్రు డట్టి తపస్సుచేసి వసిష్ఠునిచే మెప్పుబడసి గాయత్రీప్రాధాన్యమును లోకమునకు జాటెననుటలో నాశ్చర్యము లేదు. తపశ్శాలురకు నణిమాద్యష్టసిద్ధు లుండెననిన నవ్వవలసిన నిమిత్తము లేదు. జర్మనుయుద్ధమునకు బూర్వము పుష్పకవిమానము కల్పితకథ యని యు నాగ్నేయాస్త్రసమ్మోహనాస్త్రములు మిథ్యలనియు ననినవా రిందఱో ప్రత్యక్షముగ నభిప్రాయములను మార్చుకొనిరి. మన హైందవులును కొన్నిసంగతులు సంఘలాభము నుద్దేశించి రహస్యములుగ నుంచి గురుపరంపరాబోధలకు లోబరచిరి. లాభమును పొందగోరి యేరహస్యమైనను సద్బుద్ధితోను వినయవిధేయతలతోను తెలిసికొనగోరిన నిజాభిలాషులకు పూర్వమున గురువు లుపదేశించుచుండిరి. ఇక్కాలమున పాశ్చాత్యమతధర్మములకు సంఘట్టనము గలిగి చంచలమనస్కు లేర్పడి మతధర్మములందు భక్తివిశ్వాసములు చాలవఱకు నశించినందున తగు గురుశిష్యసాంప్రదాయము లంతరించుచున్నవి. ప్రత్యేకవ్యక్తులు గోరు మార్పు లొకవేళ సంఘమునందలి యెక్కువమంది పూర్వసాంప్రదాయములను తెలిసికొనజాలక యంగీకరించినను పూర్వాచారములందు భక్తిగల కొలదిమందియైనను తమ మతధర్మములను కాపాడికొనుట వారి విధియైయున్నది. భిన్నాభిప్రాయము గలవారు భిన్నసంఘముగ నుండవచ్చును. కానిపూర్వాచారములను ధ్వంసము చేయుటకు నట్టియాచారములకు దాసులగువారిని యిబ్బందిపెట్టి సంక్షోభపెట్టుటకు ప్రయత్నించుట తగదని సంస్కర్తలు గ్రహింపవలెను. బ్రాహ్మణులు తమకు సేవకత్వము నక్రమముగ విధించిరను బ్రాహ్మణేతరులు వారిప్పుడు నక్రమముగ బుద్ధిపూర్వకముగ నిదివఱకుండిన స్వతంత్రమును వీడి దాస్యమునకు దిగుచున్నందున బ్రాహ్మణులసేవకు బదు లితరుల సేవకులగుచున్నారు. బ్రాహ్మణులకిప్పటికి దాస్యవిముక్తి దూషణవిముక్తి గలుగుచున్నదులకు హర్షించుచున్నాను. ఇప్పటికైనను పాశ్చాత్యవిద్యయొక్క వ్యామోహము వలన గలిగిన మతిభ్రమలను మార్చుకొని మనవారు స్వదేశమతముయొక్కయు వృత్తులయొక్కయు సంబంధమును గలిగియుండినయెడల నార్యుల పూర్వపు ఔన్నత్యమును వివిధదేశములకు చాటగలము.

# హైందవ స్వరాజ్య నిర్మాణ సూత్రములు.

దంటు శ్రీనివాస శర్మగారు బి. ఏ.

ప్రస్తుతము సహాయ నిరాకరణోద్యమము దేశమంతటను వ్యాపించియున్నది. ఈయుద్యమమునకు విముఖులగు వారు చాలమంది ఇంచుకించుక తారతమ్యములతో స్వార్థపరాయణులే యనవచ్చును. స్వధర్మాభిలాష మించుకైనను గల ప్రతిమానవుడును మానసికముగానైన నీయుద్యమము నంగీకరించియున్నాడు. యథార్థమైన భేదాభిప్రాయము గలవారలు కొందఱు లేకపోలేదు. గాని వారి సంఖ్య అతిస్వల్పము. మన దేశోన్నతికొఱకై ఇదివఱ కనేక ప్రయత్నముల సలిపియుంటిమి. గాని రోగస్వరూపముఁ గుర్తింప రోగములకు చికిత్సచేసిన ట్లవి యన్నియు నిష్ఫలములై పోయెను. ప్రస్తుతోద్యమ మన్ననో ప్రధానవ్యాధిని జాగ్రత్తతో శోధించి తన్మూలకారణమును నిర్మూలముచేసి జాతికి నూత్న యౌవనము నొసంగ ప్రయత్నించుచున్నది.

సహాయనిరాకరణోద్యమము రాజకీయసాధనము మాత్రమే గాదు. అట్టులు కాకుండను ఉండదు. ఏలయందురా? జీవితమును సుఖవంతముగ చేయుసాధనములు అనేకములు. అందు రాజకీయస్వాతంత్ర్య మొకటి. కాని ఇదియే సర్వఫలప్రదమని యనుకొనుట పొరబాటు. పశ్చిమదేశములకును మనదేశమునకును గల ప్రధానభేద మిదియే, అచట సర్వవ్యవహారములును రాజకీయమునకు లోబడియే దానిచే నియమింపబడుచున్నవి. రాజ్యతంత్రసహాయము లేనిది పశ్చిమదేశములం దొక కార్యముకూడ సిద్ధింపదు. శాసనప్రయోగము చేసి మెడమీదఁ గత్తిపెట్టి నడిపించినగాని జనులు నడవరు. రాజ్యతంత్రాధీనమైన సంఘమునందు సదాచారమునకు తావులేదు. ధర్మమూలములలో ప్రధానములు రెండు- శాసనము. సదాచారము. ఈ రెంటియందును సదాచారమునకే యగ్రస్థాన మొసంగవలసియున్నది. ఏలయనగా శాసననిర్మాణమునకు కారణములు అధికారమున పక్షమువారి తాత్కాలికాభిప్రాయములు. ఉత్తరక్షణమం దాయుద్దేశములు వారికే మారవచ్చును. లేదా వారిప్రతిపక్షులు తదధికారస్థానమును పొంది వానిని మార్పవచ్చును. అట్లగుట ధర్మము కామరూపియై క్షణమున కొకరూపము దాల్చి జనులను పెడత్రోవలఁ బెట్టుచుండును. సదాచార మన్ననో తాత్కాలిక సందర్భములపై నాధారపడియున్నది గాదు. రాజాజ్ఞజనితమును కాదు. అయ్యది దేశమందు నాటుకొని సర్వజనాంగీకారమును బడసి క్రమక్రమముగ జనులయుద్దేశములతో మార్పుఁజెంది సుహృద్బోధనమువలె సాంఘికవ్యవహారముల నియమించును తదుల్లంఘనమువలన రాజకీయమగు ప్రత్యవాయము లేకుండుటచే నయ్యది సదాచారమే కానిచో నచిరకాలంబున నిరసింపఁబడును. కావున సాధ్యమైనంతవఱకు రాజ్యతంత్రాధీనతమును తగ్గించుటయే ధర్మాచరణకు సహాయభూత మగును.

ప్రభుత్వము అనివార్యమైన కీడు. దుర్మార్గు లుండుట తప్పదు కావున వారి దుశ్చరితముల దృష్ట్యా ప్రభుత్వనిర్బంధములు సహింపదగిన వగుచున్నవి. గాని వేఱొండుగాదు. అధర్మము - ప్రభుత్వము రెండును బాధకరములే కాని రెండవది మొదటిదానికంటె తక్కువకీడు. కావున పెద్దయాపదను తగ్గించుకొనుటకై తక్కువకీడు నంగీకరించుచున్నాము. కొందఱు బుద్ధిమంతులు ప్రభుత్వ మనవసర మని తలంచువారు కలరు. వీరిని అరాజకులందురు. మనదేశమందు ప్రభుత్వాధికారముచేసి యరాజకులని పిలువబడువారికిని వీరికిని సంబంధమేమియును లేదు. పరమార్థదృష్ట్యా ప్రభుత్వము జనశ్రేయమున కనవసరమని వీరి యభిప్రాయము. ప్రపంచమం దంతటను పారమార్థికులే యున్నచో వీరివాద మంగీకరింపవచ్చును. గాని రాగద్వేషము లున్నంతవఱకు ప్రభుత్వ మవసరమే యగును. కావున ప్రభుత్వము కేవలము అనవసరమని నిరసింపక రాజ్యతంత్రమే పరమార్థమని సకలవ్యవహారము లద్దాని యధీనము సేయక అయ్యది ఎంతవఱ కవసరమో అంతవఱకే చోటు నిచ్చి ఇతర విషయములందుగల నియామకత్వమును సంఘమునకు వదలివేయవలయును.

ఇదియే భారతస్వపరిపాలనాపద్ధతికిని పశ్చిమపద్ధతికిని గల ముఖ్యభేదము. పశ్చిమదేశవాసులకు స్వాతంత్ర్యమం దభిలాష మెండనియు ప్రజాస్వామికప్రభుత్వము వారే ఎఱుంగుదురనియుఁ బ్రాగ్దేశములందు నిరంకుశప్రభుత్వముతప్ప వేఱొండు లేదనియును, సామాన్యాభిప్రాయమై యున్నది. కాని సూక్ష్మముగ విచారించినచో ప్రజాస్వామికముయొక్క నిశ్చయతత్త్వమును భారతీయులే గుర్తెఱిఁగిరి. గాని పాశ్చాత్యులు గుర్తెఱుంగలేదు. ఇది వట్టిప్రజ్ఞావాదము కాదు. మనదేశమందు హిందూరాజు లంగీకరించిన స్థానిక ప్రభుత్వశాఖల పరిశీలించినచో నియ్యది స్పష్టపడఁగలదు. ప్రభుత్వము కేంద్రమనియును స్థానికమనియును రెండువిధములుగ విభాగము చేసియున్నారు. స్థానికముపై కేంద్రమునకుఁ గల యధికారమును సాధ్యమైనంతవఱకును తగ్గింపవలయునను సిద్ధాంతమును పాశ్చాత్యు లంగీకరించియున్నారు. పూర్వము మనదేశమందును ఆచరణలో నుండెడిది. కాని ఈవిషయమందు పాశ్చాత్యాచారమునకును మనకును గొప్ప భేదము గలదు. పశ్చిమదేశములందు స్థానికప్రభుత్వము కేంద్రనిర్మితమై తదధీనమై యున్నది. చీరాలగ్రామచరిత్ర తెలిసిన మనకు ఈ విషయముపై విశేషముగ వ్యాఖ్యానమవసరములేదు. మన ప్రాచీనపద్ధతి యిట్టిది గాదు. సహజముగ తమంతట తాము పెంపొందిన స్థానికసంఘంబుల కేంద్రప్రభుత్వమువా రంగీకరించి వానినియమములను మర్యాదలను తామే ఒప్పుకొనియున్నారు. ఆ పద్ధతిప్రకారము అవసరమగుచో మ్యునిసిపలు సంఘములు స్థాపించుటకు, అవసరమగుచో స్థాపింపకుండుటకు కేంద్రప్రభుత్వమున కట్టి యధికారము నుండెడిది గాదు. ప్రతి

గ్రామములందును కులము శ్రేణి పూగము అను పేళ్లంబరగు గ్రామసంఘము లుండెడివి. గ్రామస్థుల సకలవ్యవహారములు-వివాదములు-ఈసంఘములవలననే పరిష్కరింపబడుచుండెడివి ఈసంఘసభ్యులు అధికారులు గ్రామస్థులే కాని రాజోద్యోగులు గారు. ప్రస్తుతము మనము ప్రతిష్ఠింప బ్రయత్నించుచున్న పంచాయతీకోర్టులు పూర్వకాలమున శ్రేణ్యాదిసంఘరూపములుగ నుండెడివి. ఈగ్రామసంఘములనిర్ణయ మసంతృప్తికరముగ తోచినవా రెవరో కొందఱు మాత్రమే రాజాధిష్ఠితమైన న్యాయస్థానమున కేగెడివారే గాని సామాన్యవివాద లన్నిటికి నీసంఘములే చాలియుండెడివి. ఈ సంఘములపై రాజునకు గల యధికార మతిస్వల్పము. ఈ పద్ధతి ప్రకారము ప్రతిగ్రామమునకును రాజకీయవిషయములందేమి ఆర్థికవిషయములందేమి సాంఘికవిషయములందేమి సంపూర్ణమైన స్వయంనియంతృత్వము సిద్ధించియుండెడిది. స్థానిక ప్రభుత్వ మీరీతి ప్రజాధీనమైయుండిన నేకచక్రవర్తి చంద్రగుప్తుండైనను జహంగీరైనను జార్జియైనను సమానమే. రాజు పరదేశీయుండైనంతమాత్రమున పారతంత్ర్యముకలని బాధ జనులకు గలుగదు. అనేకశతాబ్దములనుండి పరాధీనమై యుండియు మనదేశము కొలదిమార్పులతో తన స్వధర్మమును కాపాడుకొన గలిగియుండుటకు కారణ మిదియే. మఱియు మనదేశమందు ధర్మనిర్ణయాధికారము రాజునకు లేదు. తనప్రజలతోబాటు రాజును ధర్మబద్ధుడే. ధర్మమునకు మూలము అపౌరుషేయము అనంతము అనాదియై యున్న వేదముగాని రాజనిర్మితశాసనములు గావు. అధర్మమువలన గలుగబోవు ప్రత్యవాయము లౌకికమే గాక ప్రధానముగ పారలౌకికమై యుండుటచే కర్మభూమి యగు నార్యావర్తమున రాజదండనభీతికంటె నరకభయభావనయే ధర్మప్రవర్తనకు సాధకమై యుండెడిది. కావున కేంద్రప్రభుత్వముయొక్క అసమర్థతవలన ధర్మహాని కలుగుట కితరదేశములందున్నంత సావకాశము మనదేశమం దుండెడిది గాదు. స్థానిక ప్రభుత్వము సుస్థిరమై ప్రజాధీనమై యుండుటచేత రాజదౌష్ట్యమువలన కూడ ప్రజల కంతబాధ కలిగెడిది కాదు. మహమ్మదీయప్రభుత్వము కడునిరంకుశమై ప్రజాక్షోభకరమై యుండెడిదని కొందఱు చరిత్రకారులు చెప్పుచున్నారు. కాని మహమ్మదీయచక్రవర్తు లందఱును దుర్మార్గులనుట కేవలము సాహసము. వారిలో ననేకులు తమ హిందూప్రజల క్షేమమునకై యనేక సదుపాయము లొసర్చి హిందూశాస్త్రములందును పారసీకమునందును విశేషముగ నభిమానము గనబఱచి వాని నభివృద్ధి చేయుటకై యనేకరీతుల బ్రోత్సాహము నిచ్చినటులు మన కనేకనిదర్శనములు కలవు. వాదమునకొఱకు మహమ్మదీయచక్రవర్తు లందఱును నిరంకుశప్రభువులే యని అంగీకరించినను ప్రస్తుతము బ్రిటిషుపరిపాలనముక్రింద నార్యనాగరకతకు వైదికధర్మమునకు గలిగినంతహాని-మహమ్మదీయ దౌర్జన్యమువలన-వానికి గలుగలేదు- అని నొక్కి వక్కాణింపవచ్చును.

మైకముచల్లి మతిచెడగొట్టెడివానికంటెను కత్తికొట్టి సర్వస్వము నపహరించువాడు మన కుపకారికాడా అట్లగుట వేయివర్షంబులనుండి యనేకులు పరరాజులచే జిక్కి హింసింపబడియును గనుగొందని ఆర్యధర్మము నేడు తనవారిచేతనే గర్హింపబడి కడుంగడు కృశించి సమూలముగ నాశనమగుటకు సిద్ధముగ నున్నది. కావున మన ప్రస్తుతనిమ్నత్వమునకు గల ప్రధానకారణములు రెండు: (1) దేశీయులభావములు-రుచులు-సంస్కారములు- మాఱిపోయి స్వధర్మమం దభిలాష తగ్గుట. (2) స్థానిక ప్రభుత్వమందలి స్వాతంత్ర్యము నశించి గ్రామసంఘములు నామావశిష్టము లగుట గ్రామసంఘములు నశించుటచే మనకు వ్యవహారములు సర్దుబాటు చేసికొనగల శక్తి గూడ నశించినది. అన్నివిషయములందును కేంద్రప్రభుత్వమునకు పరాధీనత యేర్పడినది. గ్రామస్థులం దైకమత్యము నానాటికి తగ్గిపోవుచున్నవి.

కొందఱభిప్రాయమున మన ప్రస్తుతస్థితికి నీరెండును కారణములు గావు. కేంద్రప్రభుత్వము దేశీయుల యధీనమందు లేకుండుట యొక్కటియే మనదురవస్థకు కారణమని వీరందరు ఈయభిప్రాయముపై నిర్మింపబడిన పాశ్చాత్యప్రభుత్వములందు స్థూలదృష్టికి రాజ్యతంత్రము ప్రజాధీనమై యున్నట్లు తోచును. గాని సూక్ష్మముగ విచారించినచో దనులే రాజ్యతంత్రాధీనులుగ నున్నట్లు స్పష్టమగును. ఏటి కెదురీదగలుగు నేర్పరియును- ప్రవాహవేగమునబడి కొట్టుకొని పోవువాడును- స్థూలదృష్టికిరువురును నీటిపై దేలియాడుచు నేయున్నవారే. కాని ఒకనికి ప్రవాహము లోబడియున్నది. రెండవవాడు ప్రవాహమునకు లోబడియున్నాడు. ఇంతియే భేదము. పాలితుల సకలవ్యవహారములు రాజ్యతంత్రాధీనములై యుంట పాశ్చాత్యపద్ధతియనియును, దేశీయపద్ధతి ప్రకారము ప్రభుత్వమని వార్యముగు కీడగుటచే అవసరమగునంతవఱకు మాత్రము దానిని సాగనిచ్చుటకు నీతియనియును- ఇదివఱకే సూచించియున్నాము. కావున ప్రభుత్వము మనయధీన మైనంతమాత్రమున మనకు గలుగబోవు లాభములేదు. సకలమును రాజ్యతంత్రాధీనము చేయుటకు మనము సంసిద్ధులమై యున్నతరి ప్రభుత్వము స్వాధీనమైనను పరాధీనమైయున్నను విశేషభేదము లేదు. కొంపకాలుట వాస్తవమైనపుడు అయ్యది ధార్మ్యగ్నిసంపర్కము వలననైనను లౌకికాగ్నివలనైనను భేద మేమియు లేదు. అట్లగుట మనదేశమున కభ్యుదయము కలుగవలయునన్న పశ్చిముల యధికారమాత్రమును కాక చాలవఱకు వీరిభావములను పద్ధతులనుగూడ నిరసింపవలసియున్నది. ప్రస్తుతదుస్థితికి కారణములు రెండని పైనుదాహరించియున్నాము. వాని నించుకంత విమర్శించి ఎంతవఱకు వానిని తీసివేయుటకు మనకు సాధ్యమగునో విచారింతము.

దేశీయుల భావములు రుచులు సంస్కారములు మాఱిపోయి స్వధర్మమందభిలాష తగ్గుట మొదటికారణముగా చెప్పియున్నాము:— ఒకవ్యక్తికి నుచితమగు ధర్మముకంటె మఱియొక వ్యక్తికి నుచితమగునది వేరు. అటులనే ఒక్కొక్కసంఘమున కొక్కొక్క ధర్మ ముచితమై యుండును. ప్రపంచమంతటను ఒకేధర్మము వ్యాపింపచేయుటకు ప్రయత్నించుట అస్వాభావికము. పరమార్థదృష్టియందు దప్ప ఐక్యమనునది నామరూపాత్మకమైన జగత్తునం దెచ్చటను లేదు. నామరూపములందభిన్నత్వము సిద్ధించినను దేశకాల భేదములు తప్పవు. కావున భిన్నత్వమే ప్రపంచలక్షణము. అట్లగుట దేశభేదము చేత తత్తదుచిత ధర్మములందు గూడ భేద మేర్పడవలసి వచ్చుచున్నది. కావున పశ్చిమదేశోచిత ధర్మముకంటెను ప్రాగ్దేశోచితము

లేదు. పశ్చిములు మొత్తముమీద ప్రాపంచికులు. ప్రాగ్దేశవాసులు అందును ప్రధానముగ భారతీయులు పారమార్థికులు. ఆర్యుల జీవిత వ్యవహారము లన్నియు పారలౌకికములు. పాశ్చ్యులవి ఐహికములు. భారతీయుల కైహికమం దిచ్ఛ లేకపోలేదు. కాని ఇహపరములకు విరోధముగలిగినప్పుడు ఇహమును త్యజించి పరము నవలంబించుటయే వారికి ధర్మము. "యతోऽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః స ధర్మః." కావున అభ్యుదయము శ్రేయము అను రెండును ధర్మాచరణకు ప్రయోజనములు. పశ్చిములకో శ్రేయముతో పనిలేదు. వారిదేశములందు ధర్మాచరణకు ప్రయోజనము జనబాహుళ్యముయొక్క సౌఖ్యము. దీనినే వారుయందురు. కాని యొకవిధముగ నాలోచించిన పశ్చిములకు ధర్మమే లేదు. అనగా శ్రేయోభ్యుదయములకు రెంటికిని మూలమై మనుష్యజీవితమును సమగ్రముగ నియమించు ధర్మము పాశ్చ్యులకు లేదు. అట్టిధర్మము లేకుంటయే నాగరకతకు లక్షణమనియు నవసరమగు నంతవఱకు వ్యవహారధర్మములను రాజశాసనములవలనఁ బ్రవర్తింపజేసి ఇతరవిషయములందు జనులను స్వేచ్ఛగ ప్రవర్తింపనీయవలయుననియు రాజశాసనమువలన ధర్మము ప్రతిష్ఠాపింపబడుచున్నప్పుడే నూతనోద్దేశ్యముల కనుకూలముగ దేశకాలభేదముల ననుసరించి ధర్మము మాఱుచుండుటకు సావకాశము కలుగు ననియుఁ గొందఱి యభిప్రాయము. కాని మనదేశమందు మహమ్మదీయ ప్రభుత్వమునకు పూర్వ మెన్నఁడును రాజనిర్మితధర్మము లేదు. సకలధర్మములకు మూలము వేదము. స్మృతులుగూడ ననుమేయశ్రుతిమూలకములు. గాన తత్తుల్యములే. సామాన్యముగ ధర్మశాస్త్రములు ఆచారవ్యవహార ప్రాయశ్చిత్తాధ్యాయములుగ త్రిధా విభజింపబడినవి. ఆచారాధ్యాయమున కట్లో వ్యవహారమునకుగూడ నట్లే యపౌరుషేయమగు వేదమే మూలముగాని రాజశాసనము గాదు. అట్లగుట ధర్మప్రభుత్వమున శాసనధిక్కారమను భావనమునకే యవకాశము లేదు. నాస్తికులు వేదనిందకులు తప్ప పూర్వకాలమున నితరు లెవ్వరును శాసనధిక్కారముఁ జేసెడివారు కారు. వ్యవహారధర్మముగూడ వేదమూలకమై యున్నచో వేదమందు ప్రమాణబుద్ధిలేని ఇతరమతస్థులకే యది ధర్మముగ నుండెడిదని సందేహము కలుగవచ్చును. అట్టివారికి ధర్మము చాలవఱకు కాచారమునై నాధారపడియుండెడిది. ఆచారముగూడ ధర్మమూలములలో ముఖ్యమైనదని చెప్పియుంటిమి. వేదప్రామాణ్యమును బోధించిన స్మృతియే దేశధర్మములు జాతిధర్మములు శ్రేణీధర్మములుగూడ గౌరవింపబడవలయునని చెప్పియున్నది. "దేశధర్మ జాతిధర్మ కులధర్మాన్ శ్రుత్యభావా దబ్రవీన్మనుః" (వసిష్ఠః) మీమాంసకులుగూడ పరదేశీయుల యాచారములు మున్నగునవి యంగీకరించినట్లు "మ్లేచ్ఛప్రసిద్ధ పదార్థాధికరణము" మున్నగు స్థానములం దెలియవచ్చును. కావున ధర్మమంతయు వేదముపై నాధారపడియుండుటవలన వ్యవహారమున కెట్టి బాధయుఁ గలిగెడిది కాదు. అట్లగుట హిందూదేశమందు నిరంకుశుఁడగు రాజు చేయు శాసనములు శాసనములు గావు. అతఁడును ధర్మబద్ధుఁడగుట నాతని నిరంకుశత్వము శాసనధిక్కారమనదగు. ప్రస్తుతకాలమున 'లా'కు మూలము రాజగుట నాతఁడు నిజముగ నిరంకుశుఁడు. అతనిని నిర్బంధించు 'లా' ఏదియును లేదు. పదునాఱువత్సరములకు పైబడినవారి నందఱను చంపివేయవలసిన దని రేపు శాసననిర్మాణసభవా రొకశాసనము చేసినఁ నట్టి శాసనము కేవలము రాక్షసకృత్య మైనను పాశ్చాత్యసిద్ధాంతముల ప్రకారము దానిని జనులు గౌరవింపక తప్పదు. అట్టి శాసనానుసారముగ జరిగింపబడిన హత్య లన్నియును నవీనసిద్ధాంతముల ప్రకారము 'లీగల్' కృత్యములే. కావున 'లా'కును న్యాయమునకును ఎట్టిసంబంధమును లేదు. పాలకు లదృష్టవంతు లై మంచిపూజ చేసికొన్నవా రై యున్నచో 'లా' న్యాయానుసారముగ నుండును. లేకున్నచో 'లా' న్యాయానుసారముగ నుండవలయునను విధి ఎచ్చటను లేదు. ఆర్యసిద్ధాంతములకును పశ్చిమసిద్ధాంతములకును గల భేదస్వరూప మిట్టిది. ఈసిద్ధాంతములం దెయ్యవి జనాభ్యుదయమునకు హేతువులో చదువరులే యూహించుకొనవచ్చును.

ఇఁక దేశకాలభేదోచితముగ ధర్మము మాఱుచుండుటకు మన సిద్ధాంతముల ప్రకారము సావకాశము లేదనుమాటకు మనధర్మశాస్త్రములు తొలుత నెట్లున్నవో అట్లే మార్పించుకయు లేకుండ నున్నవని ఎవ్వరు ననజాలరు. కాలోచితముగ ధర్మశాస్త్రములును మాఱుచునే యున్నవి. క్రొత్తపద్ధతులు క్రమక్రమముగ వచ్చి దేశమునందు నాటుకొనవలయునే గాని హఠాత్తుగ వచ్చి పైబడినచో ధర్మహాని జనించును. పూర్వాచారపరాయణత్వమే గొప్పజాతులకు లక్షణమని కార్లైల్ మున్నగు బుద్ధిమంతులు వచించియున్నారు. పూర్వాచారములం దాసక్తిగల సంఘమందు మార్పు గలుగవలయునన్నచో నట్టిమార్పులు నిజముగ జనులకు హితకరములు క్షేమకరములునై యున్నప్పుడే దేశమందు ప్రవేశింపగలుగును. లేకున్నఁ బ్రవేశింపజాలవు. సంతతము నవీనపద్ధతులకై ఆరాటపడు సంఘములకు శాంతియును సౌఖ్యమును కలుగవు. వారి జీవితమంతయును 'ఆచార్యులవా రేమిచేయుచున్నా రనిన తప్పులుచేసి దిద్దుకొనుచున్నా' రనున ట్లుండును.

అవసరమైనచో ధర్మశాస్త్రములుగూడ మాఱుచుండవలెనన్న నాశాస్త్రములు జనులచే గౌరవింపఁబడవు. మనుస్మృతినాటికంటెను యాజ్ఞవల్క్యస్మృతికాలమునకు వ్యవహారధర్మము వృద్ధిచెందినది. మనుస్మృతియందు వ్యవహారమునకుఁ బ్రత్యేకముగ నొకయధ్యాయము వినియోగింపలేదు. యాజ్ఞవల్క్యమునందు వ్యవహారమునకు ప్రత్యేకముగ నొక యధ్యాయ మిచ్చియున్నాడు. నారదస్మృతికాలమునకు వ్యవహారధర్మము మిక్కిలి వృద్ధిచెందిన ట్లూహింపదగు. నారదస్మృతిలోని వ్యవహారవిషయములు నేటిశాసననిర్మాతలును న్యాయవాదులును మెచ్చదగినవై యున్నవి.

మఱియును పూర్వాచారములు అనేకములు జనుల కనిష్టములగుటచే ధర్మశాస్త్రగర్హితములై నేడు పూర్తిగ నాచరణనుండి తొలఁగినవి. దేవరన్యాయము- ద్వాదశౌరసపుత్రదాయక్రమము- అష్టవిధవివాహములు- నేడు అంగీకరింపఁబడుటలేదు. ఇంతియ గాక శాస్త్రవిరుద్ధముగకూడ కొన్ని యాచారములు శిష్టులచే సదాచారములుగ నంగీకృతములైనవి. మాతులసుతోద్వాహము- దౌహిత్రస్వీకారము- మున్నగునవి ఇందుల కుదాహరణములు.

కావున కాలానుసారముగ శాస్త్రములు మాఱకపోలేదు. శాస్త్రములు మాఱియున్నను కొన్ని విషయములందు సదాచారమే ధర్మముగ నంగీకరింపఁబడెడిది. వేదమునకు స్మృతికి తరువాత సదాచారమే ధర్మమునకు మూలము. కాని పూర్వము 'ధర్మములు' మార్పుచెందెను, గాని 'ధర్మమున' కేమార్పును గలుగలేదు. అనగా కాలానుసారముగ నవసరమగునంతవఱకు ప్రత్యేకధర్మములు మార్పుచెందెను- గాని ఆర్యధర్మమునకు పునాదియైన భావములు- సంస్కారములు- నమ్మకములు- ఇంచుకంతయును మార్పు జెందలేదు. ఆపునాది సుస్థిరమై యున్నంతవఱకు పై కట్టడమున నవసరమగునన్ని మార్పులు చేసికొనుటకు ధర్మశాస్త్రములందనేక సావకాశములు గలవు. ఉపయోగించుకొనఁగలిగినచో నాయవకాశము లిప్పటికిని నున్నవి. కాని పూర్వకాలమున మనదేశస్థులు చేసిన సంస్కరణములకును ఇప్పుడు మనలో గొందఱు కావలయు ననుసంస్కరణములకును గొప్పభేదము గలదు. పరసాంప్రదాయమందేదేని గ్రహింపదగిన విషయమున్నచో నద్దానిని మెల్లగ నవలంబించి తమదిగా చేసికొనుట పూర్వసంస్కరణపద్ధతి. పరమతములందు కొన్నికొన్ని మంచి విషయములను గాంచి వానిని మెచ్చి స్వమతమును గర్హించి తత్పరమతమునకు లోబడిపోవుట నవీనసంస్కరణపద్ధతి. కావున నవీనసంస్కరణపద్ధతివలన స్వరూపనాశనమే కలుగబోవుచున్నది. స్వధర్మమందాసక్తి గలవారు నూత్నసంస్కరణములకు విముఖులగుటకు ఇదియే కారణము. అంతియకాని తనస్వత్వమును కాపాడుకొనఁగలిగినంతవఱకు ఆర్యధర్మమెప్పుడును సంస్కరణపరాఙ్ముఖము అగుటలేదు.

మాత్సర్యముగ విచారించినచో నార్యధర్మమంతటి యుదారస్వభావముగల ధర్మము మఱియొకటి లేదు. "అయమాత్మా బ్రహ్మ" యనుకొనునద్వైతసిద్ధినొందు బ్రహ్మజ్ఞుఁడును గంగానమ్మ పోలేరమ్మ మున్నగు గ్రామ్యదేవతల నారాధించు పామరుఁడును ఇరువురును హిందువులే. ఇరువురకును ప్రామాణ్యబుద్ధి శ్రుతి- స్మృతి-పురాణములందే. వర్ణాశ్రమధర్మముల నావంతయు నడుగుదాటక- నియమముల నన్నిటిని పాటించుచు- వేదవిహితకర్మల యథావిధిగ నాచరించు గృహస్థుఁడును- విధినిషేధముల కతీతుఁడై ఏచ్చటనేని దిరుగుచు నేమేని గుడుచుచు స్వచ్ఛందవిహారము సలుపు యోగిపుంగవుఁడును ఇరువురు హిందువులే. ఇరువురకును ప్రమాణములు వేదములే. ఏమతమైననుసరే- ఏసాంప్రదాయమైననుసరే- తన శరణుచొచ్చిన దానిని పరధర్మమని పోద్రోలక ఆర్యధర్మము ఆ నూతనసాంప్రదాయము తనదానిగనే స్వీకరించియున్నది.

మంచిచెడుగులు పరమార్థతః లేవు. గాని కొన్ని సందర్భముల కొందఱపట్ల మంచియైనది మఱికొన్ని సందర్భముల చెడుగగును. కావున నెప్పు డెయ్యది ఎంతవఱకు క్షేమకరమో అంతవఱకు దాని నవలంబించి అయ్యది క్షేమము గానప్పుడు దానిని త్యజింపవలయును. శ్రేయోభ్యుదయజనకత్వమే క్షేమమునకు మానము. అట్టిక్షేమమే ధర్మాచరణము ఫలము.

ఆర్యధర్మముయొక్క మూలసూత్రములకు భంగములేనంతవఱకు నూత్నసంస్కరణములకు ధర్మశాస్త్రము లెప్పుడును వర్జ్యంతరములు కావు. కావున మనకు ప్రస్తుతము కావలసినవి రెండు. స్వధర్మమందనురక్తి— స్వధర్మాచరణకు తగినయవకాశము. స్వధర్మమందనురక్తి మన కొకరిచ్చునది గాదు. అయ్యది మనకు సహజముగ కలుగవలసినదే. ఇక స్వధర్మాచరణమున నావకాశములు. వీని నొడగూర్చునది స్వపరిపాలనముతప్ప వేఱొండులేదు. అట్టిస్వపరిపాలనమును మన కిప్పుడిచ్చువా రెవరును లేరు. ఇచ్చినను అట్టి బిచ్చపుగూడుకలన మనకు పొట్ట నిండదు. కావున కృతనిశ్చయులమై స్వయంకృషివలన మనము స్వరాజ్యమును సంపాదించుకొనవలయును. మన స్వరాజ్యసంపాదనమునకు కత్తు లక్కఱలేదు. యుద్ధసామాను లవసరము లేదు. దీనికి కలయు సామగ్రి-మనోదార్ఢ్యము ఐకమత్యము, స్వధర్మానురక్తి. ఈసామానులను మనము సమకూర్చుకొని ఎన్ని అభ్యంతరములు వచ్చినను జంకక స్వధర్మాచరణ కవకాశము కలుగజేయు ప్రతిష్ఠాపనలను స్థాపింపవలయును. ఈపద్ధతివలన బ్రిటిషు ప్రభుత్వమువారు కట్టియుండ మనకు స్వరాజ్యము సిద్ధించును. సహాయనిరాకరణోద్యమసూత్రముల ప్రకారము ప్రస్తుతము మనము చేయదగిన పను లనేకము లున్నవి. వానియన్నింటిలోనికి ముఖ్యతమమైనపని గ్రామసంఘములను పునరుద్ధారణచేయుట. ఇంతకాలమునుండి ఆర్యధర్మములు నిలిచియుండుటకు కారణము మన గ్రామసంఘములు తప్ప మఱి వేఱు కాదని చెప్పియున్నాము. ప్రస్తుతకాలమున గ్రామసంఘములు నశించుటతోమాత్రమే ఆగక గ్రామములే నశించుస్థితి వచ్చుచున్నది. ఇక మనస్వధర్మమును నిలుపవలయునన్న నెట్లు నిలుపగలము? గ్రామముల పాడుపెట్టి పట్టణముల నిర్మించుట పాశ్చాత్యనాగరకతకు లక్షణము. దానికి కారణము వాణిజ్యదాహము. ధనతృష్ణ మిథ్యాజ్ఞానము అనుదినమును కొంచెముకొంచెముగ పాలుత్రుకొనుటతో తృప్తిజెందక పాలన్నియు నొకేసారిగ నాపోశనము చేయుదుమను దురాశతో నావుపాదుగును గోయు మూఢునిభంగి పశ్చిముల ననుకరించుచు నేడు మనవారుగూడ యంత్రశాలానిర్మాణమునకు గడంగి లక్షలకొలది పనివాండ్రను కొన్నికొన్ని పట్టణముల ప్రోగుపోసి స్వర్గఖండము లనందగు జనపదముల పాడుపెట్టుచున్నారు.

మనుష్యప్రయత్నముల కన్నిటికి పరమావధి ఆనందముగాని యుద్ధము గాదు. అయ్యది శాంత్యధీనము కావున మనుజుఁడు కోరదగినది శాంతియే. ఆశాంతి పల్లెలలో దక్క పట్టణములలో దొరకదు. పల్లెపట్టులు శాంతికి ఖను లనందగును. అట్లగుటఁ బల్లెల నుద్ధరించుట మన ముఖ్యకర్తవ్యము. పల్లెలనుద్ధరించుట యెట్లు? అదియే మనదేశమందలిబుద్ధిమంతులందఱును ఇప్పు డాలోచింపదగిన విషయము. ఇట్టి విచారణ చేయునప్పుడు అన్నిటికిని మూలసూత్రమగు విషయమును మాత్రము మఱవగూడదు. ఆసూత్రమే మనస్వధర్మమునందనురక్తి మనకు తిరిగి జనింపవలయు. లేకున్న జనపదములు బాగుపడుటయే కల్ల. స్వధర్మమందనురక్తి హెచ్చినగాని వాణిజ్యదాహ మారదు. అదాహము తీఱినగాని ఫ్యాక్టరీపద్ధతి మాఱదు. అయ్యది మానినగాని పాటకప్రజ యంతయు పల్లెల పాడుపెట్టి పట్టణములకు జేరు దుర్బుద్ధి నశింపదు.

ప్రస్తుతముమీద మన దారిద్ర్యకారణములు మూడువిధములు. (1) వర్తకమూలకముగ పరదేశీయులు దోచుకొని పోవుచున్న సొమ్ము

(2) మనదేశపు ముడివస్తువుల నెగుమతిచేసి పరదేశములనుండి సామానుల దిగుమతిచేసికొను షావుకారుల లాభములు. (3) మూడవది యీయది 'ధర్మకర్చు'. ఈయది ప్రభుత్వమువారు మనకడనుండి గ్రహించునది. ఇది ధర్మకర్చు ఎట్లగునని యందురేమో. ప్రభుత్వమువారు మనల నజ్ఞానాంధకారమునుండి యుద్ధరింప మనపై నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షప్రసారము గావించి మెల్లమెల్లగ విద్దెముల నేర్పి మనలను పెద్దవారిని జేయుటకు భారము వహించి యున్నారు. దీనినే శ్వేతమనుజుని భారమని అనేక గ్రంథముల వ్రాసియున్నారు. ఇట్టిభారము వహించినవారు మనకు గురుప్రాయులు గాన వారికిచ్చిన సొమ్ము గురుదక్షిణ యనందగు. గురువు శిష్యునివలన గ్రహించు విత్తము వేతనమని గాని కూలియని గాని పన్నని గాని యనుట ఆర్యధర్మమునకు కేవలము విరుద్ధము.

ఈ మూడు విధములగు వ్యయములను తగ్గించుట కుపాయము మహాత్ముండిదివఱకే బోధించియున్నాడు. ఆమార్గముల మన మాచరణలో పెట్టి జనపదముల నుద్ధరింపవలయును. ఇట్లు జనపదముల యార్థికస్థితి చక్కజేసి ఇతరవిషయములందు గూడ ప్రభుత్వమువారి యపేక్ష లేకుండ మనవ్యవహారముల మనమే నిర్వహించుకొనుటకు తగినవీలును కలుగజేయు ప్రతిష్ఠాపనలను నిర్మింపవలయును. అట్టి ప్రతిష్ఠాపనముల యందగ్రగణ్యములు గ్రామసంఘములు. గ్రామసంఘముల పునరుద్ధారణచేసి పూర్వపు మన స్థానిక ప్రభుత్వపద్ధతిని తిరిగి ప్రతిష్ఠింపవలయును. అది ఎట్లు చేయవలయునో అనుభవజ్ఞులగు బుద్ధిమంతులందఱును కలసి ఆలోచింపదగినవిషయము. కాని మనము స్వరాజ్యమును నిర్మించుకొను నప్పుడు ముఖ్యముగ మనస్సునం దుంచుకొనవలసిన విషయ మొక్కటి గలదు. అద్దానిని మన మెన్నడు నేమఱగూడదు. అది "స్వధర్మము."

స్వధర్మములేని స్వరాజ్యమందు మనకు స్వత్వములేదు. స్వధర్మములేని స్వరాజ్యమువలన మన కొకరీతి దాస్యము వదలి మఱియొక రీతి దాస్యము మిగులును. శరీరదాస్యము సహింపవచ్చును గాని భావదాస్యము దుర్భరము. ఇదియే "చెఱసాలల్ పరచంద్రశాలల యగున్" అని దేశభక్తులకు ప్రోత్సాహమిచ్చిన కవివరుల యంతర్భావము.

# ఇంద్రనీలములు-అన్యోక్తులు

ఎడవల్లి గంగాధర బుచ్చిరామశాస్త్రి గారు

నీలమా పుష్యరాగంబ నీవనుగుచు
పిదప పద్మరాగంబుగా పేరుబొందు
పద్మరాగాన వజ్రమై పరిణమించు
బహుళజన్మల నీవు సాఫల్య మొంద.

గీ. హీరనీలములపుట్టుక యేకదేశ
మనుచు భేద మేమి టనుట యరకతరక
హీరకాంతికి విలువకు నేమి సాటి?
నీలమా చెప్ప బాగుగా నీవ యరసి.

గీ. తెలివియుండునే దేటలో దిటవునందు
సాటియే నీల మాహీర సంఘమునకు
క్షీరముల గ్రోలి కసవు భక్షించి మనుట
కన్నుగలవారి కెల్లను గానరాదె.

గీ. ఇంద్రనీలములనుచు నెగురవలదు
ఇంద్రు డొక్కరిదైవమా ఇంతకైన
ఇంద్రుచేత్రచారిత్ర మిా కెరిగియుండి
పాలకునిపోలి ప్రజలన్న బాగుగాదె!

గీ. ఎక్కువైతేమి యాస్తత చెకిదిగిః
పట్టువచ్చినమాత్రానఁ బ్రదుకవేల
హాటకము కుటదేశపు గటువీడి
నీలమా దయచేయు నీ కేల దిక్కు

గీ. ఇంద్రనీలము లైనంత నేమి మిమ్ము
తిరుగు సంబంధు లైనను గలపకుండ
వజ్రదై పరభూభృత్పతియు దియ్య
కార్యఘటనను మిమ్ము పాకారి వీడె.

గీ. నీలమా నీదుకంఠమున నీమడోకడు
గలడు కొందఱు వడిలోన తెలుపగలను
వాడు గోమేధనాముఁ డాపాపరాసి
వానితో పొందు మామ్మాకు వలదు నీకు.

గీ. అరయ వైకుంఠపాలికన్ గూటయందు
నిచ్చె నొక్కడు మరిచెడు నీయట్లు
మురిపెము చుంటివి నీలమా ముందుజూడు
నూటనాలింటగలపాము, కోటబడుదు.

# దేశబంధు చిత్తరంజనదాసుగారు

### ఒక భక్తుడు

విశ్వమాంగళ్యమునకు స-ర్వస్వ మిచ్చి
చిఱుతినవ్వులు మోమున-చెంగలింప,
సమయ మనెడు నిరంకుశ-శాసనంబు
న్యాయ్య మన్యాయ్య మరయక-ద్రోయుచుండ
రాత్రి యనుపేరఁ జెల్లు కా-రాగృహంబు
స్వీకరించుచునుండె సు-శ్లోకముగను ౧

గీ. భానుమూర్తిని చెఱగొన్న-వార్త నపుడె
అకులాకులరాపిడి-నందుకొనుచు
మెల్లమెల్లన వీచెడు-పిల్లగాలి
లోకమంతట నల్లన-బ్రాకఁజేసె ౨

గీ. వేదరవముల జపియించు-విప్రవితతి
లోకమెల్లెడఁ బ్రాకెడు-చీకటులను
నెట్టులయినను వారింపు మీశ! యనుచు
నొక్కపెట్టునఁ జేమొత్తి-మ్రొక్కుచుండె. ౩

గీ. "తగదు తగదని" కాకులు - వగచుచుండె
వానిరవమును చెవిఁబెట్టు-వార లెవరు?
ద్రుమము లంతంత తలల న-డ్డముగ నూఁపె
వాని తలయూఁపు లెవరికి వలయు నిపుడు? ౪

గీ. అబ్బురం బయ్యె జననీము-ఖంబునందు
ఇంచుకయు విషాదంబు లే-దేమికతమొ?
రివ్వురివ్వున నవ్వులపువ్వు లొకట
విశ్వమాతృక చెక్కి-ళ్ల- విరియసాగె
ఏమిధైర్యంబొ తెలియంగ- నెవరి కగును? ౫

గీ. "అతనితోడిద జీవన-మగును మాకు
మమ్ము నందఱ బంధింపు-మమ్మ ఋణము
నొక్కటని తీర్చుకొను భాగ్య-మొసఁగు" మనుచు
లెక్కలేనట్టి మిక్కిలి-చుక్కగములు
పొడుచుకొని వచ్చె పైపైకి- విడిపడుచు. ౬

రండు రం డిక వేగమే-రండు నేఁడు
దండుదండులుగా వచ్చి- తల్లి ఋణము
తీర్చుకొనుఁ డయ్య! సోదరుల్-తిరిగిపోక
మీరు జీవింతు రాచంద్ర-తారకముగ ౭

తమము శాశ్వత మంచును తలఁపవలదు
అంధకారంబు జయ మెన్నఁ-డంద లేదు
మాటువడినంతనే లోకబాంధవుండు
తేజమును శాసె నని యెంచి- తిరుగదగునె? ౮

"సత్య మొక్కటె జయ మందు- శాశ్వతముగ
ధర్మమే రాజ్య మొనరించు- నిర్మలముగ"
అనెడి యోంకారనాదంబు నాలకించి
లటిమికొట్టుమ నిద్రను- భరతపుత్ర. ౯

# చామర్తి రాజశేఖరకవిరాయస్మృతి

### శ్రీ శేషాద్రిరమణ కవులు

కలకలలాడు నీ నగుమొగం బిఁకఁ గానఁగరాదు. భావమం
జులమగు నీదుకైత చెవిసోకదు. మాటల నీ ప్రశాంతశీ
తలరమణీయమూర్తిఁ గనఁజాలునదృష్టము గల్గదింక నీ
చెలిమికి శాశ్వతత్వమును జేసెద నైకొను రాజశేఖరా.

చ. తెలుఁగునఁజక్కఁగాఁగవితఁజెప్పఁగఁజాలితివాంగ్లభాషయన్
జలధిఁ దరింపఁగల్గితివి సంస్కృతభాష పఠించుచుంటి వీ
ఫలములనన్నిఁటిం బ్రజకుఁ బంచియొసంగఁదలంచుచున్న నిన్
దలిరులఁ ద్రుంచుకైవడి విధాత్రుఁడు త్రుంచెను రాజశేఖరా

చ. చదువుచునున్న పొత్తములు సాంగముఁ జేయఁగలేదు. తావకా
భ్యుదయము గోరుమాత కెద నూఱట చేకురలేదు. సాహితీ
వనమున తావకీన రసవత్కవితానవభావ భావనా
స్పదమయి మించలే దపుడె చావు వరించెను రాజశేఖరా.

సీ. కదనమెఱుగఁజంచి వాపోవుచున్నది
అనిశంబు తావకార్ధాంగలక్ష్మి
నిస్పృహావశమున నిలువునీరై పోయెఁ
గొడుకా! యటంచు నీకూర్మితల్లి
ఇఁక నిట్టి దేశకుం డీజన్మమునకు దు
స్తరమంచు నేడ్చె విద్యార్థిగణము
మిత్రుండు పోలేదు మేము పోతి మటంచుఁ
జెలిమికాం డ్రెల్ల రాల్చిరి జలంబు

గీ. కులపతినిఁజూచి పెదతల్లికోఁకఁజూచి
శిష్యులనుఁజూచి మిత్రులనిలుగుఁజూచి
పరమునం దెంత నీయాత్మ పల్లటిలునొ
రాజశేఖర! తెలుపనేరము గదయ్య.

కీర్తిశేషులగు

# బ్రహ్మశ్రీ, కోపల్లి హనుమంతరావు పంతులు గారు

## ఎం. ఏ., బి. యల్.

దేవరకొండ జగన్నాథరావు గారు, ఎమ్. ఏ.

శ్రీకరంబుగ లోకాళిఁ జెలఁగఁజేసి
యఖిల జీవుల సేమంబు నరయు విభుఁడు
గరము దయతోడ విశ్రాంతిఁ గలుగఁజేసి
యరయు హనుమంతరాయుని యాత్మ నెపుడు.

గీ. ఆంధ్రమాతకు గారాబు టనుఁగుపట్టి
మచిలి బందరు సతి తలమానికంబు
ఆంధ్ర జాతీయ విద్యాలతాలవాల
మగుచు దివికేగె హనుమంతు నాత్మ యకట

సీ. వనజగర్భునిరాణి వలచివచ్చిన దన నెమ్మె. బి. యల్. విద్య నెసఁగినాఁడు
ధర్మసూనునిశాంతి తనుఁ గొల్చుచుండె నా సతిశాంతమూర్తియై యలరినాఁడు
రామకృష్ణవిరక్తి రక్షింపఁగోరె నా నే వేళ త్యాగంబె యెంచినాఁడు
విదురుని విజ్ఞత వియ్యమందెనొ నాఁగ జీవు నీశ్వరసేవఁ జేర్చినాఁడు
గీ. తొంటిప్రహ్లాదుఁడో యని తోఁచునట్లు
సకల సుగుణాంబులకు బట్టు జాలినాఁడు
కరము కోపల్లి వంశంబు ఘనత కెక్క
వెలసె ధరలోన హనుమంత వీరవరుఁడు

సీ. నీయందఁ గాని సాగ నీక్షించు కాలేజి కొమ్మ కౌన్నత్యంబుఁ గూర్పవైతి
నీబోధజలధిలో నిరత మీఁదుచునున్న శిష్యాళి నొడ్డునఁ జేర్పవైతి
నీస్నేహపూరంబు నెఱిసంద వెల్గెడు చెలికాండ్రదైన్యంబుఁ దలఁపవైతి
నీబాంధిబంధులై నిరత మీఁగుచునున్న యాలుబిడ్డల గతి నరయవైతి
గీ. వకట! యిందఱ నొకమాటె యార్తి ముంచి
యింతత్వరలో హతాత్తున నేగుటకును
గారణాంతర మొండేది కానరాదు.
రమ్యగుణధుర్య! హనుమంత రాయవర్య!

సీ. నీకళాశాలకై నిధి యేమి లేదని యలకుబేరునియొద్ద కఱిగినావొ
గాంధిమహాత్ముని కార్యంబు నెఱవేర్ప విబుధుల వేఁడంగ వెడలినావొ
రీడింగుప్రభు చిత్తరీతి మార్చుటకునై యేసుక్రీస్తునిపజ్జ కేగినావొ
అల ఘోకలే తిలక్ యాత్మల దర్శించు నాలోచనంబున నరిగినావొ
గీ. ఈవు మమ్మును విడనాడి యేగుటెల్ల
మే మొనర్చిన కర్మంపు బాము గాదె
నీకు సరివారు మాలోన లేకయుండె
రమ్యగుణధుర్య! హనుమంతరాయవర్య!!!

THE LATE SRY. KOPALLE HANUMANTA RAU



కీ. శే. కోపల్లె హనుమంతరావు

SRY. K.CHINA VEERAYYA. SRY. S. VARADA DOSS
SRY. K. PEDDA VEERAYYA



శ్రీయుతులు, కాకర్ల చినవీరయ్య, సరోజం వరదదాసు, కాకర్ల పెదవీరయ్య

SRY. G. RAMACHENDRA RAU



శ్రీయుత, గ. రామచంద్రరావు

SRY. G. SATYANARAYANA



శ్రీయుత, గరిమెళ్ల సత్యనారాయణ

SRY. S. V. S. KRISHNA RAU



శ్రీయుత, ఎస్. వి. ఎస్. కృష్ణారావు

SRY. M. ANNAPOORNIAH



శ్రీయుత, మద్దూరి అన్నపూర్ణయ్య

SRY M RAMACHENDRAMURTY



శ్రీయుత, మాగంటి రామచంద్రమూర్తి

# ఆంగ్లవర్తక రక్షకపద్ధతి లేక, ఇంపీరియల్ ప్రిఫరెన్సు

గోవిందరాజు వేంకటకృష్ణరావు గారు

"సీ. చాణక్యనీతి తార్కాణగాఁ జంద్రగుప్తాదిమౌర్యులు దేశ మఱయునాఁడు
పరహింసవలని దేవస్వమేని ద్యజించు ఘనుఁ డశోకుఁడు ప్రజల మనుపునాఁడు
జాతి విశ్వవిద్యానిత్యవర్ధనుం డిల హర్షవర్ధనుం డేలునాఁడు
కాకతీయాది సత్ క్షాత్రవంశప్రభుల్ నియతి దేశంబుఁ బాలించునాఁడు
గీ. కృషియు నానాపరిశ్రమల్ వృద్ధిఁజెంది, నావికావర్తకము మహోన్నతి వహించి
భవ్యవిభవానుభవమున భరతభూమి నాగరకతకుఁ బ్రథమగణ్యముగ నుండె."

కాలవశంబున 17-వ శతాబ్దమందు మనదేశమున నాంగ్లేయులు కాలిడిననాటనుండి మనదైశ్వర్య మడుగంటు మొదలిడెను. పూర్వము ప్రపంచమందెల్ల మిక్కిలి భాగ్యవంతమై యలరారిన మనదేశ మీనాఁడు యధోగతిఁబడి దారిద్ర్యపిశాచపీడితమై, యష్టకష్టముల పొందుచున్నది. ఈ విపరీతపరిణామమునకు స్వార్థప్రేరితమై యాంగ్లేయ వర్తకసంఘము నెలకొల్పిన ప్రాబల్యములే కారణములు. ఆంగ్లేయులే మనదేశమునుండి పన్నులమూలమున వసూలుచేయబడిన ధనములో విశేష భాగమును ఇంగ్లాండులో నుండు నిండియా ఆఫీసుపోషణ నిమిత్తమును, ఆంగ్లేయోద్యోగుల యుపకారవేతనములకును, ఇనుపదారులు మున్నగువానిపై పెట్టించిన యాంగ్లేయుల ధనముపైని వడ్డీల విధమునను ప్రతిసంవత్సరమును కొనిపోవుచున్నారు. ఈ మహాధనప్రవాహమే మనదారిద్ర్యమునకును మనకర్షకుల ఋణగ్రస్తతకును కారణభూత మగుచున్నది. ఆంగ్లేయులే మనస్వదేశపరిశ్రముల నాశనము గావించి, తమపరిశ్రమ లభివృద్ధిపరచుకొని వర్తమానమందు గొప్ప యౌన్నత్య దశకు వచ్చిరి. ఇట్లు చేసియుఁ దమ ధనతృష్ణ యింకను తీఱకాబోలు నింకొక నూతనార్థికవిపత్తును మననెత్తిపై దెచ్చిపెట్ట దలచుచున్నారు. ఈ నూతనార్థికవిపత్తు ఎద్దియో, దానిని మన మెట్లు తప్పించుకొనఁ గలమో విచారించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

## ఆంగ్లవర్తకరక్షకపద్ధతి యన నేమి?

పూర్వము ప్రపంచమందు వాణిజ్యపద్ధతి ప్రబలియుండెనని పాఠకులకు దెలిసియే యుండును. 'ధనమూల మిదంజగత్' గనుక ఒకదేశమందు బంగారము వెండి అపరిమితముగ నున్నచో నింకొక దేశము వా రాధన మెట్లయినఁ గొంపోయి తమ దొకగొప్పదేశముఁగఁ జేయవలయు నని యూహించి ధన మున్న దేశమునకు చాల యెగుమతులఁ జేసి ఆ ధనమును తాము కొల్లగొట్టుటయే వాణిజ్యపద్ధతికి మూలసూత్రము. అందుచేత ఎగుమతు లెక్కువచేసి దిగుమతులు తక్కువ చేసికొనుట వాణిజ్యపద్ధతియొక్క ముఖ్యోద్దేశము. 18-వ శతాబ్దమునకు ప్రపంచమం దంతటను వాణిజ్యపద్ధతియే తన యధికారము చెలాయించెను. స్పెయిను దేశమును నాశన మొనర్చిన దీపద్ధతియే. బ్రిటిషుసామ్రాజ్యమును కొంతవరకు విచ్ఛిన్నపరచిన దీపద్ధతియే. అధినివేశరాజ్యములఁ దన స్వంతయాస్తిగ నెంచి యింగ్లాండుదేశము తనపోషణనిమిత్తము తన యధీనమం దుంచుకొనెను. అధినివేశరాజ్యప్రజలు తాము పండించు ముఖ్యపంటల నాంగ్లవర్తకులకే అమ్మవలయునుగాని ఇతరుల కమ్మగూడదు. ఈ పద్ధతిక్రింద నాంగ్లేయులు సామ్రాజ్యవ్యాపారము నంతయు తమహస్తములం దుంచుకొని విదేశవర్తకము బహిష్కరించిరి. ఇందులకు ప్రతిఫలముగ వస్తువుల ధరలు తగ్గెను. ఏలయనఁగా నక్కఱ (Demand) తక్కువ గదా! ఇవ్విధమున నన్యదేశపరిశ్రమల పోటీని సంహరించి ఆంగ్లేయపరిశ్రమలు యూరపుఖండము నంతయు నాక్రమించెను. అమెరికాదేశము స్వాతంత్ర్యయుద్ధమునకు దిగువఱకు నమెరికా దేశపు పంట లన్నియును, గ్లాసుగో బ్రిస్టలు నగరములద్వారా అన్యదేశములకు వ్యాపించెను. వాణిజ్యపద్ధతి మూలమున నాంగ్లేయధనికులు చాలలాభమును పొందిరి. కాని అమెరికాదేశీయులు నష్టపడిరి. అమెరికాదేశస్వాతంత్ర్యయుద్ధమున కిది యొక మూలకారణము. ప్రస్తుత మాంగ్లమంత్రివర్గముచే నుపపాదింపబడిన ఆంగ్లవర్తకరక్షకపద్ధతి (ఇంపీరియల్ ప్రిఫరెన్సు) పూర్వకాలపు వాణిజ్యపద్ధతియే!

## పూర్వచరిత్ర

1917 వ సంవత్సరమున పార్లమెంటుసభలో దూదిసుంకముల గుఱించి జరిగినచర్చలో భారతరాజ్యాంగమంత్రియును, బ్రిటిషుప్రభుత్వమువారును మనపక్షమూని పోరాడుటకు వారు మనయెడ కరుణారస హృదయులై న్యాయపరివర్తనమునకు గడంగలేదు. యుద్ధానంతరము మనదేశమున నాంగ్లవర్తకరక్షకపద్ధతిని నమలులోనికిఁ దేవలయు ననువట్టి ప్రాయమే వారి నట్లు కపటనాటకమాడ ప్రేరేపించినది. దూదిసుంకములకును ఆంగ్లవర్తకరక్షకపద్ధతికిని గల సంబంధమును మన మించుక విచారింపవలయును. లేకున్న నాంగ్లవర్తకరక్షకపద్ధతియే సంరక్షణపద్ధతి యని కొందఱు గ్రహించి మోసపోవచ్చును. అట్లే మననాయకులు కొందఱు ఈ పదమువిశబంధపుమాటలలోఁ దగుల్కొనిరి. ఇంకనైన వీరు నిజము గ్రహించి ప్రజాపక్షమూని యీనూతనపద్ధతిని బ్రతిఘటించుట శ్రేయస్కరము.

దూదిపరిశ్రమలకే గాక తదితరస్వదేశపరిశ్రమలకును గూడ కొంతకాలము మనకు సంరక్షణము గావలయును. అందు మనకు గావలసినది ఇతరదేశముల పోటీకంటె యెక్కువగా బ్రిటిషు పోటీనుండి సంరక్షణ మని మనము గ్రహింపవలయును. ఆంగ్లేయపాలన ప్రథమదినములలో మనము గొప్పపరిశ్రమలను చేయువార మని ప్రసిద్ధికెక్కియుంటిమి. కాని మనపరిశ్రమ లన్నియును బ్రిటిషు ప్రభుత్వపు సంరక్షణపద్ధతిచే నిర్మూలింపబడెను. మనకళలనాశన మెట్లుజరిగెనది బ్రిటిషు దేశమే గాని యితరము లగు నైరోపాదేశములు గావు హోరేస్ హేమన్ విల్సను తనచరిత్రలో నిట్లు వ్రాసెను —"181(-వ సంవత్సరమున నిర్ణయించిన సాక్ష్యములో నాకాలమున భారతీయుల దూది పట్టుగుడ్డలు బ్రిటిషుమార్కెట్టులలో యింగ్లాండులోచేసిన వానికంటె నాటికి 50 మొదలు 60-వ వంతువఱకుఁ దక్కువకు అమ్మి లాభము పొందవచ్చునని తెల్పబడెను. అందుచే నింగ్లాండులో చేసిన సామానుల సంరక్షించుటకు నాటికి 70 లేక 80 వవంతు సుంకము లెక్కువగా భారతీయుల పరిశ్రమలపై విధింపవలసివచ్చెను. ఇట్టి బహిష్కారపద్ధతి అవలంబింపని యెడల మాంఛెస్టరు పైస్లీ మిల్లులన్నియును ప్రథమమున నే మూసివేయవలసివచ్చెడిది. ఆవిధమునచే మిల్లులలోని యంత్రములను పనిచేయించినను భారతీయులతో గెల్చుట యసంభవము......భారతదేశములోనికి బ్రిటిషుసామాను లేవియైనను సరియే పన్నులు లేకుండ దిగుమతి చేయబడెను.""

జరిగినదానినిగురించి చింతించిన నేమి ఫల మున్నది! గొప్పయంత్రములతోఁ దమపరిశ్రమలను కళల నభివృద్ధిచేసికొని తమ వస్తుసామగ్రి నితరదేశములకు ఎగుమతిచేయు శక్తిగల్గినపుడు, బ్రిటిషువారు స్వేచ్ఛావాణిజ్యపద్ధతి నవలంబింప నారంభించిరి. అప్పుడు స్వేచ్ఛావాణిజ్యపద్ధతి నధిక్షేపించినవారిని బ్రిటిషువారు దూషించిరి. దండించిరి. స్వేచ్ఛావాణిజ్యపద్ధతిదేవతనే గడచిన అర్ధశతాబ్దమునుండియును ఆంగ్లేయులు పూజించుచుండిరి. ప్రస్తుతపరిస్థితులలో నార్థికవిషయములందు ఒకజాతి యింకొకజాతి నణఁగద్రొక్క యత్నములు సల్పునపుడు- నాగరికత గల దేశములన్నియు ప్రపంచమందుగల పణ్యస్థలములలో పోటీకి నిలుచునపుడు- కొన్ని దేశములు తమ నవీనసాధనయంత్రములను పరికరములను వృద్ధిచేసికొని అపక్వపదార్థములు లేక యల్లలాడునపుడు- మఱికొన్ని దేశము లపక్వపదార్థములు గల్గియుండి సాధనయంత్రసామగ్రి లేక విచారించునపుడు- స్వేచ్ఛావాణిజ్యపద్ధతి న్యాయయుక్తమగు తర్కపద్ధతి కానేరదు. అందునను ముఖ్యముగ నొకజాతి గొప్ప యంత్రపరికరములను గల్గియుండి అపక్వపదార్థములు మెండుగానున్న యింకొక దేశము తనచేతిక్రింద నున్నచో దాని నెంత హింసపెట్టి యార్థికముగ క్షీణింపజేయునో చెప్పనక్కరలేదు! కాన నాంగ్లదేశమునకును భారతదేశమునకును స్వేచ్ఛావాణిజ్యపద్ధతి న్యాయపద్ధతి కాదు. మన పరిశ్రమల వృద్ధికేవి కొనుటకు మనకు సంరక్షణపద్ధతి యావశ్యకమై యున్నది. కాని ఆంగ్లదేశము స్వేచ్ఛావాణిజ్యపద్ధతి నవలంబించుటచే ఆంగ్లప్రముఖులు మనకు సంరక్షణపద్ధతి నొసంగ నిరాకరించిరి.

ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట నవీనయంత్రకళలం దితరము లగు నైరోపాదేశములు బ్రిటిషుదేశముతోఁ బోటీకి నిలువఁబడుటకు ప్రారంభించెను అందు ముఖ్యముగ జర్మనీదేశము తనపాలకులచే ప్రోత్సాహితమై తనపాలకులు పెట్టుబడి పెట్టుధనములోఁ దనకళలను సంరక్షణపద్ధతి క్రింద నభివృద్ధిపరచుకొని బ్రిటిషుదేశమును ప్రపంచపు మార్కెట్టులలోనే గాక వారి స్వంతదేశపు మార్కెట్టులలో గూడ పోటీచేయుచు వెదిరింప మొదలిడెను అప్పుడు జర్మనీపోటీకిఁ దాళజాలక, బ్రిటిషుధనికులు టోరీరాజకీయనాయకులతో సంప్రతించి స్వేచ్ఛావాణిజ్యపద్ధతిఁ గొంతవఱకు మార్పుచేయవలెనని యున్నదనియు నట్లు గానున్న సంరక్షణపద్ధతిక్రింద సుంకముల విదేశదిగుమతి దినుసులపై విధింపవలయు ననియు నాందోళన పెట్టసాగిరి. కాని బ్రిటిషుయెన్నికదారుడు తన ఆర్థికలాభముల గణించుకొనినవాఁ డగుటచేతను, స్వేచ్ఛావాణిజ్యపద్ధతిని రాజకీయార్థిక మతముగ స్వీకరించుటచేతను, బ్రిటిషుధనికు లాందోళనముఁ బ్రతిఘటింప నమకట్టిరి.

ఏవిధమగు సంరక్షణసుంకము లైనను సామాన్యప్రజలయొక్క జీవితము దుర్భరము గావించును. ఏలయనఁగా వస్తువులకొనువాడే ప్రతిచోటను తాను కొనువస్తువులపై విధించిన సుంకముల నీయవలయును. స్వేచ్ఛావాణిజ్యపద్ధతిక్రింద బ్రిటిషు యెన్నికదారుడు చౌకధరలకు విదేశపుబట్టలను కొనవచ్చును. కాని సంరక్షణపద్ధతిక్రింద యెక్కువసుంకముల విధించినచో వాడు విదేశబట్టలను ఎక్కువధరలకు కొనవలసివచ్చును. కనుక సుంకములక్రింద వచ్చు ధన మెవ్వరిచేతులలోనికి పోవును? బ్రిటిషుదేశపు యంత్రకళల చేయువారు లాభమును సంపాదించుకొనెదరు. సుంకములు పుచ్చుకొనఁదగిన విదేశవస్తువుల విషయమున, యెక్కువగ వచ్చునదను ప్రజాకోశములోనికి పోవును. ఇది కొంతవఱకు లాభకారియే కాని తనస్వలాభమునకు బ్రిటిషు ఉత్పాదకుడు (Producer) తన పొరుగువాడగు వినియోగదారుని (consumer) కు వస్తువుల యెక్కువధరల కమ్మి కష్టపెట్టినచో సంరక్షణసుంకములవలన నెక్కుడు హాని చేకూరును. దుర్భరస్థితియందున్న స్వదేశపరిశ్రమ లభివృద్ధిపరచుకొనుటకు మాత్రమే సంరక్షణపద్ధతిక్రింద సుంకముల విధించుట న్యాయ్యము. కాని బ్రిటిషుపరిశ్రమలు బలహీనస్థితియందు లేవు. బ్రిటిషువారు నవీన యంత్రకళోద్యమమును చాలకాలము క్రిందటనుండియు ఆదరించుచున్నారు. వారిదేశమం దపక్వపదార్థములు కూడ లేవు. అట్టి సమయములో సంరక్షణసుంకములను విధించుట ఉత్పాదకుల కన్యాయ్యముగ ప్రోత్సహ మిచ్చుటయే! ఈవిషయమంతయును బ్రిటిషువినియోగజనులు గ్రహించి టోరీసుంకపు సంస్కరణనాందోళనల కొప్పుకొనలేదు యూనియనిస్టులు కూడ టోరీసూచనల నంగీకరింపలేదు. అందుచే నిన్ని సంవత్సరములవఱకును సుంకపు సంస్కరణ మాగవలసివచ్చెను.

కాని ప్రస్తుత మాగిపోయిన ఘోరసంగ్రామము గొప్ప మార్పొకటి దెచ్చెను. ప్రపంచకల్లోలక మగు నీయుద్ధము బ్రిటిషువారి రాజకీయార్థిక సాంఘిక దృక్పథములను మార్చెను. ఈ గొప్పసత్యమును చేయూతగ గ్రహించి వారివారి స్వలాభములఁ బెంపొందించుకొనుట

రాయాపక్షవాదులు భాగ్యము నిష్ప్రయోజన మని హానికర మని రూపొందబడిన రాజకీయార్థికసూత్రములను ప్రతిపాదించుచున్నారు. ఇగ్లండుదేశమును పాలిమాచ్చెదమను నావేశముఁగల్గియున్న బ్రిటిషుప్రజలలోఁ దమపక్షసిద్ధాంతములను వ్యాపింపజేయుటకు టోరీలకును అనుగ్రహనిధులకును మంచిసమయము దొరకెను. ఈ తరుణముఁ జూచుకొనియే యుద్ధానంతరము వర్తక మెట్లు సాగింపవలయునో విచారించుట కేర్పరుపబడిన బాల్ఫరు కమిటీవారు సామ్రాజ్యములో నాంగ్లవర్తకరక్షకపద్ధతిని ముఖ్యముగు నార్థికమూలసూత్రముగ భావింపవలయునని సూచించిరి. బ్రిటిషు సామ్రాజ్యపు పణ్యస్థలములనుండి జర్మనీదేశమును బహిష్కరించుటకును- కొంతవఱకు మిత్రముఁడలివారి పోటీనుండి తప్పించుకొనుటకును- ఏకో యొకవిధముగు సమస్తసామ్రాజ్యముఁ జకును క్షేమకరముగు సుంకముల విధించుటకై అధినివేశరాజ్యములతో సంప్రతించుటకును ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్సును బ్రిటిషువారు రాహ్వానించిరి. ఆ కాన్ఫరెన్సువారు బాల్ఫరు కమిటీవారు సూచించిన ఆంగ్లవర్తకరక్షకపద్ధతి నొప్పుకొనిరి. ఈ కాన్ఫరెన్సుకు భారతప్రభుత్వమువారు "మన ప్రతినిధులు"గ సర్ సింహాగారిని బికనీరుమహారాజుగారిని పంపి రని పాఠకులకు దెలిసిన విషయమే. వీరు ఆంగ్లవర్తకరక్షకపద్ధతి నామోదించిరదియును లేక ఖండించిరదియును మనకుఁ దెలియదు. కాని సింహాగారు ఖండింపవలయునను నుద్దేశముతో వెళ్లిరి. వీరికి సమయమీయక వీరు చెప్పినది వినకట్లు తోఁచుచున్నది. ఈ నూతనపద్ధతి మూలమున సామ్రాజ్యములోని ఇతర భాగముల యభివృద్ధికి భారతదేశధనము దోచుకొనబడును. ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్సులో అంద రేకగ్రీవముగ నీనూతనపద్ధతి నామోదించి రని మంత్రివర్గమువారు చెప్పిరి. ఈ మాటలచే నెవ్వరు మోసపోజాలరు. ప్రతి అధినివేశరాజ్యమునకు కాన్ఫరెన్సులో నొకవోటు గలదు. భారతదేశమునకు గూడ నొకవోటు గలదు. ఆవోటు సరి కార్యవర్గములోనివాఁడగు భారతరాజ్యాంగమంత్రి కియ్యబడెను. గాని భారతప్రతినిధి కియ్యలేదు. భారతసచివుఁడు భారతప్రతినిధుల నీ విషయమున సంప్రతించెనో లేదో తెలియదు. భారతప్రతినిధికే ఆవోటు నిచ్చియుండినచో సంగతిసందర్భము లెట్లుండెడివిరో? వేరుగ వ్రాయవలయునా? ఒకవేళ నిండియా ప్రభుత్వమువారిచే నెన్నుకొనబడిన సింహాగారు గాని, బికనీరు మహారాజాగారు గాని, ఈ దౌర్జన్యపద్ధతి నొప్పుకొనినను భారతప్రజలు వీరి యభిప్రాయములను చేతలను ఆమోదింతురా?

1903-వ సంవత్సరమున భారతదేశమునకు ఆంగ్లవర్తకరక్షకపద్ధతిని వర్తింపజేయుటకు ప్రథమముగ యత్నములు సల్పబడెను. కాని కర్జను ప్రభుత్వమువారీపద్ధతిని తీవ్రముగ విమర్శించి హిందూదేశమందు దీనిని నెలకొల్పుటకు వీలులేదని బ్రిటిషుమంత్రివర్గమువారికిఁ దెల్పిరి. తరువాత నాంగ్లప్రభుత్వమువారీవిషయమును గురించి మఱలఁ బ్రసంగింపలేదు. 1917-వ సంవత్సరమందు సామ్రాజ్యశాసనసభలో గౌరవనీయు లగు సర్ గంగాధరరావు చిట్నవీసుగారు ఆంగ్లవర్తకరక్షకపద్ధతిని భారతదేశమం దాచరణలోనికిఁ దెచ్చుటకు ప్రభుత్వమువా రాలోచింపవలసిన దని హెచ్చరించుచు నొకతీర్మానము దెచ్చిరి. కాని యిండియా ప్రభుత్వమువారీపద్ధతి మూలమున మన కనేకకష్టములు గల వనియు, అందుచే వీనిని మన మామోదించుట ఉపద్రవకర మనియుఁ దెల్పుచు తీర్మానము నధిక్షేపించిరి. చిట్నవీసుగారు తీర్మాన ముపసంహరించుకొనిరి. మొత్తముమీఁదఁ బ్రభుత్వమువారీపద్ధతిని ప్రథమమునుండియు నధిక్షేపించుచునే యుండిరి. యుద్ధానంతరము మెచ్చునప్డు ప్రభుత్వమువారి దృక్పథము మారినది. మెచ్చునప్డు ప్రభుత్వములోనివారగు బార్నెసుగారు ఆంగ్లవర్తకరక్షకపద్ధతి యెట్లయినను మనదేశమందు నెలకొల్ప గాఢముగు యత్నములు సల్పుచుండిరి. 1919 వ సంవత్సరము సామ్రాజ్యశాసనసభలో నిండియన్ టారిఫ్ ఎమెండుమెంటు బిల్లు నొకటి ప్రభుత్వమువారు ప్రవేశపెట్టగా మదనమోహనమాళవ్యగారుతప్ప ఇతరులగు అనధికారనియుక్తసభ్యులందఱు బిల్లు నామోదించిరి. హిందూదేశమునుండి యితరదేశములకు ఎగుమతిచేయు తోళ్లపైనను చర్మములపైనను 100-కి 15 వంతు ఎగుమతిపన్ను విధించుటయును సామ్రాజ్యములోని భాగములకు ఎగుమతిచేయబడువానిపై 100 కి 10 వంతు మాత్రమే యెగుమతిపన్ను విధించుటయు నీబిల్లుయొక్క యుద్దేశములు. ఆంగ్లదేశమందు గల తోళ్లపరిశ్రమలవారు తోళ్లులేక అనేకకష్టములకు లోనగుచున్నారు. అట్టివారి కీవిధముగ ప్రోత్సాహ మియ్యబడెనను విషయము మన గౌరవనీయసభ్యులు తెలిసికొనకుండుట విచారకరము. హైందవోత్పాదకునికి నష్టములేకుండ చేసెదమని ప్రభుత్వమువారు బిల్లు నుపపాదించుచు వాకొనిరే గాని అదియనుసంధకము దొరతనమువారికి మన తోళ్లపరిశ్రమ నభివృద్ధికేయు నిష్టమున్నచో విదేశతోళ్లసరకులపై సుంకముల విధించి మనదేశమందు తోళ్లఫ్యాక్టరీలను స్థాపించుటకు ప్రజల ప్రోత్సహించి, ఫ్యాక్టరీల స్థాపించినవారికి ధనసహాయమును చేసియుండెడివారు. కాని అట్లు గావింపకపోవుటయే వారి మనోభిప్రాయమును ప్రకటించుచున్నది. దొరతనమువారీవిషయమందు గూఢముగ ప్రజాప్రతినిధులకు దెలియకుండ నాంగ్లవర్తకరక్షకపద్ధతి మూలసూత్రము నంగీకరించి దాని నాచరణలోనికి దెచ్చిరి.

కాని యిట్లు గూఢముగ నెంతకాలము ప్రవర్తించెదరు. 1919-వ సంవత్సరమున సామ్రాజ్యశాసనసభా కార్యనిర్వాహకాలమందు ఆంగ్లవర్తకరక్షకపద్ధతి భారతదేశమునకు వర్తింపజేయుట లాభకరమా నష్టమా యను విషయమును విచారించుట కొక కమిటీ నేర్పరుపవలసిన దని ప్రభుత్వసభ్యులగు బార్నెసుగారు తీర్మాన ముపపాదించిరి. గౌ॥ పటేలు మున్నగు కాంగ్రెసుకు చేరిన సభ్యులందఱు ఈతీర్మానము నధిక్షేపించినను సభవా రాతీర్మానము నామోదించి, నొక కమిటీ నేర్పరచిరి. ఈకమిటీవారు వ్యవహారకాండనంతయు గుప్తముగ ముగించి తమనివేదికమును గడచిన సంవత్సరము ప్రచురించిరి. కమిటీవారు ఆంగ్లవర్తకరక్షకపద్ధతివలన భారతదేశమునకు ఎగుమతులలో నష్టమేమియు లేదనియును, దిగుమతులలో కొంతవఱకు వినియోజకులకు నష్టమున్నను మొత్తముమీద నెగుమతి దిగుమతులలో మన కేమి లాభనష్టములు లేవనియును సూచించిరి. మన భావ్యార్థికనీతి సమగ్రముగ నాలోచించుట కొక సంఘమును త్వరలో నెలకొల్పవలసినదనియుఁ సూచించిరి. ప్రజానాయకులయొక్కయును ప్రజలయొక్కయును నభిప్రాయములఁ బైకొనక కమిటీవారాంగ్లవర్తకరక్షకపద్ధతివలన మన కుపద్రవము లేదని స్వాభిప్రాయ మొసంగిరి.

## 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు కమిటీ' నివేదిక

కమిటీవారిసూచన యెంతవఱకు న్యాయ్యమో యోచింతము. మొత్తముమీఁద మన యెగుమతి దిగుమతులలో యేమియు నష్టము లేదట. ఈ సూత్రవిషయము కమిటీవారు, వర్తక వ్యాపారపు లెక్కలు పరిశీలించి కని పెట్టిరట! ఒక్క వర్తక వ్యాపార లెక్కలే యీవిషయమును నిర్ణయించుటకు చాలునని దలంపరాదు. అవి మాత్రమే గాక ఇతరస్థితిగతులును గలవు. వానిని కూడ విచారింపవలయును. మన దేశమునకు వచ్చు బ్రిటిషు వస్తువులకు సుంకము లేమియు లేకుండ స్వేచ్ఛగ రానిచ్చితి మనుకొనుఁడు. విదేశసరకులపై కఠినసుంకముల విధించితి మని తలంపుడు! ఆంగ్లేయసామ్రాజ్యములో లేని దేశములకు వెళ్లుసరకులపై పన్నుల విధించితి మనుకొనుఁడు. ఇట్లుచేసిన మనకువచ్చు నష్టముకంటె లాభమేమైన నున్నదా? కడచిన మూఁడుసంవత్సరములలో సగటున నూటికి 52.8 భాగములు దిగుమతివర్తకమును 29 భాగములు ఎగుమతివర్తకమును యునైటెడ్ కింగ్డమ్ మనదేశముతోఁ జేసినది. మిగిలిన 47.2 భాగములు దిగుమతివర్తకమును గ్రేటుబ్రిటనుదేశము తయారుచేయలేనివస్తువులై యున్నవి. ఆంగ్లదేశమునకు మనదేశమునుండి 29 భాగములకంటె నెక్కువ యెగుమతు లక్కఱలేదు. మనదేశమునకు దూదిపరిశ్రమలు మున్నగునవి గ్రేటుబ్రిటను సుమారు 28 కోట్ల రూపాయలు విలువగలవి యెగుమతి చేసెను. జపాను 11 కోట్ల రూపాయల విలువ గలవి ఎగుమతిచేసెను. ఇటలీ, అమెరికా, హాలండుదేశములు మనతో చాల తక్కువకిమ్మతు గల బట్టలవ్యాపారమును చేయుచున్నవి. ఇట్టి సమయమున మనము నూటికి 7½ రూపాయ లని యేర్పరచిన దిగుమతిసుంకము నెత్తివేసినచో నింగ్లాండుదేశము తదితరదేశములకంటె నేమి లాభము పొందును? ఏమియులేదు. కాని మనము 148 లక్షల రూప్యముల సుంకపు టాదాయమును పోఁగొట్టుకొనువార మగుదుము. ఇప్పటికే అతి హీనస్థితియందున్న మనదేశము ఈకొంచెపు టాదాయమును పోఁగొట్టుకొనిన త్వరలోనే దివాలాయెత్తును. ఇంగ్లాండుదేశపు దూదిపరిశ్రమల మనదేశమునకు స్వేచ్ఛగ రానిచ్చిన మనకు బట్టలు చవుకధరలకు దొరకునని కొందఱు వాదింపవచ్చును. ఈవాదము సహేతుకము గాదు. ఏలయన మన దేశపరిశ్రమగా విదేశపుపోటీకి నిల్వఁజాలక క్షీణించును యునైటెడ్ కింగ్డమ్ సప్లయిచేయలేని వస్తువులపై కఠినసుంకముల వేసిన మన వినియోగదారుఁడు నష్టపడును. కాన దిగుమతుల విషయమున మనకు చాల నష్టము గలదు.

ఇంక నెగుమతుల సంగతిని విచారింతము. మన యెగుమతిపట్టీలో పెద్దది జనుపనార. కడచిన 5 సంవత్సరములలో సగటున 12 కోట్ల రూపాయల విలువగల జనుపనారను, 40 కోట్లరూపాయల విలువగల జనుపనారపరిశ్రమలను ఎగుమతిచేసితిమి. అన్యదేశములయొక్కయు మన దేశముయొక్కయు పోటీకిఁ దాళఁజాలక యునైటెడ్ కింగ్డమ్‌లో జనుపనారపరిశ్రమ క్షీణించినది. ఒక్కరష్యాదేశమందు తప్ప మిగిలిన దేశము లన్నిటికిని జనుపనారను స్వేచ్ఛగ రానిచ్చెదరు. కాని జనుపనారపరిశ్రమల దిగుమతిపై నూటికి 5 మొదలు 75 భాగములవఱకు సుంకములను విధించెదరు. జనుపనారపై యెగుమతిపన్ను ఉన్నచో మన పరిశ్రమ మెక్కువగ అభివృద్ధి నొందియుండెడిది. మన మాంగ్లదేశముపై నీవిషయమున నభిమానము జూపినయెడల నాదేశపరిశ్రమ లభివృద్ధిపొందుటయు, మనము క్షీణించుటయు సంభవించును. అది గాక మన జనుపనారపరిశ్రమ బ్రిటిషువారిచేతులలో నున్నది. బ్రిటిషు ధనాఢ్యులు పెట్టుబడిపెట్టి, పరిశ్రమ నభివృద్ధిపఱచుచున్నారు. మనకు కూలిమాత్రమే గిట్టుచున్నది. వంగదేశమందు గల జనుపనారపరిశ్రమల వారు బ్రిటిషువారిపై నభిమానము చూపుట కొప్పుకొనరు.

మన రెండవయెగుమతి దూది. జపానుదేశము తక్కినదేశముల కన్న నెక్కువ దూదిని మనదేశమునుండి తెప్పించుకొనుచున్నది. 1918-19 సంవత్సరములో 7,88,800 బేలుల దూదిని జపానుకు ఎగుమతి చేసినాము. మనకు జపానుపోటీ యెక్కువగ నున్నది. దూది యెగుమతులపై కొద్దిగ సుంకము విధించిన మనయంత్రపరిశ్రమ వృద్ధి పొందును. లంకాషైరు మనదూదిని ఎక్కువగ నుపయోగింపదు. అమెరికాదేశపు దూదిపంట పాడయిపోవుటచే మనదూది ప్రతిదేశమువారికి కావలసియున్నది. ఇట్టి స్థితిలో విదేశములకు పంపు దూదిపైనను, అచ్చటనుండి వచ్చు దూదిపరిశ్రమలపైనను కఠినసుంకముల విధింప మనియు, ఆంగ్లదేశమునుండి వచ్చువానిపై తక్కువసుంకములు వేయుమనియు కోరుట యేటిన్యాయము? అట్లుచేసిన విదేశములతో ఆర్థికయుద్ధమును స్వదేశయంత్రపరిశ్రమలు నాశనమొందుటయును, ఆంగ్లదేశము లాభము పొందుటయు సంభవించును. ఇందుచే, ఎటు చూచినను, మనకు నష్టమే కల్గును.

### ఈపద్ధతివలన మనకు గలునష్టములు

ఆంగ్ల వర్తకరక్షకపద్ధతి మూలమున మన కనేకనష్టములు గలవు. మన దేశపరిశ్రమలు విదేశపు పోటీవలన నాశన మగును. మన వాణిజ్యమాలను క్షీణదశకు వచ్చును. మనదేశమం దన్యజాతులవారుచేరి మనసంపద దోచుకొనెదరు. ఇదివఱకే మన మార్థికవిషయములందు ప్రపంచమందలి ప్రతిజాతికంటెను వెనుకబడియున్నాము. ఇక నీనూతనపద్ధతి నెలకొల్పిన మనము సంపూర్ణముగ నార్థికదాస్యము నొంది తుట్టతుదకు భారతజాతి పేరు రూపుమాసిపోవును. ఆంగ్లేయమంత్రివర్గములోనివాఁడైన కోశాధ్యక్షుఁడగు ఛేంబర్‌లేనుగారు ఆంగ్ల వర్తకరక్షకపద్ధతిని నధినివేశరాజ్యము లన్నియు నొప్పుకొనవని సెలవిచ్చెను. స్వపరిపాలన మనుభవించుచున్న ప్రతినిధిపరాజ్య విధానపద్ధతి నొప్పుకొనుటలో ఆశ్చర్యమేమియు లేదు. ప్రతి అధినివేశరాజ్యమును తన ఆర్థికనీతిని తనయిష్టము వచ్చినట్లు మార్చుకొనవచ్చును. కాని ఆంగ్ల వర్తకరక్షకపద్ధతిక్రింద ప్రతి అధినివేశమును సామ్రాజ్యములోని వివిధభాగములలో చేయబడు పరిశ్రమలకు ప్రోత్సాహ మియ్యవలయును. సామ్రాజ్యములోని యితరభాగముల క్షేమముకొఱకు అధినివేశ మొకటి తన క్షేమమునకు లాభముల విడిచి పెట్టనక్కరలేదు. ప్రతిఅధినివేశము నిప్పుడిప్పుడే తన ఆర్థికజీవితము పెంపొందింప జేసికొనుచున్నది. అట్టి సమయమున నీనూతనపద్ధతి దాని కెక్కువ సహాయకారి యగును.

ఈపద్ధతి స్వేచ్ఛావాణిజ్యపద్ధతికన్న కూడ నెక్కువగ మన దేశమున కనర్థదాయకమును నష్టదాయకముగను నున్నది. స్వేచ్ఛా

వాణిజ్యపద్ధతి క్రింద మనకు కావలసిన సరకులను మనయిష్టమువచ్చిన స్థలములలో చౌకధరలకు కొనవచ్చును. ఆంగ్లవర్తకరక్షకపద్ధతి క్రింద సామ్రాజ్యేతరభాగములనుండి సరకులను చౌకధరలకు దెప్పించుకొన వీలుండదు. ఎంతటిఖరీదునైనను ఇచ్చి మన మధినివేశముల సామానులను ఆంగ్లదేశపు సామానులను కొనక తప్పదు. ఈఏర్పాటువలన అధినివేశములయొక్కయు ఆంగ్లదేశముయొక్కయు పురోభివృద్ధియును మన పురోక్షీణతయు సంఘటిల్లును. కాని ఆంగ్లసామ్రాజ్యముపై నభిమానముం జూపవలదా? యని కొందఱు ప్రశ్నింపవచ్చును. అధినివేశము లట్టి అభిమానమును భారతీయులపై జూపుచున్నవా? హిందూదేశీయులపొడ గిట్టక దక్షిణఆఫ్రికా మొదలగు భాగములు భారతీయులతోఁ దఱిమివేయ యత్నించుచున్నవి. అధినివేశములందు హైందవులు దగండ్లకు మితిలేనట్లు తోఁచుచున్నది. ఎక్కడచూచినను మనల నీచముగ చూచుచున్నారు. ఇట్టి పరిస్థితులం దొకభాగమున కింకొకభాగముపై ప్రేమగల్గు టెట్లు? ఏవిధముగఁ బరిశీలించినను మనకు మనకిష్టమువచ్చిన వాణిజ్యపద్ధతి నవలంబించుట సంపూర్ణ స్వాతంత్ర్య ముండుట మేలు.

## సభ్యరాష్ట్రముల ఆర్థికనీతి

సభ్యరాష్ట్రముల ఆర్థికనీతి యెట్టిదో, యోచింతము. కెనడా దేశపు ముఖ్యపు టాదాయము సుంకములవలననే వచ్చుచున్నది. ఆదేశ మన్యదేశములకు ఆహారపదార్థములను ముడివస్తువులను నెగుమతిచేసి తయారుచేసిన వివిధవస్తువులను దిగుమతి చేసికొనును. ప్రథమమున తనపరిశ్రమలు వృద్ధిపొందుటకును తరువాత నాంగ్లదేశముపై నభిమానము జూపుటకును ననుకూలసూత్రము ననుసరించి యెగుమతి దిగుమతులపై సుంకముల విధించుకొనుచున్నది. అట్లే ఆస్ట్రేలియా, న్యూజీలండు, సౌతుఆఫ్రికా కూడ తమస్వదేశపరిశ్రమల రక్షించుకొనుచు అన్యదేశవస్తువులపై నెక్కువగ సుంకముల విధించి ఆంగ్లదేశముపై నభిమానముం జూపుచున్నవి. ఇట్టిస్థితియందు భారతదేశ మేల వేరుదారి ద్రొక్కవలయును? వలసరాజ్యములవలె తనదేశము ప్రవర్తించుట భావ్యము. అంతియగాని తనకు మాలిన ధర్మమును మొదలుచెడ్డ బేరమును అనుసరించుట వెఱ్ఱితనము.

## ప్రస్తుతస్థితి

ఇప్పుడు మన ఆర్థికస్థితి చాల విషమస్థితిలో నున్నది. వర్తకవ్యాపారములందు మనయెగుమతులు పడిపోయెను. దిగుమతులు హెచ్చయ్యెను. కోట్లకొలది ధనము మనదేశమునుండి అన్యదేశములకు పోవుచున్నది. ఇండియా ప్రభుత్వమువారికి ఖర్చులకు 19 కోట్ల రూపాయ లీసంవత్సరము తక్కువ వచ్చెను. తక్కువగు పైకమును పరుకూర్చుటకు దూదిపరిశ్రమ దిగుమతులపై సుంకము లధికము గావించెద మని ప్రకటించిరి. లంకాషైరు మాంచెస్టరును తమవర్తకము పడిపోవునను స్వార్థభీతిచే తీవ్రముగ నసమ్మతిం దెల్పినవి. కాని దొరతనమువారు గత్యంతరమేమియు లేక పన్ను లధికము గావించుట తప్పదని. భవిష్యత్కాలమున నాంగ్లవర్తకరక్షకపద్ధతి నాచరణలోనికి దెచ్చు నభిమతముతో, మన ఆర్థికనీతిని బాగుగ పరిశీలించి యికముం దెట్లు దానిని నడుపవల యునో దెల్పుటకు గాను నొక పంచాయతీసంఘము నేర్పఱచెద మని మాంటేగూగారు సెలవిచ్చిరి. హీనస్థితియందున్న మనదేశమం దీనూతనపద్ధతి నెలకొల్పిన మన మింకను దరిద్రుల మగుదుము. కావున ఈభీకరస్థితినుండి తప్పుకొనుటకు మనకు ఆర్థికస్వాతంత్ర్య మావశ్యకము.

## సంయుక్తసంఘసూచన విమర్శన

మాంటేగూమంత్రి యిచ్చిన ఈశాస్త్రపు సంస్కరణముల వలన మనకు కొంతవఱకు ఆర్థికస్వాతంత్ర్యము చేకూరిన దని మితవాదసోదరులు వాపోవుచున్నారు. ఇం దెంతవఱకు నిజమో విచారింతము. ఆంగ్లేయసామ్రాజ్యార్థికనీతికి భంగము గాకుండ భారతదేశమున కార్థికస్వాతంత్ర్య మీయవచ్చు నని సంయుక్తసంఘమువారు దెల్పిరి. ఈ సూచన బయలువడుట సహేతుకముగ గన్పట్టుచున్నది. కాని దీనివలన గల్గు అపాయము మితవాదసోదరులు గ్రహింపకున్నారు. ఆంగ్లదేశపు టార్థికాభివృద్ధికి భారతదేశపు ఆర్థికనీతి లోబడియుండవలయు నని గదా యీ సూచన దెల్పుచున్నది! ఆంగ్లసామ్రాజ్యపు టార్థికనీతి స్థాపనమునది పార్లమెంటువారు. అందు మనకు ప్రాతినిధ్యము లేదు. తమక్షేమము చూచుకొనిగదా యితరదేశముల బాగోగు లరయుదురు. మనము జపాను అమెరికాసరకులను దిగుమతిచేసికొనకుండ వానిపై కఠినసుంకములను విధించితి మనుకొనుడు. అయిన మన కేమి లాభము? మన మెట్లు లంకాషైరుపోటీనుండి తప్పించుకొనగలము? లంకాషైరుసరకులపై మనము ఎక్కువగ సుంకముల విధించుటకు ఆంగ్లేయపార్లమెంటువా రంగీకరించెదరా? వారెన్నడు నంగీకరింపరు. కావున సంయుక్తసంఘమువారి సూచన కర్థమేమి? బ్రిటిషు వర్తకాధిపత్యమునుండి మనము తప్పించుకొనుటకు వీలులేదని గదా సంయుక్తసంఘమువారి సూచన దెల్పుచున్నది! ఇకను దరిద్రులగు మనకు మోక్షోపాయ మెక్కడ? మనసంపదను మనము కాపాడుకొనలేని స్థితియందుండి మనకు స్వపరిపాలన మొసంగితిమని చెప్పుట హాస్యాస్పదము.

మన సామ్రాజ్యశాసనసభవారిలో రాజప్రతినిధిగా రేకీభవించిన సందర్భములలోనే మన కార్థికస్వాతంత్ర్యము సిద్ధింపవలయునని యింకొక నియమము గలదు. బ్రిటిషువర్తకము మన క్షీణదశకు బయటనుండి యెట్లు కారణభూత మగుచున్నదో యట్లే లోపలనుండి ఆంగ్లేయులగు పెట్టుబడిదారుల మూలమునను మన స్వదేశపరిశ్రమలు నాశన మగుచున్నవి. ఆంగ్లోహైందవులకు క్షేమకారమగుపనుల నొనర్పవలెనని రాజప్రతినిధి యెవరును నుండజాలరు. ఆంగ్లోహైందవులు ధనాఢ్యులు. వారు గొప్ప పెట్టుబడిదారులు. వారు మనవాకకూలీలతో ఫ్యాక్టరీల స్థాపించి మన దేశీయపరిశ్రమల రూపుమాప యత్నముల గావించుచున్నారు. జాయింటుకమిటీవారి సూచన వారికి ప్రోద్బల మిచ్చుచున్నది. ఇకముందు జపాను అమెరికాలతో పోటీ యెక్కువైనప్పుడు ఆంగ్లేయకోటీశ్వరులు మనదేశమందే కొలిమిలను, ఫ్యాక్టరీలను నెలకొల్పి మనవృద్ధి కాటంకదాయకు లగుదురు. అప్పుడు బయటి పోటీకన్న లోపలిపోటీ మతింత తీక్ష్ణమై మన పారిశ్రామికాభివృద్ధికి నాశనహేతు వగును. కావున నీనియమములవలన మనము బయటను బ్రిటిషువారికిని లోపల వారిబంధువులగు ఆంగ్లోహైందవులకును ఆర్థికవిషయములందు దాసుల

మై యుండవలయునని తేలుచున్నది. వేయేల? బయటను బ్రిటిషువర్తకము పోటీగాని, లోపల ఆంగ్లో హైందవపోటీని గాని తప్పించుకొనజాలని ఆర్థికస్వాతంత్ర్యము మన కియ్యబడినది. ఈ ఆర్థికస్వాతంత్ర్యము చూచుకొనియే మన మితవాదసోదరు లుప్పొంగుచున్నారు. మనధనము దోచుకొనిపోవ నిశ్చయించుకొనినపుడు నిష్కపటముగ 'మేము మీకు ఆర్థికస్వాతంత్ర్య మీయ'మని సంయుక్తసంఘమువా రేల ప్రకటింప గూడదు? ఈ రొత్తులును- పన్నగడలును ఎవరిని ఉద్ధరించుటకు?

ఎంత ప్రార్థనపడి కోరినను, బ్రతిమాలినను, ఆర్థికస్వాతంత్ర్యము తమంతటనామే ఆంగ్లేయులు మన కిచ్చెదరనుట కట్టి కల్ల. సంస్కరణము లిచ్చుచున్నా మని యొకమూల ప్రకటించుచు, పంజాబునందు వారొనర్చిన దుండగములే వారి సంకుచితదృక్పథమును చాటుచున్నవి. అర్థరహితములయి నిష్ఫలములై సంస్కరణము లిచ్చినంత మాత్రమున దొరతనమువారి దృక్పథము మారినదని తలంచుట వెఱ్ఱి. ప్రస్తుతమిచ్చిన సంస్కరణము లెట్టు నిరుపయోగములైనవో మన కిప్పుడనుభవైకవేద్యమే కదా! ఇక మనకు గత్యంతర మేమి?

### స్వరాజ్యప్రతిష్ఠాపనము

ఆర్థికస్వాతంత్ర్యమునకును, స్వరాజ్యమునకును అవినాభావ సంబంధము గలదు. ఎప్పుడు మనము స్వరాజ్యము సంపాదింతుమో అప్పుడే మన యిక్కట్టులన్నియు నశించును. మన దేశము తిరిగి ఐశ్వర్యపూర్ణ మగును. ప్రతిభారతీయుడును స్వరాజ్యసంపాదనము నకు నిరంతరకృషిని సల్పవలసియున్నది. ఇట్లు చేసిన వాంఛాసిద్ధి యచిర కాలములో గలుగక తప్పదు. స్వరాజ్యసిద్ధి భగవదిచ్ఛ. కనుక కార్యసిద్ధి బడయుటకై ప్రతిభారతీయుడును తన మాన ప్రాణధనముల నైనను త్యజించి నిరంతర మగు కృషి సల్పుగాత.

మ. "తరణోపాయము భారతీయునకు నేతద్భారతీయ స్వరాజ్యరథం బూనుట గాకితఃపరము లేదా బాలగోపాల మం
దఱికీ కార్యధురంధరత్వము తగున్ దచ్చక్రసంఘట్టన, త్వరకుం జచ్చిన నిల్చినన్ దొరకు జీవన్ముక్తి తత్కాలికిన్."

## సమాశ్వాసన గీతిక

దండూరి బంగారయ్య గారు

ఏడువకురా! బాబు-యేడువకు తండ్రి!
యేడుస్తె నిన్నెవ్వ-రెత్తుకుంటారు?
మాతృదేశార్థమై- మమ్మెల్ల వీడి
నీతండ్రి చెఱసాల-నిలచియున్నాడు.
భారతీయుల పాట్లు- చూడగా లేక
నీమామ సంకెళ్లు- నెగడుచున్నాడు.
ఏడవకు అబ్బాయి-ఏడువకు తండ్రి
ఏడుస్తె నిన్నెవ్వ- రెత్తుకుంటారు?

* * *

స్వారాజ్యయజ్ఞంబు-జరిగేటి వేళ
ప్రాణంబు లాహుతిం-బడునట్టి వేళ
చెఱసాల సంకెలల్-చేతులం దాల్పం
బసిపిల్లలను గూడ- పంపేటి వేళ
రండోయి బాబులూ!-రండోయి యంచుం
బ్రియదేశజనని నిన్-బిలచెడి వేళ
యేడుస్తె నవ్వరా?-వెఱ్ఱినాతండ్రి.

* * *

రక్షరా! శ్రీరామ-రక్షరా! తండ్రి
మాతృభూమికి గాను మహితాత్ము డగుచు
తన ప్రాణముల నెల్ల ధారగానిడిన
మీతాత తపసులే-మీకు రక్షణలు
దిక్కుమాలినతల్లి-దీనతను బాపం
బద్ధకంకణుడైన ప్రభువగుగాంధి
సత్యసంకల్పంబె- సంరక్ష నీకు.
ఆత్మీయదేశార్థ- మఖిలంబు నిచ్చి
పశువులసాలలో- వసియించుచుండి
సుకుమారదేహంబు- స్రుక్కిపోవంగ
కాటికిం గాళ్లను-కడజాచుకొన్న
కడువృద్ధు డయ్యును-నెఱజవ్వనాన
చెఱసాలవాసంబుం- జేపట్టినట్టి
నెహ్రూమహాత్ముని-త్యాగసంసిద్ధి
నీకెన్నం డబ్బునో నాచిన్నికూన!

* * *

నీతండ్రి మార్గంబు- నీకు బోధించి
గాంధిమానికి నిన్ను- కర మప్పగించి
నీదేశభక్తియు- నీవర్తనంబు
నేం జూచి ధన్యనా-నిముసంబుకొఱకు
వేచియుంటిని సుమ్మి- వెఱ్ఱినాతండ్రి
ఆంధ్ర జాతీయుల-యాత్మగౌరవము
భారతీయులయొక్క- భావిభాగ్యంబు
నీచేత నున్నవి- నాచిన్నిబాబు!

# హైందవజనతాస్థితి

పంగనామముల రామచంద్రరావు గారు

శ్రుతిసౌఖ్యోదిత నిర్వచోకలనాయత్తాత్మయై నాటి భా
రతధాత్రీశ్వరి స్వస్వరూపగుణసాక్షాత్కారముం గల్గి యం
చితనిష్కామత విశ్వమానవజగత్క్షేమంకరోద్వృత్తి న
ప్రతిమానేశ్వరసేవలం దగిలె దేవా! భక్తకల్పద్రుమా!

శా. ఆవిజ్ఞానము ధర్మసూత్రరచనావ్యాసక్తి ధర్మైకదీ
క్షావైశద్యము విశ్వమానవమిథస్సౌభ్రాత్రకామంబు సే
వావృత్తిష్ఠిత భాషనాగరకతాప్రాంచద్యశశ్చంద్రికా
ధావళ్యస్థిరగౌరవంబు చనెఁగాదా! నేఁడు నిస్తేజమై.

ఉ. మానవసోదరత్వ మసమానముగా గణియించి స్వార్థ మిం
తైనను జూడఁబోక వెతకాఁడులేక రహించి లోకక
ల్యాణపరంపరానిరతమై నతికెక్కెను దేశమాతృసం
తానము పూర్వమందున స్వతంత్రతనుం దగఁ బట్టుకొమ్మయై.

గీ. సకలవిషయంబులం బ్రపంచంబులోన
"మాతృపద" గౌరవంబు సంప్రాప్త మయ్యె
నిజమతాదర్శ శిల్పాది నిఖిలగుణ
వైభవోపేత భారతవర్షమునకు.

గీ. కనుకఁ బాశ్చాత్యదేశంబు వెనుకఁబడుచు
సమధికాజ్ఞానపారవశ్యమున దోఁగఁ
బండపాండిత్యతాండవోద్దండ మగుచు
గండుమిగిలె భారతమహీమండలంబు.

సీ. వేదవేదాంగ భాషాదివ్యపాండితి
వాజ్జించి గౌరవం బందినారు
బాహుప్రతాపాగ్ని శాహోరమొసఁగిరి
నానావిరోధి కాంతారవిటపి
దేశపవిత్రమోదీక్షసంపల్లక్ష్మి
మనిచి రాష్ట్రశ్యసాభోర్ధ్వసీమ
మతకులాచార ధర్మప్రవచనభిక్ష
లారగించిరి బ్రాహ్మణాళిచెంత

గీ. సాముదాయిక ప్రత్యేక చర్యలందు
భరతవర్షాభివృద్ధికై పాటుబడిరి
వరుసగా బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్ర
జనులు నిర్నిద్ర శక్తి నిష్కపటవృత్తి.

సీ. పరదేశవాణిజ్య ప్రబలవర్తకులకు
గ్రహాచారమార్గవైఖరులఁ దెలిపి
శాత్రవదోర్దర్ప శమశక్యశ్యములకు
సముచైనలక్ష్యంబు లమరుపఱచి
ఉపనిషత్పారశీయామృతంబుచే లోక
విషయతృష్ణాశాంతిఁ గావింపఁజేసి
ఘనజటాశ్రమపద గానమాధుర్యంబుఁ
జెవిదొగ్గ శ్రోతమైఁ జిలకరించి

గీ. ఆతారహంబును వాత్సల్య మాత్మలీన
పాఠముల్ శిష్యసంతతిఁ బట్టి కఱపి
శాంతివాతావరణమున సౌఖ్యపడుచు
ఋషిమునులు తొల్లి గడపిరి జీవయాత్ర.

ఉ. భారతభూమి నల్దెసలపట్టుల దృష్టి నిగిడ్చినట్టి యె
వ్వారికినైనఁ దోఁచు ననవద్యపురాతనభారతీయ శే
ధారగ జ్ఞానపద్ధతిలతల్ సకలైకకళాప్రశస్తతో
దారప్రదర్శనాంబువులఁ దద్దనుఁ బెంచిరొ నిర్మలాత్ములై.

మ. తగుతాదాత్మ్యత వెంపుంగు నిందు నిరవద్యప్రౌఢికిం దాకలం
బగుచున్ మానవబుద్ధి యుల్లికకు చింత్యంబౌచుఁ గన్నార్పమా
పుగముల్ కెనొకచిరకిం గొనను నాఁ బోల్పారుచున్ దివ్యదృ
ష్టిగతింగూడ హరించునట్టి యల ప్రాక్శిల్పం బనల్పంబుగన్.

గీ. వాక్కుచేతను మానసవర్తనమున
వర్ణనముఁ జేయఁగాలేఁడు పంచజనుఁడు.
కఱకుతాగుట్టలోపలి కందరములఁ
బరిఢవిల్లెను శిల్పంపుఁ బనితనములు.

శా. శుద్ధస్ఫాటికదీప్తిపుంజవిలసత్ శ్రోణీధరాళీ గుహా
బద్ధప్రస్తర మందిరాంతర పురోభాగంబులన్ బాలశుల్
శ్రద్ధన్ గూర్చిన దేవతాలయములన్ సౌందర్యరేఖోజ్జ్వల
ద్బద్ధస్తూపములం గనంబడును శిల్పప్రౌఢతాదర్శముల్.

సీ. పల్లవాదికవంశభవ రాజచంద్రుల
కీర్తివల్లికల సాగించుపాడు
సకలాగమపురాణ శాస్త్రచర్చాధీన
వైదుష్యములకెల్లఁ బట్టుగొమ్మ
కృష్ణాప్రశంతిక కెంగేల విసరిన
వైనపూజల్లు లుప్పతిలుతావు
ప్రకృతికాంతాముఖ ప్రాముఖ్య మెప్పారు
ముద్యానవనసంపత్తి కునికిపట్టు

SRI G. RAMALINGAYYA



శ్రీ గోపాలుని రామలింగయ్య

SRI A. KALESWARA RAU



శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

SRI RAMASWAMI CHAUDARI



శ్రీ రామస్వామి చౌదరి

SRI V. NARAYANA



శ్రీ కల్లూరి నారాయణరావు

LATE C. RAJASEKARA KAVI



కీ. శే. చామర్తి రాజశేఖర కవి

SRI G. RANGAYYA NAIDU



శ్రీయుత గద్దె రంగయ్యనాయుడు

A. GURUNADHA RAMASESHAYYA



శ్రీయుత అడ్డేపల్లి గురునాధరామశేషయ్య

SRI K. SURYANARAYANA CHAUDHARI

SRI M. TIRUMALA RAU



శ్రీయుత మొసలికంటి తిరుమలరావు



శ్రీయుత కన్నెకంటి సూర్యనారాయణ చౌదరి

SRI C. BHAVAYYA



శ్రీయుత చింతమనేని భావయ్య

SRI M. GOVINDA DASU JEE



శ్రీయుత మాడుగుల గోవిందదాసుజీ

R. B. V. ALWAR CHETTY B. A.



కర్నాటిక్ పేపరుమిల్సు కంపెని మేనేజింగు డైరక్టరు

రా. బ. వి. ఆళ్వారుశెట్టి బి. ఏ.

# దేశీయ మహాజన సభా సంవిధానము

[అహమదాబాదు కాంగ్రెసు సభయందు సవరింపబడిన రీతిని ప్రకటితము]

1 వ నిబంధనము:—సముచిత శాంతిసాధనములవలన భారతీయులు స్వరాజ్యమును బడయుటయే కాంగ్రెసుసభయొక్క సంకల్పము

## సభాసమావేశ కాల నిర్ణయము

2 వ నిబంధనము:—(ఏ) గత మహాసభలో నిర్ణయింపబడినట్టిగాని లేక ఇంక ముందు వివరింపబడెడు కాంగ్రెసుస్థాయిసంఘముచే నిర్ధారణ చేయబడినట్టిగాని స్థలమునందు సంవత్సరమున కొకసారి క్రిస్టమసు సెలవులలో సాధారణముగా దేశీయమహాజన సభాసమావేశము జరుగవలయును.

(బి) కాంగ్రెసు స్థాయిసంఘమువారు-స్వయముగా గాని-రాష్ట్రీయసంఘములలో అధికసంఖ్యగల సంఘముల కోరికపైనిగాని - తమకు తగునని తోచిన స్థలమునందు ప్రత్యేకావసర దేశీయమహాజనసభను జరుపవచ్చును. అట్టి సమావేశములకుఁ గూడ నీ సంవిధానమునందలి నిబంధన లన్నియును స్థాయిసంఘమువారు అవసరమగు ననుకూల్యముగ చేయు సవరణలతో వర్తించును.

## మహాసభానుబంధ సంఘములు

3 వ నిబంధనము:—దేశీయమహాజనసభా వర్గమునం దీసంఘములు చేరియుండును.

(ఏ) దేశీయమహాజనసభ (బి) రాష్ట్రీయకాంగ్రెసు సంఘములు (సి) మండలకాంగ్రెసుసంఘములు (డి) సబుడివిజను, తాలూకా లేక తహసీలు ఫిర్కా లేక యితర స్థానిక కాంగ్రెసు సంఘములు, (ఇ) అఖిల భారత కాంగ్రెసు స్థాయిసంఘము (ఎఫ్) ఈ సందర్భమున దేశీయ మహాజనసభవారిచే ఎప్పటికప్పుడామోదింపబడి-భారతేతరఖండములందుండు-నిట్టి యితరసంఘములు (జి) రాష్ట్రీయమండల తాలూకా లేక తహసీలు, లేక యితర స్థానిక కాంగ్రెసు సంఘములచే కాలానుగుణ్యముగ నేర్పాటుపబడు కాంగ్రెసు రాష్ట్రీయ మండల, తాలూకా లేక తహసీలు లేక యితర స్థానికమహాసభల స్వాగతసంఘములు.

4 వ నిబంధనము:—పైన వివరింపబడిన కాంగ్రెసు వర్గమునందలి ఏసంఘమునం దైనను స్త్రీలు గాని పురుషులు గాని సభ్యులుగా చేరవలయునన్నచో వారు 18 ఏండ్లకు తక్కువ గాని వయసుగలవారుగా నుండవలయును. సంవిధానమునందలి 1 వ నిబంధనమునందు వివరింపబడిన సంకల్పమును సాధనములను నిబంధనలను అమోదించునట్లు లిఖితరూపముగ తెలుపవలయును.

## రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములు

5 వ నిబంధనము:—ఈదిగువ వివరింపబడిన రీతిని రాష్ట్రములను వాని ఎదుట నిరూపింపబడిన ప్రధాన కార్యస్థానములను నిర్ధారణ చేయబడినవి. ప్రధాన కార్యస్థానములు నిరూపింపబడినను నిరూపింపబడ కున్నను వానిని నిర్ణయించుటకును మార్చుటకును రాష్ట్రీయకాంగ్రెసు సంఘముల కధికారము కలదు.

| | | | |
|---|---|---|---|
| (1) | చెన్నపురి | (ద్రవిడ) | ప్రధానస్థానము చెన్నపురి |
| (2) | ఆంధ్ర | (తెలుగు) | " |
| (3) | కర్నాటక | (కన్నడ) | " గదగు |
| (4) | కేరళ | (మళయాల) | , కల్లికోట |
| (5) | బొంబాయినగరము | (మరాటీ-గుజరాతి) | బొంబాయి |
| (6) | మహారాష్ట్ర | (మరాఠీ) | పూనా |
| (7) | గుజరాతు | (గుజరాతీ) | అహమదాబాదు |
| (8) | సింధు | (సింధి) | |
| (9) | సంయుక్తరాష్ట్రములు | (హిందూస్థాని) | అలహాబాదు |
| (10) | పంజాబు | (పంజాబీ) | లాహోరు |
| (11) | పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రము | (హిందూస్థాని) | పెషావరు |
| (12) | ఢిల్లీ | (డిటో) | ఢిల్లీ |
| (13) | అజ్మీరు, మార్వారా, రాజపుటానా | " | అజ్మీరు |
| (14) | మధ్యరాష్ట్రములు | " | జబ్బలుపూరు |
| (15) | " | (మరాటీ) | నాగపూరు |
| (16) | బేరారు | (డిటో) | అమరావతి |
| (17) | బేహారు | (హిందూస్థాని) | పాట్నా |
| (18) | ఉత్కళ (ఒరిస్సా) | (ఓఢ్రము లేక ఉరియా) | |
| (19) | బెంగాలు సుర్మావాలీ | (బెంగాలీ) | కలకత్తా |
| (20) | అసాము | (అసామీ) | గౌహాటి |
| (21) | బర్మా | (బర్మీసీ) | రంగూను |

అఖిల భారత కాంగ్రెసు స్థాయిసంఘమువారు ఆయా స్వదేశ సంస్థానములను ఆయా రాష్ట్రములకు చేర్చుటకును ఆయా రాష్ట్రీయ సంఘము లాయా సంస్థానముల నాయా మండలములకు చేర్చుటకును అధికారము కలదు.

ఈ సంవిధానము ననుసరించి ప్రస్తుతమున్న రాష్ట్రీయసంఘములు వెంటనే మార్పును చేయవలెను. ఆ మార్పును అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘమువారు సవరించిన తప్ప, ఆ మార్పే స్థిరమగును.

6 వ నిబంధనము:—(ఎ) పైనిబంధనలో వివరింపబడిన ప్రతి రాష్ట్రమునకు నొక రాష్ట్రీయసంఘ ముండవలయును. (బి) ప్రతి రాష్ట్రీయసంఘమును మూడవ నిబంధనలో వివరింపబడిన మండలసంఘములున్నగు వానిని ఏర్పాటు చేయవలయును. కాంగ్రెసు సంవిధానమునకును అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘమువారు చేయు నిబంధనలకును

భిన్నములు కానిపద్ధతిని సభ్యులను పరింపవలసిన విధులను గూర్చియు కార్యనిర్వాహణమును గూర్చియు నిబంధనలను చేయుటకు రాష్ట్రీయ సంఘముల కధికారము కలదు. (సి) రాష్ట్రీయసంఘములచే చేయబడిన నిబంధనల ననుసరించి మండల సంఘములు మున్నగు సంఘములచే సంవత్సరమున కొకసారి నియోజింపబడిన ప్రతినిధులు రాష్ట్రీయసంఘసభ్యులగుదురు.

### నియోజనాధికారము

7 వ నిబంధనము:—4 వ నిబంధనము ప్రకారము సభ్యులని నిర్ణయింపబడినట్టియు సాలుకు నాలుగణాలు చందా చెల్లించునట్టియు దేశీయ ఉండుటను రాష్ట్రీయసంఘాధికారమునకు లోబడిన ఏ సంఘమునందైనను సభ్యులుగా నుండ నర్హులగుదురు. ఎవ్వరు గాని ఏక కాలమందు రెండు సంఘములందు సభ్యులుగా నుండకూడదు.

### నియోజకవర్గము - ప్రతినిధులు

8 వ నిబంధనము:—దేశీయ మహాజనసభకు ప్రతినిధులను నియోజించుటకు ప్రతి రాష్ట్రీయసంఘమునకును బాధ్యత కలదు.

21 ఏండ్ల వయసురాని వారిని, కాంగ్రెసు మతము నామోదించని వారిని ప్రతినిధులుగా నియోజింపగూడదు.

ప్రతిరాష్ట్రమునను స్వదేశసంస్థానముల ప్రజలతో సహా గత జనాభా ప్రకారము ప్రతి 50 వేలమందికిగాని అంతకు తక్కువసంఖ్యకు గాని ఒక్కొకరికంటె హెచ్చుగా ప్రతినిధులను నియోజింపగూడదు. సంస్థానములలోని ప్రజలకు గూడ నియోజనాధికారము నిచ్చినను సంస్థానముల పరిపాలనాది విషయములతో సెంతమాత్రమును కలిగించుకొనగూడదు.

అఖిల భారత కాంగ్రెసు సంఘసభ్యులందరును అధికారరీత్యా కాంగ్రెసుమహాసభకు ప్రతినిధులగుదురు. రాష్ట్రీయ సంఘములు నియోజింప నధికారముగల ప్రతినిధుల మొత్తమునుండి అఖిల భారత కాంగ్రెసు స్థాయిసంఘమునకు సభ్యులుగా నియోజింపబడిన వారిని అధికారరీత్యా సభ్యులగు వారిని మినహాయించవలయును.

స్త్రీల ప్రతినిధులను, అల్పసంఖ్యాకుల ప్రతినిధులను, ప్రత్యేక సంరక్షణము కోరు ప్రత్యేకవర్గముల ప్రతినిధులను, నియోజింపబడుట కభ్యంతరము కలుగకుండ రాష్ట్రీయసంఘములు ప్రతినిధుల నియోజనమును గూర్చి నిబంధనల నేర్పరింపనర్హులు.

ప్రతి రాజకీయవర్గమునకును అంశవారీ ప్రాతినిధ్యము లభించుటకు యితరులకు మార్పుచెందదగిన ఒక్క వోటుపద్ధతితో మరే పద్ధతితో ఏర్పడిన నియోజకవిధానమును నియోజనవిధానమును నిర్ణయించు నిబంధనలను చేయవలెను.

30-4-1921 వ తేదీలోగా రాష్ట్రీయకాంగ్రెసు సంఘములు చేసిన నిబంధనలను మహాజనసభా కార్యదర్శులకు పంపవలయును. అవి చేరినవెంటనే సాధ్యమైనంత త్వరలో కార్యదర్శులు వానిని ప్రకటింపవలయును.

నియోజనము జరిగినవెంటనే నియోజితులగు ప్రతినిధు లందరి పూర్తిపేరు-వృత్తి-వయసు-స్త్రీ పురుష వివక్షత-మతము-పూర్తి విలాసమును తెలుపు అకారాది సామాన్యక్రమపట్టికలను సిద్ధపరచి సాధారణ మహాజనసభ డిశెంబరునెల 15 వ తేదీలోగాను అవసర మహాసభలకు సభ జరుగు తేదీకి 10 రోజులు ముందుగాను రాష్ట్రీయసంఘములు దేశీయమహాజన సభాస్థాయిసంఘమునకు పంపవలయును.

9 వ నిబంధనము:—(ఏ) అఖిల భారత కాంగ్రెసు స్థాయిసంఘమువారు అప్పుడప్పుడు నిర్ణయించిన ప్రకారము ఈ మొత్తమును రాష్ట్రీయసంఘములు స్థాయిసంఘమునకు పంపవలయును. (బి) తాను చెల్లింపవలసిన చందాను పూర్తిగా చెల్లించినగాని కాంగ్రెసుసభ్యులెవ్వరును ఇతరులకు వోట్లు నీయగూడదు. తాము ప్రతినిధులుగా నిలువగూడదు.

### ప్రతినిధులు

10 వ నిబంధనము:—ఈ రీతిగా నియోజింపబడిన ప్రతి ప్రతినిధికిని అపెండిక్సు ఏలో నిరూపింపబడిన నమూనాగల ఫారములో సర్టిఫికెటును వ్రాసి, దానిపై కార్యదర్శి సంతకముచేసి, ప్రతినిధుల కిచ్చుటకు 8 వ నిబంధనలో చేర్కొనబడిన కాంగ్రెసు సంఘముల కన్నిటికిని అధికారము గలదు. గాన నట్లు జరుపవలయును.

11 వ నిబంధనము:—ఆ సర్టిఫికెటును 10 రూపాయలు సభారుసుమును మహాసభా కార్యాలయమునందు చెల్లించినచో ప్రతినిధుల కందఱకు కాలలోనికి వెళ్లుట కధికారము నిచ్చు టిక్కెటులు ఇయ్యబడును.

12 వ నిబంధనము:—దేశీయమహాజన సభాసమావేశము లందు పాల్గొనుటకు చీట్లు నిచ్చుటకు ప్రతినిధులకు మాత్రమే అధికార ముండును.

### సన్మానసంఘము

13 వ నిబంధనము:—వార్షిక మహాసభ జరుగుటకు కనీసము ఆఱునెలలకు ముందుగనే రాష్ట్రీయసంఘము సన్మానసంఘము నేర్పఱుపవలెను. సన్మానసంఘమున రాష్ట్రీయసంఘసభ్యులు కానివారు గూడ సభ్యులుగా నుండవచ్చును. సన్మానసంఘసభ్యులు చెరి 25 రూపాయలకు తక్కువగాని మొత్తమును చెల్లింపవలెను.

14 వ నిబంధనము:—ఆహ్వానసంఘమువారు తమ యధ్యక్షుని ఎన్నుకొనవలయును. ఇతర కార్యనిర్వాహక సభ్యులను తమసభ్యులలోనుండియే ఎన్నుకొనవలయును.

15 వ నిబంధనము:—కాంగ్రెసు సమావేశమునకు కావలసిన సొమ్మును వసూలుచేయుట - ఈ క్రిందిమాత్రములో నుదాహరింపబడు ప్రకారము కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నుకొనుట - ప్రతినిధులను అతిథులను ఆహ్వానించి వారికి వసతులను సమకూర్చుట - వీలైనంతవఱకు ప్రేక్షకులకు గూడ సదుపాయమును కలుగజేయుట - కార్యక్రమము

యొక్క నివేదికను అచ్చొత్తించుట-ప్రకటించుట-కాంగ్రెస్ సమావేశమగుటకు 4 మాసముల లోపుగ రాష్ట్రీయకాంగ్రెస్ సంఘమువారికి జమాఖర్చులపట్టీని సమర్పించుటయు ఆహ్వానసంఘమువారి విధి.

## అధ్యక్షుని ఎన్నిక

16 వ నిబంధనము:—కాంగ్రెస్ అధ్యక్షపదవికి అర్హులని తమకు తోచినవారిని అన్ని రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘములవారును జూనుమాసము అంత్యమగులోపున ఆహ్వానసంఘము వారికి తెలియజేయ వలయును. సాధ్యమైనంతవఱకు జూలై మొదటివారములో ఆహ్వానసంఘమువారు అధ్యక్షపదవికి సూచింపబడిన వారి పేర్లను సిఫార్సులను అన్ని రాష్ట్రీయసంఘముల వారికిని పంపవలయును. సూచింపబడిన పేర్లలో నుండియే ఒక్కరిని పరిష్కారముగ సిఫార్సుచేయవలెను. ఈ తీర్మానములను ఆలోచించుటకు ఆహ్వానసంఘమువారు వీలైనంతవఱకు ఆగష్టు మాసములో సమావేశము కావలయును.

రాష్ట్రీయకాంగ్రెస్ సంఘమువారు బహుళసంఖ్యాకులుగ సిఫార్సు చేసిన పేరును, అధ్యక్షుని ఎన్నుకొనుటకు ప్రత్యేకముగ సమావేశమైన ఆహ్వానసంఘములో చాలమంది సభ్యులు అంగీకరించిన రాబోవు కాంగ్రెసునకు అట్లు అంగీకరించబడిన వ్యక్తి అధ్యక్షుడుగ నుండును. ఒకవేళ రాష్ట్రీయకాంగ్రెస్ సంఘములవారు అధ్యక్షపదవికి సిఫార్సు చేసిన వ్యక్తిని ఆహ్వానసంఘమువారు అంగీకరింపక పోయినను- లేక పైన చెప్పిన ప్రకారము ఎన్నుకొనబడిన అధ్యక్షుడు రాజీనామా నిచ్చుట లేక చనిపోవుట లేక తదితరములగు నవాంతరములకు పాల్పడుట. గలిగినప్పుడు ఆహ్వానసంఘమువారు ఈవిషయమును ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారికి తక్షణము తెలియజేయవలయును. వీరు సెప్టెంబరు మాసము లోపుగ ఒక నిశ్చయమును చేయవలయును. ఈ రెండువిషయములలో నేదైనప్పటికిని, ఈ ఎన్నిక ఖాయము. ఈ అధ్యక్షుడు కాంగ్రెస్ జరుగు రాష్ట్రవాసిగ నుండగూడదు. ఇదే షరతులకులోనై ప్రత్యేకపు సమావేశముగాని అసాధారణ సమావేశముగాని జరుగునో దీనికి అధ్యక్షుని ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారే ఎన్నుకొనవలయును.

## కాంగ్రెస్ నిధి

17 వ నిబంధనము :—(ఎ) మామూలు కాంగ్రెస్ సమావేశముగాని అసాధారణ సమావేశముగాని ముగిసిన రెండువారములకు ఎక్కువ గాకుండ ప్రతినిధికట్నపు మొత్తములో సగమునంతయును రాష్ట్రీయకాంగ్రెస్సంఘము ద్వారా ఆహ్వానసంఘమువారు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారి కంపవలెను. (బి) సమావేశమున కగు ఖర్చులు అన్నియుపోను ఆహ్వానసంఘమువారియొద్దసొమ్ము నిల్వయున్నచో దానిని వారు ఏరాష్ట్రమునందు కాంగ్రెస్ సమావేశము జరిగెనో ఆ రాష్ట్రీయ కాంగ్రెస్కమిటీవారికి ఆరాష్ట్రీయ కాంగ్రెస్‌నిధికి ఇచ్చివేయవలయును.

## లెక్కల తనిఖీ

18 వ నిబంధనము : - ఆహ్వానసంఘమువారి జమాఖర్చులను ఈ విషయమునకు సంబంధించిన రాష్ట్రీయకాంగ్రెస్సంఘమువారు తనిఖీ (ఆడిట్) చేయించవలెను. కాంగ్రెస్ ముగిసిన 6 నెలలకు ఎక్కువ గాకుండ ఈలెక్కలపట్టీని [ఆడిటరు నివేదికను] రాష్ట్రీయకాంగ్రెస్ సంఘమువారు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారి కంపవలయును.

## ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ

19 వ నిబంధనము :—అధికారరీత్యా యున్న సభ్యులు గాక ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీలో 350 మంది సభ్యు లుండవలయును.

ఎన్నుకొనబడిన అధ్యక్షుండును కాంగ్రెస్ క్రీడునందు సంతకముచేసి ఏ కాంగ్రెస్ సంఘములోనైన సభ్యులుగను సాధారణకార్యదర్శులుగను కోశాధిపతులుగను నున్న పూర్వపు కాంగ్రెస్ అధ్యక్షులు అధికారరీత్యా సభ్యు లగుదురు. తన యధికారములో నున్న కాంగ్రెస్ కమిటీల సభ్యులనుండి ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ నియమించిన సభ్యులను ప్రతిరాష్ట్రీయ కాంగ్రెస్కమిటీవారును ఎన్నుకొనవలయును.

భాషాప్రయుక్త రాష్ట్రపుజనసంఖ్య ననుసరించి గాని, ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారికి న్యాయ్యమనితోచిన ఇతరవిధానమును బట్టిగాని సభ్యులమొత్తమును ఏర్పాటు చేయవలయును. దీనిని 1921 సంవత్సరము 31 తేదీ లోపుగ ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారు ప్రకటింపవలయును.

ప్రతినిధుల నెన్నుకొనుటకు ఏర్పడినపద్ధతియే ఈఎన్నికకు గూడ ననువర్తించును. ఆల్ ఇండియాకాంగ్రెస్ కమిటీసభ్యుల ఎన్నికలు సాధారణముగ నవంబరు మాసములో జరుగును.

ఈసంవిధానము ప్రకారము ప్రథమ ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ 1921 సంవత్సరము జూను 30 తేదీని గాని అంతకు పూర్వము గాని ఎన్నుకొనబడవలయును. అంతవరకు ఇటీవల నెన్నుకొనబడిన ఆల్ ఇండియా కాంగ్రెస్కమిటీ సభ్యులే పనిచేయుచుందురు.

అవసరమైనప్పుడెల్ల కార్యనిర్వాహణార్థము ఆల్ ఇండియా కాంగ్రెస్కమిటీవారు సమావేశము గావలయును. సమావేశమగుటకు పూర్వము ఎందులకు సమకూడవలయునో ఆపనిని తెలుపుచు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీసభ్యులు 15 మంది దరఖాస్తుమూలముగ కోరవలయును. క్రొత్త ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ ఎన్నిక జరుగువఱకు ఇదివఱకున్న ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారే పనిజూడవలయును.

20 వ నిబంధనము :—ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగ ఎన్నుకొనబడిన వ్యక్తులకు ఆయారాష్ట్రీయ కాంగ్రెస్కమిటీల కార్యదర్శులు ఆ సభ్యత్వపదవి పత్రముల నియ్యవలయును.

21 వ నిబంధనము :—ఏసంవత్సరమున కాసంవత్సరము కాంగ్రెస్ సభవారు నియమించు కార్యక్రమమును సాగించుటకును కాంగ్రెస్‌వారు నిర్ణయించునట్టియు ఆసంవత్సరములో క్రొత్తగ బయలుదేరు సమస్యలను పరిష్కరించుటకును కాంగ్రెస్ తరఫున ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారికి అధికారము గలదు. ఈ పనినిమిత్తము తన సంవిధానమున ప్రతిబంధకముగ లేకుండ తన కనుకూలమగు నిబంధనలను చేసికొనుటకు ఆల్ ఇండియా కాంగ్రెస్కమిటీ వారికి అధికార ముండవలయును.

22 వ నిబంధనము :—కాంగ్రెస్ సభాధ్యక్షుడు వచ్చెడిసంవత్సరమునకు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీయధ్యక్షుడుగ నుండవలయును.

### సాధారణ కార్యదర్శులు

23 వ నిబంధనము :—భారత దేశీయమహాజనసభకు ముగ్గురు సాధారణ కార్యదర్శులును, ఇద్దరు కోశాధిపతులును ఉండవలయును. వీరిని కాంగ్రెస్ వారు ప్రతిఏటను ఎన్నుకొనవలయును. ఆసంవత్సరములో జరుగు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీపని నివేదికమును సాధారణ కార్యదర్శులు తయారుచేసి దేశీయమహాజనసభ జరుగు సమయమున ఆసభకుపూర్వము జరుగు ఆల్ ఇండియా కాంగ్రెస్ సభలో తమదగ్గరనున్న యావత్తుసొమ్ము వివరములతో దాఖలు చేయవలయును. పిమ్మట ఇట్లు సమర్పింపబడిన లెక్కలు నివేదికపు నకళ్లను కాంగ్రెస్ సభ వారికి బంపవలెను. కాంగ్రెస్ కమిటీలకు గూడ పంపవలెను.

### కార్యనిర్వాహక సంఘము

24 వ నిబంధనము :—ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారి ప్రథమసమావేశమునందు కార్యనిర్వాహక సంఘమును నియమించవలయును. ఈ సంఘమునకు అధ్యక్షుడు సాధారణకార్యదర్శులు కోశాధిపతులు 9 గురు ఇతరసభ్యులు ఉండవలయును. ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవా రప్పుడప్పుడు నియమించుపనులను కార్యనిర్వాహక సంఘమువారు చేయవలెను.

### విషయనిర్ధారక సంఘము

25 వ నిబంధనము :—ముందు జరుగబోవు సాధారణసమావేశమునకు గాని అసాధారణ సమావేశమునకు గాని విషయనిర్ధారక సభ్యులుగ ఆల్ ఇండియా కాంగ్రెస్ సభ్యు లుండెదరు.

26 వ నిబంధనము :—దేశీయమహాజన సభ సమావేశ మగుటకు అధమము రెండురోజులు ముందుగ బహిరంగముగ విషయనిర్ధారక సంఘమువారు సమావేశము కావలయును. ఈ సభకు ఎన్నుకొనబడిన అధ్యక్షుడే అగ్రాసనాధిపత్యమును వహించును. ఉద్యోగపరిమితి ముగిసిన కార్యదర్శులు రాబోవు కాంగ్రెస్ సమావేశములో జరుపవలసిన పనియొక్క చిత్తు కార్యక్రమమును తయారుచేసి సమర్పింపవలయును. ఈ కార్యక్రమములలో ఆయారాష్ట్రీయ కాంగ్రెస్ కమిటీవారు సిఫార్సు చేసిన తీర్మానములను గూడ చేర్చవలయును.

27 వ నిబంధనము :—పై కార్యక్రమమును విషయనిర్ధారక సంఘమువారు చర్చింపవలయును. బహిరంగ సమావేశములో సమర్పించుటకు తీర్మానములను తయారుచేయవలెను.

28 వ నిబంధనము :—కాంగ్రెస్ సమావేశము జరుగుచున్న కాలములో అవసరమైనపుడు విషయనిర్ధారకసంఘమువారు అప్పుడప్పుడు సమావేశము కావలయును.

### వివాదాంశములు - స్వల్పసంఖ్యాకుల సదుపాయములు

29 వ నిబంధనము :—ఏదైన విషయమును చర్చకు ప్రవేశపెట్టుటకు భారతీయ ప్రతినిధులు గాని మహమ్మదీయ ప్రతినిధులు గాని ఏకముగ $\frac{3}{4}$ మంది అధిక్షేపించిన ఆవిషయమును విషయనిర్ధారకసంఘము వారు చర్చకు ఆమోదింపరాదు. లేక ఏ కాంగ్రెస్ లోగూడ ఆ కాంగ్రెస్ అధ్యక్షుడు ఆ విషయమును చర్చించుటకు అనుమతీయరాదు. చర్చకు అంగీకరింపబడిన విషయ మేదైన చర్చింపబడినపిదప చేయదలచుకొన్న తీర్మానమునకు భారతీయ ప్రతినిధులు గాని మహమ్మదీయ ప్రతినిధులు గాని $\frac{3}{4}$ వంతు ప్రతికూలురుగ నున్నచో నా తీర్మానమును మానివేయవలెను.

30 వ నిబంధనము :—సంవిధానములో చెప్పక విడువబడిన అన్నివిషయములకును ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీవారు నిబంధనలను చేయు నధికారమును గల్గియుందురు. ఈ నిబంధనలు ఈ సూత్రములకు ప్రతిబంధకములుగ నుండవు.

31 వ నిబంధనము :—ఇపుడు అమలులో నున్న సంవిధానముయొక్క సూత్రములు క్రిందు వాని ననుసరించి చేయబడిన కార్యములకు అడ్డు లేకుండగ వీనివలన రద్దు చేయబడినవి.

(అనుబంధము. ఏ)

(సంవిధానముయొక్క 10-వ నిబంధనమును జూచునది)

శ్రీయుత........................................గారు ............కాంగ్రెస్ కమిటీసభ్యులు............లో జరుగబోవు దేశీయమహాజనసభకు క్రమప్రకారము..................కాంగ్రెస్ కమిటీవారిచే ప్రతినిధిగ నెన్నుకొనబడిరి. దీనిని నేను ధ్రువపరచుచున్నాను.

కార్యదర్శి,
......కాంగ్రెస్ కమిటీ.

పూర్తిపేరు........................................
వృత్తి........................................
వయసు........................................
స్త్రీయా,పురుషుడా?........................................
మతము........................................
విలాసము ........................................

(అనుబంధము. బి)

ఆయారాష్ట్రములకు నియమింపబడిన ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సభ్యుల సంఖ్య :—

| | | | | |
|---|---|---|---|---|
| మదరాస్ | ... | ... | ... | 25 |
| ఆంధ్రరాష్ట్రము | ... | ... | ... | 24 |
| కర్నాటక | ... | ... | ... | 15 |
| కేరళ | ... | ... | ... | 8 |
| బొంబాయినగరము | ... | ... | ... | 7 |
| మహారాష్ట్రము | ... | ... | ... | 16 |
| గుజరాతు | ... | ... | ... | 12 |
| సింధు | ... | ... | ... | 9 |
| సంయుక్తరాష్ట్రములు | ... | ... | ... | 4 |
| పంజాబు | ... | ... | ... | 33 |
| నార్తువెస్టు ఫ్రాంటియర్ ప్రావిన్సు | | ... | ... | 4 |
| ఢిల్లీ | ... | ... | ... | 8 |
| అజ్మీరు | ... | ... | ... | 7 |
| మధ్యపరగణాలు (హిందుస్థానీ) | | ... | ... | 13 |
| ,, (మరాటీ) | | ... | ... | 7 |
| బీరార్ | ... | ... | ... | 7 |
| బీహార్ | ... | ... | ... | 33 |
| ఉత్కళ | ... | ... | ... | 12 |
| బెంగాల్ సుర్మా కనుమ ... | | ... | ... | 48 |
| అస్సాము | ... | ... | ... | 5 |
| బర్మా | ... | ... | ... | 12 |

# భారత దేశీయ మహాజన సభ

అఖిలభారత దేశీయమహాజనసంఘపు నివేదిక నం ౧.

## దేశీయ మహాజన సభా నిర్మాణము

అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులు - వారి చిరునామాలు. 1922 సంవత్సరమునకు

అధ్యక్షుడు:— శ్రీయుతులు, సి. ఆర్. దాసు. 148 రసారోడ్డు, కలకత్తా. అధ్యక్షులు కారాగారమున నుండుటచేత హకీము అజ్మలుఖాను అధ్యక్షులు. ఢిల్లీ.

సాధారణ కార్యదర్శులు:- పండిత మోతీలాలు నెహ్రూ, ఆనందభవనము, అలహాబాదు శ్రీయుతులు సి. రాజగోపాలాచార్యులు. డాక్టరు అన్సారీ 1 దర్యాగంజు ఢిల్లీ. పండిత మోతీలాలు నెహ్రూ; శ్రీయుతులు సి. రాజగోపాలాచార్యులు జైలునందుండుటచేత, వారికి బదులుగా పనిజేయుటకు శ్రీయుత, వి. జె. పటేలు, బొంబై. డాక్టరు టి. ఎస్. ఎస్. రాజను (తిరుచునాపల్లి) ప్రధానకార్యదర్శిగా నేమింపబడిరి.

కోశాధ్యక్షులు:— సేఠ్ జమ్నాలాలు బజాజ్. వార్ధా, సేఠ్ ఎమ్. ఎమ్. హాచ్. జే. ఛోటానీ, బంద్రా (B. B. & C. I.)

### మద్రాసుసభ్యులు (తమిళదేశము)

1 సి. రాజగోపాలాచార్యులు, సేలము ప్రాంతము.
2 డాక్టరు. టి. ఎస్. ఎస్ రాజను. ర్యాంకిన్సురోడ్డు, కంటోన్మెంటు, తిరుచినాపల్లి.
3 డాక్టరు పి. వరదరాజులునాయుడు, సెంట్రలుహైస్కూలు కోయంబుత్తూరు
4 మౌల్వీసయ్యదుముర్తుజాసాహేబు, సంపథిరామ్ స్ట్రీటు, తిరుచినాపల్లి
5 ఈ. వి. రామసామినాయకరు, మర్చెంటు, ఈరోడ్డు
6 డాక్టరు టి. వి. యస్. శాస్త్రి, సింగారతోపు, తిరుచినాపల్లి
7 డాక్టరు. టి. ఏ. రామచంద్రను చెట్టియారు, తంజావూరు.
8 ఎమ్. పట్టాభిరామఅయ్యరు; షోలవందాను, మధురజిల్లా.
9 కే. రాజగోపాలన్, 24 పట్టమంగలమ్, మాయవరము.
10 ఎస్. సుబ్రమణ్యనాయనార్, సాతూరు రామనాథజిల్లా.
11 సి. బాలాజీరావు, కోయంబుత్తూరు ప్రాంతము.
12 పి. జి. ఎసెర్, తిరుప్పూరు, కోయంబుత్తూరుజిల్లా.
13 పంతులు వేంకట్రామయ్యరు, కుంభకోణము.
14 జి. వి. కృపానిధి, స్వరాజ్యఆఫీసు, బ్రాడ్వే మద్రాసు.
15 టి. వి. వరుపిళ్లె. ఆండరు స్ట్రీటు, తిరుచినాపల్లి.
16 ఇ. సూర్యనారాయణఅయ్యరు, 'సమరసబోధిని' తంజావూరు.
17 వి. ఎమ్. మహాలింగఅయ్యరు, వకీలు, కోయంబుత్తూరు.
18 ఇ. సైయదుఅహమదు, 40 లాల్ ఖానువీధి, చిదంబరము.
19 యజ్ఞేశ్వరశర్మ, కల్లడకురిచి, తిరునెల్వేలి
20 కే. సంతానం Cp. ప్రెసిడెంటు డిస్ట్రిక్టుకాంగ్రెసుకమిటీ కళ్లకురిచి, దక్షిణార్కాడుజిల్లా.
21 హాజీ మహమ్మదు, పెరియమెట్టు, మదరాసు.
22 ఎన్. నారాయణన్, వెస్టు ఆవనివీధి, మధుర.
23 ఏ. రంగసామి అయ్యంగారు. స్వదేశమిత్రను ఆఫీసు, జార్జిటవును. చెన్నపురి.
24 ఎమ్. ఏ. అరుణాచలశెట్టియారు, పల్లత్తూరు, రామనాథ్ జిల్లా.
25 కే. ఎస్. మార్గంఅయ్యరు, కొల్లత్తూరు, నార్తార్కాడుజిల్లా.

### ఆంధ్ర దేశపు సభ్యులు

1 వి. వి. గిరి. బరంపురము, గంజాముజిల్లా.
2 వసంతరావు బుచ్చి సుందరరావు, విశాఖపట్టణము.
శ్రీయుత, వి. బి. సుందరరావు. (జైలులోనుండుటచే ఈస్థానము
3 బులుసు సాంబమూర్తి, కాకినాడ గోదావరిజిల్లా. [కాళీగానున్నది.)
4 దండు నారాయణరాజు, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.
5 భోగరాజు పట్టాభిసీతారామయ్య, మచిలీబందరు.
6 కొండ వేంకటప్పయ్యపంతులు, గుంటూరు.
7 బెజవాడ చంద్రశేఖరరెడ్డి, నెల్లూరు.
8 పి. వి. రంగంశెట్టి, నారాయణవనము, చిత్తూరుజిల్లా
9 కేతు వెంకటరెడ్డి, చిలమకూరు, కడపజిల్లా,
10 పేడము వెంకయ్యశెట్టి, కర్నూలు.
11 కల్లూరి సుబ్బరాయుడు, హిందూపురము, అనంతపురంజిల్లా
12 ధర్మవరము గోపాలాచారి. బళ్లారి.
13 భమిడి చినయజ్ఞ నారాయణశర్మ, మాడుగుల, గోదావరిజిల్లా
14 గద్దె రంగయ్యనాయుడు 40-41- సెవారియార్ కోయిల్ స్ట్రీటు
15 టి. ప్రకాశము, మైలాపూరు, మద్రాసు. [జి. టి. మద్రాసు
16 కే. నాగేశ్వరరావు మైలాపూరు, మద్రాసు
17 డాక్టరు నాజిర్ అహమ్మద్ సాహేబ్. రాజేపల్లిగూడెము. గోదావరిజిల్లా.
18 దుగ్గిరాల రాఘవచంద్రచౌదరి, అంగలూరు, కూర్ష్నా/కృష్ణాజిల్లా.
19 మహమ్మద్ ఉమర్ అలీషా, పిఠాపురము, గోదావరిజిల్లా

20 మహమ్మదు అబ్దుల్ సత్తారుసాహేబు, కడప
21 మహమ్మదు రజాసాహెబ్ బెల్గామి, గుంటూరు
22 డాక్టరు ధన్వాడ రామచంద్రరావు, బెజవాడ
23 కసుమ వేంకటరామయ్య. రాజమహేంద్రవరము
24 శ్రీమతి పొణకా కనకమ్మ, సుబ్బరామపురము, మన్నబోలుపోస్టు నెల్లూరుజిల్లా.

పైవారిలో 3 వ వారు జైలులోనున్నందున వీరికిబదులుగా, టి. రామచంద్రరావు (రాజమండ్రి) ఎన్నుకొనబడిరి. 8 వ వారును జైలులో నున్నందున వారికి బదులుగ కవిస్థలము రాజగోపాలాచారి(తిరుపతి) ఎన్నుకొనబడిరి. 11 వ వారు జైలులో నుండుటచేత బదులుగా, శ్రీయుతులు జి. హరిసర్వోత్తమరావు (చెన్నపురి) ఎన్నుకొనబడిరి.

## కర్నాటకపు సభ్యులు

1 డాక్టరు, నారాయణరావు సుబ్రోహర్డికార్, హుబ్లీ.
2 డాక్టరు, వి. ఎస్. ఉమాభగి, గదగ్
3 శ్రీయుత, విశ్వనాధరావు, ఎస్. జోషి, హుబ్లీ.
4 శ్రీయుత, దత్తోపంత్, ఆర్ మూల్జీ, బెల్గాము
7 శ్రీయుత, శేషగిరిరావు, టి. డాటుర్, ఎర్సీ.
5 శ్రీయుత, శ్రీనివాసరావు, వి. కోజల్గి, బీజపూరు
6 శ్రీయుత, జయరావు ఎమ్. దేశపాండ్యా బీజపూరు
8 శ్రీయుత, మాధవరావు, ఆర్. కంభాలి, బీజపూరు
9 ,, డి. హెచ్. రంగారావు, బళ్లారి
10 ,, కే. సదాశివరావు. మంగుళూరు
11 ,, ఏ. భోజరావు. మంగుళూరు
12 ,, మంజునాథభట్ కార్కి- హొన్నవార్

## మహమ్మదీయులకుగాను

13 మహమ్మదు ఉస్మాన్ సహబ్బదు. కంటోన్మెంటు బెంగుళూరు
14 మహమ్మదు మహమ్మద్సాహేబు, పుత్తూరు మంగుళూరు
15 ,, దివాన్ సాహేబ్, జాన్వేకర్. బీజపూరు

## కేరళదేశపుసభ్యులు

1 కే. మాధవన్ నాయరు. డిస్ట్రిక్టు కాంగ్రెసుసెక్రటెరీ కాలికట్టు
2 ఏ. కే. పిళ్లె. డిస్ట్రిక్టు కాంగ్రెసుసెక్రటరీ తిరువాన్కూరు తిరివేం
3 కే. పి. కేశవమీనను, సెక్రటరీ కేరళప్రావిన్సు కాలికట్ [డ్రము
4 జనాబ్ మొయిదీన్ కోయా, కాంగ్రెసుఆఫీసు కాలికట్
5 ఏ. కే. కున్హిమాయన్ హాజీ, తెల్లిచ్చేరి
6 టి. ఆర్. కృష్ణస్వామిఅయ్యరు. డిస్ట్రిక్టు కాంగ్రెస్ సెక్రటరీ పాల్ఘాటు
7 పి. అచ్యుతన్. నార్త మలబారుడిస్ట్రిక్టు కాంగ్రెసు సెక్రటరీ కాలి
8 డబ్ల్యు. పి. ఇన్నటియస్ కాంగ్రెస్ఆఫీసు త్రివ్యాండ్రు [కట్

## బొంబాయి సభ్యులు

1 ఎస్. జీ. బాంకర్. ఎస్క్వైర్ 84 చౌపట్టీ బొంబే (4)
2 శ్రీమతి సరోజినీనాయుడు టాజ్ మహల్ హోటలు, ఫోర్టు బొంబై
3 ఉమర్ శోభానీ ఎస్క్వైర్. యూనియన్బాంక్ బిల్డింగు, అపోలో స్ట్రీటు ఫోర్టు బొంబై (2)
4 విఠల్ దాస్. వి. జెరజాని ఎస్క్వైర్. ఖాదీభాండార్. ప్రిన్సెసు స్ట్రీటు బొంబే (2)
5 కే. పి. కాడిల్ కార్ ఎస్క్వైర్. ఎడిటర్ లోకమాన్య, బొంబై (4)
6 ఎమ్. ఆర్. జయకరు ఎస్క్వైర్. తాకూర్ ద్వార్ బొంబాయి (2)
7 అహమ్మదు హెచ్. ఎస్ ఖత్రీ ఎస్క్వైర్ హీరాలాల్ మంజిల్ అబ్దుల్ రహిమాన్ స్ట్రీటు బొంబాయి

## మహారాష్ట్ర సభ్యులు

1 ఎన్. సి. కేల్కారు. సదాశివపేట పునహాపట్టణము
2 ఎస్. ఎస్. అష్టపుత్రే-సతారాసిటీ
3 జే. ఎమ్. సామంత్-షోలాపూరు
4 కే. ఎస్. ఫిరోదియా అహమదునగర్
5 పి. జి. జోషి. ఈస్టర్నులు డిస్ట్రిక్టు ఖాండేశ్
6 బి. కే. మరాటీ చందావార్కర్ లేన్ నాసిక్ సిటీ
7 బి. ఎల్. మెహతా, నందురుబార్, డిస్ట్రిక్టు వెస్టుఖాండేశ్.
8 వి. కే. పటేల్ తాతాబ్లాక్సు, బంద్రా
9 ఆర్. ఎస్. మాండలిక్. గోరెగాంకర్సుబిల్డింగ్సు గిర్గాము,బొంబాయి.
10 బి. ఆర్. నాయిల్, రత్నగిరి.
11 ఎల్. బి. భోపట్కర్. సదాశివపేట పూనాపట్టణము.
12 మహమ్మద్ హుసేన్ మద్దు, భివాండీ, డిస్ట్రిక్టు తానా.
13 ఇస్మెయిల్ నాన్ మహమ్మదు సతారా సిటీ.
14 మీర్ మున్షి షుక్రుల్లా, జల్గాను డిస్ట్రిక్టు ఇ. ఖాండేశ్.
15 శ్రీమతి ఇందుమతీబాయినాయక్, బుధవారపేట, పూనాసిటీ.
16 జమ్నాదాసు. ఎమ్. మెహతా, లక్ష్మీకాంత్ మెన్సన్సు,హార్న్బీరోడ్డు, పోస్టు గ్రాంటురోడ్డు బొంబాయి.

## గుజరాతు సభ్యులు

1 మహమ్మదు అబ్బాస్ తయాబ్జీ, క్యాంప్, బరోడా.
2 మహమ్మదు అబ్దులు ఖాదరు బవాజీర్ C/o సత్యాగ్రహాశ్రమము, శబర్మతి.
3 శ్రీయుత మోహనదాస్ కరంచంద గాంధీ C/o సత్యాగ్రహాశ్రమము శబర్మతి.
4 ,, వల్లభభాయి జవేర్భాయి పటేల్, భద్రా,అహమ్మదాబాదు.
5 ,, ఇందులాల్ కన్హయ్యాలాల్ యాజ్ఞిక్ C/o గుజరాతు ప్రొవిన్షియల్ కాంగ్రెసుకమిటీ అహమదాబాదు
6 ,, బల్వంతరాయ్ నర్సిరాయ్ కనుగా. ఖాడియా. అహమ్మదాబాదు
7 ,, పూల్చందు బాపుజీషా-నడియాదు
8 ,, బెహన్ అనసూయా సారాబాయి- సేవాశ్రమము- మిర్జాపూరు-అహమ్మదాబాదు
9 ,, వామనరావు సీతారామ్ ముకదమ్- గోద్రా- గుజరాతు

10 ,, హరిభాయి జేకర్ భాయి. అమిన్ బ్రోచ్
11 ,, మోహన్‌లాల్ కే. దీక్షిత్ - ప్రెసిడెంటు. సూరతు మున్సిపాలిటీ. సూరతు
12 ,, మణిలాల్ వల్లభ్ జీ. కొఠారి - రఘునాథ్ బాంబ్స్ పోల్ - సాంక్రేషీరి - అహమ్మదాబాదు

## సింధు సభ్యులు

1 డాక్టరు ఛోయిత్ రామ్ టి. గిద్వాని - కాంగ్రెసు ఆఫీసు - హైదరాబాద్ (సింధ్)
2 జయరామ్‌దాసు దౌలతురాము. మార్కెటురోడ్డు. హైదరాబాద్ (సింధ్) జెయిలులో నున్నారు
3 అబ్దుల్ జబ్బార్. ఖిలాఫత్ ఆఫీసు. హైదరాబాద్ (సింధ్)
4 మహమ్మదుఖాను. కాంగ్రెసు ఆఫీసు. కరాచి
5 సేఠ్ నారాయణ్‌దాస్ ఆనంజీ. నానక్‌వాడ. కరాచీ
6 లాల్ చందు ఏ, జగ్తియాని. ప్రిన్సిపాల్. తిలకాలయ్. కరాచీ
7 ఖాజీ అబ్దుల్‌రహిమాన్ ఖిలాఫత్ ఆఫీసు. హైదరాబాద్(సింధ్)
8 ఖాజీ ఖుదాబక్ష్-32 మ్యాకలియాన్ బిల్డింగ్సు-బందర్‌రోడ్డు-కరాచీ
9 ప్రొఫెసర్ ఘనశ్యామ్ జేఠానంద్-హీరాబాద్ హైదరాబాద్(సింధ్)

ఇందులో 2-వ వారు జైలులో నున్నందున వారికి బదులుగ విరుమల్ గారు నేమింపబడిరి.

## సంయుక్తరాష్ట్రముల (యు. పి.) సభ్యులు

1 మౌలానా హజరత్ మోహానీ - ఖిలాఫత్ స్వదేశిస్టోర్సు - కాన్పూరు
2 పురుషోత్తముదాసు టండన్ - ఝాన్స్‌టన్ గంజ్ - అలహాబాదు
3 పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ - ఆనందభవన్ - అలహాబాదు
4 ,, కపిలదేవ మాలవీయ - 75 హెవెట్ రోడ్డు - అలహాబాదు
5 ,, గౌరీశంకర్ మిశ్ర - రామప్రసాద్ గార్డెన్ - మోతీగంజ్ - అలహాబాద్
6 చౌధరి ఖాలీ ఖ్వాజామక్ - దాలిబాగు. లఖ్నౌ
7 పండిట్ హరకర్ణనాథ్ మిశ్ర - నీల్ రోడ్ - లఖ్నౌ
8 ,, ఈశ్వరంధర్‌నాథ్ వాజపేయీ - కాంగ్రెసుకమిటీ - ఉనవో (unao)
9 బాబూ హర్నామ్ సుందర్‌లాల్ - కాంగ్రెసుకమిటీ - లఖింపూరు
10 శ్రీయుత మేలారామ్ - కాంగ్రెసుకమిటీ - షహ్జాన్‌పూరు
11 పండిట్ శ్రీ జేటీశంకరశేఖర్ - డిస్ట్రిక్టు కాంగ్రెసుకమిటీ-బులాండ్ షహర్
12 బి. వింధ్యవాసినీ ప్రసాద్‌వర్మ - సెక్రటరీ డిస్ట్రిక్టుకాంగ్రెసుకమిటీ - గోరఖ్‌పూరు.
13. మురళీధరసింహా, సెక్రటరీ. డిస్ట్రిక్టుకాంగ్రెసుకమిటీ, అజమ్‌ఘడ్
14. ఎమ్. మసూద్ ఆలీనాద్వీ షిబ్లీమంజిల్ అజమ్‌ఘడ్
15. బి. గణపత్ సహాయ్, కాంగ్రెస్ కమిటీ, సుల్తాన్ పూర్
16. ఎమ్. సర్ఫ్రాజ్ ఆలీ, కాంగ్రెస్ కమిటీ, ఫైజాబాద్.
17. హెచ్ పృథ్వీరాజ్ సింగ్. సె. డిస్ట్రిక్టు కాంగ్రెసుకమిటీ రెరలీ
18. బి. లక్ష్మణ్ దత్తజీ, కాంగ్రెస్ కమిటీ, బుదాన్
19. మౌల్వీ అబ్దుల్ కలామ్, కాంగ్రెస్ కమిటీ మురాదాబాద్.
20. శ్రీయుత్ రఘునాథ వినాయక్ ధూలేకర్, కాంగ్రెసు కమిటీ, ఝాన్సీ.
21. కన్వాల్ జుగల్‌కిశోర్‌సింగ్, కాంగ్రెస్ కమిటీ బందా.
22. పండిత వేణీమాధవతివారీ, ప్రెసిడెంటు డిస్ట్రిక్టు కాంగ్రెస్ కమిటీ. ఆటా. జలానా జిల్లా
23 మహమ్మదు అబ్దుల్ మజీద్ ఖ్వాజా సాహేబ్, ప్రిన్సిపాల్, నేషనల్ ముస్లిము యూనివర్సిటీ. ఆలీఘర్
24 మౌల్వీ నిజర్ ఖాన్ షెర్వాణీ, సెక్రటరీ, కాంగ్రెస్ కమిటీ
25 కువర్ దిగ్విజయసింగ్, కాంగ్రెసు కమిటీ. మెయినుపురి
26 శ్రీయుత బాబూరామ్‌వర్మ. కాంగ్రెసు కమిటీ ఇటావా
27 బాబూభగవాన్‌దాస్‌జీ, సేవాశ్రమము. సిగ్రా బనారెస్.
28 శ్రీయుత్. బి. శివప్రసాద్‌గుప్త సేవాఉపవన్, నాగ్వ, బనారెస్
29 ప్రొఫెసర్ జే బి. కృపాలనీ, గంధీ ఆశ్రమ్. బెనారెస్
30. శ్రీయుత విక్టరుమోహన్ జోషీ. డిస్ట్రిక్టుకాంగ్రెసుకమిటీ అల్మోరా
31 డాక్టరు మురారీలాల్. సివిలులైన్సు. కాన్పూరు.
32 ఎమ్. అజదు సోభానీ, డి. కా. కమిటీ, కాన్పూరు.
33 సైయద్ కమాలుద్దీను అహమద్ జాఫర్, ఖిలాఫత్ కమిటీ అలాహాబాదు.
34 బేగం మహమ్మదాలీ, నేషనల్ యూనివర్సిటీ ఆలిఘర్
35 శ్రీయుత్ జయరామ్ పాల్వెనా. 107 హెవ్వెట్ రోడ్డు.
36 శ్రీయుత జార్జి జోసెఫ్. ఎడిటరు. ఇండిపెండెంటు. అల్లహాబాదు
37 శ్రీయుత రాజ్ బహదూర్ డిస్ట్రిక్టు కాంగ్రెసు కమిటీ అలహాబాదు.
38 శ్రీమతి ఉమానెహ్రూ, ప్రయాగ స్ట్రీటు. అలహాబాద్.
39 మౌలానా అబ్దుల్ మజీదు. మౌల్వీమహల్లా-బుదాన్
40 ప్రొఫెసర్ రామదాస్ గవర్, టౌను కాంగ్రెస్‌కమిటీ. మిర్జాపూర్
41 శ్రీయుత. బి. రఘుపతి సహాయ్. కాంగ్రెస్ కమిటీ, గోరఖ్‌పూర్
42 పండిత. శ్యామలాలునెహ్రూ ప్రయాగ స్ట్రీటు, అలహాబాదు.
43 ఎమ్. జహూర్ అహమ్మదు, మొహల్లా తిరోపోలియా, అలహాబాద్.
44 స్వామి సత్యదేవ్ - కాంగ్రెస్ కమిటీ ఫరూకాబాదు.
45 పండిత ద్వారకాప్రసాద్. డిస్ట్రిక్టు కాంగ్రెస్ కమిటీ-బళ్లి

## అధికారరీత్యాసభ్యులు

46 పండిత మోతీలాలునెహ్రూ. ఆనందభవన్, అలహాబాద్.
2 వ వారు జైలులో నున్నందున బదులుగ బేగం హజరతు మోహానీ
3 వ వారు జైలులో నున్నందున బదులుగ శ్రీమతి కమలా నెహ్రూ
4 వ వారు జైలులోనున్నందున శ్రీమతి స్వరూప్‌రాణీ నెహ్రూ
5 వ వారును వారికి బదులుగా వచ్చినవారును జైలులో నున్నందున ఈస్థానము ఖాళీగా నున్నది.

**ఎం. వి. నరసింహాచార్యులు:—** వీరి పూర్తిపేరు మాడభూషి వేంకట నరసింహాచార్యులుగారు. వీరు సుప్రసిద్ధ పండితు లగు మాడభూషి వేంకటాచార్యులవారి పుత్రులు. గుంటూరు వాస్తవ్యులు. బి. ఏ. పరీక్షయందు ఉత్తీర్ణులయిన పిదప ప్లీడరు పరీక్ష ప్యాసయిరి. గుంటూరునందే న్యాయవాదివృత్తి ప్రారంభించి అసహాయోద్యమ మారంభమైన పిమ్మట దానిని వదలివేసిరి. పల్నాడు ప్రజల కష్టములను నివారించుటకు వీరు పాటుబడిరి. అందుకు ఫలితముగా అధికారులు వీరిని జామీనిమ్మని కోరగా ఇయ్యక నిరాకరించినందున ఒక సంవత్సరము కారాగృహశిక్షకు పాత్రులుగ చేయబడిరి. రాయవేలూరు జైలులో వీరు శిక్షననుభవించి వచ్చినపిమ్మట గుంటూరుపౌరులు సన్మాన పురస్సరముగ వీరిని గౌరవించిరి. వీరును ఉన్నవ లక్ష్మీనారాయణ గారును ఆంధ్రదేశమునందు మొట్టమొదట కారాగృహవాసమునకు బోయినవారు. శాసనోల్లంఘనసంఘమువారు గుంటూరునకు వచ్చినపుడు వాలంటీరుగ పనిచేసినందులకు వీరిని మరల నరెస్టుచేసి జిల్లామేజస్ట్రేటుగారు 10 రూ జరిమానా వేసిరి. కాని దాని నిచ్చుటకు వీరు నిరాకరించిరి. జిల్లా కాంగ్రెసుసంఘమునకు కార్యదర్శిగ వీరిపుడు మిగుల నుత్సాహముతో పాటుపడుచున్నారు.

**మద్ది రాధాకృష్ణయ్య:—** వీరు వైశ్యులు. సంపన్నులు. గుంటూరు వాస్తవ్యులు. అసహాయోద్యమ ప్రారంభము నుండియు మిగుల నుత్సాహముతో పనిచేయుచు జామీ నిచ్చుటకు ప్రభుత్వము వారిచే కోరబడి నిరాకరించినందున కఠినకారాగృహశిక్షకు లోనైరి. మొదట కొంతకాలము రాజమండ్రి జైలులోనుండగా వీరియారోగ్యము చెడెను. [illegible] సైతము వదలుకొనిరి. పిమ్మట వీరిని కడలూరి జైలుకు మార్చిరి. వీరితోబాటు వీరి సోదరులును అసహాయోద్యమమునందు పట్టుదలతో పని చేయుచున్నారు.

**గొల్లపూడి సీతారామశాస్త్రి:-** వీరు రేపల్లె (గుంటూరు జిల్లా) గ్రామవాస్తవ్యులు. గుంటూరునందును, చెన్నపురియందును వీరు విద్యనభ్యసించి పిమ్మట గుంటూరునందే జిల్లాకోర్టులో న్యాయవాదిగ ప్రవేశించిరి. ఈ వృత్తియందు నిపుణులై విశేషద్రవ్యము గణించుచున్నను మహాత్మునిపిలుపు రాగానే తమవృత్తిని విసర్జించి తమ కాలము నంతను అసహాయోద్యమాభివృద్ధికై వినియోగించిరి. చిన్నతనము నుండియు వీరు ప్రజాహితజీవనమునందు పాల్గొనుచుండిరి. బుద్ధివైశద్యము కార్యదీక్ష వీరికి పెట్టని సొమ్ములై యున్నవి. మండలసంఘ కార్యదర్శిగను, రేటుపేయర్ల సంఘ కార్యదర్శిగను వీరు సల్పిన కృషి మరువదగినది కాదు. ఇందుకు తోడుగా శాంతవినయాదిలక్షణములు చేరి వీరి సుగుణసంపదకు మెఱుగు పెట్టెను. న్యాయవాదవృత్తిని వర్జించిన పిమ్మట విదేశదీక్షతో శాసనసభాబహిష్కారమునకు దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారికి తోడుగ నుండి పనిచేసి గుంటూరుమండలము ఆవిషయమునందు అగ్రస్థానము వహించునట్లు చేయగల్గిరి. పిమ్మట ఆంధ్రరాష్ట్రీయ సంఘకార్యదర్శిగ నుండి వీరు చూపిన చాకచక్యము ఆంధ్రదేశమున కచ్చెరువు కలిగించెను. అహమ్మదాబాదు కాంగ్రెసు సభ జరిగినపిమ్మట పన్నుల నిరాకరణమునందు గుంటూరుమండలమునందు కలిగిన అత్యంత ప్రబోధమునకు వీరే కారకులు. జామీనుసెక్షను క్రింద వీరు శిక్షింపబడిరి. రాజమహేంద్రవరము జైలునకు పంపబడిరి. అక్కడ నుండి వీరిని కడలూరి జైలుకు మార్చిరి.



**నడింపల్లి వేంకట లక్ష్మీ నరసింహారావు:—** వీరు గుంటూరు కాపురస్థులు. స్కాట్లండునందు ఎమ్.ఏ. ఎల్.ఎల్. బి. పరీక్షయందు ఉత్తీర్ణులై బారిష్టరు పట్టమును గడించి మద్రాసు హైకోర్టునందును గుంటూరు జిల్లాకోర్టునందును న్యాయవాదులుగ పనిచేసి అసహాయోద్యమారంభమున తమవృత్తిని విసర్జించిరి. వీరు విశేషధన వంతులు. నిగర్వులు. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుసంఘ కార్యదర్శులుగ నుండి పనిచేయుచుండిరి. పన్నులనిరాకరణ సందర్భమున వీరికి వేయి రూపాయల జరిమానాను విధించిరి.

**మాచర్ల మహమ్మదీయులు:—** వీరు పల్నాటియందు ప్రచారమును గావించుచు శ్రీయుతులగు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారితోబాటు పట్టుకొనబడి జైలునం దుంచబడినారు. వీరు పల్నాటియందు అటవీశాఖవారి దుండగములను ధైర్యముతో నెదుర్కొనిన వీరులు.

**కతారి రామోజీ, మాచేటి పూర్ణచంద్ర రాము, బొన్నలగిడ్డ అప్పల నరసింహము, ఏల్చూరి హనుమంత రావు నాయుడుగార్లు:—** వీరు అసహాయోగమునందు మహోత్తమ మగు సేవచేసిన ధన్యులు. నరసారావుపేట వాస్తవ్యులు. పల్నాటివీరులు.

**చట్టి నరసింహారావు:—** వీరు సుప్రసిద్ధాంధ్ర నాయకులు. వీరు ఆంధ్రరాష్ట్రీయ శాంతిసైన్యమున కధిపతులుగ నుండి మహోత్తమ ముగ దేశసేవ నొనర్చినారు. దేశభక్తాగ్రేసరులు.

**కుసుమ ధర్మన్న, కుసుమ వీరాస్వామి, కుసుమ వెంకట్రామయ్య:—** వీరు ఆంధ్రదేశమునందలి పంచమప్రతినిధులు. ఆదిమాంధ్ర ప్రముఖులు. స్వసాంఘికుల యభివృద్ధికై పాటుపడుచున్న ధన్యులు. వీరు రాజమహేంద్ర నగరమునందు సేవాశ్రమమును స్థాపించి దేశసేవయును సోదరసేవయును చేయుచున్నారు. కార్యశూరులు.

**దిగ్గ పుల్లయ్యగారు:—** వీరు రాజమహేంద్రపురవాసులు. అసహాయోద్యమ ప్రచారమును గావించిన యువకులు.

**గాల్లపల్లి రామసుబ్బయ్య:—** వీరు నెల్లూరునివాసులు. మద్యపాననిషేధ విషయమునందు మహోత్తమ మగు ప్రచార మొనర్చి ఆసందర్భమునందు ప్రభుత్వమువారిచే సంవత్సరము కఠినశిక్షచే గౌరవింపబడినారు వీరు ప్రభుత్వోద్యోగమునందుండినను అసహాయోగము నవలంబించి దానిని విడచిపెట్టిరి.

**వెన్నెలకంటి రాఘవయ్య:—** వీరు ఎఫ్. ఎల్. ప్యాసుచేసినారు. కొంతకాలము క్రిందట నెల్లూరు డిస్ట్రిక్టు కాంగ్రెసు కమిటీకి

బ్రహ్మానంద సరస్వతీస్వాములు:—వీరినే తలచుగా మౌనస్వాము లందురు. వీరు వేదాంత నిష్ఠాగరిష్ఠులై సన్న్యసించినారు. ప్రస్తుతము వీరు కుర్తాళమునందు వసించుచున్నారు. శ్రీవారు మహోన్నతము లగు ఆలయాదులను నిర్మించుటకై చాల ద్రవ్యమును వెచ్చించుచున్నారు. అద్వైతవేదాంతమునందు మంచి యభినివేశముగలవారు.

వాడ్రేవు వేంకట కృష్ణరావు:—వీరు గంగలపూడి ఎస్టేటు జమీందారులు. వీరు ఆంధ్రదేశమునందు ప్రసిద్ధిగన్న ధర్మాత్ములలో నొకరు. రాజమండ్రిలో నున్న వాడరేవు వారిసత్రము వీరి యౌదార్యముచే పోషితమై వీరిధర్మమునకు ఆదర్శముగా నున్నది.

కరణం రామస్వామినాయుడు:—వీరు నర్సారావుపేట వాస్తవ్యులు. అసహాయోద్యమ ప్రచారకులు.

గోపాలుని రామలింగయ్య:—వీరు అసహాయోద్యమమునందు చాల భక్తిశ్రద్ధలతో పనిచేసిన వీరులు. ముప్పాళ్ల గ్రామ వాస్తవ్యులు

పి. జే. వెంకయ్య:—వీరు హైదరాబాదువాస్తవ్యులు. యువకులు. బి. ఏ. బి. ఎల్. ని బిరుదులను పొందినవారు.

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు:—వీరు సుప్రసిద్ధాంధ్రనాయకులు. ఆంధ్రదేశమునందు వీరి నెఱుగనివారు లేరు. కొంతకాలము ఆంధ్రదినపత్రికకు ప్రధానసంపాదకులుగ నుండియు విజ్ఞానచంద్రికవారిలో ప్రధానులుగ నుండియును దేశసేవను భాషాసేవను అసాధారణరీతితో చేసినవారు. మంచివక్తలు. దేశభక్తులు. యభిజ్ఞులు ప్రస్తుతము వీరు అసహాయోద్యమునందు పని చేయుచున్నారు.

ఎస్. గంగోజీరావు, గణపా చౌళయ్య:—వీరు దత్త మండలనివాసులు. అసహాయోద్యమ ప్రచారకులుగా నుండి అత్యుత్తమముగ సేవ చేసిన ధీరులు. ఆంధ్రులు.

సి. ఎఫ్. ఆండ్రూసు:—వీరు దక్షిణాఫ్రికాలోను ఫిజీదీవులు మున్నగు వలసరాజ్యములలోను భారతీయులస్వేచ్ఛకై విశేషముగ పనిచేసిన ఉదారహృదయు లగు ఆంగ్లేయులు. రవీంద్రునికి కుడిభుజముగ నుండి ప్రస్తుతము విశ్వభారతియందు వీరు సేవ నొనర్చుచున్నారు. వీరు సర్వదా కార్మికోద్ధరణమునకై బద్ధకంకణులు. మహాత్ముని యుదారభావములతో ప్రశంసించుచు వారియుద్యమమును అక్షుణ్ణపూర్వకముగ ప్రేమించిన క్రైస్తవప్రముఖులు వీరు.

అయ్యదేవర కాళేశ్వరరావు:—వీరు బెజవాడయందలి న్యాయవాదులలో నొకరు. అసహాయోద్యమనాయకులు. బెజవాడ మునిసిపాలిటీ యెన్నికలు సకాలమున జరుపకుండుటను ఆక్షేపించి ప్రజలను ఇందుకొరకై పన్నులు చెల్లింపవలదని బోధించి కొన్నాళ్లయున కారాగృహవాసమును స్వీకరించిన స్వార్థత్యాగులు. ఆంధ్రప్రముఖులలో నగ్రేసరులు. మహోత్తమము లగు ఆదర్శములతో విలసిల్లు ఆంధ్రనాయకులు.

శ్రీబోధానందస్వాములు:—వీరు పూర్వాశ్రమమున రాణీ పైనులు అని ప్రసిద్ధి నొందిన విద్వాంసులు. ఆంధ్రులు. స్వర్ణయోగమునకై పెక్కేండ్లు కష్టించి యశస్సు గాంచిన వారు. వీరిటీవల బోధానంద యోగదర్శన మను పేరుతో రసవాదమును గురించి సంస్కృతమున అద్భుత మగు గ్రంథమును వ్రాసియున్నారు. వీరికి సకలశాస్త్రములందును కూలంకష మగు ప్రజ్ఞ గలదు. గొప్ప మంత్రశాస్త్రవేత్తలు. హంపి విరూపాక్ష పీఠాధిపతులు. ఆంధ్రదేశమునందు వీరి నెఱుగనివారు చాల తక్కువగ నున్నారు గొప్ప బ్రహ్మవాదులు.

బ్రహ్మానందసరస్వతీస్వాములు:—వీరు గొప్ప బ్రహ్మవాదులు. వీరు కాశియందు వసించుచున్నారు. వీరికి అద్వైతమునందు గల యభినివేశము అనితరసాధారణ మైనది. వీరు పూర్వాశ్రమమున ఆంధ్రులు.

విత్రాల రామచంద్ర ఆచార్యులు:—వీరు నెల్లూరు మండలవాస్తవ్యులు. విద్యారణ్యపంచాననాది బిరుదులు గలవారు. సంస్కృతమునందు గొప్పపండితులు. గతవర్షమునందు కలకత్తాలో జరిగిన ప్రాచ్యపండితసభచే సత్కారపూర్వకముగా గౌరవింపబడినారు.

ఆచంట వేంకటసాంఖ్యాయన శర్మ:—వీరు కల్పలతా పత్రికకధిపతులు. సంస్కృతాంధ్రాంగ్లాదులందు అసమానశేముషీధురంధరు లని ఖ్యాతిగన్న వారు. ఆంధ్రదేశమునందలి విమర్శకు లగు విద్వాంసులలో నగ్రగణ్యులు. స్వతంత్రమును అనితరసాధారణము నగు మేధాసంపత్తి గలవారు.

రావుబహద్దర్ వి. ఆళ్వారు శెట్టిగారు:— వీరు పరమ శాంతస్వభావులు. ఉదారమనస్కులు. పరోపకార పారీణులు. డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరుగా నుండి ప్రస్తుతము ఉపకారవేతనమును పొందుచున్నారు. వీరు కర్నాటిక్ పేపరుమిల్సు లిమిటెడ్ కంపెనీకి మేనేజింగు డైరెక్టరుగా నున్నారు. వీరికి గల శక్తిసామర్థ్యములచే రాజమహేంద్రవరములో యంత్రశాలభవనములు దాదాపుగా పూర్తియైనట్లును, అతిత్వరలో కాగితములు తయారుచేయుట కూడ ప్రారంభ మగునని యును తెలియుచున్నది.

Printed and Published by K. Nageswara Rao at the Andhra Patrika Press,
No. 7, Thumbu Chetty Street, George Town, Madras.

Printed and Published by K. Nageswara Rao at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, George Town, Madras.




ఏమి ప్రయోజనము?

లిటిల్ స్ ఓరియంటల్ తైలము (Little's Oriental Balm) ను పది నిమిషములు రుద్దితే నీకు స్వస్థత కలుగుచుండగా నీ ముఖమునందలి అ భయంకరమైన బాధలను సహించుటవలన ప్రయోజనమేమి? ఆశ్చర్యపడవద్దు, ఎందుకంటే ఆ భయంకరమైన నొప్పిని తరిమివేయు ఔషధము ఇదిగో! నొప్పియున్నచోట కొంచెము రుద్దుము, ఆ నొప్పి పోవును. మొదట నీవు దాని నమ్మలేక యుంటివి, అయినను అది నిజమే.

న్యూయార్క్ పట్టణములో చేరిన లిస్పెనార్డ్ వీధిలో 45 వ యింటిలోనుండే ఎ. క్రైన్ దొర వ్రాయుచున్నదేమనగా:— నేను ముఖమందు నరముల నొప్పి (facial neuralgia) తోను తలలో బాధించు నొప్పితోను శ్రమపడుచుంటిని.

నాకు తోచిన మందంత ప్రయత్నించితిని. శ్రేష్ఠమైన వైద్యులు యిచ్చిన సలహా ప్రకారము చేస్తిని, గాని అంతా వ్యర్థమే. లిటిల్ స్ ఓరియంటల్ తైలము (Little's Oriental Balm) ను గూర్చి విని, ఒక బుడ్డీ తైలమును కొంటిని. 20 నిమిషములలో అది నా ముఖమందు, తల యందు యుండిన నరముల కఠినమైన బాధను తొలగించెను. ఈ మందు యెల్లప్పుడును నాతో తరుచుగా ప్రయాణము చేయు స్నేహితుడుగా యుండును.

☞ ప్రతిచోట అమ్మబడును.

## Royal Tonic Pills.

## రాయల్ టానిక్ మాత్రలు




ఈ మాత్రలు కుంకుమ పువ్వు, కస్తూరి, అంబరు మున్నగు శుద్ధ వనమూలికలచే తయారు చేయబడినవి. దిక్కుపోయినట్టియు, రక్తము క్షీణించినట్టియు దేహమునకు మంచిరక్తము నిచ్చి అమితమైనబలమును కలుగజేయును. నపుంసకత్వము, బలహీనమును కలిగించు వ్యాధులు మొదలగు వ్యాధులను అద్భుతముగా కుదిర్చి మంచిరక్తము నిచ్చును. ఇవన్నియు గాక మంచి జీర్ణశక్తిని కలిగించును. బుడ్డి 1-కి వెల రూ 1.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| 1 (ఉబ్బసము) అస్తమానివారిణి | 1 | 0 | 0 |
| 2 జిరోలియం వాసన తైలము | 1 | 0 | 0 |
| 3 మాజికల్ ర్యూమాటిక్ తైలము | 0 | 8 | 0 |
| 4 రోస్‌బిందువులు (నేత్రములకు మంచిది) | 1 | 0 | 0 |
| 5 శన్టోలియం మిక్చరు (సెగరోగనివారిణి) | 1 | 8 | 0 |
| 6 స్టేటర్సుఫీవరొక్కైను(సకలవిధజ్వరములకు) | 0 | 14 | 0 |
| 7 ట్రఫ్ సోలా (రక్తమును శుభ్రపరిచి వృద్ధి చేయునది) | 2 | 8 | 0 |

మే మిప్పుడు మీ జిల్లా వార్తాపత్రికలలో ప్రచురించుటకు ప్రారంభించితిమి.

ఔషధములు విక్రయించు వర్తకు లందరు మాకు వ్రాసిన, ధరలపట్టిని పొందవచ్చును.

**GOVINDJEE DAMODER & Co.,**
**Chemists No. 3, Sutar Chawl, Bombay.**

## ఆనందసాగరము

మనోహరమైన సువాసన ఇచ్చి విసుగు పుట్టిన మనస్సునకు ఆహ్లాదము నిచ్చుటయందును అంటుజాడ్యములను ఆపుటయందును సాటిలేని

## ఓటో మోహిని

స్త్రీలకు స్వాభావిక ఆభరణమగు కేశములను వృద్ధి చేయుటయందును పట్టువలె మృదువుగను కృష్ణసర్పమువలె నిడివిగను మెరుగునట్లు చేయుటయందు మిక్కిలి ప్రఖ్యాతిచెంది బంగారు మెడలు గావించిన

## రోనిబియా ఆయిల్

1 సీసా నూనె రు 1-0-0, 2 సీసాలు రు 2-10-0

ఇవి రెండును వాడినవారికి ఆనందసాగరము హస్తగతము.

ఓటోమోహిని ½ అవున్సు రు 2-0-0

2 డ్రాం 1-4-0 ½ డ్రాం 1-12-0 ¼ డ్రాం 0-8-0

### షియాంకంపెని, సోల్ ఏజెంటు,

ఓటోమోహిని డిపో, 6 బందరువీధి, మద్రాస్.

మూంకేతికకట్టుకొను సొగసైనగడియారం ఇనాం!!!

ఒక సొగసైన ముంకేతిగడియారము ఇనాముగా యివ్వబడును. ఇతర వివరములకు ఒకఅణా తపాలాబిళ్లను పంపిన తెలుపబడును.

## మా తలనొప్పి నివారిణిని

కొనటకు తాతాదారులు కావలెను. నిజముగా తక్షణమే అద్భుతమైన గుణము నిచ్చును.

ఒకసారి తెప్పించి ఉపయోగించకోరెదము.

12 మోతాదులు గల 1 ప్యాకెట్టు ధర రూ. 1-8-0

వి. పి. చార్జి ప్రత్యేకము.

ఈ దిగువ విలాసమునకు వ్రాయవలెను

**The Lucky Star**
Post Saidapet, MADRAS.

# వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

తంతి అడ్రెస్సు:— "వావిళ్ల" మదరాస్. } 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ. { టెలిఫోను నెం. 878.

శ్రీమద్రామాయణము, వ్యాఖ్యాన చతుష్టయవిశిష్టము ప్రతి 1-కి రూ 15 0

| | | | |
|---|---|---|---|
| పరాశరస్మృతి,సాంధ్రతాత్పర్యం | 0 12 | విషవైద్యచింతామణి సటీక ,, | 2 0 |
| ఆత్మవిద్యావిలాసము ,, | 0 6 | అథర్వణకారికలు సటీక ,, | 1 0 |

బ్రహ్మసూత్రములు, తెనుఁగు వచనము.—శ్రీశంకరులవారి భాష్యము అందఱికిఁ దెలియుట దుర్లభమని తలచి చక్కనిశైలిలో అనేకవృత్తుల ననుసరించి తెనుఁగు వ్యాఖ్యానమును ప్రకటించినారము. రూ 8-0-0 చెల్లించువారికి మొదటి సంపుట మిప్పుడు పంపుదుము. పిదప, రెండవసంపుటమును పోస్టు ఖర్చులకు వీ. పీ. చేయుదుము.

| | | | |
|---|---|---|---|
| అనంతునిఛందస్సు | 0 14 | హితోపదేశము, తెనుగువచనం | 0 12 |
| అప్పకవీయము | 2 8 | వైశ్యపురాణము,పద్యకావ్యము | 1 4 |
| ఆనందరంగరాట్ఛందము | 1 8 | సహదేవపశుశాస్త్రము | 0 6 |
| శ్రీవివేకానందవిజయము | 1 12 | పంజాబుఅల్లరి, సహాయనిరాకరణము | 0 8 |
| ప్రబంధరత్నావళి | 1 8 | | |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 12 | పెద్దబాలశిక్ష, చక్కనిప్రతి | 0 8 |

ఆంధ్రభారతము, పద్యకావ్యము 7 సంపుటముల ప్రతి 15 12

ఆంధ్రభాగవతము, పద్యకావ్యము ... అచ్చుగుచున్నది.

ఇలాజుల్‌గుర్బా, యూనాని వైద్యగ్రంథమునకు తెనుగు 3 0

శ్రీగాంధిగారి జీవితము 0 4

శ్రీతిలకుగారి సంపూర్ణ జీవితము 0 4

శ్రీమాళవ్యగారిచరిత్ర 0 8

వేమనపద్యములు, 3060, తాత్పర్యసహితము 3 8

ఇంకను అనేక సంస్కృతాంధ్రగ్రంథములు మావద్ద దొరకును.

త్రిలిఙ్గ.—రాజకీయ మత సాంఘిక ఆర్థిక శాస్త్రీయ విషయముల చర్చించు "త్రిలిఙ్గ" వారపత్రికగా 1922 సం॥ జనవరినుండి ప్రకటింపఁబడుచున్నది. చందా సంవత్సరమునకు రూ 4-0-0.

# Andhra Ayurvedic Pharmacy Ltd.,

**19, Harris Road, Mount Road, Madras.**



**Authorised Capital**

**Rs. 3,00,000**

Over 16,500 shares already subscribed.

Over Rs. one lac paid up.

## AIMS AND OBJECTS

It is the chief object of this company to supply pure drugs and reliable standard medicinal preparations even to persons living in far off villages and to encourage the progress of Ayurveda by the following among other means :—

(1) Collection and cultivation of all Ayurvedic herbs and drugs, their identification, preservation and distribution at reasonable prices to all those who need them.

(2) Preparation with the help of ancient and modern appliances of all important medicines.

(3) Publication of Pamphlets, Journals, Pharmacopoeia and other literature which would encourage the study of Ayurveda.

## DIRECTORS.

1. M. R. Ry N. Pattabhirama Rao pantulu Garu, B A., (Retired Dewan of Cochin, Chairman)
2. M. R. Ry. Rajah N. V. Ranga Rao Bahadur, Zamindar of Minagala.
3. M. R. Ry. Dr. A. Lakshmipathi, B. A. M. B. and C. M., Managing Director.

**Wanted reliable Agents in all capital Towns.** *Apply for:*—**All Genuine Ayurvedic Preparations**

# భారతదేశమునకంతకు గొప్ప ఔషధశాల

డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి. ఏ., ఎం. బి. సి. యం., గారిచే

1920 సం॥రమున స్థాపింపబడినది.

ఆంధ్ర ఆయుర్వేద ఔషధాలయము లిమిటెడ్,

నిజమైన మందులు దొరుకును రహస్యములేదు.

19, హారిసురోడ్డు, మౌంటురోడ్డు, మద్రాసు.